భావార్థః:-యే మనుష్యా బహూనాం విదుషాం సకాశాద్విద్వాంసం వృత్వా వేదాదివిద్యా అధీత్య మహర్షయో భవేయు స్తేఽన్యానధ్యాపయితుం శక్నుయుః. యే చ దాతారః ఉద్యమినః స్యు స్తే విద్యాం వృత్వా అవిదుషా ముపరి దయాం కృత్వా విద్యాగ్రహణాయ రోషేణ సంతా డ్యైతాన్ సుసభ్యాన్ కుర్యు స్తేఽత్ర సత్కర్తవ్యాః స్యు రితి. ॥౬౧॥

పదార్థము:-ఋషే=మంత్రార్థమును ఎరుగువాడా!లేక, ఆర్షేయ=మంత్రార్థజ్ఞులలో శ్రేష్ఠుడా!ఋషీణామ్=మంత్రార్థములనెఱుగువారియొక్క,నపాత్=సంతానము, యజమానః=యజ్ఞమొనర్చువాడునునగు,అయమ్=ఇతడు,అద్య=నేడు,బహుభ్యః సంగతేభ్యః=అనేకయోగ్యపురుషులచే, త్వామ్=నిన్ను,ఆ అవృణీత=స్వీకరించునుగాక!ఏషః =ఇతను, దేవేషు=విద్వాంసులలో, మే=నాయొక్క, వసు=ధనమును, చ=మఱియు, వారి=జలమును స్వీకరించునుగాక,దేవ=ఓవిద్వాంసుడా!ఆయత్యతే=ఏది అన్నిదిక్కులనుండి సంగతమొనర్చబడునో,చ=మఱియు,దేవాః=విద్వాంసులు,యాదానాని=ఏఇవ్వదగిన పదార్థములను, అదుః=ఇచ్చుచున్నారో, తాని=వానినన్నిటిని,అస్మై=ఈయజ్ఞమొనర్చువానికై , ఆ శాస్వ=బాగుగాచెప్పుము.ప్రేషితః=చదివించబడిన నీవు,ఆ గురస్వ =బాగుగా ఉద్యమమొనర్చుము, చ=మఱియు. హోతః=ఓఇచ్చువాడా! ఇషితః=అందఱిచే కోరబడిన,మానుషః=నీవు; భద్రవాచ్యాయ=భద్రము వాచ్యముగా నున్నవానికి, సూక్తవాకాయ=సుకథనము,వ్యాఖ్యానముగల వాక్కులను కలిగి ఉండునట్టి భద్రపురుషునికొఱకు,సూక్తా=చక్కని ఉక్తులను,బ్రూహి=పలుకుము, ఇతి=ఇందు కొరకై ఈ కారణముచే, పైవిధముగ,తా=ఆ యుత్తమపదార్థములను పొందువాడవు, అసి=అగుచున్నావు. [౬౧]

భావార్థము:-ఏ మానవులు అనేకవిద్వాంసులలో నుత్తమవిద్వాంసుని స్వీకరించి, వేదాదివిద్యలను చదివి,మహర్షులగుదురో, వారితరులను చదివించుట కర్హులగుదురు. ఏదాతలు, పురుషార్థపరులై విద్యనుపొంది అవిద్వాంసుల యెడ కరుణించి విద్యాగ్రహణార్థము రోషముతో ఆమూర్ఖులను తాడించుదురో, వారిని సుసభ్యులుగా నొనర్చుదురో,అటువంటివారే యీలోకమున సమ్మానార్హులగుదురు. [౬౧]

అత్ర వరుణాగ్ని విద్వద్రాజ ప్రజా శిల్పవాగ్గృహాశ్వ్యృతు హోత్రాది గుణవర్ణనాదేతదధ్యాయోక్తార్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సంగతిరస్తీతి వేద్యమ్.

ఈ అధ్యాయములో వరుణుడు, అగ్ని, విద్వాంసుడు, రాజు,ప్రజ, శిల్పము, వాణి,గృహము, అశ్వినులు, ఋతువులు, హోత మొదలైన పదార్థముల గుణముల వర్ణనయుండుటచే ఈఅధ్యాయమందుచెప్పబడ్డ అర్థమునకుపూర్వాధ్యాయములో చెప్పబడ్డ అర్థముతో సంగతియున్నదని గ్రహించవలయును.



ఇతి శ్రీమత్పరమ హంస పరివ్రాజకాచార్యాణాం శ్రీమన్మహావిదుషాం విరజానంద సరస్వతీ స్వామినాం శిష్యేణ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యేణ శ్రీమద్దయానంద సరస్వతీ స్వామినా విరచితే సంస్కృతార్య భాషాభ్యాం విభూషితే యజుర్వేద భాష్యే ఏకవింశోఽధ్యాయః సమాప్తి మగమత్.

★

కృష్ణామండలాంతర్గత కుందేరు గ్రామవాస్తవ్యులగు పాలడుగు శేషాచలాచార్య, తదేవ మండలాంతర్గత ముదునూరు గ్రామవాస్తవ్యుడు అన్నె కేశవార్యశాస్త్రి గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన శ్రీమద్దయానంద సరస్వతీ నిర్మిత యజుర్వేద భాషాభాష్యమండలి యిరువదియొకటవఅధ్యాయముసమాప్తము

---

ఓమ్

# ౨౨వ అధ్యాయపు విషయసూచిక.

1981 విక్రమ శక అజ్మీరు వైదిక యంత్రాలయ సంస్కరణమునకు అనుకృతి.

ఈ అధ్యాయములో ౩౪ మంత్రములు. ౫౪ ఛందస్సులు,౮౩౯ పదములు, ౨౧౨౪ అక్షరములున్నవి.

ఓమ్

# అథ ద్వావింశోఽధ్యాయ ఆరభ్యతే

ఇప్పుడు ఇరువదిరెండవ అధ్యాయము ఆరంభించ బడుచున్నది,

ఓం విశ్వాని దేవ సవిత ర్దురితాని పరాసువ యద్భద్రం తన్న ఆసువ॥

౧-౨౩ తేజోఽసీత్యస్య ప్రజాపతి ర్ఋషిః, సవితా దేవతా, నిచృత్పంక్తి శ్ఛందః, పంచమః స్వరః.

తత్రాదావాప్తో విద్వాన్ కథం వర్తేతేత్యాహ.

సకల శాస్త్రవేత్తయగు నాప్త విద్వాంసుడెటుల ప్రవర్తించవలయును ?

తేజోఽసి శుక్ర మమృతమాయుష్పా ఽఆయుర్మే పాహి । దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యా మాదదే॥ ॥౧॥

తేజః, అసి, శుక్రమ్, అమృతమ్, ఆయుష్పాః, ఆయుఃపాఽఇత్యాయుః+పాః, ఆయుః, మే, పాహి, దేవస్య, త్వా, సవితుః, ప్రసవఽఇతి ప్ర+సవే, అశ్వినోః, బాహుభ్యామితి బాహు+భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, ఆ, దదే ॥౧॥

పదార్థః :-(తేజః)ప్రకాశః(అసి)(శుక్రమ్)వీర్యమ్(అమృతమ్)స్వస్వరూపేణనాశరహితమ్ (ఆయుష్పాః)యః ఆయుః పాతి సః(ఆయుః)జీవనమ్(మే)మమ(పాహి)(దేవస్య)సర్వప్రకాశకస్య (త్వా)త్వామ్(సవితుః)సకలజగదుత్పాదకస్య(ప్రసవే) ప్రసూయంతే ప్రాణినో యస్మిన్ సంసారే తస్మిన్ (అశ్వినోః)వాయువిద్యుతోః(బాహుభ్యామ్)(పూష్ణః)పుష్టికర్తుః సూర్యస్య(హస్తాభ్యామ్) (ఆ)(దదే)గృహ్ణామి, ॥౧॥

అన్వయః:—హే విద్వన్నహం దేవస్య సవితు ర్జగదీశ్వరస్య ప్రసవే ఽశ్వినో ర్ధారణాకర్షణాభ్యామివ బాహుభ్యాం పూష్ణః కిరణై రివ హస్తాభ్యాం యస్త్వమాదదే యస్త్వమమృతం,శుక్రం తేజ ఇవ ఆయుష్పా అసి, స త్వం స్వం దీర్ఘాయుః కృత్వా మే మమాఽయుః పాహి. ॥౧॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః.యథా శరీరస్థా విద్యుచ్ఛరీరం రక్షతి,యథా బాహ్యౌ సూర్యవాయూ జీవనహేతూ స్తః, తథేశ్వరరచితేఽస్మిన్ జగతి ఆప్తో విద్వాన్ భవతీతి, సర్వై ర్వేద్యమ్. ॥౧॥

పదార్థము:-ఓ విద్వాంసుడా! నేను, దేవస్య=సర్వమును ప్రకాశించువాడు,సవితుః =సకలజగదుత్పత్తియొనర్చువాడునగుజగదీశ్వరునిచే,ప్రసవే=ఉత్పన్నమొనర్చబడిన[ప్రాణ్యాదులుత్పన్నమగు] సంసారమునందు,అశ్విసోః=వాయువిద్యుద్రూపాగ్నుల ధారణాకర్షణ గుణముల వలె [నుండు], బాహుభ్యామ్=భుజములచేతను, పూష్ణః=పుష్టినొసగు సూర్యుని కిరణములవలె [నుండు],హస్తాభ్యామ్=చేతులతోను,త్వా=ఏ నిన్ను,ఆదదే=

గ్రహించుచున్నానో,ప నీవు,అమృతమ్=స్వస్వరూపముచే వినాశరహితుడవు, శుక్రమ్=వీర్యవంతుడవు,తేజః=ప్రకాశముతోసమానుడవు,ఆయుష్పాః=ఆయువును రక్షించువాడవునై,అసి=ఉన్నావో,అట్టినీవు సొంతఆయువును దీర్ఘముగా నొనర్చుకొని,మే=నాయొక్క,ఆయుః=ఆయుస్సును,పాహి=రక్షించుము. [౧]

భావార్థము:-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. శరీరము నందుండు విద్యుత్తు శరీరమును రక్షించుచున్నటుల బయటనున్న సూర్యుడు,పవనము జీవనమునకు హేతువులై యున్నవి. అటుల నేఈశ్వరునిచే రచించబడినజగత్తులో సకలశాస్త్రముల నెఱిగిన ఆప్తవిద్వాంసుడును ఉన్నాడని అందఱు గ్రహించవలయును. ౧౭౨౩[౧]

---

ఇమామిత్యస్య యజ్ఞపురుష ఋషిః, విద్వాంసో దేవతాః, నిచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.
పున ర్మనుష్యై రాయుః కథం వర్తితవ్య మిత్యాహ.

మానవు లాయువు నెటుల గడపవలయును ?

ఇమా మగృభ్ణన్ రశనా మృతస్య పూర్వఽఆయుషి విదథేషు కవ్యా ।
సా నో ఽఅస్మిన్త్సుతఽఆబభూవఽఋతస్య సామన్త్సర మారపన్తీ॥ ॥౨॥

ఇమామ్, అగృభ్ణన్, రశనామ్। ఋతస్య, పూర్వే, ఆయుషి, విదథేషు, కవ్యా, సా, నః, అస్మిన్, సుతే, ఆ, బభూవ, ఋతస్య, సామన్, సరమ్, ఆరపన్తీత్యారపన్తీ॥ ॥౨॥

పదార్థః :-(ఇమామ్)(అగృభ్ణన్)గృహ్ణీయుః(రశనామ్)వ్యాపికాం రజ్జు మివ. (ఋతస్య) సత్యస్య కారణస్య(పూర్వే) పూర్వస్మిన్ (ఆయుషి) ప్రాణధారణే(విదథేషు)యజ్ఞాదిషు(కవ్యా) కవయః.అత్ర సుపాం సు ఇతి విభక్త్యాదేశః,(సా)(నః)అస్మాకమ్(అస్మిన్)(సుతే)ఉత్పన్నే జగతి (ఆ)(బభూవ)భవతి(ఋతస్య)సత్యస్య కారణస్య (సామన్) సామన్యంతే కర్మణి (సరమ్) ప్రాప్తవ్యమ్(ఆరపంతీ)వ్యక్తశబ్దం వదన్తీ. ॥౨॥

అన్వయః :-హే మనుష్యా యా ఋతస్య సరమారపంత్యా బభూవ. యామిమా మృతస్య రశనాం విదథేషు పూర్వ ఆయుషి కవ్యా అగృభ్ణన్, సాఽస్మిన్ సుతే నః సామన్నాభూవ. ॥౨॥

భావార్థః :-యథా రశనయా బద్ధాః ప్రాణిన ఇత స్తతః పలాయితుం న శక్నువంతి తథా యుక్త్యా ధృత మాయు రకాలే న పలాయతే. ॥౨॥

పదార్థము:-ఓ మానవులారా! ఏ[బుద్ధి],ఋతస్య=సత్యకారణముయొక్క,సరమ్=పొందదగిన శబ్దమును,ఆరపంతీ=చక్కగా వ్యక్తముగాపలుకుచు,ఆ బభూవ=చక్కగా

విఖ్యాతమగుచున్నదో, ఇమామ్=ఏ దీనిని, ఋతస్య=సత్యకారణముయొక్క, రసనామ్=వ్యాప్తమగు త్రాడువలె,విదథేషు=యజ్ఞాదులందు;పూర్వ్యే=మొదట, ఆయుషి=ప్రాణమును ధారణమొనర్చునాయువునిమిత్తము,కవ్యాః=కవులగు మేధావులు,అగృభ్ణన్=గ్రహించెదరో, సా=ఆబుద్ధి,అస్మిన్ సుతే=ఉత్పన్నమైన యీజగత్తునందు,నః=మాయొక్క, సామన్=అంతిమకార్యమునందు ప్రసిద్ధమగుచున్నది. అనగా కార్యమును సమాప్తి వరకు చేర్చుచున్నది. [౨]

భావార్థము:-రజ్జువుచే బంధించబడినప్రాణులు ఇటునటు పారిపోజాలవు. అటులనే యుక్తిపూర్వకముగ ధారణమొనర్చబడిన ఆయువు అకాలమున పారిపోజాలదు.౧_౨౨౪

---

౧_౨౨౫ అభిధా ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, అగ్ని ర్దేవతా, భురిగనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునర్విద్వాన్ కీదృశో భవతీత్యాహ.

విద్వాంసు డెటులుండును ?

అభిధా అసి భువనమసి యన్తాఽసి ధర్త్తా ।

స త్వమగ్నిం వైశ్వానరꣳసప్రథసఙ్గచ్ఛ స్వాహాకృతః॥ ॥౩॥

అభిధాఽఇత్యభి+ధాః, అసి, భువనమ్, అసి, యన్తా, అసి, ధర్త్తా, సః, త్వమ్, అగ్నిమ్, వైశ్వానరమ్, సప్రథసమితి స+ప్రథసమ్, గచ్ఛ, స్వాహాకృత ఇతి స్వాహా+కృతః॥ ॥౩॥

పదార్థః :-(అభిధాః)యోఽభిదధాతి సః(అసి)(భువనమ్)ఉదకమ్. భువన మిత్యుదక నా. నిఘం. ౧-౧౨. (అసి) (యంతా) నియంతా (అసి) (ధర్త్తా) సకలవ్యవహారధారకః (సః) త్వమ్) (అగ్నిమ్)పావకమ్(వైశ్వానరమ్)విశ్వేషు వస్తుషు నాయకమ్. (సప్రథసమ్)ప్రఖ్యాతత్వేన సహ వర్త్తమానమ్. (గచ్ఛ)(స్వాహాకృతః)సత్యక్రియయా నిష్పన్నః. ॥౩॥

అన్వయః :-హే విద్వన్ య స్త్వం భువన మివా స్యభిధా అసి, యన్తాసి, స స్వాహాకృతో ధర్త్తా త్వం సప్రథసం వైశ్వానర మగ్నిం గచ్ఛ జానీహి. ॥౩॥

భావార్థః:-యథా సర్వేషాం ప్రాణ్యప్రాణినాం జీవన మూలం జలమగ్నిశ్చాస్తి, తథా విద్వాంసం సర్వే జానీయుః. ॥౩॥

పదార్థము:-ఓ విద్వాంసుడా! ఏ నీవు,భువనమ్ అసి=జలమువలెశీతలుడవు,అభిధాః అసి=అభివక్తవు,యంతా అసి=నియమించువాడవునై యున్నావో,సః=అట్టినీవు,స్వాహాకృతః=సత్యక్రియచే సిద్ధుడవు,ధర్త్తా=సకలవ్యవహారములను ధారణమొనర్చువాడవునై, సప్రథసమ్=విఖ్యాతితోపాటువర్తమానము,వైశ్వానరమ్=సమస్తపదార్థములకు నేతయు

నగు,అగ్నిమ్=అగ్నిని, గచ్ఛ=ఎఱుగుము. [౩]

భావార్థము:-ఎటుల సకలప్రాణులు,అప్రాణులు మనుటకు అగ్నిజలములు మూల కారణములై యున్నవో అటులనే విద్వాంసుని కూడఅంద ఱెఱుగవలయును.[౩]౧౨౩౫

---

౧౨౩౬ స్వగేత్యస్య ప్రజాపతి ర్ఋషిః, విశ్వే దేవా దేవతాః,జగతీ ఛందః,నిషాదః స్వరః.
పున స్తమేవ విషయ మాహ.

మఱల నా విషయమే.

స్వగా త్వా దేవేభ్యః ప్రజాపతయే బ్రహ్మన్నశ్వం భన్త్స్యామి దేవేభ్యః ప్రజాపతయే తేన రాధ్యాసమ్ । తం బధాన దేవేభ్యః ప్రజాపతయే తేన రాధ్నుహి॥

స్వగేతి స్వ+గా, త్వా,దేవేభ్యః,ప్రజాపతయ ఇతి ప్రజా+పతయే,బ్రహ్మన్, అశ్వమ్, భన్త్స్యామి, దేవేభ్యః, ప్రజాపతయ ఇతి ప్రజా+పతయే, తేన, రాధ్యాసమ్, తమ్, బధాన, దేవేభ్యః,ప్రజాపతయ ఇతి ప్రజా+పతయే, తేన, రాధ్నుహి॥

పదార్థః :-(స్వగా)స్వయం గచ్ఛతీతి స్వగా స్తం స్వయంగామినమ్. అత్ర విభక్తే ర్డాదేశః (త్వా)త్వామ్(దేవేభ్యః)విద్వద్భ్యః(ప్రజాపతయే)ప్రజాయాః పాలకాయ (బ్రహ్మన్) విద్యయా వృద్ధ(అశ్వమ్)మహాంతమ్(భంత్స్యామి)బద్ధం కరిష్యామి(దేవేభ్యః)దివ్యగుణేభ్యః(ప్రజాపతయే) ప్రజాపాలకాయ గృహస్థాయ(తేన)(రాధ్యాసమ్)సమ్యక్సిద్ధో భవేయమ్. (తమ్)(బధాన)(దేవేభ్యః) దివ్యగుణకర్మస్వభావేభ్యః (ప్రజాపతయే) ప్రజాపాలకాయ (తేన) (రాధ్నుహి) సమ్యక్ సిద్ధో భవ. ॥౪॥

అన్వయః :- హే బ్రహ్మన్నహం త్వా స్వగా కరోమి దేవేభ్యః ప్రజాపతయేఽశ్వం భంత్స్యామి. తేన దేవేభ్యః ప్రజాపతయే రాధ్యాసం తం త్వం బధాన, తేన దేవేభ్యః ప్రజాపతయే రాధ్నుహి. ॥౪॥

భావార్థః :-సర్వై ర్మనుష్యై ర్విద్యా సుశిక్షా బ్రహ్మచర్య సత్సంగైః శరీరాత్మనో ర్మహద్బలం సంపాద్య దివ్యాన్ గుణాన్ గృహీత్వా విద్వద్భ్యః సుఖం దత్వా స్వస్య పరేషాం చ వృద్ధిః కార్యా. ॥౪॥

పదార్థము:-బ్రహ్మన్=విద్యచే వృద్ధినిపొందినవాడా!నేను,త్వా=నిన్ను,స్వగా=స్వయముగ గమనమొనర్చువానిగ చేయుచున్నాను,దేవేభ్యః=విద్వాంసులకొఱకు,ప్రజాపతయే=సంతానమునురక్షించు గృహస్థుని కొరకు,అశ్వమ్=సర్వవ్యాపకమగు నుత్తమ గుణమును, భన్త్స్యామి=బద్ధమొనర్చుచున్నాను. తేన=దానిచేత,దేవేభ్యః=దివ్యగుణముల కొఱకు,ప్రజాపతయే=సంతానమును పాలించుగృహస్థుని కొరకు,రాధ్యాసమ్=[చక్క

గా సంసిద్ధుడ]నగుదునుగాక!తమ్=దానిని నీవు,బధాన=బంధించుము, తేన=దానిచే,దేవేభ్యః=దివ్యగుణకర్మస్వభావములు గలవారికి,ప్రజాపతయే=ప్రజలనుపాలించువానికొఱకు సాధ్నుహి=బాగుగ సిద్ధమగుము. [౪]

భావార్థము:-సమస్తమానవులు విద్యా సుశిక్షలచేతను, బ్రహ్మచర్య సత్సంగముల చేతను,శరీరాత్మలయొక్క గొప్పబలమును సంపాదించి, దివ్యగుణముల ధరించి,విద్వాంసులకు సుఖముచే కూర్చి, తనయొక్కయు,పరులయొక్కయు అభివృద్ధిని ఒనర్చవలయును.

---

ప్రజాపతయ ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ఇంద్రాదయో దేవతాః, అతిధృతి శ్ఛందః, షడ్జః స్వరః,
పున ర్మనుష్యాః కాన్ వర్ధయేయు రిత్యాహ.
మానవులెవరిని వర్ధింప జేయవలయును ?

ప్ర॒జాప॑తయే త్వా॒ జుష్టం॒ ప్రోక్షా॑మీన్ద్రా॒గ్నిభ్యాం॑ త్వా॒ జుష్టం॒ ప్రోక్షా॑మి వా॒యవే॑ త్వా॒ జుష్టం॒ ప్రోక్షా॑మి విశ్వే॑భ్య స్త్వా॒ దే॒వేభ్యో॒ జుష్టం॒ ప్రోక్షా॑మి స॒ర్వేభ్య స్త్వా॒ దే॒వేభ్యో॒ జుష్టం॒ ప్రోక్షా॑మి । యోఽఅర్వ॑న్తం॒ జిఘా॑ꣳసతి॒ తమ॒భ్య॑మీతి॒ వరు॑ణః ప॒రో మ॒ర్తః॑ ప॒రః శ్వా॥ ॥౫॥

ప్ర॒జాప॑తయ॒ ఇతి॑ ప్ర॒జా+ప॑తయే, త్వా, జుష్ట॑మ్, ప్ర, ఉ॒క్షా॒మి॒, ఇ॒న్ద్రా॒గ్ని॒భ్యా॒మితీ॑న్ద్రా॒గ్ని+భ్యా॑మ్, త్వా॒, జుష్ట॑మ్, ప్ర, ఉ॒క్షా॒మి॒, వా॒యవే॑, త్వా॒, జుష్ట॑మ్, ప్ర, ఉ॒క్షా॒మి॒, వి॒శ్వే॑భ్యః, త్వా॒, దే॒వేభ్యః॑, జుష్ట॑మ్, ప్ర, ఉ॒క్షా॒మి॒, స॒ర్వే॑భ్యః, త్వా॒, దే॒వేభ్యః॑, జుష్ట॑మ్, ప్ర, ఉ॒క్షా॒మి॒, అర్వ॑న్తమ్, జిఘా॑ꣳసతి, తమ్, అ॒భి, అ॒మీ॒తి॒, వరు॑ణః, ప॒రః, మ॒ర్తః॑, ప॒రః, శ్వా॥ ॥౫॥

పదార్థః :-(ప్రజాపతయే)ప్రజాపాలకాయ (త్వా) త్వామ్ (జుష్టమ్) ప్రీతమ్ (ప్రోక్షామి) ప్రకృష్టతయా ఉక్షింభామి. (ఇంద్రాగ్నిభ్యామ్)జీవాగ్నిభ్యామ్(త్వా) (జుష్టమ్) (ప్రోక్షామి) (వాయవే)పవనాయ(త్వా)(జుష్టమ్)(ప్రోక్షామి)(విశ్వేభ్యః)అఖిలేభ్యః(త్వా)త్వామ్(దేవేభ్యః) విద్వద్భ్యః(జుష్టం)(ప్రోక్షామి)(సర్వేభ్యః)సమగ్రేభ్యః(త్వా)(దేవేభ్యః)దివ్యేభ్యః పృథివ్యాదిపదార్థేభ్యః (జుష్టమ్) (ప్రోక్షామి) (యః) (అర్వంతమ్)శీఘ్రగామినమశ్వమ్ (జిఘాంసతి) హంతుమిచ్ఛతి(తమ్)(అభి) (అమీతి) ప్రాప్నోతి(వరుణః) శ్రేష్ఠః (పరః) ఉత్కృష్టః (మర్తః) మనుష్యః (పరః)(శ్వా)కుక్కురః. ॥౫॥

అన్వయః :- హే విద్వన్ యః పరో వరుణో మర్తో ఽర్వంతం జిఘాంసతి తమభ్యమీతి,యః పరః శ్వేవ వర్తతే,యస్తం నివారయతి తం ప్రజాపతయే జుష్టం త్వా ప్రోక్షామింద్రాగ్నిభ్యాం జుష్టం త్వాప్రోక్షామి,వాయవే త్వా జుష్టం ప్రోక్షామి, విశ్వేభ్యో దేవేభ్యో జుష్టం త్వా ప్రోక్షామి, సర్వేభ్యో దేవేభ్యో జుష్టం త్వా ప్రోక్షామి. ॥౫॥

భావార్థః:- యే మనుష్యా ఉత్తమాన్ పశూన్ హింసితు మిచ్ఛేయు స్తే సింహావద్ధంతవ్యాః, య ఏతాన్ రక్షితుం యతేరం స్తే, సర్వరక్షణాయాధికర్తవ్యాః. ॥౫॥

పదార్థము:- ఓవిద్వాంసుడా!పరః=ఉత్తముడు,వరుణః=శ్రేష్ఠుడునగు,యః మర్తః =ఏమానవుడు,అర్వంతమ్=శీఘ్రముగ నడచుహయమును,జిఘాంసతి=కొట్టినడపదలచుచున్నాడో, తమ్=అతనికి, అభి అమీతి=అన్నివైపులనుండి లభించుచున్నది, మఱియు, పరః=ఏ ఇతరమానవుడు,శ్వా=కుక్కవలె దుష్కర్మియైయున్నాడో,అతనినిఎవడు నిరోధించుచున్నాడో అట్టి, ప్రజాపతయే=ప్రజలను పాలించువానికి,జుష్టమ్=ప్రీతికలిగించిన త్వా=నిన్ను,ప్రోక్షామి=బాగుగా సిక్తమొనర్చుచున్నాను. ఇంద్రాగ్నిభ్యామ్=జీవముకొఱకు,అగ్నికొఱకు,జుష్టమ్=ప్రీతికల్పించిన, త్వా=నిన్ను, ప్రోక్షామి=చక్కగా ప్రోక్షించుచున్నాను,వాయవే=పవనముకొఱకు, జుష్టమ్ త్వా=ప్రీతియొనర్చిన నిన్ను, ప్రోక్షామి=బాగుగా ప్రోక్షించుచున్నాను. విశ్వేభ్యః=సకల విద్వాంసులకు, జుష్టమ్ త్వా= ప్రీతియొనర్చిన నిన్ను,ప్రోక్షామి=అభిషిక్త మొనర్చుచున్నాను.సర్వేభ్యఃదేవేభ్యః=దివ్యములగు పృథివ్యాదులకు,జుష్టమ్ త్వా=ప్రీతి చేకూర్చిననిన్ను,ప్రోక్షామి=అభిషిక్తమొనర్చుచున్నాను. [౫]

భావార్థము:- ఉత్తమపశువులను హింసించగోరు మానవులు సింహామువలె హంతవ్యులగుచున్నారు. వీనిని [ఈ పశువులను] రక్షించుటకు ప్రయత్నించువారలే అందఱిని రక్షించు అధికారము పొంద యోగ్యులగుదురు. [౫] ౧౨౭౭

---

అగ్నయ ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, అగ్న్యాదయో దేవతాః, భురిగతిజగతీ ఛందః,నిషాదః స్వరః.

పున ర్మనుష్యాః కథం వర్తేరన్నిత్యాహ.

మానవులెటుల ప్రవర్తించవలయును?

అగ్నయే స్వాహా సోమాయ స్వాహాపాం మోదాయ స్వాహా సవిత్రే స్వాహా వాయవే స్వాహా విష్ణవే స్వాహేన్ద్రాయ స్వాహా బృహస్పతయే స్వాహా మిత్రాయ స్వాహా వరుణాయ స్వాహా॥ ॥౬॥

అగ్నయే, స్వాహా, సోమాయ, స్వాహా, అపామ్, మోదాయ, స్వాహా,

సవిత్రే, స్వాహా, వాయవే, స్వాహా, విష్ణవే, స్వాహా, ఇన్ద్రాయ, స్వాహా, బృహస్పతయే, స్వాహా, మిత్రాయ, స్వాహా; వరుణాయ, స్వాహా॥ ॥౬॥

పదార్థః :-(అగ్నయే)పావకాయ (స్వాహా) శ్రేష్ఠయా క్రియయా (సోమాయ) ఓషధిగణ శోధనాయ(స్వాహా)(అపామ్)జలానామ్(మోదాయ)ఆనందాయ(స్వాహా)సుఖప్రాప్తికా క్రియా (సవిత్రే)సూర్యాయ (స్వాహా) (వాయవే) (స్వాహా) (విష్ణవే) వ్యాపకాయ విద్యుద్రూపాయ (స్వాహా)(ఇంద్రాయ)జీవాయ(స్వాహా)(బృహస్పతయే)బృహతాం పాలకాయ(స్వాహా)(మిత్రాయ)సఖ్యే(స్వాహా)సత్క్రియా(వరుణాయ)శ్రేష్ఠాయ(స్వాహా)ఉత్తమక్రియా. ॥౬॥

అన్వయః:-యది మనుష్యా అగ్నయే స్వాహా, సోమాయ స్వాహాఽపాం మోదాయ స్వాహా, సవిత్రే స్వాహా, వాయవే స్వాహా, విష్ణవే స్వాహేంద్రాయ స్వాహా, బృహస్పతయే స్వాహా, మిత్రాయ వరుణాయ స్వాహా క్రియేరం స్తర్హి కిం కిం సుఖం న ప్రాప్యేత. ॥౬॥

భావార్థః :- హే మనుష్యా యదగ్నౌ సంస్కృతం ఘృతాదికం హవి ర్హూయతే, తదోషధి జలం సూర్యతేజో వాయువిద్యుతౌ చ సంశోధ్యైశ్వర్య వర్ధన ప్రాణాపాన ప్రజారక్షణశ్రేష్ఠ సత్కారనిమిత్తం జాయతే, కించిదపి ద్రవ్యం స్వరూపతో నష్టం న భవతి. కింతు అవస్థాంతరం ప్రాప్య సర్వత్రైవ పరిణతం జాయతే. అతఏవ సుగంధ మిష్టపుష్టిరోగనాశకగుణై ర్యుక్తాని ద్రవ్యాణ్యగ్నౌ ప్రక్షిప్యౌషధ్యాది శుద్ధిద్వారా జగదారోగ్యం సంపాదనీయమ్. ॥౬॥

పదార్థము:-మానవులు,అగ్నయే=అగ్నికొఱకు,స్వాహా=శ్రేష్ఠక్రియను, సోమాయ=ఔషధములను శోధించుటకు, స్వాహా=ఉత్తమక్రియను, అపామ్=జలసంబంధమున కలుగు,మోదాయ=ఆనందమునకై,స్వాహా=సుఖముచేకూర్చుక్రియను,సవిత్రే=సూర్య మండలార్థము, స్వాహా=ఉత్తమక్రియను, వాయవే=పవనముకొఱకు, స్వాహా=ఉత్తమ క్రియను, విష్ణవే=[వ్యాపకమగు]విద్యుద్రూపాగ్నికై,స్వాహా=ఉత్తమక్రియను, ఇంద్రాయ=జీవునకై, స్వాహా=ఉత్తమక్రియను, బృహస్పతయే=పెద్దలను పాలించువారికై, స్వాహా=ఉత్తమక్రియను, మిత్రాయ=మిత్రునికై,స్వాహా=ఉత్తమక్రియను,వరుణాయ =శ్రేష్ఠపురుషునకై,స్వాహా=ఉత్తమక్రియను ఆచరించుచో,ఏ యే యుత్తమసుఖములు లభించవు ? [౬]

భావార్థము:-ఓ మానవులారా! సంస్కృత మొనర్చబడిన యే ఘృతాది హవిస్సు అగ్నియందు హోమమొనర్చబడునో,అయ్యది ఓషధులను, జలమును,సూర్యుని తేజస్సును, వాయువిద్యుత్తులను చక్కగా సంశోధన మొనర్చి ఐశ్వర్యవృద్ధికి కారణమగుచున్నది. మఱియు ప్రాణాపానములరక్షణ,ప్రజారక్షణ అను శ్రేష్ఠసత్కారములకు నిమిత్తమగుచున్నది. ద్రవ్యమెద్దియు స్వరూపముతో నేమాత్రము నశించదు. కాని అవస్థాంతరమును పొంది సర్వత్ర పరిణతము జెందును.కనుకనే సుగంధపుష్టి మిష్ట రోగనాశక గుణములుగల పదార్థ

ముల నగ్నియందు వ్రేల్చి ఓషధ్యాది పదార్థముల శుద్ధిద్వారా సంసారమున కారోగ్యము సంపాదించవలయును. [౬]౧౨౩౯

౧౨౪ హింకారాయేత్యస్య ప్రజాపతి ర్ఋషిః; ప్రాణాదయో దేవతాః,అత్యష్టి శ్ఛందః, గాంధారః స్వరః.

పున ర్మనుష్యై ర్జగత్ కథం శోధనీయ మిత్యాహ.

మానవులు జగత్తునెటుల శుద్ధమొనర్చ వలయును ?

హిఙ్కారాయ స్వాహా హిఙ్కృతాయ స్వాహా క్రన్దతే స్వాహాఽవక్రన్దాయ స్వాహా ప్రోథతే స్వాహా ప్రప్రోథాయ స్వాహా గన్ధాయ స్వాహా ఘ్రాతాయ స్వాహా నివిష్టాయ స్వాహోపవిష్టాయ స్వాహా సన్దితాయ స్వాహా వల్గతే స్వాహా ఽఽసీనాయ స్వాహా శయానాయ స్వాహా స్వపతే స్వాహా జాగ్రతే స్వాహా కూజతే స్వాహా ప్రబుద్ధాయ స్వాహా విజృమ్భమాణాయ స్వాహా విచృతాయ స్వాహా సంహానాయ స్వాహోపస్థితాయ స్వాహాఽయనాయ స్వాహా ప్రాయణాయస్వాహా॥

హిఙ్కారాయేతి హిమ్+కారాయ, స్వాహా, హిఙ్కృతాయేతి హిమ్+కృతాయ, స్వాహా, క్రన్దతే, స్వాహా, అవక్రన్దాయేత్యవ+క్రన్దాయ, స్వాహా, ప్రోథతే, స్వాహా,ప్రప్రోథాయేతి ప్ర+ప్రోథాయ,స్వాహా,గన్ధాయ,స్వాహా,ఘ్రాతాయ,స్వాహా, నివిష్టాయేతి ని+విష్టాయ, స్వాహా, ఉపవిష్టాయేత్యుప+విష్టాయ, స్వాహా, సన్దితాయేతి సమ్+దితాయ, స్వాహా, వల్గతే, స్వాహా, ఆసీనాయ, స్వాహా, శయానాయ, స్వాహా, స్వపతే, స్వాహా, జాగ్రతే, స్వాహా, కూజతే, స్వాహా, ప్రబుద్ధాయేతి ప్ర+బుద్ధాయ, స్వాహా, విజృమ్భమాణాయేతి వి+జృమ్భమాణాయ, స్వాహా, విచృతాయేతి వి+చృతాయ, స్వాహా, సంహానాయేతి సమ్+హానాయ,స్వాహా, ఉపస్థితాయేత్యుప+స్థితాయ, స్వాహా, ఆయనాయేత్యా+అయనాయ, స్వాహా, ప్రాయణాయ, ప్రాయణాయేతి ప్ర+అయనాయ, స్వాహా॥ ॥౭॥

పదార్థః :- (హింకారాయ) యో హిం కరోతి తస్మై (స్వాహా) (హింకృతాయ) హిం కృతం యేన తస్మై (స్వాహా) (క్రందతే) ఆహ్వానం రోదనం వా కుర్వతే. (స్వాహా)(అవక్రం

దాయ)నీచైః కృతాహ్వానాయ(స్వాహా)(ప్రోథతే)పర్యాప్తాయ(స్వాహా)(ప్రప్రోథాయ)అత్యంతం పర్యాప్తాయ(స్వాహా)(గంధాయ)(స్వాహా)(ఘ్రాతాయ)యోఽఘ్రాయి తస్మై (స్వాహా)(నివిష్టాయ)యో నివిశతే తస్మై(స్వాహా) (ఉపవిష్టాయ)య ఉపవిశతి తస్మై(స్వాహా)(సందితాయ)యః సమ్యగ్ దీయతే ఖండ్యతే తస్మై(స్వాహా) (వల్గతే)గచ్ఛతే (స్వాహా) (ఆసీనాయ) స్థితాయ (స్వాహా) (శయానాయ) శేతే తస్మై (స్వాహా) స్వపతే ప్రాప్తసుషుప్తయే (స్వాహా)(జాగ్రతే)(స్వాహా)(కూజతే)అప్రకటశబ్దోచ్చారకాయ(స్వాహా)(ప్రబుద్ధాయ) ప్రకృష్టజ్ఞానవతే (స్వాహా)(విజృంభమాణాయ)విశేషేణాంగ వినామకాయ(స్వాహా) (విచృతాయ) గ్రంథకాయ (స్వాహా)(సంహానాయ)సంహన్యతే యస్మింస్తస్మై(స్వాహా)(ఉపస్థితాయ)ప్రాప్తసమీపత్వాయ (స్వాహా)(ఆయనాయ)సమంతాద్విజ్ఞానాయ(స్వాహా)(ప్రాయణాయ)(స్వాహా). ॥౭॥

అన్వయః :-యై ర్మనుష్యై ర్హింకారాయ స్వాహా,హింకృతాయ స్వాహా,క్రందతే స్వాహోఽవక్రందాయ స్వాహా,ప్రోథతే స్వాహా, ప్రప్రోథాయ స్వాహా, గంధాయ స్వాహా, ఘ్రాతాయ స్వాహా, నివిష్టాయ స్వాహోపవిష్టాయ స్వాహా, సందితాయ స్వాహా, వల్గతే స్వాహాఽఽసీనాయ స్వాహా,శయానాయ స్వాహా,స్వపతే స్వాహా,జాగ్రతే స్వాహా,కూజతే స్వాహా,ప్రబుద్ధాయ స్వాహా, విజృంభమాణాయ స్వాహా,విచృతాయ స్వాహా, సంహానాయ స్వాహోపస్థితాయ స్వాహాఽయనాయ స్వాహా,ప్రాయణాయ స్వాహా క్రియంతే, తై ర్దుఃఖాని వియోజ్య సుఖాని లభ్యంతే. ॥౭॥

భావార్థః :-మనుష్యై రగ్నిహోత్రాది యజ్ఞై ర్యావద్ధూయతే తావత్సర్వం ప్రాణినాం సుఖకారకం భవతి. ॥౭॥

పదార్థము:-ఏ మానవులు,హింకారాయ=హిం అని శబ్దమొనర్చువానికై,స్వాహా =ఉత్తమక్రియను, హింకృతాయ=హిం అను శబ్దమొనర్చినవానికై, స్వాహా=ఉత్తమ క్రియను,క్రందతే=పిలుచువానికై లేక ఆక్రందనమొనర్చువానికై,స్వాహా=ఉత్తమక్రియను,అవక్రందాయ=క్రిందనుండి[హీనస్వరముతో]పిలుచువానికై,స్వాహా=ఉత్తమక్రియను, ప్రోథతే=సర్వకర్మలయందు పరిపూర్ణునికై, స్వాహా=ఉత్తమక్రియను, (ప్రప్రోథాయ) అత్యంత పూర్ణునికై. స్వాహా) ఉత్తమ క్రియను. గంధాయ=సుగంధమునకై,స్వాహా=ఉత్తమక్రియను,ఘ్రాతాయ=ఘ్రాణమొనర్చిన వానికై,స్వాహా=ఉత్తమక్రియను, నివిష్టాయ=నిరంతరముప్రవేశించువానికై,కూర్చొనువానికై, స్వాహా=ఉత్తమక్రియను, ఉపవిష్టాయ=కూర్చొన్నవానికి,స్వాహా=ఉత్తమక్రియను, సందితాయ=బాగుగా నివ్వబడిన[లేక ఖండించబడిన]దానికై,స్వాహా=ఉత్తమక్రియను,బల్గతే=నడచువానికై, స్వాహా=ఉత్తమక్రియను, ఆసీనాయ=కూర్చొన్నవానికై, స్వాహా=ఉత్తమక్రియను, శయనాయ=నిద్రించువానికై, స్వాహా=ఉత్త మక్రియను, స్వపతే=నిద్రను పొందినవానికై, స్వాహా=ఉత్తమక్రియను. ఆగ్రతే=మేలుకొన్నవానికై, స్వాహా=ఉత్తమక్రియను, కూజతే=కూజించువానికై, స్వాహా=ఉత్తమక్రియను, ప్రబుద్ధాయ=ఉత్తమ జ్ఞానవంతునకై ,స్వాహా=ఉత్తమక్రియను, విజృంభమాణాయ=బాగుగ ఆవలించుటకై, స్వాహా=

ఉత్తమక్రియను,విచృతాయ=విశేషరచన యొనర్చువానికై,స్వాహా=ఉత్తమ క్రియను, సంహానాయ=సంఘాత పదార్థములను సమూహముగ నొనర్చువానికై, స్వాహా= ఉత్తమక్రియను, ఉపస్థితాయ=సమీపమున స్థితుడై యున్నవానికి, స్వాహా=ఉత్తమ క్రియను, అయనాయ=చక్కని విశేషజ్ఞానమునకై,స్వాహా=ఉత్తమక్రియను,మఱియు, ప్రాయణాయ=చేర్పించువానికై, స్వాహా=ఉత్తమక్రియను ఒనర్చెదరో, ఆమానవులకు దుఃఖములు తొలగి సుఖములు సమకూరును. [౭]

భావార్థము:-మానవులచే నగ్నిహోత్రాదులందెంత వ్రేల్చబడునో యది ప్రాణుల కంత సుఖము సమకూర్చునది యగుచున్నది. [౭]౧-౨౭

---

౧-౨౮ం యతే స్వాహేత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ప్రయత్నవంతో జీవాదయో దేవతాః,
నిచృదతిధృతి శ్ఛందః; షడ్జః స్వరః.
పున స్తమేవ విషయ మాహ.
మఱల విషయ మదియే.

యతే స్వాహా ధావతే స్వాహోద్ద్రావాయ స్వాహోద్దుతాయ స్వాహా శూకారాయ స్వాహా శూకృతాయ స్వాహా నిషణ్ణాయ స్వాహోత్థితాయ స్వాహా జవాయ స్వాహా బలాయ స్వాహా వివర్తమానాయ స్వాహా విపృత్తాయ స్వాహా విధూన్వానాయ స్వాహా విధూతాయ స్వాహా శుశ్రూషమాణాయ స్వాహా శృణ్వతే స్వాహేక్షమాణాయ స్వాహేక్షితాయ స్వాహా వీక్షితాయ స్వాహా నిమేషాయ స్వాహా యదత్తి తస్మై స్వాహా యత్ పిబతి తస్మై స్వాహా యన్మూత్రం కరోతి తస్మై స్వాహా కుర్వతే స్వాహా కృతాయ స్వాహా॥ ॥౮॥

యతే, స్వాహా, ధావతే, స్వాహా, ఉద్ద్రావాయేత్యుత్+ద్రావాయ,స్వాహా, ఉద్దుతాయేత్యుత్+దుతాయ, స్వాహా, శూకారాయ, స్వాహా, శూకృతాయ, స్వాహా, నిషణ్ణాయ, నిసన్నాయేతి ని+సన్నాయ, స్వాహా. ఉత్థితాయ, స్వాహా, జవాయ, స్వాహా, బలాయ, స్వాహా, వివర్తమానాయేతి వి+వర్తమానాయ,స్వాహా, విపృత్తాయేతి వి+పృత్తాయ, స్వాహా, విధూన్వానాయేతి విధూన్వానాయ, స్వాహా, విధూతాయేతి వి+ధూతాయ, స్వాహా,శుశ్రూషమాణాయ,స్వాహా,శృణ్వతే,స్వాహా

ఈక్షమాణాయ, స్వాహా, ఈక్షితాయ, స్వాహా, వీక్షితాయేతి వి+ఈక్షితాయ, స్వాహా, నిమేషాయేతి ని+మేషాయ, స్వాహా, యత్, అత్తి, తస్మై, స్వాహా, యత్, పిబతి, తస్మై, స్వాహా, యత్, మూత్రమ్, కరోతి, తస్మై, స్వాహా, కుర్వతే స్వాహా, కృతాయ, స్వాహా॥ ॥౮॥

పదార్థం :-(యతే) ప్రయతమానాయ(స్వాహా) సత్క్రియా (ధావతే) (స్వాహా) (ఉద్ద్రావాయ) ఊర్ధ్వం గతాయ ద్రవీభూతాయ(స్వాహా) (ఉద్ద్రుతాయ) ఉత్కర్షం గతాయ (స్వాహా) (శూకారాయ) శీఘ్రకారిణే(స్వాహా) (శూకృతాయ) శీఘ్రం కృతాయ(స్వాహా) (నిషణ్ణాయ)నిశ్చయేనస్థితాయ(స్వాహా)(ఉత్థితాయ)కృతోత్థానాయ(స్వాహా)(జవాయ)వేగాయ(స్వాహా)(బలాయ) (స్వాహా)(వివర్తమానాయ)విశేషేణ వర్తమానాయ(స్వాహా) (వివృత్తాయ) వివిధతయా కృతవర్తమానాయ(స్వాహా)(విధూన్వానాయ)యో వివిధం ధునోతి తస్మై (స్వాహా)(విధూతాయ) యేన వివిధం ధూతం కంపితం తస్మై(స్వాహా)(శుశ్రూషమాణాయ)శ్రోతు మిచ్ఛతే (స్వాహా) (శృణ్వతే)యః శృణోతి తస్మై(స్వాహా)(ఈక్షమాణాయ)దర్శకాయ (స్వాహా) (ఈక్షితాయ) అన్యేన దృష్టాయ (స్వాహా) (వీక్షితాయ) విశేషేణ కృతదర్శనాయ (స్వాహా) (నిమేషాయ) (స్వాహా)(యత్)(అత్తి) భక్షయతి(తస్మై)(స్వాహా)(యత్)(పిబతి)(తస్మై) (స్వాహా)(యత్) (మూత్రమ్) (కరోతి)(తస్మై)(స్వాహా)(కుర్వతే)(స్వాహా)(కృతాయ)(స్వాహా). ॥౮॥

అన్వయః :-యే మనుష్యా యతే స్వాహా, ధావతే స్వాహోద్ద్రావాయ స్వాహోద్ద్రుతాయ స్వాహా,శూకారాయ స్వాహా,శూకృతాయ స్వాహా,నిషణ్ణాయ స్వాహోత్థితాయ స్వాహా, జవాయ స్వాహా,బలాయ స్వాహా,వివర్తమానాయ స్వాహా,వివృత్తాయ స్వాహా, విధూన్వానాయ స్వాహా,విధూతాయ స్వాహా,శుశ్రూషమాణాయ స్వాహా,శృణ్వతే స్వాహేక్షమాణాయ స్వాహేక్షితాయ స్వాహా, వీక్షితాయ స్వాహా, నిమేషాయ స్వాహా, యదత్తి తస్మై స్వాహా, యత్ పిబతి తస్మై స్వాహా,యన్మూత్రం కరోతి తస్మై స్వాహా కుర్వతే,స్వాహా,కృతాయ స్వాహా, కుర్వంతి తే సర్వాణి సుఖాని లభంతే. ॥౮॥

భావార్థః:-యే ప్రయత్నధావనాదీనాం సాధకాని సుగంధ్యాది హోమ ప్రభృతీని చ కర్మాణి కుర్వంతి. తే సర్వాణీష్టాని వస్తూని ప్రాప్నువంతి. ॥౮॥

పదార్థము:-ఏ మనుష్యులు,యతే=యత్నశీలురకై,స్వాహా=సత్క్రియను, ధావతే=పరుగిడువానికై, స్వాహా=శ్రేష్ఠక్రియను, ఉద్ద్రావాయ=పైకిపోయిన ఆర్ద్రపదార్థములకై, స్వాహా=సుందరమైన క్రియను, ఉద్ద్రుతాయ=ఉత్కర్షమును పొందినవానికి, స్వాహా=ఉత్తమక్రియను, శూకారాయ=శీఘ్రత్వమొనర్చువానికి, స్వాహా=ఉత్తమక్రియను, శూకృతాయ=శీఘ్రమొనర్చినవానికి, స్వాహా=ఉత్తమక్రియను, నిషణ్ణాయ=నిశ్చయముగ కూర్చొన్నవానికి, స్వాహా=ఉత్తమక్రియను, ఉత్థితాయ=లేచినవానికై,

స్వాహా=ఉత్తమక్రియను,జవాయ=వేగమునకై, స్వాహా=ఉత్తమక్రియను, బలాయ=బలమునకై, స్వాహా=ఉత్తమక్రియను, వివర్తమానాయ=విశేషరీతితో ప్రవర్తమానుడై యుండువానికై,స్వాహా=సత్క్రియను, వివృత్తాయ=విశేషరీతిగ ప్రవర్తించినవానికై, స్వాహా=ఉత్తమక్రియను,విధూన్వాయ=పదార్థమును విధూనన మొనర్చువానికై, స్వాహా=ఉత్తమక్రియను,విధూతాయ=అనేకవిధముల విధూనన మొనర్చినవానికై,స్వాహా=ఉత్తమక్రియను, శుశ్రూషమాణాయ=వినగోరువానికై, స్వాహా=ఉత్తమక్రియను, శృణ్వతే=వినుచున్నవానికై, స్వాహా=ఉత్తమక్రియను, ఈక్షమాణాయ=వీక్షించువానికై, స్వాహా=ఉత్తమక్రియను, ఈక్షితాయ=వీక్షించినవానికై, స్వాహా=ఉత్తమక్రియను,వీక్షితాయ=బాగుగా వీక్షించినవానికై,స్వాహా=ఉత్తమక్రియను, నిమేషాయ=కనురెప్పలు మూయుటకై, తెరచుటకై, స్వాహా=ఉత్తమక్రియను, యత్ అత్తి=ఎవడు తినుచున్నాడో, తస్మై స్వాహా=అతనికై ఉత్తమక్రియను,యత్ పిబతి=ఎవడు త్రాగుచున్నాడో,తస్మైస్వాహా=అతనికై ఉత్తమక్రియను,యత్ మూత్రం కరోతి=ఎవడు మూత్రమును విడచుచున్నాడో,తస్మై=అతనికై,స్వాహా=ఉత్తమక్రియను, కుర్వతే=చేయువానికై, స్వాహా=ఉత్తమక్రియను, కృతాయ=చేసినవానికై, స్వాహా=ఉత్తమ క్రియను చేయుచున్నారో వారందరు సకలసుఖములు పొందుచున్నారు. [౮]

భావార్థము:-ఎవరు సుప్రయత్నములను, ధావనాదిక్రియలను సాధించుకార్యములను,సుగంధ్యాది వస్తువుల హోమకర్మలను చేయుచున్నారో, వారు సకలసుఖములను అభీష్టవస్తువుల నన్నిటిని పొందుచున్నారు. [౮]

---

తత్సవితు రిత్యస్య విశ్వామిత్ర ఋషిః, సవితా దేవతా, నిచృద్ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః

అథేశ్వర విషయమాహ.

ఈశ్వరుని గురించి చెప్పబడినది.

**తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్॥**

**తత్, సవితుః, వరేణ్యమ్, భర్గః, దేవస్య, ధీమహి,**

**ధియః, యః,నః, ప్రచోదయాదితి ప్ర+చోదయాత్॥** ॥౯॥

పదార్థః:-(తత్)(సవితుః)సకలజగదుత్పాదకస్య(వరేణ్యమ్)వరేణ్యం వర్తుమర్హ మత్యుత్తమమ్(భర్గః)సర్వదోషప్రదాహకం తేజోమయం శుద్ధమ్ (దేవస్య)స్వప్రకాశస్వరూపస్య (సర్వైః) కమనీయస్య సర్వసుఖప్రదస్య(ధీమహి)దధీమహి(ధియః)ప్రజ్ఞాః(యః)పరమాత్మా(నః)అస్మాకమ్ (ప్రచోదయాత్). ॥౯॥

అన్వయః:- హే మనుష్యాః సవితు ర్దేవస్య యద్వరేణ్యం భర్గో వయం ధీమహి. తదేవ యూయం ధరత.యో నః సర్వేషాం ధియః ప్రచోదయాత్ సోఽంతర్యామీ సర్వైరుపాసనీయః.

భావార్థః:-సర్వైర్మనుష్యైః సచ్చిదానందస్వరూపం నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావం సర్వాంతర్యామిణం పరమాత్మానం విహాయైతస్య స్థానేఽన్యస్య కస్యచిత్పదార్థస్యోపాసనాస్థాపనం కదాచిన్నైవ కార్యం కస్మై ప్రయోజనాయ? యోఽస్మాభిరుపాసితః సన్నాస్మాకం బుద్ధీరధర్మాచరణాన్నివర్త్య ధర్మాచరణే ప్రేరయేత్. యేన శుద్ధాః సంతో వయం తం పరమాత్మానంప్రాప్యైహిక పారమార్థికే సుఖే భుంజీమహీత్యస్మై. ॥౯॥

పదార్థము:-ఓ మానవులారా! సవితుః=సకలజగదుత్పాదకుడు, దేవస్య=స్వయం ప్రకాశుడు, అందఱుకోరదగు సమస్తసుఖములనిచ్చు వాడునగు పరమేశ్వరునియొక్క, వరేణ్యమ్=స్వీకరించదగినది, అత్యుత్తమమునగు, భర్గః=సమస్తదోషములను దహనమొనర్చు పశుద్ధస్వరూపమును మేము, ధీమహి=ధారణమొనర్చెదమో, తత్=దానిని మీరు ధారణమొనర్చుడు, యః=ఎవడు, నః=మనయందఱియొక్క, ధియః=బుద్ధులను, ప్రచోదయాత్=ప్రేరేపించునో అనగా వారిని [మనలనందఱను]సత్కర్మలయందు ప్రవేశమొనరింపజేయునో, ఆ అంతర్యామియైన పరమాత్మ అందఱికి ఉపాసించ యోగ్యుడు.

భావార్థము:- మానవులందరు సచ్చిదానంద స్వరూపుడు, నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావుడు,సర్వాంతర్యామియునగు పరమాత్మను వదలి అతనికిబదులుగా ఇతరవస్తువును దేనినెన్నటికి ఉపాపించకూడదు. ఏ ప్రయోజనముకొఱకు? మేముసాసించిన పరమాత్మ మాబుద్ధులను అధర్మాచరణమునుండితొలగించి ధర్మాచరణమునందుప్రవృత్తమొనరించుటకును, అటుల శుద్ధులైనమేము ఆపరమాత్మనుపొంది ఐహికపారలౌకిక సుఖములను భోగించగలుగుటకును. ఈ ప్రయోజనములకొఱకు. [౯]౧౩౧

---

౧౩౨ హిరణ్యపాణీత్యస్య మేధాతిథి ఋషిః, సవితా దేవతా, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః

పునస్తమేవ విషయ మాహ.

మఱల నద్విషయమే.

హిరణ్యపాణి మూతయే సవితారముపహ్వాయే। స చేత్తా దేవతా పదమ్॥

హిరణ్యపాణిమితి హిరణ్య+పాణిమ్, ఊతయే, సవితారమ్,

ఉప, హ్వాయే,సః,చేత్తా, దేవతా, పదమ్॥ ॥౧౦॥

పదార్థః:-(హిరణ్యపాణిం)హిరణ్యాని సూర్యాదీని తేజాంసి పాణౌ స్తవనే యస్య తమ్ (ఊతయే)రక్షణాద్యాయ(సవితారమ్)సకలైశ్వర్యప్రాపకమ్(ఉప)(హ్వాయే) ధ్యానయోగేనాహ్వాయే(సః)(చేత్తా)సమ్యగ్జ్ఞానస్వరూపత్వేన సత్యాఽసత్యజ్ఞాపకః(దేవతా)ఉపాసనీయ ఇష్టదేవ ఏవ(పదమ్)ప్రాప్తుమర్హమ్. ॥౧౦॥

అన్వయః:- హే మనుష్యా యమహమూతయే హిరణ్యపాణిం పదం సవితారముపహ్వాయే స చేత్తా దేవతాఽస్తీతి యూయం విజానీత. ॥౧౦॥

భావార్థః:-మనుష్యై రితః పూర్వమంత్రార్థస్య వివరణం వేదితవ్యమ్. చేతనస్యరూపస్య పరమాత్మన ఉపాసనాం విహాయ కస్యాప్యన్యస్య జడస్యోపాసనా కదాపి నైవ కార్యా. నహి జడముపాసితం సద్ధానిలాభకారకం రక్షకం చ భవతి. తస్మాచ్చేతనైః సర్వైర్జీవైశ్చేతనో జగదీశ్వర ఏవోపాసనీయో నేతరో జడత్వాదిగుణయుక్తః పదార్థః ॥౧౦॥

పదార్థము:—ఓ మానవులారా! నేను, ఊతయే=రక్షాదుల నిమత్తము, హిరణ్యపాణిమ్=సూర్యాదితేజము లెవనిని స్తవనమొనర్చుచున్నవో, పదమ్=పొందయోగ్యుడు, సవితారమ్=సకలైశ్వర్యములను లభింపజేయువాడునగునట్టి యే జగదీశ్వరుని, ఉపహ్వయే=ధ్యానయోగముచే పిలుచుచున్నానో, సః=అతను, చేత్తా=మంచిజ్ఞానస్వరూపుడగుటచేసత్యమును, మిథ్యను తెలియజేయువాడు, దేవతా=ఉపాసించయోగ్యుడు, ఇష్టదేవుడునై యున్నాడని మీరందఱు గ్రహించుడు. [౧౦]

భావార్థము:-ఈ మంత్రమునుండి గురుమంత్రమనబడు పూర్వోక్తగాయత్రీ మంత్రముయొక్క వివరణమే యనియు, దానిఅర్థముయొక్క తాత్పర్యమిటులుండుననియు గ్రహించవలయును, చేతనస్వరూపుడగు పరమాత్ముని యుపాసనను వదలి ఇతర యే జడమును ఉపాసించజనదు, ఏలయన ఉపాసించబడిన జడపదార్థము హానిలాభముల [నొనర్చుట]కు కారకముగారని, రక్షించునదిగాని కాజాలదు. కనుక చేతనములగు సకలజీవులకు చేతన స్వరూపుడగు జగదీశ్వరుడే ఉపాసించయోగ్యుడు. ఇతరములైనజడత్వాదిగుణములతో కూడిన పదార్థములు ఉపాసనీయములు కావు. [౧౦]౧-౨౮-౩

---

౧-౨౮-౩ దేవస్యేత్యస్య ప్రజాపతి ఋషిః, సవితా దేవతా, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః,
పున స్తమేవ విషయ మాహ,
మఱల విషయ మయ్యదియే.

దేవస్య చేతతో మహీం ప్ర సవితు ర్హవామహే। సుమతిం సత్యరాధసమ్॥
దేవస్య, చేతతః, మహీమ్, ప్ర, సవితుః, హవామహే,
సుమతిమితి సు+మతిమ్, సత్యరాధసమితి. సత్య+రాధసమ్॥ ॥౧౧॥

పదార్థః-(దేవస్య)స్తోతుమర్హస్య(చేతతః)చేతనస్వరూపస్య(మహీమ్) మహతీమ్ (ప్ర) (సవితుః)సర్వసంసారోత్పాదకస్య(హవామహే)ఆదద్యామ(సుమతిమ్) శోభనాం ప్రజ్ఞామ్ (సత్యరాధసమ్)సత్యం రాధ్నోతి యయా తామ్. ॥౧౧॥

అన్వయః:- హే మనుష్యా యథా వయం సవితుశ్చేతతో దేవస్యేశ్వరస్యోపాసనాం కృత్వా మహీం సత్యరాధసం సుమతిం ప్రహవామహే తథైతముపాస్యైతాం యూయంప్రాప్నుత.॥౧౧॥

భావార్థః- హేమనుష్యా యేన చేతనస్వరూపేణ జగదీశ్వరేణాఖిలంజగదుత్పాదితం తస్యైవారాధనేన సత్యవిద్యాయుక్తాం ప్రజ్ఞాం యూయం ప్రాప్తుం శక్నుథ నేతరస్య జడస్యారాధనేన

పదార్థము:-ఓమానవులారా! మేము,సవితుః=సమస్తలోకములనుత్పన్న మొనర్చు వాడు,చేతతః=చేతనస్వరూపుడు,దేవస్య=స్తవనీయుడునగు ఈశ్వరుని ఉపాసించి, మహీమ్=గొప్పదియు, సత్యరాధసమ్=జీవమునకు సత్యమును సాధించుసాధనమునగు, సుమతిమ్=సుందరబుద్ధిని, ప్ర హవామహే=ఎటులగ్రహించుచున్నామో అటులనే, ఆవరేశునుపాసించి యాబుద్ధిని మీరు పొందుడు. [౧౧]

భావార్థము:-ఓ మానవులారా! సమస్త సంసారమును సృజించిన చేతన స్వరూప జగదీశ్వరుని నారాధించి, ఉపాసించి మీరందరు సత్యవిద్యాయుక్తమగు నుత్తమబుద్ధిని పొందగలుగుదురు గాని యితర జడపదార్థముల నారాధించి యెన్నటికి పొందజాలరు.

---

౧౨౮ సుష్టుతి మిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, సవితా దేవతా, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పున స్తమేవ విషయ మాహ.

వెండియు విషయ మదియే.

సుష్టుతిꣳ సుమతీ వృధో రాతిꣳ సవితురీమహే ।. ప్ర దేవాయ మతీ విదే॥

సుష్టుతిమ్ సు స్తుతిమితి సు+స్తుతిమ్, సుమతీవృధః,సుమతివృధఇతి సుమతి+వృధః, రాతిమ్, సవితుః, ఈమహే, ప్ర, దేవాయ, మతీవిదే, మతివిద ఇతి మతి+విదే॥ ॥౧౨॥

పదార్థః:-(సుష్టుతిమ్)శోభనాం స్తుతిమ్(సుమతీవృధః)యః సుమతిం వర్ధయతి తస్య.అత్ర సంహితాయాం దీర్ఘః(రాతిమ్)దానమ్(సవితుః)సర్వోత్పాదకస్య(ఈమహే)యాచామహే (ప్ర) (దేవాయ)విద్యాం కామయమానాయ(మతీవిదే)యో మతిం జ్ఞానం విందతి తస్మై.అత్ర సంహితాయామితి దీర్ఘః. ॥౧౨॥

అన్వయః:-హే మనుష్యా యథా వయం సుమతీవృధః సవితు రీశ్వరస్య సుష్టుతిం కృత్వా తస్మాన్మతీవిదే దేవాయ రాతిం ప్రేమహే,తథైతా మస్మాద్యూయమపి యాచధ్వమ్. ॥౧౨॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యదా యదా పరమేశ్వరస్య ప్రార్థనా కార్యా తదా తదా స్వార్థా పదార్థా వా సర్వశాస్త్రవిజ్ఞానయుక్తా ప్రజ్ఞైవయాచనీయా,యస్యాం ప్రాప్తాయాం జీవాః సర్వాణి సుఖసాధనాని ప్రాప్నువంతి. ॥౧౨॥

పదార్థము:-ఓ మానవులారా! మేము,సుమతీవృధః=ఉత్తమమతి నభివృద్ధిపఱచు వాడు,సవితుః=సమస్తము నుత్పన్న మొనర్చువాడునగు నాపరమేశ్వరునియొక్క,సుష్టుతిమ్=సుందర స్తవన మొనర్చి,ఈవిధముగనే,మతీవిదే=జ్ఞానమును పొందినవాడు,దేవాయ=

విద్యాదిగుణముల కామించువాడునగు మనుష్యునికి, రాతిమ్=ఇచ్చుటను, ప్రేమహే=ఎటుల చక్కగా కోరుచున్నామో, అటులనే మీరును ఈ దానక్రియను ఈశ్వరుడగు నితని యాచించుడు. [౧౨]

భావార్థము:-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఎప్పుడు పరమాత్మని ప్రార్థించవలసివచ్చినను తనకుగాని, ఇతరులకుగాని సమస్త సుఖసాధనములను జీవము పొందగలుగునటువంటి యుత్తమబుద్ధినే కోరవలయును. [౧౨]౧౨౭౪

---

౧౨౭౫ రాతి మిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, సవితా దేవతా, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.
పున స్తమేవ విషయ మాహ.

మరల నవ్విషయమే.

రాతిꣳ సత్పతిం మహే సవితార ముపహ్వయే । ఆసవం దేవవీతయే॥౧౩॥

రాతిమ్, సత్పతిమితి సత్+పతిమ్, మహే, సవితారమ్, ఉప, హ్వయే, ఆసవమిత్యా+సవమ్, దేవవీతయ ఇతి దేవ+వీతయే॥ ॥౧౩॥

పదార్థః:-(రాతిమ్)దాతారమ్(సత్పతిమ్)సతాం జీవానాం పదార్థానాం వా పాలకమ్ (మహే)మహత్యై (సవితారమ్)సకల జగదుత్పాదకమ్ (ఉప)(హ్వయే) ఉపస్తుయామ్ (ఆసవమ్) సమంతాదైశ్వర్యయుక్తమ్ (దేవవీతయే)దివ్యానాం గుణానాం విదుషాం వా ప్రాప్తయే॥౧౩॥

అన్వయః :- హే మనుష్యా యథాఽహం మహే దేవవీతయే రాతి మాసవం సత్పతిం సవితార ముపహ్వయే తథా యూయమప్యేనం ప్రశంసత. ॥౧౩॥

భావార్థః -- అత్ర వాచకలుప్తోమాలంకారః. యది మనుష్యా ధర్మార్థ కామసిద్ధిం కామయేరం స్తర్హి పరమాత్మానమేవోపాస్య తదా జ్ఞాయాం వర్తేరన్. ॥౧౩॥

పదార్థము:-ఓ మానవులారా! నేను, మహే=గొప్ప, దేవవీతయే=దివ్యగుణముల ప్రాప్తికై,విద్వాంసులప్రాప్తికై, రాతిమ్=దాతయు, ఆసవమ్=సకలైశ్వర్యయుక్తుడు, సత్పతిమ్=సత్యములు నిత్యవిద్యమానములునగు జీవముల, లేక పదార్థముల పాలకుడు, సవితారమ్=సకలజగదుత్పాదకుడు నగు జగదీశ్వరుని, ఉపహ్వయే=ధ్యానయోగమున సమీపముగ ఎటుల స్తుతి యొనర్చెదనో అటులనే మీరును అతనిని కీర్తించుడు. [౧౩]

భావార్థము:-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. మానవులు ధర్మార్థకామములసిద్ధి కామించుచో పరమాత్మని ఉపాసించి అతని ఆజ్ఞయందు మెలగవలయును. ౧౨౭౫[౧౩]

---

దేవస్యేత్యస్య ప్రజాపతి ర్ఋషిః, సవితా దేవతా, పిపీలికామధ్యా నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.
పున స్తమేవ విషయ మాహ

అదే విషయము మఱల చెప్పబడెను.

దేవస్య సవితు ర్మతి మాసవం విశ్వదేవ్యమ్। ధియా భగం మనామహే॥

దేవస్య, సవితుః, మతిమ్, ఆసవమిత్యా+సవమ్,

విశ్వదేవ్యమితి విశ్వ+దేవ్యమ్, ధియా, భగమ్, మనామహే॥ ॥౧౪॥

పదార్థః.(దేవస్య)సకల సుఖప్రదాతుః (సవితుః) సకలైశ్వర్య ప్రదాతుః (మతిమ్) ప్రజ్ఞామ్(ఆసవమ్)సకలైశ్వర్య హేతుమ్(విశ్వదేవ్యమ్)విశ్వేభ్యో దేవేభ్యో హితమ్.(ధియా)ప్రజ్ఞయా (భగమ్)ఉత్తమైశ్వర్యమ్(మనామహే)యాచామహే. ॥౧౪॥

అన్వయః:-హేమనుష్యా యథా వయం సవితు ర్దేవస్య పరమాత్మనః సకాశాన్మతి మాసవం చ ప్రాప్య తయా ధియా సర్వం విశ్వదేవ్యం భగం మనామహే తథా యూయ మపి కురుత.॥౧౪॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. సర్వై ర్మనుష్యైః పరమేశ్వరోపాసనయా ప్రజ్ఞాం ప్రాప్యైతయా పూర్ణ మైశ్వర్యం విధాయ సర్వప్రాణిహితం సంసాధనీయమ్. ॥౧౪॥

పదార్థము:-ఓ మానవులరా! మేము,సవితుః=సకలైశ్వర్యప్రదాతయు,దేవస్య=సమస్త సుఖప్రదాతయునగు పరమాత్మునినుండి, మతిమ్=బుద్ధిని, ఆసవమ్=సమస్తైశ్వర్యముల హేతువును పొంది,ధియా=ఆబుద్ధిచే, విశ్వదేవ్యమ్=సకలవిద్వాంసులకు హితమొనగూర్చు,భగమ్=ఉత్తమైశ్వర్యమును,మనామహే=ఎటుల యాచించుచున్నామో, అటులనే మీరును కోరుడు. [౧౪]

భావార్థము:-ఈమంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది.పరమేశ్వరోపాసనచే నుత్తమబుద్ధి పొంది,దానిచే పూర్ణైశ్వర్యమును గడించి,సకలప్రాణులహితమును చక్కగా సాధించుట మానవులందఱి కర్తవ్యము. [౧౪]౧౨౨౮

---

౧౨౨౯ అగ్నిమిత్యస్య సుతంభర ఋషిః, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ యజ్ఞ కర్మ విషయమాహ.

యజ్ఞకర్మ విషయమును వివరించెను.

అగ్నిꣳ స్తోమేన బోధయ సమిధానో ఽఅమర్త్యమ్।

హవ్యా దేవేషు నోదధత్॥ ॥౧౫॥

అగ్నిమ్, స్తోమేన, బోధయ, సమిధాన ఇతి

సమ్+ఇధానః, అమర్త్యమ్, హవ్యా, దేవేషు, నః, దధత్॥ ॥౧౫॥

పదార్థః:-(అగ్నిం)పావకమ్(స్తోమేన)ఇంధనసమూహేన(బోధయ) (సమిధానః) ప్రదీప్యమానః(అమర్త్యమ్)కారణరూపేణ మరణధర్మరహితమ్(హవ్యా)ఆదాతుం దాతు మర్హాణి(దేవే

షు)దివ్యేషు వాయ్వాదిషు(నః)అస్మభ్యమ్(దధత్)దధాతి. ॥౧౫॥

అన్వయః:-హే విద్వన్ యః సమిధానోఽగ్నిం దేవేషు హవ్యా మనో దధత్ తమ మర్త్య మగ్నిం స్తోమేన బోధయ ప్రదీపయ. ॥౧౫॥

భావార్థః:-యద్యగ్నౌ సమిధః ప్రక్షిప్య సుగంధ్యాదిద్రవ్యం జుహుయు స్తర్హ్యయం తద్వాయ్వాదిషు విస్తార్య సర్వాన్ ప్రాణినః సుఖయతి. ॥౧౫॥

పదార్థము;-ఓ విద్వాంసుడా!సమిధానః=చక్కగాదీపించు నే యగ్ని,దేవేషు= దివ్యవాయ్వాది పదార్థములందు, హవ్యా=ఆదానప్రదానములొనర్చదగు పదార్థమును, నః=మాకై, దధత్=ధారణమొనర్చుచున్నదో,అమర్త్యమ్=కారణస్వరూపము అనగా పరమాణుభావముచే వినాశధర్మరహితమగు, అగ్నిమ్=ఆ యగ్నిని, స్తోమేన=ఇంధన సమూహముచే,బోధయ=మేల్కొలుపుము. బాగుగా ప్రజ్వలింపజేయుము. [౧౫]

భావార్థము:-అగ్నియందు సమిధల నుంచి దివ్యములగు సుగంధ పదార్థములను వ్రేల్చుచో నయ్యగ్ని యాపదార్థమును వాయ్వాదులందు వ్యాపింపజేసి సకలప్రాణులకు సుఖము సమకూర్చుచున్నది. ౧-౨౨-౩[౧౫]

---

స హవ్యవాశిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, అగ్ని ర్దేవతా, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః
పున రగ్నిః, కీదృశోఽస్తీత్యాహ
అగ్ని యెటు వంటిది ?

స హవ్యవాడమర్త్య ఉశిగ్దూత శ్చనోహితః । అగ్ని ర్ధియా సమృణ్వతి॥

సః, హవ్యవాడితి హవ్యవాట్, అమర్త్యః, ఉశిక్, దూతః, చనోహిత ఇతి చనః+హితః, అగ్నిః, ధియా, సమ్, ఋణ్వతి॥ ॥౧౬॥

పదార్థః:-(సః)(హవ్యవాట్)యో హవ్యం వహతి దేశాంతరం ప్రాపయతి సః(అమర్త్యః) మృత్యుధర్మరహితః(ఉశిక్)కాంతిమాన్(దూతః)ఇవ వర్తమానః(చనోహితః)యశ్చనాంసిఅన్నాని హినోతి ప్రాపయతి సః(అగ్నిః)పావకః(ధియా)కర్మణా(సమ్)(ఋణ్వతి)ప్రాప్నోతి. ॥౧౬॥

అన్వయః:-హే మనుష్యా యోఽమర్త్యో హవ్యవాడుశిగ్ దూత శ్చనోహితోఽగ్ని రస్తి స ధియా సమృణ్వతి. ॥౧౬॥

భావార్థః:-యథా కార్యార్థం ప్రేషితో దూతః కార్యసాధకో భవతి తథా సంప్రయోజితోఽగ్నిః సుఖకార్యసిద్ధికరో భవతి. ॥౧౬॥

పదార్థము:-ఓ మానవులారా! అమర్త్యః=మృత్యుధర్మరహితము,హవ్యవాట్= హుతద్రవ్యము నొకచోటునుండి మఱియొకచోటునకు చేర్చునది, ఉశిక్=ప్రకాశమానము,దూతః=దూతవలెవర్తమానమైనది,చనోహితః=అన్నప్రాప్తికలిగింపజేయునదియు

నగు,అగ్నిః=ఏయగ్ని యున్నదో, సః=అది,ధియా=కర్మచే అనగా తదుపయోగకరము లగు శిల్పాదికార్యములచే, సమ్ ఋణ్వతి=బాగుగా లభించుచున్నది.

భావార్థము:-కార్యనిమిత్తమై పంపబడినదూత చేయదగిన పనులనే చేయువాడగును. అటులనే చక్కగా నియుక్త మొనర్చబడిన యగ్నియు సుఖ[కర] కార్యములను సిద్ధింపజేయునది యగుచున్నది. [౧౬]

---

౧౭. అగ్నిం దూత మిత్యస్య విశ్వరూప ఋషిః, అగ్ని ర్దేవతా. నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః
అథాగ్నిగుణా ఉచ్యంతే.

అగ్నిగుణములు చెప్పబడుచున్నవి.

అగ్నిం దూతం పురో దధే హవ్యవాహ ముప బ్రువే।

దేవాఀ౨॥ ఆసాదయాదిహ॥ ॥౧౭॥

అగ్నిమ్, దూతమ్, పురః, దధే, హవ్యవాహమితి హవ్య+వాహమ్, ఉప, బ్రువే, దేవాన్, ఆ, సాదయాత్, ఇహ॥ ॥౧౭॥

పదార్థః:-(అగ్నిమ్)వహ్నిమ్(దూతమ్)దూతవత్కార్యసాధకమ్(పురః)అగ్రతః(దధే)ధరామి(హవ్యవాహమ్)యో హవ్యాని అత్తు మర్హాణి వహతి ప్రాపయతి తమ్(ఉప)(బ్రువే)ఉపదిశామి (దేవాన్)దివ్యాన్ భోగాన్(ఆ)సమంతాత్ (సాదయాత్)సాదయేత్ ప్రాపయేత్ (ఇహ) అస్మిన్ సంసారే. ॥౧౭॥

అన్వయః:-హే మనుష్యా య ఇహ దేవానాసాదయాత్త్వం హవ్యావాహం దూత మగ్నిం పురోదధే యుష్మాన్ ప్రత్యుపబ్రువే యూయమప్యేవం కురుతేతి. ॥౧౭॥

భావార్థః:-హేమనుష్యా యథాఽగ్ని ర్దివ్యసుఖప్రదోఽస్తి తథా, వాయ్వాదయోఽపి వర్తంత ఇతి వేద్యమ్. ॥౧౭॥

పదార్థము:-ఓ మానవులారా!ఇహ=ఈలోకములో నేది,దేవాన్=దివ్యభోగములను, ఆ సాదయాత్=ఏది లభింపజేయుచున్నదో అట్టి, హవ్యవాహమ్=భోజనమొనర్చదగుపదార్థములను లభింపజేయునది, దూతమ్=దూతవలె కార్యసిద్ధి యొనర్చునదియు నగు,అగ్నిమ్=అగ్నిని, పురః=సమక్షమున, [నేను], దధే=ఉంచుచున్నాను, మఱియు, ఉపబ్రువే=మీరును ఇటులొనర్చుడని మీకు నుపదేశమొనర్చు చున్నాను. [౧౭]

భావార్థము:-మానవులారా! అగ్నివలెనే వాయ్వాదులును దివ్యసుఖప్రదములని యెఱుగుదురుగాక! [౧౭]౧౭౮

---

౧౭౯. అజీజన ఇత్యస్యారుణత్రసదస్యూ ఋషీ. పవమానో దేవతా, పిపీలికామధ్యా

విరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.
పునః సూర్యరూపోఽగ్నిః, కీదృశ ఇత్యాహ.
సూర్యరూపాగ్ని యెటులున్నది?

అజీజనో హి పవమాన సూర్యం విధారే శక్మనా పయః।
గోజీరయా రꣳహమాణః పురంధ్యా॥ ॥౧౮॥

అజీజనః, హి, పవమాన, సూర్యమ్, విధారఇతి వి+ధారే,శక్మనా, పయః,
గోజీరయేతి గో+జీరయా, రꣳహమాణః, పురంధ్యేతి పురమ్+ధ్యా॥ ॥౧౮॥

పదార్థః:-(అజీజనః)జనయతి(హి)ఖలు(పవమాన)పవిత్రకారక(సూర్యమ్)సవితృమండలమ్ (విధారే)ధారయామి(శక్మనా)కర్మణా.శక్మేతి కర్మ నామ.నిఘం.౨.౧. (పయః)ఉదకమ్(గోజీరయా)గవాం జీరయా జీవనక్రియయా(రంహమాణః)గచ్ఛన్(పురంధ్యా)యయా పురం దధాతి తయా. ॥౧౮॥

అన్వయః;- హే పవమానాగ్నివత్పవిత్ర జన యోఽగ్నిః పురంధ్యా రంహమాణః సూర్యమజీజన స్తం శక్మనా గోజీర యా పయశ్చాహం విధారే హి. ॥౧౮॥

భావార్థః:-యది విద్యుత్సూర్యస్య కారణం న స్యాత్తర్హి సూర్యోత్పత్తిః కథం స్యాద్యది సూర్యో న స్యాత్తర్హి భూగోల ధృతి ర్వృష్ట్యా గవాదిపశుజీవనం చ కథం స్యాత్. ॥౧౮॥

పదార్థము:-పవమాన=పవిత్రమొనర్చు నగ్నివలె పవిత్రుడగు పురుషుడా! నీవు ఏ యగ్ని,పురంధ్యా=పురమును ధారణమొనర్చుక్రియచే,రంహమాణః=పోవుచు,సూర్యమ్ =సూర్యుని,అజీజనః=ప్రకటింపజేయుచున్నదో,దానిని మఱియు,శక్మనా=కర్మచేతను, గోజీరయా=గవాది పశువుల జీవనక్రియచేతను, పయః=జలమునుకూడ నేను,వి ధారే హి=విశేషించి ధారణమొనర్చుచునే యున్నాను.

భావార్థము:- విద్యుత్తుసూర్యునికి కారణము కానిచో సూర్యుని యుత్పత్తి యెటుల జరుగును? సూర్యుడు లేకున్నచో భూగోళధారణము మఱియు వర్షముచే గవాది పశువుల జీవనము ఎటుల గడచును? [౧౮]౧౨౯౧

---

౧౨౯౦ విభూరిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, అగ్ని ర్దేవతా, భురిగ్వికృతి శ్ఛందః, మధ్యమః స్వరః,
పున స్తమేవ విషయ మాహ
మఱల నా విషయమే

విభూ ర్మాత్రా ప్రభూః పిత్రా శ్వోఽసి హయోఽస్యత్యోఽసి మయోఽ స్యర్వాసి సప్తి రసి వాజ్యసి వృషాసి నృమణా అసి। యయు ర్నామాసి శిశు ర్నా

మాస్యాదిత్యానాం పత్వాన్విహి। దేవా ఆశాపాలా ఏతం దేవేభ్యోఽశ్వం మేధాయ ప్రోక్షితꣳ రక్షత। ఇహ రన్తి రిహ రమతా మిహ ధృతి రిహ స్వధృతిః స్వాహా॥

విభూ రితి వి+భూః, మాత్రా, ప్రభూ రితి ప్ర+భూః, పిత్రా, అశ్వః,అసి, హయః, అసి, అత్యః, అసి, మయః, అసి, అర్వా, అసి, సప్తిః, అసి, వాజీ, అసి, వృషా, అసి, నృమణాః, నృమనా ఇతి నృ+మనాః, అసి, యయుః,నామ, అసి, శిశుః, నామ, అసి, ఆదిత్యానామ్, పత్వా, అను, ఇహి, దేవాః, ఆశాపాలా ఇత్యాశా+పాలాః, ఏతమ్, దేవేభ్యః, అశ్వమ్, మేధాయ, ప్రోక్షిత మితి ప్ర+ఉక్షితమ్, రక్షత,+ఇహ, రన్తిః, ఇహ, రమతామ్, ఇహ, ధృతిః, ఇహ, స్వధృతి రితి స్వః+ధృతిః, స్వాహా॥ ॥౧౯॥

పదార్థః:-(విభూః)వ్యాపకః(మాత్రా)జననీవద్వర్తమానయా పృథివ్యా(ప్రభూః) సమర్థః (పిత్రా)వాయునా (అశ్వః) యోఽశ్నుతే వ్యాప్నోతి మార్గాన్ సః(అసి)అస్తి. అత్ర సర్వత్ర వ్యత్యయః(హయః)హయ ఇవ శీఘ్రగామీ(అసి)(అత్యః)యోఽతి సతతం గచ్ఛతి సః(అసి) (మయః) సుఖకారీ(అర్వా)యః సర్వాన్నృచ్ఛతి సః(అసి)(సప్తిః)మూర్త్రద్రవ్యసంబంధీ(అసి)(వాజీ)వేగవాన్ (అసి)(వృషా)వృష్టికర్తా(అసి)(నృమణాః) యో నృషు నేతృషు పదార్థేషు మన ఇవ సద్యోగామీ (అసి)(యయుః)యో యాతి సః (నామ) అభ్యసనీయః (అసి) (శిశుః)యః శ్యతి తనూకరోతి సః (నామ) వాక్. నామేతి వాఙ్నామ...నిఘం-౧. ౧౧. (అసి) (ఆదిత్యానామ్) మాసానామ్ (పత్వా) యోఽధః పతతి సః (అను) (ఇహి)ఏతి(దేవాః) విద్వాంసః (ఆశాపాలాః)య ఆశా దిశః పాలయంతి (ఏతమ్)వహ్నిమ్. (దేవేభ్యః)దివ్య భోగేభ్యః (అశ్వమ్) వ్యాప్తిశీలమ్. (మేధాయ) సంగమాయ బుద్ధిప్రాపణాయ దుష్టహింసనాయ వా (ప్రోక్షితమ్) జలేన సిక్తమ్ (రక్షత)(ఇహ) (రంతిః)రమణమ్. (ఇహ) (రమతామ్) క్రీడతు (ఇహ) (ధృతిః) (ధైర్యమ్) (ఇహ) (స్వధృతిః) స్వేషాం ధారణమ్ (స్వాహా)సత్యయా క్రియయా, ॥౧౯॥

అన్వయః:-హే ఆశాపాలా దేవాయూయం యో మాత్రా విభూ,పిత్రా ప్రభూ రశ్వోఽసి, హయోఽస్యత్యోఽసి, మయోఽస్యర్వాఽసి.సప్తి రసి, వాజ్యసి, వృషాఽసి, నృమణా అసి. యయు ర్నామాఽసి.శిశుర్నామాస్యాదిత్యానాం పత్వా ఽన్విహి. ఏత మశ్వం స్వాహా.దేవేభ్యో మేధాయ ప్రోక్షితం రక్షత.యేనేహ రంతి రిహ రమతా మిహ ధృతి రిహ,స్వధృతిః స్యాత్.॥౧౯॥

భావార్థః—యే మనుష్యాః పృథివ్యాదిషు వ్యాపకం సర్వేభ్యో వేగవద్భ్యోఽతిశయేన వేగవంతం వహ్నిం గుణకర్మస్వభావతో విజానంతి. తే సుఖేనేహ క్రీడంతి. ॥౧౯॥

పదార్థము:- ఆశాపాలాః=దిక్కులను పాలించువారలారా! దేవాః=విద్వాంసు

లారా! మీరు,ఏది, మాత్రా=తల్లితో సమానముగ నుండుపృథ్వీచే, విభూః=వ్యాపకము పిత్రా=తండ్రివలె నున్న పవనముచే,ప్రభూః=సమర్థము, అశ్వః=మార్గములందువ్యాప్త మునై యున్నదో,హయః అసి=గుఱ్ఱముతోసమానముగ శీఘ్రముగ నడచునదై యున్న దో,అత్యః అసి=నిరంతరము పోవునదై యున్నదో,మయః అసి=సుఖముసమకూర్చునదై యున్నదో, అర్వా అసి=అందఱికి అందునదై యున్నదో, సప్తిః=మూర్తిమంతములగు పదార్థములతోసంబంధముంచునదై యున్నదో,వాజీ అసి=వేగవంతమైయున్నదో,వృషా అసి=వర్షించునదై యున్నదో, నృమణాః=అన్నివిధముల వ్యవహారములను చేకూర్చు పదార్థములందు మనస్సువలె శీఘ్రముగవెళ్లునదై యున్నదో,యయుః=ప్రాప్తికలిగించు నదియు,వెళ్లునదియు,నామ అసి=పేరుగలదియునై యున్నదో,శిశుః=వ్యవహారయోగ్య విషయములను సూక్ష్మమొనర్చునదియు,నామ=ఉత్తమవాణియునై,అసి=ఏది యున్న దో, ఆదిత్యానామ్=నెలలయొక్క,పత్వా=అధఃపతనమగునదై, అన్విహ=అన్వితమగు చున్నదో,లభించుచున్నదో,ఏతమ్ అశ్వమ్=ఆ యీ వ్యాప్తమగు నగ్నిని,స్వాహా=సత్య క్రియచే,దేవేభ్యః=దివ్యభోగములకొఱకును, మేధాయ=సుగుణముల కలిగించుట కొఱ కును,బుద్ధినిపొందుట కొఱకును,దుష్టులను సంహరించుటకును,ప్రోక్షితమ్=జలసిక్తముగ, రక్షత=ఉంచుడు.దానివలన,ఇహ=ఈలోకమున,రంతిః=ఉత్తమసుఖమున రమించునటుల, ఇహ=ఈలోకమున,రమతామ్=క్రీడించుడు మఱియు,ఇహ=ఇచ్చట, ధృతిః=సామాన్య ధారణయు. ఇహ=ఇచ్చట,స్వధృతిః=స్వపదార్థముల ధారణయు కలుగుగాక! [౧౯]

పదార్థము:-ఏ మానవులు పృథివ్యాది లోకములందు వ్యాప్తములు, సమస్త వేగ వంతములు నగు పదార్థములందతి వేగవంతమగు నగ్నిని గుణకర్మస్వభావముచే నెఱుగు చున్నారో వారీలోకమున సుఖముగ నుండుచున్నారు. [౧౯]౧-౨౯౧

---

౨౨-౨ కాయేత్యస్య ప్రజాపతి ఋషిః, ప్రజాపత్యాదయో దేవతాః; ఆద్యస్య విరాడతిధృతిః, ఉత్తరస్య నిచృదతిధృతిశ్ఛందః, షడ్జః స్వరః

అథ కస్మై ప్రయోజనాయ హోమః కర్తవ్య ఇత్యాహ.

ఏ ప్రయోజనమునకై హోమ మొనర్చవలయును?

కాయ స్వాహా కస్మై స్వాహా కతమస్మై స్వాహా స్వాహాధిమాధీతాయ స్వాహా మనః ప్రజాపతయే స్వాహా చిత్తం విజ్ఞాతాయాదిత్యై స్వాహాదిత్యై మహ్యై స్వాహాదిత్యై సుమృడీకాయై స్వాహా సరస్వత్యై స్వాహా సరస్వత్యై పావకాయై స్వాహా సరస్వత్యై బృహత్యై స్వాహా పూష్ణే స్వాహా పూష్ణే ప్రపథ్యాయ స్వాహా

పూష్ణే నరన్ధిషాయ స్వాహా త్వష్ట్రే స్వాహా త్వష్ట్రే తురీపాయ స్వాహా త్వష్ట్రే పురురూపాయ స్వాహా విష్ణవే స్వాహా విష్ణవే నిభూయపాయ స్వాహా విష్ణవే శిపివిష్టాయ స్వాహా॥ ॥౨౦॥

కాయ, స్వాహా, కస్మై, స్వాహా, కతమస్మై, స్వాహా, స్వాహా, ఆధిమిత్యా+ధిమ్, ఆధీతాయేత్యా+ధీతాయ, స్వాహా, మనః, ప్రజాపతయ ఇతి ప్రజా+పతయే, స్వాహా, చిత్తమ్, విజ్ఞాతాయేతి వి+జ్ఞాతాయ, అదిత్యై, స్వాహా, అదిత్యై, మహ్యై, స్వాహా, అదిత్యై, సుమృడీకాయా ఇతి సు+మృడీకాయై, స్వాహా, సరస్వత్యై, స్వాహా సరస్వత్యై, పావకాయై, స్వాహా, సరస్వత్యై, బృహత్యై, స్వాహా, పూష్ణే, స్వాహా, పూష్ణే, ప్రపథ్యాయేతి ప్ర+పథ్యాయ, స్వాహా, పూష్ణే, నరన్ధిషాయ, స్వాహా, త్వష్ట్రే, స్వాహా, త్వష్ట్రే, తురీపాయ, స్వాహా, త్వష్ట్రే, పురురూపాయేతి పురు+రూపాయ, స్వాహా, విష్ణవే, స్వాహా, విష్ణవే, నిభూయపాయేతి నిభూయ+పాయ, స్వాహా, విష్ణవే, శిపివిష్టాయేతి శిపి+విష్టాయ, స్వాహా॥ ॥౨౦॥

పదార్థః-(కాయ)సుఖసాధకాయ విదుషే(స్వాహా)సత్యక్రియా. (కస్మై)సుఖస్వరూపాయ (స్వాహా)(కతమస్మై)బహూనాం మధ్యే వర్తమానాయ (స్వాహా)(స్వాహా) (ఆధిమ్) యః సమన్తాద్దధాతి తమ్ (ఆధీతాయ) సమన్తాద్విద్యావృద్ధయే(స్వాహా)(మనః)(ప్రజాపతయే)(స్వాహా) సత్యా క్రియా (చిత్తమ్) స్మృతిసాధకమ్ (విజ్ఞాతాయ) (అదిత్యై) పృథివ్యై. అదితి రితి పృథివీనా. నిఘం.౧౧(స్వాహా)(అదిత్యై)నాశరహితాయై(మహ్యై)మహత్యైవాచే(స్వాహా)(అదిత్యై) జనన్యై(సుమృడీకాయై) సుష్ఠు సుఖకారికాయై (స్వాహా)(సరస్వత్యై) నద్యై (స్వాహా) (సరస్వత్యై)విద్యాయుక్తాయై వాచే.(పావకాయై)పవిత్రకర్త్ర్యై(స్వాహా)(సరస్వత్యై)విదుషాం వాచే (బృహత్యై)మహత్యై (స్వాహా) (పూష్ణే)పుష్టికర్త్రే(స్వాహా)(పూష్ణే) పుష్టాయ(ప్రపథ్యాయ) ప్రకర్షేణపథ్యకరణాయ(స్వాహా)(పూష్ణే)పోషకాయ(నరంధిషాయ)యో నరాన్ దిదేష్టుపదిశతి తస్మై (స్వాహా)(త్వష్ట్రే)ప్రకాశాయ. త్విష ఇతో౽త్వమ్. ఉణాదౌ.పా. ౨.౯౫. అనేనాయం సిద్ధః (స్వాహా) (త్వష్ట్రే) విద్యా ప్రకాశకాయ (తురీపాయ) నౌకానాం పాలకాయ(స్వాహా) (త్వష్ట్రే)ప్రకాశకాయ,(పురురూపాయ)బహురూపాయ(స్వాహా)(విష్ణవే)వ్యాపకాయ(స్వాహా) (నిభూయపాయ)యో నితరాం రక్షితో భూత్వా౽న్యాన్ పాలయతి తస్మై (స్వాహా) (విష్ణవే) (శిపివిష్టాయ) శిపి స్వాక్రోశత్సు ప్రాణిషు వ్యాప్త్యా ప్రవిష్టాయ (స్వాహా) ॥౨౦॥

అన్వయః :- యై ర్మనుష్యైః కాయ స్వాహా, కస్మై స్వాహా, కతమస్మై స్వాహాऽऽధిం ప్రాప్య స్వాహా ऽऽ ధీతాయ స్వాహా, ప్రజాపతయే మనః స్వాహా, విజ్ఞాతాయ చిత్త మదిత్యై స్వాహా, మహ్యా ऽదిత్యై స్వాహా, సమృడీకాయా అదిత్యై స్వాహా, సరస్వత్యైస్వాహా, పావకాయై సరస్వత్యై స్వాహా, బృహత్యై సరస్వత్యై స్వాహా,పూష్ణే స్వాహా, ప్రపథ్యాయ పూష్ణే స్వాహా, నరంధిషాయ పూష్ణే స్వాహా, త్వష్ట్రే స్వాహా,తురీపాయ త్వష్ట్రే స్వాహా,పురురూపాయ త్వష్ట్రే స్వాహా, విష్ణవే స్వాహా. నిభూయపాయ విష్ణవే స్వాహా, శిపివిష్టాయ విష్ణవే స్వాహా కృతా స్తే కథం న సుఖినః స్యుః? ॥౨౦॥

భావార్థః :—యే విద్వత్సుశిక్షాऽధ్యయనాంతఃకరణ విజ్ఞాన వాగ్వాయ్వాదిశుద్ధయే యజ్ఞ క్రియాః కుర్వంతి. తే సుఖినో భవంతి. ॥౨౦॥

పదార్థము:-ఏ మానవులు, కాయ=సుఖమును సాధించువానికొఱకు, స్వాహా= సత్యక్రియను, కస్మై=సుఖస్వరూపునికొఱకు,స్వాహా=సత్యక్రియను, కతమస్మై=అనేకులలో వర్తమానుడై యున్నవానికై, స్వాహా=సత్యక్రియను,ఆధిమ్=బాగుగా పదార్థములను ధారణమొనర్చువానినిపొంది,స్వాహా=సత్యక్రియను,అధీతాయ=సకలదిక్కుల నుండి విద్యావృద్ధికై, స్వాహా=సత్యక్రియను, ప్రజాపతయే=ప్రజలకై పాలించువానికొఱకును,మనః స్వాహా=మనస్సుయొక్క సత్క్రియను,విజ్ఞాతాయ=విశేషించి ఎఱిగినవానికొఱకు,చిత్తమ్=స్మృతిసాధకముఅనగాచేతనమిచ్చుచైతన్యమైనమనస్సు,అదిత్యై =భూమికై,స్వాహా=సత్యక్రియను,మహ్యాఅదిత్యై=వినాశరహితమగుబృహద్వాణికై స్వాహా=సత్యక్రియను, సుమృడీకాయై = బాగుగ సుఖము చేకూర్చు, అదిత్యై=తల్లికొఱకై,స్వాహా=సత్యక్రియను, సరస్వత్యై=నదికొఱకు, స్వాహా=సత్యక్రియను, పావకాయై సరస్వత్యై=పవిత్రమునుకలిగించు విద్యాయుక్తవాణికొఱకు, స్వాహా=సత్యక్రియను,బృహత్యై సరస్వత్యై=గొప్పదైన విద్వాంసులవాణికొఱకు,స్వాహా=ఉత్తమ క్రియను, పూష్ణే=పుష్టిని కలిగించువానికొఱకు, స్వాహా=ఉత్తమక్రియను,ప్రపథ్యాయ పూష్ణే=ఉత్తమముగ పథ్యమునకుతగిన భోజనమొనర్చుటచే కలుగు పుష్టికొఱకు,స్వాహా =సత్యక్రియను

నరంధిషాయ పూష్ణే=మనుష్యుల కుపదేశించువానికై, పుష్టినొసగు వానికొఱకు, స్వాహా=సత్యక్రియను, త్వష్ట్రే=ప్రకాశమొనర్చువానికొఱకు, స్వాహా=సత్యక్రియను, తురీపాయ=నౌకలను పాలించువాని కొఱకును, త్వష్ట్రే=విద్యాప్రకాశమొనర్చువాని కొఱకును,స్వాహా=సత్యక్రియను,పురురూపాయ=బహురూపములు గలవానికి, త్వష్ట్రే =ప్రకాశమొనర్చువానికొఱకు,స్వాహా=సత్యక్రియను,విష్ణవే=వ్యాప్తుడగువానికొఱకు, స్వాహా=సత్యక్రియను, (నిభూయపాయ) నిరంతరము స్వయముగ రక్షితుడై ఇతరులను పాలించువాడును,విష్ణవే = సర్వవ్యాపకుడు నగువానికై, స్వాహా=సత్యక్రియను, శిపివిష్టాయ=ఆక్రోశించు ప్రాణులందువ్యాప్తిచే ప్రవేశించియున్న,విష్ణవే=వ్యాపకుడైనపర

మాత్మునికై, స్వాహా=సత్యక్రియను చేసియుందురో, వారేల సుఖవంతులు కారు?[౨౦]

భావార్థము:-విద్వాంసుల సుఖముకొఱకు, చదువుటకొఱకు, అంతఃకరణపు విశేష జ్ఞానముకొఱకు, వాణీపవనాది పదార్థముల శుద్ధికొఱకు యజ్ఞక్రియలనొనర్చువారు సుఖముగా నుండు వారగుదురు. [౨౦]౧౭౯౨

---

౧౭౯౩ విశ్వో దేవస్యేత్యస్య స్వస్త్యాత్రేయ ఋషిః, విద్వాన్ దేవతా, ఆర్ష్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః

పున ర్మనుష్యైః కిం క_ర్తవ్య మిత్యాహ.

మానవుల క_ర్తవ్యమేమిటి?

విశ్వో దేవస్య నేతు ర్మర్తో వురీత సఖ్యమ్।

విశ్వో రాయ ఇషుధ్యతి ద్యుమ్నం వృణీత పుష్యసే స్వాహా ॥౨౧॥

విశ్వః, దేవస్య, నేతుః, మ_ర్తః, వురీత, సఖ్యమ్, విశ్వః, రాయే, ఇషుధ్యతి, ద్యుమ్నమ్, వృణీత, పుష్యసే, స్వాహా॥ ॥౨౧॥

పదార్థః:-(విశ్వః)సర్వః (దేవస్య)విదుషః (నేతుః)(నాయకస్య(మ_ర్తః)మనుష్యః(వురీత) వృణుయాత్. అత్ర వ్యత్యయే నాత్మనేపదమ్. బహులం ఛందసీతి శపో లుక్. లిఙ్ ప్రయోగో ఽయమ్.(సఖ్యమ్)మిత్రత్వమ్ (విశ్వః)(రాయే)ధనాయ(ఇషుధ్యతి)యాచతే శరాన్ ధరతి వా (ద్యుమ్నమ్) ధనం యశో వా (వృణీత)(పుష్యసే)పుష్టయే (స్వాహా) ॥౨౧॥

అన్వయః:-యథా విశ్వోమ ర్తో నేతు ర్దేవస్య సఖ్యం వురీత. యథా వా విశ్వో మర్త్యోరాయ ఇషుధ్యతి. తథా స్వాహా పుష్యసే ద్యుమ్నం వృణీత. ॥౨౧॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోమాలంకారః. సర్వే మనుష్యా విద్వద్భిః సహ సువృదో భూత్వా విద్యాం యశశ్చ గృహీత్వా శ్రీమంతో భూత్వా సుపథ్యేన పుష్టాః సంతు. ॥౨౧॥

పదార్థము:-ఎటుల, విశ్వః మ_ర్తః=సకలమనుష్యులు, నేతుః దేవస్య=-సకలవ్యవహారములను చక్కజేయువిద్వాంసనాయకునియొక్క, సఖ్యమ్=మైత్రిని,వురీత=స్వీకరించుదురో, లేక ఎటుల, విశ్వః=సకలమానవులు, రాయే=ధనమునకై, ఇషుధ్యతి=యాచించుదురో, లేక బాణములను తమతమ ధనుస్సులందు ధరించుదురో,అటులనే, స్వాహా =సత్యక్రియచేతను, సత్యవాణిచేతను, పుష్యసే=పుష్టికొఱకు, ద్యుమ్నమ్=ధనమును యశస్సును, వృణీత=స్వీకరించవలయును. [౨౧]

పదార్థము:-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. మనుష్యులందరు విద్వాంసులతో మైత్రి యొనర్చి విద్యాయశస్సులను సంపాదించి, ధనవంతులు

శ్రీమంతులునై, ఉత్తమ యోగ్యాహారముచే,సుమార్గముచే పుష్టులగుదురుగాక! [౨౧]

౨౨-౨౨ ఆబ్రహ్మన్నిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, లింగోక్తా దేవతాః, స్వరాడుత్కృతి శ్ఛందః, షడ్జః స్వరః

పున ర్మనుష్యైః కిమేష్టవ్యమిత్యాహ.

మానవు లేమేమి యభిలషించవలయును?

ఆ బ్రహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మవర్చసీ జాయతా మా రాష్ట్రే రాజన్యః శూర ఽఇషవ్యోఽతి వ్యాధీ మహారథో జాయతాం దోగ్ధ్రీ ధేను ర్వోఢా నడ్వానాశుః సప్తిః పురన్ధి ర్యోషా జిష్ణూ రథేష్ఠాః సభేయో యువాఽస్య యజమానస్య వీరోజాయ తాం నికామే నికామే నః పర్జన్యో వర్షతు ఫలవత్యో నఽఓషధయః పచ్యన్తాం యోగ క్షేమో నః కల్పతామ్॥ ॥౨౨॥

ఆ, బ్రహ్మన్, బ్రాహ్మణః, బ్రహ్మవర్చసీతి బ్రహ్మ+వర్చసీ, జాయతామ్, ఆ, రాష్ట్రే, రాజన్యః, శూరః, ఇషవ్యః, అతివ్యాధీత్యతి+వ్యాధీ, మహారథ ఇతి మహా+రథః, జాయతామ్, దోగ్ధ్రీ, ధేనుః, వోఢా, అనడ్వాన్, ఆశుః, సప్తిః, పురన్ధిరితి పురమ్+ధిః, యోషా, జిష్ణుః, రథేష్ఠాః, రథేష్ఠా ఇతి రథే+స్థాః, సభేయః, యువా,ఆ, అస్య, యజమానస్య, వీరః, జాయతామ్, నికామే నికామ ఇతి నికామే+ నికామే,నః, పర్జన్యః, వర్షతు,ఫలవత్య ఇతి ఫల+వత్యః, నః, ఓషధయః,పచ్యన్తామ్, యోగక్షేమ ఇతి యోగ+క్షేమః, నః, కల్పతామ్॥ ॥౨౨॥

పదార్థః:-(ఆ) సమంతాత్ (బ్రహ్మన్) విద్యాదినా సర్వేభ్యో మహన్! పరమాత్మన్! (బ్రాహ్మణః) వేదేశ్వరవిత్ (బ్రహ్మవర్చసీ) వేదవిద్యాప్రదీప్తః (జాయతామ్) ఉత్పద్యతామ్ (ఆ) (రాష్ట్రే) రాజ్యే (రాజన్యః) రాజపుత్రః (శూరః)నిర్భయః(ఇషవ్యః)ఇషుషు సాధుః(అతివ్యాధీ) అతిశయేన వ్యద్ధుం శత్రూన్ తాడయితుం శీలం యస్య సః (మహారథః) మహాంతో రథా వీరా వా యస్య సః (జాయతామ్) (దోగ్ధ్రీ) ప్రపూరికా (ధేనుః)గౌః(వోఢా)వాహకః(అనడ్వాన్) వృషభః (ఆశుః)శీఘ్రగామీ (సప్తిః) అశ్వః (పురంధిః) యా పురూన్ బహూన్ దధాతి సా (యోషా) (జిష్ణుః) జయశీలః (రథేష్ఠాః) యో రథే తిష్ఠతి సః (సభేయః) సభాయాం సాధుః (యువా) ప్రాప్తయౌవనః (ఆ) (అస్య) (యజమానస్య) యో యజతే దేవాన్ విదుషః సత్కృ

పునరీశ్వరః కీదృశోఽస్తీత్యాహ.

మఱల నాయీశ్వరు డెటులున్నాడు?

యుఞ్జన్తి వ్రధ్న మరుషం చరన్తం పరి తస్థుషః। రోచన్తే రోచనా దివి॥౫

యుఞ్జన్తి, వ్రధ్నమ్, అరుషమ్, చరన్తమ్, పరి, తస్థుషః, రోచన్తే, రోచనాః, దివి॥ ॥౫॥

పదార్థః:- (యుంజంతి) యుక్తం కుర్వంతి(బ్రధ్నమ్) మహాంతమ్ (అరుషమ్) అరుఃషు మర్మసు సీదంతమ్ (చరంతమ్) ప్రాప్నువంతమ్(పరి)సర్వతః(తస్థుషః)స్థావరాన్(రోచంతే)ప్రకాశంతే (రోచనాః)దీప్తయః(దివి). ॥౫॥

అన్వయః:- యే పరి తస్థుషశ్చరంతం విద్యుతమివ వర్తమాన మరుషం బ్రధ్నం పరమాత్మాన మాత్మనా సహ యుంజంతి.తే దివి సూర్యే రోచనాః కిరణా ఇవ రోచంతే. ॥౫॥

భావార్థః:-హే మనుష్యా ! యథా ప్రతిబ్రహ్మాండే సూర్యః ప్రకాశతే తథా సర్వస్మిన్ జగతి పరమాత్మా ప్రకాశతే యే యోగాభ్యాసేనాఽన్తర్యామిణం పరమాత్మానం స్వమాత్మనా యుంజతే తే సర్వతః ప్రకాశితా జాయంతే. ॥౫॥

పదార్థము:- ఏ పురుషులు, పరితః=అన్నిదిక్కుల నుండి, తస్థుషః=స్థావరజీవములను,చరన్తమ్=పొందుచు విద్యుత్తువలె వర్తమానుడు,అరుషమ్=దెబ్బ తగిలినంత మాత్రముననే ప్రాణ వియోగము సంభవించు మర్మస్థలముల రక్షణకై స్థిరుడు, బ్రధ్నమ్=అంటికంటె గొప్పవాడు,సర్వోపరి విరాజమానుడునగు పరమాత్ముని స్వకీయాత్మలతో, యుంజంతి=సంప్రయుక్త మొనర్చుచున్నారో వారు, దివి=సూర్యుని యందు,రోచనాః =కిరణములవలె, పరమాత్మయందు, రోచంతే=ప్రకాశమాను లగుచున్నారు. [౫]

భావార్థము:- ఓ మానవులారా! ప్రతిబ్రహ్మాండము నందెటుల సూర్యుడు ప్రకాశించుచున్నాడో, అటులనే సర్వజగత్తునందు పరమాత్మ ప్రకాశించుచున్నాడు. ఎవరు యోగాభ్యాసముచే అంతర్యామి యగు పరమాత్మను స్వాత్మతో సంయుక్తమొనర్చుచున్నారో, వారన్నిదిక్కులలో ప్రకాశితు లగుచున్నారు. [౫]౧౩౧౧

---

౧౩౧౨ యుంజంత్యస్యేతి ప్రజాపతి ర్ఋషిః, సూర్యో దేవతా, విరాడ్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ కేనేశ్వరః ప్రాప్తవ్య ఇత్యాహ.

ఎవడీశ్వరుని పొందగలడు?

యుఞ్జన్త్యస్య కామ్యా హరీ విపక్షసా రథే। శోణా ధృష్ణూ నృవాహసా॥౬॥

యుఞ్జన్తి, అస్య, కామ్యా, హరీ+ఇతి హరీ, విపక్షసేతి వి+పక్షసా, రథే,

శోణా, ధృష్ణూ ఇతి ధృష్ణూ, నృవాహసేతి నృ+వాహసా॥ ॥౬॥

పదార్థః:- (యుంజంతి) అస్య జీవస్య (కామ్యా)కమనీయా(హరీ)హరణశీలౌ(విపక్షసా) వివిధైః పరిగృహీతా (రథే) యానే (శోణా) రక్తగుణవిశిష్టౌ (ధృష్ణూ) దృఢౌ (నృవాహసా) నృణాం వాహకౌ. ॥౬॥

అన్వయః:- హే మనుష్యా యథా శిక్షకాః కామ్యా హరీ విపక్షసా శోణా ధృష్ణూ నృవాహసా రథే యుంజంతి,తథా యోగినోఽస్య పరమేశ్వరస్య మధ్య ఇంద్రియాణి మనః ప్రాణాంశ్చ యుంజంతి. ॥౬॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః.యథా మనుష్యాః సుశిక్షితైర్హయై రుక్తేన యానేన స్థానాంతరం సద్యః ప్రాప్నువంతి తథైవ విద్యాసత్సంగయోగాభ్యాసైః పరమాత్మానం క్షిప్రం ప్రాప్నువంతి. ॥౬॥

పదార్థము:- మానవులారా! శిక్షకులెటుల, కామ్యా=మనోహరములు, హరీ=కొంపోవునవి,విపక్షసా=వివిధవిధములుగ గ్రహించబడినవి, శోణా=రక్తగుణవిశిష్టములు, ధృష్ణూ=అతిదృఢములు, నృవాహసా=మానవులను ఒకచోటునుండి మఱొకచోటునకు చేర్చునవియగు హయద్వయమును, రథే=రథమునకు, యుంజంతి=జోడించుచున్నారో, అటులనే యోగులు, అస్య=ఈ పరమేశ్వరుని యందు ఇంద్రియములను, అంతఃకరణములను, ప్రాణములను సంలగ్న మొనర్చుచున్నారు. [౬]

భావార్థము:-ఈ మంత్రము నందు వాచకలుప్తోపమాలంకారమున్నది.మానవులు సుశిక్షితములగు ఘోటకములను పూన్చిన రథము ద్వారా ఒకస్థానము నుండి మఱొక స్థానమునకు ఎటుల పోవుచున్నారో అటులనే విద్యచేతను,సత్యముచేతను, యోగాభ్యాసము చేతను పరమాత్మను శీఘ్రముగా పొందుచున్నారు. [౬]౧౩౧౭

యద్వాత ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ఇంద్రో దేవతా, నిచృద్ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

పున ర్మనుష్యః కస్య సంగం కుర్యాదిత్యాహ.

మనుష్యుడెవనితో సంగమొనర్చవలయును?

యద్వాతోఽఅపోఽఅగనీగన్ ప్రియామిన్ద్రస్య తన్వమ్ ।

ఏతꣳ స్తోత రనేన పథా పునరశ్వమా వర్తయాసి నః॥ ॥౭॥

యత్, వాతః, అపః, అగనీగన్, ప్రియామ్, ఇన్ద్రస్య, తన్వమ్, ఏతమ్, స్తోతః, అనేన, పథా, పునః, అశ్వమ్, ఆ, వర్తయాసి, నః॥ ॥౭॥

పదార్థః:-(యత్) యం కలాయంత్రాశ్వమ్ (వాతః) వాయుః(అపః)జలాని(అగనీగన్)

ప్రాప్నువంతి (ప్రియామ్)కమనీయమ్(ఇంద్రస్య) విద్యుతః(తన్వమ్) వి స్తృతం శరీరమ్(ఏతమ్) (స్తోతః)స్తావక(అనేన)(పథా)మార్గేణ(పునః)(అశ్వమ్)ఆశుగామినమ్ (ఆ)(వ ర్తయాసి)వ ర్తయేః (నః) అస్మాన్. ॥౭॥

అన్వయః:- హే స్తోత ర్యథా శిల్పిజనా ఇంద్రస్య ప్రియాం తన్వం వాత ఇవ ప్రాప్య యద్ యమపోఽగనీగఁ స్తథైత మశ్వ మనేన పథా త్వం ప్రాపోప్నోషి. పున ర్నోఽస్మానావ ర్తయాఽసి. తం భవంతం వయం సత్కుర్యామ. ॥౭॥

భావార్థః :- అత్ర వాచక లుప్తోపమాలంకారః. హేమమష్యా యే యుష్మాన్ సుమార్గేణ గమయంతి. తత్సంగేన యూయం వాయువిద్యుదాదివిద్యాం ప్రాప్నుత. ॥౭॥

పదార్థము:- స్తోతః=స్తుతించు పురుషుడా! ఎటుల శిల్పులు, ఇంద్రస్య=విద్యుత్తు యొక్క, ప్రియామ్=అతిసుందరమైన, తన్వమ్=విస్తారయుక్త శరీరమును, వాతః= పవనమువలె పొంది,యత్=కలాయంత్రరూపమగు నే యశ్వమును,అపః=ఏ జలములను, అగనీగన్=పొందుచున్నారో, అటులనే, ఏతమ్ అశ్వమ్=శీఘ్రముగనడచు నీ కలాయంత్రాశ్వమును, అనేన పథా=విద్యుద్రూపమగు మార్గమున నీవు పొందుచున్నావు. పునః=మరల, నః=మమ్ములను, ఆ వర్తయాసి=చక్కగా పరిభ్రమణ మొనరింప జేయుదువు.ఇటు నటు తీసుక పోయెదవు.అట్టి నిన్ను మేము సత్కరించెదము గాక!

భావార్థము:-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము కలదు. ఎవరు మిమ్ములను సుమార్గమున నడపించుదురో వారి సంగతిచే మీరు వాయువిద్యుదాది విద్యలను పొందుడు. ౧౩౧౩ [౭]

---

౧౩౦౪ వసవ ఇత్యస్య ప్రజాపతి రృషిః, వాయ్వాదయో దేవతాః, అత్యష్టి శ్ఛందః, గాంధారః స్వరః

పునర్విద్వాంసః కిం కుర్వంతీ త్యాహ

విద్వాంసు లేమి యొనర్చుదురు?

వసవ స్త్వాఽఞ్జన్తు గాయత్రేణ ఛన్దసా రుద్రా స్త్వాఽఞ్జన్తు త్రైష్టుభేన ఛన్దసాదిత్యా స్త్వాఽఞ్జన్తు జాగతేన ఛన్దసా। భూర్భువః స్వ ర్లాజీ ౩ఞ్ఛాచీ ౩ న్యవ్యే గవ్య ఏతదన్న మత్త దేవా ఏతదన్న మద్ధి ప్రజాపతే॥ ॥౮॥

వసవః, త్వా, అఞ్జన్తు, గాయత్రేణ, ఛన్దసా, రుద్రాః, త్వా, అఞ్జన్తు, త్రైష్టుభేన, త్రైస్తుభేనేతి త్రై+స్తుభేన, ఛన్దసా, ఆదిత్యాః, త్వా, అఞ్జన్తు, జాగతేన, ఛన్దసా, భూః, భువః, స్వః, లాజీఇన్, శాచీఇన్, యవ్యే, గవ్యే, ఏతత్, అన్నమ్, అత్త,

దేవాః, ఏతత్, అన్నమ్, అద్ధి, ప్రజాపత ఇతి ప్రజా+పతే॥ ॥౮॥

పదార్థః:- (వసవః) ప్రథమకల్పా విద్వాంసః(త్వా)త్వామ్ (అంజంతు) కామయంతామ్ (గాయత్రేణ)గాయత్రీఛందోవాచ్యేన(ఛందసా)అర్థేన(రుద్రాః)మధ్యమకల్పా విద్వాంసః(త్వా) త్వామ్ (అంజంతు) (త్రైష్టుభేన) త్రిష్టుప్ ప్రకాశితేనార్థేన (ఛందసా) (ఆదిత్యాః) ఉత్తమా విద్వాంసః(త్వా)(అంజంతు)(జాగతేన)జగతీఛందః ప్రకాశితేనార్థేన(ఛందసా)స్వచ్ఛందేన(భూః) ఇమంలోకమ్(భువః)అంతరిక్షస్థాన్(స్వః)ప్రకాశసాంల్లోకాన్(లాజీన్)స్వస్వకక్షాయాం చలితాన్ (శాచీన్)వ్యక్తాన్(యవ్యే)యవానాం భవనే క్షేత్రే జాతమ్(గవ్యే)గోర్వికారే (ఏతత్)(అన్నమ్) (అత్త) భక్షయత(దేవాః)విద్వాంసః(ఏతత్)(అన్నమ్) (అద్ధి) భుంక్ష్వ(ప్రజాపతే) ప్రజారక్షక !

అన్వయః :- హే ప్రజాపతే వసవో గాయత్రేణ ఛందసా యం త్వాఽఞ్జంతు, రుద్రాస్త్రైష్టుభేన ఛందసా యం త్వాఽఞ్జంత్వాదిత్యా జాగతేన ఛందసా యం త్వాఽఞ్జంతు, స త్వమేతదన్న మద్ధి. హే దేవా యూయం యవ్యే గవ్య ఏతదన్నమత్త.లాజీన్ శాచీన్ భూర్భువః స్వ ర్లోకాను ప్రాప్నుత చ. ॥౮॥

భావార్థః :- యే విద్వాంసః సాంగోపాంగాన్ వేదాన్ మనుష్యా నధ్యాపయంతి తే ధన్యవాదార్హా భవంతి. ॥౮॥

పదార్థము:-ప్రజాపతే=ప్రజలను పాలించు రాజా!వసవః=ప్రథమశ్రేణికి జెందిన విద్వాంసులు, గాయత్రేణ=గాయత్రీఛందోవాచ్యమగు, ఛందసా=అర్థముతో, త్వామ్ =ఏ నిన్ను,అంజంతు=కోరెదరో,రుద్రాః=మధ్యమకక్షకు చెందిన, విద్వాంసులు,త్రైష్టుభేన=త్రిష్టుప్ ఛందస్సుతో ప్రకటించబడు,ఛందసా=స్వచ్ఛందమగు నర్థముతో,త్వా= ఏ నిన్ను, అంజంతు=కోరెదరో, ఆదిత్యాః=ఉత్తమ విద్వాంసులు,జాగతేన=జగతీ ఛందస్సుచే ప్రకాశింపబడునర్థముచే, ఛందసా=స్వచ్ఛందముగ,త్వామ్=ఏ నిన్ను, అంజంతు =కోరెదరో, అట్టి నీవు,ఏతత్ అన్నమ్=ఈ అన్నమును, అద్ధి=ఆరగించుము,దేవాః=ఓ విద్వాంసులారా! మీరు, యవ్యే=యవలు పండుపొలములో పండించినపదార్థములలోను, గవ్యే=గోదుగ్ధఘృతాదులలోను చక్కగా కలిసిపోయిన,ఏతత్ అన్నమ్=ఈ అన్నమును అత్త=ఆరగించుడు మఱియు, లాజీన్=స్వకక్షలందు భ్రమణ మొనర్చునవి, శాచీన్= ప్రకటితములు, సువ్యక్తములునగు, భూః=ఈ ప్రత్యక్షలోకమును, భువః=అంతరిక్షస్థ లోకములను, స్వః=ప్రకాశస్థములగు సూర్యాదిలోకములను పొందుడు.

భావార్థము:-ఏ విద్వాంసులు సాంగోపాంగముగ చతుర్వేదములను మనుష్యులకు చదివించుదురో, వారు ధన్యవాదమునకు అర్హులగుచున్నారు. ౧౩౧౪ [౮]

---

౧౩౧౫ కః స్విదిత్యస్య ప్రజాపతి ర్ఋషిః జిజ్ఞాసు ర్దేవతా, నిచృదత్యష్టి శ్ఛందః, గాంధారః స్వరః.

అథ విద్వాంసః కిం కిం ప్రష్టవ్యా ఇత్యాహ

విద్వాంసుల నేనేమి ప్రశ్నించవలయును?

కః స్విదేకాకీ చరతి క ఉ స్విజ్జాయతే పునః।

కిꣳ స్విద్ధిమస్య భేషజం కిమ్వావపనం మహత్॥ ॥౯॥

కః స్విత్, ఏకాకీ, చరతి, కః, ఉ, ఇత్యూꣳ, స్విత్, జాయతే, పునరితి పునః, కిమ్, స్విత్, హిమస్య, భేషజమ్, కిమ్, ఉꣳ ఇత్యూం, ఆవపనమిత్యా+ వపనమ్, మహత్॥ ॥౯॥

పదార్థః:- (కః)(స్విత్)ప్రశ్నే(ఏకాకీ)అసహాయః(చరతి)గచ్ఛతి(కః)(ఉ)వితర్కే (స్విత్)(జాయతే)(పునః) (కిమ్) (స్విత్) (హిమస్య) శీతస్య (భేషజమ్) ఔషధమ్ (కిమ్)(ఉ)(ఆవపనమ్) సమంతాద్వపతి యస్మిం స్తత్ (మహత్)విస్తీర్ణమ్. ॥౯॥

అన్వయః:- హే విద్వాంసో వయం యుష్మాన్ కః స్విదేకాకీ చరతి?క ఉ స్విత్ పునః పునర్జాయతే? కిం స్విద్ధిమస్య భేషజం? కిము మహదావపనమస్తీతి పృచ్ఛామః. ॥౯॥

భావార్థః:- ఏతేషాం ప్రశ్నానా ముత్తరస్మిన్మంత్ర ఉత్తరాణి కథితానీతి వేద్యమ్. మనుష్యా ఈదృశానేవ ప్రశ్నాన్ కుర్యుః. ॥౯॥

పదార్థము:-ఓ విద్వాంసులారా! మేము మిమ్ముల నడుగుచున్నాము. కః స్విత్ =ఎవడు,ఏకాకీ=ఏకాకిగ,ఒంటరిగ,చరతి=విచరించుచున్నాడు? ఉ=మరియు, కః స్విత్ ఎవడు, పునః=మాటిమాటికి, జాయతే=ప్రకటితుడగుచున్నాడు? కిమ్ స్విత్=ఏది,హిమస్య=శీతమునకు, భేషజమ్=ఔషధము? కిమ్ ఉ=ఏది, మహత్ ఆవపనమ్=బీజవపనమునకు గొప్ప స్థానము? [౯]

భావార్థము:-ఉక్త ప్రశ్నల సమాధానములు ముందు మంత్రమునందు చెప్పబడినవని గ్రహించవలయును. మనుష్యులిటువంటి జిజ్ఞాసల నొనర్చుచుండవలయును? [౯]

---

౧౦౧౬ సూర్య ఇత్యస్య ప్రజాపతి ఋషిః, సూర్యో దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పూర్వోక్త ప్రశ్నానాముత్తరాణ్యాహ

పూర్వమంత్రమునందలి ప్రశ్నలకు సమాధానమిచ్చుచున్నాడు.

సూర్య ఏకాకీ చరతి చన్ద్రమా జాయతే పునః।

అగ్నిర్హిమస్య భేషజం భూమి రావపనం మహత్॥ ॥౧౦॥

సూర్యః, ఏకాకీ, చరతి, చన్ద్రమాః, జాయతే, పునరితి పునః, అగ్నిః,

హిమస్య, భేషజమ్, భూమిః, ఆవపనమిత్యా+వపనమ్, మహత్॥ ॥౧౦॥

పదార్థః:- (సూర్యః)సవితా(ఏకాకీ)(చరతి)(చంద్రమాః)చంద్రలోకః(జాయతే)(పునః)(అగ్నిః)పావకః(హిమస్య)(భేషజమ్)(భూమిః)(ఆవపనమ్)(మహత్). ॥౧౦॥

అన్వయః:- హే జిజ్ఞాసవో మనుష్యాః! సూర్య ఏకాకీ చరతి. పునశ్చంద్రమాః ప్రకాశితో జాయతే. అగ్ని ర్హిమస్య భేషజం, భూమి ర్మహదావపనమ స్తీతి యూయం విత్త. ॥౧౦॥

భావార్థః:-అస్మిన్ సంసారే సూర్యః స్వాకర్షణేన స్వస్యైవ కక్షాయాం వర్తతే. తస్యైవ ప్రకాశేన చంద్రాదయో లోకాః ప్రకాశితా భవంతి. అగ్నినా తుల్యం శీతనివారకం వస్తు, పృథివ్యా తుల్యం మహత్ క్షేత్రం కిమపి నాస్తీతి మనుష్యై ర్వేదితవ్యమ్. ॥౧౦॥

పదార్థము:-ఓ జిజ్ఞాసువులారా!సూర్యుడు,ఏకాకీ=స్వావలంబుడై స్వకక్ష యందు చరతి=సంచరించు చున్నాడు.పునః=ఆ సూర్యుని ప్రకాశముచేతనే, చంద్రమాః=చంద్రలోకము, జాయతే=ప్రకాశితమగు చున్నది. అగ్నిః=నిప్పు, హిమస్య=శీతమునకు, భేషజమ్=ఓషధి, భూమిః=పృథివి, మహత్ ఆవపనమ్=వపనయోగ్యమగు గొప్ప స్థానము, అని మీరు గ్రహించుడు. [౧౦]

భావార్థము:-ఈ సంసారమున సూర్యుడు స్వకీయాకర్షణశక్తిచే స్వకీయకక్ష యందు మెలగు చున్నాడు. అతని ప్రకాశముచేతనే చంద్రాదిలోకములు ప్రకాశితములగు చున్నవి. అగ్నితో సమానమైన శీతనివారకమగువస్తువు, పృథ్వితో సమానమగు బీజవపనమునకు మహాక్షేత్రమును ఇతర మెద్దియు లేదు అని మానవులు గ్రహించవలయును. ౧౩౧౬ [౧౦]

---

౧౩౧౭ కా స్విదాసీ దిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, జిజ్ఞాసు ర్దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః పునః ప్రశ్నానాహ.

మఱల ప్రశ్నల జెప్పుచున్నాడు

కా స్విదాసీత్పూర్వచిత్తిః కిం స్విదాసీద్బృహద్వయః ।
కా స్విదాసీత్పిలిప్పిలా కా స్విదాసీత్పిశఙ్గిలా॥ ॥౧౧॥

కా, స్విత్, ఆసీత్, పూర్వచిత్తి రితి పూర్వ+చిత్తిః, కిమ్, స్విత్, ఆసీత్, బృహత్, వయః, కా, స్విత్, ఆసీత్, పిలిప్పిలా, కా, స్విత్, ఆసీత్, పిశఙ్గిలా॥

పదార్థః:- (కా)(స్విత్)(ఆసీత్)అస్తి(పూర్వచిత్తిః)పూర్వా చాసౌ చిత్తిః ప్రథమా స్మృతి విషయా(కిమ్)(స్విత్) (ఆసీత్) (బృహత్) మహత్ (వయః) యో వేతి గచ్ఛతి స పక్షీ (కా) (స్విత్) (ఆసీత్)(పిలిప్పిలా)ఆర్ద్రీభూతా చిక్కణా శోభనా.శ్రీ ర్వై పిలిప్పిలా.శ.౧౩.౨.౬.౧౬.

(కా)(స్విత్)(ఆసీత్)(పిశంగిలా)యా పిశం ప్రకాశరూపం గిలతి సా. పిశమితి రూప నామ.

అన్వయః:- హే విద్వాంసో వయం యుష్మాన్ ప్రతి కాస్విత్ పూర్వచిత్తి రాసీత్?కింస్విద్ బృహద్వయ ఆసీత్? కాస్విత్ పిలిప్పిలాఽఽసీత్కాస్విత్ పిశంగిలాఽఽసీదితి పృచ్ఛామః. ॥౧౧॥

భావార్థః:- ఏతేషా ముత్తరాణ్యుత్తరత్ర మంత్రే సంతి. యది విదుషః ప్రతి ప్రశ్నా న్న కుర్యు స్తర్హి విద్వాంసోఽపి న భవేయుః. ॥౧౧॥

పదార్థము:-ఓ విద్వాంసులారా! మేము మిమ్ము ప్రశ్నించుచున్నాము.కా చిత్ =ఏది, పూర్వచిత్తిః ఆసీత్=ప్రప్రథమ స్మృతి విషయమై యున్నది? కిమ్ స్విత్ బృహత్ వయః ఆసీత్=ఎగురు గొప్పవిహంగమ మెద్ది?కాస్విత్=ఏది,పిలిప్పిలా ఆసీత్=ఆర్ద్రీభూతమై నున్నగా శోభాయమానమైన వస్తువు ? కా స్విత్ పిశంగిలా=ప్రకాశరూపమును మ్రింగు వస్తువేది? [౧౧]

భావార్థము:-వీని సమాధానములు తర్వాత మంత్రమునందున్నవి. విద్వాంసుల నిటుల ప్రశ్నించనిచో తాము విద్వాంసులు కాజాలరు. ౧౩౧౪ [౧౧]



౧౩౧౮ ద్యౌరాసీదిత్యస్య ప్రజాపతి ఋషిః, విద్యుదాదయో దేవతాః, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ ప్రాక్ప్రశ్నో త్తరాణ్యాహ.

పూర్వ ప్రశ్నలకు ప్రత్యుత్తరములు

ద్యౌ రాసీత్పూర్వచిత్తి రశ్వ ఆసీద్బృహద్వయః ।
అవి రాసీత్ పిలిప్పిలా రాత్రి రాసీత్ పిశఙ్గిలా॥ ॥౧౨॥

ద్యౌః, ఆసీత్, పూర్వచిత్తి రితి పూర్వ+చిత్తిః, అశ్వః, ఆసీత్, బృహత్, వయః, అవిః, ఆసీత్, పిలిప్పిలా, రాత్రిః, ఆసీత్, పిశఙ్గిలా॥ ॥౧౨॥

పదార్థః:- (ద్యౌః)దివ్యగుణప్రదా వృష్టిః. ద్యౌ ర్వై వృష్టిః. శత. కాం.౧౩.౨.౬.౧౪. (ఆసీత్) అస్తి (పూర్వచిత్తిః) ప్రథమస్మృతివిషయా (అశ్వః) యోఽశ్నుతే మార్గాన్ సోఽగ్నిః (ఆసీత్)(బృహత్)మహత్(వయః)యో వేతి గచ్ఛతి సః (అవిః)రక్షణాదికర్త్రీ పృథివీ (ఆసీత్)(పిలిప్పిలా)(రాత్రిః)(ఆసీత్)(పిశంగిలా). ॥౧౨॥

అన్వయః:- హే జిజ్ఞాసవః పూర్వచిత్తి ర్ద్యౌరాసీద్ బృహద్వయో ఽశ్వ ఆసీత్. పిలిప్పిలాఽవి రాసీత్పిశంగిలా రాత్రి రాసీ దితి యూయం బుధ్యధ్వమ్. ॥౧౨॥

భావార్థః:- హే జనా యేన సూర్యరూపాద్యగ్నినా ఽభేన సర్వగుణసంపన్నాఽన్నాదినా సంసార

స్థితినిమిత్తా వృష్టి ర్జాయతే తతః సర్వరత్నాఢ్యా భూర్భవతి. సూర్యాగ్నినిమిత్తైనైవ ప్రాణినాం శయనాయ రాత్రి ర్జాయతే. ॥౧౨॥

పదార్థము:-జిజ్ఞాసువులారా! పూర్వచిత్తిః=ప్రప్రథమస్మృతి విషయము, ద్యౌః ఆసీత్=దివ్యగుణప్రదమగు వృష్టియై ఉన్నది. బృహత్ వయః=ఎగురునటువంటిది,అశ్వః ఆసీత్=మార్గమున వ్యాపించు పక్షివలె నగ్ని ఉన్నది.పిలిప్పిలా=వర్షముచే తడిసి నున్నగా శోభాయమానముగా నుండునది,అవిః ఆసీత్=అన్నాదులచే రక్షాద్యుత్తమగుణములను ప్రకటించు పృథివియై యున్నది.పిశంగిలా=ప్రకాశమును మ్రింగివేయునది, అంధకారమును వ్యాపింపజేయునది,రాత్రిః ఆసీత్=రాత్రి అయియున్నది.అని గ్రహించుడు.[౧౨]

భావార్థము:-హవన సూర్యరూపాదులగు అగ్నియొక్క తాపముచేతను, సర్వగుణ సంపన్నములగు అన్నాదులచేతను సంసారస్థితికి హేతుభూతమగువృష్టి సంభవించుచున్నది. ఆ వర్షముచే పృథివి ఓషధ్యాద్యుత్తమ పదార్థయుక్త యగుచున్నది. సూర్యరూపాగ్ని వలననే ప్రాణుల విశ్రాంతి కొఱకు రాత్రి కలుగుచున్నది. ౧౩౧౮[౧౨]

---

వాయు రిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, బ్రహ్మాదయో దేవతాః, భురిగతిజగతీ ఛందః, నిషాదః స్వరః.

అథ విద్వద్భి ర్మనుష్యాః క్వ యోజనీయా ఇత్యాహ

మానవులు విద్వాంసుల నెక్కడ నియోగించవలయును?

వాయు ష్ట్వా పచతై రవత్వసితగ్రీవ శ్ఛాగై ర్న్యగ్రోధ శ్చమసైః శల్మలి ర్వృద్ధ్యా। ఏష స్య రాథ్యో వృషా పడ్భి శ్చతు ర్భి రేదగన్ బ్రహ్మాకృష్ణశ్చ నోఽవతు నమోఽగ్నయే॥ ॥౧౩॥

వాయుః, త్వా, పచతైః, అవతు, అసితగ్రీవ ఇత్యసిత+గ్రీవః, ఛాగైః, న్యగ్రోధః, చమసైః, శల్మలిః, వృద్ధ్యా, ఏషః, స్యః, రాథ్యః, వృషా, పడ్భిరితి పడ్+భిః, చతుర్భి రితి చతుః+భిః; ఆ, ఇత్, అగన్, బ్రహ్మా,అకృష్ణః,చ,నః,అవతు, నమః, అగ్నయే॥ ॥౧౩॥

పదార్థః:-(వాయుః)అతిమః స్థూలః కార్యరూపః(త్వా)త్వామ్(పచతైః)పరిపాక పరిణామైః(అవతు)రక్షతు(అసితగ్రీవః)అసితా కృష్ణా గ్రీవా శిఖా యస్య సః (ఛాగైః) ఛేదనైః (న్యగ్రోధః)వటః(చమసైః) మేఘైః (శాల్మలిః) వృక్షవిశేషః (వృద్ధ్యా) వర్ధనేన(ఏషః) (స్యః) సః (రాథ్యః) రథేషు హితా రథ్యాస్తాసు కుశలః (వృషా)వర్షకః (పడ్భిః)పాదైః. అత్ర వర్ణవ్యత్యయేన దస్య డః. (చతుర్భిః)(ఆ) (ఇత్) ఏవ (అగన్)గచ్ఛతి. (బ్రహ్మా) చతుర్వేదవిత్ (అకృష్ణః) అవిద్యాంధకారరహితః(చ)(నః)అస్మాన్(అవతు)ప్రవేశయతు(నమః)అన్నమ్(అగ్నయే)ప్రకాశ

మానాయ విదుషే. ॥౧౩॥

అన్వయః :- హే విద్యార్థిన్ పచతై ర్వాయు శ్ఛాగై రసితగ్రీవ శ్చమసై ర్న్యగ్రోధో వృద్ధ్యా శాల్మలి స్త్వాఽవతు. య ఏష రాథ్యో వృషా స్య చతుర్భిః పడ్భి రిత్ త్వాఽగన్ యో ఽకృష్ణో బ్రహ్మా చ నోఽస్మానవతు.తస్మా అగ్న యే విద్యయా ప్రకాశమానాయ నమో దేయమ్.

భావార్థః:- హే మనుష్యా వాయుః ప్రాణేనాగ్ని పాచనేన సూర్యోవృష్ట్యా వృక్షాః ఫలాదిభి రశ్వాదయో గత్యా విద్వాంసః శిక్షయా యుష్మాన్ రక్షంతి. తాన్ యూయం విజానీత విదుష స్సత్కురుత చ. ॥౧౩॥

పదార్థము:-ఓ విద్యార్థీ! పచతైః=సుపాకములచే, వాయుః=స్థూలకార్యరూపమైన పవనము, ఛాగైః=ఛేదన క్రియలచే, అసితగ్రీవః=నల్లని శిఖలుగల అగ్ని,చమసై =మేఘములచే, న్యగ్రోధః=వటవృక్షము, వృధ్యా=పెంపుచే, శల్మలిః=బూరుగుచెట్టుః త్వా=నిన్ను,అవతు=పాలించుగాక! ఏషః=ఏయియ్యది, రాథ్యః=మార్గములందు సంచరించుటయందు కుశలము,వృషా=సుఖవర్షకము నై ఉన్నదో,స్యః=అయ్యది.చతుర్భిః ఇత్ =గమన మొనర్చు నాలుగు కాళ్లచే నిన్ను,అగన్=పొందుగాక! చ=మఱియు, అకృష్ణః=అవిద్యాంధకారముక్తుడగు, బ్రహ్మ=చతుర్వేదవిత్తగునే యుత్తమ విద్వాంసుడు, నః=మమ్ముసకల సద్గుణములందు,అవతు=ప్రవేశ మొనరించునో,అగ్న యే=విద్యచే ప్రకాశమానుడు చతుర్వేదములను చదివినవాడు నగునా విద్వాంసునకు,నమః=అన్న మీయవలయును. [౧౩]

భావార్థము:-ఓ మానవులారా! పవనము ప్రాణాది శ్వాసములచేతను, అగ్ని అన్నాదుల పచనముద్వారాను,సూర్యుడు వృష్టిచేతను,వృక్షములు ఫలాదులచేతను,అశ్వాదులు గతి ద్వారాను,విద్వాంసులు సుశిక్షచేతను మిమ్ము రక్షించుచున్నారు.వారిని మీరెఱుగుడు. విద్వాంసులను సత్కరించుడు. ౧౩౧౯[౧౩]

---

సంశితో రశ్మి నేత్యస్య ప్రజాపతి ఋషిః, బ్రహ్మ దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వర
పున ర్విద్వాంసః కిం కుర్యు రిత్యాహ
విద్వాంసు లేమి చేయవలయును?

**సంశితో రశ్మినా రథః సంశితో రశ్మినా హయః ।**
**సంశితో ఽఅప్స్వప్సుజా బ్రహ్మ సోమపురోగవః॥ ॥౧౪॥**

**సంశిత ఇతి సమ్+శితః, రశ్మినా,రథః, సంశిత ఇతి సమ్+శితః, రశ్మినా, హయః, సంశిత ఇతి సమ్+శితః, అప్స్విత్యప్+సు, అప్సుజా ఇత్యప్సు+జాః, బ్రహ్మ, సోమపురోగవ ఇతి సోమ+పురోగవః॥ ॥౧౪॥**

పదార్థః:-(సంశితః)సమ్యక్ సూక్ష్మీకృతః(రశ్మినా) కిరణసమూహేన (రథః)రమణసాధనః (సంశితః)(రశ్మినా)(హయః)అశ్వః(సంశితః) స్తుతః(అప్సు)ప్రాణేషు(అప్సుజాః)ప్రాణేషు జాయమానః(బ్రహ్మా)మహాన్ యోగీ విద్వాన్ (సోమపురోగవః)సోమఽఓషధిగణబోధ ఐశ్వర్యయోగో వా పురోగామీ యస్య సః. ॥౧౪॥

అన్వయః:-యది మనుష్యై రశ్మినా రథః సంశితో రశ్మినా హయః శంసితోఽప్స్వప్సుజాః సోమపురోగవో బ్రహ్మా సంశితః క్రియేత తర్హి కిం కిం సుఖం న లభ్యేత? ॥౧౪॥

భావార్థః:—యే మనుష్యా పదార్థవిజ్ఞానేన విద్వాంసో భవంతి, తేఽన్యాన్ కారయిత్వా ప్రశంసాం ప్రాప్నువంతు. ॥౧౪॥

పదార్థము:-మానవులు,రశ్మినా=కిరణ సమూహముచే, రథః=ఆనందమును సిద్ధమొనర్చు యానమును, సంశితః=చాల బాగుగ సూక్ష్మ శిల్పముచే నిర్మించినట్లయితేను, రశ్మినా=కళ్లెపు త్రాడుచే, హయః=గుఱ్ఱము,శంసితః=చక్కగానడచుటలో తీక్ష్ణము, శ్రేష్టక్రియయు గలదియునై,[స్తుతమగుచో] అప్సు=ప్రాణములందు,అప్సుజాః=ప్రాణవాయువు రూపమున సంచరించు పవనము లేక బాష్పము,సోమపురోగవః=ఓషదిగణబోధను ఐశ్వర్యయోగమును [పురోగామి] ప్రప్రథమమున ప్రాప్తించువాడగు, బ్రహ్మా=విద్వాంసుడైన పెద్దయోగి,సంశితః=అతిప్రశంసితుడుగా నొనర్చబడినచో లభించనిసుఖము లేవియుండును?

భావార్థము:-ఏ మానవులు పదార్థవిజ్ఞానముచే విద్వాంసులగుదురో, వారు ఇతరులను విద్వాంసులుగ నొనర్చి ప్రశంసను పొందుదురుగాక! ౧౩-౨౦[౧౪]



౧౩.౨౧ స్వయమిత్యస్య ప్రజాపతి ఋషిః, విద్వాన్ దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ జిజ్ఞాసవః కీదృశా భవేయు రిత్యాహ

చదువవలెయునని ఉత్తమ విద్య నభ్యసించవలయునని కోరుచూ రెటులుండురు?

స్వయం వాజింస్తన్వం కల్పయస్వ స్వయం యజస్వ స్వయం జుషస్వ ।
మహిమా తేఽన్యేన న సన్నశే॥ ॥౧౫॥

స్వయమ్, వాజిన్, తన్వమ్, కల్పయస్వ, స్వయమ్, యజస్వ, స్వయమ్, జుషస్వ, మహిమా, తే, అన్యేన, న, సన్నశ ఇతి సమ్+నశే॥ ॥౧౫॥

పదార్థః:-(స్వయమ్)(వాజిన్)జిజ్ఞాసో(తన్వమ్)శరీరమ్(కల్పయస్వ) సమర్థయస్వ (స్వయమ్) (యజస్వ)సంగచ్ఛస్వ(స్వయమ్)(జుషస్వ) సేవస్వ(మహిమా)ప్రతాపః(తే) తవ(అన్యేన)(న)(సన్నశే)సమ్యక్ నశ్యేత్. ॥౧౫॥

అన్వయః:- హే వాజింస్త్వం స్వయం తన్వం కల్పయస్వ స్వయం విదుషో యజస్వ. స్వయం జుషస్వ చ యత స్తే మహిమా ఽన్యేన సహా న సంనశే. ॥౧౫॥

భావార్థః :- యథాఽగ్నిః స్వయం ప్రకాశః స్వయం సంగతః స్వయం సేవమానోఽస్తి తథా యే జిజ్ఞాసవః స్వయం పురుషార్థయుక్తా భవంతి తేషాం మహిమా కదాచిన్న నశ్యతి.

పదార్థము:- వాజిన్=ఓ జ్ఞానాపేతుగల జనుడా ! నీవు, స్వయమ్=స్వయముగ, తన్వమ్=స్వశరీరమును,కల్పయస్వ=సమర్థవంతముగ నొనర్చుకొనుము. స్వయమ్=స్వయముగ సువిద్వాంసులను,యజస్వ=కలియుము, స్వయమ్=స్వయముగ వారిని,జుషస్వ=సేవించుము.ఇటులొనర్చుటచే,తే మహిమా=నీయొక్కమహిమ,ప్రతాపము,అన్యేన సహా=ఇతరునితోపాటు,న సన్నశే=వినష్టము చెందకుండును గాక ! [౧౫]

భావార్థము:-ఎటుల అగ్ని తనంతటతాను ప్రకాశితమగునో, తానే లభించునో, తానే సేవకు లబ్ధమగునో అటులనే జ్ఞానపిపాసువులు స్వయముగ పురుషార్థయుక్తులగుదురు. వారిప్రతాపము, గొప్పతనమెన్నటికి విలీనముజెందదు. ౧౩-౨౧[౧౫]

---

౧౩-౨-౨. న వా ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, సవితా దేవతా, విరాడ్ జగతీ ఛందః, నిషాదః స్వరః.

అథ మనుష్యాః కీదృశా భవేయు రిత్యాహ

మానవు లెటులుండవలయును?

నవా ఉఉ ఽ ఏతన్మ్రియసే న రిష్యసి దేవాఀ౨॥ఽఇదేషి పథిభిః సుగేభిః ।
యత్రాసతే సుకృతో యత్ర తే యయు స్తత్ర త్వా దేవః సవితా దధాతు ॥౧౬॥

న, వై, ఊం ఇత్యూం, ఏతత్, మ్రియసే, న, రిష్యసి, దేవాన్, ఇత్,ఏషి, పథిభి రితి పథి+భిః, సుగేభి రితి సు+గేభిః, యత్ర, ఆసతే,సుకృత ఇతి సు+కృతః, యత్ర, తే, యయుః, తత్ర, త్వా, దేవః, సవితా, దధాతు॥ ॥౧౬॥

పదార్థః-(న)నిషేధే(వై)నిశ్చయేన(ఉ)వితర్కే-(ఏతత్)(మ్రియసే) (న) (రిష్యసి) హింధి (దేవాన్)దివ్యాన్ గుణాన్ విదుషో వా (ఇత్) ఏవ (ఏషి) ప్రాప్నోషి (పథిభిః)మార్గైః(సుగేభిః) సుఖేన గంతుం యోగ్యైః(యత్ర)(ఆసతే)ఉపవిశంతి(సుకృతః)ధర్మాత్మానః(యత్ర) (యత్ర) (తే)యోగినో విద్వాంసః(యయుః)యాంతి. (తత్ర)(త్వా) త్వామ్(దేవః)స్వప్రకాశః(సవితా) సకల జగదుత్పాదకః పరమేశ్వరః(దధాతు)ధరతు. ॥౧౬॥

అన్వయః:- హే విద్యార్థిన్ యత్ర తే సుకృత ఆసతే, సుఖం యయు ర్యత్ర సుగేభిః పథిభి స్త్వం దేవానేషి.యత్రైతదు వర్తతే స్థిత స్త్వంన మ్రియసే న వై రిష్యసి,తత్రేత్ త్వా సవితా దేవో దధాతు. ॥౧౬॥

భావార్థః:-యది మనుష్యా స్వస్వరూపం జానీయు స్తర్హి తేఽవినాశిత్వం విద్యుః.,యది ధర్మ్యేణ మార్గేణ గచ్ఛేయు స్తర్హి సుకృతా మానందం ప్రాప్నుయుః. యది పరమాత్మానం సేవేరం స్తర్హి సత్యే మార్గే జీవాన్ దధ్యుః. ॥౧౬॥

పదార్థము:-ఓ విద్యార్థీ ! యత్ర=ఎచ్చట, తే సుకృతః=ధర్మాత్ములు, యోగులు నగు నా విద్వాంసులు, ఆసతే=కూర్చొనెదరో,మఱియు సుఖమును, యయుః=పొందెదరో,యత్ర=ఎక్కడ, సుగేభిః=సుఖముగవెళ్ళదగిన, పథిభిః=మార్గములద్వారా నీవు, దేవాన్=దివ్యములు శ్రేష్ఠములునగు గుణములను,లేక విద్వాంసులను,ఏషి=పొందుచున్నావో, మఱియు నెక్కడ,ఏతత్=ఈ పూర్వోక్తవృత్తాంత మంతయు,ఉ=ఉన్నదో, మఱియు స్థితుడవైన నీవు,న మ్రియసే=నశింపవో,న వై రిష్యసి=ఇతరులను నాశనమొన రించవో,తత్ర ఇత్=అక్కడనే,త్వా=నిన్ను,సవితా=సకలజగత్తు నుత్పన్నమొనర్చు పరమేశ్వరుడు,దేవః=స్వప్రకాశుడు,దధాతు=స్థాపించుగాక ! [౧౬]

భావార్థము:-మనుష్యులు స్వరూపముల నెఱుగుచో అవినాశిత్వమును ఎఱుగగలరు.ధర్మయుక్త మార్గమున చరించుచో సుకర్మలనాచరించువారు పొందునానందమును పొందగలరు. పరమాత్మను సేవించు వారగుచో జీవములను సత్యమార్గము నందు నడపగలరు. ౧౩-౨-౨[౧౬]

---

అగ్నిరిత్యస్య ప్రజాపతి రృషిః, అగ్న్యాదయో దేవతాః, అతిశక్వర్యౌ ఛందసీ, పంచమః స్వరః.

అథ కే పశవ ఇత్యాహ.

పశువేదియను విషయము చెప్పబడుచున్నది.

అగ్నిః పశు రాసీత్తేనాయజన్త స ఏతం లోకమజయద్ యస్మిన్నగ్నిః స తే లోకో భవిష్యతి తజ్జేష్యసి పిబైతా అపః । వాయుః పశురాసీత్తేనాయజన్త స ఏతం లోకమజయద్యస్మిన్వాయుః స తే లోకో భవిష్యతితం జేష్యసి పిబైతాఽఅపః। సూర్యః పశురాసీత్తేనా యజన్త స ఏతం లోకమజయద్ యస్మిన్త్సూర్యః స తే లోకో భవిష్యతి తం జేష్యసి పిబైతాఽఅపః॥ ॥౧౭॥

అగ్నిః, పశుః, ఆసీత్, తేన, అయజన్త, సః, ఏతమ్, లోకమ్, అజయత్, యస్మిన్, అగ్నిః, సః, తే, లోకః, భవిష్యతి, తమ్, జేష్యసి, పిబ, ఏతాః,

అ॒పః, వా॒యుః, ప॒శుః, ఆ॒సీ॒త్, తేన, అ॒య॒జ॒న్త, సః, ఏ॒తమ్, లో॒కమ్, అ॒జ॒య॒త్, యస్మి॒న్, వా॒యుః, సః, తే॒, లో॒కః, భ॒వి॒ష్య॒తి॒, తమ్, జే॒ష్య॒సి॒, పిబ, ఏ॒తాః, అ॒పః, సూర్యః, ప॒శుః, ఆ॒సీ॒త్, తేన అ॒య॒జ॒న్త॒. సః, ఏ॒తమ్, లో॒కమ్, అ॒జ॒య॒త్, య॒స్మి॒న్, సూర్యః, సః, తే॒, లో॒కః, భ॒వి॒ష్య॒తి॒, తమ్, జే॒ష్య॒సి॒, పిబ, ఏ॒తాః, అ॒పః॥

పదార్థః:-(అగ్నిః) వహ్నిః (పశుః) దృశ్యః (ఆసీత్) అస్తి(తే)(అయజన్త)యజన్తు(సః) (ఏతమ్)(లోకమ్)ద్రష్టవ్యమ్ (అజయత్) జయతి(యస్మిన్) లోకే (అగ్నిః)(సః)(తే)తవ(లోకః) (భవిష్యతి)(తమ్)(జేష్యసి)(పిబ) (ఏతాః)(అపః)జలాని(వాయుః)(పశుః)ద్రష్టవ్యః(ఆసీత్)(తేన) (అయజన్త)(సః)(ఏతమ్) వాయ్వధిష్ఠాత్మకమ్(లోకమ్) (అజయత్)జయతి(యస్మిన్)(వాయుః) (సః)(తే)(లోకః)(భవిష్యతి)(తమ్)(జేష్యసి)ఉత్కర్షయసి(పిబ)(ఏతాః)(అపః)ప్రాణాన్ (సూర్యః) (పశుః)దృశ్యః(ఆసీత్)(తేన)(అయజన్త) (సః)(ఏతమ్)సూర్యాధిష్ఠితమ్ (లోకమ్) (అజయత్)జయతి(యస్మిన్)(సూర్యః)(సః)(తే)(లోకః) (భవిష్యతి)(తమ్)(జేష్యతి)(పిబ) (ఏతాః) (అపః)వ్యాప్తాన్ ప్రకాశాన్. ॥౧౭॥

అన్వయః:-హే జిజ్ఞాసో యస్మిన్ సోఽగ్నిః పశురాసీత్తేనాఽయజన్త. తేన త్వం యజ. యథా స విద్వాంస్తేనైతం లోకమజయత్తథైతం జయ, తం చేజ్జేష్యసి తర్హి సోఽగ్నిస్తే లోకో భవిష్యతి. అతస్త్వమేతా యజ్ఞేన శోధితా అపః పిబ. యస్మిన్ స వాయుః పశురాసీద్యేన యజమానా అయజన్త. తేన త్వం యజ యథా స ఏతం లోకమజయత్తథా త్వం జయ. యది తం జేష్యసి. తర్హి స వాయుస్తే లోకో భవిష్యతి. అతస్త్వమేతా అపః పిబ. యస్మిన్స సూర్యః పశురాసీత్తేనాఽయజన్త యథా స ఏతం లోకమజయత్ తథా త్వ జయ. యది త్వం తం జేష్యసి తర్హి స సూర్యస్తే లోకో భవిష్యతి. తస్మాత్త్వమేతా అపః పిబ. ॥౧౭॥

భావార్థః:- హే మనుష్యాః సర్వేషు యజ్ఞేష్వగ్న్యాదీనేవ పశూన్ జానన్తు నైవ ప్రాణినోఽత్ర హింసనీయా హోతవ్యా వా సన్తి య ఏవం విదిత్వా సుగన్ధ్యాది ద్రవ్యాణి సుసంస్కృత్యాఽగ్నౌ జుహ్వతి తాని వాయుం సూర్యం చ ప్రాప్య వృష్టిద్వారా నివర్త్య ఓషధీః ప్రాణాన్ శరీరం బుద్ధిం చ క్రమేణ ప్రాప్య సర్వాన్ప్రాణినః ఆహ్లాదయన్తి. ఏతత్కర్తారః పుణ్యస్య మహత్త్వేన పరమాత్మానం ప్రాప్య మహీయన్తి. ॥౧౭॥

పదార్థము:-విద్యా జిజ్ఞాసూ! అస్మిన్=చూడదగినయీజగత్తులో, సః అగ్నిః=ఆ యగ్ని, పశుః ఆసీత్=చూడతగినదై యున్నదో. తేన=దానిచే యజ్ఞకర్తలెటుల, అయజన్త=యజ్ఞమొనర్చెదరో, ఆ విధముగ నీవును యజన మొనరించుము. సః=ఆ విద్వాంసు డెటుల, ఏతమ్ లోకమ్=దృశ్యమానమగు నీలోకమును, అజయత్=జయించుచున్నాడో అటులనే దీనిని జయించుము. తమ్=దానిని, జేష్యసి=జయించినచో, అగ్నిః=ఆ యగ్ని, తే లోకః=నీకుచూడదగినదిగ, భవిష్యతి=కాగలదు. కనుక నీవు, ఏతాః అపః=యజ్ఞముచే శుద్ధమొనర్పబడిన యీ జలములను, పిబ=త్రాగుము. యస్మిన్=ఎందు, సః వాయుః=ఆ

పవనము,పశుః ఆసీత్=చూడదగినదై యున్నదో,మఱియు దేనిచే యజ్ఞ మొనరించువారు, అయజంత=యజ్ఞమాచరించు చున్నారో,తేన=దానిచే నీవు యాగమొనరించుము.సః= ఆ విద్వాంసుడు ఎటుల,ఏతమ్ లోకమ్=ఈ వాయుమండలముండు లోకమును,అజయత్ =జయించునో అటులనే నీవు జయించుము.తమ్ జేష్యసి=దానిని జయించుచో,వాయుః =ఆపవనము,తే లోకఃభవిష్యతి=నీకుచూడదగినదిఅగును.కావున నీవు,ఏతాఃఅపః=యజ్ఞ శోధితములు ప్రాణరూపములునగు నీపవనములను,పిబ=ధారణమొనరించుము.యస్మిన్ =ఎచ్చట,సూర్యః పశుః ఆసీత్=సూర్యమండలము చూడదగినదై యున్నదో,తేన అయ జంత=దానిచే యజ్ఞకర్తలు యజ్ఞమాచరించవలయును.సః=అవిద్వాంసుడెటుల, ఏతత్ లోకమ్ అజయత్=సూర్యమండలాధిష్ఠితమగు నీ లోకమును జయించుచున్నాడో అటు లనే నీవు జయించుము. తమ్ జేష్యసి=దానిని నీవు జయించుచో, సః సూర్యః=ఆ సూర్య మండలము, తే లోకః భవిష్యతి=నీకు చూడదగినదిగా కాగలదు, కావున నీవు, ఏతాః అపః=యజ్ఞముచే శుద్ధములై సంసారమున వ్యాప్తమగుచున్న ఈసూర్యప్రకాశములను, పిబ=గ్రహించుము. [౧౭]

భావార్థము :- ఓ మానవులారా! సకలయజ్ఞములందు అగ్న్యాదులనే పశువులు గా నెఱుగుడు.కాని ప్రాణులీయజ్ఞమున చంపదగినవి కావు. హోమ మొనర్పదగినవియు కావు. ఎవరైనా యిటుల తెలుసుకొని సుగంధ్యాది మంచిపదార్థములను చక్కగా సం స్కరించి అగ్నియందు హోమమొనర్చుచో, ఆ పదార్థములు వాయువును, సూర్యుని పొంది వృష్టిద్వారా తిరిగివచ్చి ఓషధులను, ప్రాణములను, శరీరమును, బుద్ధిని క్రమము గా పొంది సకల ప్రాణములను ఆహ్లాద పఱచుచున్నవి. ఈ యజ్ఞకర్మ నాచరించువారు పుణ్యాధిక్యముచే పరమాత్మను పొంది సత్కారార్హులు కాగలుగుదురు. ౧౩-౨౩[౧౭]

---

౧౩-౨౪ అథ ప్రాణాయేత్యస్య మంత్రస్య ప్రజాపతి ఋషిః, ప్రాణాదయో దేవతాః, విరాడ్ జగతీ ఛందః, నిషాదః స్వరః.

పున ర్మనుష్యైః కిం కిం విజ్ఞేయ మిత్యాహ.

మానవు లేమేమి తెలుసుకొనవలయును ?

ప్రాణాయ స్వాహాఽపానాయ స్వాహా వ్యానాయ స్వాహా।
అమ్బేఽఅమ్బికేఽమ్బాలికే న మా నయతి కశ్చన।
సస స్త్యశ్వకః సుభద్రికాం కామ్పీలవాసినీమ్॥ ॥౧౮॥

ప్రాణాయ, స్వాహా,అపానాయ,స్వాహా, వ్యానాయేతి వి+ఆనాయ,స్వాహా అమ్బే, అమ్బికే, అమ్బాలికే,న,మా, నయతి,కః,చన,ససస్తి అశ్వకః,సుభద్రికా

మిత్తి సు+భద్రికామ్,కామ్పీలవాసినీమితి కామ్పీల+వాసినీమ్ ॥౧౮॥

పదార్థః:-(ప్రాణాయ) ప్రాణపోషణాయ (స్వాహా) సత్యవాక్ (అపానాయ)(స్వాహా) (వ్యానాయ)(స్వాహా)(అంబే) మాతః (అంబికే) పితామహి (అంబాలికే)ప్రపితామహి(న)విషేధే (మా)మామ్(నయతి)వశే స్థాపయతి(కః)(చన)కోఽపి(ససస్తి)స్వపితి(అశ్వకః)అశ్వ ఇవ గంతా జనః (సుభద్రికామ్) సుష్ఠు కళ్యాణకారికామ్. (కాంపీలవాసినీమ్) కం సుఖం పీలతి బధ్నాతి గృహ్ణాతీతి కంపీలః, స్వార్థేఽణ్, తం వాసయితుం శీలమస్యా స్తాం లక్ష్మీమ్. ॥౧౮॥

అన్వయః:-హే అంబేఽంబికేఽమ్బాలికే కశ్చనాశ్వకో యాః కాంపీలవాసినీం సుభద్రికామాదాయ ససస్తి న మా నయతి,అతోఽహం ప్రాణాయ స్వాహాఽపానాయ స్వాహా వ్యానాయ స్వాహా చ కరోమి. ॥౧౮॥

భావార్థః :- హే మనుష్యా యథా మాతా పితామహీ ప్రపితామహ్యపత్యాని సుశిక్షాం నయతి తథా యుష్మాభి రపి స్వసంతానాః శిక్షణీయాః. ధనస్య స్వభావోఽస్తి. యత్రేదం సంచీయతే తాన్నిద్రాలూనలసాన్ కర్మహీనాన్ కరోతి అతో ధనం ప్రాప్యాపి పురుషార్థ ఏవ కర్తవ్యః. ॥౧౮॥

పదార్థము:- అంబే=అమ్మా , అంబికే=అయ్యమ్మా!, అంబాలికే=మునినాయనమ్మా! కశ్చన అశ్వకః=అశ్వముతో సమానుడైన యొకానొక శీఘ్రగామి జనుడు, కాంపీలవాసినీమ్=సుఖగ్రాహులగు మానవులను నివసింపజేయు శీలముగలదియు, సుభద్రికామ్=ఉత్తమ కల్యాణమొనగూర్చునదియునగు లక్ష్మిని పొంది,ససక్తి=నిద్రించుచున్నాడు. కాని అది [లక్ష్మి]మా=నన్ను,న నయతి=వశమొనర్చుకొనజాలదు. కావున నేను, ప్రాణాయ=ప్రాణపోషణమునకై, స్వాహా=సత్యవాణిని, అపానాయ=దుఃఖమును తొలగించుటకై, స్వాహా=సుశిక్షితవాణిని, వ్యానాయ=శరీరమంతట వ్యాప్తముగు నాత్మకై, స్వాహా=సత్యవాణిని వినియోగించుచున్నాను. [౧౮]

భావార్థము:- ఓమానవులారా! ఎటుల తల్లి, నాయనమ్మ, మునినాయనమ్మ సంతానమునకు సుశిక్ష గఱపుదురో, అటులనే మీరును మీ సంతానమునకు శిక్ష గఱపవలయును. తాను సంచయమై యున్నచోటనున్న వారిని నిద్రాళువులుగను, సోమరులుగను, కర్తవ్యహీనులుగను నొనర్చుట' ధనముయొక్క స్వభావమైయున్నది. కావున ధనమును పొందియు మానవుడు పురుషార్థమునే ఆచరించవలయును. [౧౮]

---

౨౩-౧౯ గణానాం త్వేత్యస్య ప్రజాపతి ఋషిః,గణపతి ర్దేవతా,శక్వరీ ఛందః, ధైవతః స్వరః.

పున ర్మనుష్యైః కీదృశః పరమాత్మోపాసనీయ ఇత్యాహ.

మానవు లెటువంటి పరమాత్మ నుపాసించవలయును ?

గణానాం త్వా గణపతిꣳ హవామహే ప్రియాణాం త్వా ప్రియపతిꣳ హ

వామహే నిధీనాం త్వా నిధిపతిꣳ హవామహే వసో మమ ఆహ మజాని గర్భధ మా త్వ మజాసి గర్భధమ్॥ ॥౧౯॥

గణానామ్, త్వా, గణపతి మితి గణ+పతిమ్, హవామహే, ప్రియాణామ్, త్వా, ప్రియపతిమితి ప్రియ+పతిమ్, హవామహే, నిధీనామితి ని+ధీనామ్, త్వా, నిధిపతి మితి, నిధి+పతిమ్, హవామహే, వసో ఇతి వసో, మమ, ఆ, అహమ్, అజాని, గర్భధమితిగర్భ+ధమ్, ఆ, త్వమ్, అజాసి, గర్భధమితి గర్భ+ధమ్॥

పదార్థః :- (గణానామ్)సమూహానామ్ (త్వా) త్వామ్ (గణపతిమ్) సమూహపాలకమ్ (హవామహే)స్వీకుర్మహే(ప్రియాణామ్)కమనీయానామ్(త్వా)(ప్రియపతిమ్)కమనీయం పాలకమ్.(హవామహే)(నిధీనామ్)విద్యాదిపదార్థపోషకాణామ్(త్వా)(నిధిపతిమ్)నిధీనాంపాలకమ్ (హవామహే) (వసో) వసంతి భూతాని యస్మిన్త్స వసు స్తత్సంబుద్ధౌ (మమ) (ఆ) (అహమ్) (అజాని)జానీయామ్ (గర్భధమ్) యో గర్భం దధాతి తమ్.(ఆ) (త్వమ్) (అజాసి)ప్రాప్నుయాః (గర్భధమ్)ప్రకృతిమ్. ॥౧౯॥

అన్వయః :- హే జగదీశ్వర వయం గణానాం గణపతిం త్వా హవామహే. ప్రియాణాం ప్రియపతిం త్వా హవామహే. నిధీనాం నిధిపతిం త్వా హవామహే. హే వసో మమ న్యాయాధీశో భూయాః. యం గర్భధం త్వమాజాసి, తం గర్భధ మహమాజాని. ॥౧౯॥

భావార్థః :- హే మనుష్యా యః సర్వస్య జగతో రక్షక ఇష్టానాం విధాతైశ్వర్యాణాం ప్రదాతా ప్రకృతేః పతిః సర్వేషాం బీజాని విదధాతి తమేవ జగదీశ్వరం సర్వ ఉపాసీరన్. ॥౧౯॥

పదార్థము:-ఓజగదీశ్వరా! మేము, గణానామ్=గణముల మధ్య, గణపతిమ్ త్వా =గణముల పాలించుడవగు నిన్ను, హవామహే=స్వీకరించుచున్నాము. ప్రియాణామ్=అతి ప్రియులగు సుందరుల మధ్య,ప్రియపతిమ్ త్వా=అతిప్రియులు సుందరులునగు వారిని పాలించు నిన్ను, హవామహే=ప్రశంసించుచున్నాము. నిధీనామ్=విద్యాదిపదార్థముల బలపఱచువారి మధ్య, నిధిపతిమ్ త్వా=విద్యాదిపదార్థముల రక్షించువ్వాడవగు నిన్ను,హవామహే=స్వీకరించుచున్నాము.వసో=సకలప్రాణులుఎవనియందు వసించుచున్నవో అట్టి ఓ జగదీశ్వరా ! నీవు, మమ=నాకు న్యాయాధీశుడవుకమ్ము,గర్భధమ్=గర్భమువలె సంసారమును ధారణమొనర్చు నేప్రకృతిని,త్వమ్= ధారణమొనర్చుచు నీవు,ఆ అజాసి=జన్మాది దోషరహితుడవై చక్కగా పొందుచున్నావో,గర్భధమ్=అట్టి ప్రకృతిని ధరించు నిన్ను,అహమ్=నేను,ఆ అజాని=బాగుగా నెఱుగుదునుగాక ! [౧౯]

భావార్థము:-ఓ మానవులారా ! ఎవడు సకలజగత్తుకు రక్షకుడో,అభీష్టసుఖముల నొసగుచున్నాడో, ఐశ్వర్యములను ప్రదానమొనర్చు చున్నాడో, ప్రకృతిని పాలించు

చున్నాడో, సకలబీజములను విధించుచున్నాడో అట్టి యా జగదీశ్వరునినే అందఱు ఉపాసించవలయును. ౨౩-౧౯[౧౯]

— —

౨౩-౨౦ తా ఉభా విత్యస్య ప్రజాపతి ర్ఋషిః, రాజప్రజే దేవతే, స్వరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ రాజప్రజాజనాః పరస్పరం కథం వర్తేరన్నిత్యాహ.

రాజు ప్రజలు పరస్పరమెటుల మెలగవలయును ?

తా౨ ఉభౌ చతురః పదః సమ్ప్రసారయావ స్వర్గే లోకే ప్రోర్ణువాథాం వృషా వాజీ రేతోధా రేతో దధాతు॥ ॥౨౦॥

తౌ, ఉభౌ, చతురః, పదః, సమ్ప్రసారయావేతి సమ్+ప్రసారయావ, స్వర్గ ఇతి స్వః+గే, లోకే, ప్ర, ఊర్ణువాథామ్, వృషా, వాజీ, రేతోధా ఇతి రేతః+ధాః, రేతః, దధాతు॥ ॥౨౦॥

పదార్థః:- (తౌ) ప్రజా రాజానౌ (ఉభౌ) (చతురః) ధర్మార్థకామమోక్షాన్ (పదః) ప్రాప్తవ్యాన్ (సంప్రసారయావ) విస్తారయావః (స్వర్గే) సుఖమయే (లోకే) ద్రష్టవ్యే (ప్ర) (ఊర్ణువాథామ్) ప్రాప్నుయాథామ్. (వృషా) దుష్టానాం శక్తిబంధకః (వాజీ) విజ్ఞానవాన్ (రేతోధాః) యో రేతః శ్లేష మాలింగనం దధాతి సః (రేతః) వీర్యం పరాక్రమమ్ (దధాతు). ॥౨౦॥

అన్వయః:- హే రాజప్రజే యువాం ఉభౌ తౌ యథా స్వర్గే లోకే చతురః పదః ప్రోర్ణువాథాం తథైతానావామధ్యాపకోపదేశకౌ సంప్రసారయావ. యథా రేతోధా వృషా వాజీ రాజా ప్రజాసు రేతో. వీర్యం దధ్యాత్తథా ప్రజాపి దధాతు. ॥౨౦॥

భావార్థః:- అత్ర వాచక లుప్తోపమాలంకారః. యది రాజప్రజే పితాపుత్రవద్వర్తేయాతాం తర్హి ధర్మార్థకామమోక్షఫలసిద్ధిం యథావత్ప్రాప్నుయాతాం యథా రాజా ప్రజాసుఖబలే వర్ధయేత్తథా ప్రజా అపి రాజ్ఞః సుఖబలే ఉన్నయేత్. ॥౨౦॥

పదార్థము:- ఓ రాజా ! ప్రజలారా ! ఉభా=మీరిరువురు, తౌ=రాజు ప్రజలు, ఎటుల స్వర్గే లోకే=సుఖమయము, ద్రష్టవ్యమునగు వ్యవహారమున లేక పదార్థమున, చతురఃపదః=పొందదగిన ధర్మార్థ కామమోక్షములను పదములను, ప్రోర్ణువాథామ్=పొందుదురో, అటులనే అధ్యాపకులము, ఉపదేశకులమునగు మేము, సంప్రసారయావ=విస్తరింపజేయుదుముగాక ! ఎటుల, రేతోధాః=ఆలింగనము అనగా ఇతరులను కలుపుకొను స్వభావము గలవాడు, వృషా=దుష్టులసామర్థ్యమును నిరోధించువాడు, వాజీ=విశిష్టజ్ఞానవంతుడునగు రాజు ప్రజలలో, రేతః=స్వపరాక్రమమును స్థాపించునో, అటులనే ప్రజలును, దధాతు=స్థాపించెదరుగాక ! [౨౦]

భావార్థము:-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకార మున్నది. రాజు ప్రజలు పితాపుత్రులవలె మెలగుచో ధర్మార్థ కామ మోక్షముల సిద్ధి యథావతు పొంద గలరు.రాజు ప్రజలయొక్క సుఖమును బలమును వృద్ధిపఱచునటులనే ప్రజలును రాజు యొక్క సుఖమును బలమును పెంపొందింప జేయవలయును. ౧౩-౧౯[-౨౦]

౧౩-౨౭ ఉత్సక్థ్యా ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః,న్యాయాధీశో దేవతా,భురిగ్గాయత్రీ ఛన్దః,షడ్జః స్వరః.
పునా రాజ్ఞా దుష్టాచారాః సమ్యగ్ దండనీయా ఇత్యాహ.
దుష్టాచారులను రాజు బాగుగా దండించవలయును.

ఉత్సక్థ్యా అవ గుదం ధేహి సమఞ్జిం చారయా వృషన్।

యః స్త్రీణాం జీవభోజనః॥ ॥౨౦॥

ఉత్సక్థ్యా ఇత్యుత్+ సక్థ్యాః, అవ, గుదమ్, ధేహి,సమ్, అఞ్జిమ్, చారయ, వృషన్, యః, స్త్రీణామ్, జీవభోజన ఇతి జీవ+భోజనః॥ ॥౨౦॥

పదార్థః:-(ఉత్సక్థ్యాః)ఊర్ధ్వం సక్థినీ యస్యాస్తస్యాః ప్రజాయాః (అవ)(గుదమ్)క్రీడామ్ (ధేహి)(సమ్)(అంజిమ్)ప్రసిద్ధన్యాయమ్(చారయ)ప్రాపయ. అత్ర సంహితాయామితి దీర్ఘః (వృషన్)శక్తిమన్(యః)(స్త్రీణామ్)(జీవభోజనః)జీవా భోజనం భక్షణం యస్య సః. ॥౨౦॥

అన్వయః :- హే వృషన్ యః స్త్రీణాం జీవభోజనో వ్యభిచారీ వ్యభిచారిణీ వా స్త్రీ వర్తేత. తం తాం చ నిగృహ్యోత్సక్థ్యా స్తాడయ స్వప్రజాయాం చ గుదమవ ధేహ్యాఞ్జిం సంచారయ. ॥౨౦॥

భావార్థః:- హే రాజన్ యే విషయసేవాయాం క్రీడంతో జనాః క్రీడంత్యః స్త్రియో వా వ్యభిచారం వర్ధయేయుస్తే తాశ్చ తీవ్రేణ దండేన శాసనీయాః. ॥౨౦॥

పదార్థము:-వృషన్ =ఓశక్తిమంతుడా!స్త్రీణామ్=స్త్రీలమధ్య,యః జీవభోజనః= ప్రాణుల మాంసమును తినేవాడు,వ్యభిచారియగు పురుషుడు ఎవడుండునో అటులనే పురుషులమధ్య వ్యభిచారిణియగునే స్త్రీ యుండునో,ఆస్త్రీపురుషుల[నిరువుర]నుబంధించి, ఉత్సక్థ్యాః=తలక్రిందుగా వ్రేలాడవేసి ధండించి,స్వప్రజలమధ్య,అవ గుదమ్=ఉత్తమ సుఖ మును, ధేహి=ధరింప జేయుము, మఱియు,అంజిమ్=ప్రసిద్ధన్యాయమును,సంచారయ= చక్కగా నడుపుము. [-౨౦]

భావార్థము:-ఓ రాజా ! విషయలోలుపులై చరించు పురుషులు, స్త్రీలు వ్యభి చారమును పెంచుచున్నచో ఆ స్త్రీపురుషులను తీవ్రదండనముచే శిక్షించలయును.

౧౩_౨౮ యకాసకావిత్యస్య ప్రజాపతి ర్ఋషిః,రాజప్రజే దేవతే,విరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః
పున స్తమేవ విషయ మాహా.
మఱల నవ్విషయమే.

యకాసకౌ శకున్తికా హల్గితి వఞ్చతి ।
ఆహన్తి గభే పసో నిగల్గలీతి ధారకా॥ ॥౨౨॥

యకా, అసకౌ, శకున్తికా, ఆహలక్, ఇతి, వఞ్చతి, ఆ, హన్తి, గభే, పసః, నిగల్గలీతి, ధారకా ॥౨౨॥

పదార్థః:- (యకా)యా(అసకౌ)అసౌ ప్రజా(శకుంతికా)అల్పా పక్షిణీవ నిర్బలా(ఆహలక్) సమంతాద్ధలం విలేఖనమఞ్చతి సః(ఇతి)అనేన ప్రకారేణ(వంచతి)ప్రలంభతే (ఆ) (హంతి) (గభే)ప్రజాయామ్(పసః)రాష్ట్రమ్(నిగల్గలీతి)భృశం నిగలతీవ వర్తతే.(ధారకా)సుఖస్య ధర్త్రీ.

అన్వయః:- యస్యాం గభే రాజా పసో రాష్ట్రమాహంతి సా ధారకా ప్రజా నిగల్గలీతి యతో యకాఽసకౌ శకుంతికా శకుంతికేవ వర్తతే తస్మాదిమామాహలగ్రాజా వఞ్చతీతి.॥౨౨॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యది రాజా న్యాయేన ప్రజాయా రక్షణం న కుర్యాదకృత్వా కరం గృహ్ణీయాత్తర్హి యథా ప్రజాః క్రమశః క్షీణా భవంతి తథా రాజాఽపి నష్టో భవతి. యది విద్యావినయాభ్యాం ప్రజాః సంరక్షేత్తర్హి రాజప్రజే సర్వతోవర్ధేతామ్.

పదార్థము:-గభే=ఏ ప్రజలయందు రాజు, పసః=స్వకీయరాజ్యమును, ఆహంతి= ఎఱుగునో,లేక పొందునో,ధారకా=సుఖము ధరింపగలుగు నా ప్రజ,నిగల్గలీతి=నిరంతర సుఖమును మింగుచున్నదానివలె ఉండగలుగుచున్నది.ఏలయన, యకా అసకౌ=ఏయీ ప్రజ యున్నదోఅది,శకుంతికా=అల్పవిహంగమువలె నిర్బలమైయున్నది.కావున నీప్రజను, ఆహాలక్=భూమియందంతట చక్కగా నాగలిని నడిపించు రాజు అనగా నాగలిచే దున్న బడు భూమినుండి శిస్తును పొందు రాజు,వంచతి ఇతి=ప్రజలకు సుఖము లభించు విధము గానే తన కరధనమును తాను పొందుచున్నాడు. [౨౨]

పదార్థము:-ఈ మంత్రములో వాచక లుప్తోపమాలంకారమున్నదీ.ఒక వేళ రాజు న్యాయముతో ప్రజను రక్షించక ప్రజనుండి కప్పమును గ్రహించుచో, ప్రజల నశించుటతోపాటు రాజును నశించిపోవును. విద్యావినయములచే ప్రజలను చక్కగా రక్షించుచో రాజు ప్రజలు[ఇరువురు] సకలవిధముల వృద్ధిపొందుదురు. ౧౩_౨౮[౨౨]

—০০—

౧౬౩_౨౯ యకోఽసకావిత్యస్య ప్రజాపతి ర్ఋషిః,రాజప్రజే దేవతే,బృహతీ ఛందః,మధ్యమః స్వరః.
పున స్తమేవ విషయ మాహా.
మఱల నా విషయమే.

యకో౽సకౌ శకున్తక ఆహలగితి వఞ్చతి ।

వివక్షత ఇవ తే ముఖ మధ్వర్యో మా న స్త్వమభిభాషథాః ॥౨౩॥

యకః, అసకౌ, శకున్తకః, ఆహలక్, ఇతి, వఞ్చతి, వివక్షత ఇవేతి వివ

క్షతః+ఇవ, తే, ముఖమ్, అధ్వర్యో౽ఇత్యధ్వర్యో,మా,నః, త్వమ్, అభి, భాషథాః॥

పదార్థః:-(యకః)యః(అసకౌ)అసౌ రాజా (శకుంతకః)నిర్బలః పక్షీవ (ఆహలక్)సమం తాద్విలిఖితం యథాస్యా త్తథా(ఇతి) (వఞ్చతి)వంచితో భవతి(వివక్షత ఇవ)వక్తు మిచ్ఛోరివ(తే) తవ(ముఖమ్)ఆస్యమ్(అధ్వర్యో)యో౽ధ్వరమివాచరతి తత్సంబుద్ధౌ(మా)(నః)అస్మాన్(త్వమ్) (అభి)(భాషథాః)వదేః. ॥౨౩॥

అన్వయః:-హే అధ్వర్యో త్వం నో మాభిభాషథా మిథ్యాభాషణం వివక్షత ఇవ తే ముఖం మా భవతు. యద్యేవం యకో౽సకౌ కరిష్యసి తర్హి శకుంతక ఇవ రాజా౽౽హలగితి న వంచతి.

భావార్థః:-అత్ర లుప్తోపమాలంకారః.రాజా కదాచిన్మిథ్యాప్రతిజ్ఞః పరుషవాదీ న స్యాన్న కంచిద్వంచయేత్. యద్యయమన్యాయం కుర్యాత్తర్హి స్వయమపి ప్రజాభి ర్వంచితః స్యాత్.

పదార్థము:- అధ్వర్యో=యజ్ఞమువలె నాచరించు రాజా, త్వమ్=నీవు, నః=మమ్ముల గుఱించి, మా అభిభాషథాః=అసత్యమాడకుము. వివక్షత ఇవ=అవకతవకగా గప్పాలు కొట్టువాని ముఖమువలె, తే ముఖమ్=నీ ముఖము కాకుండును గాక! ఈవిధముగ, యకః అసకౌ=ఏ యీరాజు ప్రగల్భములాడుచో [అతను] శకుంతకః=నిర్బల ఖగమువలె,ఆహలక్=సమూలముగ ఉచ్ఛిన్నుడై నటులగును. ఇతి=ఈ విధముగ, వంచతి =వంచింపబడును. [౨౩]

భావార్థము:- ఈమంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము. రాజు ఎన్నటికి అసత్యప్రతిజ్ఞ యొనర్చువాడుగాని, కటువచనము పలుకువాడుగాని కాగూడదు.ఎవరిని వంచించగూడదు.రాజే అన్యాయమొనరించుచో తానుగూడ ప్రజలవలన వంచించబడును.

---

మాతా చేత్యస్య ప్రజాపతి ర్ఋషిః, భూమి సూర్యౌ దేవతే, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పున స్తమేవ విషయ మాహ.

మఱల నా విషయమే.

మాతా చ తే పితా చ తే౽గ్రం వృక్షస్య రోహతః ।

ప్రతిలామీతి తే పితా గభే ముష్టి మతంసయత్॥ ॥౨౪॥

మాతా, చ తే, పితా, చ, తే, అగ్రమ్, వృక్షస్య, రోహతః, ప్రతిలామి, ఇతి, తే, పితా, గభే, ముష్టిమ్, అతంసయత్॥ ॥౨౪॥

పదార్థః:-(మాతా)పృథివీవ వర్తమానా మాతా(చ) (తే) తవ(పితా)సూర్య ఇవ వర్తమానః పితా(చ)(తే)తవ(అగ్రమ్)ముఖ్యాంశ్రియమ్(వృక్షస్య)వ్రశ్చితుం ఛేత్తుం యోగ్యస్య సంసారాఖ్యస్య రాజ్యస్య(రోహతః)(ప్రతిలామి)స్నిహ్యామి. (ఇతి)(తే) తవ(పితా)(గభే) ప్రజాయామ్(ముష్టిమ్)ముష్ట్యా ధనగ్రాహకం రాజ్యమ్(అతంసయత్)తంసయత్యలంకరోతి. ॥౨౪॥

ఇయం వై మాతాఽసౌ పితా తాభ్యామేవైనం స్వర్గం లోకం గమయత్యగ్రం వృక్షస్య రోహత ఇతి. శ్రీర్వై రాష్ట్రస్యాగ్రఀశ్రియమేవైనఀరాష్ట్రస్యాగ్రం గమయతి ప్రతిలామీతి తే పితా గభే ముష్టి మతఀసయదితి. విడ్ వై గభో రాష్ట్రం ముష్టీ రాష్ట్రమేవావిశ్యాహంతి తస్మాద్ రాష్ట్రీ విశం ఘాతుకః. ॥శ.కాం.౧౩;అ ౨,బ్రాహ్మ,౩,కం.౩.॥

అన్వయః:- హే రాజన్ యది తే పృథివీవ మాతా చ సూర్య ఇవ తే పితా చ వృక్షస్యాగ్రం రోహతః. యది తే పితా గభే ముష్టి మతంసయత్తర్హి ప్రజాజనోఽహం ప్రతిలామీతి.॥౨౪॥

భావార్థః :- యౌ మాతాపితరౌ పృథివీ సూర్య వద్ధైర్యవిద్యా ప్రకాశితౌ న్యాయేన రాజ్యం పాలయిత్వాగ్ర్యాం శ్రియం ప్రాప్య ప్రజా భూషయిత్వా స్వస్య పుత్రం రాజనీత్యా యుక్తం కుర్యాతాం తౌ రాజ్యం కర్తు మర్హేతామ్. ॥౨౪॥

పదార్థము:-ఓరాజా;తే మాతా=పృథివివలె సహనశీలయు గౌరవించునదియు నగు నీ తల్లి, చ=మఱియు, తే పితా=సూర్యునివలె తేజస్వియు, పాలకుడునగు నీతండ్రి, చ=కూడ, వృక్షస్య=ఛేదించ యోగ్యమగు సంసారమను వృక్షరూప రాజ్యముయొక్క, అగ్రమ్=ముఖ్యమగు శ్రీని, శోభను, లక్ష్మిని, రోహతః=ఆరూఢులగుచో, పితా=నీతండ్రి, గభే=ప్రజలలో, ముష్టిమ్=పిడికిలి నిండా ధనము సేకరించబడగలుగు రాజ్యమును, అతంసయత్=ప్రకాశింపచేయుచున్నచో, ఇతి=ఈ విధపు ప్రజనైన నేను, ప్రతిలామి=ఆ రాజును బాగుగ ప్రేమించువాడనయ్యెదను. [౨౪]

భావార్థము:- ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఏ తల్లిదండ్రులు భూమి తరణులవలె ధైర్యవిద్యాప్రకాశకులై న్యాయముతో రాజ్యమును పాలించి,ఉత్తమ శ్రీని,లక్ష్మిని పొంది ప్రజలను సుశోభిత మొనరించి, తన కొడుకును రాజనీతి విజ్ఞునిగా చేయుదురో వారిరువురు రాజ్యమొనర్చుట కర్హులు. [౨౪]

---

మాతా చేత్యస్య ప్రజాపతి ర్ఋషిః, భూమి సూర్యౌ దేవతే, నిచృదనుష్టుప్ ఛందః,గాంధారః స్వరః

పున ర్మాతా పితరౌ కీదృశౌ భవేతా మిత్యాహ.

తల్లిదండ్రు లెటులుండవలయును.

మాతా చ తే పితా చ తేఽగ్రే వృక్షస్య క్రీడతః।

వివక్షత ఇవ తే ముఖం బ్రహ్మన్ మా త్వం వదో బహు॥ ॥౨౫॥

మాతా, చ, తే పితా, చ, తే, అగ్రే, వృక్షస్య, క్రీడతః, వివక్షత ఇవేతి వి+వక్షతః+ఇవ, తే, ముఖమ్, బ్రహ్మన్, మా, త్వమ్, వదః, బహు॥ ॥౨౫॥

పదార్థః:-(మాతా)పృథివీవజ్జననీ(చ)(తే)(పితా) సూర్యవద్వర్తమానః (చ)(తే)(అగ్రే) విద్యారాజలక్ష్మ్యాం(వృక్షస్య)రాజ్యస్యమధ్యే(క్రీడతః)(వివక్షత ఇవ)(తే)తవ)ముఖమ్)(బ్రహ్మన్) చతుర్వేదవిత్ (మా)(త్వమ్)(వదః)వదేః(బహు). ॥౨౫॥

అన్వయః:- హే బ్రహ్మన్ యస్య తే మాతా చ యస్య తే పితా చ వృక్షస్యాగ్రే క్రీడత స్తస్య తే వివక్షత ఇవ యన్ముఖం తేన త్వం బహు మా వదః. ॥౨౫॥

భావార్థః:-యౌ మాతాపితరౌ సుశీలౌ ధర్మాత్మానౌ శ్రీమంతౌ కులీనౌ భవేతాం తాభ్యాం శిక్షిత ఏవం పుత్రో మితభాషీ భూత్వా కీర్తి మాప్నోతి. ॥౨౫॥

పదార్థము:- బ్రహ్మన్=నాలుగు వేదముల నెఱిగిన సజ్జనుడా! తే=సూర్యునితో సమానుడవు తేజస్వివియగు నే నీయొక్క, మాతా చ=పృథివితో సమానమైన తల్లియు, తే పితా చ=ఏ నీయొక్క తండ్రియు, వృక్షస్య=సంసారరూప రాజ్యమునందు, అగ్నే =విద్యారాజ్యముల శోభ యందు, క్రీడతః=రమించుచున్నారో, తే=అట్టి నీ యొక్క, వివక్షత ఇవ=అధికముగ చెప్పగోరు మనుష్యుని ముఖమువలె, ముఖమ్=ముఖమున్నది దానిచే, త్వమ్=నీవు, బహు=ఎక్కువగా, మా వదః=మాటలాడకుము. [౨౫]

భావార్థము:- సుశీలురు, ధర్మాత్ములు, శ్రీమంతులు, కులీనులునగు తల్లిదండ్రుల ద్వారా శిక్షితుడైన పుత్రుడు మితభాషియై కీర్తిని పొందగలుగుచున్నాడు. [౨౫]

---

౧౩౩౨ ఊర్ధ్వ మిత్యస్య ప్రజాపతి ఋషిః, శ్రీర్దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః

పునా రాజపురుషః కాముత్కృష్టాం కుర్యు రిత్యాహ.

మరల రాజపురుషులు ఎవరిని అభివృద్ధిపఱచవలెను.

ఊర్ధ్వా మేనా ముచ్ఛ్రాపయ గిరౌ భారం హరన్నివ।
అథాస్యై మధ్య మేధతాం శీతే వాతే పునన్నివ॥ ॥౨౬॥

ఊర్ధ్వామ్, ఏనామ్, ఉత్, శ్రాపయ, గిరౌ, భారమ్, హరన్నివేతి హరన్+ఇవ, అథ, అస్యై, మధ్యమ్, ఏధతామ్, శీతే, వాతే పునన్నివేతి పునన్+ఇవ॥ ॥౨౬॥

పదార్థః:-(ఊర్ధ్వామ్) ఉత్కృష్టామ్, ఏనామ్=రాజ్యశ్రియా యుక్తాం ప్రజామ్, (ఉత్)

శ్రాపయ = ఊర్ధ్వం నయ, గిరౌ = పర్వతే (భారమ్) (హరన్నివ) (అథ) అస్యై = అస్యాః, (మధ్యమ్) ఏధతామ్ = వర్ధతామ్, (శీతే) వాతే = వాయౌ, పునన్నివ = పృథక్ కుర్వన్నివ. ॥౨౬॥

ఊర్ధ్వమేనా ముచ్ఛ్రాపయేతి. శ్రీర్వై రాష్ట్రమశ్వమేధః శ్రియమేవాస్మై రాష్ట్రమూర్ధ్వ ముచ్ఛ్రయతి, గిరౌ భారꣳ హరన్నివేతి. శ్రీర్వై రాష్ట్రస్య భారః శ్రియమేవాస్మై రాష్ట్రꣳ సంనహ్యత్యథో శ్రియమేవాస్మిన్ రాష్ట్రమధినిదధాతి, అథాస్యై మధ్యమేధతామితి శ్రీర్వై రాష్ట్రస్య మధ్యꣳ శ్రియమేవ రాష్ట్రే మధ్యతోఽన్నాద్యం దదాతి శీతే వాతే పునన్నివేతి, క్షేమో వై రాష్ట్రస్య శీతం క్షేమమేవాస్మై కరోతి. శత. కాం. ౧౩ బ్రా. ౨. కం. ౧, ౨, ౩, ౪.

అన్వయః:- హే రాజన్ త్వం గిరౌ భారం హరన్నివైనామూర్ధ్వా ముచ్ఛ్రాపయ. అథాస్యై మధ్యం ప్రాప్య శీతే వాతే పునన్నివ భవానేధతామ్. ॥౨౬॥

భావార్థః:- అత్రోపమాలంకారః. యథా కశ్చిద్భారవాట్ శిరసి పృష్ఠే వా భారముత్థాప్య గిరి మారుహ్యోపరి స్థాపయేత్తథా రాజా శ్రియ మున్నతిభావం నయేత్. యథా వా కృషీవలా బుసాదిభ్యోఽన్నం పృథక్ కృత్య భుక్త్వా వర్ధంతే, తథా సత్యన్యాయేన సత్యాసత్యే పృథక్ కృత్య న్యాయకారీ రాజా నిత్యం వర్ధతే. ॥౨౬॥

పదార్థము:- ఓ రాజా! గిరౌ=పర్వతము మీదకు, భారమ్=భారమును, హరన్నివ =చేర్చువానివలె, ఏనామ్=ఈ రాజ్యలక్ష్మి యుక్తులు, ఊర్ధ్వామ్=ఉత్తమశ్రేణికి జెందినవారు నగు ప్రజలను, ఉచ్ఛ్రాపయ=సదా అధికాధికముగ నున్నతి పఱచుము. అథ =ఇప్పుడు, అస్యై మధ్యమ్=ఈ ప్రజలయొక్క మధ్యభాగమగు లక్ష్మిని పొంది, శీతే వాతే=శీతలపవనమునందు, పునన్నివ=వ్యవసాయ మొనర్చువాని క్రియచే ధాన్యాదు లెటుల శుద్ధములగునో, పవనయోగముచే జలము లెటుల స్వచ్ఛములగునో అటులనే నీవును, ఏధతామ్=వృద్ధిని పొందుము. [౨౬]

భావార్థము:- ఈ మంత్రమునందు ఉపమాలంకారములు రెండున్నవి. భారవాహకుడెటుల తన తలమీదనో, వీపుమీదనో బరువు నెత్తుకొని పర్వతము నెక్కి యా బరువును పైన స్థాపించుచున్నాడో, అటులనే రాజు లక్ష్మిని ఉన్నతి పఱచవలయును. కర్షకులు ధాన్యమును తప్పతాలునుండి వేఱుజేసి భుజించి వృద్ధియగుచున్నటుల సత్యముచేతను న్యాయముచేతను సత్యాసత్యములను వేఱుపఱచి, న్యాయమొనర్చురాజు నిత్యము వృద్ధిని పొందుచున్నాడు. ౧౩౪౨[౨౬]

---

౦౩౨౭ ఊర్ధ్వమేన మిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, శ్రీర్దేవతా అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః

పున స్తమేవ విషయ మాహ.

మఱల నవ్విషయమే.

ఊర్ధ్వమేన ముచ్ఛ్రయతాద్ గిరౌ భారꣳ హరన్నివ.

అథాస్య మధ్యమేజతు శీతే వాతే పునన్నివ ॥౨౭॥

ఊర్ధ్వమ్, ఏనమ్, ఉత్, శ్రియతాత్, గిరౌ, భారమ్, హరన్నివేతి హరన్+ఇవ, అథ, అస్య, మధ్యమ్, ఏజతు, శీతే, వాతే, పునన్నివేతి పునన్+ఇవ॥ ॥౨౭॥

పదార్థః:- ఊర్ధ్వమ్=అగ్రగామినమ్, ఏనమ్=రాజానమ్, ఉచ్ఛ్రయతాత్=ఉచ్ఛ్రితం కుర్యాత్, గిరౌ=పర్వతే, (భారమ్) (హరన్నివ) (అథ) అస్య=రాష్ట్రస్య(మధ్యమ్)ఏజతు=సత్కర్మసు చేష్టతామ్,(శీతే)(వాతే)(పునన్నివ). ॥౨౭॥

అన్వయః:- హే ప్రజా విద్వన్ భవాన్ గిరౌ భారం హరన్నివైనం రాజాన మూర్ధ్వ ముచ్ఛ్రయతాత్. అథాస్య మధ్యం ప్రాప్య శీతే వాతే పునన్నివైజతు. ॥౨౭॥

భావార్థః:- అత్రోపమాలంకారౌ. యథా సూర్యో మేఘమండలే జలభారం నీత్వా వర్ష యిత్వా సర్వానున్నయతి తథైవ ప్రజా రాజపురుషానున్నయే దధర్మాచరణాద్భిభియాచ్చ.

పదార్థము:- ప్రజాస్థవిద్వాంసుడా! నీవు, గిరౌ భారమ్ వహన్నివ=పర్వతము మీదకు భారమును చేర్చువానివలె, ఏనమ్=ఈరాజును, ఊర్ధ్వమ్=సకల వ్యవహారము లందు అగ్రగామిగ, ఉచ్ఛ్రయతాత్=ఉన్నతి యుక్తునిగ నొనర్చుము, అథ=దీని తర్వాత, అస్య మధ్యమ్=ఈ రాజ్యపు మధ్యభాగమగు లక్ష్మిని పొంది, శీతే వాతే=శీతలవాయువునందు, పునన్నివ=శుద్ధములగుచున్న అన్నాదులవలె, ఏజతు=ఉత్తమ కర్మలందు చేష్టలొనర్చుచుండుము. [౨౭]

భావార్థము:- ఈ మంత్రము నందుపమాలంకారములు రెండున్నవి. సూర్యుడు మేఘమండలమునకు జలమును చేర్పించి యటనుండి వర్షింపజేసి యందఱిని అభివృద్ధి పఱచుచున్నటులనే ప్రజలు రాజ పురుషులను వృద్ధిపఱచవలయును. అధర్మాచరణము నకు వెఱవవలయును. ౧౩౩౩[౨౭]

---

యదస్యా ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ప్రజాపతి ర్దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయ మాహ

మఱల నా విషయమే

యదస్యా౽అꣳహుభేద్యాః కృధు స్థూలముపాతసత్।
ముష్కావిదస్యా ఏజతో గోశఫే శకులావివ॥ ॥౨౮॥

యత్, అస్యాః, అꣳహుభేద్యా ఇత్యꣳహు+భేద్యాః,కృధు,స్థూలమ్,ఉపాతసదిత్యుప+అతసత్, ముష్కౌ, ఇత్, అస్యాః, ఏజతః, గోశఫ ఇతి గో+శఫే,

[శ్రాపయ=ఊర్ధ్వం నయ, గిరౌ=పర్వతే(భారమ్)(హరన్నివ)(అథ)అస్యై=అస్యాః, (మధ్యమ్) ఏధతామ్=వర్ధతామ్,(శీతే)వాతే=వాయౌ,పునన్నివ=పృథక్ కుర్వన్నివ. ॥౨౮॥

ఊర్ధ్వమేనా ముచ్ఛ్రాపయేతి.శ్రీర్వై రాష్ట్రం మశ్వమేధః శ్రియమేవాస్మై రాష్ట్రమూర్ధ్వ ముచ్ఛ్రయతి,గిరౌ భారఀ హరన్నివేతి.శ్రీర్వై రాష్ట్రస్య భారః శ్రియమేవాస్మై రాష్ట్రఀ సంనహ్యత్యథో శ్రియమేవాస్మిన్ రాష్ట్రమధినిదధాతి,అథాస్యై మధ్యమేధతామితి శ్రీర్వై రాష్ట్రస్య మధ్యఀ శ్రియమేవ రాష్ట్రే మధ్యతోఽన్నాద్యం దదాతి శీతే వాతే పునన్నివేతి, క్షేమో వై రాష్ట్రస్య శీతం క్షేమమేవాస్మై కరోతి.శత.కాం.౩బ్రా.౩.కం.౧,౨,౩,౪.

అన్వయః:- హే రాజన్ త్వం గిరౌ భారం హరన్నివైనామూర్ధ్వా ముచ్ఛ్రాపయ.అథాస్యై మధ్యం ప్రాప్య శీతే వాతే పునన్నివ భవానేధతామ్. ॥౨౮॥

భావార్థః:-అత్రోపమాలంకారః.యథాకశ్చిద్భారవాట్ శిరసి పృష్ఠే వా భారముత్థాప్య గిరి మారుహ్యోపరి స్థాపయేత్తథా రాజా శ్రియ మున్నతిభావం నయేత్. యథా వా కృషీవలా బుసాదిభ్యోఽన్నం పృథక్ కృత్య భుక్త్వా వర్ధంతే, తథా సత్యన్యాయేన సత్యాసత్యే పృథక్ కృత్య న్యాయకారీ రాజా నిత్యం వర్ధతే. ॥౨౮॥

పదార్థము:- ఓ రాజా! గిరౌ=పర్వతము మీదకు, భారమ్=భారమును, హరన్నివ=చేర్చువానివలె, ఏనామ్=ఈ రాజ్యలక్ష్మి యుక్తులు, ఊర్ధ్వామ్=ఉత్తమశ్రేణికి జెందినవారు నగు ప్రజలను, ఉచ్ఛ్రాపయ=సదా అధికాధికముగ నున్నతి పఱచుము. అథ=ఇప్పుడు, అస్యై మధ్యమ్=ఈ ప్రజలయొక్క మధ్యభాగమగు లక్ష్మిని పొంది, శీతే వాతే=శీతలపవనమునందు, పునన్నివ=వ్యవసాయ మొనర్చువాని క్రియచే ధాన్యాదులెటుల శుద్ధములగునో, పవనయోగముచే జలములెటుల స్వచ్ఛములగునో అటులనే నీవును, ఏధతామ్=వృద్ధిని పొందుము. [౨౮]

భావార్థము:- ఈ మంత్రమునందు ఉపమాలంకారములు రెండున్నవి. భారవాహకుడెటుల తన తలమీదనో, వీపుమీదనో బరువు నెత్తుకొని పర్వతము నెక్కి యా బరువును పైన స్థాపించుచున్నాడో, అటులనే రాజు లక్ష్మిని ఉన్నతి పఱచవలయును. కర్షకులు ధాన్యమును తప్పుతాలునుండి వేఱుజేసి భుజించి వృద్ధియగుచున్నటుల సత్యముచేతను న్యాయముచేతను సత్యాసత్యములను వేఱుపఱచి, న్యాయమొనర్చురాజు నిత్యము వృద్ధిని పొందుచున్నాడు. ౧౩౪౨[౨౮]

---

౧౩౪౩ ఊర్ధ్వమేన మిత్యస్య ప్రజాపతి ఋషిః, శ్రీర్దేవతా అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః

పున స్తమేవ విషయ మాహ.

మఱల నవ్విషయమే.

**ఊర్ధ్వమేన ముచ్ఛ్రయతాద్ గిరౌ భారఀ హరన్నివ**

అథాస్య మధ్యమేజతు శీతే వాతే పునన్నివ ॥౨౩॥

ఊర్ధ్వమ్, ఏనమ్, ఉత్, శ్రియతాత్, గిరౌ, భారమ్, హరన్నివేతి హరన్+ఇవ, అథ, అస్య, మధ్యమ్, ఏజతు, శీతే, వాతే, పునన్నివేతి పునన్+ఇవ॥ ॥౨౭॥

పదార్థః:-ఊర్ధ్వమ్=అగ్రగామినమ్, ఏనమ్=రాజానమ్, ఉచ్ఛ్రయతాత్=ఉచ్ఛ్రితం కుర్యాత్, గిరౌ=పర్వతే, (భారమ్) (హరన్నివ) (అథ) అస్య=రాష్ట్రస్య(మధ్యమ్)ఏజతు=సత్కర్మసు చేష్టతామ్,(శీతే)(వాతే)(పునన్నివ). ॥౨౭॥

అన్వయః:-హే ప్రజా విద్వన్ భవాన్ గిరౌ భారం హరన్నివైనం రాజాన మూర్ధ్వ ముచ్ఛ్రయతాత్.అథాస్య మధ్యం ప్రాప్య శీతే వాతే పునన్నివైజతు. ॥౨౭॥

భావార్థః:-అత్రోపమాలంకారౌ. యథా సూర్యో మేఘమండలే జలభారం నీత్వా వర్ష యిత్వా సర్వానున్నయతి తథైవ ప్రజా రాజపురుషానున్నయే దధర్మాచరణాద్బిభీయాచ్చ.

పదార్థము:- ప్రజాస్థవిద్వాంసుడా! నీవు, గిరౌ భారమ్ వహన్నివ=పర్వతము మీదకు భారమును చేర్చువానివలె, ఏనమ్=ఈరాజును, ఊర్ధ్వమ్=సకల వ్యవహారము లందు అగ్రగామిగ, ఉచ్ఛ్రయతాత్=ఉన్నతి యుక్తునిగ నొనర్చుము, అథ=దీని తర్వాత, అస్య మధ్యమ్=ఈ రాజ్యపు మధ్యభాగమగు లక్ష్మిని పొంది, శీతే వాతే=శీతలవాయువునందు, పునన్నివ=శుద్ధములగుచున్న అన్నాదులవలె, ఏజతు=ఉత్తమ కర్మలందు చేష్టలొనర్చుచుండుము. [౨౭]

భావార్థము:- ఈ మంత్రము నందుపమాలంకారములు రెండున్నవి. సూర్యుడు మేఘమండలమునకు జలమును చేర్పించి యటనుండి వర్షింపజేసి యందఱిని అభివృద్ధి పఱచుచున్నటులనే ప్రజలు రాజ పురుషులను వృద్ధిపఱచవలయును. అధర్మాచరణము నకు వెఱవవలయును. ౧౩౩౩[౨౭]

---

యదస్యా ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ప్రజాపతి ర్దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయ మాహ

మఱల నా విషయమే

యదస్యాऽఅꣳహుభేద్యాః క్రృధు స్థూలముపాతసత్।

ముష్కావిదస్యా ఏజతో గోశఫే శకులావివ॥ ॥౨౮॥

యత్, అస్యాః, అꣳహుభేద్యా ఇత్యꣳహు+భేద్యాః,క్రృధు,స్థూలమ్,ఉపాతసదిత్యుప+అతసత్, ముష్కౌ, ఇత్, అస్యాః, ఏజతః, గోశఫ ఇతి గో+శఫే,

శకులా విదేతి శకులౌ+ఇవ॥ ॥౨౮॥

పదార్థః:-యత్ = యః, అస్యాః = ప్రజాయాః, అంహుభేద్యాః = అంహుమపరాధం యా భినత్తి తస్యాః,కృధు = హ్రస్వమ్,కృధ్వితి హ్రస్వ నామ...౩ ౨.స్థూలమ్=మహత్ కర్మ, ఉపాతసత్ = ఉపఘూపయేత్(ముష్కౌ)మూషకౌ,ఇత్ = ఏవ. (అస్యాః) ఏజతః = కంపయతః గోశఫే= గోఖురచిహ్నే,శకులావివ= హ్రస్వౌ మత్స్యావివ. ॥౨౮॥

అన్వయః:-యద్యో రాజా రాజపురుషశ్చాస్యా అంహుభేద్యాః కృధు స్థూలం కర్మోపాతసత్తావస్యా ఏజతో గోశఫే శకులావివ ముష్కావిదేజతః. ॥౨౮॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యథా ప్రీతిమంతౌ మత్స్యావల్పేఽపి జలాశయే నివసత స్తథా రాజరాజపురుషావల్పేఽపి కరలాభే న్యాయేన ప్రీత్యా వర్తేయాతాం, యది దుఃఖచ్ఛేదికాయాః ప్రజాయాః స్వల్పమహదుత్తమం కర్మ ప్రశంసయేతాం తర్హి తౌ ప్రజా ఉపరక్తాః కృత్వా స్వవిషయే ప్రీతిం కారయేతామ్. ॥౨౮॥

పదార్థము:- యత్=ఏరాజు, లేక రాజపురుషుడు, అస్యాః అంహుభేద్యాః=అపరాధముల వినాశనమొనరించు ఈ ప్రజల యొక్క, కృధు=సూక్ష్మ కర్మను,స్థూలమ్=గొప్ప కర్మను, ఉపాతసత్=సుశోభిత మొనరించునో, ఆయిరువురు, అస్యాః=ఇతనిచే, ఏజతః=కర్మచేయించుచున్నారు. మఱియు వారు స్వయముగా, గోశఫే=ఆవు గిట్టచే భూమిమీద నేర్పడిన గుంటలోని, శకులావివ=రెండు చిన్న చేపలవలె, ముష్కౌ=ప్రజల నుండి పొందిన కరమును దొంగిలించుచు కంపితులగుదురు. [౨౮]

భావార్థము:- ఈ మంత్రమునందు ఉపమాలంకారమున్నది. ఒకదానితో నొకటి ప్రేమించుకొను చేపలు చిన్నచిన్న గుంటలలోను జలాశయములందును వసించున్నటుల రాజు, రాజపురుషులు అల్పకరము పొందినప్పటికిని న్యాయపూర్వకముగ ప్రీతితో ప్రవర్తించవలయును.దుఃఖములను తొలగించు ప్రజల అల్పకర్మనే గాని, గొప్ప కర్మనే గాని ప్రశంసించు వారగుచో వా రిరువురు ప్రజలను ప్రసన్నులుగా నొనర్చి తమ విషయము నందును వారికి ప్రీతి జనింప జేయువారగుదురు. ౧౩౩౪[౨౮]

---

యద్దేవాస ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, విద్వాంసో దేవతాః, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః

పున స్తమేవ విషయ మాహ.

మఱల విషయ మయ్యదియే.

యద్దేవాసో లలామగుం ప్రవిష్టీమిన మావిషుః సక్థ్నా దేదిశ్యతే నారీ సత్యస్యాక్షిభువో యథా॥ ॥౨౯॥

యత్, దేవాసః, లలామ గుమితి లలామ+గుమ్, ప్ర, విష్టిమినమ్,ఆవిషుః,

సక్థ్నా, దేదిశ్యతే, నారీ, సత్యస్య, అక్షిభువ ఇత్యక్షి+భువః, యథా॥ ॥౨౯॥

పదార్థః:-యత్=యమ్,దేవాసః=విద్వాంసః,లలామగుమ్=యేన న్యాయేనేప్సాం గచ్ఛంతి ప్రాప్నువంతి తమ్,(ప్ర)విష్టిమినమ్=విశిష్టా బహవః ష్టిమా ఆర్ద్రీభూతాః పదార్థా విద్యంతే యస్మిం స్తమ్, ఆవిషుః=వ్యాప్నుయుః, సక్థ్నా=శరీరావయవేన,దేదిశ్యతే=భృశ ముపదిశ్యేత,నారీ=నరస్య స్త్రీ,(సత్యస్య)(అక్షిభువః)యదక్షిణి భవతి ప్రత్యక్షం తస్య,(యథా).

అన్వయః:- హే రాజన్!యథా సత్యస్యాక్షిభువో మధ్యే వర్తమానా దేవాసః సక్థ్నా నారీవ యద్విష్టిమినం లలామగుం న్యాయం ప్రావిషు ర్యథా చాఽప్తేన సత్యమేవ దేదిశ్యతే తథా త్వమాచర. ॥౨౯॥

భావార్థః:- అత్రోపమాలంకారః. యథా శరీరాంగైః స్త్రీపురుషౌ లక్ష్యేతే తథా ప్రత్యక్షాదిప్రమాణైః సత్యం లక్ష్యతే.తేన సత్యేన విద్వాంసో యథా ప్రాప్తవ్య మార్ద్రీభావం ప్రాప్నుయు స్తథేతరే రాజప్రజాస్థాః స్త్రీపురుషా విద్యయా వినయం ప్రాప్య సుఖ మన్విచ్ఛంతు.

పదార్థము:- ఓరాజా! యథా=ఎటుల, సత్యస్య=సత్యమును, అక్షిభువః=కండ్ల యెదుట ప్రకటితమునగు ప్రత్యక్ష వ్యవహారము మధ్య వ్యవహరించు, దేవాసః=విద్వాంసులు,సక్థ్నా=తొడచే లేక స్వశరీరాంగముచే, నారీ=స్త్రీవలె,విష్టిమినమ్=సుందరమును ఆర్ద్రమునగు పదార్థములు గలదియు,లలామగుమ్=మనోవాంఛిత ఫలములను లభింప జేయునదియునగు, యత్=ఏ న్యాయమును,ప్రావిషుః=పొందుదురో, శాస్త్రవేత్తలగు విద్వాంసులెటుల సత్యమును, దేదిశ్యతే=నిరంత ముపదేశించుదురో, అటులనే మీరును ఆచరించుడు. [౨౯]

భావార్థము:-ఈ మంత్రము నందుపమాలంకారము గలదు.శరీరాంగములచే స్త్రీ పురుషులు లక్షింపబడు చున్నటులుగనే ప్రత్యక్షాది ప్రమాణములచే సత్యము లక్షింప బడుచున్నది.ఆ సత్యముచే విద్వాంసులు పొందనగు కోమలత్వమును ఎటుల పొందెదరో అటులనే రాజుకు ప్రజలకు సంబంధించిన స్త్రీ పురుషులు విద్యచే వినయమును పొంది సుఖమును కోరుదురుగాక ! ౧౩౩౫[౨౯]

---

౧౩౩౬ యద్ధరిణ ఇత్యస్య ప్రజాపతి ఋషిః, రాజా దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః

పునః రాజా కథ మాచరే దిత్యాహ

ఆ రాజెటుల ఆచరించవలయును ?

యద్ధరిణో యవమత్తి న పుష్టం పశు మన్యతే ।

శూద్రా యదర్యజారా న పోషాయ ధనాయతి ॥ ॥౩౦॥

యత్, హరిణః, యవమ్, అత్తి, న, పుష్టమ్, పశు, మన్యతే,శూద్రా, యత్,
అర్యజారేత్యర్య+జారా,న, పోషాయ, ధనాయతి॥ ॥౩౦॥

పదార్థః-యత్ = యః, హరిణః = పశుః, (యవమ్)(అత్తి)(న)(పుష్టమ్) పశు = పశుమ్, (మన్యతే) శుద్రా = శూద్రస్య స్త్రీ,యత్ = యా,అర్యజారా అర్యో స్వామివైశ్యో జారయతి వయసా హంతి సా,న = నిషేధే,పోషాయ = పుష్టయే, ధనాయతి = ఆత్మనో ధనమిచ్ఛతి. ॥౩౦॥

అన్వయః-యత్ యో రాజా హరిణో యవమత్తీవ పుష్టం పశు న మన్యతే స యద్యర్య జారా శూద్రేవ పోషాయ న ధనాయతి. ॥౩౦॥

భావార్థః-యో రాజా పశువద్వ్యభిచారే వర్తమానః ప్రజాపుష్టిం న కరోతి.స ధనాఢ్యా శూద్రా రాజా దాసీవ సద్యో రోగీ భూత్వా పుష్టిం వినాశ్య ధనహీనతయా దరిద్రః సన్ మ్రియతే. తస్మాద్రాజా కదాచిదీర్ష్యాం వ్యభిచారం చ నాచరేత్. ॥౩౦॥

పదార్థము:-యత్=ఏరాజు, హరిణః=హరిణము ఎటుల, యవమ్=పొలములో మొలచిన యవాదిసస్యములను,అత్తి=తినుచున్నదో,అటులనే,పుష్టమ్=పుష్టమైన,పశుమ్= చూడదగిన తన ప్రజను హృష్టపుష్టులుగా నుండుటచూచి, యత్=ఎవడు,న మన్యతే= [సంతసించక]తినునో, అతను, యత్ అర్యజారా=యజమానుని, లేక వైశ్యుని[వడుచు తనపు]వయస్సునుండి వృద్ధులుగా నొనర్చు,శూద్రా=దాసియైనశూద్రస్త్రీవలె,పోషాయ =పుష్టికొఱకు,న=కాదు ధనాయతి=[కేవలము] తనకొఱకే ధనమును వాంఛించు వాడగును. [౩౦]

భావార్థము:-ఏరాజు పశువువలె వ్యభిచారమునందురతుడై ప్రజలను బలపఱచడో వాడు ధనాఢ్యురాలయ్యును జారకర్మయొనరించుచు దాసియై చరించు శూద్రకులస్త్రీ వలె శీఘ్రముగ రోగియై తన బలమును పోగొట్టుకొని, ధనాభావముచే దరిద్రుడై చని పోవును.కావున రాజు ఎన్నటికి ఈర్ష్యనుగాని,వ్యభిచారమును గాని ఆచరించగూడదు.

---

౧౩౩౭ యద్ధరిణ ఇత్యస్య ప్రజాపతి ఋషిః, రాజప్రజే దేవతే, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః
పునః స రాజా కేన హేతునా నశ్యతీత్యాహ
ఆ రాజేకారణముచే నశించిపోవును?

యద్ధరిణో యవమత్తి న పుష్టం బహు మన్యతే ।
శూద్రో యదర్యాయై జారో న పోష మనుమన్యతే ॥

యత్, హరిణః, యవమ్, అత్తి, న, పుష్టమ్, బహు, మన్యతే, శూద్రః

యత్, అర్యాయై, జారః, న, పోషమ్, అను, మన్యతే॥ ॥౩౦॥

పదార్థః:-(యత్)యః,(హారిణః)(యవమ్)(అత్తి)భక్షయతి. (న) (పుష్టమ్) ప్రజాజనమ్ (బహు)అధికమ్(మన్యతే)జానాతి(శూద్రః)మూర్ఖకులోత్పన్నః(యత్) యః (అర్యాయై) అర్యాయాః స్వామినో వైశ్యస్య వా స్త్రియాః (జారః) వ్యభిచారేణ వయో హంతా (న) నిషేధే (పోషమ్)పుష్టిమ్(అను)(మన్యతే). ॥౩౦॥

అన్వయః : యద్యః శూద్రోఽర్యాయై జారో భవతి న యథా పోషం నాఽనుమన్యతే యత్ యో రాజా హారిణో యవమత్తీవ పుష్టం ప్రజాజనం బహు న మన్యతే. స సర్వతః క్షీణో జాయతే. ॥౩౦॥

భావార్థః: అత్ర వాచక లుప్తోపమాలంకారః. యది రాజా రాజపురుషాశ్చ పరస్త్రీ వేశ్యాగమనాయ పశువద్వర్తంతే తాన్ సర్వే విద్వాంసః శూద్రానివ జానంతి. యథా శూద్ర అర్యకులే జారో భూత్వా సర్వాన్ సంకరయతి తథా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యాః శూద్రకులే వ్యభిచారం కృత్వా వర్ణసంకరనిమిత్తా భూత్వా నశ్యంతి. ॥౩౦॥

పదార్థము:-యత్ శూద్రః=మూర్ఖులకులములో పుట్టిన ఏ మూఢుడు,అర్యాయై =స్వస్వామి భార్యతోనో లేక వైశ్య స్త్రీతోనో, జారః=వ్యభిచరించి తన ఆయువును క్షీణింప జేసుకొనుచున్నాడో,అతడు ఎటుల,పోషమ్=బలమును,పుష్టిని,న అనుమన్యతే= అనుమానమొనర్చజాలడో,లేక,యత్=ఏరాజు, హారిణః=మృగము, యవమ్=మొలచిన యవాదిసస్యములను తినుచున్నటుల,పుష్టమ్=ధనసంతాన స్త్రీసుఖైశ్వర్యములచే పుష్టమైయున్న తన ప్రజను,బహు న మన్యతే=అధికముగా భావించడో,ఆరాజు అన్నివిధముల క్షీణించి నశించిపోవును. [౩౦]

భావార్థము:-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఏ రాజు లేక రాజపురుషులు పరస్త్రీ వేశ్యాగమనములకై పశువులవలె వ్యవహరించుదురో వారిని విద్వాంసులు శూద్రతుల్యులుగా నెంచెదరు.ఎటుల మూర్ఖశూద్రుడు శ్రేష్ఠకులములందు వ్యభిచరించి యందరిని వర్ణసంకరమొనర్చు వాడగునో అటులనే బ్రాహ్మణక్షత్రియ వైశ్యులును శూద్రకులముతో వ్యభిచరించి వర్ణసంకరమునకు కారకులై నశించిపోవుచున్నారు.



౧౩౩౨ దధిక్రావ్ణ ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః,రాజా దేవతా,అనుష్టుప్ ఛందః,గాంధారః స్వరః.

పునః స రాజా కస్యేవ కిం వర్ధయేదిత్యాహ.

ఆరాజు ఎవరివలె దేనినభివృద్ధిపఱచవలయును ?

దధిక్రావ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః।

సురభి నో ముఖా కరత్ ప్ర ణ ఆయూంషి తారిషత్॥ ॥౩౨॥

దధిక్రావ్ణ ఇతి దధి+క్రావ్ణః, అకారిషమ్, జిష్ణోః, అశ్వస్య, వాజినః,సురభి, నః, ముఖా, కరత్, ప్రవః, అయూంషి, తారిషత్॥ ॥౩౨॥

పదార్థః:-(దధిక్రావ్ణః)యో దధీన్ పోషకాన్ ధారకాన్ వా క్రామ్యతి తస్య, (అకారిషమ్)కుర్యామ్(జిష్ణోః)జయశీలస్య(అశ్వస్య)ఆశుగామినః(వాజినః)బహువేగవతః,(సురభి)ప్రశస్త సుగంధియుతాని,(నః)అస్మాకమ్, (ముఖా)ముఖాని, (కరత్)కుర్యాత్, (ప్ర) (నః) (అస్మాకమ్) (ఆయూంషి)(తారిషత్)సంతారయేత్. ॥౩౨॥

అన్వయః:- హేరాజన్ యథాఽహం దధిక్రావ్ణో వాజినో జిష్ణోరశ్వస్యేవ వీర్యమకారిషం తథా భవాన్ నః సురభి ముఖేవ వీర్యం ప్రకరన్న ఆయూంషి తారిషత్. ॥౩౨॥

భావార్థః:-యథాఽశ్వశిక్షకా అశ్వాన్ వీర్యరక్షణనియమేన బలిష్ఠాన్ సంగ్రామే విజయ నిమిత్తాన్ కుర్వంతి తథైవాధ్యాపకోపదేశకాః కుమారాన్ కుమారీంశ్చ పూర్ణేన బ్రహ్మచర్య సేవనేన విద్యాయుక్తాన్ విదుషీశ్చ కృత్వా శరీరాత్మబలాయ ప్రవర్త్య దీర్ఘాయుషో యుద్ధ శాలీనాన్ సంపాదయేయుః. ॥౩౨॥

పదార్థము:—ఓ రాజా ! నేనెటుల, దధిక్రావ్ణః=ధరించు వారికి, పోషించు వారికి లభించునది, వాజినః=అధిక వేగముగలది, జిష్ణోః=జయించునది, అశ్వస్య=శీఘ్రగమనము గలదియునగు గుఱ్ఱమువలె పరాక్రమమును,అకారిషమ్=చేయుదునో,అటులనే నీవు,నః= మాయొక్క,సురభి=సుగంధి యుక్తములైన,ముఖా=ముఖములవలె పరాక్రమమును, ప్ర కరత్=అభివృద్ధిపఱచుము.నః=మాయొక్క,అయూంషి=ఆయువులను,తారిషత్= వాని యవధులకు చేర్చుము. [౩౨]

భావార్థము:-అశ్వశిక్షకులెటుల హయములను పరాక్రమరక్షణ నియమములచే బలిష్ఠములుగను, సంగ్రామమునందు విజయము చేకూర్చునవిగను నొనర్చుచున్నారో, అటులనే అధ్యాపకోపదేశకులు బాలబాలికలను పూర్ణబ్రహ్మచర్య సేవనముచే విద్వాం సులుగాను, విదుషీమణులుగాను చేసి వారిని శరీరాత్మబలములకై ప్రవృత్తులుగ నొనర్చి దీర్ఘాయుష్మంతులుగాను,యుద్ధవిద్యాకుశలులుగాను ఒనర్చెదరు గాక! ౧౩౩౮[౩౨]

---

౧౨౩౯ గాయత్రీత్యస్య ప్రజాపతి ర్ఋషిః,విద్వాంసో దేవతాః,ఉష్ణిక్ ఛందః,ఋషభః, స్వరః.

పున స్తమేవ విషయ మాహ.

మఱల నా విషయమే.

గాయత్రీ త్రిష్టుబ్జగత్యనుష్టుప్పఙ్క్త్యా సహ।
బృహత్యుష్ణిహా కకుప్సూచీభిః శమ్యన్తు త్వా॥ ॥౩౩॥

గాయత్రీ, త్రిష్టుప్, త్రిష్టుబితి త్రి+స్తుప్,జగతీ,అనుష్టుప్,అనుష్టుబిత్యను

+స్తుప్, పంక్త్యా, సహ, బృహతీ ఉష్ణిహా, కకుప్, సూచీభిః, శమ్యన్తు, త్వా ॥౩౩॥

పదార్థః:-(గాయత్రీ)గాయంతం త్రాయమాణా (త్రిష్టుప్) యాఽధ్యాత్మికాధిభౌతికాధిదైవికాని త్రీణి సుఖాని స్తోభతే స్తభ్నాని సా(జగతీ)జగద్వద్వి స్తీర్ణా (అనుష్టుప్) యయాఽనుష్టోభతే సా,(పంక్త్యా)వి స్తృతయా క్రియయా,(సహ)(బృహతీ)మహదర్థా,(ఉష్ణిహా)యయా ఉషః స్నిహ్యాతితయా,(కకుప్)లాలిత్యయుక్తా,(సూచీభిః)సీవన సాధికాభిః,(శమ్యంతు)(త్వా) త్వామ్,

అన్వయః:- హే విద్వన్ యే విద్వాంసః పంక్త్యా సహ గాయత్రీ త్రిష్టుబ్జగత్యనుష్టుబుష్ణిహా సహ బృహతీ కకుప్సూచీభి రివ త్వా త్వాం శమ్యంతు. తాం స్త్వం సేవస్వ. ॥౩౩॥

భావార్థః :- యే విద్వాంసో గాయత్ర్యాదిఛందోఽర్థవిజ్ఞాపనేన మనుష్యాన్ విదుషః కుర్వంతి సూచ్యా ఛిన్నం వస్త్రమివ భిన్నమతా న్యనుసందధత్యైకమత్యే స్థాపయంతి తే జగత్కల్యాణకారకా భవంతి. ॥౩౩॥

పదార్థము:-ఓ విద్వాంసుడా ! ఏ విద్వాంసులు,పంక్త్యా సహ=విస్తారయుక్తమగు పంక్తి ఛందస్సుతోపాటు, గాయత్రీ=పాటపాడు వానిని రక్షించుగాయత్రి, త్రిష్టుప్=ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవికములగు త్రివిధ దుఃఖములను నివారించు త్రిష్టుప్, జగతీ=జగత్తువలె విస్తీర్ణముగ వ్యాపించు జగతీ ఛందస్సు, అనుష్టుప్=వెనుకనుండి సంసార దుఃములను స్తంభింపజేయు అనుష్టుప్పు, ఉష్ణిహా=ఉషఃకాలమును లభింపజేయు ఉష్ణిక్కు [ఈ ఛందస్సు] తోపాటు, బృహత్=గంభీరాశయముగల బృహతి,కకుప్=లలితపదముల యర్థముతో యుక్తమైన కకుప్ఛందస్సు[తో],సూచీభిః=సూదులచే వస్త్రము కుట్టబడునటుల,త్వా=నిన్ను,శమ్యంతు=శాంతియుక్తులుగ నొనర్చుదురో,సకల విద్యలను బోధగఅపుదురో వారిని నీవు సేవించుము. [౩౩]

భావార్థము:- ఏ విద్వాంసులు గాయత్ర్యాది ఛందస్సుల అర్థమును విప్పిజెప్పి మానవులను విద్వాంసులుగ నొనర్చెదరో,మఱియు సూది చినిగిపోయిన గుడ్డలను కుట్టినటుల భిన్న భిన్న మతములను సత్యమునందు కలిపివేసి వారినందఱిని [సత్యమైన] ఏకమతమునందు స్థాపించుచున్నారో వారు జగత్తునకు కళ్యాణము సమకూర్చు వారగుచున్నారు. ౧౩౩౯[౩౩]

---

౧౩౪ం ద్విపదా ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ప్రజా దేవతాః, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః

పునర్విద్వాంసః కిం కుర్యు రిత్యాహ

విద్వాంసు లేమి యొనర్చుదురు?

ద్విపదా యా శ్చతుష్పదా స్త్రిపదా యాశ్చ షట్పదాః।
విచ్ఛన్దా యాశ్చ సచ్ఛన్దాః సూచీభిః శమ్యన్తు త్వా॥ ॥౩౪॥

ద్విపదా ఇతి ద్వి+పదాః, యాః, చతుష్పదా ఇతి చతుః+పదాః, త్రిపదా ఇతి త్రి+పదాః, యాః, చ, షట్పదా ఇతి షట్+పదాః, విచ్ఛన్దా ఇతి వి+ఛన్దాః, యాః, చ, సచ్ఛన్దా ఇతి సచ్ఛన్దాః, సూచీభిః, శమ్యన్తు, త్వా ॥౩౪॥

పదార్థః:-(ద్విపదాః)ద్వే పదే యాసు తాః(యాః)(చతుష్పదాః)చత్వారి పదానియాసు తాః,(త్రిపదాః)త్రీణి పదాని యాసు తాః(యాః) (చ) (షట్పదాః) షట్పదాని యాసు తాః, (విచ్ఛందాః)వివిధాని ఛందాంస్యూర్జనాని యాసు తాః (యాః) (చ) (సచ్ఛందాః) సమానాని ఛందాంసి యాసు తాః,(సూచీభిః)అనుసంధాన సాధికాభిః,క్రియాభిః,(శమ్యన్తు)(త్వా) ॥౩౪॥

అన్వయః :- యే విద్వాంసః సూచీభిర్యా ద్విపదా యా శ్చతుష్పదా యా స్త్రిపదా యాశ్చ షట్పదా యా విచ్ఛందా యాశ్చ సచ్ఛందా స్త్వాం గ్రాహయిత్వా శమ్యంతు శమం ప్రాపయంతు తాన్ నిత్యం సేవస్వ. ॥౩౪॥

భావార్థః:-యే విద్వాంసో మనుష్యాన్ బ్రహ్మచర్యనియమేన వీర్యవృద్ధిం ప్రాపయ్యారోగాన్ జితేంద్రియాన్ విషయాసక్తివిరహాన్ కృత్వా ధర్మ్యే వ్యవహారే చాలయంతి తే సర్వేషాం పూజ్యా భవంతి. ॥౩౪॥

పదార్థము,- ఏ విద్వాంసులు, సూచీభిః=సంధులను కలిపివేయు క్రియలచే, ద్విపదాః=రెండు పాదములు గలవియు, చతుష్పదాః=నాలుగుపాదములు గలవియు త్రిపదాః=మూడుపాదములు గలవియు, యాః=ఏవియున్నవో, షట్పదాః=ఆరు పాదములు గలవియు, విచ్ఛందాః=అనేకవిధముల పరాక్రమము గలవియు, యాః=ఏవియున్నవో, చ=మఱియు, సచ్ఛందాః=ఒకేవిధమైన ఛందస్సులు గలవి, యాః=ఏవియున్నవో,ఆయా క్రియలను, త్వా=నీకు గ్రహింపజేసి, శమ్యంతు=శాంతిసుఖములను లభింపజేయు చున్నారో,వారిని నిత్యము సేవించుము. [౩౪]

భావార్థము:-ఏ విద్వాంసులు మానవులను బ్రహ్మచర్యనియమముచే వీర్యవృద్ధిని కలిగించి, నీరోగులుగను, జితేంద్రియులుగను, విషయాసక్తి రహితులుగను ఒనర్చి ధర్మయుక్త వ్యవహారమునందు నడపుచున్నారో వారందఱికి పూజ్యులు, సత్కరించుటకు తగినవారు నగుచున్నారు. ౧౩౩౦[౩౪]

---

౧౩౪౦ మహానామ్న్య ఇత్యస్య ప్రజాపతి ఋషిః,ప్రజా దేవతా భురిగుష్ణిక్ ఛందః,ఋషభః స్వరః.
పునర్విద్వాంసః కీదృశా భవేయు రిత్యాహ.

విద్వాంసు లెటులుండవలయును ?

మహానామ్న్యో రేవత్యో విశ్వా ఆశాః ప్రభూవరీః।
మైఘీ ర్విద్యుతో వాచః సూచీభిః శమ్యన్తు త్వా ॥౩౫॥

మహోనామ్న్య ఇతి మహా+నామ్న్యః, రేవత్యః, విశ్వాః, ఆశాః, ప్రభూవరీతి ప్ర+భూవరీః, మైఘీః,విద్యుత ఇతి వి+ద్యుతః,వాచః,సూచీభిః,శమ్యన్తు,త్వా॥

పదార్థః :- (మహానామ్న్యః) మహన్నామ యాసాం తాః, (రేవత్యః) బహుధనయుక్తాః, (విశ్వాః)అఖిలాః,(ఆశాః)దిశః,(ప్రభూవరీః)ప్రభుత్వయుక్తాః(మైఘీః)మేఘానామిమాః, (విద్యుతః)(వాచః)(సూచీభిః)(శమ్యంతు)(త్వా)త్వామ్. ॥౩౫॥

అన్వయః:- హే జిజ్ఞాసో సూచీభి ర్యా మహానామ్న్యో రేవత్యః ప్రభూవరీ ర్విశ్వా ఆశా ఇవ మైఘీ ర్విద్యుత ఇవ చ వాచ స్త్వా శమ్యంతు. తా స్త్వం గృహాణ. ॥౩౫॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః యేషాం వాచో దిగ్వత్సర్వాసు విద్యాసు వ్యాపికా మేఘస్థా విద్యుదివ సర్వార్థప్రకాశికాః సంతి తే శాంత్యా జితేంద్రియత్వం ప్రాప్య మహాకీర్తయో జాయంతే. ॥౩౫॥

పదార్థము:- ఓజిజ్ఞాసువా! సూచీభిః=సంధానమొనర్చు క్రియలవలన, మహానామ్న్యః=పెద్దపేరు గడించినవి, రేవత్యః=అనేక విధములగు ధనములుగలవి, ప్రభూవరీః=ప్రభుత్వముతో కూడినవియు నగు, విశ్వాః ఆశాః=ఏ సకలదిశలున్నవో వానివలెను, మైఘీః=మేఘ సంబంధములగు, విద్యుతః=ఏ విద్యుత్తులున్నవో వానివలెను, వాచః=వాణులు, త్వా=నిన్ను,శమ్యంతు=శాంతియుక్తము లొనర్చుగాక.వానిని నీవు గ్రహించుము. [౩౫]

భావార్థము:- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమా లంకారమున్నది. ఎవరి వాణి దిశలవలె సకలవిద్యలందు వ్యాప్తము, మేఘమునందుండు విద్యుత్తువలె అర్థమును ప్రకాశపఱచునదియునై యున్నదో, ఆ విద్వాంసులు శాంతితో జితేంద్రియత్వమును పొంది గొప్ప కీర్తిమంతులగుదురు. ౧౩౪౧[౩౫]

---

౧౩౪౨ నార్య ఇత్యస్య ప్రజాపతి రృషిః, స్త్రియో దేవతాః, భురిగుష్ణిక్ ఛందః, ఋషభః, స్వరః

అథ కన్యాః కియద్ బ్రహ్మచర్యం కుర్యు రిత్యాహ.

కన్యలెంత బ్రహ్మచర్యము ననుష్ఠించవలయును?

నార్య స్తే పత్న్యో లోమ విచిన్వన్తు మనీషయా।

దేవానాం పత్న్యో దిశః సూచీభిః శమ్యన్తు త్వా॥ ॥౩౬॥

నార్యః, తే, పత్న్యః, లోమ,వి,చిన్వన్తు, మనీషయా, దేవానామ్,పత్న్యః, దిశః, సూచీభిః, శమ్యన్తు, త్వా॥ ॥౩౬॥

పదార్థః:- (నార్యః)నరాణాం స్త్రియః(తే)తవ,(పత్న్యః) స్త్రియః,(లోమ) అనుకూలం రచనమ్,(వి) (చిన్వంతు) సంచితం కుర్వంతు. (మనీషయా) మనన ఈషణకర్త్ర్యా ప్రజ్ఞయా, (దేవానామ్)విదుషామ్,(పత్న్యః)స్త్రి యః,(దిశః)(సూచీభిః)అను సంధానక్రియాభిః,(శమ్యంతు) (త్వా)త్వామ్. ॥౩౬॥

అన్వయః:- హే విదుష్యధ్యాపికే యాః కుమార్యో మనీషయా తే లోమ విచిన్వంతు తా దేవానాం నార్యః పత్న్యో భవంతు. హే కుమారి యా దేవానాం పత్న్యో భూత్వా సూచీభిః దిశ ఇవ శుద్ధా విదుష్యః సంతి తాస్త్వా త్వాం శమ్యంతు. ॥౩౬॥

భావార్థః:- యాః కన్యా ఆద్యే వయసి ఆషోడశాదాచతుర్వింశద్వర్ష బ్రహ్మచర్యేణ విద్యా సుశిక్షాః ప్రాప్య స్వసదృశానాం పత్న్యః స్యు స్తాః దిశ ఇవ సుప్రకాశితకీర్తయో భవంతి. ॥౩౬॥

పదార్థము:- ఓ విదుషీ ! అధ్యాపకులారా ! ఏ కన్యలు, మనీషయా=తీక్ష్ణబుద్ధితో, తే లోమ=నీయొక్క అనుకూలములగు ఆజ్ఞలను,వచనములను,విచిన్వంతు=సంచయన మొనర్చెదరో,ఆకన్యలు, దేవానామ్=పండితులకు, నార్యః=ధర్మపత్నులగుదురు గాక! ఓ కుమారీ! ఏమహిళలు విద్వాంసులకు,పత్న్యః=పత్నులై ,సూచీభిః=అనుసంధింపజేయు క్రియలచే,దిశః=దిక్కులవలె శుద్ధమగు పాకవిద్యను చదివియున్నారో,వారు,త్వా=నీకు, శమ్యంతు=శాంతిజ్ఞానముల లభింపజేయుదురు గాక ! [౩౬]

భావార్థము:- ఏకన్యలు ప్రథమ వయస్సులో అనగా ౧౬నుండి౨౪ సం॥ల వయస్సు వరకు బ్రహ్మచర్యముతో విద్యను,ఉత్తమశిక్షను పొంది స్వసదృశపురుషులకు పత్నులగుదురో వారు దిక్కులవలె ఉత్తమ ప్రకాశవంతమగు కీర్తిగలవారలగుదురు. ౧౩౪-౨[౩౬]

---

౧౩౪౩ రజతా ఇత్యస్య ప్రజాపతి ఋషిః. స్త్రియో దేవతాః, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః

పున స్తాః కీదృశో భవేయు రిత్యాహ.

ఆ కన్యలెటులుండవలెను?

రజతా హరిణీః సీసా యుజో యుజ్యన్తే కర్మభిః ।

అశ్వస్య వాజిన స్త్వచి సిమాః శమ్యన్తు శమ్యన్తీః॥ ॥౩౭॥

రజతాః, హరిణీః,సీసాః, యుజః యుజ్యన్తే,కర్మభి రితి కర్మ+భిః,అశ్వస్య, వాజినః, త్వచి, సిమాః,శమ్యన్తు, శమ్యన్తీః॥ ॥౩౭॥

పదార్థః;--(రజతాః)అనురక్తాః,(హరిణీః)ప్రశస్తో హారో హారణం విద్యతే యాసాం తాః॥ (సీసాః)ప్రేమబంధికాః. అత్ర 'షిఞ్ బంధనే' ఇత్యస్మాదౌణాదికః క్సః ప్రత్యయోఽన్యేషామపీతి దీర్ఘః(యుజః)సమాహితాః,(యుజ్యంతే) (కర్మభిః) ధర్మ్యైభిః క్రియాభిః, (అశ్వస్య) వ్యాప్తు, శీలస్య(వాజినః)ప్రశస్తబలవతః,(త్వచి)సంవరణే,(సిమాః)ప్రేమ్ణా బద్ధాః,(శమ్యంతు)ఆనందంతు,

(శమ్యంతీః)శమం ప్రాప్నువతీః ప్రాపయంత్యో వా. ॥౩౭॥

అన్వయః:-యథా స్వయంవరా వాజినోఽశ్వస్య త్వచి సంయుజ్యంతే తథా కర్మభీ రజతా హారిణీః సీసా యుజః శమ్యంతీః సిమా హృద్యాన్ పతీన్ ప్రాప్య శమ్యంతు. ॥౩౭॥

భావార్థః:- హే మనుష్యా యే సుశిక్షితాః స్వయంవరా భూత్వా స్త్రీపురుషాః స్వేచ్ఛయా పరస్పరస్మిన్ ప్రీతా వివాహం కుర్వంతి. తే భద్రాన్ లావణ్యగుణస్వభావయుక్తాన్ సంతానానుత్పాద్య సదానందంతి. ॥౩౭॥

పదార్థము,-స్వయంవరవిధానముచే పెండ్లియాడిన స్త్రీలెటుల,వాజినః=ప్రశంసితమగు బలము గలవాడును, అశ్వస్య=ఉత్తమ గుణములందు వ్యాప్తుడు నగుపతికి, త్వచి=సంవరణమొనర్చుటలో,యుజ్యంతే=సంలగ్నులుగనొనర్చబడుదురో, అనగాభర్తను వస్త్రాదులచే నాచ్ఛాదనమొనర్చుట మొదలగు సేవలందు పాల్గొందురో, అటులనే, కర్మభిః =ధర్మయుక్త క్రియలచే, రజతాః=అనురాగమును,ప్రీతిని పొందిన వారును,హారిణీః= ప్రశంసనీయమైనస్వీకరణము గలవారును, సీసాః=ప్రేమగలవారును,యుజః=సావధాన చిత్తలై యోగ్యకార్యము లొనరించువారును, శమ్యంతీః=శాంతిని పొందినవారును, లభింపజేయువారును, సిమాః=ప్రేమచే బద్ధురాండ్రును నగు[స్త్రీలు]తమహృదయము లకంటెప్రియులైన పతులను పొంది,శమ్యంతు=ఆనందము ననుభవించెదరు గాక![౩౭]

భావార్థము :- ఓ మనుష్యులారా ! సుశిక్షితులు, స్వయంవరమును ఒనర్చిన వారలునగునే స్త్రీపురుషులు స్వేచ్ఛగ పరస్పరము ప్రీతులై వివాహ మొనర్చుకొనుచున్నారో వారు అందము,గుణము, సుస్వభావములు గల సంతానమును కని సదా ఆనందించుదురు. ౧౩౪౩[౩౭]

---

౧౩౪౪ కువిదంగేత్యస్య ప్రజాపతి ఋషిః, సభాసదో దేవతాః, నిచృత్పంక్తి, ఛందః, పంచమః స్వరః

అథాధ్యాపకాధ్యేతారః కీదృశః స్యు రిత్యాహ.

చదువువారు, చెప్పువారు ఎటువంటివారుగా నుండవలయును.

కువిదఙ్గ యవమన్తో యవఞ్చిద్యథా దాన్త్యనుపూర్వం వియూయ ।
ఇహేహైషాఙ్ కృణుహి భోజనాని యే బర్హిషో నమఉక్తిం యజన్తి. ॥౩౮॥

కువిత్, అఙ్గ, యవమన్త ఇతి యవ+మంతః, యవమ్, చిత్, యథా, దాన్తి, అనుపూర్వ మిత్యను+పూర్వమ్, వియూయేతి వి+యూయ, ఇహేహేతీహ +ఇహ,ఏషామ్, కృణుహి, భోజనాని, యే, బర్హిషః, నమఃఉక్తిమితి నమః+ఉ

క్తిమ్, యజన్తి ॥౩౮॥

పదార్థః:-(కువిత్)బహువిజ్ఞానయుక్తః, (అంగ) మిత్ర (యవమంతః)బహుయవాది ధాన్య యుక్తాః(యవమ్)ధాన్యసమూహమ్,(చిత్)అపి,(యథా) (దాంతి) ఛిందంతి(అనుపూర్వమ్)ఆను కూల్యమనతిక్రమ్య, (వియూయ) వియోజ్య సమ్మిశ్ర్య చ, (ఇహేహ)అస్మిన్నస్మిన్వ్యవహారే, (ఏషామ్)జనానామ్,(కృణుహి)కురు, (భోజనాని)పాలనార్థాన్యన్నాని, (యే)(బర్హిషః) జలస్య (నమఉక్తిమ్)నమసోఽన్నస్య వచనమ్,(యజంతి)సంగచ్ఛంతే. ॥౩౮॥

అన్వయః:- హే అంగ ! కువిత్ త్వమిహేహైషాం యథా యవమంతో కృషీవ యవం వియూయ చిదప్యనుపూర్వం దాంతి యే చ బర్హిషో నమ ఉక్తిం యజంతి. తేషాం భోజనాని కృణుహి. ॥౩౮॥

భావార్థః:-అత్రోపమాలంకారః. హే అధ్యాపకాధ్యేతారో యూయం యథా కృషీవ లాః పరస్పరస్య క్షేత్రాణి పర్యాయేణ లునంతి. బుసాదిభ్యోఽన్నాని పృథక్కృత్వాన్యాన్ భోజయిత్వా స్వయం భుంజతే, తథైవేహ విద్యావ్యవహారే నిష్కపటతయా విద్యార్థిభిరధ్యా పకానాం సేవా మధ్యాపకైర్విద్యార్థినాం విద్యావృద్ధిం చ కృత్వా పరస్పరాన్ భోజనాదినా సత్కృత్య సర్వ ఆనందంతు. ॥౩౮॥

పదార్థము:-అంగ=ఓ మిత్రుడా ! కువిత్=బహువిజ్ఞానవంతుడా ! నీవు,ఇహేహ= ఈ యీ వ్యవహారమునందు, ఏషాం=ఏ యీ మనుష్యులు, యవమంతః=యవాదిసస్య యుక్త వ్యవసాయమొనర్చువారు,యథా=ఎటుల,యవమ్=యవాదిధాన్యమును పొట్టు నుండి,వియూయ=వేరుచేసి,చిత్=మరియు,అనుపూర్వమ్=క్రమముగ,దాంతి=ఛేదించు చున్నారో వారి యొక్కయు మఱియు, యే=ఎవరైతే, బర్హిషః=జలములకు, నమ ఉక్తిమ్=అన్నమునకు సంబంధించిన వాక్కును,యజంతి=ఉచ్చరించి సత్కరించుచున్నారో వారలయొక్కయు,భోజనాని=భోజనములను,కృణుహి=చేయుము,[వారి భోజనము లను ఆరగించుము]. [౩౮]

భావార్థము:-ఈ మంత్రము నందుపమాలంకారము కలదు. ఓ అధ్యాపకులారా! అధ్యేతలారా ! మీరు కృషీవలులెటుల పరస్పర క్షేత్రములను వంతులప్రకారముగా కోసు కొని, పొట్టునుండి ధాన్యమును వేరుచేసి, ఇతరులకు భోజనము పెట్టి తాము భుజించు దురో అటులనే ఇచట విద్యావ్యవహారమునందు నిష్కపటముగ విద్యార్థులు అధ్యాపకుల సేవను,అధ్యాపకులు విద్యార్థుల విద్యావృద్ధిని నొనర్చి,ఒకరినొకరు భోజనాదులచే సత్క రించుకొని యందఱు ఆనందము ననుభవించవలయును. ౧౩౪౪[౩౮]

---

౧౩౪౫ కత్యా ఛ్యతీ త్యస్య ప్రజాపతి ఋషిః, అధ్యాపకో దేవతా,భురిగ్గాయత్రీ ఛందః షడ్జః స్వరః

పునరధ్యాపకా విద్యార్థినాం కీదృశీం పరీక్షాం గృహ్ణీయు రిత్యాహ.

శిక్షకులు విద్యార్థులనెటుల పరీక్షించవలయును.

క స్త్వా ఛ్యతి క స్త్వా విశా స్తి కస్తే గాత్రాణి శమ్యతి।
క ఉ తే శమితా కవిః ॥ ॥౩౯॥

కః, త్వా, ఆఛ్యతి, కః, త్వా, వి, శా స్తి, కః, తే,గాత్రాణి, శమ్యతి, కః,ఉ ఇత్యూం, తే, శమితా, కవిః ॥౩౯॥

పదార్థః:-(కః)(త్వా)త్వామ్,(ఆఛ్యతి)సమంతాచ్ఛినత్తి,(కః)(త్వా)త్వామ్,(వి)(శాస్తి) విశేషేణోపదిశతి .(కః) (తే) తవ, (గాత్రాణి) అంగాని, (శమ్యతి)శామ్యతి శమం ప్రాపయతి. అత్ర వా ఛందసీతి దీర్ఘత్వాభావః. (కః)(ఉ)వితర్కే-(తే)తవ,(శమితా)యజ్ఞస్య కర్తా,(కవిః) సర్వశాస్త్రవిత్. ॥౩౯॥

అన్వయః:-హే అధ్యేతస్త్వా త్వాం క ఆఛ్యతి. కస్త్వా విశాస్తి? కస్తే గాత్రాణి శమ్యతి? క ఉ తే శమితా? కవి రధ్యాపకోఽస్తి?. ॥౩౯॥

భావార్థః:- అధ్యాపకా అధ్యేతౄన్ ప్రత్యేవం పరీక్షాయాం పృచ్ఛేయుః. కే యుష్మాక మధ్యయనం ఛిందంతి ? కే యుష్మానధ్యయనాయోపదిశంతి?. కేఽంగానాం శుద్ధిం యోగ్యాం చేష్టాం చ జ్ఞాపయంతి?. కోఽధ్యాపకోఽస్తి? కిమధీతం?, కిమధ్యేతవ్యమస్తీత్యాది పృష్ట్వా సుపరీక్ష్యోత్తమానుత్సాహ్యాధమాన్ ధిక్కృత్వా విద్యామున్నయేయుః. ॥౩౯॥

పదార్థము:-అధ్యయన మొనరించు విద్యార్థీ ! త్వా=నిన్ను,కః=ఎవడు,ఆఛ్యతి= ఛేదించుచున్నాడు ? కః=ఎవడు,త్వా=నిన్ను,విశాస్తి=బాగుగ చదివించు చున్నాడు? కః=ఎవడు,తే గాత్రాణి=నీ యంగములకు,శమ్యతి=శాంతి చేకూర్చు చున్నాడు ? కః ఉ=ఎవడు,తే శమితా=నీకు యజ్ఞకర్త, కవిః=సకలశాస్త్రముల నెఱిగి చదివించు వాడెవడు ? [౩౯]

భావార్థము:-ఎవరు మీ యధ్యయనమును భంగపఱచు చున్నారు? ఎవరు విద్యాధ్యయనమునకై మీకు ఉపదేశించుచున్నారు ? ఎవరు అంగముల శౌచమును, యోగ్య చేష్టను తెలియజెప్పుచున్నారు ? చదివించు వారెవరు ? ఏమిచదివితిరి ? ఏమి చదువవలయును ? ఇటుల అధ్యాపకులు చదువువారిని పరీక్షలో ప్రశ్నించి చక్కగ పరీక్షించి, ఉత్తమ విద్యార్థుల కుత్సాహము గొలిపియు,దుష్టస్వభావముగల వారిని ధిక్కరించియు, అవమానపఱచియు,విద్యావృద్ధి యొనరించవలయును. ౧౩౯౪[౩౯]

---

౧౩౯౮ ఋతవ ఇత్యస్య ప్రజాపతి ఋషిః, ప్రజా దేవతాః, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః స్త్రీపురుషాః కథం వర్తేరన్నిత్యాహ.

స్త్రీపురుషు లెటుల ప్రవర్తించవలయును ?

ఋతవస్త ఋతుథా పర్వ శమితారో విశాసతు ।

సంవత్సరస్య తేజసా శమీభిః శమ్యన్తు త్వా॥ ॥౪౦॥

ఋతవః, తే, ఋతుథేత్యృతు+థా, పర్వ, శమితారః, వి, శాసతు, సంవత్స

రస్య, తేజసా, శమీభిః, శమ్యన్తు, త్వా ॥౪౦॥

పదార్థః:-(ఋతవః)వసంతాద్యాః,(తే)తవ,(ఋతుథా)ఋతుభ్యః,(పర్వ)పాలనమ్, (శమితారః)అధ్యయనాధ్యాపనాఖ్యే యజ్ఞే శమాదిగుణానాం ప్రాపకాః, (వి శాసతు) విశేషేణోపదిశంతు, (సంవత్సరస్య) (తేజసా) జలేన తేజ. ఇత్యుదక నా.నిఘం.౧.౧౨. (శమీభిః) కర్మభిః, (శమ్యంతు)త్వా=త్వామ్. ॥౪౦॥

అన్వయః:-హే విద్యార్థిన్ యథా తే ఋతవ ఋతుథా పర్వేవ శమితారోఽధ్యేతారం విశాసతు.సంవత్సరస్య తేజసా శమీభి స్త్వా త్వాం శమ్యంతు తాం స్త్వం సదైవ సేవస్వ.॥౪౦॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః.యథా ఋతవః పర్యాయేణ స్వాని స్వాని లింగాన్యభిపద్యంతే,తథైవ స్త్రీపురుషాః పర్యాయేణ బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సంన్యాసాశ్రమాన్ కృత్వా బ్రాహ్మణా బ్రాహ్మణ్యశ్చా ధ్యాపయేయుః. క్షత్రియాః ప్రజా రక్షంతు. వైశ్యాః కృష్యాదిక మున్నయంతు.శూద్రశ్చైతాన్ సేవంతామితి. ॥౪౦॥

పదార్థము:-ఓ విద్యార్థీ ! ఎటుల,తే=నీయొక్క,ఋతవః=వసంతాది ఋతువులు, ఋతుథా=ప్రతి ఋతువుయొక్క గుణముచే,పర్వ=పాలించునో అటులనే,శమితారః= అధ్యయనాధ్యాపనాఖ్య యజ్ఞమందు శమదమాది గుణముల లభింపజేయు నధ్యాపకులు చదువువారికి,వి శాసతు=విశేషించి ఉపదేశించవలయును.మఱియు,సంవత్సరస్య=సంవత్సరపు,తేజసా=జలముచేతను,శమీభిః=కర్మలచేతను,త్వా=నీకు,శమ్యంతు=శాంతి నిచ్చెదరు గాక ! వారిని నీవెల్లప్పుడు సేవించుము. [౪౦]

భావార్థము:-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఋతువు లెటుల వంతులప్రకారము తమ తమ చిహ్నములను పొందుచున్నవో అటులనే స్త్రీ పురుషులు క్రమముగ బ్రహ్మచర్య గృహస్థాశ్రమములందు ప్రవేశించి వానప్రస్థులై వనమునందుండి తపమొనర్చిసంన్యాసమునుస్వీకరించవలయును.బ్రాహ్మణుడు,బ్రాహ్మణి చదివించవలయును, క్షత్రియులగు స్త్రీ పురుషులు ప్రజలను రక్షించవలయును. వైశ్య స్త్రీపురుషులు వ్యవసాయమును అభివృద్ధి పఱచవలయును.శూద్ర స్త్రీపురుషులు బ్రాహ్మణాదులకు సేవయొనర్చవలయును. ౧౩౪౮[౪౦]



౧౩౪౭ అర్థమాసా ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ప్రజా దేవతాః, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః

అథ బాలకేషు మాత్రాదయః కథం వర్తేరన్నిత్యాహ.

బాలురందు మాత్రాదు లెటుల మెలగవలయును ?

అర్ధమాసాః పరూꣳషి తే మాసా అచ్ఛ్యన్తు శమ్యన్తః ।
అహోరాత్రాణి మరుతో విలిష్టꣳ సూదయన్తు తే॥ ॥౪౧॥

అర్ధమాసా ఇత్యర్ధ+మాసాః, పరూꣳషి, తే, మాసాః, ఆ, చ్ఛ్యన్తు,శమ్యన్తః, అహోరాత్రాణి, మరుతః, విలిష్టమితి విలిష్టమ్, సూదయన్తు, తే ॥౪౧॥

పదార్థః:-(అర్ద్ధమాసాః)కృష్ణశుక్లపక్షాః,(పరూంషి)కఠోరాణి వచనాని,(తే)తవ.(మాసాః) చైత్రాదయః,(ఆ)సమంతాత్. (ఛ్యన్తు)ఛిందంతు, (శమ్యంతః)శాంతిం ప్రాపయంతః, (అహోరాత్రాణి)(మరుతః)మనుష్యాః, (విలిష్టమ్)విరుద్ధమల్పమపి వ్యసనమ్ (సూదయంతు) దూరీకారయంతు,(తే)తవ. ॥౪౧॥

అన్వయః:- హే విద్యార్థిన్నహోరాత్రాణ్యర్ధమాసా మాసాశ్చాయూంషీవ తే తవ పరూంషి శమ్యంతో మరుతః దుర్వ్యసనాన్యాచ్ఛ్యన్తు. తే తవ మాసా విలిష్టం సూదయంతు.

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యది మాతా పిత్రధ్యాపకోపదేశకాతిథయో బాలానాం దుర్గుణాన్న నివర్తయేయుస్తర్హి తే శిష్టా కదాచిన్న భవేయుః. ॥౪౧॥

పదార్థము:-ఓ విద్యార్థులారా! అహోరాత్రాణి=దివారాత్రములు, అర్ధమాసాః =శుక్ల కృష్ణపక్షములు,మాసాః=చైత్రాదిమాసము లెటుల ఆయువును హరించుచున్నవో అటులనే,తే=నీయొక్క,పరూంషి=కఠోరవచనములకు, శమ్యంతః=శాంతి కలిగించుచు, మరుతః=ఉత్తమ మానవులు దుష్కర్మలను, ఆచ్ఛ్యంతు=వినాశమొనరించుదురు గాక ! మఱియు, తే విలిష్టమ్=కించిన్మాత్ర మైనను నీకున్న దుర్వ్యసనమును, సూదయంతు =తొలగింప జేయుదురుగాక ! [౪౧]

భావార్థము:-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకార మున్నది. తల్లిదండ్రులు,అధ్యాపకోపదేశకులు,అతిథులు బాలుర దుర్గుణములను నివారణ మొనరించనిచో వారెన్నటికి శిష్టులు కాజాలరు. ౧౩౪౭[౪౧]

---

౧౩౪౮ దైవ్యా ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః భురిగుష్ణిక్ ఛందః, ఋషభః, స్వరః,
అథాధ్యాపకాదయః కథం వర్తేరన్నిత్యాహ.
చదివించువారు మొ॥ సజ్జనులెటుల ప్రవర్తించవలయును ?

దైవ్యా అధ్వర్యవస్త్వా ఛ్యన్తు వి చ శాసతు ।
గాత్రాణి పర్వశస్తే సిమాః కృణ్వన్తు శమ్యన్తీ॥ ॥౪౨॥

దైవ్యాః, అధ్వర్యవః, త్వా, ఆ, ఛ్యన్తు, వి, చ, శాసతు,గాత్రాణి,

పర్వశ ఇతి పర్వ+శః, తే, సిమాః, కృణ్వన్తు, శమ్యన్తీః ॥౪౨॥

పదార్థః:-(దైవ్యాః)దేవేషు విద్వత్సు కుశలాః,(అధ్వర్యవః) ఆత్మనోఽహింసాఖ్యయజ్ఞమిచ్ఛంతః,(త్వా)త్వామ్,(ఆ)(ఛ్యంతు)ఛిందంతు,(వి)(చ) (శాసతు) ఉపదిశంతు, (గాత్రాణి) అంగాని(పర్వశః)సంధితః(తే)తవ,(సిమాః)ప్రేమబద్ధాః,(కృణ్వంతు)(శమ్యంతీః)దుష్టస్వభావం నివారయంత్యః. ॥౪౨॥

అన్వయః:-హే విద్యార్థిన్ విద్యార్థిని వా దైవ్యా అధ్వర్యవ స్త్వా విశాసతు చ తే తవ దోషానాచ్ఛ్యంతు పర్వశో గాత్రాణి పరీక్షంతాం సిమాః శమ్యంతీః సత్యో మాతరోఽప్యేవం శిక్షాం కృణ్వంతు. ॥౪౨॥

భావార్థః:-అధ్యాపకోపదేశకాఽతిథయో యదా బాలకాన్ శిక్షయేయు స్తదా దుర్గుణాన్ వినాశ్య విద్యాం ప్రాపయేయు రేవమధ్యాపకోపదేశికా విదుష్యః స్త్రియోఽపి కన్యాః ప్రత్యాచరేయుః.వైద్యకశాస్త్రరీత్యా శరీరావయవాన్ సమ్యక్ పరీక్ష్యౌషధాన్యపి ప్రదద్యుః.

పదార్థము:-ఓవిద్యార్థీ,ఓవిద్యార్థినీ! దైవ్యాః=విద్వాంసులలో కుశలులు,అధ్వర్యవః =స్వరక్షారూపమగు యజ్ఞము నభిలషించు వారునగు అధ్యాపకోపదేశకులు, త్వా= నీకు,వి శాసతు=విశేషోపదేశ మొనరింతురు గాక ! చ=మఱియు,తే=నీదోషములను,ఆ ఛ్యంతు=వినాశమొనరించుదురు గాక ! పర్వశః=సంధిసంధుల నుండి, గాత్రాణి=అంగ ములను పరికించుదురు గాక ! సిమాః=ప్రేమతో బద్ధురాండ్రై,శమ్యంతీః=దుష్టస్వభావ మును దూరమొనర్చు తల్లి మొదలగు సాధ్వీమహిళలు ఇటువంటి శిక్షనే,కృణ్వంతు= గఱపుదురు గాక ! [౪౨]

భావార్థము:-అధ్యాపకోపదేశకులు,అతిథులు బాలకులకు శిక్షగఱపునప్పుడు వారి దోషములను వినాశమొనరించి వారికి విద్యాప్రాప్తిని కలిగించ వలయును. అటులనే అధ్యాపికలు,ఉపదేశికలునైన విదుషీమతల్లులు కన్యలనుగుఱించియు ఆచరించవలయును. వైద్యకశాస్త్రరీత్యా శరీరావయవములను చక్కగా పరీక్షించి ఔషధములను గూడ ఇవ్వవలయును. ౧౩౪౭[౪౨]

---

౧౩౪౮ ద్యౌరిత్యస్య ప్రజాపతి ఋషిః, రాజా దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః
పునరధ్యాపకాదయః కీదృశా భవేయు రిత్యాహ.
అధ్యాపకాదు లెటువంటివారుగా నుండవలయును ?

ద్యౌ స్తే పృథివ్య్ న్తరిక్షం వాయుశ్ఛిద్రం పృణాతు తే ।
సూర్య స్తే నక్షత్రైః సహ లోకం కృణోతు సాధుయా॥ ॥౪౩॥

ద్యౌః, తే, పృథివీ, అన్తరిక్షమ్, వాయుః, ఛిద్రమ్, పృణాతు,తే,సూర్యః,తే,

నక్షత్రైః, సహ, లోకమ్, కృణోతు, సాధుయేతి సాధు+యా ॥౪౩॥

పదార్థః:-(ద్యౌః)ప్రకాశరూపా విద్యుత్(తే)తవ,(పృథివీ)భూమిః,(అంతరిక్షమ్) ఆకాశమ్,(వాయుః)పవనః(ఛిద్రమ్) ఇంద్రియమ్(పృణాతు) సుఖయతు (తే) తవ, (సూర్యః) సవితా (తే)తవ,(నక్షత్రైః)(సహ)(లోకమ్)దర్శనీయమ్,(కృణోతు)(సాధుయా)సాధు సత్యమ్. ॥౪౩॥

అన్వయః:- హే శిష్యేఽధ్యాపికే వా యథా ద్యౌః పృథివ్యంతరిక్షం వాయుః సూర్యో నక్షత్రైః సహ చంద్రశ్చ తే ఛిద్రం పృణాతు. తే తవ వ్యవహారం సాధ్నోతు.తథా తే తవ సాధుయా లోకం కృణోతు. ॥౪౩॥

భావార్థః:- అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా పృథివ్యాదయః సుఖప్రదాః సూర్యాదయః ప్రకాశకాః పదార్థాః సంతి తథైవాధ్యాపకా ఉపదేశకాశ్చాధ్యాపికా అప్యుపదేశికాశ్చ సర్వాన్ సన్మార్గస్థాన్ కృత్వా విద్యాప్రకాశం జనయంతు. ॥౪౩॥

పదార్థము:-ఓ శిష్యులారా ! అధ్యాపికలారా ! ఎటుల,ద్యౌః=ప్రకాశరూపమైన విద్యుత్తు,పృథివీ=భూమి,అన్తరిక్షమ్=ఆకాశము, వాయుః=పవనము, సూర్యః=సూర్య లోకము,మఱియు,నక్షత్రైః సహ=నక్షత్రములతోపాటు చంద్రలోకము,తే ఛిద్రమ్=నీ ప్రత్యేకేంద్రియమునకు, పృణాతు=సుఖము సమకూర్చునో, తే=నీవ్యవహారమును సిద్ధమొనర్చునో అటులనే, తే సాధుయా=నీయొక్క ఉత్తమసత్యము, లోకమ్=దర్శనీయ లోకమును,కృణోతు=సాధించును గాక ! [౪౩]

భావార్థము:-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. పృథివ్యాదులు సుఖమిచ్చునవిగను,సూర్యాదులు ప్రకాశము కలిగించునవిగను ఎటులున్నవో అటులనే అధ్యాపకోపదేశకులగు స్త్రీపురుషులిరువురు అందఱిని సన్మార్గస్థులుగ నొనర్చి విద్యాప్రకాశమును కలిగింపవలెను. ౧౩౪౯[౪౩]

---

౧౩౫౦ శంత ఇత్యస్య ప్రజాపతి ఋషిః, రాజా దేవతా, ఉష్ణిక్ ఛందః, ఋషభః స్వరః

పునర్మాత్రాదిభిః కిం కర్తవ్యమిత్యాహ.

మాతాదులేమి యొనర్చవలయును ?

శం తే పరేభ్యో గాత్రేభ్యః శమస్త్వవరేభ్యః।

శమస్థభ్యో మజ్జభ్యః శమ్వస్తు తన్వై తవ॥ ॥౪౪॥

శమ్, తే, పరేభ్యః, గాత్రేభ్యః, శమ్, అస్తు, అవరేభ్యః, శమ్, అస్థభ్య ఇత్యస్థ+భ్యః, మజ్జభ్య ఇతి మజ్జ+భ్యః, శమ్, ఉ ఇత్యూ, అస్తు, తన్వై, తవ

పదార్థః:-(శమ్)సుఖమ్,(తే)తుభ్యమ్,(పరేభ్యః)ఉత్కృష్టేభ్యః(గాత్రేభ్యః)(శమ్)(అస్తు)

(అవరేభ్యః)మధ్యస్థేభ్యో నికృష్టేభ్యో వా,(శమ్)(అస్థభ్యః)అస్థిభ్యః,ఛందస్యపి దృశ్యత ఇత్యనేన హలాదావప్యనఙ్,(మజ్జభ్యః)(శమ్)(ఉ)(అస్తు)(తన్వై)శరీరాయ(తవ). ॥౪౪॥

అన్వయః:-హే విద్యామిచ్ఛో యథా పృథివ్యాదితత్త్వం తవ తన్వే శమస్తు, పరేభ్యో గాత్రేభ్యః శం వరేభ్యో గాత్రేభ్యః శమస్తు.అస్థభ్యో మజ్జభ్యఃశమస్తు,తథా స్వకీయై రుత్తమగుణ కర్మస్వభావై రధ్యాపకాస్తే శంకరా భవంతు. ॥౪౪॥

భావార్థః:-అత్రవాచకలుప్తోపమాలంకారః. యథా మాతా పిత్రాఽధ్యాపకోపదేశకైః సంతానానాం దృఢాంగాని పృథా ధాతవశ్చ స్యు ర్యైః కల్యాణం కర్తు మర్హేయుస్తథా ఽధ్యాపనీయ ముపదేష్టవ్యం చ. ॥౪౪॥

పదార్థము:-ఓ విద్యాభిలాషీ ! పృథివ్యాది తత్వము లెటుల,తవ తన్వై=నీ శరీర మునకై,శమ్ అస్తు=సుఖహేతువులగునో,పరేభ్యః=అత్యంతోత్తమములగు,గాత్రేభ్యః= అంగములకై,శమ్=సుఖ [హేతువులగునో] ఉ=మఱియు, అవరేభ్యః=ఉత్తమములైన వానికంటె తక్కువవనియు, మధ్యమములు నికృష్టములునగు అంగములకై,శమ్ అస్తు= సుఖరూపములగునో ! అస్థభ్యః=ఎముకలకు,మజ్జభ్యః=శరీరమునందుండు కొవ్వునకు,శమ్= సుఖహేతువులగునో, అటులనే ఉత్తమగుణకర్మ స్వభావములచే నధ్యాపకులు, తే=నీకు సుఖముచే కూర్చువారలగుదురు గాక ! [౪౪]

భావార్థము:-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. తల్లిదండ్రులు,అధ్యాపకోపదేశకులు తమ సంతానముల అంగములు ధాతువులు ఇతరులకుకళ్యాణ మొనర్చుటకు యోగ్యములు పుష్టములునెటుల కాగలుగునోఅటుల చదివించవలయును, ఉపదేశించవలయును. ౧౩౩౦[౪౪]

---

౦౩౫౧ కః స్విదిత్యస్య ప్రజాపతి ఋషిః, జిజ్ఞాసు ర్దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ విదుషః ప్రతి ప్రశ్నా ఏవం కర్తవ్యా ఇత్యాహ.

విద్వాంసులనిటుల ప్రశ్నల నడుగవలయును.

కః స్విదేకాకీ చరతి క ఉ స్విజ్జాయతే పునః।
కిం స్విద్ధిమస్య భేషజం కిమ్వావపనం మహత్॥ ॥౪౫॥

కః,స్విత్, ఏకాకీ, చరతి, కః,ఉః ఇత్యూ, స్విత్, జాయతే,పునరితి పునః, కిమ్, స్విత్, హిమస్య, భేషజమ్, కిమ్,ఉః ఇత్యూ,ఆవపన మిత్యా+వపనమ్, మహత్ ॥౪౫॥

పదార్థః:-(కః)(స్విత్)(ఏకాకీ)అసహాయోఽద్వితీయః (చరతి) ప్రాప్నోఽస్తి (కః) (ఉ)

(స్విత్)అపి,(జాయతే)(పునః)(కిమ్)(స్విత్)(హిమస్య)శీతస్య, (భేషజమ్) ఔషధమ్, (కిమ్) (ఉ) (ఆవపనమ్)సమన్తాత్సర్వాధారమ్;(మహత్). ॥౯౫॥

అన్వయః:- హేవిద్వన్ అస్మిన్ సంసారే కః స్విదేకాకీ చరతి? క ఉ స్విత్ పున ర్జాయతే? కిం స్విద్ధిమస్య భేషజం ? కిము మహదావపన మస్తీతి ? వదస్వ. ॥౯౫॥

భావార్థః:- అసహాయః కో భ్రమతి? శీతనివారకః కః? కః పునః పునరుత్పద్యతే మహదుత్పత్తిస్థానమ్ కిమస్తీత్యేతేషాం ప్రశ్నానా ముత్తరేణ మంత్రేణ సమాధానాని వేదితవ్యాని.

పదార్థము:- ఓ విద్వాంసుడా! ఈ లోకమునందు, కః స్విత్=ఎవడు,ఏకాకీ=ఒంటరిగా,అసహాయుడుగ,చరతి=నడచుచున్నాడు ? లభించుచున్నాడు ? ఉ=మరియు, కః స్విత్=ఎవడు, పునః=మాటిమాటికి, జాయతే=ఉత్పన్నమగు చున్నాడు ? కిం స్విత్=ఏది,హిమస్య=శీతమునకు,భేషజమ్=ఔషధము? కిమ్ ఉ=మఱియునెద్ది, మహత్ ఆవపనమ్=చక్కగా సకలబీజములను విత్తుటకు గొప్ప ఆధారము? వీనిని చెప్పుము. [౯౫]

భావార్థము:- సహాయము లేకుండ భ్రమణమొనర్చున దెవరు ? మాటిమాటి కెవడు పుట్టుచున్నాడు ? శీతనివృత్తి మొనర్చున దెద్ది ? గొప్ప ఉత్పత్తి స్థానమెయ్యది ? ఈ ప్రశ్నల సమాధానము ముందు మంత్రమునందు గాంచవచ్చును. ౧౩౫౧[౯౫]

౧౩౫౨ సూర్య ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః,సూర్యాదయో దేవతాః,అనుష్టుప్ ఛందః,గాంధారః స్వరః
పునః పూర్వోక్త ప్రశ్నోత్తరాణ్యాహ.

పూర్వోక్త ప్రశ్నలకిచ్చుట ప్రత్యుత్తరము లివ్వబడుచున్నవి.

సూర్య ఏకాకీ చరతి చంద్రమా జాయతే పునః ।
అగ్ని ర్హిమస్య భేషజం భూమి రావపనం మహత్॥ ॥౯౬॥

సూర్యః, ఏకాకీ, చరతి, చంద్రమాః జాయతే, పునరితి పునః
అగ్నిః హిమస్య, భేషజమ్, భూమిః, ఆవపనమిత్యా+వపనమ్,మహత్.

పదార్థః:-(సూర్యః)సూర్యలోకః,(ఏకాకీ)అసహాయః, (చరతి) (చంద్రమాః) ఆహ్లాదకరశ్చంద్రః,(జాయతే) ప్రకాశితో భవతి,(పునః) పశ్చాత్(అగ్నిః)పావకః, (హిమస్య) శీతస్య,(భేషజమ్)ఔషధమ్,(భూమిః) భవంతి భూతాని యస్యాం సా పృథివీ,(ఆవపనమ్) సమంతాద్వపంతి యస్మిం స్తత్,(మహత్)విస్తీర్ణమ్. ॥౯౬

అన్వయః:- హే జిజ్ఞాసో ! సూర్య ఏకాకీ చరతి. చంద్రమాః పునర్జాయతేఽగ్నిర్హిమస్య భేషజం, మహదావపనం భూమిరస్తీతి. ॥౯౬॥

భావార్థః:- హే విద్వాంసో! సూర్యః స్వస్యైవ పరిధౌ భ్రమతి.న కస్య చిల్లోకస్య పరితః.

చంద్రాదిలోకా స్తేనైవ ప్రకాశితా భవంతి.అగ్నిరేవ శీతవినాశక స్సర్వబీజవపనార్థం మహత్ క్షేత్రం భూమిరేవా స్తీతి.యూయం విజానీత. ॥౪౬॥

పదార్థము:- ఓ జిజ్ఞాసూ ! సూర్యః=సూర్యలోకము, ఏకాకీ=ఒంటరిగా,చరతి=స్వపరిధియందు తిరుగుచున్నది.చంద్రమాః=ఆనందమిచ్చు చంద్రుడు,పునః=మాటిమాటికి జాయతే=ప్రకాశించుచున్నాడు.అగ్నిః=పావకము,హిమస్య భేషజమ్=శీతమున కౌషధము.మఱియు, మహత్=గొప్పదగు, ఆవపనమ్=సకలబీజములు చక్కగా వపనమైన ర్పుటకాధారమైనది,భూమిః=భూమియై యున్నది. [౪౬]

భావార్థము:-విద్వాంసులారా ! సూర్యుడు తనపరిధిలోనే భ్రమించుచున్నాడు. ఏలోకాంతరముచుట్టు తిరుగుట లేదు.చంద్రాదిలోకములు ఆ సూర్యుని ప్రకాశముచేతనే ప్రకాశితములు. అగ్నియే శీతనాశకము, మఱియు సకలబీజముల వపనమునకు గొప్ప క్షేత్రము భూమియై యున్నదని గ్రహించుడు. ౧౩౫-౯[౪౬]

---

౧౩౫-౪౭ కింస్విదిత్యస్య ప్రజాపతి ఋషిః,జిజ్ఞాసు ర్దేవతా,అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః ప్రశ్నానాహ.

మఱల ప్రశ్నలను చెప్పెను.

**కిఌస్విత్సూర్యసమం జ్యోతిః కిఌ సముద్రసమఌ సరః ।**
**కిఌస్విత్ పృథివ్యై వర్షీయః కస్య మాత్రా న విద్యతే॥ ॥౪౭॥**

**కిమ్, స్విత్, సూర్యసమమితి సూర్య+సమమ్, జ్యోతిః కిమ్, సముద్ర సమమితి సముద్ర+సమమ్, సరః, కిమ్, స్విత్, పృథివ్యై, వర్షీయః కస్య, మాత్రా, న విద్యతే ॥౪౭॥**

పదార్థః:-(కిమ్)(స్విత్)(సూర్యసమమ్)సూర్యేణ తుల్యమ్, (జ్యోతిః)ప్రకాశస్వరూపమ్, (కిమ్)(సముద్రసమమ్)(సరః)సరంతి జలాని యస్మిన్ తడాగే తత్. (కిమ్)(స్విత్)(పృథివ్యై) పృథివ్యాః.అత్ర పంచమ్యర్థే చతుర్థీ.(వర్షీయః)వృద్ధమ్,(కస్య)(మాత్రా)మీయతే యయా సా, (న)(విద్యతే)భవతి. ॥౪౭॥

అన్వయః:-హే విద్వన్ కింస్విత్ సూర్యసమం జ్యోతిః? కిం సముద్రసమం సరః? కింస్విత్ పృథివ్యైవర్షీయః ? కస్య మాత్రా న విద్యత ఇతి. ॥౪౭॥

భావార్థః:-ఆదిత్యవత్తేజస్వి, సముద్రవదుదధి,భూమే రధికం చ కిం,కస్య చ పరిమాణం వా స్తీత్యేతేషాం ప్రశ్నానాముత్తరాణి పరస్మిన్ మంత్రే వేదితవ్యాని. ॥౪౭॥

పదార్థము:-ఓ విద్వాంసుడా! కిం స్విత్=ఏది,సూర్యసమమ్=సూర్యునికి సమమైన, జ్యోతిః=ప్రకాశస్వరూపము ? కిమ్=ఏది,సముద్రసమమ్=సముద్రముతో సమానమైన, సరః=జలము ప్రవహించుటకు,పడుటకు,వచ్చుటకు.పోవుటకు ఆధారమగు జలాశయమేద్ది? కిం స్విత్=ఏది,పృథివ్యై=పృథివికంటె,వర్షీయః=చాలా పెద్దది? కస్య=దేనికి,మాత్రా=తూచబడు పరిమాణము, న విద్యతే=లేదు? [౪౭]

భావార్థము:-ఆదిత్యునితో తుల్యమైన తేజస్వి,సముద్రముతో సమమైన జలాధారము,భూమికంటె పెద్దది ఏది? దేనికి పరిమాణము లేదు ? ఈ నాలుగు ప్రశ్నలకు సమాధానము ముందు మంత్రమున తెలుసుకొనవచ్చును. ౧౩౫౩[౪౭]

---

౧౩౫౪ బ్రహ్మేత్యస్య ప్రజాపతి ఋషిః, బ్రహ్మాదయో దేవతాః అనుష్టుప్ ఛందః, గాంధారః, స్వరః.

అథై తేషా ముత్తరాణ్యాహ.

ఉక్తప్రశ్నలకు సమాధానము లిందు చెప్పబడుచున్నవి.

బ్రహ్మ సూర్యసమం జ్యోతి ర్ద్యౌః సముద్ర సమꣳ సరః।
ఇన్ద్రః పృథివ్యై వర్షీయాన్ గోస్తు మాత్రా న విద్యతే॥ ॥౪౮॥

బ్రహ్మ; సూర్యసమమితి సూర్య+సమమ్, జ్యోతిః, ద్యౌః, సముద్రసమమితి సముద్ర+సమమ్, సరః, ఇన్ద్రః, పృథివ్యై, వర్షీయాన్, గోః, తు, మాత్రా, న, విద్యతే, ॥౪౮॥

పదార్థః:-(బ్రహ్మ)బృహత్ సర్వేభ్యో మహదనంతమ్. (సూర్యసమమ్) (జ్యోతిః)ప్రకాశకమ్, (ద్యౌః) అంతరిక్షమ్, (సముద్రసమమ్) సముద్రేణ సమానః, (సరః) (ఇంద్రః) సూర్యః, (పృథివ్యై)పృథివ్యాః,(వర్షీయాన్)అతిశయేన వృద్ధో మహాన్, (గోః)వాచః, (తు)(మాత్రా) (న)(విద్యతే)భవతి. ॥౪౮॥

అన్వయః:-హే జిజ్ఞాసో త్వం సూర్యసమం జ్యోతి ర్బ్రహ్మ, సముద్రసమం సరో ద్యౌః, పృథివ్యై వర్షీయానింద్రో, గోస్తు మాత్రా న విద్యత ఇతి విజానీహి. ॥౪౮॥

భావార్థః:-న కించిత్ స్వప్రకాశేన బ్రహ్మణా సమం జ్యోతి ర్విద్యతే, సూర్యప్రకాశేన యుక్తేన మేఘేన తుల్యో జలాశయః, సూర్యేణ తుల్యో లోకేశో, వాచా తుల్యం వ్యవహారసాధకం కించిదపి వస్తు నభవతీతి సర్వే నిశ్చిన్వంతు. ॥౪౮॥

పదార్థము:-ఓజిజ్ఞాసువా!నీవు,సూర్యసమమ్=సూర్యునితో సమానమగు,జ్యోతిః=స్వప్రకాశస్వరూపము, బ్రహ్మ=అన్నిటికంటె పెద్ద అనంతుడైన పరమేశ్వరుడు.సముద్రసమమ్=సముద్రముతోసమానమగు,సరః=సరస్సు,ద్యౌః=అంతరిక్షము,పృథివ్యై=పృథివి

కంటె,వర్షీయాన్=పెద్దది,ఇంద్రః=సూర్యలోకము,గోః=వాణికి, తు=అయితే,మాత్రా=మానము పరిమాణము,న విద్యతే=లేదని ఎఱుగుము. [౪౮]

భావార్థము:-స్వయంప్రకాశుడగు బ్రహ్మతో నుద్దియగు జ్యోతియెద్దియు లేదు. సూర్యప్రకాశముతో యుక్తమైన మేఘమునకు సాటియైన జలాశయమును లేదు.సూర్యసముడగు లోకేశుడు లేడు.వాణితో తుల్యమగు వ్యవహార సాధకమగు పదార్థమెద్దియు లేదు.అని అందరు నిశ్చయించుకొనవలయును. ౧౩౫౪[౪౮]

పృచ్ఛామీత్యస్య ప్రజాపతి ర్ఋషిః,ప్రష్టృ సమాధాతారౌ దేవతే;అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.
పునః ప్రశ్నానాహ.

మఱల నీమంత్రమందు ప్రశ్నలను చెప్పుచున్నాడు.

పృచ్ఛామి త్వా చితయే దేవసఖ యది త్వమత్ర మనసా జగన్థ।
యేషు విష్ణుస్త్రిషు పదేష్వేష్ట స్తేషు విశ్వం భువన మావివేశా ౩॥౨ ॥ ॥౪౯॥

పృచ్ఛామి, త్వా, చితయే, దేవసఖేతి దేవ+సఖ, యది, త్వమ్, అత్ర, మనసా, జగన్థ, యేషు, విష్ణుః, త్రిషు, పదేషు, ఆ ఇష్ట ఇత్యా+ఇష్టః, తేషు, విశ్వమ్, భువనమ్, ఆ, వివేశ॥ ॥౪౯॥

పదార్థః:-(పృచ్ఛామి)(త్వా)త్వామ్,(చితయే)చేతనాయ,(దేవసఖ)దేవానాం విదుషాం సుహృద్,(యది)(త్వమ్)(అత్ర)(మనసా)అంతఃకరణేన,(జగంథ)(యేషు)(విష్ణుః)వ్యాపకేశ్వరః (త్రిషు)త్రివిధేషు,(పదేషు)నామస్థానజన్మాఖ్యేషు,(ఏష్టః)(తేషు)(విశ్వమ్)(భువనమ్)(ఆ)(వివేశ) ఆవిష్టో వ్యాప్తోఽస్తి. ॥౪౯॥

అన్వయః:-హే దేవసఖ యది త్వమత్ర మనసా జగంథ.తర్హి త్వా చితయే పృచ్ఛామి యో విష్ణుర్యేషు త్రిషు పదేష్వేష్టోఽస్తి తేషు వ్యాప్తః సన్ విశ్వం భువన మావివేశ.తం చ పృచ్ఛామి.

భావార్థః:-హే విద్వన్ యశ్చేతనః సర్వవ్యాపీ పూజితుం యోగ్యః పరమేశ్వరోఽస్తి తం మహ్యా ముపదిశ. ॥౪౯॥

పదార్థము:-దేవసఖ=విద్వాంసుల మిత్రమా!యది=ఒకవేళ,త్వమ్=నీవు,అత్ర=ఈ విషయమున, మనసా=అంతఃకరణముచే, జగంథ=ఎఱుగుచున్నచో, త్వా=నిన్ను, చితయే=చేతనార్థము, పృచ్ఛామి=అడుగుచున్నాను. విష్ణుః=పవిష్ణువు, వ్యాపకుడైన పరమాత్మ,యేషు త్రిషు=పమూడురకములైన, పదేషు=పొంద తగోగ్యములగు జన్మ; నామ;స్థానములందు;ఏష్టః=చక్కగా ఇష్టుడై యున్నాడో, తేషు=అందు వ్యాప్తుడగుచు,

విశ్వమ్ భువనమ్=సకల భువనములందు, ఆ వివేశ=చక్కగా ప్రవేశించు చున్నాడో, ఆ పరమాత్మని గుఱించిగూడ నిన్ను ప్రశ్నించు చున్నాను. [౪౯]

భావార్థము:-ఓ విద్వాంసుడా ! చేతనుడు, సర్వవ్యాపకుడు, పూజార్హుడు[ఉపాసనీయుడు, ప్రశంసనీయుడు, స్తవనీయుడు] నైన యే పరమేశ్వరుడున్నాడో అతనిని గుఱించి నాకుపదేశించుము. ౧౩౫౭[౪౯]

---

౧౩౫౮ అపీత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ఈశ్వరో దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథై తేషా ముత్తరాణ్యాహ.

వీనికి ప్రత్యుత్తరములు.

అపి తేషు త్రిషు పదేష్వస్మి యేషు విశ్వం భువన మావివేశ।
సద్యః పర్యేమి పృథివీ ముత ద్యామేకేనాఙ్గేన దివో అస్య పృష్ఠమ్ ॥౫౦॥

అపి, తేషు, త్రిషు, పదేషు, అస్మి, యేషు, విశ్వమ్, భువనమ్, ఆవివేశేత్యా+వివేశ, సద్యః, పరి, ఏమి, పృథివీమ్, ఉత, ద్యామ్, ఏకేన, అఙ్గేన, దివః, అస్య, పృష్ఠమ్॥ ॥౫౦॥

పదార్థః:-(అపి)(తేషు)పూర్వోక్తేషు,(త్రిషు)(పదేషు)ప్రాప్తుం యోగ్యేషు నామస్థాన జన్మాఖ్యేషు(అస్మి)(యేషు)(విశ్వమ్)అఖిలమ్, (భువనమ్)జగత్, (ఆవివేశ) సమంతాద్విష్టమస్తి (సద్యః)(పరి)సర్వతః,(ఏమి)ప్రాప్తోఽస్మి.(పృథివీమ్)భూమి మంతరిక్షం వా,(ఉత)(ద్యామ్) సర్వ ప్రకాశమ్(ఏకేన)(అంగేన)కమనీయేన,(దివః)ప్రకాశమానస్యసూర్యాదిలోకస్య(అస్య)(పృష్ఠమ్) ఆధారమ్. ॥౫౦॥

అన్వయః:-హే మనుష్యా యోజగత్స్రష్టేశ్వరోఽహం యేషు త్రిషు పదేషు విశ్వం భువన మావివేశ తేష్వప్యహం వ్యాప్తోఽస్మి.అస్య దివః పృష్ఠం పృథివీ ముత ద్యాంచైకేనాంగేన సద్యః పర్యేమి. తం మాం సర్వే యూయ ముపాధ్వమ్. ॥౫౦॥

భావార్థః:-యథా సర్వాన్ జీవాన్ ప్రతీశ్వర ఉపదిశతి. అహం కార్యకారణాత్మకే జగతి వ్యాప్తోఽస్మి. మయా వినైకః పరమాణు రవ్యాప్తో నాస్తి. సోఽహం యత్ర జగన్నాస్తి. తత్రాప్యనంతస్వరూపేణ పూర్ణోఽస్మి.యదిదం జగదతివిస్తీర్ణం భవంతః పశ్యంతి. తదిదం మత్సన్నిధావేకాణుమాత్రమపి నాస్తీతి. తథైవ విద్వాన్ విజ్ఞాపయేత్. ॥౫౦॥

పదార్థము:-ఓమానవులారా! జగత్స్రష్టయైన నేను, యేషు త్రిషు పదేషు=జన్మనామ స్థానములు అను పొందదగిన యేపదములందు, విశ్వమ్ భువనమ్=సకలజగత్తు, ఆవివేశ=నలువైపులనుండి ప్రవేశించుచున్నదో, తేషు=ఆ జన్మనామ స్థానములందు, అపి=కూడ,

అస్మి=వ్యాప్తుడనై యున్నాను, అస్య దివః=ప్రకాశమానమగు నీ సూర్యాదిలోకముల, పృష్ఠమ్=ఉపరితల భాగమును,పృథివీమ్=భూమి లేక అంతరిక్షమును, ఉత=మఱియు, ద్యామ్=సమస్తప్రకాశమును,ఏకేన అంగేన=అతిమనోహరమును,పొందదగినదియునగు నొకే వ్యవహారముచే, లేక దేశముచే, సద్యః=శీఘ్రముగ, పరి ఏమి=అన్నిదిక్కులనుండి ప్రాప్తుడనగుచున్నాను.అట్టి నా యుపాసనయే మీరందరొనర్పుడు. [౫౦]

భావార్థము:-జీవులన్నిటికి పరమాత్మ ఉపదేశించుచున్నాడు.నేను కార్యకారణాత్మకముగ నున్న జగత్తున వ్యాప్తుడనై యున్నాను.నేను వ్యాప్తముకాని ఒక్కపరమాణువు కూడ లేదు. జగత్తులేనిచోట గూడ నేననంతస్వరూపముతో పరిపూర్ణుడనై యున్నాను.మీరు చూచుచున్న అతి విస్తారమైన యీ జగత్తు నాయెదుట అణుమాత్రమైనను కాజాలదు.ఈ సంగతి అటులనే విద్వాంసులందరికి తెలియజెప్పవలయును. ౧౩౫౮[౫౦]

---

౧౩౫౯ కేష్వంత ఇత్యస్య ప్రజాపతి ఋషిః,పరమేశ్వరో దేవతా,పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

అథేశ్వర విషయే ప్రశ్నానాహ.

ఈశ్వరుని గుఱించి రెండు ప్రశ్నలను చెప్పెను.

కేష్వన్తః పురుష ఆ వివేశ కాన్యన్తః పురుషే అర్పితాని।
ఏతద్ బ్రహ్మన్నుప వల్హామసి త్వా కిꣳస్విన్నః ప్రతివోచాస్యత్ర॥ ॥౫౧॥

కేషు,అన్తరిత్యన్తః,పురుష,ఆ, వివేశ,కాని,అన్తరిత్యన్తః,పురుషే,అర్పితాని,
ఏతత్, బ్రహ్మన్,ఉప,వల్హామసి,త్వా,కిమ్,స్విత్, నః, ప్రతి, వోచాసి, అత్ర॥ ॥౫౧॥

పదార్థః:-(కేషు)(అంతః)మధ్యే,(పురుషః)సర్వత్ర పూర్ణః,(ఆ) (వివేశ) ప్రవిష్టోఽస్తి (కాని)(అంతః)మధ్యే,(పురుషే)(అర్పితాని)స్థాపితాని,(ఏతత్)(బ్రహ్మన్)బ్రహ్మవిద్విద్వన్,(ఉప) (వల్హామసి)ప్రధానాభవామః(త్వా)త్వామ్,(కిమ్)(స్విత్)(నః)అస్మాన్,(ప్రతి)(వోచాసి)ఉచ్యాః, అత్ర వేటి మధ్యమైకవచనే వా ఛందసి సర్వే విధయో భవంతీ త్యుమాగమః. ॥౫౧॥

అన్వయః:-హే బ్రహ్మన్ ! కేషు పురుషోఽన్తరావివేశ? కాని పురుషేఽన్త రర్పితాని ? యేన వయ ముపవల్హామసి.ఏతత్త్వా త్వాం ప్రచ్ఛామ స్తత్కింస్విద స్త్యత్ర నః ప్రతివోచాసి.

భావార్థః:-చతుర్వేద విద్భిర్విద్వానితరై ర్జనై రేవం ప్రష్టవ్యః.హే వేదవిద్విద్వన్ ! పూర్ణః పరమేశ్వరః కేషు ప్రవిష్టోఽస్తి ? కాని చ తదంతర్గతాని సంతి? ఏతత్ పృష్టో భవాన్ యథార్థ్యేన బ్రవీతు.యేన వయం ప్రధానపురుషా భవేమ. ॥౫౧॥

పదార్థము:-బ్రహ్మన్=వేదమునెఱిగిన విద్వాంసుడా ! అంతః పురుషః=సర్వత్ర

పూర్ణుడై యున్న పరమేశ్వరుడు,కేషు=ఎందు లోపల, ఆ వివేశ=ప్రవేశించుచున్నాడు? కాని=ఏవి,పురుషే=పూర్ణేశ్వరునియందు,అంతః=లోపల,అర్పితాని=స్థాపనయొనర్చబడి యున్నవి?, ఏ జ్ఞానముచే మేము,ఉపవహ్లోమసి=ప్రధానులము కాగలుగుదుమో:ఏతత్= ఆ యీ జ్ఞానమును,త్వా=నిన్ను ప్రశ్నించు చున్నాము.కిం స్విత్=అది,ఏదై యున్నదో, అత్ర=ఈ విషయమునందు,నః ప్రతి=మాకు,వోచాసి=చెప్పుము. [౫౧]

భావార్థము:-నాలుగు వేదముల నెఱిగిన విద్వాంసుని నితరులిటుల ప్రశ్నించ వలయును.ఓ వేదజ్ఞుడా ! విద్వాంసుడా! పూర్ణుడైన పరమాత్మ యేనిలో ప్రవిష్టుడై యు న్నాడు ? ఏవి యతని యందంతర్గతములై యున్నవి ? ఈ మాట మిమ్ముల నడుగు చున్నాము. ఏజ్ఞానముచే మేముత్తమపురుషులము కాగలుగుదుమో దానిని యదార్థ ముగ వచింపుడు. ౧౩౫౪[౫౧]

---

పంచస్వంత ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, పరమేశ్వరో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పూర్వమంత్రోక్త ప్రశ్నయో రుత్తర మాహా.

పూర్వమంత్రములో నడిగిన ప్రశ్నలకిందు ప్రత్యుత్తరములు.

పఞ్చస్వన్తః పురుష ఆవివేశ తాన్యన్తః పురుషే అర్పితాని ।

ఏతత్త్వాత్ర ప్రతిమన్వానో అస్మి న మాయయా భవస్యుత్తరో మత్॥౫౨॥

పఞ్చస్వితి పఞ్చ+సు, అన్తరిత్యన్తః,పురుషః,ఆ,వివేశ,తాని,అన్తరిత్యన్తః, పురుషే, అర్పితాని, ఏతత్, త్వా, అత్ర, ప్రతిమన్వాన ఇతి ప్రతి+మన్వానః,అస్మి,న, మాయయా, భవసి, ఉత్తర ఇత్యుత్+తరః,మత్॥ ॥౫౨॥

పదార్థః-(పంచసు) భూతేషు తన్మాత్రాసు వా (అంతః)(పురుషః)పూర్ణః పరమాత్మా, (ఆ)(వివేశ) స్వవ్యాప్త్యాఽవిష్టోఽస్తి (తాని) భూతాని తన్మాత్రాణి వా (అంతః) మధ్యే(పురుషే) పూర్ణే పరమాత్మని, (అర్పితాని) స్థాపితాని.(ఏతత్)(త్వా)త్వామ్, (అత్ర)(ప్రతిమన్వానః) ప్రత్యక్షేణ విజానన్; (అస్మి)(న) (మాయయా) ప్రజ్ఞయా. మాయేతి ప్రజ్ఞా నా...నిఘం.౩.౨. (భవసి)(ఉత్తరః) ఉత్కృష్టం తారయతి సమాదధాతి సః (మత్) మమ సకాశాత్ ॥౪౨॥

అన్వయః- హేజిజ్ఞాసో పంచస్వంతః పురుష ఆవివేశ. తాని పురుషేఽన్త రర్పితాని.ఏత దత్ర త్వా ప్రతిమన్వానోఽహం సమాధాతాఽస్మి. యది మాయయా యుక్తస్త్వం భవసి తర్హి మదుత్తరః సమాధాతా కశ్చిన్నాస్తీతి విజానీహి. ॥౫౨॥

భావార్థః-పరమేశ్వర ఉపదిశతి.హే మనుష్యామదుత్తరః కోఽపి నాస్తి.అహమేవ సర్వే షామాధారః సర్వమభివ్యాప్య ధరామి. మయి వ్యాప్తే సర్వాణి వస్తూని స్వస్వనియమే స్థితాని సంతి. హే పరోత్తమా యోగినో విద్వాంసో భవంతో మత్తేదం విజ్ఞానం విజ్ఞాపయత. ॥౫౨॥

పదార్థము:-ఓజిజ్ఞాసువా! పంచసు అంతః=పంచభూతములందును,పంచతన్మాత్రలందును, పురుషః = పూర్ణపరమాత్మ, ఆ వివేశ=స్వవ్యాప్తిచే చక్కగా వ్యాప్తుడగుచున్నాడు. తాని=ఆ పంచభూతములు తన్మాత్రలు, పురుషే=పూర్ణపురుషుడైన పరమాత్మయొక్క,అంతః=లోపల,అర్పితాని=స్థాపితములై యున్నవి. ఏతత్=ఇది,అత్ర=ఈ జగత్తునందు,త్వా=నీకు,ప్రతిమన్వానః=ప్రత్యక్షముగ తెలుగుచు సమాధాన మిచ్చువాడనై ,అస్మి=ఉన్నాను. ఒకవేళనీవు, మాయయా=ఉత్తమ బుద్ధియుక్తుడవు, భవసి=అగుచో, మత్=నాకంటె, ఉత్తరః=శ్రేష్ఠుడైన సమాధానకర్త ఎవడును, న=లేడని యెఱుగుము. [౫౨]

భావార్థము:-పరమేశ్వరు డుపదేశించుచున్నాడు.మానవులారా! నాపైనఎవడూ లేడు. నేనే అందరికాధారుడనై, అన్నిటిలో వ్యాప్తుడనై ధారణమొనర్చు చున్నాను. నేను వ్యాప్తుడనై యుండుటచేతనే సకల పదార్థములు స్వస్వనియమములందు స్థితములై యున్నవి.సర్వోత్తములగు యోగులారా! విద్వాంసులారా! మీరు నాయీ విజ్ఞానమును తెలియజేయుడు. ౧౩౫౮[౫౨]

---

౧౩౫౯ కాస్విదిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ప్రష్టా దేవతా, అనుష్టుప్, ఛందః, గాంధారః స్వరః.

పునః ప్రశ్నానాహ.

మఱల ప్రశ్నలు.

కా స్విదాసీత్పూర్వచిత్తిః కిꣳస్విదాసీద్ బృహద్వయః ।

కా స్విదాసీత్పిలిప్పిలా కా స్విదాసీత్ పిశఙ్గిలా ॥ ॥౫౩॥

కా, స్విత్, ఆసీత్, పూర్వచిత్తిరితి పూర్వ+చిత్తిః, కిమ్, స్విత్, ఆసీత్, బృహత్, వయః, కా, స్విత్, ఆసీత్, పిలిప్పిలా,కా,స్విత్,ఆసీత్,పిశఙ్గిలా॥ ॥౫౩॥

పదార్థః:-(కా)(స్విత్)(ఆసీత్)(పూర్వచిత్తిః)పూర్వస్మిన్ననాదౌ సంచయనాఖ్యా,(కిమ్)(స్విత్)(ఆసీత్)(బృహత్)మహత్,(వయః)ప్రజననాత్మకమ్, (కా)(స్విత్) (ఆసీత్) (పిలిప్పిలా) ఆర్ద్రీభూతా,(కా)(స్విత్)(ఆసీత్)(పిశంగిలా)అవయవాంతః కర్త్రీ. ॥౫౩॥

అన్వయః:-హే విద్వన్నత్ర జగతి కా స్విత్ పూర్వచిత్తి రాసీత్ ? కిం స్విద్ బృహద్వయ ఆసీత్? కాస్విత్ పిలిప్పిలా ఆసీత్? కాస్విత్ పిశంగిలా ఆసీదితి భవంతం పృచ్ఛామి. ॥౫౩॥

భావార్థః:-అత్ర చత్వారః ప్రశ్నా స్తేషాం సమాధానాని పరస్మిన్మంత్రే ద్రష్టవ్యాని.

పదార్థము:-ఓ విద్వాంసుడా! ఈ జగత్తునందు,కా-స్విత్=ఏది,పూర్వచిత్తిః ఆసీత్=అనాది సమయమున సంచితమై యున్నది? కిం స్విత్=ఏది,బృహత్ వయః=గొప్ప

ఉత్పన్న స్వరూపమై,ఆసీత్=ఉన్నది? కా స్విత్=ఏది,పిలిప్పిలా=తడిసి జిగటగా బురదగా, ఆసీత్=ఉన్నది ? కా స్విత్=ఏది,పిశంగలా=అవయవములను లోపలకు ముడుచుకొను నదై ,ఆసీత్=ఉన్నది ? నిన్నిది అడుగుచున్నాను. [౫౩]

భావార్థము:-ఈ మంత్రమునందు నాలుగు ప్రశ్నలున్నవి.వాని సమాధానములు ముందు మంత్రములో చూడవచ్చును. ౧౩౫౯[౫౩]

---

౧౩౬౦ద్యౌరాసీదిత్యస్య ప్రజాపతి ర్ఋషిః,సమాధాతా దేవతా,నిచృదనుష్టుప్ ఛందః,గాంధారః,స్వరః.

పూర్వప్రశ్నానా ముత్తరాణ్యాహ.

పూర్వప్రశ్నలకు ప్రత్యుత్తరములు.

ద్యౌ రాసీత్పూర్వ చిత్తి రశ్వ ఆసీద్ బృహద్వయః ।
అవి రాసీత్పిలిప్పిలా రాత్రి రాసీత్పిశఙ్గిలా ॥ ॥౫౪॥

ద్యౌః, ఆసీత్, పూర్వచిత్తిరితి పూర్వ+చిత్తిః, అశ్వః, ఆసీత్, బృహత్, వయః, అవిః, ఆసీత్, పిలిప్పిలా, రాత్రిః, ఆసీత్, పిశఙ్గిలా ॥ ॥౫౪॥

పదార్థః:-(ద్యౌః)విద్యుత్,(ఆసీత్)(పూర్వచిత్తిః) ప్రథమం చయనమ్, (అశ్వః)మహత్తత్వమ్,(ఆసీత్)(బృహత్)మహత్, (వయః)ప్రజననాత్మకమ్, (అవిః) రక్షికా ప్రకృతిః, (ఆసీత్), (పిలిప్పిలా)(రాత్రిః) రాత్రివద్వర్తమానః ప్రలయః (ఆసీత్) (పిశంగిలా) సర్వేషామవయవానాం నిగలికా. ॥౫౪॥

అన్వయః:-హేజిజ్ఞాసో ద్యౌః పూర్వచిత్తి రాసీదశ్వో బృహద్వయ ఆసీదవిః పిలిప్పిలాఽఽసీద్రాత్రిః పిశంగిలాఽఽసీదితి త్వం విజానీహి. ॥౫౪॥

భావార్థః:-హే మనుష్యా యాఽతీవసూక్ష్మా విద్యుత్సా ప్రథమా పరిణతి ర్మహదాఖ్యం ద్వితీయా పరిణతిః,ప్రకృతిర్మూలకారణ మపరిణతిః,ప్రలయః సర్వస్థూల వినాశకోఽస్తీతి విజానీత.

పదార్థము:-ఓ జిజ్ఞాసువా ! ద్యౌః=విద్యుత్తు, పూర్వచిత్తిః ఆసీత్ =ప్రప్రథమ సంచయమైయున్నది.అశ్వః=మహత్తత్వము,బృహత్ వయఃఆసీత్=పెద్ద ఉత్పత్తిస్వరూపమై యున్నది. పిలిప్పిలా=తడిసి జిగటగా బురదగానున్నది.అవిఃఆసీత్=రక్షించు ప్రకృతియై యున్నది. రాత్రిః=రాత్రివలెనుండు ప్రలయము,పిశంగిలా=సకలావయవములను [సర్వస్వరూపములను]మింగునదై,ఆసీత్=ఉండెను.అని నీవెఱుగుము. [౫౪]

భావార్థము:-ఓ మానవులారా ! అతిసూక్ష్మమైన యేవిద్యుత్తు ఉన్నదో యది ప్రథమపరిణామము, మహత్తత్వము ద్వితీయ పరిణామము, మఱియు అన్నిటికి మూల

కారణమైన ప్రకృతి పరిణామరహితమైనది. ప్రళయము సకలస్థూల జగత్తును వినాశన మొనర్చునదై యున్నదని గ్రహించుడు. ౧౩౬౩[౫౪]

౧౩౬౧ కా ఈమిత్యస్య ప్రజాపతి ఋషిః, ప్రష్టా దేవతా, అనుష్టుప్ఛందః, గాంధారః స్వరః.
పునః ప్రశ్నానాహ.
మఱల ప్రశ్నలను చెప్పుచున్నాడు.

కా ఈమరే పిశఙ్గిలా కా ఈం కురుపిశఙ్గిలా।
క ఈమాస్కన్ద మర్షతి క ఈం పన్థాం విసర్పతి॥ ॥౫౫॥

కా, ఈమ్, అరే, పిశంగిలా, కా, ఈమ్, కురుపిశంగిలేతి కురు+పిశఙ్గిలా,
కః, ఈమ్, ఆస్కందమిత్యా+స్కందమ్, అర్షతి, కః, ఈమ్, పన్థామ్, వి, సర్పతి ॥౫౫॥

పదార్థః:-(కా)(ఈమ్)సముచ్చయే,(అరే)నీచసంబోధనే,(పిశంగిలా)రూపావరణకారిణీ, (కా)(ఈమ్)(కురుపిశంగిలా)(కః)(ఈమ్)(ఆస్కందమ్)(అర్షతి)ప్రాప్నోతి.(కః)(ఈమ్)ఉదకస్య, (పంథామ్)మార్గమ్,(వి)(సర్పతి). ॥౫౫॥

అన్వయః:-అరే స్త్రి! కా ఈం పిశంగిలా? కా ఈం కురుపిశంగిలా? క ఈమాస్కందమర్షతి? క ఈం పంథాం విసర్పతీతి పమాధేహి. ॥౫౫॥

భావార్థః:- కేన రూప మ్రావ్రియతే? కేన కృష్యాది ర్నశ్యతే? కః శీఘ్రం ధావతి? కశ్చ మార్గే ప్రసరతీతి చత్వారః ప్రశ్నాస్తేషాముత్తరాణి పరస్మిన్మంత్రే వేదితవ్యాని. ॥౫౫॥

పదార్థము:-అరే=ఓ విదుషీ స్త్రీ! కా ఈమ్=ఏది మాటిమాటికి, పిశంగిలా=రూపములనావరణమొనర్చునదై యున్నది? కా ఈమ్=ఏది సారెసారెకు, కురుపిశంగిలా=కృష్యాద్యన్నములను మ్రింగునదై యున్నది? కా ఈమ్=ఏది మాటిమాటికి, ఆస్కందమ్=విలక్షణగతిని, అర్షతి=పొందుచున్నది? మఱియు, కః=ఏది, ఈమ్=జలముయొక్క, పంథామ్=మార్గమున, వి సర్పతి=విశేషముగ వ్యాపించి నడచున్నది? [౫౫]

భావార్థము:-దేనిచే రూపమావరించబడుచున్నది? దేనిచే కృష్యాదులు వినష్టము లగుచున్నవి? ఏది శీఘ్రఫలాయనమొనర్చును? ఎయ్యది దారిలో వ్యాపించును? ఇవి నాలుగుప్రశ్నలు.వీని సమాధానములను ముందు మంత్రములో తెలుసుకొనవచ్చును.

౧౩౬౨ అజేత్యస్య ప్రజాపతి ఋషిః, తత్త్వజ్ఞాతా దేవతా, స్వరాడుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.
పూర్వప్రశ్నానా ముత్తరాణ్యాహ.
పూర్వమంత్రములోని ప్రశ్నలకు సమాధానములు,

అజారే పిశఙ్గిలా శ్వావిత్ కురుపిశఙ్గిలా ।
శశ ఆస్కన్ద మర్షత్యహిః పన్థాం వి సర్పతి॥ ॥౫౬॥

అజా,అరే,పిశఙ్గిలా,శ్వావిత్, శ్వావిదితి శ్వా+విత్, కురుపిశఙ్గిలేతి కురు+
... ఙ్గిలా, శశః, ఆస్కన్దమిత్యా+స్కన్దమ్, అర్షతి, అహిః, వి, సర్పతి॥ ॥౫౬॥

పదార్థః:-(అజా) జన్మరహితా ప్రకృతిః, (అరే) సంబోధనే, (పిశంగిలా) (శ్వావిత్) పశువిశేష ఇవ,(కురుపిశంగిలా)కురోః కృతస్య కృష్యాదేః పిశాన్యంగాని గిలతి సా, (శశః)పశు విశేష ఇవ వాయుః, (ఆస్కందమ్)సమంతాదుత్ప్లుత్య గమనమ్, (అర్షతి) ప్రాప్నోతి, (అహిః) మేఘః,(పంథామ్)పంథానమ్,(వి సర్పతి)వివిధతయా గచ్ఛతి. ॥౫౬॥

అన్వయః:-అరే మనుష్యా అజా పిశఙ్గిలా శ్వావిత్కురుపిశంగిలాఽస్తి. శశ ఆస్కంద మర్షత్యహిః, పంథాం విసర్పతీతి విజానీత. ॥౫౬॥

భావార్థః:-హేమనుష్యా అజా యాఽజా ప్రకృతిః సర్వకార్యప్రలయాధికారిణీ కార్య కార్యణాఖ్యా స్వకార్యం స్వస్మిన్ ప్రచాలయతి. యా సేధా కృష్యాదికం వినాశయతి యో వాయుః శశ ఇవ గచ్ఛన్ సర్వం శోషయతి,యో మేఘః సర్ప ఇవ గచ్ఛతి.తాన్ విజానీత.

పదార్థము:-అరే=ఓ మానవులారా ! అజా=జన్మరహిత ప్రకృతి, పిశంగిలా= విశ్వముయొక్క రూపమును ప్రలయకాలమున మింగునది,శ్వావిత్=పదుపంది,కురుపిశం గిలా=కృషియొనర్చబడిన వ్యవసాయపు టంగములను నాశనమొనరించునది. శశః= చెవులపిల్లివలె వేగయుక్తమును,కృష్యాదులను ఖరఖరలాడించునదియు నగు వాయువు, ఆస్కందమ్=బాగుగా గంతులువేయుచు,ఒక పదార్థమునుండి మఱియొక పదార్థమును శీఘ్రముగ,అర్షతి=పొందుచున్నది.మఱియు, అహిః=మేఘము, పంథామ్=మార్గమున, వి సర్పతి=వివిధగతులచే వ్యాపించుచు పోవును.ఈ విషయము నెఱుగుడు. [౫౬]

భావార్థము:-ఓ మానవులారా! ఏ ప్రకృతి కార్యరూపమున నున్న జగత్తంతటిని ప్రలయమొనర్చి కార్యకారణరూపమున నున్న స్వకార్యమును తనలోనే లయమొనర్చు కొనునదై యున్నదో, ఏ యేదుపంది కృష్యాదులను నాశనమొనర్చునో, ఏ వాయువు శశమువలె వీచుచు అన్నిటిని ఎండింపజేయునో, ఏ మేఘము సర్పమువలె భూమి మీఁద పోవునో వానినన్నిటిని తెలుసుకొనుడు. ౧౩౬౨[౫౬]

---

౧౩౬౩ కత్యస్యేత్యస్య ప్రజాపతిః ఋషిః, ప్రష్టా దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః
పునః ప్రశ్నానాహ.

మఱల ప్రశ్నలు.

కత్యస్య విష్ఠాః కత్యక్షరాణి కతి హోమాసః కతిధా సమిద్ధః।
యజ్ఞస్య త్వా విదథా పృచ్ఛమత్రి కతి హోతార ఋతుశో యజన్తి ॥౫౭॥

కతి,అస్య,విష్ఠాః, విష్ఠా ఇతి వి+స్థాః, కతి, అక్షరాణి, కతి, హోమాసః, కతిధా, సమిద్ధ ఇతి సమ్+ఇద్ధః, యజ్ఞస్య, త్వా,విదథా, పృచ్ఛమ్,అత్ర,కతి, హోతారః, ఋతుశ ఇత్యృతుశః, యజన్తి ॥౫౭॥

పదార్థః:(కతి)(అస్య) (విష్ఠాః) విశేషేణ తిష్ఠతి యజ్ఞో యాసు తాః(కతి) (అక్షరాణి) ఉదకాని.అక్షర మిత్యుదక నా...నిఘం.౧.౧౨.(కతి)(హోమాసః)దానాఽఽదానాని,(కతిధా) కతి ప్రకారైః, (సమిద్ధః) జ్ఞానాదిప్రకాశకాః సమిద్రూపాః. అత్ర ఛాందసోవర్ణాగమ స్తేన ధస్య ద్విత్వం సంపన్నమ్(యజ్ఞస్య)సంయోగాదుత్పన్నస్య జగతః,(త్వా)త్వామ్, (విదథా)విజ్ఞానాని,(పృచ్ఛమ్)పృచ్ఛామి,(అత్ర)(కతి)(హోతారః)(ఋతుశః)ఋతుమృతుం ప్రతి,(యజంతి) సంగచ్ఛంతే. ॥౫౭॥

అన్వయః:-హే విద్వన్నస్య యజ్ఞస్య కతి విష్ఠాః? కత్యక్షరాణి? కతి హోమాసః? కతిధా సమిద్ధః? కతి హోతార ఋతుశో యజంతీత్యత్ర విషయే విదథా త్వాఽహం పృచ్ఛమ్

భావార్థః:-ఇదం జగత్ క్వ తిష్ఠతి? కత్యస్య నిర్మాణసాధనాని? కతి వ్యాపారయోగ్యాని కతివిధం జ్ఞానాదిప్రకాశకం? కతి వ్యవహర్తార ఇతి పంచ ప్రశ్నా స్తేషాముత్తరాణ్యుత్తరత్ర వేద్యాని. ॥౫౭॥

పదార్థము:-ఓ విద్వాంసుడా! అస్య యజ్ఞస్య=సంయోగజన్యము సంసారరూపము నగు ఈయజ్ఞమునకు,కతి విష్ఠాః=సంసారరూపయజ్ఞము విశేషించి స్థితమైయున్న విష్ఠలు ఎన్ని ? కతి అక్షరాణి=జలాదిసాధనములెన్ని ? కతి హోమాసః=ఆదానప్రదానములకు యోగ్యములైన పదార్థములెన్ని ? కతిధా సమిద్ధః=జ్ఞానాదుల సాధకములగు సమిద్రూపములు ఎన్నివిధములు, కతి హోతారః=ఆదానప్రదానములొనర్చు హోతలెంత మంది,ఋతుశః=వసంతాది ఋతువులందు,యజంతి=సంగతమొనర్చు చున్నారు ?ఈ విధముగ,అత్ర=ఈ విషయములో,విదథా=విజ్ఞానములను,త్వా=నిన్ను, నేను, పృచ్ఛమ్=ప్రశ్నించుచున్నాను. [౫౭]

భావార్థము:-ఈ జగత్తెక్కడ స్థితమైయున్నది ? దీనియుత్పత్తి సాధనములెన్ని? వ్యాపారయోగ్యములగు వస్తువు లెన్ని ? జ్ఞానాదిప్రకాశక వస్తువు లెన్నివిధములు ? వ్యవహర్త లెందరు ? ఈ అయిదు ప్రశ్నల సమాధానములు తర్వాత మంత్రములో తెలుసుకొనదగును. ౧౩౬౩[౫౭]

౧౩౬౪ షడస్యేత్యస్య ప్రజాపతి ఋషిః, సమిధా [సమాధాతా అని ఉండుట యుచితము].
దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః

పూర్వప్రశ్నానా ముత్తరాణ్యాహ
పూర్వమంత్ర కథిత ప్రశ్నలకు ప్రత్యుత్తరములు

షడస్య విష్ఠాః శతమక్షరాణ్యశీతి ర్హోమాః సమిధో హ తిస్రః ।
యజ్ఞస్య తే విదథా ప్ర బ్రవీమి సప్త హోతార ఋతుశో యజన్తి ॥౫౮॥

షట్, అస్య, విష్ఠాః, విష్ఠా ఇతి వి+స్థాః, శతమ్, అక్షరాణి, అశీతిః, హోమాః, సమిధ ఇతి సమ్+ఇధః, హ, తిస్రః, యజ్ఞస్య, తే, విదథా, ప్ర, బ్రవీమి, సప్త, హోతారః, ఋతుశ ఇతి ఋతు+శః యజన్తి ॥౫౮॥

పదార్థః:-(షట్)ఋతవః,(అస్య)(విష్ఠాః)(శతమ్)(అక్షరాణి) ఉదకాని,(అశీతిః)ఉపలక్షణమేతదసంఖ్యస్య,(హోమాః)(సమిధః)సమిధ్యతే,ప్రదీప్యతే జ్ఞానం యాభి స్తాః,(హ)కిల, (తిస్రః)(యజ్ఞస్య)(తే)తుభ్యమ్,(విదథా)(విజ్ఞానాని),(ప్ర)ప్రకర్షేణ,(బ్రవీమి)(సప్త) పంచప్రాణా మన ఆత్మా చ,(హోతారః)దాతార ఆదాతారః,(ఋతుశః)(యజంతి). ॥౫౮॥

అన్వయః:-హే జిజ్ఞాసవోఽస్య యజ్ఞస్య షడ్ విష్ఠాః శతమక్షరాణ్యశీతి ర్హోమా స్తిస్రో హ సమిధః సప్త హోతార ఋతుశో యజంతి తస్య విదథా తేఽహం ప్రబ్రవీమి. ॥౫౮॥

భావార్థః:-హే జ్ఞాన మీప్సవో జనా యస్మిన్ యజ్ఞే షడ్ ఋతవః స్థితిసాధకా అసంఖ్యాని జలాదీని వస్తూని వ్యవహారసాధకాని బహవో వ్యవహారయోగ్యాః పదార్థాః సర్వేప్రాణ్యప్రాణినో హోత్రాదయః సంగచ్ఛంతే.యత్ర చ జ్ఞానాదిప్రకాశికా త్రివిధా విద్యాః సంతి తం యజ్ఞం యూయం విజానీత. ॥౫౮॥

పదార్థము:-ఓ.జిజ్ఞాసువులారా! అస్య యజ్ఞస్య=ఈసంగతమగు జగత్తునకు,షట్=ఆరు రుతువులు, విష్ఠాః=విశేషస్థితికి నాధారములైన విష్ఠలు, శతమ్ అక్షరాణి=జలాదుల యుత్పత్తి సాధనము లసంఖ్యాకములు,అశీతిః హోమాః=ఆదానప్రదాన యోగ్యవస్తువు లసంఖ్యాకములు,తిస్రః=ఆధ్యాత్మికాది భౌతికాధి దైవికములు అనుమూడు,హ సమిధః=ప్రసిద్ధికెక్కిన జ్ఞానాదుల ప్రకాశకములగు విద్యలు,సప్త=పంచప్రాణములు, మనస్సు, ఆత్మ ఈ యేడు,హోతారః=ఇచ్చిపుచ్చుకొను వ్యవహారములకు కర్తలు,ఋతుశః=వసంతాది ప్రతి రుతువునందు,యజంతి=సంగతులగుచున్నారు.ఆ జగత్తుయొక్క,వితథా=విజ్ఞానములను,తే=నీకు,నేను,ప్రబ్రవీమి=చెప్పుచున్నాను. [౫౮]

భావార్థము:-జ్ఞానమునభిలషించు జనులారా! ఏ జగద్రూప యజ్ఞమునందు స్థితిసాధకములగు షడృతువులు,అసంఖ్యములగు జలాదివస్తువులు,వ్యవహార యోగ్య పదార్థము

లున్నవో,ఎచట సకలప్రాణులు, అప్రాణులు, హోతలు మున్నగువారు సంగతులగుచున్నారో, ఎక్కడ జ్ఞానాది ప్రకాశములగు త్రివిధ విద్యలున్నవో ఆ యజ్ఞమును మీరు తెలుసుకొనుడు. ౧౩౬౪[౫౮]

---

౧౩౬౫ కోఽస్యేత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ప్రష్టా దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః, స్వరః
పునః ప్రశ్నానాహ
మఱల ప్రశ్నల నడుగుచున్నాడు.

కో అస్య వేద భువనస్య నాభిం కో ద్యావాపృథివీ అన్తరిక్షమ్ ।
కః సూర్యస్య వేద బృహతో జనిత్రం కో వేద చన్ద్రమసం యతోజాః ॥

కః, అస్య, వేద, భువనస్య, నాభిమ్, కః, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, అన్తరిక్షమ్, కః, సూర్యస్య, వేద, బృహతః, జనిత్రమ్, కః, వేద, చన్ద్రమసమ్, యతోజా ఇతి యతః+జాః॥ ॥౫౯॥

పదార్థః:-(కః)(అస్య)(వేద)జానాతి,(భువనస్య) సర్వాధికరణస్య సంసారస్య, (నాభిమ్) మధ్యమాంగం బంధనస్థానమ్,(కః)(ద్యావాపృథివీ)సూర్యభూమీ, (అంతరిక్షమ్)ఆకాశమ్, (కః)(సూర్యస్య)సవితృమండలస్య,(వేద)జానాతి,(బృహతః)మహతః,(జనిత్రమ్)కారణం జనకం వా (కః)(వేద)(చంద్రమసమ్)చంద్రలోకమ్,(యతోజాః)యస్మాజ్జాతః. ॥౫౯॥

అన్వయ-:-హే విద్వన్నస్య భువనస్య నాభిం కో వేద? కో ద్యావాపృథివీ అంతరిక్షం వేద ? కో బృహతః సూర్యస్య జనిత్రం వేద ? యో యతోజాస్తం చంద్రమసం చ కో వేదేతి వదతా ధేహి. ॥౫౯॥

భావార్థః-అస్య జగతో ధారకం బంధనం భూమిసూర్యాంతరిక్షాణి మహతః సూర్యస్య కారణం యస్మాదుత్పన్నశ్చంద్ర స్తం చ కో వేదేతి చతుర్ణాం ప్రశ్నానాము త్తరాణి పరస్మిన్ మంత్రే సంతీతి వేదితవ్యమ్. ॥౫౯॥

పదార్థము:-ఓ విద్వాంసుడా ! అస్య భువనస్య=సకలమునకాధార భూతమగు నీ జగత్తుయొక్క, నాభిమ్=బంధనస్థానమగు మధ్యభాగమును, కః వేద=ఎవడు ఎరుగుచున్నాడు? కః=ఎవడు,ద్యావాపృథివీ=సూర్యుని మఱియు పృథివిని,అంతరిక్షమ్=ఆకాశమును ఎఱుగును? కః=ఎవడు,బృహతః సూర్యస్య=గొప్ప సూర్యమండలముయొక్క, జనిత్రమ్=ఉపాదానమునులేక నిమిత్తకారణమును,వేద=ఎఱుగుచున్నాడు? మఱియు యతోజాః=దేనినుండి ఉదయించెనో,చంద్రునియొక్క ఆ ఉత్పాదకుని,మఱియు,చంద్రమసం=చంద్రలోకమును,కః వేద=ఎవడెఱుగుచున్నాడు దీనికి సమాధానమొసగుము.

భావార్థము:-ఈ జగత్తుయొక్క ధారణకర్తను,బంధనమును, భూమి సూర్యాన్తరిక్షములను, మహాంతుడైన సూర్యునికారణమును, దేనినుండి చంద్రుడుపుట్టెనో దానిని ఎవడు ఎఱుగుచున్నాడను నీనాలుగు ప్రశ్నలకు జవాబులు ముందు మంత్రమునం దెఱుగదగును. ౧౩౮౫[౫౯]

---

౧౩౮౬ వేదాహమిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, సమాధాతా దేవతా, త్రిష్టుప్ ఛందః ధైవతః స్వరః

పూర్వ ప్రశ్నానా ముత్తరాణ్యాహ

పూర్వమంత్రోక్త ప్రశ్నలకు సమాధానములు

వేదాహ మస్య భువనస్య నాభిం వేద ద్యావాపృథివీ అన్తరిక్షమ్।
వేద సూర్యస్య బృహతో జనిత్రమథో వేద చన్ద్రమసం యతోజాః॥౬౦॥

వేద, అహమ్, అస్య, భువనస్య, నాభిమ్, వేద, ద్యావాపృథివీ ఇతి ద్యావా+పృథివీ, అంతరిక్షమ్, వేద, సూర్యస్య, బృహతః, జనిత్రమ్, అథో ఇత్యథో, వేద, చంద్రమసమ్, యతోజా ఇతి యతః+జాః॥ ॥౬౦॥

పదార్థః- (వేద) (అహమ్)(అస్య)(భువనస్య) (నాభిమ్) బంధనమ్, (వేద)(ద్యావాపృథివీ) ప్రకాశాప్రకాశౌ లోకసమూహౌ (అంతరిక్షమ్) ఆకాశమ్, (వేద) సూర్యస్య) (బృహతః) బృహత్పరిమాణయుక్తస్య, (జనిత్రమ్) (అథో) (వేద) (చంద్రమసమ్) (యతోజాః) ॥౬౦॥

అన్వయః- హే జిజ్ఞాసోఽస్య భువనస్య నాభిమహం వేద ద్యావాపృథివీ అంతరిక్షం వేద బృహతః సూర్యస్య జనిత్రం వేద, అథో యతోజాస్తం చంద్రమసఞ్చాహం వేద. ॥౬౦॥

పదార్థము:-ఓ జిజ్ఞాసూ ! అస్య భువనస్య=సకలమున కధికరణమగు నీ భువనము యొక్క,నాభిమ్=బంధనస్థానమును,కారణరూప మధ్యభాగమునగు పరబ్రహ్మను,అహమ్=నేను, వేద=ఎఱుగుదును,మఱియు, ద్యావాపృథివీ=ప్రకాశితములు అప్రకాశితములు నగు లోకసమూహములను, అంతరిక్షమ్=ఆకాశమునుకూడ, వేద=నే నెఱుగుచున్నాను బృహతః సూర్యస్య=గొప్పదగు సూర్యలోకమునకు, జనిత్రమ్=ఉపాదాన కారణమగు తైజసమును,నిమిత్తకారణమగు బ్రహ్మను. వేద=ఎఱుగుచున్నాను?అథో=దీనియనంతరము, యతోజాః=ఏ పరమాత్మనుండి చంద్రుడుదయించెనో ఆపరమాత్మని, మఱియు, చంద్రమసమ్=చంద్రుని,వేద=నే నెఱుగుచున్నాను. [౬౦]

భావార్థము:-విద్వాంసుడుత్తర మిచ్చును:-ఓ జిజ్ఞాసువా! ఈజగత్తుయొక్క బంధనము అనగా స్థితికికారణము, ప్రకాశితములు-అప్రకాశితములు, మధ్యస్థమైన ఆకాశము అను నీలోకత్రయముల కారణమును,సూర్యచంద్రుల ఉపాదాననిమిత్తకారణములను,

ఏతత్సమస్తమును నేనెఱుగుదును. బ్రహ్మయే ఈ సకలమునకు నిమిత్తకారణము, మఱియు ప్రకృతి ఉపాదానకారణమునై యున్నది. ౧౩౬౬[౬౦]

౧౩౬౭ పృచ్ఛామీత్యస్య ప్రజాపతి ర్ఋషిః, స్రష్టా దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః
పునః ప్రశ్నానాహ
మరల ప్రశ్నల వేయుచున్నాడు

పృచ్ఛామి త్వా పరమన్తం పృథివ్యాః పృచ్ఛామి యత్ర భువనస్య నాభిః।
పృచ్ఛామి త్వా వృష్ణో అశ్వస్య రేతః పృచ్ఛామి వాచః పరమం వ్యోమ॥

పృచ్ఛామి, త్వా, పరమ్, అన్తమ్, పృథివ్యాః, పృచ్ఛామి, యత్ర, భువనస్య, నాభిః, పృచ్ఛామి, త్వా, వృష్ణః, అశ్వస్య, రేతః, పృచ్ఛామి, వాచః, పరమమ్, వ్యోమేతి వి+ఓమ॥ ॥౬౧॥

పదార్థః-(పృచ్ఛామి) (త్వా) త్వామ్, (పరమ్) పరభాగస్థమ్, (అన్తమ్) సీమానమ్, (పృథివ్యాః) (పృచ్ఛామి) (యత్ర) (భువనస్య) (నాభిః) మధ్యాకర్షణేన బంధకమ్, (పృచ్ఛామి) (త్వా) త్వామ్, (వృష్ణః) సేచకస్య, (అశ్వస్య) బలవతః, (రేతః) వీర్యమ్, (పృచ్ఛామి) (వాచః) వాణ్యాః (పరమమ్) ప్రకృష్టమ్, (వ్యోమ) ఆకాశరూపం స్థానమ్. ॥౬౧॥

అన్వయః- హే విద్వన్నహం త్వా త్వాం పృథివ్యా అంతం పరం పృచ్ఛామి. యత్ర భువనస్య నాభి రస్తి తం పృచ్ఛామి యద్ వృష్ణో ఽశ్వస్య రేతో ఽస్తి, తత్ పృచ్ఛామి, వాచః పరమం వ్యోమ త్వా పృచ్ఛామీతి వదోత్తరాణి. ॥౬౧॥

భావార్థః:-పృథివ్యాః సీమా లోకస్యాకర్షణేన బంధనం బలినో జనస్య పరాక్రమో వాక్పారగశ్చ కో ఽస్తీత్యేతేషాం ప్రశ్నానా ముత్తరాణి పరస్మిన్ మంత్రే వేదితవ్యాని. ॥౬౧॥

పదార్థము:-ఓ విద్వాంసుడా ! నేను, త్వా=నిన్ను, పృథివ్యాః=పృథివియొక్క, పరమ్ అంతమ్=పరభాగమగు అవధిని, పృచ్ఛామి=అడుగుచున్నాను. యత్ర=ఎచ్చట, భువనస్య=లోకముయొక్క, నాభిః=మధ్యభాగమున నుండి ఆకర్షించి బంధనమొనర్చుచున్నదానిని, పృచ్ఛామి=ప్రశ్నించుచున్నాను. వృష్ణః=[వర్షింపజేసి] సేచనమొనర్చువాడును, అశ్వస్య=బలవంతుడునగు పురుషునియొక్క, రేతః=పరాక్రమమున్నదో దానిని, పృచ్ఛామి=అడుగుచున్నాను. వాచః=వేదత్రయరూపములోనున్న వాణియొక్క, పరమమ్=ఉత్తమమగు, వ్యోమ=ఆకాశరూపస్థానమును, త్వా=నిన్ను, పృచ్ఛామి=అడుగుచున్నాను. నీవు ప్రత్యుత్తరమిమ్ము. [౬౧]

భావార్థము:-పృథివియొక్క సీమయెద్ది? లోకమును ఆకర్షించు బంధనమేది? బల

వంతుని పరాక్రమమేది ? వాక్పారగుడు ఎవడు? అను నీ ప్రశ్నల కు త్తరము తర్వాత మంత్రమునందు తెలుసుకొనవచ్చును. ౧౩౬౭[౬౧]

---

౧౩౬౮ ఇయమిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, సమాధాతా దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః,స్వరః

పూర్వ ప్రశ్నానా ముత్తరాణ్యాహ

పూర్వమంత్రోక్త ప్రశ్నలకు సమాధానములు

ఇయం వేదిః పరో అన్తః పృథివ్యా అయం యజ్ఞో భువనస్య నాభిః ।
అయఀ సోమో వృష్ణో అశ్వస్య రేతో బ్రహ్మాయం వాచః పరమం వ్యోమ॥౬౨॥

ఇయమ్, వేదిః, పరః, అంతః,పృథివ్యాః, అయమ్, యజ్ఞః, భువనస్య,నాభిః, అయమ్, సోమః,వృష్ణః, అశ్వస్య, రేతః, బ్రహ్మా, అయమ్, వాచః, పరమమ్, వ్యోమేతి వి+ఓమ ॥౬౨॥

పదార్థః:-(ఇయః)(వేదిః)మధ్యరేఖా (పరః) (అంతః) (పృథివ్యాః) భూమేః, (అయమ్) (యజ్ఞః)సర్వైః పూజనీయో జగదీశ్వరః, (భువనస్య) సంసారస్య, (నాభిః) అయమ్) (సోమః) ఓషధిరాజః, (వృష్ణః) వీర్యకరస్య; (అశ్వస్య) బలేన యుక్తస్య జనస్య, (రేతః) (బ్రహ్మా) చతుర్వేద విత్, (అయమ్) (వాచః) వాణ్యాః. (పరమమ్) (వ్యోమ) స్థానమ్. ॥౬౨॥

అన్వయః- హే జిజ్ఞాసో ఇయం వేదిః పృథివ్యాః పరోఽన్తోఽయం యజ్ఞో భువనస్య నాభిరయం సోమో వృష్ణోఽశ్వస్య రేతోఽయం బ్రహ్మా వాచః పరమం వ్యోమాఽస్తీతి విద్ధి. ॥౬౨॥

భావార్థః:-హే మనుష్యా యద్యస్య భూగోలస్య మధ్యస్థా రేఖా క్రియేత తర్హి సా ఉపరిష్టాత్ భూమేరంతం ప్రాప్నువతీ సతీ వ్యాససంజ్ఞాం లభతే.అయమేవ భూమేరంతోఽస్తి.సర్వేషాం మధ్యాకర్షణం జగదీశ్వరః సర్వేషాం ప్రాణినాం వీర్యకర ఓషధిరాజః సోమో వేదపారగో వాక్పారగోఽస్తీతి యూయం విజానీత. ॥౬౨॥

భావార్థము:-ఓ జిజ్ఞాసూ! ఇయమ్ వేదిః=ఈమధ్యరేఖ,పృథివ్యాః=భూమియొక్క, పరః అంతః=పరభాగమైన యవధి,అయమ్ యజ్ఞః=ప్రత్యక్షగుణములుగలవాడును,అందఱికి పూజనీయుడునగు నీ జగదీశ్వరుడు, భువనస్య=సంసారమునకు, నాభిః=నియతస్థితికి బంధకుడు,అయమ్సోమః=ఓషధులలోనుత్తమము అంశుమంతమునగునీసోమము,వృష్ణః అశ్వస్య=పరాక్రమవంతుడు బలవంతుడునైన జనునియొక్క, రేతః=పరాక్రమము. అయమ్ బ్రహ్మా=చతుర్వేదవిత్తగు నీబ్రహ్మ,వాచః= వేదత్రయరూపముగనున్న వాణికి, పరమమ్ వ్యోమ=ఉత్తమమైన స్థానము అని నీవు గ్రహించుము. [౬౨]

భావార్థము:-ఓ మనుష్యులారా! ఈ భూమికి మధ్యస్థముగ నొక రేఖను గీయుచో అది పైనుండి భూమియంతమును స్పర్శించును. అది వ్యాసమనబడును. అదియే భూమికి అంతావధి అనియు,సకలలోకములకు మధ్య ఆకర్షణకర్త జగదీశ్వరుడనియు,సర్వప్రాణులకు పరాక్రమ కర్త,ఔషధములందుత్తమము అంశుమంతమునైనది సోమము అనియు, వేదపారగుడగు పురుషుడు వాణీపారంగతుడు అనియు మీరెఱుగుడు, ౧౩౬౮[౬౨]

---

౧౩౬౯ సుభూరిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, సమావర్తా దేవతా, విరాడనుష్టుప్ ఛందః,గాంధారశ్స్వరః

ఈశ్వరః కీదృశ ఇత్యాహ

ఈశ్వరుడెటువంటివాడు ?

సు॒భూః స్వ॑య॒మ్భూః ప్ర॑థ॒మో॒ఽన్తర్మ॑హ॒త్య॑ర్ణ॒వే ।

ద॒ధే హ॒ గర్భ॑ మృ॒త్వియం॑ యతో॑ జా॒తః ప్ర॒జాప॑తిః ॥ ॥౬౩॥

సు॒భూ రితి॑ సు+భూః, స్వ॒య॒మ్భూరితి॑ స్వ॒యమ్+భూః, ప్ర॒థ॒మః,అ॒న్తః, మ॒హ॒తి, అ॒ర్ణ॒వే, ద॒ధే, హ॒, గర్భ॑మ్, ఋ॒త్వియ॑మ్, య॒తః, జా॒తః, ప్ర॒జాప॑తి॒ రితి॑ ప్ర॒జా+ప॑తిః॥ ॥౬౩॥

పదార్థః:-(సుభూః)యః సుష్ఠు భవతీతి,(స్వయంభూః)యః స్వయంభవత్యుత్పత్తి నాశ రహితః,(ప్రథమః)ఆదిమః,(అంతః)మధ్యే,(మహతి) (అర్ణవే) యత్రార్ణాంస్యుదకాని సంబద్ధాని సంతి తస్మిన్సంసారే(దధే)దధాతి, (హ)కిల, (గర్భమ్) బీజమ్,(ఋత్వియమ్)ఋతుసమాప్తోఽస్య తమ్,(యతః)యస్మాత్,(జాతః)(ప్రజాపతిః)ప్రజాపాలకః సూర్యః. ॥౬౩॥

అన్వయః:-హే జిజ్ఞాసో యతః ప్రజాపతి ర్జాతో యశ్చ సుభూః స్వయంభూః ప్రథమో జగదీశ్వరో మహత్యర్ణవేఽన్తరృత్వియం గర్భం దధే తం హ సర్వే జనా ఉపాసీరన్, ॥౬౩॥

భావార్థః- యది యే మనుష్యాః సూర్యాదీనాం పరం కారణం ప్రకృతిం తత్ర బీజధారకం పరమాత్మానం చ విజానీయు స్తర్హి తేఽస్మిన్సంసారే విస్తీర్ణసుఖా భవేయుః. ॥౬౩॥

పదార్థము:-ఓ జిజ్ఞాసూ! యతః=ఏజగదీశ్వరుని నుండి,ప్రజాపతిః=విశ్వరక్షకుడగు సూర్యుడు,జాతః=ఉత్పన్నమయ్యెనో,సుభూః=చక్కగ విద్యమానుడు, స్వయంభూః= స్వయంప్రసిద్ధుడు, ఉత్పత్తి నాశరహితుడు, ప్రథమః=అందఱికంటె నుత్తముడునైన, ఏ పరమాత్మ, మహతి అర్ణవే అంతః=విశాలమును, జలములచే సంబద్ధమును నగు లోకము యొక్క మధ్య,ఋత్వియమ్ గర్భమ్=సమయానుకూలముగ ప్రాప్తమగు బీజమును,దధే =ధారణమొనర్చు చున్నాడో,హ=ఆతనినే అందఱు ఉపాసించవలయును: [౬౩]

భావార్థము:-ఏ మానవులు సూర్యాదిలోకముల కుత్తమ కారణమగు ప్రకృతిని,

ఆ ప్రకృతియందుత్పత్తి శక్తిని ధారణమొనర్చు పరమాత్ముని ఎఱుగుదురో వారే యీ లోకమున విస్తారమైన సుఖమును పొందువారగుదురు. ౧౩౯౯[౬౩]

---

౧౩౭౦ హోతా యక్షదిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ఈశ్వరో దేవతా, విరాడుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః

ఈశ్వరః కథముపాస్య ఇత్యాహ

ఈశ్వరు నెటుల నుపాసించవలయును?

**హోతా యక్షత్ ప్రజాపతిꣳ సోమస్య మహిమ్నః।**

**జుషతాం పిబతు సోమꣳ హోత ర్యజ॥** ॥౬౪॥

**హోతా, యక్షత్, ప్రజాపతి మితి ప్రజా+పతిమ్, సోమస్య, మహిమ్నః, జుషతామ్, పిబతు, సోమమ్, హోతః, యజ॥** ॥౬౪॥

పదార్థః- (హోతా) ఆదాతా, (యక్షత్) యజేత్ పూజయేత్, (ప్రజాపతిమ్) విశ్వస్య పాలకం స్వామినమ్. (సోమస్య) సకలైశ్వర్యయుక్తస్య (మహిమ్నః) మహతో భావస్య సకాశాత్, (జుషతామ్) (పిబతు) (సోమమ్) సర్వౌషధిరసమ్, (హోతః) దాతః, (యజ)పూజయ.

అన్వయః- హే హోతర్యథా హోతా సోమస్య మహిమ్నః ప్రజాపతిం యక్షజ్జుషతాం చ, సోమం చ పిబతు తథా త్వం యజ పిబ చ. ॥౬౪॥

భావార్థః- అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా యథా విద్వాంసోఽస్మిఞ్జగతి రచనాది విశేషైః పరమాత్మనో మహిమానం విదిత్వైనముపాసతే.తథైతం యూయ ముపాధ్వం యథేమే యుక్త్యౌషధాని సేవిత్వా ఽరోగా జాయంతే తథా భవంతోఽపి భవంతు.

పదార్థము:-హోతః=దానమిచ్చువాడా! ఎటుల,హోతా=గ్రహించుపురుషుడు, సోమస్య=సకలైశ్వర్యయుక్తుడు,మహిమ్నః=గొప్పవాడగుటచే, ప్రజాపతిమ్=విశ్వపాలకుడై యున్న స్వామిని, యజేత్=పూజించునో లేక యతనిని, జుషతామ్=సేవించి ప్రసన్నునిగ నొనర్చునో,మఱియు,సోమమ్=సర్వోత్తమములగు ఓషధులరసమును,పిబతు =పానమొనర్చునో,అటులనే, నీవు, యజ=అతనిని పూజించుము, మఱియు ఉత్తమౌషధి రసమును పానమొనర్చుము. [౬౪]

భావార్థము:-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఓమానవులారా ! విద్వాంసులెటుల ఈ జగద్రచనాది విశేషచిహ్నములచే పరమాత్ముని మహిమను ఎఱిగి యతని నుపాసించెదరో, అటులనే మీరును అతనిని ఉపాసించుడు.ఎటుల ఈవిద్వాంసులు యుక్తిపూర్వకముగ పథ్యపదార్థములను సేవించి రోగరహితులగు చున్నారో అటులనే మీరును ఉండుడు. ౧౩౭౦[౬౪]

౧౩౩౧ ప్రజాపతే నేత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ఈశ్వరో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః
పున స్తమేవ విషయ మాహ.
మఱల నా విషయమే.

ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా రూపాణి పరి తా బభూవ। యత్కామా స్తే జుహుమ స్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణామ్॥ ॥౬౫॥

ప్రజాపత ఇతి ప్రజా+పతే, న, త్వత్, ఏతాని, అన్యః, విశ్వా, రూపాణి, పరి, తా, బభూవ, యత్కామా ఇతి యత్+కామాః, తే, జుహుమః, తత్, నః, అస్తు, వయమ్, స్యామ, పతయః, రయీణామ్ ॥౬౫॥

పదార్థః- (ప్రజాపతే) సర్వస్యాః ప్రజాయాః పాలక స్వామిన్నీశ్వర (న) (త్వత్) తవ సకాశాత్ (ఏతాని) పృథివ్యాదీని భూతాని (అన్యః) భిన్నః, (విశ్వా) సర్వాణి, (రూపాణి) స్వరూపయుక్తాని, (పరి) (తా) తాని, (బభూవ) భవతి, (యత్కామాః) యః పదార్థః కామో యేషాం తే, (తే) తవ, (జుహుమః) ప్రశంసామః, (తత్) కమనీయం వస్తు (నః) అస్మభ్యమ్, (అస్తు) భవతు (వయమ్) (స్యామ) భవేమ, (పతయః) స్వామినః పాలకాః, (రయీణామ్) విద్యా సువర్ణాది ధనానామ్. ॥౬౫॥

అన్వయః- హే ప్రజాపతే పరమాత్మన్కశ్చిత్ త్వదన్యస్తా తాన్యేతాని విశ్వా రూపాణి వస్తూని న పరి బభూవ. యత్కామా వయం త్వాం జుహుమ స్తన్నోఽస్తు తే కృపయా వయం రయీణాం పతయః స్యామ. ॥౬౫॥

భావార్థః-యది పరమేశ్వరాదుత్తమం బృహదైశ్వర్యయుక్తం సర్వశక్తి మద్వస్తు కించిదపి నాస్తి తర్హి తుల్యమపి న. యో విశ్వాత్మా విశ్వస్రష్టాఽఖిలైశ్వర్యప్రద ఈశ్వరోఽస్తి తస్యైవ భక్తివిశేషేణ పురుషార్థేనైహిక మైశ్వర్యం యోగాభ్యాసేన పారమార్థికం సామర్థ్యం ప్రాప్నుయామ. ॥౬౫॥

పదార్థము:-ప్రజాపతే=సకలప్రజలకు రక్షకుడవగు స్వామీ! ఈశ్వరా! తా ఏతాని =అయా పృథివ్యాది భూతములమీదను మఱియు, విశ్వా రూపాణి=స్వరూపయుక్తములగు సకల వస్తువులమీదను, త్వత్ అన్యః=నీకంటెనన్యుడెవడును, న పరిబభూవ=బలవంతుడుగా లేడు. యత్కామాః=ఏయేకామనలు కలిగినవారమై, వయమ్=మేము, నిన్ను, జుహుమః=ప్రశంసించెదమో, తత్=ఆయా కామనలకు యోగ్యమగు వస్తువులు, నః= మాకు, అస్తు=లభించుగాక! తే=భవత్కృపచే మేము, రయీణామ్=విద్యాసువర్ణాది ధనములకు, పతయః=రక్షకులగు స్వాములము, స్యామ=అగుదుముగాక! [౬౫]

భావార్థము:-పరమేశ్వరుని కంటె ఉత్తమము, గొప్పదియు, ఐశ్వర్యయుక్తము,

సర్వశక్తివంతమునగు పదార్థమెద్దియు లేనప్పుడు అతనికి తుల్యమైనదియు నేదియులేదు. విశ్వాత్ముడు,విశ్వస్రష్ట, అఖిలైశ్వర్యప్రదుడునగు నే యీశ్వరుడున్నాడో, యతనిశక్తి విశేషముచేతను,స్వపురుషార్థము చేతను ఇహలోకాభ్యుదయమును, యోగాభ్యాసమును సేవించి పరలోకసామర్థ్యమును మేము పొందెదముగాక ! ౧౩౭౧[౬౫]

అత్ర పరమాత్మ మహిమా, సృష్టిగుణవర్ణనం, యోగప్రశంసా, ప్రశ్నోత్తరాణి,
సృష్టిపదార్థ ప్రశంసనం, రాజప్రజాగుణవర్ణనం, శాస్త్రాద్యుపదేశోఽధ్య
యన మధ్యాపనం, స్త్రీ పురుషగుణవర్ణనం, పునః ప్రశ్నోత్తరాణి
పరమేశ్వర గుణవర్ణనం, యజ్ఞవ్యాఖ్యా, రేఖాగణితాది
చోక్తమత ఏతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన
సహ సంగతి రస్తీతి వేద్యమ్

★

ఈ అధ్యాయమునందు ౧ పరమాత్మ మహిమ [౧,౨,౩,౪ ౫,౬], ౨ సృష్టిగుణము [౭], ౩ యోగప్రశంస, ౪. ప్రశ్నోత్తరములు [౯, ౧౦, ౧౧, ౧౨, ౫, సృష్టిపదార్థముల ప్రశంస [౧౬,౧౭], ౬ రాజుయొక్కయు. ప్రజల యొక్కయు గుణముల వర్ణన [౨౦, ౩౩], ౭ శాస్త్రోపదేశము [౧౩, ౧౪, ౧౫], ౮ పఠన పాఠనములు [౩౪, ౩౯, ౪౨, ౪౩], ౯ స్త్రీపురుషుల పరస్పరగుణములు [ ౪౦, ౪౧, ౪౪, ౪౫, ౪౬,], ౧౦ ప్రశ్నోత్తరములు ౪౮, ౪౯. ౫౦,౫౧,౫౨ ౫౩.౫౪, ౫౫, ౫౬, ౫౭, ౫౮, ౫౯, ౬౦, ౬౧, ౬౨,], ౧౧. ఈశ్వరుని గుణములు [౬౩,౬౪. ౬౫] ౧౨ యజ్ఞమునకు వ్యాఖ్య[౫౭, ౫౮] ౧౩ రేఖాగణితాదుల వర్ణన [౬౧. ౬౨ ] యు దుటచే ఈ అధ్యాయమందు చెప్పబడ్డ అర్థమునకు పూర్వాధ్యాయములోచెప్పబడ్డ అర్థముతోసంగతియున్నదని గ్రహించవలయును.

ఇతి శ్రీమత్పరమ హంస పరివ్రాజకాచార్యాణాం పరమవిదుషాం శ్రీమద్విరజానంద
సరస్వతీస్వామినాం శిష్యేణ దయానందసరస్వతీ స్వామినా విరచితే
సంస్కృతార్య భాషాభ్యాం విభూషితే సుప్రమాణయుక్తే
యజుర్వేద భాష్యే త్రయోవింశోఽధ్యాయః
సమాప్తిః

★

కృష్ణామండలాంతర్గత కుందేరు గ్రామవాస్తవ్యులగు పాలడుగు
శేషాచలాచార్య, తదేవ మండలాంతర్గత ముదునూరు గ్రామవాస్తవ్యుడు
ఊన్నే కేశవార్యశాస్త్రి గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన శ్రీమద్దయానంద
సరస్వతీ నిర్మిత యజుర్వేద భాషాభాష్యమందలి యిరువదిమూడవ అధ్యాయము సమాప్తము

# యజుర్వేదము

## ౨౪ వ అధ్యాయము

లోని

## కృమి కీట పశు పక్షి తిర్యక్కుల విజ్ఞానము

ఈ 24 వ అధ్యాయములో పశుపక్షుల, సర్పాదుల, వన్యమృగముల, జలచరముల, కీటాదుల గుణములు వర్ణించబడినవని మహర్షి దయానందు డధ్యాయాంతమున నిర్దేశించి యుండెను. ఇంతియగాక వెనుకటి ౨౩ వ అధ్యాయముతో సంగతియు నున్నదని సూచించెను.

సకల విద్యలు వేదమున బీజరూపమున నున్నవి. మానవులకు సకలజీవులతో సంపర్కమున్నది. కావున వానినుండి యేయేలాభములు, హానులు సంభవించునో ఇందు నిర్దేశించబడినవి. ఇందు ఆయాతిర్యక్ప్రాణులు గుణమునుబట్టి, రంగునుబట్టి, ఆకారమునుబట్టి, స్వభావకర్మలను బట్టి సూచించబడినవి. ఈ జంతువిద్య యందలి రహస్యమును పరిశీలించి సంఘోపయోగముగ విషయములను వెల్లడించుట చాలా అవసరము.

గుఱ్ఱములకు, ఎడ్లకు, ఆవులకు, గేదలకు, కోళ్ళకు, గొఱ్ఱెలకు, మేకలకు ఉన్న రంగులను బట్టి, సుడులనుబట్టి వాని గుణములను, మంచిచెడులను నిర్ణయించుకొనుట రైతాంగమునందును ప్రజానీకమునందును ప్రచలితమైయున్నది. వారును, ఆధునిక జంతుశాస్త్రజ్ఞులును ఇరువురు ఈ విషయముమీద పరిశోధించి నూతన ఫలితములను లోకమున కందించగలరని నమ్ముచున్నాము.

ఈ అధ్యాయమును సరళముగ అర్థముచేసుకొనుటకై ముందు మహర్షి దయానందుని వ్యాఖ్యానమునుండి కొన్ని వాక్యముల నుదహరించు చున్నాము.

అత్ర సర్వత్ర దేవతాపదేన తత్తద్గుణయోగాత్ పశవో వేదితవ్యాః(౧)యా యస్య పశో ర్దేవతాఽస్తి స తద్గుణోఽస్తీతి వేద్యమ్. (మం.౧౩,౧౯) యే పశవః పక్షిణశ్చ వాయుగుణాః సూర్యగుణాః సంతి తైస్తదనుకూలాని కార్యాణి సాధనీయాని. (౪) యే మనుష్యా వాయ్వగ్న్యాదిగుణా న్పశూన్ పాలయంతి తే సర్వోపకారకా భవంతి. (మం. ౮). చంద్రాది గుణ యుక్తాః పశవః సంతి తైస్తత్తత్కార్యం మనుష్యైః సాధ్యమ్ (మం.౨).

అని పలుతావులందు నిర్దేశించబడినది. ఇందు ఏయే దేవతలు గలవిగా ఏయే జంతువులు చెప్పబడియున్నవో ఆయా దేవతాగుణము లాయా పశువులందుండుననియు, వానిని చక్కగా గమనించి ఉపకారమును పొందమనియు సూచించెను.

ఇందు "ఆలభతే" అను ప్రయోగమును గాంచి యనేకులు యజ్ఞము నందాయా దేవతల నుద్దేశించి ఆయా పశువుల బలినొసగుటయే మంత్రాశయమని భావించువారును గలరు.

వారికొక చిన్న మనవి:-యజ్ఞమునకు మరొక నామధేయము అధ్వరము. హింసారహితమైనది అని అధ్వరశబ్దార్థము అట్టిచో యజ్ఞమునందు హింస జరుగదని వేరుగా చెప్పనవస

రము లేదుగదా ! ఆలభతే పదమునకు చంపుట అను అర్థము రాజాలదు. ఎవరైనా అటుల గ్రహించుచో వైదికసాహిత్యమును వారెరుగరని భావించవలయును. వేదమునందు పదేపదే పశువులను పెంచవలయును, పోషించవలయునని బోధించబడినది, యజ్ఞమునందు ముఖ్యముగా వీరిచే బలివస్తువుగ భావించబడు గోవు 'అఘ్న్యా'గా కీర్తించబడినది. అది చంపదగినది కాదు, కొట్టతగినదియు కాదని ఆ శబ్దమే నిర్దేశించుచున్నది. కావున వైదిక ధర్మమును మననమొనర్చి సిద్ధాంతీకరించుకొనవలసి యున్నది.

ఆలభతే శబ్దము(౧౧, ౧౬, ౨౦-౨౯) మొత్తము ౧౨ మంత్రములలో కనబడుచున్నది. ౩౦ వ అధ్యాయపు ౨౨ వ మంత్రములో కూడ ఉన్నది. ఈ మంత్రములన్నిటిలో చతుర్థీ విభక్త్యంతములకు ద్వితీయా బహువచనాంతములు జోడించబడినవి.౧౧ వ మంత్రములో ఋతువులాటింటికి ధూమ్ర శ్వేత కృష్ణ అరుణ పిశంగవర్ణములు చెప్పబడినవి. రంగులు బలియివ్వ బడుటకు సాధనములు కాజాలవుగదా ! ఇక ఆయారంగులుగల జంతువులను గ్రహించుచో అవి యేవియగును ? ఇచ్చట సంస్కృత పదార్థములో ఆ=సమంతాత్, లభతే=ప్రాప్నోతి, చక్కగ పూర్తిగ లభించుట, పొందుట అని యర్థమొనర్చబడినది. మిగతా తావులలో నిదియే యర్థమొనర్చబడినవి. ఆయాకార్యములకై ఆయా వస్తువులు లేక ప్రాణులు ఉపయోగకరములు గావున బుద్ధిమంతులు వాని వలన లాభము పొందవలయునని ఉపదేశము. మిగతా పదకొండు మంత్రములందు సరిగా ఐదేసి విషయములకై ఐదేసి వస్తువులు చెప్పబడినవి. కాని సర్వత్ర ఒకే సారి 'ఆలభతే' ప్రయోగించబడినది. అన్నిటికి దానినే అన్వయము చేసుకొనవలయును.

౧౬వ మంత్రములో భిన్నభిన్నమరుత్తులకు - మర్త్యులకు విద్వాంసులేమి గ్రహించెదరో అటులనే మీరును గ్రహించుడనెను. ౨౦వ మంత్రములో పిట్టల పేరులున్నవి కావున పక్షివిజ్ఞుని అనుకరించుడనియు, ౨౧లో జలచరముల పేర్లుండుటచే జలజంతుపాలనవిత్తును అనుకరించుడనియు, ౨౨,౨౩,౨౪ మంత్రములలో పశుల పేర్లున్నవి కావున పక్షిగుణ విజ్ఞానిని పక్షికర్మవిత్తును అనుకరించుడనియు, ౨౫వ మంత్రములో కాల వాచక శబ్దములుండుటచే కాలవిదుని అనుకరించుడనియు, ౨౬వ మంత్రములో భూచర జంతువుల పేరులుండుటచే స్థలచరజంతుగుణవిత్తును అనుకరించుడనియు ఉపదేశించబడినది. ౨౯వ మంత్రములో 'ప్రజాపతయే పురుషాన్ హస్తినః' ప్రజాపాలకుడగు రాజునకై పురుషులను గజములను ఆలభించుమనియున్నది. అయితే వానిని బలి యొనర్చి యజ్ఞముచేయమనియే భావించవలసినదేనా? కనుక యజ్ఞమునందు పశువధ యుండదని విచారశీలురు గ్రహించవచ్చును.

ఇంతియగాక ఈ వేదములోని ౨౩ వ అధ్యాయపు ౧౭ వ మంత్రములో "అగ్నిః పశురాసీత్; వాయుః పశురాసీత్, సూర్యః పశురాసీత్" అగ్నివాయు సూర్యులు పశువులనియు, యజ్ఞకర్తలు "తేన అయజంత" వానితో యజ్ఞమొనరించిరనియు, 'సః ఏతమ్ అజయత్' అతడీ లోకముసు జయించెననియు అటులనే నీవు 'తంజేష్యసి' వానిని జయించుచో, ఆ అగ్న్యాదులు "తే లోకః భవిష్యతి" నీ లోకములు - నీకు దర్శనీయములగుననియు చెప్పబడియున్నది. కావున నీ ౨౪వ అధ్యాయములో పశుహింసాయుక్త యజ్ఞమేదియు బోధించబడలేదనియు

ౕందు జలస్థలాకాశచరములగు పశుపక్షి తిర్యక్కుల విజ్ఞానము ప్రకటించ బడెననియు, మానవులావిద్యను గ్రహించి లాభమును గ్రహించవలయుననియు మహర్షి దయానందుడు వేదమునకు తగిన యర్థము యోగజన్య దివ్యదృష్టిచే నొనర్చియుండెను. బీజ రూపముగ నిచ్చుట నిర్దేశించ బడిన విజ్ఞానమును విశదీకరించుట జంతుశాస్త్రవిశేషజ్ఞుల పనియై యున్నది.

ఆయా కాలములకై ఆయాజంతువులను పరిగ్రహించ వలసినదిగా చెప్పబడిన మంత్రము లున్నవి. కొన్నిచోటులందు "కొఱకు" అని అర్థము వచ్చు చతుర్థీవిభక్త్యంత శబ్దములు, కొన్ని చోటులందు ఫలానా నిమిత్తము అని సూచించుటకై షష్ఠీవిభక్త్యంత శబ్దములు ప్రయోగించ బడినవి. ఆయా దేవతలు గలవి యని ప్రథమాంతములుగను, ఆయా జంతువులను గ్రహించ వలయునని ద్వితీయా విభక్త్యంతములుగను శబ్దములు వాడబడినవి.

౧,౨,౩,౪,౫,౬,౭,౮,౯,౧౦,౧౪,౧౫,౧౭,౧౯,౩౧ మంత్రములందు ఏ యే జంతువుల కే యే దేవతలలో ప్రథమాంత శబ్దములతో నిర్దేశించబడినది. ౧౧,౧౨,౧౩,౧౬,౨౦,౨౧,౨౨,౨౩,౨౪,౨౫,౨౬,౨౭,౨౮,౨౯.౩౦,౩౨,౩౩,౩౪ మంత్రములలో ఏ యే ప్రయోజనముల కే యే పశువు లుపయోగపడునది చతుర్థీ విభక్త్యంత శబ్దములతో చెప్పబడినది. ౧౮,౩౫,౩౬,౩౭,౩౮,౩౯,౪౦. మంత్రములలో దేని నిమిత్త ముపయోగపడునో షష్ఠ్యంత శబ్దములలో చెప్పబడినది.

మేమును నిచట స్వాధ్యాయశీలుర కుపయోగపడునటుల జంతువిశేషములను తెలుపు యౌగికములగు ప్రథమా ద్వితీయా విభక్త్యంత శబ్దములను విడిగాను, ఏ యే దేవతగుణములు గలవి యున్నవో వానిని దైవతములని ప్రత్యేకముగను, ఏ యే ప్రయోజనములకు, కార్యములకు ఆ యా జంతువులు పేర్కొనబడినవో ఆ యా చతుర్థ్యంత షష్ఠ్యంత శబ్దములను వేర్వేరు అనుక్రమణికలుగనిచ్చుచున్నాము.

వాని సహాయమున ఎక్కడ ఏజంతువు ఏ గుణము గలదిగ, ఎందుల కుపయోగపడునదిగ నిర్దేశించబడియున్నదో సరళముగ సమన్వయ పఱచుకొనగలరని ఆశించుచున్నాము.

ఈ అధ్యాయమునందలి విజ్ఞానమును మననమొనర్చువారికి ఈ అనుక్రమణికలు ఎక్కువగా తోడ్పడగలవని భాష్యము మధ్య విశేషాను బంధముగ మేము చేర్చుచున్నాము.

ఈ అనుక్రమణిక యందాయా మంత్రముల సంఖ్య నిర్దేశించబడినది.

వికారి ౧౮౮౧
మకరసంక్రాంతి.

ఇట్లు బుధజన విధేయులు
శేషాచలార్య, కేశవార్యశాస్త్రి









౨౪ వ అధ్యాయములోని తిర్యక్కుల అనుక్రమణిక

## ప్రథమా ద్వితీయా విభక్త్యంతములు.

★

## దైవతములు

★

మైత్రవరుణ్యా ౨,౭
యామాః ౩
రౌద్ర ౩౯
రౌద్రాః ౩
వాయవ్య ౧
వాయవ్యాః ౯
వారుణాః ౨
వారుణాః ౧౫
వైద్యుతాః ౧౦
వైష్ణవ ౧
వైష్ణవీ ౩౬
వైశ్వకర్మణాః ౧౮
వైశ్వదేవాః ౧౪
వైశ్వదేవ్య ౫
శునాసీరీయాః ౧౭
సారస్వతీ ౧
సారస్వత్య ౪,౧౪
సావిత్ర ౩౫
సావిత్రాః ౧,౨,౧౪
సౌమాపౌష్ణ ౧
సౌమ్యాః ౨,౯,౧౪
సౌరీ ౩౩
సౌర్యయామా ౧

## చతుర్థీ విభక్త్యంతములు

అంతర దిశాభ్యః ౨౬
అంతరిక్షాయ ౨౬
అగ్నయే ౧౬,౨౩,౨౪
అగ్నీ సోమాభ్యాం ౨౩
అతి చండసే ౧౩
అదిత్యై ౯(౫)
అద్భ్యః ౨౧
అనీకవతే ౧౬
అనుమత్యై ౩౨
అనుష్టుభే ౧౨
అరణ్యాయ ౩౯
అవాంతరదిశాభ్య ౨౬
అశ్విభ్యాం ౨౩
అహోరాత్రయోః సంధిభ్యః ౨౫
అంహ్నే ౨౫
ఆదిత్యేభ్యః ౨౮
ఇంద్రాగ్నిభ్యాం ౨౨
ఇంద్రాయ ౧,౪౦
ఈశానాయ ౨౭
ఉష్ణిహే ౧౨
ఋషభాయ ౩౦
కకుభే ౧౩
కామాయ ౩౯
క్రీడిభ్యః ౬౧
క్షిప్రశ్యేనాయ ౩౦
గాయత్ర్యై ౧౨
...గృహపతయే ౨౪
గృహమేధిభ్యః ౧౬
గ్రీష్మాయ ౧౧,౨౦
చతుష్పే ౨౯
జగత్యై ౧౨
త్రిష్టుభే ౧౨
త్వష్ట్రే ౨౪,౨౭
దిగ్భ్యః ౨౬
దివే ౨౬
దేవ జామిభ్యః ౨౪
దేవానాం పత్నీభ్యః ౫ ౯ ౧౧ ౨౪
ధాత్రే ౫,౯,౩౧
నదీపతయే ౩౪
నిరృత్యై ౩౭
పంక్త్యై ౧౩
పర్జన్యాయ ౨౧
...పశుపతయే ౩
ప్రజాపతయే ౨౯,౩౦
ప్రతిశ్రుత్కాయై ౩౨
బృహత్యై ౧౩
బృహస్పతయే ౨౭,౩౮
భూమ్యై ౨౬
మత్యై ౩౯
మనుష్యరాజాయ ౩౦
మన్యవే ౩౩
మరుద్భ్య ౧౬(౮)
మాసేభ్యః ౨౫
మిత్రాయ ౨౮,౨౯,౨౨
మిత్రావరుణాభ్యాం ౨౩
...మృత్యవే ౩౮
యామాయ ౩౦
రాత్ర్యై ౨౫,౩౬
రుద్రాయ.... ౩
రుద్రేభ్యః ౨౮
వనస్పతిభ్యః ౨౩
వరుణాయ ౨౧,౨౨,౨౭
వరుణాయ ౩౦,౩౭
వర్షాభ్యః ౧౧,౨౦
వసంతాయ ౧౧,౨౦
వసుభ్యః ౨౮
వాచస్పతయే ౩౮
వాచే ౫,౨౯,౩౧
వాయవే ౨౨,౩౦,౩౪
విరాజే ౧౩
విశ్వేభ్యోదేవేభ్యః ౨౮
వైశ్వదేవః ౪౦
శరదే ౧౧,౨౦
శరవ్యాయై ౪౦
శార్దూలాయ ౩౦
శిశిరాయ ౧౧,౨౦
శ్రోత్రాయ ౨౯
శ్వా ౪౦
సంవత్సరాయ ౨౫
సముద్రాయ ౨౧,౩౦
సరస్వతే ౩౩
సరస్వత్యై ౩౩
సాంతపనేభ్య ౧౬
సాధ్యేభ్యః ౨౮
సోమాయ ౨౨,౨౮,౩౨
స్వతవద్భ్యః ౧౬
స్వపస్యాయ ౧
హిమవతే ౩౦
హేమంతాయ ౧౧,౨౦
హ్రియై ౩౫

## షష్ఠీ విభక్త్యంతములు

అకూపారస్య ౩౫
అగ్నిష్వాత్తానాం ౧౭
అపామ్ ౩౮
అప్సరసాం ౩౮
అర్ధమాసానాం ౩౮
అహ్నః ౩౬
ఆదిత్యానాం ౬,౩౯
ఇంద్రస్య ౩౨
ఇతరజనానాం ౩౬
ఋతూనామ్ ౩౭
గంధర్వాణాం ౩౮
చంద్రమసః ౩౫
దిశాం ౩౬
నీలంగోః ౩౦
పితృణాం ౧౭(౩)
పితృణాం ౩౭
బర్హిషదాం ౧౭
బాహ్వోః ౧
మాయోః ౩౨
మాసా(నాం)న్ ౩౮
రక్షసాం ౮౦
వనస్పతీనాం ౬,౩౭
వాజినాం ౩౯
వాతస్య ౩౫
విశ్వేషాందేవానాం ౫౦
సర్పాణాం ౩౬
సోమవతాం ౨౭







ఓమ్

# అథ చతుర్వింశోఽధ్యాయారమ్భః

ఇప్పుడు ఇరువది నాల్గవ అధ్యాయము * ఆరంభము

ఓమ్ విశ్వాని దేవ సవిత ర్దురితాని పరాసువ యద్భద్రం తన్న ఆ సువ॥౧॥

అశ్వ ఇత్యస్య ప్రజాపతి రృషిః, ప్రజాపతి ర్దేవతా, భురిక్ సంకృతిశ్ఛందః, గాంధారః స్వరః.
అథ మనుష్యైః పశుభ్యః కీదృశ ఉపకారో గ్రాహ్య ఇత్యాహ.
మానవులు పశువులనుండి ఎటువంటి యుపకారమును గ్రహించవలయును ?

అశ్వస్తూపరో గోమృగస్తే ప్రాజాపత్యాః కృష్ణగ్రీవ ఆగ్నేయో రరాటే పురస్తాత్ సారస్వతీ మేష్య ధస్తాద్ధన్వో రాశ్వినా వధోరామౌ బాహ్వోః సౌమాపౌష్ణః శ్యామో నాభ్యాం సౌర్యయామౌ శ్వేతశ్చ కృష్ణశ్చ పార్శ్వయో స్త్వాష్ట్రౌ లోమశ సక్థౌ సక్థ్యో ర్వాయవ్యః శ్వేతః పుచ్ఛ ఇన్ద్రాయ స్వపస్యాయ వేహద్వైష్ణవో వామనః

అశ్వః, తూపరః, గోమృగ ఇతి గో+మృగః, తే, ప్రాజాపత్యా ఇతి ప్రాజా+పత్యాః, కృష్ణగ్రీవ ఇతి కృష+గ్రీవః, ఆగ్నేయః, రరాటే, పురస్తాత్, సారస్వతీ, మేషీ, అధస్తాత్, హన్వోః, ఆశ్వినౌ, అధోరామావి త్యధః+రామౌ, బాహ్వోః, సౌమాపౌష్ణః శ్యామః, నాభ్యామ్, సౌర్యయామౌ, శ్వేతః, చ, కృష్ణః, చ, పార్శ్వయోః, త్వాష్ట్రౌ, లోమశ సక్థావితి లోమశ+సక్థౌ, సక్థ్యోః, వాయవ్యః, శ్వేతః, పుచ్ఛే, ఇంద్రాయ, స్వపస్యా యేతి సు+అపస్యాయ, వేహత్, వైష్ణవః, వామనః॥౧॥

పదార్థః:- అశ్వః = ఆశుగామీ తురంగః, తూపరః, = హింసకః, గోమృగః = గౌరివ వర్తమానో గవయః, (తే) ప్రాజాపత్యాః = ప్రజాపతిః సూర్యో దేవతా యేషాం తే, కృష్ణగ్రీవః = కృష్ణా గ్రీవా యస్య సః, ఆగ్నేయః = అగ్నిదేవతాకః, రరాటే = లలాటే, పురస్తాత్ = ఆదితః

---

*1981 విక్రమ శక అజ్మీరు వైదిక యంత్రాలయ సంస్కరణమునకు అనుకృతి.
ఈ అధ్యాయములో ౪౦ మంత్రములు. ౭. ఛందస్సులు, ౬౨౪ పదములు, ౧౫౦౪ అక్షరములున్నవి.

సారస్వతీ=సరస్వతీ దేవతా యస్యాః సా,మేషీ=శబ్దకర్త్రీ మేషస్య స్త్రీ,(అధస్తాత్)హన్వోః =ముఖావయవయోః,ఆశ్వినౌ=అశ్విదేవతాకౌ,అధోరామౌ=అధో రమణీయయో స్తౌ, (బాహ్వోః)సౌమాపౌష్ణః=సోమపూషదేవతాకః, శ్యామః=కృష్ణవర్ణః, నాభ్యామ్=మధ్యే, సౌర్యయామౌ=సూర్యయమ సంబంధినౌ,శ్వేతః=శ్వేతవర్ణః,(చ)(కృష్ణః)(చ)పార్శ్వయోః =వామదక్షిణభాగయోః, త్వాష్ట్రౌ=త్వష్టృదేవతాకౌ, లోమశ సక్థౌ=లోమాని విద్యంతే యస్య తల్లోమశం సక్థి యయో స్తౌ,సక్థ్యోః=పాదావయవయోః, వాయవ్యః=వాయుదేవ తాకః, శ్వేతః=శ్వేతవర్ణః, (పుచ్ఛే) ఇంద్రాయ=ఐశ్వర్య యుక్తాయ, స్వపస్యాయ=శోభ నాన్యపాంసి కర్మాణి యస్య తస్మై,వేహత్=అకాలే వృషభోపగమనేన గర్భఘాతినీ,వైష్ణవః =విష్ణుదేవతాకః,వామనః=వక్రాంగః. ॥౧॥

అన్వయః:- హే మనుష్యా యూయమశ్వస్తూపరో గోమృగస్తే ప్రాజాపత్యాః కృష్ణగ్రీవ ఆగ్నేయః పురస్తాద్రరాటే మేషీ సారస్వతీ అధస్తాద్ధన్వోర్బాహ్వోరధో రామౌ వాశ్వినౌ సౌమా పౌష్ణః శ్యామో నాభ్యాం పార్శ్వయోః శ్వేతశ్చ కృష్ణశ్చ సౌర్యయామౌ సక్థ్యో ర్లోమశ సక్థౌ త్వాష్ట్రౌ పుచ్ఛే శ్వేతో వాయవ్యో వేహద్వైష్ణవో వామనశ్చ స్వపస్యాయేంద్రాయ సంయోజయత. ॥౧॥

భావార్థః:- యే మనుష్యా అశ్వాదిభ్యః కార్యాణి సంసాధ్యైశ్వర్యమున్నీయ ధర్మ్యాణి కర్మాణి కుర్యుస్తే సౌభాగ్యవంతో భవేయుః.అత్ర సర్వత్ర దేవతాపదేన తత్తద్ గుణయోగాత్ పశవో వేదితవ్యాః. ॥౧॥

పదార్థము :- ఓ మానవులారా! అశ్వః=శీఘ్రముగ నడచు గుఱ్ఱము, తూపరః= హింసించు పశువు,గోమృగః=గోవువలెనుండు గవయము,తే ప్రాజాపత్యాః=అవి ప్రజా పాలకుడగు సూర్యుడు దేవతగాగలవి అనగా సూర్యలోకపు గుణములుగలవి, కృష్ణగ్రీవః =నల్లనికంఠముగల పశువు, ఆగ్నేయః=అగ్ని దేవతగాగలది;పురస్తాత్=ప్రథమమునుండి, రరాటే=లలాటము నిమిత్తము, మేషీ=[శబ్దకర్త్రియగు] ఆడగొఱ్ఱె, సారస్వతీ=సరస్వ తి దేవతగాగలది, అధస్తాత్=క్రిందనుండి,హన్వోః=వామదక్షిణభాగములుగ నున్నముఖా వయవమగు గడ్డమునిమిత్తము,బాహ్వోః=భుజములనిమిత్తము,అధోరామౌ=క్రిందరమిం చునవి,ఆశ్వినౌ=అశ్వినులు దేవతలుగాగల పశువులు,సౌమాపౌష్ణః=సోముడు పూషుడు దేవతలుగాగలది, శ్యామః=నల్లని రంగుగల పశువు, నాభ్యామ్=బొడ్డునందు మఱియు, పార్శ్వయోః=ఎడమ కుడివైపులందు, శ్వేతః చ కృష్ణః చ=తెల్లరంగు, నల్ల రంగు గలవి, సౌర్యయామౌ=సూర్యునికి యమునికి సంబంధములగు పశువులు, సక్థ్యోః = కాళ్లయొక్క సంధులదగ్గఱి భాగములలో, లోమశ సక్థౌ=ఎక్కువరోమములున్న సక్థు లుగలవి త్వాష్ట్రౌ=త్వష్టదేవతగా గల పశువులు; పుచ్ఛే=తోకలో, శ్వేతః=తెల్లరంగు గలది, వాయవ్యః=వాయువు దేవతగా గలది. వేహత్=కామోద్దీపనము కాకుండగనే [ఎదగాక పూర్వమే]ఆబోతు దగ్గఱకుపోయి గర్భము [చూలు]ను పోగొట్టుకొనుగోవు, వైష్ణవః=విష్ణుదేవతగా గలది, వామనః=మఱియు పొట్టిశరీరముపలె కొద్దిగా వంగిన

అవయవములు గల పశువు, వీని నన్నిటని, స్వపస్యాయ=అతి సుందరములగు కర్మలుగల వాడు, ఇంద్రాయ=ఐశ్వర్యయుక్తుడు నగు పురుషునకై సంయోగపఱచుము. అనగా ఆ యా ప్రత్యేకాంగముల కానంద నిమిత్తకములగు ఉక్తగుణములు గల పశువులను నియమించుడు. [౧]

భావార్థము :- అశ్వాదిపశువులచే కార్యములను సాధించి, ఐశ్వర్యము నభివృద్ధి పఱచి ధర్మానుకూలముగ పని యొనర్చు వారుత్తమ భాగ్యవంతులగుదురు.

ఈ ప్రకరణము నందంతట దేవతాపదముచే నా యా గుణములు గలిగియుండు [నాయా] పశువులను గ్రహించవలయును. ౧౩౭౨[౧]

---

రోహిత ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, సోమాదయో దేవతాః,నిచృత్ సంకృతి శ్ఛందః,గాంధారః స్వరః.
పునః కే పశవః కీదృశగుణా ఇత్యాహ.

ఏ పశువు లెటువంటి గుణములు గలవను విషయము చెప్పబడు చున్నది.

రోహితో ధూమ్రరోహితః కర్కన్ధురోహితస్తే సౌమ్యా బభ్రురరుణబభ్రుః శుకబభ్రుస్తే వారుణాః శితిరన్ధ్రోఽన్యతః శితిరన్ధ్రః సమన్తశితి రన్ధ్రస్తే సావిత్రాః శితిబాహురన్యతః శితిబాహుః సమన్త శితిబాహుస్తే బార్హస్పత్యాః పృషతీ క్షుద్రపృషతీ స్థూలపృషతీ తా మైత్రావరుణ్యః॥ ॥౨॥

రోహితః, ధూమ్రరోహిత ఇతి ధూమ్ర+రోహితః, కర్కన్ధురోహిత ఇతి కర్కన్ధు+రోహితః, తే, సౌమ్యాః, బభ్రుః, అరుణబభ్రురితి అరుణ+బభ్రుః,శుకబభ్రురితి శుక+బభ్రుః, తే, వారుణాః, శితిరన్ధ్ర+ఇతి శితి+రన్ధ్రః, అన్యతః శితిరన్ధ్ర ఇత్యన్యతః+శితిరన్ధ్రః,సమన్త శితిరన్ధ్ర ఇతి సమన్త+శితిరంధ్రః, తే, సావిత్రాః, శితిబాహు రితి శితి+బాహుః,అన్యతః శితిబాహు రిత్యన్యతః+శితిబాహుః, సమన్త శితి బాహురితి సమన్త+శితిబాహుః, తే, బార్హస్పత్యాః,పృషతీ, క్షుద్రపృషతీతి, క్షుద్ర+పృషతీ, స్థూల పృషతీతి స్థూల+పృషతీ,తాః, మైత్రావరుణ్యః॥ ॥౨॥

పదార్థః-రోహితః=రక్తవర్ణః, ధూమ్రరోహితః=ధూమ్రరక్తవర్ణః,కర్కంధురోహితః=కర్కంధు ర్బదరీఫలమివ రోహితః, (తే)సౌమ్యాః=సోమదేవతాకాః, బభ్రుః=నకుల

సదృశవర్ణః, అరుణబభ్రుః=అరుణేన యుక్తో బభ్రు ర్వర్ణో యస్య సః, శుకబభ్రుః=శుకస్యేవ బభ్రు ర్వర్ణో యస్య సః, (తే)(వారుణాః)వరుణదేవతాకాః, (శితిరంధ్రః)శితిః శ్వేతతా రంధ్రే యస్య సః,అన్యంతః శితిరధ్రః=అన్యతోఽన్యస్మిన్ రంధ్రాణీవ శితయో యస్య సః, సమంత శితిరంధ్రః=సమంతతో రంధ్రాణీవ శితయః శ్వేతచిహ్నాని యస్య సః,(తే)సావిత్రాః=సవితృ దేవతాకాః,శితిబాహుః=శితయో బాహ్వో ర్యస్య సః,అన్యతఃశితిబాహుః=అన్యతఃశితయో బాహ్వో ర్యస్య సః, సమంతశితిబాహుః=సమంతాచ్ఛితయో బాహ్వో ర్భుజస్థానయో ర్యస్య సః, (తే)బార్హస్పత్యాః=బృహస్పతి ర్దేవతాకాః, పృషతీ=అంగైః సుసిక్తా, క్షుద్రపృషతీ= క్షుద్రాణి పృషంతి యస్యాః సా, స్థూలపృషతీ=స్థూలాని పృషంతి యస్యాః సా,(తాః)మైత్రా వరుణ్యః=ప్రాణోదాన దేవతాకాః. ॥౨॥

అన్వయః:-హే మనుష్యా యుష్మాభి ర్యే రోహితో ధూమ్రరోహితః కర్కంధురోహితశ్చ సంతి తే సౌమ్యాః. యే బభ్రు రరుణభ్రు శుకభభ్రుశ్చ సంతి తే వారుణాః. యే శితిరంధ్రోఽన్యత శ్శితిరంధ్రః, సమంతశితిరంధ్రశ్చ సంతి తే సావిత్రాః. యే శితిబాహురన్యతః శితిబాహుః సమంతశితిబాహుశ్చ సంతి తే బార్హస్పత్యాః,యాః పృషతీ క్షుద్రపృషతీ స్థూలపృషతీ చ సంతి తా మైత్రావరుణ్యో భవంతీతి బోధ్యమ్. ॥౨॥

భావార్థః:-యే చంద్రాది గుణయుక్తాః పశవః సంతి తైస్తత్తత్కార్యం మనుష్యైః సాధ్యమ్. ॥౨॥

పదార్థము:- ఓ మానవులారా! మీకు, రోహితః=సామాన్యపు ఎఱుపు గలది, ధూమ్రరోహితః=ధూమ్రమవర్ణపు ఎఱుపుగలది, కర్కంధు రోహితః=పండిన రేగుపండు వంటి ఎరుపుగలది, తే=ఆ యా పశువులు, సౌమ్యాః=సోమదేవతలు అనగా సోమగుణ ముగలవి. బభ్రుః=ముంగిసవలె ధూమ్రమవర్ణము గలది, అరుణ బభ్రుః=ఎఱుపుకు తిరిగిన ముంగిసవంటి రంగుగలది, శుకబభ్రుః=చిలుకవంటి రంగుగలది, తే=ఆ యా పశువులు, వారుణాః=వరుణుడు దేవతగా గలవి అనగా శ్రేష్ఠమైనవి. శితిరంధ్రః=శితిరంధ్రము అనగా మర్మస్థానాదులందు తెలుపుగలది, అన్యతః శితిరంధ్రః=ఇతరచోట్ల, ఇతర అంగములందును రంధ్రములవలె తెలుపుగుర్తులుగలది. సమన్త శితిరంధ్రః=అన్నిచోట్ల రంధ్రములవలె శ్వేతచిహ్నములుగలది, తే=ఆ యా పశువులు, సావిత్రాః=సవితదేవతగా గలవి. శితిబాహుః=ముందు భుజ[పాద]ములందు తెల్లపొడలుగలది, అన్యతః శితిబాహుః=ఇతర అంగములందు తెల్లనిమచ్చలుగలది, సమంత శితిబాహుః=అంతట ముంగాళ్ళయందు తెల్ల పొడలుగలది,తే=ఆ యా పశువులు, బార్హస్పత్యాః=బృహస్పతి దేవతగాగలవి,పృషతీ= అన్ని అవయవములచే, చక్కగ సిక్తమైనది, క్షుద్రపృషతీ=రంగురంగుల చిన్నచిన్న పొడలు గలది, స్థూలపృషతీ=పెద్దపెద్ద పొడలుగలది, తాః=అవన్నీ, మైత్రావరుణ్యాః= ప్రాణోదానములు దేవతలుగా గలవి అని ఎఱుగవలయును. [౨]

భావార్థము:-చంద్రాదుల ఉత్తమ గుణములుగల పశువులతో వానివాని గుణా

నుకూలములగు పనులను మానవులు సాధించవలయును. ౧౩౨౩[౨]

---

శుద్ధవాల ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, అశ్వ్యాదయో దేవతాః, నిచృదతిజగతీ ఛందః, నిషాదః స్వరః
పునః కీదృశగుణాః పశవః ఇత్యాహ.
ఎటువంటిగుణములు గల పశువులున్నవి ?

శుద్ధవాలః సర్వశుద్ధవాలో మణివాల స్త ఆశ్వినాః శ్యేతః శ్యేతాక్షో౽రుణ స్తే రుద్రాయ పశుపతయే కర్ణా యామా అవలిప్తా రౌద్రా నభోరూపాః పార్జన్యాః॥

శుద్ధవాల ఇతి శుద్ధ+వాలః,సర్వశుద్ధవాల ఇతి సర్వ+శుద్ధవాలః,మణివాల ఇతి మణి+వాలః,తే,ఆశ్వినాః, శ్యేతః, శ్యేతాక్ష ఇతి శ్యేత+అక్షః,అరుణః,తే,రుద్రాయ, పశుపతయ ఇతి పశు+పతయే, కర్ణాః, యామాః, అవలిప్తా ఇత్యవ+లిప్తాః,రౌద్రాః నభోరూపా ఇతి నభః+రూపాః, పార్జన్యాః॥ ॥౩॥

పదార్థః:-శుద్ధవాలః=శుద్ధా వాలా యస్య సః, సర్వశుద్ధవాలః=సర్వే శుద్ధా వాలా యస్య సః, మణివాలః=మణిరివ వాలా యస్య సః, (తే)ఆశ్వినాః=సూర్యచంద్రదేవతాకాః, శ్యేతః=శ్వేతవర్ణః,శ్యేతాక్షః=శ్యేతే అక్షిణీ యస్య సః,అరుణః=రక్తవర్ణః,(తే)రుద్రాయ =దుష్టానాం రోదకాయ, పశుపతయే=పశూనాం పాలకాయ, కర్ణాః=యైః కార్యాణి కుర్వంతి తే,యామాః=వాయుదేవతాకాః,అవలిప్తాః=అవలిప్తాన్యుపచితాన్యంగాని యేషాం తే, రౌద్రాః=ప్రాణాదిదేవతాకాః, నభోరూపాః=నభ ఇవ రూపం యేషాం తే, పార్జన్యాః =మేఘదేవతాకాః. ॥౩॥

అన్వయః:-హే మనుష్యా యుష్మాభి ర్యే శుద్ధవాలః సర్వశుద్ధవాలో మణివాలశ్చ సంతి తే ఆశ్వినాః.యే శ్యేతః శ్యేతాక్షో౽రుణశ్చ సంతి తే పశుపతయే రుద్రాయ.యే కర్ణాః సంతి తే యామాః. యే౽వలిప్తాః సంతి తే రౌద్రాః. యే నభోరూపాః సంతి తే పార్జన్యాశ్చ వేదితవ్యాః. ॥౩॥

భావార్థః:-యో యస్య పశో ర్దేవతా౽స్తి.స తద్గుణో౽స్తీతి వేద్యమ్. ॥౩॥

పదార్థము:- ఓ మానవులారా! శుద్ధబాలః=శుద్ధమైన వెంట్రుకలు, లేక శుద్ధములగు చిన్నచిన్న అంగములు గలది, సర్వశుద్ధబాలః=అంతయు శుద్ధములైన వెంట్రుకలు గలది, మణిబాలః=మణులవలె నిగనిగలాడు వెంట్రుకలుగలది అగు నేపశువులు, తే=అవన్నీ, ఆశ్వినాః=సూర్యచంద్రులు దేవతలుగా గలవి అనగా సూర్యునివలె చంద్రునివలె దివ్యగుణములుగలవి. శ్యేతః=శ్వేతవర్ణముగలది, శ్యేతాక్షః=శ్వేతనయనములు గలది

అరుణః=ఎఱ్ఱని రంగుగలది, తే=అవి, పశుపతయే=పశువుల రక్షించువానికి మఱియు,రుద్రాయ=దుష్టుల నేడ్పించువానికి [అయియున్నవి] కర్ణాః=వేనిచే కార్యములొనర్చుచున్నారో అవి, యామాః=వాయువు దేవతగా గలవి. అవలిప్తాః=ఉన్నతావయవములు గలవి, స్థూలశరీరము గలవి, రౌద్రాః=ప్రాణవాయువు మొదలైనవి దేవతలుగా గలవి. నభోరూపాః=ఆకాశమువలె నీలిరంగుగల పశువులు, అవన్నీ, పార్జన్యాః=మేఘము దేవతలుగా గలవి అని ఎఱుగవలయును. [౩]

భావార్థము:- ఏ పశువున కేది దేవతయో అది ఆ దేవతాగుణములు గలిగియున్నదని గ్రహించవలయును, ౧౩౨౪[౩]

---

పృశ్ని రిత్యస్య ప్రజాపతి ఋషిః, మారుతాదయో దేవతాః,విరాడతిధృతి శ్ఛందః,షడ్జః స్వరః.

పున స్తమేవ విషయ మాహ.

మఱల నా విషయమే.

పృశ్ని స్తిరశ్చీన పృశ్ని రూర్ధ్వపృశ్ని స్తే మారుతాః ఫల్గూర్లోహితోర్ణీ పలక్షీ తాః సారస్వత్యః ప్లీహాకర్ణః శుణ్ఠాకర్ణోఽధ్యాలోహ కర్ణ స్తే త్వాష్ట్రాః కృష్ణగ్రీవః శితికక్షో ఽఞ్జిసక్థ స్త ఐన్ద్రాగ్నాః కృష్ణాఞ్జి రల్పాఞ్జి ర్మహాఞ్జి స్త ఉషస్యాః॥

పృశ్నిః, తిరశ్చీన పృశ్ని రితి తిరశ్చీన+పృశ్నిః,ఊర్ధ్వపృశ్ని రిత్యూర్ధ్వ+పృశ్నిః, తే, మారుతః, ఫల్గూః, లోహితోర్ణీతి లోహిత+ఊర్ణీ, పలక్షీ, తాః, సారస్వత్యః, ప్లీహాకర్ణః, ప్లీహాకర్ణ ఇతి ప్లీహ+కర్ణః, శుణ్ఠా+కర్ణః,శుణ్ఠకర్ణ ఇతి శుణ్ఠ+కర్ణః,అధ్యాలోహకర్ణ ఇత్యధ్యాలోహ+కర్ణః,తే, త్వాష్ట్రాః, కృష్ణగ్రీవ ఇతి కృష్ణ+గ్రీవః,శితికక్ష ఇతి శితి+కక్షః,అఞ్జిసక్థ ఇత్యఞ్జి+సక్థః, తే, ఐన్ద్రాగ్నాః, కృష్ణాఞ్జి రితి కృష్ణ+అఞ్జిః,అల్పాఞ్జి రిత్యల్ప+అఞ్జిః,మహాఞ్జి రితి మహా+అఞ్జిః,తే,ఉషస్యాః

పదార్థః:-పృశ్నిః=ప్రష్టవ్యః,తిరశ్చీనపృశ్నిః=తిరశ్చీనః పృశ్నిః స్వర్శో యస్య సః, (తే)మారుతాః=మరుద్దేవతాకాః, ఫల్గూః=యా ఫలాని గచ్ఛతి ప్రాప్నోతి సా, లోహితోర్ణీ ఊర్ధ్వపృశ్నిః=ఊర్ధ్వ ఉత్కృష్టః పృశ్నిః స్వర్శో యస్య సః, =లోహితా ఊర్ణా యస్యాః సా, పలక్షీ=పలే చంచలే అక్షిణీ యస్యాః సా, (తాః) సారస్వత్యః=సరస్వతీ దేవతాకాః, ప్లీహాకర్ణః=ప్లీహేవ కర్ణే యస్య సః, శుణ్ఠాకర్ణః=శుణ్ఠా శుష్కౌ కర్ణౌ యస్య సః, అధ్యా

లోహకర్ణః=అధిగతం చ తల్లోహం చ సువర్ణం తద్వద్వర్ణో యస్య సః, లోహమితి హిరణ్యనా...నిఘం.౧.౨.(తే)త్వాష్ట్రాః=త్వష్టృదేవతాకాః, కృష్ణగ్రీవః=కృష్ణా గ్రీవా యస్య సః, శితికక్షః=శితీ శ్వేతౌ కక్షౌ పార్శ్వౌ యస్య సః, అంజిసక్థః=అంజీని ప్రసిద్ధాని సక్థీని యస్య సః, (తే)ఐంద్రాగ్నాః=వాయువిద్యుద్దేవతాకాః,కృష్ణాంజిః=కృష్ణా విలిఖితా అంజి గ్గతిర్యస్య సః, అల్పాంజిః=అల్పగతిః,మహాంజిః=మహాగతిః ,(తే) ఉషస్యాః=ఉషాదేవతాకాః. ॥౪౫॥

అన్వయః:- హే మనుష్యా యే పృశ్ని స్తిరశ్చీనపృశ్ని రూర్ధ్వపృశ్నిశ్చ సంతి తే మారుతాః.యాః ఫల్గూ ర్లోహితోర్ణీ పలక్షీ చ సంతి తాః సారస్వత్యః. యే ప్లీహాకర్ణః శుంఠాకర్ణో ఽధ్యాలోహాకర్ణశ్చ సంతి తే త్వాష్ట్రాః. యే కృష్ణగ్రీవః శితికక్షో ఽఞ్జిసక్థశ్చ సంతి త ఐంద్రాగ్నాః.యే కృష్ణాంజి రల్పాంజి ర్మహాంజిశ్చ సంతి త ఉషస్యాశ్చ భవంతీతి వేద్యమ్. ॥౪॥

భావార్థః:-యే పశవః పక్షిణశ్చ వాయుగుణా, యే నదీగుణా, యే సూర్యగుణా, యే వాయువిద్యుద్గుణా, యే చోషోగుణాః సంతి, తై స్తదనుకూలాని కార్యాణి సాధనీయాని. ॥౪॥

పదార్థము:- ఓ మానవులారా! ప్రశ్నిః=అడగదగినది, తిరశ్చీనపృశ్నిః=అడ్డముగ స్పర్శించునది, ఊర్ధ్వపృశ్నిః=ఉన్నతము, ఉత్తమమునగు స్పర్శముగలది. తే=అవి,మారుతాః=మరుద్దేవతాగుణము గలవి, ఫల్గూః=ఫలములను పొందునది.లోహితోర్ణీ=లోహితవర్ణపు ఉన్ని వెంట్రుకలు గలది, పలక్షీ=చంచలములు చపలములునగు నయనములు గలది, తాః=అవి, సారస్వత్యః=సరస్వతి దేవతగా గలవి, ప్లీహాకర్ణః=ప్లీహరోగ చిహ్నములు గల చెవులుగలది, శుంఠాకర్ణః=శుష్కకర్ణములుగలది, అధ్యాలోహాకర్ణః=చక్కగా లభించిన సువర్ణముతో సమానములైన కర్ణములుగలది. తే=ఆ పశువులు, త్వాష్ట్రాః =త్వష్టదేవతగాగలవి.కృష్ణగ్రీవః=నల్లని మెడగలది,శితికక్షః=పార్శ్వభాగములలో తెల్లని రంగుగలది, అంజిసక్థః=లావుగా స్పష్టముగా కనబడు దృఢములైన తొడలుగలది, తే= అటువంటి పశువులు, ఐంద్రాగ్నాః=పవనము విద్యుత్తు దేవతలుగాగలవి, కృష్ణాఞ్జిః= ఎగిరెగిరి నడచునది, అల్పాంజిః=మందగమనముగలది, మహాంజిః=పెద్ద నడకగలది,తే= ఆ పశువులు, ఉషస్యాః=ఉషస్సు దేవతగాగలవి అని ఎఱుగవలయును. [౪]

భావార్థము,- ఏ పశుపక్షులు పవనగుణములు గలవో, ఏవి నదీగుణములుగలవో ఏవి సూర్యగుణములు గలవో, ఏవి పవన విద్యుత్తుల గుణములు గలవో, ఏవి ప్రాతః కాలపు గుణములు గలవో వానిచేత వాని యనుకూలములగు కార్యములనే సాధించవలయును. ౧౩౨౫[౪]



శిల్పా ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః విశ్వేదేవా దేవతాః, నిచృద్ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.
పున స్తమేవ విషయ మాహ.

మఱల నవ్విషయమే.

శిల్పా వైశ్వదేవ్యో రోహిణ్య స్త్ర్యవయో వాచేఽవిజ్ఞాతా అదిత్యై సరూపా

ధాత్రే వత్సతర్యో దేవానాం పత్నీభ్యః॥ ॥౫॥

శిల్పాః, వైశ్వదేవ్య ఇతి వైశ్వ+దేవ్యః, రోహిణ్యః,త్ర్యవయ ఇతి త్రి+అవయః, వాచే, అవిజ్ఞాతా ఇత్యవి+జ్ఞాతాః, అదిత్యై, సరూపా ఇతి స+రూపాః, ధాత్రే, వత్సతర్యః, దేవానామ్,పత్నీభ్యః॥ ॥౫॥

పదార్థః:-శిల్పాః=సురూపాః శిల్పకార్యసాధికాః, వైశ్వదేవ్యః=విశ్వదేవదేవతాకాః రోహిణ్యః=ఆరోఢుమర్హాః,త్ర్యవయః=త్రివిధాశ్చ తా అవయాశ్చ తాః(వాచే).అవిజ్ఞాతాః =విశేషేణాజ్ఞాతాః,అదిత్యై=పృథివ్యై,సరూపాః=సమానం రూపం యాసాంతాః,ధాత్రే =ధారకాయ,వత్సతర్యః=అతిశయేన వత్సా అల్పవయసః, దేవానామ్=దివ్యగుణానాం విదుషామ్, పత్నీభ్యః=భార్యాభ్యః. ॥౫॥

అన్వయః:-హే మనుష్యా యుష్మాభి ర్యాః శిల్పా వైశ్వదేవ్యో వాచే రోహిణ్యస్త్ర్యవయోఽదిత్యా అవిజ్ఞాతాః ధాత్రే సరూపా దేవానాం పత్నీభ్యో వత్సతర్యశ్చ తా విజ్ఞేయాః.

భావార్థః:-యే సర్వే విద్వాంసః శిల్పవిద్యయాఽనేకాని యానాదీని రచయేయుః పశూనాం చ పాలనం కృత్వోపయోగం గృహ్ణీయు స్తే శ్రీమంతః స్యుః. ॥౫॥

పదార్థము:- ఓ మానవులారా! మీరు, శిల్పాః=అందమైన రూపముగలవి. శిల్పకార్యములను సాధించునవి, వైశ్వదేవ్యః=విశ్వేదేవతలు దేవతలుగాగలవి, వాచే=వాణికొఱకు, రోహిణ్యః=క్రిందినుండి మీదికి ఎక్కగలిగినవి యగు, త్ర్యవయః=మూడు రకముల గొఱ్ఱెలు, అదిత్యై=భూమికొఱకు, అవిజ్ఞాతాః=విశేషించి అజ్ఞాతములైన గొఱ్ఱెలు మొదలైనవి, ధాత్రే=ధారణమొనర్చుటకు, సరూపాః=ఒకేరూపముగలవి, దేవానామ్ పత్నీభ్యః=దివ్యగుణములు గల విద్వాంసుల స్త్రీలకొఱకు, వత్సతర్యః=చాలా లేతవయస్సుగల పెయ్యదూడలు అని ఎఱుగవలయును, [౫]

భావార్థము:- ఏ విద్వాంసులు శిల్పవిద్యచే ననేక యానాదుల నిర్మించి పశువులను పాలించి వానితో పని తీసుకొందురో వారే ధనవంతులు కాగలరు. ౧౩౭౬[౫]

---

కృష్ణగ్రీవా ఇత్యస్య ప్రజాపతి ఋషిః, అగ్న్యాదయో దేవతాః, విరాడుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

పున స్తమేవ విషయ మాహ.

మఱల నా విషయమే

కృష్ణగ్రీవా ఆగ్నేయాః శితిభ్రవో వసూనాం రోహితా రుద్రాణాం శ్వేతా అవరోకిణ ఆదిత్యానాం నభోరూపాః పార్జన్యాః॥ ॥౬॥

కృష్ణగ్రీవా ఇతి కృష్ణ+గ్రీవాః ఆగ్నేయాః, శితిభ్రవ ఇతి శితిభ్రవః, వసూనామ్, రోహితాః, రుద్రాణామ్, శ్వేతాః, అవరోకిణ ఇత్యవ+రోకిణః,ఆదిత్యానామ్, నభోరూపా ఇతి నభః+రూపాః, పార్జన్యాః॥ ॥౬॥

పదార్థః:-కృష్ణగ్రీవాః=కృష్ణా కర్షికా గ్రీవా నిగరణం యేషాం తే,ఆగ్నేయాః=అగ్నిదేవతాకాః, [శితిభ్రవః]=శితి శ్వేతాః భ్రూ భ్రుకుటి ర్యాసాం తాః,వసూనామ్=పృథివ్యాదీనామ్, రోహితాః=రక్తవర్ణాః, రుద్రాణామ్=ప్రాణాదీనామ్,. శ్వేతాః=శ్వేతవర్ణాః, అవరోకిణః=అవరోధకా, ఆదిత్యానామ్=సూర్యసంబంధినాం మాసానామ్, నభోరూపాః=నభ ఉదకమివ రూపం యేషాం తే,పార్జన్యాః=మేఘదేవతాకాః. ॥౬॥

అన్వయః:- హే మనుష్యా యే కృష్ణగ్రీవా స్త ఆగ్నేయాః.యే శితిభ్రవ స్తే వసూనాం, యే రోహితా స్తే రుద్రాణాం.యే శ్వేతా అవరోకిణ స్త ఆదిత్యానాం, యే నభోరూపా స్తే చ పార్జన్యాః బోధ్యాః. ॥౬॥

భావార్థః:-మనుష్యై రగ్నేరాకర్షణక్రియా పృథివ్యాదీనాం ధారణక్రియా వాయూనాం ప్రరోహణక్రియా ఆదిత్యానా మవరోధికా మేఘానాం చ జలవర్షికాః క్రియా విదిత్వా కార్యేషూపయోజ్యాః. ॥౬॥

పదార్థము:- ఓ మానవులారా! కృష్ణగ్రీవాః=ముడుచుకొన్న మెడగలవి, లాగుకొని మేతను మ్రింగునవి,ఆగ్నేయాః=అగ్ని దేవతగా గలవి,శితిభ్రవః=తెల్లని కనురెప్పలు గలవి, వసూనామ్=పృథివ్యాది వసువులకు చెందినవి,రోహితాః=ఎఱ్ఱరంగుగలవి, రుద్రాణామ్=ప్రాణాది ఏకాదశరుద్రులకుఃచెందినవి, శ్వేతాః=తెల్లరంగు గలవి, అవరోకిణః=అవరోధించునవి, ఆదిత్యానామ్=సూర్యసంబంధములగు మాసములకు చెందినవి. నభోరూపాః=జలమువలె రూపముగలవి, పార్జన్యాః=మేఘము దేవతగాగలవి,అనగా మేఘసదృశ గుణములు గలవని గ్రహించవలయును. [౬]

భావార్థము:- అగ్నియొక్క ఆకర్షణ క్రియను, పృథివ్యాదుల ధారణక్రియను వాయువుయొక్క ప్రరోహణక్రియను, ఆదిత్యుల అవరోధక్రియను, మేఘములయొక్క వర్షణక్రియను, ఎరిగి కార్యములందు చక్కగా వినియోగించవలయును. ౧౩౭౭[౬]

---

ఉన్నత ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ఇంద్రాదయో దేవతాః, అతిజగతీ ఛందః, నిషాదః స్వరః.

పున స్తమేవ విషయ మాహ.

మఱల నవ్విషయమే.

ఉన్నత ఋషభో వామన స్త ఐన్ద్రావైష్ణవా

ఉన్నతః శితిబాహుః శితిపృష్ఠస్త ఐన్ద్రాబార్హస్పత్యాః
శుకరూపా వాజినాః కల్మాషా ఆగ్నిమారుతాః శ్యామాః పౌష్ణాః ॥౨॥

ఉన్నత ఇత్యుత్+నతః, ఋషభః, వామనః, తే, ఐన్ద్రావైష్ణవాః, ఉన్నత, ఇత్యుత్+నతః, శితిబాహురితి శితి+బాహుః, శితి పృష్ఠ ఇతి శితి+పృష్ఠః, తే, ఐన్ద్రాబార్హస్పత్యాః, శుకరూపా ఇతి శుక+రూపాః, వాజినాః, కల్మాషాః, ఆగ్నిమారుతా ఇత్యాగ్ని + మారుతాః, శ్యామాః, పౌష్ణాః ॥౨॥

పదార్థః:- ఉన్నతః = ఉచ్ఛ్రితః, ఋషభః = శ్రేష్ఠః, వామనః = వక్రాంగః, (తే) ఐంద్రావైష్ణవాః = విద్యుద్వాయుదేవతాకాః, (ఉన్నతః) శితిబాహుః = శితీ స్తనూ కర్తారౌ బాహూ ఇవ బలం యస్య సః, శితిపృష్ఠః = శితి స్తనూకరణం పృష్ఠం యస్య సః, (తే) ఐంద్రాబార్హస్పత్యాః = వాయుసూర్యదేవతాకాః, శుకరూపాః = శుకస్య రూపమివ రూపం యేషాం తే, వాజినాః = వేగవంతః, కల్మాషాః = శ్వేతకృష్ణవర్ణాః, ఆగ్నిమారుతాః = అగ్నివాయుదేవతాకాః, శ్యామాః = శ్యామవర్ణాః, పౌష్ణాః = పుష్టినిమిత్తమేఘదేవతాకాః. ॥౨॥

అన్వయః:- హే మనుష్యా భవద్భి ర్యే ఉన్నత ఋషభో వామనశ్చ సంతి.త ఐంద్రావైష్ణవాః.య ఉన్నతః శితిబాహుః శితి పృష్ఠశ్చ సంతి త ఐంద్రాబార్హస్పత్యాః. యే శుకరూపా వాజినః కల్మాషాః సంతి త ఆగ్నిమారుతాః. యే శ్యామాః సంతి తే చ పౌష్ణాః విజ్ఞేయాః.

భావార్థః:- యే మనుష్యాః పశూనా మున్నతిం పుష్టిం చ కుర్వంతి తే నానావిధాని సుఖాని లభంతే. ॥౨॥

పదార్థము:- ఓ మానవులారా! ఉన్నతః = ఎత్తైనది, ఋషభః = శ్రేష్ఠమైనది, వామనః = వక్రాంగములు గలిగి పొట్టిగానుండునది. తే = అవన్నీ, ఐంద్రావైష్ణవాః = విద్యుద్వాయువులు దేవతలుగాగలవై యున్నవి, ఉన్నతః = ఉన్నతమైనది, శితిబాహుః = ఇతరపదార్థములను ఛేదించు బాహువుల వంటిబలముగలది, శితిపృష్ఠః = కుఱుచవీపుగలది, తే = ఆ పశువులన్నియు, ఐంద్రాబార్హస్పత్యాః = వాయువు సూర్యుడు దేవతలుగాగలవి. శుకరూపాః = చిలుకలవలె రూపములను కలిగినవి, వాజినాః = వేగముగలవి, కల్మాషాః = జట్టురంగుగలవి, ఇవన్నీ, ఆగ్నిమారుతాః = అగ్నిపవనములు దేవతలుగ గలవి, శ్యామాః = నల్లరంగుకలవి, పౌష్ణాః = పుష్టినిమిత్తకము మేఘము దేవతగాగలవిఅనిగ్రహించవలయును.

భావార్థము:- పశువులయున్నతి, పుష్టి కలిగించువారలు నానా ప్రకారముల సుఖమును పొందగలరు. ౧౩౨౮ [౨]

ఏతా ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః,ఇంద్రాగ్న్యాదయో దేవతాః,విరాట్ బృహతీ ఛందః,మధ్యమః స్వరః.
పున స్తమేవ విషయమాహ.
మఱల నదేవిషయము.

ఏతా ఐన్ద్రాగ్నా ద్విరూపా అగ్నీషోమీయా వామనా అనడ్వాహ ఆగ్నావై ష్ణవా వశా మైత్రావరుణ్యోఽన్యత ఏన్యో మైత్ర్యః॥ ॥౮॥

ఏతాః, ఐన్ద్రాగ్నాః,ద్విరూపా ఇతి ద్వి+రూపాః, అగ్నీషోమీయాః,వామనాః అనడ్వాహః, ఆగ్నావైష్ణవాః, వశాః, మైత్రావరుణ్యః, అన్యత ఏన్య ఇత్యన్యతః+ఏన్యః, మైత్ర్యః॥ ॥౮॥

పదార్థః:-(ఏతాః) పూర్వోక్తాః (ఐంద్రాగ్నాః)వాయు విద్యుత్సంగినః (ద్విరూపాః) ద్వే రూపే యాసాం తాః,(అగ్నీషోమీయాః)సోమాగ్ని దేవతాకాః, (వామనాః) వక్రావయవాః, (అనడ్వాహః) వృషభాః, (ఆగ్నావైష్ణవాః) అగ్నివాయు దేవతాకాః, (వశాః) వంధ్యాగావః, (మైత్రావరుణ్యః)ప్రాణోదానదేవతాకాః, (అన్యత ఏన్యః)యా అన్యతో యంతి ప్రాప్నువంతి తాః(మైత్ర్యః)మిత్రస్య ప్రియే వర్తమానాః. ॥౮॥

అన్వయః:- హే మనుష్యా యుష్మాభి ర్యా ఏతా ద్విరూపాః సంతి తా ఐంద్రాగ్నాః. యే వామనా అనడ్వాహః సంతి తేఽగ్నీషోమీయా ఆగ్నావైష్ణవాశ్చ. యా వశాః సంతి తా మైత్రావరుణ్యః. యా అన్యతఏన్యః సంతి తాశ్చ మైత్ర్యో విజ్ఞేయాః. ॥౮॥

భావార్థః:-యే మనుష్యా వాయ్వగ్న్యాది గుణాన్ పశూన్ పాలయంతి తే సర్వోపకారకా భవంతి. ॥౮॥

పదార్థము:- ఓ మానవులారా! ఏతాః ద్విరూపాః=పూర్వోక్తములైన రెండు రెండు రూపములుగల యీ పశువులు, ఐంద్రాగ్నాః=వాయు విద్యుత్తులకు తోడుగా నుండునవి, వామనాః=వంకర అవయవములుగలవి, పొట్టివియగు, అనడ్వాహః=ఎద్దులు అగ్నీషోమీయాః=సోముడు అగ్ని దేవతలుగాగలవి, మఱియు, ఆగ్నావైష్ణవాః=అగ్ని మఱియు వాయువు దేవతలుగా గలవి, వశాః=గొడ్డుటావులు, మైత్రావరుణ్యః=ప్రాణము మఱియు ఉదానము దేవతలుగాగలవి, అన్యత ఏన్యః=ఇతరచోటులనుండి లభించునవి, మైత్ర్యః=మిత్రుని ప్రియవ్యవహారమునందుండునవి అని తెలుసుకొనదగును. [౮]

భావార్థము:-వాయువు అగ్ని మొదలైనవాని గుణములుగల గవాదిపశువులను పాలించువారు అందరికి ఉపకారమొనర్చువారలగుచున్నారు. ౧౩౭౯[౮]

కృష్ణగ్రీవా ఇత్యస్య ప్రజాపతి రృషిః,అగ్న్యాదయో దేవతాః,నిచృత్పంక్తి శ్ఛందః,పంచమః స్వరః.

పున స్తమేవ విషయ మాహా.

మఱల నదే విషయము.

క్రృష్ణగ్రీవా ఆగ్నేయా బభ్రవః సౌమ్యాః శ్వేతా వాయవ్యా అవిజ్ఞాతా అదిత్యై సరూపా ధాత్రే వత్సతర్యో దేవానాం పత్నీభ్యః॥ ॥౯॥

కృష్ణగ్రీవా ఇతి కృష్ణ+గ్రీవాః, ఆగ్నేయాః, బభ్రవః, సౌమ్యాః, శ్వేతాః, వాయవ్యాః, అవిజ్ఞాతా ఇత్యవి+జ్ఞాతాః, అదిత్యై,సరూపా ఇతి స+రూపాః,ధాత్రే, వత్సతర్యః, దేవానామ్, పత్నీభ్యః॥ ॥౯॥

పదార్థః:-(కృష్ణగ్రీవాః)కృష్ణకంఠాః,(ఆగ్నేయాః)అగ్నిదేవతాకాః,(బభ్రవః)నకులవర్ణవద్వర్ణయుక్తాః (సౌమ్యాః) సోమదేవతాకాః(శ్వేతాః)(వాయవ్యాః) వాయుదేవతాకాః (అవిజ్ఞాతాః)న విశేషేణ జ్ఞాతా విదితాః, (అదిత్యై)అఖండితాయై జనిత్వక్రియాయై. అదితి ర్జనిత్వమితి మంత్రప్రామాణ్యాదత్రాదితి శబ్దేన గృహ్యతే.(సరూపాః)సమానం రూపం యాసాం తాః (ధాత్రే)ధారకాయ వాయవే(వత్సతర్యః) అతిశయేన వత్సాః (దేవానామ్) సూర్యాదీనామ్, (పత్నీభ్యః)పాలికాభ్యః క్రియాభ్యః. ॥౯॥

అన్వయః:-హే మనుష్యా యుష్మాభి ర్యే కృష్ణగ్రీవా స్త ఆగ్నేయాః. యే బభ్రవ స్తే సౌమ్యాః. యే శ్వేతా స్తే వాయవ్యాః.యేఽవిజ్ఞాతా స్తేఽదిత్యై,యే సరూపా స్తే ధాత్రే, యా వత్సతర్య స్తాశ్చ దేవానాం పత్నీభ్యో విజ్ఞేయాః. ॥౯॥

భావార్థః:-యే పశవః కర్షకా నిగలకా అగ్నివద్వర్తమానా, య ఓషధీవద్ధారకాః. య ఆవరకా స్తే వాయువద్వర్తమానాః. యేఽవిజ్ఞాతా స్తే ప్రజననాయ, యే ధాతృగుణా స్తే ధారణాయ,యే సూర్యకిరణవద్వర్తమానాః పదార్థాః సంతి తే వ్యవహారసాధనే ప్రయోజ్యాః.

పదార్థము:- ఓ మానవులారా ! మీరు, కృష్ణగ్రీవాః=నల్లనిమెడ గల పశువులు, ఆగ్నేయాః=అగ్ని దేవతగాగలవి; బభ్రవః=ముంగిసరంగువలె రంగుగలవి, సౌమ్యాః= సోముడు దేవతగాగలవి, శ్వేతాః=తెల్లగానున్నవి,వాయవ్యాః=వాయువు దేవతగాగలవి. అవిజ్ఞాతాః=ఏవి విశేష చిహ్నముచే నేమియు ఎఱుగబడనివై యున్నవో అవి, అదిత్యై =అఖండితమగు జనన క్రియకు, సరూపాః=సమానములగు రూపములుగలవి, ధాత్రే= ధారణమొనర్చు పవనముకొఱకు, మఱియు, వత్సతర్యః=చిన్న చిన్న లేగదూడలు, దేవానామ్=సూర్యాదిలోకములయొక్క, పత్నీభ్యః=పాలించు క్రియలకొఱకు [అని] ఎరుగవలయును. [౯]

భావార్థము,- దున్నునవి, మ్రింగునవి యగు నే పశువులు అగ్నివలెనున్నవో, ఏవి

ఓషధులవలె గుణములను ధరించునవి,ఏవి కష్పునవియునైయున్నవో,అవి వాయువు వలె నున్నవి. ఏవి అవిజ్ఞాతములో ఎఱుగబడజాలనివో అవి [సంతాన] ఉత్పత్తి కొఱకు, ఏవి ధాతృగుణములు గలవై యున్నవో అవి ధారణమొనర్చుటకును, ఏ పదార్థములుసూర్య కిరణములవలె నున్నవో అవి వ్యవహారములను సాధించుటయందును ప్రయోగించ బడ వలయును. ౧౩౮౦[౯]

---

కృష్ణా భౌమా ఇత్యస్య ప్రజాపతి ఋషిః,అంతరిక్షాదయో దేవతాః,విరాడ్ గాయత్రీ ఛందః,షడ్జః స్వరః

పునస్తమేవ విషయ మాహ.

మఱల నదే విషయము.

కృష్ణా భౌమా ధూమ్రా అన్తరిక్షా బృహన్తో దివ్యాః
శబలా వైద్యుతాః సిధ్మాః స్తారకాః॥ ॥౧౦॥

కృష్ణాః భౌమాః, ధూమ్రాః, అన్తరిక్షాః, బృహన్తః,దివ్యాః,శబలాః,వైద్యుతాః, సిధ్మాః, తారకాః॥ ॥౧౦॥

పదార్థః:-(కృష్ణా)కృష్ణవర్ణా విలేఖననిమిత్తా వా(భౌమాః)భూమిదేవతాకాః(ధూమ్రాః) ధూమ్రవర్ణాః (అంతరిక్షాః) అంతరిక్షదేవతాకాః (బృహంతః) వర్ధకాః (దివ్యాః) దివ్యగుణకర్మ స్వభావాః (శబలాః) కించిచ్ఛ్వేతాః (విద్యుతాః) విద్యుద్దేవతాకాః (సిధ్మాః) మంగలకారిణః (తారకాః)దుఃఖస్య పారే కారిణః. ॥౧౦॥

అన్వయః:-హే మనుష్యా యుష్మాభి ర్యే కృష్ణా స్తే భౌమాః. యే ధూమ్రా స్త అంతరిక్షాః.యే దివ్యా బృహంతః శబలా స్తే వైద్యుతాః,యే సిధ్మా స్తే చ తారకా విజ్ఞేయాః.

భావార్థః:-యది మనుష్యాః కర్షణాది కార్యసాధకాన్ పశ్వాది పదార్థాన్ భూమ్యాదిషు సంయోజయేయు స్తర్హి తే మంగల మాప్నుయుః. ॥౧౦॥

పదార్థము,—ఓ మానవులారా! కృష్ణాః=నల్లరంగుగలవి, క్షేత్రాదులను దున్నునవి, భౌమాః=భూమి దేవతగాగలవి, ధూమ్రాః=ధూమ్రవర్ణముగలవి, అంతరిక్షాః=అంతరిక్షము దేవతగాగలవి. దివ్యాః=దివ్యగుణకర్మ స్వభావయుక్తములై, బృహంతః=వర్ధకములునై, శబలాః=కొద్దిగా తెల్లగానున్నవి,వైద్యుతాః=విద్యుత్తు దేవతగా గలవియై యున్నవి. సిధ్మాః=మంగళమును సమకూర్చునవి, తారకాః=దుఃఖమును తరింపజేయునవై యున్నవి. [౧౦]

భావార్థము:- దున్నుటమొదలైన కార్యములను సాధించుపశువులను పదార్థములను, భూమ్యాదులందు సంయోగమొనరించుచో మానవులు ఆనంద మంగళములను పొందగలరు. ౧౩౮౧[౧౦]

ధూమ్రానిత్యస్య ప్రజాపతి ఋషిః,వసంతాదయో దేవతాః, విరాడ్ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మఱల అదే విషయము.

ధ్రూమాన్ వసన్తాయాలభతే శ్వేతాన్ గ్రీష్మాయ కృష్ణాన్ వర్షాభ్యో

ఽరుణాఞ్ఛరదే పృషతో హేమంతాయ పిశఙ్గాఞ్ఛిశిరాయ॥ ॥౧౧॥

ధూమ్రాన్,వసంతాయ,ఆ,లభతే, శ్వేతాన్, గ్రీష్మాయ, కృష్ణాన్, వర్షాభ్యః,

అరుణాన్, శరదే, పృషతః, హేమంతాయ, పిశఙ్గాన్, శిశిరాయ॥ ॥౧౧॥

పదార్థః:-(ధూమ్రాన్)ధూమ్రవర్ణాన్ పదార్థాన్(వసంతాయ)వసంతర్త్తౌ సుఖాయ (ఆ) సమంతాత్(లభతే)ప్రాప్నోతి(శ్వేతాన్)శ్వేతవర్ణాన్(గ్రీష్మాయ)గ్రీష్మర్త్తౌ సుఖాయ (కృష్ణాన్) కృష్ణవర్ణాన్కృషిసాధకాన్ వా(వర్షాభ్యః)వర్షర్త్తౌ కార్యసాధనాయ(అరుణాన్)అరక్తాన్(శరదే) శరదృతౌ సుఖాయ(పృషతః) స్థూలాన్,(హేమంతాయ) హేమంతర్త్తౌ కార్యసాధనాయ(పిశంగాన్)రక్తపీతవర్ణాన్(శిశిరాయ)శిశిరర్త్తౌ వ్యవహారసాధనాయ. ॥౧౧॥

అన్వయః:-యో మనుష్యో వసంతాయధూమ్రాన్,గ్రీష్మాయశ్వేతాన్,వర్షాభ్యః కృష్ణాన్, శరదేఽరుణాన్,హేమంతాయ పృషతః,శిశిరాయ పిశంగానాలభతే.స సతతం సుఖీ భవతి. ॥౧౧॥

భావార్థః:-మనుష్యై ర్యస్మిన్నృతౌ యే పదార్థాః సంచయనీయాః సేవనీయాశ్చ స్యుస్తాన్ సంచిత్యసంసేవ్యారోగా భూత్వా ధర్మార్థ కామమోక్షసాధనాన్యనుష్ఠాతవ్యాని. ॥౧౧॥

పదార్థము:- ఏమనుష్యుడు, వసంతాయ=వసంత ఋతువునందలి సుఖమునకై, ధూమ్రాన్=ధూమ్రరంగుగలపదార్థములను, గ్రీష్మాయ=గ్రీష్మఋతువునందలి ఆనందమునకై, శ్వేతాన్=తెల్లనిరంగుగలవానిని,వర్షాభ్యః=వర్షర్తువునందు కార్యసిద్ధికై, కృష్ణాన్=నల్లనిరంగుగలవానిని, లేక వ్యవసాయకార్యములను సాధించువానిని,శరదే=శరదృతువునందలి సుఖమునకై, అరుణాన్=ఎఱ్ఱనిరంగుగలవానిని, హేమంతాయ=హేమంత ఋతువునందు కార్యమును సాధించుటకు, పృషతః=స్థూలమైనవానిని, శిశిరాయ=శిశిరర్తుసంబంధములైన కార్యములను సాధించుటకు, పిశంగాన్=కొంచెమెఱుపుగానుండు పసుపురంగుగల పదార్థములను, ఆ లభతే=చక్కగా పొందునో, అతను నిరంతరము సుఖమును పొందగలుగుచున్నాడు. [౧౧]

భావార్థము:- ఆ యా ఋతువులందు ఏయేపదార్థములు సంచయమొనర్చదగినవో,సేవనీయములో వానిని మానవులు సమకూర్చుకొని చక్కగా సేవించి,నీరోగులై ధర్మార్థ కామమోక్షములను సాధించు వ్యవహారముల నాచరించవలయును. [౧౧]

త్ర్యవయ ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః,అగ్న్యాదయో దేవతాః, విరాడనుష్టుప్ ఛందః,గాంధారః స్వరః.

పున స్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

త్ర్యవయో గాయత్ర్యై పఞ్చావయ స్త్రిష్టుభే దిత్యవాహో।

జగత్యై త్రివత్సో అనుష్టుభే తుర్యవాహ ఉష్ణిహే॥ ॥౧౨॥

త్ర్యవయ ఇతి త్రి+అవయః,గాయత్ర్యై,పంచావయ ఇతి పంచ+అవయః, త్రిష్టుభే, త్రిస్తుభ ఇతి త్రి+స్తుభే, దిత్యవాహ ఇతి దిత్య+వాహః,జగత్యై,త్రి+వత్సా ఇతి త్రి+వత్సాః,అనుష్టుభే,అనుస్తుభ ఇత్యను స్తుభే,తుర్యవాహ ఇతి తుర్య+వాహ, ఉష్ణిహే॥ ॥౧౨॥

పదార్థః:-(త్ర్యవయః)త్రయోఽవయో యేషాం తే (గాయత్ర్యై)గాయత్రో రక్షికాయై (పంచావయః)పంచ అవయో యేషాం తే.(త్రిష్టుభే)త్రయాణాం శారీరవాచిక మానసానాం సుఖానాం స్తంభనాయ స్థిరీకరణాయ(దిత్యవాహః)దితౌ ఖండనే భవా దిత్యా న దిత్యా అదిత్యా స్తాన్ యే వహంతి ప్రాపయంతి తే దిత్యవాహః(జగత్యై)జగద్రక్షణాయై క్రియాయై(త్రివత్సాః) త్రయో వత్సా స్త్రిషు వా నివాసో యేషాం తే(అనుష్టుభే)అను స్తంభాయ,(తుర్యవాహః)యే తుర్యం చతుర్థం వహంతి తే(ఉష్ణిహే)ఉత్కృష్టతయా స్నిహ్యతి యయా తస్యై క్రియాయై.

అన్వయః:- యే త్రవయో గాయత్ర్యై పంచావయ స్త్రిష్టుభే దిత్యవాహో జగత్యై త్రివత్సా అనుష్టుభే తుర్యవాహ ఉష్ణిహే చ ప్రయతేరన్ స్తే సుఖినః స్యుః. ॥౧౨॥

భావార్థః: యథా విద్వాంసో ఽధీతై ర్గాయత్ర్యాదిఛందోఽర్థైః సుఖాని వర్ధయంతే తథా పశుపాలకా ఘృతాదీని వర్ధయేయుః. ॥౧౨॥

పదార్థము:- త్రవయః=మూడు గొఱ్ఱెలుగలవారు, గాయత్ర్యై=పాడువానిని రక్షించు నామెకొఱకును: పంచావయః=ఐదు గొఱ్ఱెలు గలవారు, త్రిష్టుభే=శారీరిక వాచిక మానసికసుఖములను స్థిరమొనర్చుటకును, దిత్యవాహః=వినాశమందు * ప్రసిద్ధ ముకాని వానిని లభింపజేయువారు,జగత్యై=సంసారమును రక్షించు క్రియకొఱకును, త్రివత్సాః=మూడు దూడలు గలవారు లేక మూడు స్థానములందు నివాసముగలవారు అనుష్టుభే=వెనుకనుండి అపుక్రియ కొఱకును, తుర్యవాహః=తన పశువులలో నాల్గవ దానిని లభింపజేయువారు, ఉష్ణిహే=ఉత్తమరీతిగ ప్రసన్నత లభించు క్రియకొఱకును,

* మంత్రపదపాఠములందును, పదార్థాదులందును "దిత్యవాహ" అనుపాఠమును చూపించుచు అర్థము "అదిత్యవాహ్యా" అని చేయబడినది. ఇక్కడ అకారము పూర్వము చెందవచ్చును గాని అటులను సూచించబడలేదు. —(అనువాదకులు)

చక్కగా ప్రయత్నమొనర్చుచో వారందఱు సుఖులు కావచ్చును. [౧౨]

భావార్థము:-విద్వాంసులెటుల చదివిన గాయత్ర్యాది ఛందస్సుల అర్థములతో సుఖములను పెంపొందజేయుచున్నారోఅటులనే పశుపాలకులును ఘృతాదులను వర్ధింప జేయవలయును. ౧౩౮౩[౧౨]

పష్ఠవాడిత్యస్య ప్రజాపతి ర్ఋషిః,విరాడాదయో దేవతాః, నిచృదనుష్టుప్ ఛందః,గాంధారః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మఱల నదే విషయము.

ప॒ష్ఠ॒వాహో॑ వి॒రాజ॑ ఉ॒క్షణో॑ బృహ॒త్యా॑ ఋష॒భాః ।

క॒కు॒భేఽన॒డ్వాహః॑ ప॒ఙ్క్త్యై ధే॒నవో॒ఽతి॑ఛన్ద॒సే॥ ॥౧౩॥

ప॒ష్ఠ॒వాహ॒ ఇతి॑ ప॒ష్ఠ॒+వాహః॑, వి॒రాజ॒ ఇతి॑ వి॒+రాజే॑, ఉ॒క్షణః॑, బృ॒హ॒త్యై॑, ఋష॒భాః, క॒కు॒భే॑, అ॒న॒డ్వాహః॑, ప॒ఙ్క్త్యై, ధే॒నవః॑, అతిఛన్దస॒ ఇత్యతి॑+ఛన్దసే.

పదార్థః:-(పష్ఠవాహః)యే పష్ఠేన పృష్ఠేన వహంతి తే,(విరాజే)విరాట్ ఛందసే (ఉక్షాణః)వీర్యసేచనసమర్థాః(బృహత్యై)బృహతీఛందోఽర్థాయ(ఋషభాః(బలిష్ఠాః(కకుభే) కకుబుష్ణిక్ ఛందోఽర్థాయ(అనడ్వాహః)శకటవహనసమర్థాః (పంక్త్యై) పంక్తిఛందోఽర్థాయ (ధేనవః) దుగ్ధధాత్ర్యః(అతిఛందసే)అతిజగత్యాది ఛందోఽర్థాయ. ॥౧౩॥

అన్వయః:-యై ర్మనుష్యై ర్విరాజే పష్ఠవాహో బృహత్యా ఉక్షాణః కకుభే ఋషభాః పంక్త్యా అనడ్వాహోఽతి ఛందసే ధేనవః స్వీక్రియంతే,తేఽతిసుఖం లభంతే. ॥౧౩॥

భావార్థః:-యథా విద్వాంసో విరాడాది ఛందోభ్యో బహూని విద్యాకార్యాణి సాధ్నువంతి తథోష్ట్రాదిభ్యః పశుభ్యో గృహస్థా అఖిలాని కార్యాణి సాధ్నుయుః. ॥౧౩॥

పదార్థము:- ఏ మనుష్యులచే, విరాజే=విరాట్ ఛందస్సునకై, పష్ఠవాహః=వీపుతో భారవహన మొనర్చునవి, బృహత్యై=బృహతీ ఛందస్సులోని అర్థమునకై ఉక్షాణః=వీర్యసించన మొనర్చుటకు సమర్థములైనవి, కకుభే=కకుబుష్ణిక్ఛందస్సులయొక్క అర్థమునకై, ఋషభాః=అత్యంత బలముగల ప్రాణులు,పంక్త్యై=పంక్తి ఛందస్సుయొక్క అర్థమునకై, అనడ్వాహః=శకటవహన సమర్థములగు ఎద్దులు, అతి ఛందసే=అతిజగత్యాది ఛందస్సుల అర్థమునకై, ధేనవః=పాడియావులు స్వీకరించబడునో వారు అత్యంతసుఖమును పొందుదురు. [౧౩]

భావార్థము:- విరాడాది ఛందస్సులద్వారా విద్వాంసులు ఎటుల బహువిద్యా

స్వభావము గలవారు. త్వా=నిన్ను, మా ని క్రన్=నీచగతిని పొందకుండ జేయుదురు గాక! హే, అగ్నే=వినయముచే శోభాయమానమగు సభాపతీ! తే=నీకు, సుయమమ్=సుందరముగ నియమమును నడపునట్టి, క్షత్రమ్=ధనము లేక రాజ్యము, అస్తు=కలుగుగాక, అందువలన, ఉపసత్తా=సమీపమున కూర్చొని యున్నవాడవై, అనిష్టృతః ఏవ=హింసను లేక విఘ్నమును పొందకుండగనే నీవు, అధి వర్ధతామ్=అధికముగ వృద్ధిపొందుము, తుభ్యమ్=నీకు రాజ్యము లేక ధనము సుఖదాయకమగుగాక! [౪]

భావార్థము:- ఓ రాజా! నీవు ప్రాచీనులైన వృద్ధులు నిన్ను బాగుగా కీర్తించునట్టి ఉత్తమ వినయమును ధరించుము, రాజ్యమున మంచి నియమములను ప్రవృత్తపఱచుము, అందువలన నీవు, నీ రాజ్యము విఘ్నరహితమై నలుదిక్కులా వ్యాపింపగలదు. ప్రజలు నిన్ను సర్వోపరిగా గౌరవింతురు. ౧౪౮౯[౪]

---

౧౪౯౦ క్షత్రేణేత్యస్యాగ్నిర్ఋషిః । అగ్నిర్దేవతా । స్వరాట్ పఙ్క్తిశ్ఛన్దః । పంచమః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

క్ష॒త్రేణా॑గ్నే॒ స్వాయుః॒ సꣳ ర॑భస్వ మి॒త్రేణా॑గ్నే మిత్ర॒ధేయే॑ యతస్వ।
స॒జా॒తానాం॑ మధ్యమ॒స్థా ఏ॑ధి॒ రాజ్ఞా॑మగ్నే విహ॒వ్యో॑ దీదిహీ॒హ ॥౫॥

క్ష॒త్రేణ॑, అ॒గ్నే॒, స్వాయు రితి॑ సు, ఆయుః॑, సమ్, ర॒భ॒స్వ॒. మి॒త్రేణ॑, అ॒గ్నే॒, మి॒త్ర॒ధేయ॒ ఇతి॑ మిత్ర॒+ధేయే॑, య॒త॒స్వ॒,స॒జా॒తానా॒ మితి॑ స+జా॒తానా॑మ్, మ॒ధ్య॒మ॒స్థా ఇతి॑ మ॒ధ్యమ॒+స్థాః॒, ఏ॒ధి॒, రాజ్ఞా॑మ్, అ॒గ్నే॒, వి॒హ॒వ్య ఇతి॑. వి+హ॒వ్యః॒, దీ॒ది॒హి॒, ఇ॒హ॥ ॥౫॥

పదార్థః:-(క్షత్రేణ) రాజ్యేన ధనేన వా (అగ్నే) పావకవత్తేజస్విన్ (స్వాయుః)శోభనం చ తదాయుశ్చ (సమ్) సమ్యక్ (రభస్వ) ఆరంభం కురు (మిత్రేణ) ధార్మికై ర్విద్వద్భి ర్మిత్రైః సహ (అగ్నే) విద్యావినయప్రకాశక (మిత్రధేయే) మిత్రై ర్ధర్తవ్యే వ్యవహారే (యతస్వ) (సజాతానామ్) సమానజన్మనామ్ (మధ్యమస్థాః) మధ్యే భవా మధ్యమాః పక్షపాతరహితాస్తేషు తిష్ఠతీతి (ఏధి) భవ (రాజ్ఞామ్) ధార్మికాణాం రాజాధిరాజానాం మధ్యే (అగ్నే) న్యాయప్రకాశక (విహవ్యః) విశేషేణ స్తోతుం యోగ్యః (దీదిహి) ప్రకాశితో భవ (ఇహ) అస్మిన్ సంసారే రాజ్యాధికారే వా. ॥౫॥

అన్వయః:- హే అగ్నే ! త్వమిహ క్షత్రేణ సహ స్వాయుః సంరభస్వ. హే అగ్నే మిత్రేణ

సహ మిత్రధేయే యతస్వ. హే అగ్నే ! సజాతానాం రాజ్ఞాం మధ్యే మధ్యమస్థా ఏధి .విహవ్యః సన్ .దీదిహి చ. ॥౫॥

భావార్థః:- రాజా సదా బ్రహ్మచర్యేణ దీర్ఘాయుః సత్యధర్మప్రియైరమాత్యైః సహ మంత్రయితాఽన్యై రాజభిః సహ సుసన్ధిః పక్షపాతం విహాయ న్యాయాధీశః సర్వైః సులక్షణైర్యుక్తః సన్ దుష్టవ్యసనవిరహో భూత్వా ధర్మార్థకామమోక్షాన్ ధైర్యేణ శాన్త్యాఽప్రమాదేన చ శనైశ్శనైః సాధయేత్. ॥౫॥

పదార్థము:- హే, అగ్నే=అగ్నివలె తేజోవంతుడవైన విద్వాంసుడా! నీవు, ఇహ =ఈ జగత్తునందు లేక రాజ్యాధికారమునందు, క్షత్రేణ=రాజ్యముతో లేక ధనముతో, స్వాయుః=సుందరమయిన యువావస్థను, సమ్ రభస్వ=బాగుగా ప్రారంభించుము, హే, అగ్నే=విద్యావినయములతో శోభాయమాననుడవగు ఓ రాజా!,మిత్రేణ=ధర్మాత్ములు, విద్వాంసులునైన మిత్రులతో, మిత్రధేయే=మిత్రులచే ధరించతగిన యోగ్యమైన వ్యవహారమునందు, యతస్వ=ప్రయత్న మొనరించుము, అగ్నే=న్యాయమును ప్రకాశపఱచు సభాపతీ ! సజాతానామ్=ఒకేపర్యాయము జనించినవారు, సమానవయస్సుగలవారు, రాజ్ఞామ్=ధర్మాత్ములునైన రాజాధికారుల మధ్య, మధ్యమస్థాః=మధ్యస్థుడవు, వాది ప్రతివాదులకు సాక్షివి, ఏధి=కమ్ము, మఱియు, విహవ్యః=విశేషస్తుతికి యోగ్యుడవై, దీదిహి=ప్రకాశవంతుడవు కమ్ము, [౫]

భావార్థము:- సభాపతియైన రాజు, సదా బ్రహ్మచర్యముతో దీర్ఘాయుష్మంతుడు, సత్యధర్మమందు ప్రీతినుంచు మంత్రులతో విచారించువాడు, ఇతర రాజులతో చక్కని సంధిచేసుకొనువాడు, పక్షపాతమును త్యజించిన న్యాయాధీశుడు,సకల శుభగుణయుక్తుడు, దుష్టవ్యసనములకు దూరుడునై ధర్మ, అర్థ, కామ, మోక్షములను,ధైర్యముగా శాంతముగా, ప్రమాదరహితముగా నెమ్మది నెమ్మదిగా సాధించవలయును. ౧౪౯౦[౫]

---

౧౪౯౧ అతి నిహ ఇత్యస్యాగ్నిరృషిః । అగ్నిర్దేవతా । భురిగ్బృహతీ ఛన్దః । మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

అతి నిహో అతి స్రిధోఽత్యచిత్తిమత్యరాతి మగ్నే విశ్వా హ్యగ్నే

దురితా సహస్వాథాఽస్మభ్యఀసహవీరాఀరయిన్దాః॥ ॥౬॥

అతి, నిహః, అతి, స్రిధః, అతి అచిత్తిమ్. అతి, అరాతిమ్, అగ్నే,

విశ్వా,హి,అగ్నే, దురి తేతి దుః+ఇతా, సహస్వ, అథ, అస్మభ్యమ్, సహ వీరామితి సహ+వీరామ్, రయిమ్, దాః॥ ॥౬॥

పదార్థః:-(అతి) అతిశయేన (నిహాః) యోఽసత్యం నితరాం జహాతి సః (అతి) (స్రిధః) దుష్టాచారాన్ (అతి) అతిక్రమ్య (అచిత్తిమ్) అజ్ఞానమ్ (అతి) (అరాతిమ్) అదానమ్. (అగ్నే) తేజస్విన్సభాపతే (విశ్వా) సర్వాణి (హి) ఖలు (అగ్నే) దృఢవిద్య (దురితాని) దుష్టాచరణాని (సహస్వ) (అథ) (అస్మభ్యమ్) (సహవీరామ్) వీరైః సహవర్తమానాం సేనామ్ (రయిమ్) ధనమ్ (దాః) దద్యాః. ॥౬॥

అన్వయః:-హే అగ్నే త్వమతి నిహాః సన్ స్రిధోఽతి సహస్వాచిత్తి మత్యరాతిం సహస్వ. హే అగ్నే త్వం హి విశ్వా దురితాఽతిసహస్వాఽథాఽస్మభ్యం సహవీరాం రయిం చ దాః.

భావార్థః: యే దుష్టాచారత్యాగినః కుత్సితానాం నిరోధకా అజ్ఞానమదానం చ పృథక్ కుర్వాణా దుర్వ్యసనేభ్యః పృథగ్భూతాః సుఖదుఃఖయోః సోఢారో వీరసేనాప్రియా యథా గుణానాం జనానాం యోగ్యం సత్కారం కుర్వన్తః సన్తో న్యాయేన రాజ్యం పాలయేయుస్తే సదా సుఖినో భవేయు రితి. ॥౬॥

పదార్థము:- అగ్నే = తేజోవంతుడ వగునో సభాపతీ! నీవు, అతి నిహాః= నిశ్చయముగ అసత్యమును త్యజించువాడవగుచు, స్రిధః=దుష్టాచారములను, అతి సహస్వ=అధికముగ సహించుము. అచిత్తిమ్=అజ్ఞానమును, అతి=అతిక్రమించుము. అరాతిమ్=దాన నిషేధమును [అదానమును] సహించుము. హే, అగ్నే=దృఢమైన విద్య గలవాడా! తేజోవంతుడా! విద్వాంసుడా; నీవు, హి=మాత్రమే, విశ్వాదురితా=సమస్త దుష్టాచరణములను, అతి=అధికముగ సహించుము, అథ=అటుపిమ్మట, అస్మభ్యమ్= మాకు, సహవీరామ్=వీరపురుషులతో గూడిన సైన్యమును, రయిమ్ = ధనమును, దాః=ఒసగుము, [౬]

భావార్థము:- ఎవరు దుష్టాచారములను త్యజించుదురో, కుత్సితుల నడ్డగించుదురో, అజ్ఞానమును అదానమును వేఱు [దూర]పఱచుదురో, దుర్వ్యసనములకు దూరముగ నుందురో, సుఖదుఃఖములను సహించుదురో, వీరపురుషులైన సైనికులతో ప్రీతి గలిగియుందురో, గుణానుకూలముగ ప్రజలను బాగుగా సత్కరించుదురో, న్యాయసమ్మతముగ రాజ్యమును పరిపాలించుదురో, అట్టి వారు సదాసుఖులు కాగలుగుదురు.

---

౧౪౯౩ అనాధృష్య ఇత్యస్యాగ్నిరృషిః । అగ్నిర్దేవతా । నిచృజ్జగతీ ఛన్దః । నిషాదః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

అనాధృష్యో జాతవేదా అనిష్టృతో విరాడగ్నే క్షత్రభృద్దీదిహీహ ।

విశ్వా ఆశాః ప్రముఞ్చన్మానుషీర్భియః శివేభిరద్య పరి పాహి నో వృధే॥

అనాధృష్యః, జాతవేదా+ఇతి జాత+వేదాః, అనిష్టృతః, అని_స్తృత ఇత్యని+_స్తృతః, విరాడితి వి+రాట్, అగ్నే, క్షత్రభృదితి, క్షత్ర+భృత్, దీదిహి. ఇహ, విశ్వాః, ఆశాః, ప్రముఞ్చన్నితి ప్ర+ముఞ్చన్, మానుషీః, భియః, శివేభిః, అద్య, పరి, పాహి, నః, వృధే॥ ॥౭॥

పదార్థః:-(అనాధృష్యః) అన్యైర్ధర్షితుమయోగ్యః(జాతవేదాః)జాతవిద్యః (అనిష్టృతః) దుఃఖాత్పృథగ్భూతః (విరాట్) విశేషేణ రాజమానః(అగ్నే)సుసంగృహీతరాజనీతే (క్షత్రభృత్) యః క్షత్రం రాజ్యం బిభర్తి సః (దీదిహి) కామయ (ఇహ) అస్మిన్ రాజ్యవ్యవహారే (విశ్వాః) సకలాః (ఆశాః) దిశః (ప్రముఞ్చన్) ప్రకర్షేణ ముక్తా కుర్వన్(మానుషీః) మనుష్యసంబంధినీః (భియః) రోగదోషాదికాః (శివేభిః) కల్యాణకారిభిః సభ్యైః (అద్య) ఇదానీమ్ (పరి) సర్వతః (పాహి) రక్ష (నః) అస్మాన్ (వృధే) వర్ధనాయ. ॥౭॥

అన్వయః:- హే అగ్నే యోఽద్యేహ మానుషీర్భియో నాశయ శివేభిశ్చ సహానిష్టృతోఽనాధృష్యో జాతవేదా విరాట్ క్షత్రభృదస్తి. స త్వం నో దీదిహి విశ్వా ఆశాః ప్రముఞ్చన్త్స త్వం నో వృధే పరి పాహి. ॥౭॥

భావార్థః:- యే రాజ రాజపురుషాః ప్రజాః సన్తోష్య మఙ్గలాచరణాః సర్వవిద్యాన్యాయక్రియాః సన్తి ప్రజాః పాలయేయుస్తే సర్వదిక్ప్రవృత్తకీర్తయః స్యుః. ॥౭॥

పదార్థము:- హే, అగ్నే=బాగుగా రాజనీతిని సంగ్రహింపజేయు నో రాజా! నీవు, అద్య=ఇపుడు, ఇహ=ఈ రాజ్య వ్యవహారమున, మానుషీః=మానవ సంబద్ధమైన, భియః=రోగ శోకాది భయములను నష్టమొనర్చుము. ఏనీవు, శివేభిః=కల్యాణకారులైన సభ్య సజ్జనులతో పాటు, అనిష్టృతః=దుఃఖముల నుండి వేరైనవాడవు, అనాధృష్యః=ఇతరులచే బెదరించుటకు తగనివాడవు, విరాట్=విశేషప్రకాశ మానుడవు, క్షత్రభృత్=రాజ్యపోషకుడవునై యున్నావో, అట్టి నీవు,నః=మమ్ము, దీదిహి=కోరుము. విశ్వాః ఆశాః=సకల దిశలను, ప్రముఞ్చన్=బాగుగా ముక్తపఱచుచున్న వాడవై, వృధే=మా వృద్ధి నిమిత్తము, పరిపాహి=సర్వదిశల నుండి రక్షించుము. [౭]

భావార్థము:- ఏరాజు లేక రాజపురుషులు ప్రజలను సంతుష్టపరచి మంగళాచరణ మొనర్చుదురో,సకల విద్యాయుక్తులు న్యాయ ప్రియులునై యుండుచు ప్రజలను రక్షించుదురో అట్టిరాజపురుషులు సమస్తదిశలలో వ్యాపించిన కీర్తిగలవారగుదురు.౧౪౯-౨[౭]

---

దైవ్యేత్యస్యాగ్ని ఋషిః, అగ్నిర్దేవతా, భురిగ్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

౧౪౯౩ బృహస్పత ఇత్యస్య ప్రజాపతి ర్ ఋషిః । విశ్వేదేవా దేవతాః । త్రిష్టుప్ ఛన్దః । ధైవతః స్వరః

పున స్తమేవ విషయ మాహ.

మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పఁబడెను.

బృహస్పతే సవిత ర్బోధ యైనꣳ సꣳ శితం చిత్సన్తరాꣳ సꣳ శిశాధి।
వర్ధయైనం మహతే సౌభగాయ విశ్వఽఏన మను మదన్తు దేవాః ॥౮॥

బృహస్పతే, సవితః, బోధయ, ఏనమ్, సꣳశిత మితి సమ్+శితమ్, చిత్, సన్తరామితి సమ్+తరామ్, సమ్, శిశాధి, వర్ధయ, ఏనమ్ మహతే, సౌభగాయ, విశ్వే, ఏనమ్, అను, మదన్తు, దేవాః॥ ॥౮॥

పదార్థః:-(బృహస్పతే) బృహతాం పాలక (సవితః) విద్యైశ్వర్యయుక్త (బోధయ) సచేతనం కురు (ఏనమ్) రాజానమ్ (సంశితమ్) తీక్ష్ణబుద్ధిస్వభావమ్(చిత్)(సన్తరామ్)అతితరామ్ (సం, శిశాధి) సమ్యక్ శిక్షస్వ (వర్ధయ)(ఏనమ్) (మహతే)(సౌభగాయ) ఉత్తమైశ్వర్యభావాయ (విశ్వే) సర్వే (ఏనమ్) (అను) పశ్చాత్ (మదన్తు) ఆనన్దన్తు (దేవాః) సునభ్యా విద్వాంసః. ॥౮॥

అన్వయః:- హే బృహస్పతే ! సవితః పూర్ణవిద్యోపదేశక! త్వమేనం సంశితం కుర్వన్ బోధయ సంశిశాధి చిదపి ప్రజాః సన్తరాం శిశాధ్యేనం మహతే సౌభగాయ వర్ధయ విశ్వే దేవా ఏన మనుమదన్తు. ॥౮॥

భావార్థః:-యో రాజసభోపదేశకః, స ఏతాన్ దుర్వ్యసనేభ్యో నివర్త్య సుశీలాన్ సంపాద్య మహైశ్వర్యవృద్ధయే ప్రవర్తయేత్. ॥౮॥

పదార్థము:-బృహస్పతే=సజ్జనులను రక్షించు గొప్పవాడా! సవితః=విద్యైశ్వర్య యుక్తుడా! సంపూర్ణ విద్యోపదేశకుడా! నీవు, ఏనమ్=ఈ రాజును, సంశితమ్=తీక్ష్ణ బుద్ధిస్వభావముగల వానినిగా జేయుచు, బోధయ=చేతనాయుక్తముగ నొనర్చుము. సమ్ శిశాధి=మంచిశిక్ష గఱపుము,చిత్=మఱియు,సన్తరామ్=అతిశయముగ ప్రజలకు శిక్ష గఱపుము, ఏనమ్=ఈరాజును, మహతే=గొప్ప, సౌభగాయ=ఉత్తమైశ్వర్యము కలుగుటకై, వర్ధయ=అభివృద్ధిపఱచుము. మఱియు, విశ్వేదేవాః=సమస్త సుందరులైన సభ్య విద్వాంసులు,ఏనమ్=ఈరాజునకు,అనుమదన్తు=ప్రసన్నులు,అనుకూలురు నగుదురుగాక!

భావార్థము:-రాజసభకుపదేశించువాడే రాజాదులను దుర్వ్యసనములనుండి తొలగించి, సుశీలత్వమును ప్రాప్తింపజేసి మహదైశ్వర్యవృద్ధికై ప్రవృత్తపఱచ వలయును.

---

౧౪౯౪ అముత్రేత్యస్య ప్రజాపతి ర్ ఋషిః, అశ్వాదయో దేవతాః, త్రిష్టుప్ ఛన్దః,ధైవతః స్వరః.

అథాధ్యాపకోపదేశకైః కిం కార్య మిత్యాహ.
అధ్యాపకుడు, ఉపదేశకుడు యేమి చేయవలయును ?

అముత్రభూయాదధ యద్యమస్య బృహస్పతే అభిశస్తే రముఞ్చః।
ప్రత్యౌహతా మశ్వినా మృత్యు మస్మాద్దేవానా మగ్నే భిషజా శచీభిః ॥౯॥

అముత్రభూయా దిత్యముత్ర+భూయాత్, అధ, యత్, యమస్య, బృహస్పతే, అభిశస్తే రిత్యభి+శస్తేః, అముఞ్చః, ప్రతి, ఔహతామ్, అశ్వినా, మృత్యుమ్, అస్మాత్, దేవానామ్, అగ్నే, భిషజా, శచీభిః॥ ॥౯॥

పదార్థః:-(అముత్రభూయాత్)పరజన్మని భావినః, అత్రాముత్రోప పదాద్ భూ ధాతోః క్యప్ (అధ) అథ (యత్) (యమస్య) నియన్తుః (బృహస్పతే) మహతాం పాలక (అభిశస్తేః) సర్వతోఽపరాధాత్(అముఞ్చః)ముచ్యాః(ప్రతి)(ఔహతామ్)వితర్కేణ సాధ్నుతామ్(అశ్వినా) అధ్యాపకోపదేశకౌ (మృత్యుమ్) (అస్మాత్) (దేవానామ్) (అగ్నే) సద్వైద్య(భిషజా)ఔషధాని (శచీభిః) కర్మభిః ప్రజ్ఞాభి ర్వా. ॥౯॥

అన్వయః:-హే బృహస్పతే త్వమముత్ర భూయాదభిశస్తే రేన మముఞ్చః, అధ యద్యో యమస్య శాసనే తిష్ఠేత్తస్య మృత్యు మముఞ్చః, హే అగ్నే త్వం యథాఽశ్వినా శచీభి ర్భిషజా ప్రత్యౌహతాం తథాఽస్మాద్దేవానా మారోగ్యం సమ్పాదయ. ॥౯॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. త ఏవ శ్రేష్ఠా అధ్యాపకోపదేశకా యేఽత్ర పరత్ర చ సుఖాయ సర్వాన్ సుశిక్షయేయు ర్యేన బ్రహ్మచర్యాదీని కర్మాణి సేవయిత్వా మనుష్యా అల్పమృత్యు మానన్దహానిం చ నాప్నుయుః. ॥౯॥

పదార్థము:-హే ! బృహస్పతే=గొప్పవారిని కాపాడు విద్వాంసుడా, నీవు, అముత్రభూయాత్=పరజన్మమునందగు, [పరజన్మయొక్క] అభిశస్తేః=సకలాపరాధముల నుండి, అముఞ్చః=విము క్తిపొందుము. అథ=తదనంతరము,యత్=ఎవడు యమస్య=ధర్మాత్ముడు నియమకర్తయునగువాని యొక్క శిక్ష [శాసనము] యందుండునో అతనియొక్క, మృత్యుమ్=మృత్యువును తప్పించుము. అగ్నే=ఉత్తమవైద్యుడా! నీవు, ఎట్లు అశ్వినా=అధ్యాపకోపదేశకులు, శచీభిః=కర్మలచే లేక బుద్ధులచే, భిషజా=రోగ నివారక పదార్థములను, ప్రతి ఔహతామ్=విశేష తర్కముతో సిద్ధపఱచుదురో ఆటులే, అస్మాత్=ఇందువలన, దేవానామ్=విద్వాంసులకు ఆరోగ్యమును చేకూర్చుము.

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. బ్రహ్మచర్యాది కర్మలను సేవించి అల్పవయస్సులోనే మృత్యువును,ఆనందము యొక్క హానిని,పొందకుండు

నటుల ఎవరీ లోకమందును పరలోకమందును సుఖము కలుగుటకై సమస్తమునకు మంచి శిక్షణొసగెదరో వారే శ్రేష్ఠులైన అధ్యాపకులు,ఉపదేశకులు నైయున్నారు.౧౪౯౪[౯]

---

౧౪౯౫ ఉద్వయమిత్యస్యాగ్ని ర్ఋషిః, సూర్యో దేవతా, విరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
అథేశ్వరోపాసన విషయ మాహ.

ఇపుడీశ్వరోపాసన విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

ఉద్వయ న్తమసస్పరి స్వః పశ్య న్త ఉత్తరమ్।

దేవం దేవత్రా సూర్య మగన్మ జ్యోతి రుత్తమమ్॥ ॥౧౦॥

ఉత్, వయమ్, తమసః. పరి, స్వరితి స్వః, పశ్యన్తః, ఉత్తర మిత్యుత్+తరమ్, దేవమ్, దేవత్రేతి దేవ+త్రా,సూర్యమ్, అగన్మ, జ్యోతిః, ఉత్తమ మిత్యుత్+తమమ్॥ ॥౧౦॥

పదార్థః:-(ఉత్) ఉత్కృష్టే (వయమ్) (తమసః) అన్ధకారాత్పృథగ్వర్తమానమ్ (పరి) సర్వతః (స్వః) సుఖసాధకమ్ (పశ్యన్తః) ప్రేక్షమాణాః (ఉత్తరమ్)సర్వేషాం లోకానాముత్తారకమ్ (దేవమ్) ద్యోతమానమ్ (దేవత్రా) దేవేషు వర్తమానమ్ (సూర్యమ్) చరాఽచరాత్మానమ్ (అగన్మ) ప్రాప్నుయామ (జ్యోతిః) ప్రకాశమానమ్ (ఉత్తమమ్) అతిశ్రేష్ఠమ్ ॥౧౦॥

అన్వయః: హే మనుష్యా యథా వయం తమసః పృథగ్భూతం జ్యోతిః సవితృమణ్డలం పశ్యన్తః స్వరుత్తరం దేవత్రోత్తమం సూర్యం జగదీశ్వరం దేవం పర్యుదగన్మ తథా తం యూయమపి ప్రాప్నుత. ॥౧౦॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యే మనుష్యాః సూర్యమివాఽవిద్యాన్ధకారాత్పృథగ్భూతం స్వప్రకాశం మహాదేవం సర్వోత్కృష్టం సర్వాన్తర్యామిణం పరమాత్మానమేవోపాసతే, తే ముక్తిసుఖమపి లభన్తే. ॥౧౦॥

పదార్థము:-ఓ మానవులారా! ఎట్లు, వయమ్=మేము, తమసః=అంధకారము నుండి వేరుగా వర్తమానమైన, జ్యోతిః,=ప్రకాశమాన సూర్యమండలమును,పశ్యన్తః= చూచుచు, స్వః=సుఖసాధకుడు, ఉత్తమమ్=సమస్త ప్రజలను దుఃఖములనుండి తరింప జేయువాడు, దేవత్రా=దివ్యపదార్థములందును, విద్వాంసులయందును వర్తమానుడు, ఉత్తమమ్=అతి శ్రేష్ఠుడు, సూర్యమ్=చరాచరము యొక్క ఆత్మ, దేవమ్=ప్రకాశమానుడువగు జగదీశ్వరుని,పరి ఉత్ అగన్మ=సకల దిశలనుండి ఉత్కృష్టతా పూర్వకముగా పొందెదమో, అటులనే మీరును ఆజగదీశ్వరుని పొందుడు. [౧౦]

భావార్థము:-ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఏ జనులు సూర్యునివలె నవిద్యారూపాంధకారమునుండి పృథగ్భూతుడు, స్వయంప్రకాశుడు,గొప్ప వాడు, సర్వోత్కృష్టుడు, సర్వాంతర్యామియునైన పరమేశ్వరునే ఉపాసించుచున్నారో వారే ముక్తి సుఖములను నిర్విఘ్నముగ,ప్రీతి పూర్వకముగ,తప్పక పొందుచున్నారు.

---

౧౪౯౬ ఊర్ధ్వా ఇత్యస్యాగ్ని ర్ఋషిః, అగ్ని ర్దేవతా, ఉష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.
అథాఽగ్నిః కీదృశ ఇత్యాహ.

ఇపుడగ్ని యెటులున్నదను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

ఊర్ధ్వా అస్య సమిధో భవన్త్యూర్ధ్వా శుక్రా శోచీꣳష్యగ్నేః।

ద్యుమత్తమా సుప్రతీకస్య సూనోః॥ ॥౧౧॥

ఊర్ధ్వాః, అస్య, సమిధ ఇతి సమ్+ఇధః, భవన్తి,ఊర్ధ్వా,శుక్రా,శోచీꣳషి, అగ్నేః, ద్యుమత్తమేతి ద్యుమత్+తమా, సుప్రతీకస్యేతి సు+ప్రతీకస్య, సూనోః॥

పదార్థః:-(ఊర్ధ్వాః) ఉత్తమాః (అస్య) (సమిధః) సమ్యక్ ప్రదీపికాః (భవన్తి) (ఊర్ధ్వా) ఊర్ధ్వాని (శుక్రా) శుద్ధాని (శోచీంషి) తేజాంసి (అగ్నేః) పావకస్య (ద్యుమత్తమా) అతిశయేన ప్రశస్తప్రకాశయుక్తాని (సుప్రతీకస్య) శోభనాని ప్రతీకాని ప్రతీతికరాణి కర్మాణి యస్య తస్య సూనోః) ప్రాణిగర్భవిమోచకస్య. ॥౧౧॥

అన్వయః:-హే మనుష్యా యస్యాఽస్య సుప్రతీకస్య సూనో రగ్నే రూర్ధ్వాః సమిధ ఊర్ధ్వా ద్యుమత్తమా శుక్రా శోచీంషి భవన్తి తం విజానీత. ॥౧౧॥

భావార్థః:-హే మనుష్యా యోఽయమూర్ధ్వగన్తా సర్వదర్శనహేతుః సర్వేషాం పాలన నిమిత్తోఽగ్ని రస్తి, తం విజ్ఞాయ కార్యాణి సతతం సాధ్నుత. ॥౧౧॥

పదార్థము:-ఓ మానవులారా ! సుప్రతీకస్య=సుందర ప్రతీతికారక కర్మలతో యుక్తుడు,సూనోః=ప్రాణులయొక్క గర్భములను విడిపించువాడునగు, అస్యఅగ్నేః= ఏయీ యగ్నికి,ఊర్ధ్వాః=ఉత్తమములైన,సమిధః=చక్కగాప్రకాశింపజేయు సమిధలు, ఊర్ధ్వా=పైకిబోవునవి,ద్యుమత్తమమ్=అత్యుత్తమప్రకాశయుక్తములు, శుక్రా=శుద్ధము లునగు,శోచీꣳషి=తేజస్సులు,భవన్తి=ఉండుచున్నవో,దానిని మీరు తెలిసికొనుడు.[౧౧]

భావార్థము:-ఓ మానవులారా! పైకిబోవునది,సమస్త జనులు చూచుటకు హేతువైనది, సర్వరక్షణకు కారణమైనదియునగు నే యీయగ్నికలదో, దానిని దెలిసికొని నిరంతరము కార్యములను సాధించుచుండుడు. ౧౪౯౬[౧౧]

---

౧౪౫౭ తనూనపాదిత్యస్యాఽగ్ని ఋషిః, విశ్వే దేవా దేవతాః, ఉష్ణిక్ ఛన్దః ఋషభః స్వరః.
అథ వాయుః కింవత్ కార్యసాధకోఽస్తీత్యాహ.
వాయు వెవనివలె కార్యసాధకమై యున్నది ?

తనూన పాదసురో విశ్వవేదా దేవో దేవేషు దేవః।
పథో అనక్తు మధ్వా ఘృతేన॥ ॥౧౨॥

తనూన పాదితి తనూ+నపాత్, అసురః, విశ్వవేదా ఇతి విశ్వ+వేదాః, దేవః, దేవేషు, దేవః, పథః, అనక్తు, మధ్వా, ఘృతేన॥ ॥౧౨॥

పదార్థః:-(తనూనపాత్) యస్తనూషు శరీరేషు న పతతి సః (అసురః) ప్రకాశరహితో వాయుః (విశ్వవేదాః) యో విశ్వం విన్దతి సః (దేవః) దివ్యగుణః (దేవేషు) దివ్యగుణేషు వస్తుషు (దేవః) కమనీయః(పథః)మార్గాన్(అనక్తు) (మధ్వా) మధురేణ(ఘృతేన) ఉదకేన సహ.

అన్వయః:- హే!మనుష్యా యో దేవేషు దేవోఽసురో విశ్వవేదాస్తనూన పాద్దేవో మధ్వా ఘృతేన సహ పథోఽనక్తు,తం యూయం విజానీత. ॥౧౨॥

భావార్థః:-యథా పరమేశ్వరో మహాదేవో విశ్వవ్యాపీ సర్వేషాం సుఖకరోఽస్తి తథా వాయురప్యస్తి నహ్యనేన వినా కశ్చిదపి కుత్రచిద్ గన్తుం శక్నోతి. ॥౧౨॥

పదార్థము,-ఓ మానవులారా! దేవేషు=ఉత్తమ గుణములుగల పదార్థములలో, దేవః=ఉత్తమ గుణము గలది, అసురః=ప్రకాశరహితమైనదియునగు వాయువు, విశ్వవేదాః=సమస్తమునకు లభించెడిదియు, తనూనపాత్=శరీరమునందు పడనిదియు, దేవః= కోరదగినదియునై యేది,మధ్వా=మధురమైన, ఘృతేన=జలముతో, పథః=శ్రోత్రాది మార్గములను, అనక్తు=ప్రకటించునో దానిని మీరు తెలిసికొనుడు. [౧౨]

భావార్థము:-విశ్వవ్యాపియైన పరమేశ్వరుడెట్లు అన్నింటియందును వ్యాపించి సమస్తమునకుసుఖమొసగువాడై యున్నాడో వాయువుకూడ అటులనే అయియున్నది. ఏలయన నీవాయువే లేనిచో నెవరు నెచటికిని బోజాలరు. ౧౪౫౭[౧౨]

---

౧౪౫౮ మధ్వేత్యస్యాగ్ని ఋషిః, యజ్ఞో దేవతా, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.
పునః కీదృశా జనాః సుఖినః స్యు రిత్యాహ.
మఱల నెటువంటి మనుష్యుడు సుఖవంతుడగునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

మధ్వా యజ్ఞం నక్షసే ప్రీణానో నరాశంసోఽఅగ్నే।
సుకృద్దేవః సవితా విశ్వవారః॥ ॥౧౩॥

మధ్వా, యజ్ఞమ్, నక్షసే, ప్రీణానః, నరాశꣳసః ।

అగ్నే, సుకృదితి సు+కృత్, దేవః, సవితా, విశ్వవార ఇతి విశ్వవారః॥

పదార్థః:-(మధ్వా)మధురేణ వచనేన(యజ్ఞమ్)సంగతం వ్యవహారమ్(నక్షసే)ప్రాప్నోషి (ప్రీణానః) కామయమానః (నరాశంసః) యో నరాన్ శంసతి సః (అగ్నే) విద్వన్ (సుకృత్) యః సుష్ఠు కరోతి సః (దేవః) వ్యవహర్తా (సవితా) ఐశ్వర్యమిచ్ఛుకః (విశ్వవారః) యో విశ్వం వృణోతి సః. ॥౧౩॥

అన్వయః:- హే అగ్నే యో నరాశంసః సుకృద్విశ్వవారః ప్రీణానః సవితా దేవస్త్వం మధ్వా యజ్ఞం నక్షసే తం వయం ప్రసాదయేమ. ॥౧౩॥

భావార్థః:- యే మనుష్యా యజ్ఞే సుగన్ధాదిహోమేన వాయుజలే శోధయిత్వా సర్వాన్ సుఖయన్తి, తే సర్వాణి సుఖాని ప్రాప్నువన్తి. ॥౧౩॥

పదార్థము:- హే ! అగ్నే=విద్వాంసుడా! నరాశంసః=మానవులను ప్రశంసించు వాడవు, సుకృతమ్=ఉత్తమ కార్యమొనర్చువాడవు, విశ్వవారః=ప్రశంసను స్వీకరించు వాడవు, ప్రీణానః=కోరుచున్న వాడవు, సవితా=ఐశ్వర్యమును కోరువాడవు, దేవః= వ్యవహారమునందు చతురుడవు నైనయే నీవు,మధ్వా=మధుర వాక్కులతో,యజ్ఞమ్= సంగత వ్యవహారమును, నక్షసే=పొందుచున్నావో, అట్టి నిన్ను మేము ప్రసన్న పఱ చెదము గాక! [౧౩]

భావార్థము:-ఏమానవులు యజ్ఞమందు సుగంధ్యాది పదార్థములను హోమమొ నర్చి వాయుజలములను శుద్ధమొనర్చి సమస్తమునకు సుఖమును కలుగజేయుచున్నారో అట్టి మానవులే సకల సుఖములను బొందుచున్నారు. ౧౪౫౮[౧౩]

---

౧౪౫౯ అచ్ఛేత్యస్యాగ్ని ర్ఋషిః, వహ్ని ర్దేవతా, భురిగుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథాఽగ్నినోపకారో గ్రాహ్య ఇత్యాహ.

ఇపు డగ్నివలననుపకారమును పొందవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

అచ్ఛాయమేతి శవసా ఘృతేనేడానో వహ్ని ర్నమసా ।

అగ్నిꣳస్రుచో అధ్వరేషు ప్రయత్సు॥ ॥౧౪॥

అచ్ఛ అయమ్, ఏతి, శవసా, ఘృతేన, ఈడానః, వహ్నిః ।

నమసా, అగ్నిమ్, స్రుచః, అధ్వరేషు, ప్రయత్స్వితి ప్రయత్+సు॥౧౪॥

పదార్థః:-(అచ్ఛ) (అయమ్) (ఏతి) గచ్ఛతి(శవసా)బలేన(ఘృతేన)జలేన సహ(ఈడానః)

స్తువన్ (వహ్నిః) విద్యాయా వోఢా (నమసా) పృథివ్యాద్యన్నేన (అగ్నిమ్)పావకమ్(స్రుచః) హోమసాధనాని (అధ్వరేషు) అహింసనీయేషు (ప్రయత్సు) ప్రయత్నసాధ్యేషు వర్త్తమానేషు.

అన్వయః:- హే మనుష్యా యోఽయమీడానో వహ్నిః ప్రయత్స్వధ్వరేషు శవసా ఘృతేన నమసా సహ వర్త్తమానమగ్నిం స్రుచశ్చాచ్ఛైతి తం యూయం సత్కురుత. ॥౧౪॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే మనుష్యా యోఽగ్నిరింధనైర్జలేన యుక్తో యానేషు ప్రయుక్తః సన్ బలేన సద్యో గమయతి.తం విజ్ఞాయోపకురుత. ॥౧౪॥

పదార్థము:-ఓ మానవులారా! అయమ్=ఏ యితడు, ఈడానః=స్తుతించువాడు, వహ్నిః=విద్యనుచేర్చువాడునగు విద్వాంసుడు,ప్రయత్సు=ప్రయత్నముచేసాధించతగిన, అధ్వరేషు=విఘ్నములకు భిన్నముగనున్న యజ్ఞమందు, శవసా=బలముతో, ఘృతేన =జలముతో, నమసా=పృథివ్యాది అన్నములతో వర్తమానమైన, అగ్నిమ్=అగ్నిని మఱియు, స్రుచః=హోమ సాధనములైన స్రువాదులను, అచ్ఛ ఏతి=బాగుగా పొందు చున్నాడో, అట్టి విద్వాంసుని మీరు సత్కరించుడు. [౧౪]

భావార్థము:-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది. జనులారా ! ఏయగ్ని ఇంధన జలములతో కూడియున్న యానములందు ప్రయుక్త మొనర్చబడి బలముతో శీఘ్రముగా నడిపించుచున్నదో,అట్టి దానిని దెలిసికొనిఉపకారము పొందుడు.



౧౫౦౦ స యక్షదిత్యస్యాగ్ని ర్ఋషిః, వాయుర్దేవతా, స్వరాడుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

స యక్షదస్య మహిమాన మగ్నేః స ఈం మన్ద్రా సు ప్రయసః ।
వసుశ్చేతిష్ఠో వసుధాతమశ్చ॥ ॥౧౫॥

సః, యక్షత్, అస్య, మహిమానమ్, అగ్నేః, సః,
ఈమ్, మన్ద్రా। సుప్రయస ఇతి సు+ప్రయసః, వసుః,
చేతిష్ఠః। వసుధా తమ ఇతి, వసు+ధాతమః, చ॥ ॥౧౫॥

పదార్థః:-(సః) (యక్షత్) యజేత్సఙ్గచ్ఛేత (అస్య) (మహిమానమ్) మహత్వమ్(అగ్నేః) పావకస్య (సః) (ఈమ్) జలమ్ (మన్ద్రా) ఆనన్దప్రదాని హవీంషి (సుప్రయసః) శోభనాని ప్రయాంసి ప్రీతాన్యన్నాదీని యస్మాత్తస్య (వసుః) వాసయితా (చేతిష్ఠః) అతిశయేన చేతా సంజ్ఞాతా (వసుధాతమః) యోఽతిశయేన వసూని దధాతి సః (చ) సముచ్చయే. ॥౧౫॥

అన్వయః;-స మనుష్యః సుప్రయసో౽స్యాగ్నే ర్మహిమానం యశుత్స వసుశ్చేతిష్ఠో వసుధాతమశ్చ సన్నీం మన్ద్రా యశుత్. ॥౧౫॥

భావార్థః-య ఇత్థమగ్నేర్మహత్వం విజానీయాత్సో౽తిధనీ స్యాత్. ॥౧౫॥

పదార్థము:-సః=పూర్వోక్తుడైన అవిద్వాంసుడు,సుప్రయసః=ప్రీతి కారకములు సుందరములునగు అన్నాదులకు హేతువైనవాడు,అస్యఅగ్నేః=ఈయగ్ని యొక్క,మహిమానమ్=గొప్పతనమును, యశుత్=బాగుగా పొందును గాక! మఱియు, సః=అతడు, వసుః=నివాసమునకు హేతువై, చేతిష్ఠః=అధికముగ తెలిసికొనువాడై, చ=మఱియు వసుధాతమః=అత్యంత ధనములనుధరించువాడై,ఈమ్=జలమును మఱియు,మన్ద్రా=అనందదాయకములగు హోమ యోగ్య పదార్థములనుపొందునుగాక! [౧౫]

భావార్థము:-ఏపురుషుడీవిధముగా అగ్ని యొక్క గొప్పతనమును తెలిసికొనునో ఆత డధికధనవంతుడగును. ౧౫౦౦[౧౫]

---

౧౫౦౧ ద్వారో దేవీరిత్యస్యా౽గ్ని ఋషిః, దేవ్యో దేవతాః, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.
పునస్తమేవ విషయ మాహ.

మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

ద్వారో దేవీ రన్వస్య విశ్వే వ్రతా దదన్తే అగ్నేః ।
ఉరువ్యచసో ధామ్నా పత్య మానాః॥ ॥౧౬॥

ద్వారః, దేవీః, అను, అస్య, విశ్వే, వ్రతా, దదన్తే, అగ్నే, ఉరువ్యచస ఇత్యురు-వ్యచసః, ధామ్నా, పత్యమానాః॥ ॥౧౬॥

పదార్థః:-(ద్వారః) ద్వారాణి (దేవీః) దేదీప్యమానాని (అను) (అస్య) (విశ్వే) సర్వే (వ్రతా) సత్యభాషణాదీని (దదన్తే)(అగ్నేః)పావకస్య(ఉరువ్యచసః)బహువ్యాపకస్య(ధామ్నా) స్థానేన (పత్యమానాః) స్వామిత్వం కుర్వాణాః. ॥౧౬॥

అన్వయః:-హే విశ్వే పత్యమానా ఉరువ్యచసో౽స్యాగ్నే ర్ధామ్నా దేవీ ర్ద్వారో వ్రతా౽ను దదన్తే తే సైశ్వర్యా జాయన్తే. ॥౧౬॥

భావార్థః:-యే౽గ్నివిద్యాయా ద్వారాణి జానన్తి తే సత్యాచారాః సన్తో౽నుమోదన్తే.

పదార్థము:-విశ్వే పత్యమానాః=నాయకులైన యేవిద్వాంసులందరు, ఉరు వ్యచసః=అనేకములందు వ్యాపకమైయున్న, అస్య అగ్నేః=ఈయగ్ని యొక్క,ధామ్నా=స్థానముచే, దేవీః=ప్రకాశితములగు, ద్వారః=ద్వారములను, మఱియు వ్రతా=సత్య

భాషణాది వ్రతములను, అను దదస్తే=అనుకూలముగ నుపదేశించుదురో, వారు సుంద రైశ్వర్యవంతులగుదురు. [౨౬]

భావార్థము:-ఎవరు అగ్ని విద్యయొక్క ద్వారము[పద్ధతు]లను తెలిసికొనుచు న్నారో వారు సత్యాచరణమొనర్చుచు నత్యంతానందితులగుచున్నారు. ౧౫౦౧[౧౬]

---

౧౫౦౨ తే అస్యేత్యస్యాగ్ని ర్ఋషిః, యజ్ఞో దేవతా, విరాడుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.
పునస్తమేవ విషయ మాహ.

మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

తే అస్య యోషణే దివ్యే న యోనా ఉషాసా నక్తా ।
ఇమం యజ్ఞమవతా మధ్వరం నః॥ ॥౧౭॥

తే ఇతి తే, అస్య, యోషణే ఇతి యోషణే, దివ్యే ఇతి దివ్యే, న, యోనౌ, ఉషాసానక్తా, ఉషసానక్తే త్యుషసానక్తా,ఇమమ్,యజ్ఞమ్, అవతామ్,అధ్వరమ్,నః.

పదార్థః:-(తే) (అస్య) (యోషణే) భార్యే వర్తమానే (దివ్యే) దివ్యస్వరూపే (న) ఇవ (యోనౌ) గృహే (ఉషాసానక్తా) రాత్రిన్దివౌ (ఇమమ్) (యజ్ఞమ్) (అవతామ్) రక్షేతామ్ (అధ్వరమ్) అహింసనీయమ్ (నః) అస్మాకమ్. ॥౧౭॥

అన్వయః:-హే మనుష్యాస్తే ఉషాసానక్తాఽస్య యోనౌ దివ్యే యోషణే న నో యమి మమధ్వరం యజ్ఞమవతాం తం యూయం విజానీత. ॥౧౭॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యథా విదుషీ పత్నీ గృహకృత్యాని సాధ్నోతి తథా వహ్నినా జాతే రాత్ర్యహ్నీ సర్వం వ్యవహారం సాధ్నుతః. ॥౧౭॥

పదార్థము:-ఓమానవులారా! తే ఉషాసానక్తా=దివానక్తములు రెండు, అస్య= ఈపురుషునియొక్క,యోనౌ=గృహంబున,దివ్యే=ఉత్తమ రూపముగల,యోషణే న= ఇరువుర స్త్రీలవలె, నః=మాయొక్క, ఇమమ్=ఈయా, అధ్వరమ్ యజ్ఞమ్=వినాశన మొనర్చ దగని యజ్ఞమును, అవతామ్=రక్షించుదురో. దానిని మీరును తెలిసికొనుడు.

భావార్థము:-ఈ మంత్ర మందుపమాలంకారమున్నది. ఎట్లు విదుషియైన స్త్రీ గృహకృత్యములను సాధించుచున్నదో, అటులనే అగ్నివలన జనించిన దివారాత్రములు సమస్త వ్యవహారములను సిద్ధపఱచుచున్నవి. ౧౫౦౨[౧౭]

---

౧౫౦౩ దైవ్యేత్యస్యాగ్నిర్ఋషిః అగ్నిర్దేవతా । భురిగ్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.
పునస్తమేవ విషయ మాహ.

మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

దైవ్యా హోతారా ఊర్ధ్వమధ్వరం నోఽగ్నేర్జిహ్వా మభి

గృణీతమ్। కృణుతం నః స్విష్టిమ్॥ ॥౧౮॥

దైవ్యా, హోతారా, ఊర్ధ్వమ్, అధ్వరమ్, నః, అగ్నేః, జిహ్వామ్, అభి, గృణీతమ్, కృణుతమ్, నః, స్విష్టిమితి సు+ఇష్టిమ్॥ ॥౧౮॥

పదార్థః:-(దైవ్యా) దేవేషు విద్వత్సు భవౌ విద్వాంసౌ(హోతారా)సుఖస్య దాతారౌ (ఊర్ధ్వమ్) ప్రాప్తోన్నతిమ్ (అధ్వరమ్) అహింసనీయం వ్యవహారమ్ (నః) అస్మాకమ్(అగ్నేః) పావకస్య (జిహ్వామ్) జ్వాలామ్ (అభి) (గృణీతమ్) ప్రశంసేతామ్ (కృణుతమ్) కురుతమ్(నః) (స్విష్టిమ్)శోభనా ఇష్టిర్యస్యా స్తామ్. ॥౧౮॥

అన్వయః:-యౌ దైవ్యా హోతారా న ఊర్ధ్వమధ్వర మభిగృణీతం తౌ నః స్విష్టిమగ్నేర్జిహ్వాం కృణుతమ్. ॥౧౮॥

భావార్థః:-యది జిజ్ఞా స్వధ్యాపకా వగ్నివిద్యాం జానీయాతాం, తర్హి విశ్వస్యోన్నతిం కుర్యాతామ్. ॥౧౮॥

పదార్థము:-దైవ్యా=విద్వాంసులలో ప్రసిద్ధులునగునే యిరువురు విద్వాంసులు, హోతారా=సుఖమునొసగువారు,నః=మాయొక్క, ఊర్ధ్వమ్=ఉన్నతి పొందినదియు అధ్వరమ్=చెడగొట్ట దగనిదియునగు వ్యవహారమును, అభిగృణీతమ్=సమస్తవిధముల ప్రశంసించుచున్నారో, ఆ యిరువురు,నః=మాయొక్క, స్విష్టిమ్=సుందరమైన యజ్ఞము నిమిత్తము,అగ్నేః=అగ్నియొక్క, జిహ్వామ్=జ్వాలను,కృణుతమ్=సిద్ధమొనర్తురుగాక!

భావార్థము:-జిజ్ఞాసువులు, అధ్యాపకులు అగ్నివిద్యను తెలిసికొనినవారగుచో, వారు విశ్వోన్నతి యొనర్చవలయును. ౧౫౦౩[౧౮]

---

తిస్రో దేవీరిత్యస్యాఽగ్ని ర్ఋషిః, ఇడాదయో లిఙ్గోక్తా దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.
పున ర్మనుష్యైః కీదృశీ వాణీ సేవనీయా ఇత్యాహ

మఱల మానవులెట్టి వాణిని సేవించవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

తిస్రో దేవీ ర్బర్హి రేదꣳ సద న్త్విడా సరస్వతీ భారతీ। మహీగృణానా॥౧౯॥

తిస్రః, దేవీః, బర్హిః, ఆ, ఇదమ్, సదన్తు, ఇడా,

సరస్వతీ, భారతీ, మహీ, గృణానా॥ ॥౧౯॥

పదార్థః:-(తిస్రః)త్రిత్వసంఖ్యాకాః (దేవీః)కమనీయాః(బర్హిః)అన్తరిక్షమ్(ఆ)సమన్తాత్ ఇదమ్) (సదన్తు) ప్రాప్నువన్తు (ఇడా) స్తోతుమర్హా (సరస్వతీ) ప్రశస్తవిజ్ఞానవతీ (భారతీ) సర్వ శాస్త్రధారిణీ (మహీ) మహతీ (గృణానా) స్తువన్తి. ॥౧౯॥

అన్వయః:-హే మనుష్యా యూయం యా మహీ గృణానేడా సరస్వతీ భారతీ చ తిస్రో దేవీ రిదం బర్హిరాసదన్తు తాం సమ్యగ్విజానీత. ॥౧౯॥

భావార్థః:-యే మనుష్యా వ్యవహారకుశలాం సర్వశాస్త్రవిద్యాన్వితాం సత్యాదివ్యవహారధర్త్రీం వాణీం ప్రాప్నుయుస్తే స్తుత్యాః సన్తో మహాన్తో భవేయుః. ॥౧౯॥

పదార్థము:-ఓ మానవులారా! మీరు, మహీ=గొప్పదియు, గృణానా=స్తుతించునదియునగు, ఇడా=స్తుతించదగినది, సరస్వతీ=ప్రశస్త విజ్ఞానము గలది మఱియు, భారతీ=సర్వశాస్త్రములను ధరించునదియగు,తిస్రః దేవీః=కోరదగిన ఏమూడువాక్కులు ఇదమ్ బర్హిః=ఈయంతరిక్షమున, ఆసదన్తు=బాగుగా ప్రాప్తములగునో ఆత్రివిధవాణులను బాగుగా తెలిసికొనుడు. [౧౯]

భావార్థము:-ఏమానవులు వ్యవహారమున చతురము, సకల శాస్త్రవిద్యాయుక్తము, సత్యాది వ్యవహారములను ధరించునదియునగు వాణిని పొందెదరో, వారు స్తుతించదగినవారై గొప్పవారగుదురు. ౧౫౦౪[౧౯]

౧౫౦౫ తన్న ఇత్యస్యాగ్ని ర్ఋషిః, త్వష్టా దేవతా, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

ఈశ్వరాత్ కిం ప్రార్థనీయ మిత్యాహ

ఈశ్వరుని నేమి ప్రార్థించవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

తన్న స్తురీప మద్భుతం పురుక్షు త్వష్టా సువీర్యమ్।

రాయస్పోషం విష్యతు నాభిమస్మే॥ ॥౨౦॥

తమ్, నః, తురీపమ్, అద్భుతమ్, పురుక్షు, త్వష్టా, సువీర్యమితి సు+వీర్యమ్, రాయః, పోషమ్, వి, స్యతు, నాభిమ్, అస్మే+ఇత్యస్మే॥ ॥౨౦॥

పదార్థః:-(తమ్)ప్రసిద్ధమ్(నః)అస్మాన్(తురీపమ్)యత్తురఃసద్య ఆప్నోతి తమ్(అద్భుతమ్) ఆశ్చర్యగుణకర్మ స్వభావమ్ (పురుక్షు) యత్ పురుషు బహుషు క్షియతి వసతి తత్ (త్వష్టా) విద్యయా ప్రకాశిత ఈశ్వరః (సువీర్యమ్) సుష్ఠుబలమ్(రాయః)ధనస్య(పోషమ్)పుష్టిమ్(విస్యతు) విముఞ్చతు (నాభిమ్) మధ్యప్రదేశమ్ (అస్మే)అస్మాకమ్. ॥౨౦॥

అన్వయః:-త్వష్టాఽస్మే నాభిః ప్రతి తురీపమద్భుతం పురుక్షు సువీర్యం తం రాయస్పోషం దదాతు నో దుఃఖాద్విష్యతు చ. ॥౨౦॥

భావార్థః:-హే మనుష్యా యచ్ఛీఘ్రకార్యాశ్చర్యభూతం బహువ్యాపకం ధనం బలం వాస్తి తదస్మాయ మీశ్వర ప్రార్థనయా ప్రాప్యానన్దితా భవత. ॥౨౦॥

పదార్థము:-త్వష్టా=విద్యచే ప్రకాశితుడగు నీశ్వరుడు,అస్మే=మాయొక్క, నాభిమ్=మధ్యప్రదేశమును గుఱించి,తురీపమ్=శీఘ్రత్వమునుపొందెడిది,అద్భుతమ్=ఆశ్చర్యరూపగుణకర్మ స్వభావములతో కూడినది, పురుతు=బహుపదార్థములందు వసించునది, సువీర్యమ్=సుందరబలయుక్తమైనదియునగు,తమ్‌రాయః=ఆప్రసిద్ధ ధనముయొక్క,పోషమ్=పుష్టినిఒసగుగాక!మఱియు నః=మమ్ము దుఃఖములనుండి, విస్యతు=విడిపించుగాక!

భావార్థము:-ఓ మానవులారా! శీఘ్రకారియు, ఆశ్చర్యరూపమును,అనేకమందు వ్యాపకము నగునే ధనము లేక బలము కలదో దానిని మీరు ఈశ్వరప్రార్థనచే పొంది ఆనందితులగుడు. ౧౫౦౫[౨౦]

వనస్పత ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, విద్వాంసో దేవతాః. విరాడుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

జిజ్ఞాసుః కీదృశో భవేదిత్యాహ

జిజ్ఞాసువు ఎటులుండవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

**వనస్పతేఽవ సృజా రరాణస్త్మనా దేవేషు।అగ్నిర్హవ్యꣳశమితా సూదయాతి॥**

**వనస్పతే అవ, సృజ, రరాణః, త్మనా, దేవేషు,**

**అగ్నిః, హవ్యమ్, శమితా, సూదయాతి॥ ॥౨౧॥**

పదార్థః:-(వనస్పతే) వనస్య సమ్భజనీయస్య శాస్త్రస్య పాలక (అవ) (సృజ) అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (రరాణః) రమమాణః (త్మనా) ఆత్మనా (దేవేషు) దివ్యగుణేష్వివ విద్వత్సు (అగ్నిః) పావకః (హవ్యమ్) ఆదాతుమర్హమ్ (శమితా) యజ్ఞసంబన్ధీ (సూదయాతి) సూక్ష్మీకృత్య వాయౌ ప్రసారయతి. ॥౨౧॥

అన్వయః:-హే వనస్పతే యథా శమితాఽగ్ని ర్హవ్యం సూదయాతి తథా త్మనా దేవేషు రరాణః సన్ హవ్యమవసృజ. ॥౨౧॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః.యథా దివ్యేష్వన్తరిక్షాదిషు వహ్నిర్రాజతే, తథా విద్వత్సు స్థితో జిజ్ఞాసుః సుప్రకాశితాత్మా భవతి. ॥౨౧॥

పదార్థము:-వనస్పతే=సేవించదగిన శాస్త్రమునకు రక్షకుడవగు జిజ్ఞాసూ ! శమితా=యజ్ఞసంబంధమైన, అగ్నిః=అగ్ని,హవ్యమ్=గ్రహించదగిన హోమద్రవ్యములను, సూదయాతి=సూక్ష్మపఱచి వాయువునందెటుల వ్యాపింపజేయుచున్నదో అటులనే, త్మనా=నీయాత్మచే,దేవేషు=దివ్యగుణములవలె నున్న విద్వాంసులలో, రరాణః=రమణమొనర్చుచు గ్రహించదగిన పదార్థములను, అవసృజ=బాగుగా నిర్మాణమొనర్చుము.

భావార్థము:-ఈమంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఎట్లు శుద్ధమైన ఆకాశాదులందు అగ్ని శోభాయమానమగుచున్నదో, అటులనే విద్వాంసులలో స్థితుడైన జిజ్ఞాసువు సుందరము ప్రకాశితమునగు స్వరూపముగల వాడగుచున్నాడు.

---

అగ్నే స్వాహేత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః

పున ర్మనుష్యైః కిం కార్య మిత్యాహ

మఱల మనుష్యు లేమిచేయవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

అగ్నే స్వాహా కృణుహి జాతవేద ఇన్ద్రాయ హవ్యమ్ ।

విశ్వేదేవా హవిరిదం జుషన్తామ్॥ ॥౨౨॥

అగ్నే, స్వాహా, కృణుహి, జాతవేద ఇతి జాత+వేదః,ఇన్ద్రాయ,

హవ్యమ్, విశ్వే, దేవాః, హవిః, ఇదమ్, జుషన్తామ్॥ ॥౨౨॥

పదార్థః:-(అగ్నే) విద్వన్ (స్వాహా) సత్యాం వాచమ్ (కృణుహి) కురు (జాతవేదః) ప్రకటవిద్య (ఇన్ద్రాయ) పరమైశ్వర్యాయ (హవ్యమ్) ఆదాతు మర్హామ్ (విశ్వే) సర్వే (దేవాః) విద్వాంసః (హవిః) గ్రాహ్యం వస్తు (ఇదమ్) (జుషన్తామ్) సేవన్తామ్. ॥౨౨॥

అన్వయః:- హే జాదవేదోఽగ్నే త్వమిన్ద్రాయ స్వాహా హవ్యం కృణుహి. విశ్వేదేవా ఇదం హవిర్జుషన్తామ్. ॥౨౨॥

భావార్థః:-యది మనుష్యా ఐశ్వర్యవర్ధనాయ ప్రయతేరం స్తర్హి సత్యం పరమాత్మానం విదుషశ్చ సేవేరన్. ॥౨౨॥

పదార్థము:-జాతవేదః=విద్యయందు ప్రసిద్ధుడవు,అగ్నే=విద్వాంసుడవునగు పురుషుడా! నీవు, ఇన్ద్రాయ=ఉక్త ఐశ్వర్యముకొఱకు, స్వాహా=సత్యవాణిని మఱియు, హవ్యమ్=గ్రహించ దగిన పదార్థమును, కృణుహి=ప్రసిద్ధపఱచుము, మఱియు, విశ్వేదేవాః=సమస్త విద్వాంసులు, ఇదమ్ హవిః=గ్రహించదగిన యీయుత్తమ వస్తువును, జుషన్తామ్=సేవించెదరుగాక! [౨౨]

భావార్థము:-ఐశ్వర్యమును పెంపొందజేయుటకై ప్రయత్నించు మానవుడు సత్యమును, పరమాత్మను, విద్వాంసులను సేవించుచుండవలయును, ౧౫౦౭[౨౨]

---

పీవో అన్నేత్యస్య వసిష్ఠ ఋషిః, వాయుర్దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

కీదృశం సన్తానం సుఖయతీత్యాహ.

ఎటువంటి సంతానము సుఖింపజేయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

పీవో అన్నా రయివృధః సుమేధాః శ్వేతః సిషక్తి నియుతామభిశ్రీః।
తే వాయవే సమనసో వితస్థు ర్విశ్వేన్నరః స్వపత్యాని చక్రుః ॥౨౩॥

పీవో అన్నేతి పీవః+అన్నా, రయివృధ ఇతి రయి+వృధః, సుమేధా ఇతి సు+మేధాః, శ్వేతః, సిషక్తి, సిసక్తీతి సిసక్తి, నియుతామితి ని+యుతామ్, అభిశ్రీరిత్యభి+శ్రీః, తే, వాయవే, సమనసః ఇతి స+మనసః, వి, తస్థుః, విశ్వా, ఇత్, నరః, స్వ పత్యానీతి సు+అపత్యాని, చక్రుః॥ ॥౨౩॥

పదార్థః:-(పీవోఅన్నా) పీవాంసి పుష్టికరాణ్యన్నాని యేషు (రయివృధః) యే రయిం వర్ద్ధయన్తి తే (సుమేధాః) శోభనా మేధా ప్రజ్ఞా యేషాన్తే (శ్వేతః) గన్తా వర్ధకో వా(సిషక్తి) సిశ్చతి (నియుతామ్) నిశ్చితగతీనామ్ (అభిశ్రీః) అభితః శోభా యస్య సః (తే) (వాయవే) వాయువిద్యాయై (సమనసః) సమానవిజ్ఞానాః (వి,తస్థుః) తిష్ఠేయుః (విశ్వా) అఖిలాని (ఇత్) ఏవ (నరః) నాయకాః (స్వపత్యాని) శోభనాని చ తాన్యపత్యాని (చక్రుః) కుర్యుః. ॥౨౩॥

అన్వయః:-యే సమనసో రయివృద్ధః సుమేధా నరః పీవోఅన్నా విశ్వా స్వపత్యాని చక్రుః. త ఇద్వాయవే వితస్థు ర్యదా నియుతామభిశ్రీః శ్వేతో వాయుః సర్వాన్ సిషక్తి.తదా స శ్రీమాన్ జాయతే. ॥౨౩॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా వాయుః సర్వేషాం జీవనమూలమస్తి తథో త్తమాన్యపత్యాని సర్వేషాం సుఖనిమిత్తాని జాయన్తే. ॥౨౩॥

పదార్థము:-సమనసః=సమాన జ్ఞానముగలవారు, రయివృధః=ధనమును పెంపొందజేయువారు, సుమేధాః=సుందరబుద్ధిమంతులు, నరః=నాయకులు, పీవోఅన్నా=పుష్టికారకాన్నము గల వారునగు నేపురుషులు,విశ్వా స్వపత్యాని=సుందర సంతానమును, చక్రుః=కనెదరో,తే ఇత్=వారే,వాయవే=వాయువిద్య కొఱకు, వితస్థుః=విశేషముగ స్థితమగుదురు. ఎప్పుడు, నియుతామ్=నిశ్చితగతి గల జనులయొక్క, అభిశ్రీః=సర్వవిధముల శోభాయుక్తమును,శ్వేతః=గమనశీలముగలది,లేక ఉన్నతిని కలుగజేయునదియునగు వాయువు సమస్తమును,సిషక్తి=తడుపుచున్నదో,అప్పుడు అదిశోభాయుక్తమైనదగుచున్నది. [౨౩]

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. వాయువెట్లు అందఱి జీవనమునకు మూలాధారమో అటులనే ఉత్తమ సంతానము అందఱి సుఖములకు నిమిత్తమగుచున్నది. ౧౫౦౮[౨౩]

౧౫౪౯ రాయ ఇత్యస్య వసిష్ఠ ఋషిః, వాయుర్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
పునర్మనుష్యేణ కిం కార్యమిత్యాహ
మరల మానవులేమి చేయవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

రాయే ను యం జజ్ఞతూ రోదసీమే రాయే దేవీ ధిషణా ధాతి దేవమ్ ।
అధ వాయుం నియుతః సశ్చత స్వా ఉత శ్వేతం వసుధితిం నిరేకే॥౨౪॥

రాయే, ను, యమ్, జజ్ఞతుః, రోదసీ ఇతి రోదసీ, ఇమే ఇతీమే, రాయే, దేవీ, ధిషణా, ధాతి, దేవమ్, అధ, వాయుమ్, నియుత ఇతి ని+యుతః, సశ్చత, స్వాః, ఉత, శ్వేతమ్, వసుధితిమితి వసు+ధితిమ్, నిరేకే॥ ॥౨౪॥

పదార్థః:-(రాయే) ధనాయ (ను) సద్యః(యమ్) (జజ్ఞతుః)జనయతః(రోదసీ)ద్యావాపృథివ్యౌ(ఇమే)ప్రత్యక్షే.అత్ర వాచ్ఛన్దసి సర్వే విధయో భవన్తీతి ప్రకృతిభావాఽభావః(రాయే) ధనాయ (దేవీ) దివ్యగుణా (ధిషణా) ప్రజ్ఞేవ వర్తమానా (ధాతి)దధాతి (దేవమ్)దివ్యం పతిమ్ (అధ)అథ(వాయుమ్)(నియుతః)నిశ్చయేన మిశ్రణాఽమిశ్రణకర్తారః(సశ్చత)ప్రాప్నువన్తి.అత్ర వ్యత్యయః (స్వాః) సమ్బన్ధినః (ఉత) (శ్వేతమ్) వృద్ధమ్ (వసుధితిమ్) పృథివ్యాది వసూనాం ధితి ర్యస్మాత్తమ్ (నిరేకే) నిర్గతశఙ్కే స్థానే. ॥౨౪॥

అన్వయః:- హేమనుష్యా ఇమే రోదసీ రాయే యం జజ్ఞతు ర్దేవీ ధిషణా యం దేవం రాయే ను ధాతి. అధ నిరేకే స్వా నియుతః శ్వేతముత వసుధితిం వాయుం సశ్చత తం యూయం విజానీత. ॥౨౪॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే మనుష్యా భవన్తో బలాదిగుణాయుక్తం సర్వస్య ధర్తారం వాయుం విజ్ఞాయ ధనప్రజ్ఞం వర్ధయన్తు యద్యేకాన్తే స్థిత్వాఽస్య ప్రాణస్య ద్వారా స్వాత్మానం పరమాత్మానం చ జ్ఞాతుమిచ్ఛేయుస్తర్హ్యనయోః సాక్షాత్కారో భవతి.

పదార్థము:-ఓ మానవులారా ! ఇమే రోదసీ=ఈ భూమ్యాకాశములు, రాయే=ధనార్థము, యమ్=దేనిని, జజ్ఞతుః=ఉత్పన్న మొనర్చునో, దేవీ=ఉత్తమ గుణముగలది, ధిషణా=బుద్ధివలె నుండునదియగు స్త్రీ, దేవమ్=ఏ యుత్తమ పతిని, రాయే=ధనము కొఱకు, ను=శీఘ్రముముగా, ధాతి=ధరించుచున్నదో, అధ=దీని తర్వాత, నిరేకే=నిశ్శంక స్థానమున, స్వాః=తనసంబంధీకులైనవారు, నియుతః=నిశ్చయముగకలిపివేయువారు లేక వేరుచేయువారు, శ్వేతమ్=వృద్ధుని, ఉత=మఱియు, వసుధితిమ్=పృథివ్యాది వస్తువులను ధరించుటకు హేతువునైన, వాయుమ్=వాయువును, సశ్చత=పొందుచున్నారో, దానిని మీరు తెలిసికొనుడు. [౨౪]

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఓ మానవు

లారా!మీరు బలాదిగుణయుక్తమును. సమస్తమును ధరించునదియునగు వాయువును తెలిసికొని ధనమును, బుద్ధిని పెంపొందజేయుదురు గాక ! ఏకాంతమున స్థితులై ఈ ప్రాణము ద్వారా తమ స్వరూపమును,పరమాత్మను తెలిసికొన దలంచినయెడల ఆత్మ, పరమాత్మలు రెండును సాక్షాత్కారములగును. ౧౫౬౯[౨౪]

---

ఆప ఇత్యస్య హిరణ్యగర్భ ఋషిః, ప్రజాపతి ర్దేవతా, స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ

మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

ఆపో హ యద్బృహతీ ర్విశ్వమా యన్ గర్భం దధానా జనయ న్తీ రగ్నిమ్।
తతో దేవానాꣳసమవ ర్తతాసు రేకః కస్మై దేవాయ హవిషా విధేమ ॥

ఆపః, హ, యత్, బృహతీః, విశ్వమ్, ఆయన్, గర్భమ్,
దధానాః, జన య న్తీః, అగ్నిమ్, తతః, దేవానామ్, సమ్, అవ ర్తత,
అసుః, ఏకః, కస్మై, దేవాయ, హవిషా, విధేమ॥ ॥౨౫॥

పదార్థః:-(ఆపః) వ్యాపికా స్తన్మాత్రాః (హ) ఖలు (యత్) యమ్ (బృహతీః)బృహత్యః (విశ్వమ్) కృతప్రవేశమ్ (ఆయన్)గచ్ఛన్తి(గర్భమ్)మూలం ప్రధానమ్(దధానాః) ధరన్త్యః సత్యః (జనయన్తీః) ప్రకటయన్త్యః (అగ్నిమ్) సూర్యాద్యాఖ్యమ్ (తతః) తస్మాత్ (దేవానామ్) దివ్యానాం పృథివ్యాదీనామ్ (సమ్) సమ్యక్ (అవర్తత)వర్తయ(అసుః)ప్రాణః(ఏకః)అసహాయః [కస్మై]సుఖనిమిత్తాయ(దేవాయ)దివ్యగుణాయ (హవిషా) ధారణేన(విధేమ)పరిచరేమ.॥౨౫॥

అన్వయః:-బృహతీ ర్జనయన్తీ ర్యద్విశ్వం గర్భం దధానాః సత్య ఆప ఆయం స్తతోఽగ్నిం దేవానామేకోఽసుః సమవర్తత తస్మై హ కస్మై దేవాయ వయం హవిషా విధేమ. ॥౨౫॥

భావార్థః:- హే మనుష్యా యాని స్థూలాని పఞ్చతత్త్వాని దృశ్యన్తే,తాని సూక్ష్మాత్ప్రకృతి కార్యాత్పఞ్చతన్మాత్రా ఖ్యాదుత్పన్నాని విజానీత. యేషాం మధ్యే య ఏకః సూత్రాత్మా వాయురస్తి. స సర్వేషాం ధర్తేతి బుధ్యధ్వమ్.యది తద్ద్వారా యోగాభ్యాసేన పరమాత్మానం జ్ఞాతుమిచ్ఛేత తర్హి తం సాక్షాద్విజానీత. ॥౨౫॥

పదార్థము:-బృహతీః=మహత్పరిమాణము గలవి, జనయన్తీః=పృథివ్యాదులను ప్రకటించునది,యత్ విశ్వమ్=సమస్తమునందు ప్రవేశించియున్నది,గర్భమ్=సమస్తమునకు ప్రధానమూలమైన దానిని, దధానాః=ధరించునవి, ఆపః=వ్యాపక జలములయొక్క సూక్ష్మమాత్రలు,ఆయన్=ప్రాప్తములగునో,తతః=దానివలన,అగ్నిమ్=సూర్యాది రూ

పాగ్నిని, దేవానామ్=ఉత్తమ పృథివ్యాది పదార్థములయొక్క సంబంధమును, ఏకః= అసహాయమునునైన ఒక,అసుః=ప్రాణమును,సమ్వర్తత=బాగుగా ప్రవృత్త పఱచునో హ=నిశ్చయముగ, కస్మై=అట్టి సుఖమునకు నిమిత్తము, దేవాయ=ఉత్తమ గుణ యుక్తుడునగు నీశ్వరుని మేము, హవిషా=ధారణమొనర్చుటచే, విధేమ=సేవించు వార మగుదుము గాక! [౧౫౧౦-౨౫]

భావార్థము:- ఓ మానవులారా! స్థూలపంచతత్త్వము లేవి కనబడుచున్నవో వానియొక్క సూక్ష్మప్రకృతికార్యములు పంచతన్మాత్రములనెడి వానినుండిఉత్పన్నము లయ్యెనని యెఱుంగుడు. వానిమధ్య సూత్రాత్మయైన యే ఒక వాయువున్నదో అది అందఱిని ధరించుచున్నదని తెలిసికొనుడు. ఎవరావాయువు ద్వారా యోగాభ్యాస ముచే పరమాత్మను తెలిసికొన దలంతురో వారు ఆ పరమాత్మను సాక్షాత్తుగా తెలిసి కొనగలరు. [౨౫]

---

యశ్చిదిత్యస్య హిరణ్యగర్భ ఋషిః, ప్రజాపతి ర్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

కే జనా మోదన్త ఇత్యాహ

ఏ మానవు లానందితులగు చున్నారో చెప్పబడెను.

యశ్చిదాపో మహినా పర్య పశ్యద్దక్షం దధానా జనయన్తీ ర్యజ్ఞమ్।

యో దేవేష్వధి దేవ ఏక ఆసీత్కస్మై దేవాయ హవిషా విధేమ ॥౨౬॥

యః, చిత్, ఆపః, మహినా, పర్య పశ్యదితి పరి+అపశ్యత్,

దక్షమ్, దధానాః, జనయన్తీః, యజ్ఞమ్, యః, దేవేషు,

అధి, దేవః, ఏకః, ఆసీత్, కస్మై, దేవాయ, హవిషా, విధేమ ॥౨౬॥

పదార్థః:-(యః) పరమేశ్వరః(చిత్)(ఆపః)వ్యాప్తిశీలాః సూక్ష్మాస్తన్మాత్రాః(మహినా) స్వస్య మహిమ్నా వ్యాపకత్వేన (పర్యపశ్యత్) సర్వతః పశ్యతి (దక్షమ్) బలమ్ (దధానాః) ధరన్త్యః (జనయన్తీః) ఉత్పాదయన్త్యః (యజ్ఞమ్) సంగతం సంసారమ్ (యః) (దేవేషు) ప్రకృత్యాది జీవేషు (అధి) ఉపరిభావే(దేవః) దివ్యగుణకర్మ స్వభావః (ఏకః) అద్వితీయః(ఆసీత్) అస్తి (కస్మై) సుఖస్వరూపాయ (దేవాయ)సర్వసుఖప్రదాయ (హవిషా) తదాజ్ఞాయోగాభ్యాస ధారణేన (విధేమ) సేవేమహి. ॥౨౬॥

అన్వయః:-యో మహినా దక్షం దధానా యజ్ఞం జనయన్తీ రాపః సన్తి, తాః పర్యపశ్య

ద్యోదేవేష్వేకోఽధి ఆసీ_త్తస్మై చిత్ కస్మై దేవాయ వయం హవిషా విధేమ. ॥౨౬॥

భావార్థః:- హే మనుష్యా యే భవ_న్తః సర్వస్య ద్రష్టారం ధర్తార మద్వితీయ మధిష్ఠాతారం పరమాత్మానం జ్ఞాతుం యోగం నిత్యమభ్యస్య_న్తి త ఆనన్దితా భవ_న్తి: ॥౨౬॥

పదార్థము:-యః=ఏ పరమేశ్వరుడు, మహినా=తనవ్యాపకత్వమహిమచే,దక్షమ్=బలమును, దధానాః=ధరించునవియు, యజ్ఞమ్=సంగత సంసారమును, జనయన్తీః=ఉత్పన్న మొనర్చునవియు,ఆపః=వ్యాప్తిశీలములునగు సూక్ష్మజలముల యొక్క సూక్ష తన్మాత్ర లేవియున్నవో వానిని,పర్యపశ్యత్=అన్నివైపులనుండి చూచుచున్నాడో,యః=ఏ ఈశ్వరుడు, దేవేషు=ఉత్తమ గుణములు గలిగిన ప్రకృతి మొదలగువాని యందును, జీవములందును, ఏకః=ఒకే, అధి దేవః=ఉత్తమ గుణకర్మ స్వభావములు గలిగినవాడై, ఆసీత్=ఉన్నాడో అతనిని, చిత్=మాత్రమే, కస్మై=సుఖస్వరూపుడును, దేవాయ=సకలసుఖదాతయునగు ఈశ్వరుని మేము, హవిషా=ఆజ్ఞాపాలనముచే మఱియు యోగాభ్యాసముయొక్క ధారణచే, విధేమ=సేవించెదము గాక ! [౨౬]

భావార్థము:-ఓ మానవులారా ! ఎవరు సర్వద్రష్టయు, ధర్తయు, కర్తయు, అద్వితీయుడు, అధిష్ఠాతయునగు పరమాత్మను దెలిసికొనుటకై నిత్యము యోగాభ్యాసము చేయుచున్నారో వారు ఆనందితులగు చున్నారు. ౧౫౧౧[౨౬]

---

౧౫౧౨ ప్రయాభిరిత్యస్య వసిష్ఠ ఋషిః, వాయుర్దేవతా, స్వరాట్ పంక్తిశ్ఛన్దః పఞ్చమః స్వరః.

విదుషా కథం భవితవ్య మిత్యాహ

విద్వాంసు లెటులుండవలయునో ఆ విషయ మీ మంత్రమందు చెప్పబడెను

ప్రయాభిర్యాసి దాశ్వాꣳసమచ్ఛా నియుద్భి ర్వాయ విష్టయే దురోణే।

ని నో రయిꣳ సుభోజసం యువస్వ ని వీరం గవ్య మశ్వ్యం చ రాధః॥

ప్ర,యాభిః, యాసి, దాశ్వాꣳసమ్, అచ్ఛ, నియుద్భిరితి నియుత్+భిః,

వాయో ఇతి వాయో, ఇష్టయే, దురోణే, ని, నః, రయిమ్, సుభోజ సమితి

సు+భోజసమ్, యువస్వ, ని, వీరమ్, గవ్యమ్, అశ్వ్యమ్, చ, రాధః॥౨౭॥

పదార్థః:-(ప్ర) (యాభిః) కమనీయాభిః (యాసి) ప్రాప్నోసి (దాశ్వాంసమ్) సుఖస్య దాతారమ్ (అచ్ఛ) అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (నియుద్భిః) నిశ్చితైర్గుణైః (వాయో) వాయురివ, వర్తమాన (ఇష్టయే) అభీష్టసుఖాయ (దురోణే) గృహే (ని) నితరామ్ (నః) అస్మాకమ్ (రయిమ్) ధనమ్ (సుభోజసమ్) సుష్ఠు భోజాంసి భోజనాని యస్మాత్తమ్(యువస్వ)మిశ్రయస్వ

(ని) (వీరమ్) ప్రాప్తవిజ్ఞానాదిగుణమ్ (గవ్యమ్) గోభ్యో హితమ్ (అశ్వ్యమ్) అశ్వేభ్యో హితమ్ (చ) (రాధః) ధనమ్. ॥౨౭॥

అన్వయః:-హేవిద్వన్ వాయో వాయురివ త్వం ప్రయాభి ర్నియుద్భి రిష్టయేఽచ్ఛయాసి పురోణే నః సుభోజసం రయిం నియువస్వ వీరం గవ్యమశ్వ్యం చ రాధో ని యువస్వ. ॥౨౭॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా వాయుః సర్వాణి జీవనాదీనీష్టాని కర్మాణి సాధ్నోతి, తథా విద్వానస్మిన్ సంసారే వర్తేత. ॥౨౭॥

పదార్థము:-వాయో=వాయువువలె నున్న విద్వాంసుడా! నీవు, ప్రయాభిః=బాగుగా కోరతగిన,నియుద్భిః=నియతములైన గుణములతో,ఇష్టయే=అభీష్టసుఖార్థము అచ్ఛయాసి=బాగుగా ప్రాప్తము గుచున్నావు.పురోణే=స్నేహమున, నః=మాయొక్క, సుభోజసమ్=సుందరభోగమునకు హేతువు, దాశ్వాంసమ్=సుఖదమునగు, రయిమ్=ధనమును, ని యువస్వ=నిరంతరము మిశ్రిత మొనర్చుచుండుము, వీరమ్=విజ్ఞానాది గుణములను పొందినది, గవ్యమ్=గోహితకరమైనది, చ=మఱియు, అశ్వ్యమ్=అశ్వము లకు హితమైనదియునగు, రాధః=ధనమును,ని=నిరంతమ పొందుచుండుము. [౨౭]

భావార్థము:-ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. వాయు వెట్లు సకల జీవనాది ఇష్టకర్మలను సిద్ధపఱచు చున్నదో అటులనే విద్వాంసుడీ సంసార మందు వర్తించవలయును. ౧౫౧౨[౨౭]

---

౧౫౧౩ ఆ న ఇత్యస్య వసిష్ఠ ఋషిః, వాయుర్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయ మాహ

మరల నదే విషయ మీ మంత్ర మందుచెప్పబడెను

ఆ నో నియుద్భిః శతినీభి రధ్వరꣳ సహస్రిణీభి రుప యాహి యజ్ఞమ్।

వాయో అస్మిన్త్సవనే మాదయస్వ యూయం పాత స్వస్తిభిః సదా నః॥

ఆ, నః, నియుద్భిరితి నియుత్+భిః, శతినీభిః, అధ్వరమ్,

సహస్రిణీభిః, ఉప, యాహి, యజ్ఞమ్, వాయో ఇతి వాయో, అస్మిన్, సవనే,

మాదయస్వ, యూయమ్, పాత, స్వ స్తిభిరితి స్వస్తి+భిః, సదా,నః ॥౨౮॥

పదార్థః:-(ఆ) (నః) అస్మాకమ్ (నియుద్భిః) నిశ్చితైర్మిశ్రితామిశ్రితై ర్గమనాగమనైః (శతినీభిః) శతం బహూని కర్మాణి విద్యన్తే యాసు తాభిః (అధ్వరమ్)అహింసనీయమ్(సహస్రిణీభిః) సహస్రాణ్యసంఖ్యా వేగా విద్యన్తే యాసు గతిషు తాభిః (ఉప) (యాహి) ప్రాప్నుహి

(యజ్ఞమ్) సంగతవ్యర్థం వ్యవహారమ్ (వాయో) వాయురివ బలవన్-విద్వన్ (అస్మిన్) (సవనే) ఉత్పత్త్యధికరణే జగతి (మాదయస్వ) ఆనన్దయస్వ(యూయమ్)(పాత) రక్షత (స్వస్తిభిః) సుఖైః సహ (సదా) సర్వస్మిన్ కాలే (నః) అస్మాన్. ॥౭౨॥

అన్వయః:- హే వాయో యథా వాయుర్నియుద్భిశ్శతినీభిః సహస్రిణీభి ర్గతిభి రస్మిన్సవనే నోఽధ్వరం యజ్ఞముపగచ్ఛతి, తథా త్వమేతమాయాహి మాదయస్వ. హే విద్వాంసో యూయ మేత ద్విద్యయా స్వస్తిభి ర్నః సదా పాత. ॥౭౨॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. విద్వాంసో యథా వాయవో వివిధాభి ర్గతిభిః సర్వాన్ పుష్ణన్తి. తథైవ సుశిక్షయా సర్వాన్ పోషయన్తు. ॥౭౨॥

పదార్థము:-వాయో=వాయువువలె బలవంతుడవైన విద్వాంసుడా! ఎట్లు వాయువు,నియుద్భిః=నిశ్చితముగ కలసినవి లేక వేఱుగ రాకపోకలొనర్చునవి,శతినీభిః= బహుకర్మలు గలవి, సహస్రిణీభిః=అతివేగముగలవియగు నడకలతో, అస్మిన్సవనే= ఉత్పత్తికాధారమైన యీ జగత్తులో, నః=మాయొక్క, అధ్వరమ్=చెఱుపరానిది, యజ్ఞమ్=సంగతి యోగ్యమునగు వ్యవహారమును, ఉప=సమీపమున పొందుచున్నదో అటులనే నీవు, ఆ యాహి=బాగుగా లభించుము. మాదయస్వ=ఆనందితుడవగుము. ఓ విద్వాంసులారా! యూయమ్=మీరు ఈ విద్యచే,స్వస్తిభిః=సుఖములతో,నః=మమ్ము, సదా=సర్వకాలములందు, పాత=రక్షణచేయుడు. [౭౨]

భావార్థము:-ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. వాయు వెట్లు వివిధ గమనములతో సకల పదార్థములను పుష్టపఱచుచున్నదో అటులనే విద్వాం సులు సుశిక్షచే సమస్త జనులను పుష్టపఱచవలయును. ౧౫౧౩[౭౨]

---

౧౫౧౪ నియుత్వానిత్యస్య గృత్సమద ఋషిః, వాయుర్దేవతా, నిచృద్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః

అథేశ్వరః కీ దృశ ఇత్యాహ

ఇప్పు డీశ్వరు డెటులున్నాడను విషయ మీ మంత్రమందుచెప్పబడెను

ని యుత్వాన్ వాయవా గహ్యయఀ శుక్రో అయామి తే।
గన్తాసి సున్వతో గృహమ్॥ ॥౭౩॥

నియుత్వాన్, వాయో+ఇతి వాయో, ఆ, గహి, అయమ్,
శుక్రః, అయామి, తే, గన్తా, అసి, సున్వతః, గృహమ్॥ ॥౭౩॥

పదార్థః:-(నియుత్వాన్) నియన్తా (వాయో) పవన ఇవ(ఆ)(గహి)సమన్తాత్ ప్రాప్నుహి (అయమ్) (శుక్రః) పవిత్రకర్తా (అయామి) ప్రాప్నోమి. (తే) తవ (గన్తా)(అసి) (సున్వతః)

అభిషవం కుర్వతః (గృహమ్).

అన్వయః:- హే వాయో నియుత్వానీశ్వర స్త్వం ... ఇవ ... వాయుః సున్వతో గృహం గచ్ఛతి. తథా మా మా గహి. యత స్త్వమీశ్వరోఽసి, తస్మాత్తే స్వరూప మహమయామి. ౨౯

భావార్థః:- అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా వాయుః సర్వశోధకః సర్వత్ర గన్తా సర్వ ప్రియోఽస్తి తథేశ్వరోఽపి వర్తతే. ౨౯

పదార్థము:- వాయో=వాయువువలెశీఘ్రగామీ!నీవు,నియుత్వాన్=నియమకర్తవు ఈశ్వరుడవు శుక్రః=పవిత్రకర్తయు,గన్తా=గమనశీలమునునగు, అయమ్ ఈ వాయువు, సున్వతః=రసము పిండువానియొక్క, గృహమ్=గృహమును ఎటుల పొందుచున్నదో అటులనే నాకు, అగహి=బాగుగా లభించుము,అసి=నీవు ఈశ్వరుడవు కనుక నీ స్వరూపమును నేను,అయామి=ప్రాప్తించు చున్నాను. [౨౯]

భావార్థము:- ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఈశ్వరుడు కూడ వాయువువలె సమస్తమును శోధించువాడు సర్వత్ర గమన మొనర్చువాడు, సమస్తమునకు ప్రాణముకంటెను ప్రియమైనవాడునునై యున్నాడు. ౧౫౧౪[౨౯]



౧౫౧౫ వాయో శుక్ర ఇత్యస్య పురుమీఢ ఋషిః, వాయుర్దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునర్మనుష్యేణ కిం కార్యమిత్యాహ

మరల మానవు డేమి చేయవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను

వాయో శుక్రోఽఅయామి తే మధ్వోఽ అగ్రం దివిష్టిషు।
ఆ యాహి సోమ పీతయే స్పార్హో దేవ నియుత్వతా॥ ॥30॥

వాయో+ఇతి వాయో, శుక్రః, అయామి, తే, మధ్వః, అగ్రమ్, దివిష్టిషు, ఆ, యాహి, సోమపీతయ ఇతి సోమ+ పీతయే, స్పార్హః, దేవ, నియుత్వతా ॥30॥

పదార్థః:-(వాయో) వాయురివ వర్తమాన (శుక్రః) శుద్ధికరః (అయామి) ప్రాప్నోమి. (తే) తవ (మధ్వః) మధురస్య (అగ్రమ్) ఉత్తమం భాగమ్ (దివిష్టుషు) దివ్యాసు సంగతిషు (ఆ, యాహి) (సోమపీతయే) సదౌషధిరసపానాయ (స్పార్హః) యః స్పృహయతి తస్యాఽయమ్ (దేవ) దివ్యగుణసమ్పన్న (నియుత్వతా) వాయునా సహ. ॥30॥

అన్వయః:- హే వాయో యో వాయురివ శుక్ర స్త్వమసి తే మధ్వోఽగ్రం దివిష్టిష్వహమయామి. హే దేవ స్పార్హ స్త్వం నియుత్వతా సహ సోమపీతయ ఆయాహి. ॥30॥

భావార్థః:- అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే మనుష్యా యథా వాయుః సర్వాన్

రసగన్ధాదీన్ పీత్వా సర్వాన్ పోషయతి, తథా త్వం సర్వాన్ పుష్ణాణ. ॥౩౦॥

పదార్థము:-వాయో=వాయువువలె నుండు విద్వాంసుడా! శుక్రః=నీవు శుద్ధి కారకుడవు, తే మధ్వః=నీ మధుర వచనముయొక్క, అగ్రమ్=ఉత్తమ భాగమును, దివిష్టిషు=ఉత్తమ సంగతులయందు నేను, అయామి=పొందుచున్నాను, దేవ=ఉత్తమగుణ యుక్త విద్వాంసుడా! స్పార్హః=ఉత్తమ గుణాభిలాషయుక్తుని పుత్రుడవైన నీవు, నియుత్వతా=వాయువుతోపాటు, సోమపీతయే=ఉత్తమ ఓషధులయొక్క రసమును త్రాగుటకై, ఆయాహి=చక్కగా సమీపించుము. [౩౦]

భావార్థము:-ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఓ మానవుడా! ఎట్లు వాయువు సమస్తరస, గంధాదుల నారగించి సర్వమును పుష్టివంతముగ కొనర్చుచున్నదో అటులనే నీవును సమస్తమును పుష్టిపఱచు చుండుము. ౧౫౧౫[౩౦]

---

౧౫౧౬ వాయురిత్యస్యాఽమీఢ ఋషిః, వాయుర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథ విద్వద్భిః కిం కార్య మిత్యాహ

ఇపుడు విద్వాంసు లేమి చేయవలయునను విషయ మీ మంత్రమందుచెప్పబడెను

వాయు రగ్రేగా యజ్ఞప్రీః సాకం గన్మనసా యజ్ఞమ్।శివో నియుద్భిః శివాభిః॥

వాయుః, అగ్రేగా+ఇత్యగ్రే+గాః, యజ్ఞ ప్రీరితి యజ్ఞ+ప్రీః, సాకమ్, గన్, మనసా, యజ్ఞమ్। శివః, నియుద్భిరితి నియుత్+భిః, శివాభిః ॥౩౧॥

పదార్థః:-(వాయుః) పవనః (అగ్రేగాః) యోఽగ్రే గచ్ఛతి సః (యజ్ఞప్రీః)యో యజ్ఞం ప్రీతి పూరయతి సః (సాకమ్)సహ (గన్) గచ్ఛతి (మనసా) (యజ్ఞమ్) (శివః) మఙ్గలమయః (నియుద్భిః) నిశ్చితాభిః క్రియాభిః (శివాభిః) మఙ్గలకారిణీభిః. ॥౩౧॥

అన్వయః:-హే విద్వన్!యథా వాయుర్నియుద్భిః శివాభి ర్యజ్ఞం గన్,తథా శివోఽగ్రేగా యజ్ఞప్రీః సం స్త్వం మనసా సాకం యజ్ఞమాయాహి. ॥౩౧॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. అత్రాయాహీతి పదం పూర్వమన్త్రాదను వర్తతే. యథా వాయురనేకైః పదార్థైస్సహ గచ్ఛత్యాగచ్ఛతి తథా విద్వాంసో ధర్మ్యాణి కర్మాణి విజ్ఞానేన ప్రాప్నువన్తు. ॥౩౧॥

పదార్థము:-ఓ విద్వాంసుడా! ఎట్లు, వాయుః=వాయువు, నియుద్భిః=నిశ్చితములైన, శివాభిః=మంగళ కారకములగు క్రియలతో, యజ్ఞమ్=యజ్ఞమును, గన్=ప్రాప్తమగుచున్నదో, అటులనే, శివః=మంగళ స్వరూపుడవు, అగ్రేగాః=అగ్రగామివి, యజ్ఞప్రీః=యజ్ఞమును పూర్ణపఱచువాడవునగు నీవు, మనసా=మనస్సుయొక్క వృత్తి

తో; సాకమ్=పాటు యజ్ఞమును పొందుము. [౩౧]

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఈమంత్రమందు గల(ఆ యాహి)అను పదములయొక్క అనువృత్తి పూర్వమంత్రమునుండి వచ్చుచున్నది, ఎట్లువాయువు అనేకపదార్థములతోపాటు వచ్చుచు,పోవుచునున్నదో,అటులనే విద్వాంసులు కూడ ధర్మయుక్త కర్మలను విజ్ఞానముతో పొందవలయును.౧౫౧౬[౩౦]

---

౧౫౧౭ వాయ ఇత్యస్య గృత్సమద ఋషిః, వాయుర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః,

పునస్తమేవ విషయ మాహ

మరల నదే విషయ మీ మంత్ర మందుచెప్పబడెను

వాయో యే తే సహస్రిణో రథాసస్తేభిరా గహి। నియుత్వాన్త్సోమపీతయే॥

వాయో ఇతి వాయో, యే, తే, సహస్రిణః, రథాసః, తేభిః,

ఆ, గహి, నియుత్వాన్, సోమపీతయ ఇతి సోమ+పీతయే॥ ॥౩౨॥

పదార్థః:-(వాయో) పవనవద్వర్తమాన (యే) (తే) తవ(సహస్రిణః)ప్రశస్తాః సహస్రం జనా విద్యన్తే యేషు తే (రథాసః) రమణీయాని యానాని (తేభిః) తైః(ఆ) (గహి)ప్రాప్నుహి (నియుత్వాన్) సమర్థః సన్ (సోమపీతయే) సోమస్య పానాయ. ॥౩౨॥

అన్వయః:-హే వాయో వాయురివ వర్తమాన విద్వన్! యే తే సహస్రిణో రథాసః సన్తి తేభిః సహ నియుత్వాన్త్సంస్త్వం సోమపీతయ ఆ గహి. ॥౩౨॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే మనుష్యా యథా వాయోరసంఖ్యా రమణీయా గతయః సన్తి, తథా వివిధాభి ర్గతిభిః సమర్థా భూత్వైశ్వర్యం భుఙ్ధ్వమ్. ॥౩౨॥

పదార్థము,-వాయో=వాయువు వలెనున్న విద్వాంసుడా! తే=నీయొక్క,సహస్రిణః=వేలకొలది ప్రశస్తమానవులచే యుక్తములు, రథాసః=సుందరములు ఆరామమొసగునవియైన పయానములున్నవో,తేభిః=వానిని కలిగియున్న,నియుత్వాన్=సమర్థుడవైన నీవు, సోమపీతయే=సోమౌషధి రసమును త్రాగుటకై,ఆగహి=రమ్ము[౩౨]

భావార్థము:-ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఓ మానవులారా! ఎట్లు రమణీయములైన అసంఖ్యాకగతులు వాయువునకున్నవో అటులనే అనేకవిధములైన నడకలతో సమర్థులై ఐశ్వర్యమును భోగించుడు. ౧౫౧౭[౩౨]

---

౧౫౧౮ ఏకయేత్యస్య గృత్సమద ఋషిః, వాయుర్దేవతా, విచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయ మాహ

మరల నదే విషయ మీ మంత్రమందుండెను

ఏకయా చ దశభిశ్చ స్వభూతే ద్వాభ్యా మిష్టయే వింశతీ చ,

తిసృభిశ్చ వహసే త్రింశతా చ నియుద్భిర్వాయ విహ తా వి ముఞ్చ॥३३॥

ఏకయా, చ, దశభిరితి దశ+భిః, చ, స్వభూత+ఇతి స్వ+భూతే,ద్వాభ్యామ్,

ఇష్టయే, వింశతీ, చ, తిసృభిరితి తిసృ+భిః, చ, వహసే, త్రింశతా, చ, నియు

ద్భిరితి నియుత్+భిః,వాయో ఇతి వాయో, ఇహ,తా, వి, ముఞ్చ॥ ॥३३॥

పదార్థః:-(ఏకయా) గత్యా (చ) (దశభిః)దశవిధాభిర్గతిభిః(చ)(స్వభూతే)స్వకీయైశ్వర్యే (ద్వాభ్యామ్) విద్యాపురుషార్థాభ్యామ్ (ఇష్టయే) విద్యాసంగతయే (వింశతీ) (చ) (తిసృభిః) (చ) (వహసే) ప్రాప్నోషి (త్రింశతా) ఏతత్సంఖ్యాకైః (చ) (నియుద్భిః)(వాయో) (ఇహ) (తా) తాని (వి,ముఞ్చ) విశేషేణ త్యజ. ॥३३॥

అన్వయః:-హే స్వభూతే వాయో ! యథా పవన ఇహేష్టయే ఏకయా చ దశభిశ్చ ద్వాభ్యామిష్టయే వింశతీ చ తిసృభిశ్చ త్రింశతా చ నియుద్భిః సహ యజ్ఞం వహతి తథా వహసే.స త్వం తా వి ముఞ్చ. ॥३३॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః.యథా వాయు రిన్ద్రియైః ప్రాణై రనేకాభి ర్గతిభిః పృథివ్యాదిలోకైశ్చ సహ సర్వశ్రేష్ఠం సాధ్నోతి,తథా విద్వాంసోఽపి సాధ్నుయుః.

పదార్థము:-స్వభూతే= స్వకీయైశ్వర్యముతో శోభాయమానా ! వాయో = వాయుతుల్య విద్వాంసుడా ! ఎట్లు వాయువు, ఇహ=ఈజగత్తుయొక్క సంగతికై, ఏకయా=ఒక విధమైన నడకచే, చ=మఱియు, దశభిః=పది విధములైన నడకలచే, చ= మఱియు ద్వాభ్యామ్=విద్యా పురుషార్థములచే, ఇష్టయే=విద్యాసంగతికై, వింశతీ= రెండు ఇరువైలు నలుబది, చ=మఱియు తిసృభిః=త్రివిధ గతులతో, చ=మఱియు త్రింశతా=ముప్పది,చ=మఱియు,నియుద్భిః=నిశ్చిత నియమములతో,యజ్ఞమును పొం దుచున్నదో అటులనే, వహసే=పొందుచున్నావు. అట్టి నీవు, తా=వానియన్నింటిని, విముఞ్చ=విశేషముగ వెడలించుము. అనగా వానినుపదేశించుము. [33]

భావార్థము:-ఈమంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది.ఎట్లు వాయువు ఇంద్రియములతోను ప్రాణముతోను,అనేక నడకలతోను పృథివ్యాది లోకములతోపాటు అందఱి యభీష్టమును సాధించుచున్నదో అటులనే విద్వాంసులు కూడ సాధించవలెను.

---

०३.०४ తవ వాయ ఇత్యస్యాఙ్గిరస ఋషిః, వాయుర్దేవతా, నిచృద్ గాయత్రీ ఛన్దః,షడ్జః స్వరః.

అథ కింవద్వాయుః స్వీకర్తవ్య ఇత్యాహ

ఇపుడు చేనివలె వాయువును స్వీకరించవలయునను విషయ మీ మంత్రమందుండెను

తవ వాయ వృతస్పతే త్వష్టు ర్జామాతరద్భుత । అవాంస్యా వృణీమహే॥

తవ, వాయో+ఇతి వాయో, ఋతస్పతే, ఋతస్పత ఇత్యృత
+పతే, త్వష్టుః, జామాతః, అద్భుత, అవాంసి, ఆ, వృణీమహే ॥३४॥

పదార్థః:-(తవ) (వాయో) బహుబల (ఋతస్పతే) సత్యపాలక (త్వష్టుః) విద్యయా ప్రదీప్తస్య (జామాతః) కన్యాపతి వద్వర్తమాన (అద్భుత) ఆశ్చర్యకర్మన్ (అవాంసి) రక్షణాదీని (ఆ) (వృణీమహే) స్వీకుర్మహే. ॥३४॥

అన్వయః:-హే ఋతస్పతే జామాతరద్భుత! వాయో వయం యాని త్వష్టుస్తవాఽవాంస్యా వృణీమహే తాని త్వమపి స్వీకురు. ॥३४॥

భావార్థః:-యథా జామాతాఽఽశ్చర్య గుణః సత్యసేవకః స్వీకర్తవ్యోఽస్తి. తథా వాయు రపి వరణీయోఽస్తి. ॥३४॥

పదార్థము:-ఋతస్పతే=సత్యరక్షకా! జామాతః=అల్లునివలెనున్నవాడా! అద్భుత=ఆశ్చర్యరూపకర్మ చేయువాడా! వాయో=బహుబలయుక్త విద్వాంసుడా! మేము, త్వష్టుః=విద్యచే ప్రకాశితుడవైన,తవ=నీయొక్క,అవాంసి=పరిరక్షణాదికర్మలను,ఆ వృణీమహే=స్వీకరించుచున్నామో, వానిని నీవుకూడ స్వీకరించుము. [३४]

భావార్థము:-ఎట్లు అల్లుడు శ్రేష్ఠములగు నాశ్చర్యకర గుణములుగలవాడు, సత్యేశ్వరుని సేవకుడునై స్వీకరించ యోగ్యుడగుచున్నాడో, అటులనే వాయువును స్వీకరించుటకు యోగ్యమగుచున్నది. ౧౫౯౯[३४]

---

౧౫౨౦ అభి త్వేత్యస్య వసిష్ఠ ఋషిః, వాయుర్దేవతా, స్వరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
అథ రాజధర్మ మాహ

ఇపుడు రాజధర్మ విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

అభి త్వా శూర నోనుమోఽదుగ్ధా ఇవ ధేనవః ।
ఈశాన మస్య జగతః స్వర్దృశ మీశాన మిన్ద్ర తస్థుషః॥ ॥३५॥

అభి, త్వా, శూర, నోనుమః, అదుగ్ధా ఇవేత్య దుగ్ధాః+ఇవ, ధేనవః, ఈశానమ్, అస్య, జగతః, స్వర్దృశ మితి స్వః+దృశమ్, ఈశానమ్, ఇన్ద్ర, తస్థుషః ॥३५॥

పదార్థః:-(అభి)(త్వా)త్వామ్(శూర)నిర్భయ(నోనుమః)భృశం సత్కుర్యామ ప్రశంసేమ (అదుగ్ధాఇవ) అవిద్యమానపయస ఇవ (ధేనవః) గావః (ఈశానమ్) ఈశానశీలమ్ (అస్య)జగతః జంగమస్య (స్వర్దృశమ్) సుఖేన ద్రష్టుం యోగ్యమ్ (ఈశానమ్) (ఇన్ద్ర) సభేశ (తస్థుషః) స్థావరస్య. ॥३५॥

అన్వయః:- హే శూరేన్ద్ర ధేనవోఽదుగ్ధా ఇవ వయమస్య జగతస్తస్థుష ఈశానం స్వర్దృశమీశానం త్వాఽభినోనుమః. ॥३५॥

భావార్థః:-అత్రోపమాలంకారః. హే రాజన్ ! యది భవాన్ పక్షపాతం విహాయేశ్వరవన్న్యాయాధీశో భవేద్యది కదాచిద్వయం కరమపి న దద్యామ తథాఽప్యస్మాన్ రక్షేత్తర్హి త్వదనుకూలా వయం సదా భవేమ. ॥३५॥

పదార్థము:-శూర=నిర్భయుడా! ఇన్ద్ర=సభాపతీ! అదుగ్ధా ధేనవః ఇవ=పాలు లేని గోవులవలెనున్న మేము, అస్య జగతః=ఈచర జగత్తుయొక్కయు,తస్థుషః=అచర జగము యొక్కయు,ఈశానమ్=నియంతవు, స్వర్దృశమ్=సుఖపూర్వకముగ చూడదగిన ఈశ్వరతుల్యుడవు, ఈశానమ్=సమర్థుడవునైన, త్వా=నిన్ను, అభి నోనుమః=సమ్ముఖులమై సత్కరించెదము, లేక ప్రశంసించెదముగాక! [३५]

భావార్థము.-ఈమంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది.రాజా!నీవుపక్షపాతమును విడనాడి ఈశ్వరునివలె న్యాయాధీశుడవై, మేమొకప్పుడు పన్నులనీయకున్నను, మమ్ముల రక్షింతువేని మేము సదా నీకనుకూలముగ నుందుము. ०५-२०[३५]

---

०५२० న త్వావానిత్యస్య శమ్యుర్బార్హస్పత్య ఋషిః. పరమేశ్వరో దేవతా, స్వరాట్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

ఈశ్వర ఏవోపాసనీయ ఇత్యాహ.

ఈశ్వరుడే ఉపాసించదగినవాడను విషయ మీ మంత్రమందు చెప్పబడెను

న త్వావాఀ॥ऽ అన్యో దివ్యో న పార్థివో న జాతో న జనిష్యతే।
అశ్వాయన్తో మఘవన్నిన్ద్ర వాజినో గవ్యన్తస్త్వా హవామహే ॥३६॥

న, త్వావానితి త్వా+వాన్, అన్యః, దివ్యః, న, పార్థివః, న, జాత,
న, జనిష్యతే, అశ్వాయన్తః అశ్వయన్త ఇత్యశ్వ+యన్త, మఘ
వన్నితి మఘ+వన్, ఇన్ద్ర, వాజినః, గవ్యన్తః,త్వా, హవామహే ॥३६॥

పదార్థః:-(న) (త్వావాన్) త్వత్సదృశః (అన్యః) భిన్నః (దివ్యః) శుద్ధః (న) (పార్థివః)

పృథివ్యాం విదితః (న) (జాతః) ఉత్పన్నః (న) (జనిష్యతే) ఉత్పత్స్యతే (అశ్వాయన్తః) ఆత్మనోఽశ్వ మిచ్ఛన్తః (మఘవన్) పరమపూజితైశ్వర్య (ఇన్ద్ర) సర్వదుఃఖ విదారక (వాజినః) వేగవన్తః (గవ్యన్తః) గాం వాణీం చ కామయమానాః (త్వా) (హవామహే) స్తువీమః. ॥౩౬॥

అన్వయః:- హే మఘవన్నిన్ద్రేశ్వర వాజినో గవ్యన్తోఽశ్వాయన్తో వయం త్వా హవామహే. యతః కశ్చిదన్యః పదార్థో న త్వావాన్ దివ్యో న పార్థివో న జాతో న జనిష్యతే తస్మాద్ భవానేవాఽస్మాకముపాస్యో దేవోఽస్తి. ॥౩౬॥

భావార్థః: న కోపి పరమేశ్వరేణ సదృశః శుద్ధో జాతో వా జనిష్యమాణో వర్త్తమానో వాఽస్తి అతఏవ సర్వైర్మనుష్యైరేనం విహాయాన్యస్య కస్యాప్యుపాసనాఽస్య స్థానే నైవ కార్యా ఇదమేవ కర్మేహాముత్ర చానన్దప్రదం విజ్ఞేయమ్. ॥౩౬॥

పదార్థము:-మఘవన్=పూజితోత్తమైశ్వర్యము కలవాడా ! ఇన్ద్ర=సకల దుఃఖ వినాశక పరమేశ్వరా ! వాజినః=వేగవంతులము, గవ్యన్తః=ఉత్తమవాక్కు పలుకువారము, అశ్వాయన్తః= శీఘ్రత్వమును గోరుచున్న వారమునైన మేము,త్వా=నిన్ను, హవామహే=స్తుతించుచున్నాము.ఏలయన,అన్యః=ఇతర పదార్థమేదియు,త్వావాన్= నీవలె, దివ్యః=శుద్ధమైనది, న=లేదు. పార్థివః=పృథివియందు ప్రసిద్ధమైనది, న జాతః= ఏదియును ఉత్పన్నము కాలేదు. న జనిష్యతే=పుట్టనూబోదు. కావున నీవే మాకుపాస్య దేవుడవు. [౩౬]

భావార్థము:-పరమేశ్వరునితో సమానుడైన శుద్ధుడు పుట్టలేదు. కనుకనే మానవులతనిని వదలి యితరము దేనిని అతనికి బదులుగా నెన్నడును ఉపాసించ జనదు. ఇహ పరలోకములందీ కర్మనే ఆనందదాయకమని గ్రహించవలయును. ౧౫౨౧[౩౯]



త్వామిదిత్యస్య శంయుర్బార్హస్పత్య ఋషిః. ఇన్ద్రో దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
పునా రాజధర్మవిషయ మాహ

మరల రాజధర్మ విషయ మీ మంత్రమందు చెప్పబడెను

త్వామిద్ధి హవామహే సాతౌ వాజస్య కారవః ।
త్వాం వృత్రేష్విన్ద్ర సత్పతిం నరస్త్వాం కాష్ఠాస్వర్వతః॥ ॥౩౭॥

త్వామ్, ఇత్, హి, హవామహే, సాతౌ, వాజస్య, కారవః, త్వామ్ వృత్రేషు, ఇన్ద్ర సత్పతిమితిసత్ పతిమ్, నరః త్వామ్, కాష్ఠాసు, అర్వతః ॥౩౭॥

పదార్థః:-(త్వామ్) (ఇత్) ఏవ (హి) (హవామహే) గృహ్ణీమః (సాతౌ) సంగ్రామే

(వాజస్య) విద్యావిజ్ఞానజన్యస్య కార్యస్య (కారవః) కర్తారః (త్వామ్) (వృత్రేషు) ఘనేషు (ఇన్ద్ర)సూర్య ఇవ జగత్పాలక(సత్పతిమ్)సత్యస్య ప్రచారేణ పాలకమ్(నరః)నేతారః(త్వామ్) (కాష్ఠాసు) దిక్షు (అర్వతః) ఆశుగామినోఽశ్వస్యేవ. ॥౩౭॥

అన్వయః:- హేఽఇన్ద్ర వాజస్య హి కారవో నరో వయం సాతౌ త్వాం వృత్రేషు సూర్య మివ సత్పతిం త్వామర్వత ఇవ సేనాయాం పశ్యేమ కాష్ఠాసు త్వామిద్ధవామహే. ॥౩౭॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే సేనాసభేశౌ యువాం సూర్యవన్న్యాయాభయప్రకాశకౌ శిల్పినాం సంగృహీతారౌ సత్యస్య ప్రచారకౌ భవేతమ్. ॥౩౭॥

పదార్థము:-ఇన్ద్ర=సూర్యునివలె జగద్రక్షకా! రాజా! వాజస్య=విద్యచే లేక విజ్ఞానముచేనగు కార్యమును, హి=మాత్రమే, కారవః=చేయువారము, నరః=నాయకులము నైన మేము, సాతౌ=రణమందు,త్వామ్=నిన్ను,వృత్రేషు=మేఘములందు సూర్యునివలె, సత్పతిమ్=సత్యప్రచారముచే రక్షకుడవైన,త్వామ్=నిన్ను, అర్వతః=శీఘ్రగామియైన గుఱ్ఱమువలె సేనయందు చూచెదముగాక! కాష్ఠాసు=దిశలయందు,త్వామ్ ఇత్=నిన్నే గ్రహణమొనర్చెదముగాక! [౩౭]

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఓ సేనాపతీ మఱియు సభాపతీ! మీయిరువురు సూర్యునివలె న్యాయమును, మఱియు అభయమును, ప్రకాశింపజేయువారును, శిల్పులను సంగ్రహపఱచు వారును,సత్యమును ప్రచారమొనర్చువారునునగుదురు గాక! ౧౫-౨-౨[౩౭]

---

స త్వమిత్యస్య శమ్యుర్బార్హస్పత్య ఋషిః, ఇంద్రో దేవతా, స్వరాడ్బృహతీ ఛన్దః, నిషాదః స్వరః. విద్వాన్ కిం కరోతీత్యాహ.

విద్వాంసుడేమిచేయుచున్నాడను విషయ మీ మంత్రమందు చెప్పబడెను

స త్వం నశ్చిత్ర వజ్రహస్త ధృష్ణుయా మహస్తవానో అద్రివః ।
గామశ్వꣳ రథ్యమిన్ద్ర సంకిర సత్రా వాజం న జిగ్యుషే॥ ॥౩౮॥

సః, త్వమ్, నః, చిత్ర, వజ్రహస్తేతి వజ్ర+హస్త, ధృష్ణుయేతి ధృష్ణు+యా, మహః, స్తవానః, అద్రివ ఇత్యద్రి+వః, గామ్, అశ్వమ్, రథ్యమ్,ఇన్ద్ర, సమ్, కిర, సత్రా, వాజమ్, న, జిగ్యుషే ॥౩౮॥

పదార్థః-(సః) పూర్వోక్తః (త్వమ్) (నః) అస్మభ్యమ్ (చిత్ర) ఆశ్చర్యస్వరూప (వజ్ర

హస్త) (ధృష్ణుయా) ప్రగల్భతయా (మహః) మహత్ (స్తవానః) స్తువన్ (అద్రివః) ప్రశస్తాశ్మమయవస్తుయుక్త (గామ్) వృషభమ్ (అశ్వమ్) (రథ్యమ్) రథస్య వోఢారమ్ (ఇన్ద్ర) (సమ్) (కిర) ప్రాపయ (సత్రా) సత్యమ్ (వాజమ్) విజ్ఞానమ్ (న)ఇవ (జిగ్యుషే)జయశీలాయ. ॥౩౮॥

అన్వయః:-హే చిత్ర వజ్రహస్తాద్రివ ఇన్ద్ర ధృష్ణుయా మహః స్తవానః స త్వం జిగ్యుషే నః సత్రా వాజం న గాం రథ్య మశ్వం సంకిర. ॥౩౮॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యథా మేఘసంబంధీ సూర్యో వృష్ట్యా సర్వాన్ సమృధ్నాతి. తథా విద్వాన్ సత్యవిజ్ఞానేన సర్వైశ్వర్యం ప్రకాశయతి. ॥౩౮॥

పదార్థము:- చిత్ర=ఆశ్చర్యరూపా! వజ్రహస్త=వజ్రమును హస్తమునందుధరించిన వాడా,అద్రివః=ప్రశస్తమైన రాతితో నిర్మించిన వస్తువులు గలవాడా!ఇన్ద్ర=శత్రునాశక! విద్వాంసుడా! ధృష్ణుయా=మొండితనముతో, మహః=అధికముగ, స్తవానః=స్తుతించుచు,సః=ఆపూర్వోక్తుడవైన,త్వమ్=నీవు జిగ్యుషే=జయించు పురుషునికొఱకు, మఱియు,నః=మా నిమిత్తము, సత్రా=సత్యమైన, వాజమ్ న=విజ్ఞానమువలె గామ్=ఎద్దును, రథ్యమ్=రథమునకు యోగ్యమైన, అశ్వమ్=గుఱ్ఱమును, సంకిర=బాగుగా ప్రాప్తించుము, [౩౮]

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఎట్లు మేఘ సంబంధియైన సూర్యుడు వర్షముచేత సమస్తమును సంబద్ధపఱచుచున్నాడో అటులనే విద్వాంసుడు సత్యముయొక్క విజ్ఞానముచే సకలైశ్వర్యమును ప్రకాశపఱచుచున్నాడు.

---

౨౭.౩౯ కయా న ఇత్యస్య వామదేవ ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ

మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను

కయా నశ్చిత్ర ఆ భువదూతీ సదావృధః సఖా । కయా శచిష్ఠయా వృతా॥

కయా, నః, చిత్రః, ఆ, భువత్, ఊతీ, సదావృధ ఇతి

సదా+వృధః । సఖా, కయా, శచిష్ఠయా, వృతా॥ ॥౩౯॥

పదార్థః:-(కయా) (నః) అస్మాన్ (చిత్రః) అద్భుతః (ఆ,భువత్) భవేత్ (ఊతీ)రక్షణాది క్రియయా. అత్ర సుపామితి పూర్వసవర్ణాదేశః (సదావృధః)యః సదా వర్ధతే తస్య (సఖా) (కయా) (శచిష్ఠయా) అతిశయితయా క్రియయా (వృతా) యా వర్తతే తయా. ॥౩౯॥

అన్వయః:-హే విద్వన్! చిత్రః సదావృధః సఖాఽఽభువత్కయోతీ నో రక్షేః. కయా శచిష్ఠయా వృతాఽఽస్మాన్నియోజయేః. ॥౩౯॥

భావార్థః- యోఽద్భుతగుణకర్మ స్వభావో విద్వాన్ సర్వస్య మిత్రం భూత్వా కుకర్మాణి నివర్త్య సుకర్మభిః రస్మాన్ యోజయేత్సోఽస్మాభిః సత్కర్తవ్యః. ॥౩౯॥

పదార్థము:-ఓ విద్వాంసుడా! చిత్రః=ఆశ్చర్యకరమైన కర్మచేయువాడు, సదా వృధః=సదావృద్ధిని పొందువాడునగు వానికి, సఖా=మిత్రుడవు, ఆభువత్=కమ్ము, కయా ఊతీ=ఏదైనా రక్షణాది క్రియతో,నః=మమ్ము రక్షించుము.కయా శచిష్టయా= అత్యంత దగ్గరసంబంధముగల, వృతా=వర్తమాన క్రియతో మమ్ము యుక్తపఱచుము.

భావార్థము:-ఆశ్చర్యకరములైన గుణకర్మస్వభావములు గల యే విద్వాంసుడు సమస్తమునకు మిత్రుడగునో,కుకర్మలనుండి నివృత్తి మొనర్చి ఉత్తమకర్మలతో మనలను యుక్తపఱచునో అతనిని మనము సత్కరించవలయును. ౧౫-౪౪[౩౯]

---

౧౫.౫౫ కస్త్వేత్యస్య వామదేవ ఋషిః, ఇంద్రో దేవతా,నిచృద్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ

మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను

కస్త్వా సత్యో మదానాం మꣳహిష్ఠో మత్సదన్ధసః । దృఢా చిదారుజే వసు॥

కః, త్వా సత్యః, మదానామ్, మꣳహిష్ఠః, మత్సత్,

అన్ధసః, దృఢా, చిత్, ఆరుజ+ఇత్యా+రుజే, వసు॥ ॥౪౦॥

పదార్థః: (కః) సుఖప్రదః (త్వా) త్వామ్ (సత్యః) సత్సు సాధుః (మదానామ్)హర్షాణామ్) (మంహిష్ఠః) అతిశయేన మహత్వయుక్తః (మత్సత్) ఆనన్దయేత్ (అన్ధసః) అన్నాత్ (దృఢా) దృఢాని (చిత్) ఇవ (ఆరుజే) సమస్తారోగాయ (వసూ) వసూని ద్రవ్యాణి. అత్ర సుపాం సులుగితి జసో లుక్. ॥౪౦॥

అన్వయః:- హే విద్వన్! యః కః సత్యో మంహిష్ఠో విద్వాంస్త్వాన్ధసో మదానాం మధ్యే మత్సదారుజే ఔషధాని చిదివ దృఢా వసు సంచినుయాత్సోఽస్మాభిః పూజనీయః. ॥౪౦॥

భావార్థః:-అత్రోపమాలంకారః.యః సత్యప్రియ ఆనన్దప్రదో విద్వాన్ పరోపకారాయ రోగనివారణా యౌషధమివ వస్తూని సంచినుయాత్స ఏవ సత్కారమర్హేత్. ॥౪౦॥

పదార్థము:-ఓ విద్వాంసుడా! కః=సుఖదాత, సత్యః=శ్రేష్ఠులలో నుత్తముడు, మంహిష్ఠః=అతిమహత్వయుక్త విద్వాంసుడునగునెవడు,త్వా=నిన్ను,అన్ధసః=అన్నము వలనకలుగు మదానామ్=ఆనందములమధ్య,మత్సత్=ప్రసన్నపఱచునో, ఆరుజే=సమస్త రోగములకై ఔషధములనెట్లు సమకూర్చునో,చిత్=అటులనే,దృఢా=దృఢముగ,వసు= ద్రవ్యములను సంచయ మొనర్చునో, అట్టివాడు మాకు పూజనీయుడు. [౪౦]

భావార్థము:-ఈమంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది.సత్యప్రియుడు ఆనంద ప్రదుడునగునే విద్వాంసుడు పరోపకారము కొఱకును, రోగనివారణార్థమును ఓషధతుల్య వస్తువులను సంచయమొనర్చునో అట్టి విద్వాంసుడే సత్కారము పొందుటకు యోగ్యుడు. ౧౫-౪౫[౪౦]

---

అభీషుణ ఇత్యస్య వామదేవ ఋషిః. ఇన్ద్రో దేవతా, పాదనిచృద్గాయత్రీ ఛందః. షడ్జః స్వరః.
కీ దృశా జనా ధనం లభన్త ఇత్యాహ
ఎటువంటి ప్రజలు ధనమును బడయుదురను విషయ మీ మంత్రమందు చెప్పబడెను

అభీ షు ణః సఖీనా మవితా జరితౄణామ్। శతం భవా స్యూతయే ॥౪౧॥

అభి, సు, నః, సఖీనామ్, అవితా, జరితౄణామ్, శతమ్, భవాసి,ఊతయే॥

పదార్థః:-(అభి) సర్వతః. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (సు) శోభనే (నః) అస్మాకమ్ (సఖీనామ్) మిత్రాణామ్ (అవితా) రక్షకః (జరితౄణామ్) స్తోతౄణామ్ (శతమ్) (భవాసి)భవేః (ఊతయే) ప్రీత్యాద్యాయ. ॥౪౧

అన్వయః:- హేవిద్వన్ యస్త్వం నః సఖీనాం జరితౄణాం చావితోతయే శతం సుభవాసి సోఽభిపూజ్యః స్యాః. ॥౪౧॥

భావార్థః:- యే మనుష్యాః సుహృదాం రక్షకా అసంఖ్యసుఖప్రదా అనాథానాం రక్షణే ప్రవర్తన్తే తేఽసంఖ్యం ధనం లభన్తే. ॥౪౧॥

పదార్థము:-ఓ విద్వాంసుడా! ఏ నీవు,నః=మాయొక్క, సఖీనామ్=మిత్రులకు మఱియు, జరితౄణామ్=స్తుతించు జనులకు, అవితా=రక్షకుడవు,ఊతయే=ప్రీతి మొదలగువాని నిమిత్తము,శతమ్=శతవిధములుగా,సు భవాసి=సుందరపద్ధతిని నిర్మించువాడవునగుచున్నావో,అట్టినీవు,అభి=అన్నివైపులనుండి సత్కార యోగ్యుడవగుదువు గాక.

భావార్థము:-ఏమానవులు తమమిత్రుల రక్షకులై,అసంఖ్యాకవిధముల సుఖమును చేకూర్చువారై, అనాథులను రక్షించుటకు ప్రయత్నమొనర్చుచున్నారో వారు అమిత ధనమును పొందుచున్నారు. ౧౫-౪౬[౪౧]

---

౧౫-౪౭ యజ్ఞా యజ్ఞేత్యస్య శంయుర్ఋషిః, యజ్ఞో దేవతా, బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.
పునస్తమేవ విషయమాహ
మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను

యజ్ఞా యజ్ఞా వోఽఅగ్నయే గిరా గిరా చ దక్షసే। ప్ర ప్ర

వయము మమృతం జాతవేదసం ప్రియం మిత్రం న శంసిషమ్ ॥౪౨॥

యజ్ఞా యజ్ఞేతి యజ్ఞా+యజ్ఞా, వః, అగ్నయే గిరాగిరేతి గిరా+గిరా.
చ, దక్షసే, ప్రప్రేతి ప్ర+ప్ర, వయమ్, మృతమ్, అజాత వేద
సమితి జాత+వేదసమ్, ప్రియమ్, మిత్రమ్, న, శంసిషమ్ ॥౪౨॥

పదార్థః:-(యజ్ఞాయజ్ఞా)యజ్ఞే యజ్ఞే.అత్ర సుపాం సులుగిత్యాకారాదేశః(వః)యుష్మాన్ (అగ్నయే) పావకాయ (గిరాగిరా) వాణ్యావాణ్యా (చ) (దక్షసే) బలాయ (ప్రప్ర) ప్రకర్షేణ (వయమ్) (అమృతమ్) నాశరహితమ్ (జాతవేదసమ్) జాతవిజ్ఞానమ్ (ప్రియమ్) ప్రీతివిషయమ్ (మిత్రమ్) సఖాయమ్ (న) ఇవ (శంసిషమ్) ప్రశంసేయమ్. ॥౪౨॥

అన్వయః:- హే మనుష్యా యథాఽహమగ్నయే గిరాగిరా దక్షసే చ యజ్ఞాయజ్ఞా వో యుష్మాన్ ప్రశంసిషమ్. వయం జాతవేదసమమృతం ప్రియం మిత్రం న వో యుష్మాన్ ప్రశంసేమ. తథా యూయమప్యాచరత. ॥౪౨॥

భావార్థః:-అత్రోపమా వాచకలుప్తోపమాలంకారౌ. యే మనుష్యాః సుశిక్షితయా వాణ్యా యజ్ఞానుష్ఠాయ బలం వర్ధయిత్వా మిత్రవద్విదుషః సత్కృత్య సంగచ్ఛన్తే, తే బహుజ్ఞా ధన్యాశ్చ జాయన్తే. ॥౪౨॥

పదార్థము:-ఓ మానవులారా! ఎట్లు నేను, అగ్నయే=అగ్నికొఱకు గిరాగిరా= ప్రతివాక్కుతోను, చ=మఱియు, దక్షసే=బలార్థము, యజ్ఞాయజ్ఞా=ప్రతి యజ్ఞము నందును, వః=మిమ్ము,ప్రప్ర శంసిషమ్=ప్రశంసింతునో,వయమ్=మేము,జాతవేదసమ్= జ్ఞాని, అమృతమ్=ఆత్మరూపముతో అవినాశి, ప్రియమ్=ప్రియుడునగు, మిత్రమ్ న= మిత్రునివలె మిమ్ము నెటులప్రశంసించెదమో, అటులనే మీరును ఆచరించుచుండుడు.

భావార్థము:-ఈమంత్రమందు ఉపమా వాచక లుప్తోపమాలంకారములున్నవి. ఏ మానవులు ఉత్తమ శిక్షిత వాక్కుతో యజ్ఞానుష్ఠాన మొనర్చి బలము పెంపొందజేసి, మిత్రులవలె విద్వాంసులను సత్కరించి సమాగమ మొనర్చు చున్నారో వారు బహుజ్ఞాన ముగలవారు ధనికులునగుచున్నారు. ౧౫౨౭[౪౨]

---

౧౫౨౮ పాహి న ఇత్యస్య భార్గవఋషిః, అగ్నిర్దేవతా, స్వరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
ఆప్తాః కిం కుర్యురిత్యాహ

ఆప్త ధర్మాత్ములు యేమిచేయవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

పాహి నో అగ్న ఏకయా పాహ్యుత ద్వితీయయా।

పాహి గీర్భి స్తి సృభి రూర్జాం పతే పాహి చతస్సృభి ర్వసో॥ ॥౪౩॥

పాహి, నః, అగ్నే, ఏకయా, పాహి, ఉత, ద్వితీయయా,

పాహి, గీర్భిరితి గీః+భిః, తిసృభిరితి తిసృ+భిః, ఊర్జామ్,

పతే, పాహి, చతస్సృభిరితి చతస్సృ+భిః, వసో ఇతి వసో॥ ॥౪౩॥

పదార్థః:-(పాహి) రక్ష (నః) అస్మాన్ (అగ్నే) పావకవద్విద్వన్ (ఏకయా) సుశిక్షయా (పాహి) (ఉత) అపి (ద్వితీయయా) అధ్యాపనక్రియయా (పాహి) (గీర్భిః) వాగ్భిః (తిసృభిః) కర్మోపాసనా జ్ఞానజ్ఞాపికాభిః (ఊర్జామ్) బలానామ్ (పతే) పాలక (పాహి) (చతస్సృభిః) ధర్మార్థ కామమోక్ష విజ్ఞాపికాభిః (వసో) సువాసప్రద. ॥౪౩॥

అన్వయః:- హే వసో అగ్నే త్వమేకయా నోఽస్మాన్ పాహి. ద్వితీయయా పాహి. తిసృభిర్గీర్భిః పాహి. హే ఊర్జాం పతే త్వం నోఽస్మాన్ చతస్సృభి రుత పాహి. ॥౪౩॥

భావార్థః:-ఆప్తా నాస్యృ ముపదేశాధ్యాపనాభ్యాం మనుష్యకల్యాణకరం విజానన్తి. అతో ఽహర్నిశమజ్ఞానమనుకమ్ప్య సదోపదిశ న్త్యధ్యాపయన్తి చ. ॥౪౩॥

పదార్థము:-వసో=సుందర వాసమొసగువాడా, అగ్నే=అగ్నివలె తేజస్వియగు విద్వాంసుడా! నీవు, ఏకయా=ఉత్తమ శిక్షతో, నః=మమ్ము, పాహి=రక్షించుము. ద్వితీయయా=రెండవదగు అధ్యాపనక్రియచే, పాహి=రక్షించుము. తిసృభిః=కర్మోపాసన జ్ఞానములను తెలియజేయు మూడు,గీర్భిః=వాణులచే, పాహి=రక్షించుము. ఊర్జామ్=బలముల యొక్క, పతే=రక్షకుడా! నీవు, చతస్సృభిః=ధర్మ,అర్థ,కామ మోక్షముల యొక్క విజ్ఞానములను తెలియజేయు చతుర్విధ వాక్కులతో, ఉత=కూడ మమ్ము రక్షించుము. [౪౩]

భావార్థము:-సత్యవాదులు, ధర్మాత్ములు,ఆప్తులు ఉపదేశాధ్యాపనములు దక్క నితరములను మానవులకు కల్యాణకరములైన సాధనములుగభావించరు. కావుననే వారు అజ్ఞానులపై కనికరించి నిరంతరము ఉపదేశించుచు, చదివించుచున్నారు. ౧౪౨౨

---

౧౪౨౩ ఊర్జో నపాతమిత్యస్య శమ్యుర్ ఋషిః, వాయుర్దేవతా, స్వరాడ్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయ మాహ

మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను

ఊర్జో నపాత౦స హినాయమస్మయుర్ దాశేమ హవ్యదాతయే।

భువద్వాజే ష్వవితా భువ ద్వృధఽఉత త్రాతా తనూనామ్॥ ॥౪౪॥

ఊర్జః, నపాతమ్, సః, హిన, అయమ్, అస్మయుః

ఇత్యస్మ+యుః, దాశేమ, హవ్యదాతయ+ఇతి హవ్య+దాతయే, భువత్,

వాజేషు, అవితా, భువత్, వృధే, ఉత, త్రాతా, తనూనామ్॥ ॥౪౪॥

పదార్థః:-(ఊర్జః) పరాక్రమస్య (నపాతమ్) అపాతితారం విద్యాబోధనమ్ (సః) (హిన) హిను వర్ధయ.అత్ర హి గతౌ వృద్ధౌ చేత్యస్మాల్లోణ్మధ్య మైకవచనే వర్ణవ్యత్యయేన ఉకారస్య అకారః (అయమ్) (అస్మయుః) యోఽస్మాన్ కామయతే (దాశేమ) స్వీకుర్యామ (హవ్యదాతయే) దాతవ్యానాం దానాయ (భువత్) భవేత్ (వాజేషు) సంగ్రామేషు (అవితా) రక్షితా (భువత్) భవేత్ (వృధే) వర్ధనాయ (ఉత) అపి (త్రాతా) (తనూనామ్) శరీరాణామ్. ॥౪౪॥

అన్వయః:- హే విద్యార్థిన్ ! స త్వమూర్జో నపాతం హిన యతోఽయం భవానస్మయుర్వాజేష్వవితా భువదుతాపి తనూనాం వృధే త్రాతా భువత్.తతస్త్వం హవ్యదాతయే వయం దాశేమ. ॥౪౪॥

భావార్థః:-యః పరాక్రమం వీర్యం చ న హాన్యాచ్ఛరీరాత్మనో ర్వర్ధకః సన్ రక్షకః స్యాదాప్తాస్తస్మై విద్యాం దద్యుః.యోఽస్మాద్విపరీతోఽజితేన్ద్రియో దుష్టాచారీ నిన్దకో భవేత్స విద్యాగ్రహణేఽధికారీ న భవతీతి వేద్యమ్. ॥౪౪॥

పదార్థము:-ఓ విద్యార్థీ! సః=ఆనీవు, ఊర్జః=పరాక్రమమును,నపాతమ్=నష్టము చేయని విద్యాబోధను, హిన=వృద్ధిపఱచుము. అందువలన,అయమ్=ప్రత్యక్షముగనున్న నీవు, అస్మయుః=మమ్మును కోరువాడవు మఱియు, వాజేషు=సంగ్రామములందు అవితా=రక్షించువాడవు, భువత్=అగుము, ఉత=మఱియు, తనూనామ్=శరీరముల వృద్ధి, వృధే=పెంపొందుటకై, త్రాతా=పాలించువాడవు, భువత్=అగుదువుగాక! కావున నీకు, హవ్యదాతయే=ఇవ్వదగిన పదార్థములనిచ్చుటకై మేము,దాశేమ=స్వీకరించెదము గాక! [౪౪]

భావార్థము:-ఎవరు బలపరాక్రమములను నష్టమొనర్చక శరీరాత్మల నున్నతిపఱచుచు రక్షకులగుదురో అట్టివారికి ఆప్తులు చదువుచెప్ప వలయును. ఎవరుదీనికి వ్యతిరేకముగ లంపటులు, దుష్టాచారులు, నిందకులు నగుదురో వారు విద్యను గ్రహించుట కధికారులు కారని యెఱుంగుడు. ౧౧-౭౯[౪౪]

౧౧.౩౦ సంవత్సర ఇత్యస్య శమ్యు ర్ఋషిః, అగ్ని ర్దేవతా, నిచృదభి కృతిశ్ఛన్దః । ఋషభః స్వరః.

పునస్తమేవ విషయ మాహ .

మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను

సంవత్సరోఽసి పరివత్సరోఽసీదావత్సరోఽసీ ద్వత్సరోసి వత్సరోఽసి। ఉషసస్తే కల్పన్తా మహో రాత్రాస్తే కల్పన్తా మర్ధమాసాస్తే కల్పన్తాం మాసాస్తే కల్పన్తా మృతవస్తే కల్పన్తాᳶ సంవత్సరస్తే కల్పతామ్। ప్రేత్యాఽఏత్యై సం చాఞ్చ ప్ర చ సారయ। సుపర్ణ చిదసి తయా దేవతయాఽఙ్గిరస్వ ద్ధ్రువః సీద॥ ॥౪౫॥

సంవత్సరః, అసి, పరివత్సర+ఇతి పరి+వత్సరః, అసి, ఇదావత్సర ఇతీదా+వత్సరః, అసి, ఇద్వత్సర ఇతీత్+వత్సరః, అసి, వత్సరః, అసి, ఉషసః, తే, కల్పన్తామ్, అహోరాత్రాః, తే, కల్పన్తామ్, అర్ధమాసా+ఇత్యర్ధమాసా, తే, కల్పన్తామ్, మాసాః, తే, కల్పన్తామ్, ఋతవః, తే, కల్పన్తామ్, సంవత్సరః. తే, కల్పతామ్, ప్రేత్యా+ఇతి ప్ర+ఇత్యై, ఏత్యా+ఇత్యా+ఇత్యై, సమ్, చ, అఞ్చ, ప్ర, చ, సారయ। సుపర్ణ చిదితి సుపర్ణ+చిత్, అసి, తయా, దేవతయా, అంగిరస్వదిత్యఙ్గిరః+వత్, ధ్రువః, సీద॥ ॥౪౫॥

పదార్థః:-(సంవత్సరః)సంవత్సర ఇవ నియమేన వర్తమానః(అసి)(పరివత్సరః)వర్జితవర్జ్యో వత్సర ఇవ దుష్టాచారత్యాగీ (అసి) (ఇదావత్సరః) నిశ్చయేన సమంతాద్ వర్తమానః సంవత్సర ఇవ (అసి) (ఇద్వత్సరః) నిశ్చితసంవత్సర ఇవ (అసి) (వత్సరః) వర్ష ఇవ (అసి) (ఉషసః)ప్రభాతాః (తే) తుభ్యమ్(కల్పన్తామ్) సమర్థా భవన్తు (అహోరాత్రాః)రాత్రి దినాని(తే) (కల్పన్తామ్) (అర్ధమాసాః) సితాసితాః పక్షాః (తే) (కల్పన్తామ్) (మాసాః) చైత్రాదయః(తే) (కల్పన్తామ్) (ఋతవః) వసన్తాద్యాః(తే)(కల్పన్తామ్) (సంవత్సరః) (తే) (కల్పతామ్) (ప్రేత్యై)ప్రకృష్టేన ప్రాప్త్యై(ఏత్యై)సమన్తాద్ గత్యై(సమ్) సమ్యక్(చ)(అఞ్చ)ప్రాప్నుహి (ప్ర)(చ) (సారయ) (సుపర్ణచిత్) యః శోభనాని పర్ణాని పాలనాని చినోతి సః(అసి) (తయా) (దేవతయా)దివ్యగుణయుక్తయా సమయరూపయా (అంగిరస్వత్)సూత్రాత్మప్రాణవత్(ధ్రువః)దృఢః(సీద)స్థిరో భవ.

అన్వయః:- హే విద్వన్ జిజ్ఞాసో! యా యతస్త్వం సంవత్సరోఽసి పరివత్సరో సీఽదావత్సరోఽసీద్వత్సరోఽసి వత్సరోఽసి తస్మాత్తే కల్యాణకర్య ఉషసః కల్పన్తాం తే మఙ్గలప్రదా అహోరాత్రాః కల్పన్తాం,తేఽర్ధమాసాః కల్పన్తాం,తే మాసాః కల్పన్తాం తే ఋతవః కల్పన్తాం, తే

సంవత్సరః కల్పతాం. త్వం చ ప్రైత్యై సమఞ్చత్వమేత్యై స్వప్రభావం ప్రసారయ చ యత స్త్వం సుపర్ణచిదసి తస్మాత్తయా దేవతయా సహాఙ్గిరస్వద్ ధ్రువః సీద. ॥౪౫॥

భావార్థః-యే ఆప్తా మనుష్యా వ్యర్థం కాలం న నయన్తి, సునియమైర్వర్తమానాః కర్తవ్యాని కుర్వన్తి, త్యక్తవ్యాని త్యజన్తి, తేషాం సుప్రభాతః శోభనా అహోరాత్రా అర్ధమాసా మాసా ఋతవశ్చ గచ్ఛన్తి, తస్మాదుత్కృష్టగతయే ప్రయత్య సుమార్గేణ గత్వా శుభాన్ గుణాన్ సుఖాని చ ప్రసారయేయుః. సులక్షణయా వాచా పత్న్యా చ సహితా ధర్మగ్రహణే ఽధర్మ త్యాగే చ కృతోత్సాహా సదా భవేయు రితి. ॥౪౫॥

పదార్థము:-విద్వాంసుడా! లేక జిజ్ఞాసువా! నీవు, సంవత్సరః=సంవత్సరమువలె నియమముగ వర్తమానుడవై, అసి=ఉన్నావు, పరివత్సరః=త్యాజ్య వత్సరమువలె దురాచరణత్యాగివై, అసి=ఉన్నావు, ఇదావత్సరః=నిశ్చయముతో బాగుగా వర్తమాన మగు వత్సరమువలె, అసి=ఉన్నావు, ఇద్వత్సరః=నిశ్చితసంవత్సరమువలె, అసి=ఉన్నావు, వత్సరః=సంవత్సరమువలె, అసి=ఉన్నావు, కావున, తే=నీకు, ఉషసః=కల్యాణ కారిణియగు ఉషస్సులు ప్రభాతవేళలు, కల్పన్తామ్=సమర్థములగుగాక! తే=నీకు, అహోరాత్రాః=రాత్రింబగళ్ళు మంగళదాయకములు, కల్పన్తామ్=సమర్థములగుగాక! తే=నీకు, అర్ధమాసాః=శుక్ల కృష్ణ పక్షములు, కల్పన్తామ్=సమర్థములగుగాక! తే=నీకు, మాసాః=చైత్రాది మాసములు, కల్పన్తామ్=సమర్థములగు గాక! తే=నీకు, ఋతవః=వసంతాదిఋతువులు, కల్పన్తామ్=సమర్థములగుగాక! తే=నీకు, సంవత్సరః=సంవత్సరము, కల్పతామ్=సమర్థమగు గాక! చ= మఱియు నీవు, ప్రైత్యై=ఉత్తమత్వప్రాప్తికై, సమ్ అఞ్చ=బాగుగా ప్రాప్తించుము, చ=మఱియు నీవు, ఏత్యై=బాగుగా వెళ్ళుటకై, ప్రసారయ=నీప్రభావమును విస్తరింప జేయుము, సుపర్ణచిత్ అసి=సుందర రక్షణకు సాధనములను సంచయమొనర్చువాడవు, అటులయున్నందువలన, తయా దేవతయా=ఉత్తమగుణ యుక్తమైన సమయ రూపదేవతతోపాటు, అంగిరస్వత్=సూత్రాత్మయగు ప్రాణవాయువువలె, ధ్రువః =దృఢనిశ్చయముగ. సీద=స్థిరమగుము. [౪౫]

భావార్థము:-ఆప్తపురుషులెవరు కాలమునువ్యర్థపుచ్చరో, సుందరనియమములతో వర్తించుదురో, కర్తవ్యకర్మలను చేయుదురో, చేయరాని కర్మలను త్యజించుదురో వారియొక్క ప్రభాతకాలము, దివారాత్రములు, పక్షములు, మాసములు, ఋతువులు మున్నగునవన్నియు. బాగుగా జరిగిపోవును. కావున ఉత్తమగతినిమిత్తము ప్రయత్నించి మంచి మార్గమున నడచి శుభగుణములను, సుఖములను విస్తరింపజేయవలయును. సులక్షణముల వాక్కుతో సహితము లేక స్త్రీతో సహితముగ ధర్మగ్రహణమందును త్యజించుట యందును సదా దృఢమైన ఉత్సాహవంతులుగ నుండవలయును. ౧౫౩౦ [౪౫]



అస్మిన్నధ్యాయే సత్యప్రశంసా విజ్ఞాపనం,సద్గుణస్వీకారో, రాజ్యవర్ధన మనిష్టనివారణం, జీవన
వృద్ధి ర్మిత్రవిశ్వాసకే,సర్వత్రకీర్తికరణ మైశ్వర్యవర్ధనమల్పమృత్యు నివారణం,శుద్ధికరణం,
సుకృతానుష్ఠానం,యజ్ఞకరణం, బహుధనధారణం,స్వామిత్వ ప్రతిపాదనం,సువాగ్గ్రి
హణం, సద్గుణేచ్ఛాఽగ్ని ప్రశంసా, విద్యాధనవర్ధనం, కారణవర్ణనం, ధనోప
యోగః,పరస్పరేషాం రక్షణం,వాయుగుణవర్ణన మాధారాఽఽధేయ
కథన మీశ్వర గుణవర్ణనం, శూరవీర కృత్యకథనం,ప్రసన్నతా
సమ్పాదనం,మిత్రరక్షణం,విద్వదాశ్రయః,స్వాత్మపాలనం
వీర్యరక్షణం యుక్తాహార విహారశ్చోక్తమత ఏత
దధ్యాయోక్తార్థస్య పూర్వాధ్యాయోక్తా
ర్థేన సహ సంగతి రస్తీతి వేద్యమ్.

---

ఈ అధ్యాయమందు సత్యప్రశంస నెఱుగుట, ఉత్తమ గుణములను స్వీకరించుట, రాజ్యము నభివృద్ధి పఱ
చుట, అనిష్టనివృత్తి, జీవితమును పెంచుట, మిత్రునిపై విశ్వాసముంచుట, సర్వత్ర కీర్తిని బడయుట,
ఐశ్వర్యము నభివృద్ధిపఱచుట, అల్పమృత్యు నివారణము, శుద్ధియొనర్చుట,సత్కర్మానుష్ఠానము,
యజ్ఞమొనర్చుట, బహుధనమును ధరించుట, స్వామిత్వ ప్రతిపాదనము, సుందర వాణిగ్రహ
ణము, సద్గుణేచ్ఛ, అగ్నిప్రశంస, విద్యాధనములను అభివృద్ధిపఱచుట,కారణవర్ణన, ధనోప
యోగము, పరస్పర రక్షణ, వాయుగుణ వర్ణన, ఆధారాధేయ కథనము, ఈశ్వరుని
గుణవర్ణన,శూరవీరుల కృత్యముల కథనము,ప్రసన్నతా సంపాదనము,మిత్రరక్షణ,
విద్వాంసుల నాశ్రయించుట, స్వాత్మపాలనము, వీర్యరక్షణ, యుక్తాహారవిహా
రములు, మన్నగు విషయములు చెప్పబడి యున్నవి. కావున నీ అధ్యాయ
మందు చెప్పబడిన అర్థమునకు పూర్వాధ్యాయము నందు చెప్పబడిన
అర్థముతో సంబంధమున్నదని యెఱుంగవలయును.

[౨౭ వ అధ్యాయము సమాప్తము]



ఇతి శ్రీమత్పరమ హంస పరివ్రాజకాచార్యాణాం పరమవిదుషాం శ్రీయుతవిరజానంద
సరస్వతీస్వామినాం శిష్యేణ శ్రీపరమహంస పరివ్రాజకాచార్యేణ శ్రీమద్దయానంద
సరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సమన్వితే సుప్రమాణ
యుక్తే యజుర్వేదభాష్యే సప్తవింశతితమోఽధ్యాయః పూర్తిమగమత్.

★

కృష్ణామండలాంతర్గత కుందేరు గ్రామవాస్తవ్యులగు పాలడుగు
శేషాచలాచార్య, తదేవ మండలాంతర్గత ముదునూరు గ్రామవాస్తవ్యుడు
అన్నే కేశవార్యశాస్త్రి, గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన శ్రీమద్దయానంద
సరస్వతీ నిర్మిత యజుర్వేద భాష్యమందలి యిరువది యేడవ అధ్యాయము సమాప్తము

---

ఓమ్

# అథాష్టా వింశోఽధ్యాయ ఆరభ్యతే

—o—

ఇప్పుడిరువది ఎనిమిదవ అధ్యాయము * ఆరంభమగుచున్నది.

విశ్వానిదేవ సవితర్దురితాని పరాసువ। యద్భద్రం తన్న ఆసువ ॥౧॥

హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ మనుష్యైర్యజ్ఞేన కథం బలం వర్ధనీయ మిత్యాహ.

మానవులు యజ్ఞమువలన నెట్లు బలమును పెంపొందజేయవలయును?

హోతా యక్షత్సమిధేన్ద్ర మిడస్పదే నాభా పృథివ్యా అధి। దివో

వర్ష్మన్త్స మిధ్యతఽఓజిష్ఠశ్చర్షణీ సహాం వేత్వాజ్యస్య హోతర్యజ ॥౧॥

హోతా, యక్షత్, సమిధేతి సమ్+ఇధా, ఇన్ద్రమ్, ఇడః, పదే, నాభా, పృథి

వ్యాః, అధి, దివః, వర్ష్మన్। సమ్, ఇధ్యతే, ఓజిష్ఠః, చర్షణీ సహామ్, చర్షణీసహా

మితి చర్షణి+సహామ్, వేతు, ఆజ్యస్య, హోతః, యజ॥ ॥౧॥

పదార్థః:-(హోతా) ఆదాతా (యక్షత్) యజేత్ (సమిధా) జ్ఞానప్రకాశేన (ఇన్ద్రమ్) విద్యుదాఖ్యమగ్నిమ్ (ఇడః)వాణ్యాః. అత్ర జసాదిషు ఛన్దసి వా వచనమితి యాడభావః(పదే) ప్రాప్తవ్యే (నాభా) నాభౌ మధ్యే (పృథివ్యాః) భూమేః (అధి) ఉపరి(దివః) ప్రకాశస్య(వర్ష్మన్) వర్ష్మకే మేఘమండలే (సమ్) (ఇధ్యతే) ప్రదీప్యతే (ఓజిష్ఠః) అతిశయేన బలీ (చర్షణీసహామ్) యే

---

## * ౨౮ వ అధ్యాయపు విషయసూచిక

| [క్రమసంఖ్య] | [మంత్రములు] | [క్రమసంఖ్య] | [మంత్రములు] |
|---|---|---|---|
| హోతృగుణములు | ౧-౩౪ | విద్వాంసుల కర్తవ్యము | ౨౦-౨౩ |
| రాజపురుషులు | ౨-౪,౪౭ | వాణిగణములు | ౩౭ ౩౮ |
| సుఖము పొందుట కర్మలు | ౫-౮,౧౦,౧౩-౧౭, ౨౪-౨౭,౨౯ | అశ్వినుల గుణములు | ౪౧ |
| ఆప్త వైద్యుతు | ౯ | హోతకర్తవ్యములు | ౩,౪౬ |
| ధన ప్రశంస | ౧౮,౩౦,౩౩ | యజ్ఞ వర్ణనము | ౧,౩౯ |
| సుగృహ నిర్మాణము | ౧౯,౨౮,౩౬ | విద్వత్ప్రశంస | ౩౧,౩౨,౩౪,౩౫,౪౦ ౪౨,౪౫. |

* 1981 విక్రమ శక అజ్మీరు వైదిక యంత్రాలయ సంస్కరణమునకు అనుకృతి.

ఈ అధ్యాయములో ౪౬ మంత్రములు, ౪౬ ఛందస్సులు, ౯౬౭ పదములు, ౨౫౦౪ అక్షరములున్నవి

[అనువాదకులు]

చర్షణీన్ మనుష్యసమూహాన్ సహన్తే తేషామ్ (వేతు) ప్రాప్నోతు (ఆజ్యస్య) ఘృతాదికమ్. అత్ర కర్మణి షష్ఠీ (హోతః) యజమాన (యజ) సంగచ్ఛస్వ. ॥౧॥

అన్వయః:- హే హోతస్త్వం యథా హోతా సమిధేడస్పదే పృథివ్యా నాభా దివోఽధి వర్షిష్ఠన్నిన్ద్రం యక్షత్తేనౌజిష్ఠః సన్ చర్షణీసహాం మధ్యే సమిధ్యతే ఆజ్యస్య వేతు తథా యజ॥౧॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్వేదమన్త్రైః సుగన్ధ్యాదిద్రవ్యమగ్నౌ ప్రక్షిప్య మేఘమణ్డలం ప్రాపయ్య జలం శోధయిత్వా సర్వార్థం బలం వర్ద్ధనీయమ్. ॥౧॥

పదార్థము:- హోతః=యజమానుడా! హోతా=శుభగుణగ్రహణకర్త, సమిధా=జ్ఞాన ప్రకాశముతో, ఇడః=వాణిసంబంధమైన, పదే=పొందదగిన వ్యవహారము నందు, పృథివ్యాః=భూమి యొక్క, నాభా=మధ్యమందు మఱియు దివః=ప్రకాశము యొక్క, అధి=పైనను, వర్షిష్ఠన్=వర్షించు మేఘమండలమునందు, ఇన్ద్రమ్=విద్యుద్రూపాగ్నిని, యక్షత్=సంగతమొనర్చునో, దానిచే ఓజిష్ఠః=అతిశయ బలముగలిగిన వాడై, చర్షణీసహామ్=మానవ సమూహములను సహించు యోధులలో, సమ్ ఇధ్యతే=బాగుగా నెటుల ప్రకాశితుడగునో, మఱియు ఆజ్యస్య=ఘృతాదులు, వేతు=ఎటుల ప్రాప్తము లగునో, అటుల నీవు, యజ=సమాగము మొనర్చుచుండుము. [౧]

భావార్థము:- ఈమంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది. మానవులు వేదమంత్రములతో సుగంధ్యాది ద్రవ్యములను అగ్నియందు వ్రేల్చి మేఘమండలమునకు చేర్పించి, జలమును శుద్ధపఱచి సమస్తమునకు బలమును కలుగజేయవలయును. [౧]

---

౨౮।౨ హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః. ఇన్ద్రో దేవతా, నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

రాజపురుషాః కీదృశాః స్యురిత్యాహ

రాజపురుషు లెటు లుండవలయునను విషయము.

హోతా యక్షత్తనూనపాతమూతిభిర్జేతారమపరాజితమ్। ఇన్ద్రం దేవꣳ స్వర్విదం పథిభిర్మధుమత్తమైర్నరాశꣳసేన తేజసా వేత్వాజ్యస్య హోతర్యజ॥

హోతా, యక్షత్, తనూనపాతమితి తనూ-నపాతమ్, ఊతిభిరిత్యూతి+భిః, జేతారమ్, అపరాజితమిత్యపరా+జితమ్, ఇన్ద్రమ్, దేవమ్, స్వర్విదమితి స్వః+విదమ్, పథిభిరితి పథి+భిః, మధుమత్తమైరితి మధుమత్+తమైః, నరాశꣳసేన, తేజసా, వేతు, ఆజ్యస్య, హోతః, యజ॥ ॥౨॥

పదార్థః:-(హోతా) సుఖస్య ప్రదాతా (యక్షత్) సంగచ్ఛేత (తనూనపాతమ్) యః శరీరాణి పాతి తమ్(ఊతిభిః) రక్షాదిభిః (జేతారమ్) జయశీలమ్ (అపరాజితమ్) అన్యైః పరాజేతుమశక్యమ్ (ఇన్ద్రమ్) పరమైశ్వర్యకారకం రాజానమ్(దేవమ్) విద్యావినయాభ్యాం సుశోభితమ్ (స్వర్విదమ్) ప్రాప్తసుఖమ్ (పథిభిః) ధర్మ్యైర్మార్గైః (మధుమత్తమైః) అతిశయేన మధురజలాది యుక్తైః (నరాశంసేన) నరైః రాశంసితేన (తేజసా) ప్రాగల్భ్యేన (వేతు) ప్రాప్నోతు (ఆజ్యస్య) విజ్ఞేయమ్. అత్ర కర్మణి షష్ఠీ (హోతః) (యజ). ॥౨॥

అన్వయః:- హే హోత స్త్వం యథా హోతోతిభి ర్మధు మత్తమైః పథిభిస్తనూనపాతం జేతారమపరాజితం స్వర్విదం దేవమిన్ద్రం యక్షత్ నరాశంసేన తేజసాఽఽజ్యస్య వేతు తథా యజ. ॥౨॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యది రాజానః స్వయం న్యాయమార్గేషు గచ్ఛన్తి ప్రజానాం రక్షా విదధ్యుస్తేఽపరాజితారః సన్తః శత్రూణాం విజేతారః స్యుః ॥౨॥

పదార్థము:-హోతః = గ్రహించు పురుషుడా ! ఎట్లు, హోతా = సుఖదాత, ఊతిభిః=రక్షణలతో మఱియు, మధుమత్తమైః=అతిమధురమైన జలాదులతో యుక్తములగు, పథిభిః=ధర్మయుక్త మార్గముల, తనూనపాతమ్=శరీరముల రక్షకుడును, జేతారమ్=జయశీలుడును, అపరాజితమ్=శత్రువులకు జయించశక్యముకాని వాడును, స్వర్విదమ్=సుఖమును పొందినవాడును, దేవతమ్=విద్యావినయములచే సుశోభితుడును ఇన్ద్రమ్=పరమైశ్వర్యకారకుడునైన రాజును, యక్షత్= సేవించగలడో,నరాశంసేన= మానవులచే ప్రశంసించబడిన, తేజసా=ప్రతిభచే, ఆజ్యస్య=తెలిసికొనదగిన విషయమును, వేతు=పొందగలవో, అటుల, యజ= సంగమొనరించుము. [౨]

భావార్థము,-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఏ రాజులు రాజ్యమువొక్క న్యాయమార్గమున తాము నడచుచు ప్రజలను రక్షించుచుందురో, వారు పరాజయమును పొందనివారై శత్రువులను జయించువారగుదురు. ౧౫౩౨[౨]

---

హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, స్వరాట్ పంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మఱల నదే విషయము.

హోతా యక్షదిడాభి రిన్ద్ర మీడిత మాజుహ్వాన మమర్త్యమ్ ।
దేవో దేవైః సవీర్యో వజ్రహస్తః పురన్దరో వేత్వాజ్యస్య హోతర్యజ ॥౩॥

హోతా, యక్షత్, ఇడాభిః, ఇన్ద్రమ్, ఈడితమ్, ఆజుహ్వాన మిత్యా+జుహ్వా

నమ్ । అమ_ర్త్యమ్, దేవః, దేవైః, సవీర్య ఇతి స+వీర్యః, వజ్రహ_స్త ఇతి వజ్ర+హ_స్తః, పురన్దర ఇతి పురమ్+దరః, వేతు, ఆజ్యస్య, హోతః, యజ ॥౩॥

పదార్థః:-(హోతా)(యక్షత్)(ఇడాభిః)సుశిక్షితాభిర్వాగ్భిః(ఇన్ద్రమ్)పరమవిద్యైశ్వర్య సమ్పన్నమ్ (ఈడితమ్) ప్రశ_స్తమ్ (ఆజుహ్వానమ్) స్పర్ధమానమ్ (అమ_ర్త్యమ్) సాధారణైర్మను ష్యైరసదృశమ్ (దేవః) విద్వాన్ (దేవైః) విద్వద్భిః సహ (సువీర్యః) బలోపేతః (వజ్రహ_స్తః) వజ్రాణి శస్త్రాణి హస్తే యస్య సః (పురన్దరః) యోఽరిపురాణి దృణాతి సః (వేతు) ప్రాప్నోతు (ఆజ్యస్య) విజ్ఞానేన రక్షితుం యోగ్యస్య రాజ్యస్య (హోతః) (యజ). ॥౩॥

అన్వయః:-హే హోత_స్త్వం యథా హోతేడాభి రమ_ర్త్యమా జుహ్వాన మీడిత మిన్ద్రం యక్షద్యథాఽయం వజ్రహ_స్తః పురన్దరః సవీర్యో దేవో దేవైః సహాజ్యస్యావయవాన్ వేతు తథా యజ. ॥౩॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా రాజ రాజపురుషాః పితృవత్ప్రజాః పాలయేయు_స్తథైవ ప్రజా ఏతాన్ పితృవత్సేవేరన్. య ఆ_ప్తవిద్వదనుమత్యా సర్వాణి కార్యాణి కుర్యు_స్తే భ్రమం నాప్నుయుః. ॥౩॥

పదార్థము:-హోతః=ఓ గ్రహీతా! ఎట్లు హోతా=సుఖదాత, ఇడాభిః=మంచి శిక్షిత వాక్కులతో, అమ_ర్త్యమ్=సాధారణ మనుష్యులకు విలక్షణుడు, ఆజుహ్వానమ్= పోటీచేయువాడు, ఈడితమ్=ప్రశంసితుడు, ఇన్ద్రమ్=ఉ_త్తమ విద్యైశ్వర్యయుక్తుడగు రాజపురుషుని, యక్షత్=పొందునో, ఎట్లు,వజ్రహ_స్తః=హ_స్తములందు శస్త్రాస్త్రముల ధరించియున్నవాడు, పురన్దరః=శత్రువుల నగరములను ధ్వంసమొనర్చువాడు, సవీర్యః= బలయుక్తుడునగు,దేవః=ఈవిద్వాంసుడు,దేవైః=విద్వాంసులతోపాటు, ఆజ్యస్య=విజ్ఞాన ముతోరక్షించదగిన రాజ్యావయవములను, వేతు=పొందునో అటుల నీవు, యజ=సమాగ మము చేయుము. [౩]

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఎట్లు రాజు రాజపురుషులు తండ్రివలె ప్రజలను పాలించుచుందురో అటులనే ప్రజలును వారిని తండ్రి వలె సేవించవలయును. ఆ_ప్తవిద్వాంసుల అనుమతితో నెవరు సమ_స్తకార్యములు చేయు దురో వారు భ్రమను పొందజాలరు. ౧౫౩౩[౩]

---

౧౫౩౪ హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః, రుద్రో దేవతా,త్రిష్టుప్ ఛన్దః,ధైవతః స్వరః.

పున_స్తమేవ విషయ మాహ

మరల నదే విషయము.

హో॑తా యక్షద్బ॒ర్హి॒షీన్ద్ర॑ం నిష॒ద్వ॒రం వృ॑ష॒భం నర్యా॑పసమ్।
వసు॑భీ రు॒ద్రైరా॑ది॒త్యైః స॒యుగ్భి॑ర్బ॒ర్హిరా స॑ద॒ద్వేత్వాజ్య॑స్య హో॒త॒ర్యజ॥

హో॑తా, య॒క్షత్, బ॒ర్హిషి, ఇన్ద్ర॑మ్, ని॒ష॒ద్వ॒రమ్, ని॒స॒ద్వ॒రమి॑తి నిసత్+
వ॒రమ్, వృ॒ష॒భమ్, నర్యా॑పస॒మితి॒ నర్య+అపసమ్, వసు॑భి॒రితి॒ వసు+భిః, రు॒ద్రైః,
ఆ॒ది॒త్యైః, స॒యుగ్భి॒రితి॒ స॒యుక్+భిః, బ॒ర్హిః, ఆ, అ॒స॒ద॒త్, వేతు॑, ఆజ్య॑స్య,
హో॑తః, యజ॥ ॥౪॥

పదార్థః:-(హోతా) (యక్షత్) (బర్హిషి) ఉత్తమాయాం విద్వత్సభాయామ్ (ఇన్ద్రమ్) నీత్యా సుశోభమానమ్ (నిషద్వరమ్) నిషీదన్తి వరాః శ్రేష్ఠా మనుష్యా యస్య సమీపే తమ్ (వృషభమ్) సర్వోత్కృష్టం బలిష్ఠమ్ (నర్యాపసమ్) నృషు సాధూన్యపాంసి కర్మాణి యస్య తమ్ (వసుభిః) ప్రథమకల్పైః (రుద్రైః) మధ్యకక్షాస్థైః (ఆదిత్యైః) ఉత్తమకల్పైశ్చ విద్వద్భిః (సయుగ్భిః) యే యుఞ్జన్తే తైః (బర్హిః) ఉత్తమాం సభామ్ (ఆసదత్) ఆసీదతి(వేతు) ప్రాప్నోతు (ఆజ్యస్య) కర్తవ్యస్య న్యాయస్య (హోతః) (యజ). ॥౪॥

అన్వయః:-హే హోతర్హోతా యథా సయుగ్భిర్వసుభీ రుద్రైరాదిత్యైః సహ బర్హిషి నిషద్వరం వృషభం నర్యాపసమిన్ద్రం యక్షదాజ్యస్య బర్హిరాసదత్సుఖం వేతు తథా యజ ॥౪॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా పృథివ్యాదయో లోకాః ప్రాణాదయో వాయవః కాలావయవాః మాసాః సహ వర్తన్తే తథా యే రాజప్రజాజనాః పరస్పరానుకూల్యే వర్తిత్వా సభయా ప్రజాపాలనం కుర్యుస్తే శ్రేష్ఠాం ప్రశంసాం ప్రాప్నువన్తి. ॥౪॥

హోతః=ఉత్తమ దానమునిచ్చు పురుషుడా! హోతా=సుఖముగోరు పురుషుడెట్లు,సయుగ్భిః=కలిసిమెలిసి యోగము చేయువారు,వసుభిః=ప్రథమ తరగతికి చెందినవారు,రుద్రైః=మధ్యతరగతికి చెందినవారు,ఆదిత్యైః=ఉత్తమతరగతికి చెందినవారునగు విద్వాంసులతోకూడి, బర్హిషి=ఉత్తమ విద్వాంసుల సభయందు, నిషద్వరమ్=శ్రేష్ఠ జనుల సమీపమున కూర్చుండునట్టి వాడును, వృషభమ్=సర్వోత్తమ బలిష్ఠుడును, నర్యాపసమ్=మానవుల ఉత్తమ కార్యములను సేవించువాడును,ఇన్ద్రమ్=నీతితోశోభించువాడుననగు రాజును,యక్షత్=పొందగలడో,ఆజ్యస్య=చేయదగిన న్యాయముయొక్క, బర్హిః=ఉత్తమ సభయందు,ఆ అసదత్=స్థితమగుచున్నాడో,మఱియు,వేతు=సుఖమును పొందగలడో, అటులనే, యజ=నీవు పొందుము. [౪]

భావార్థము:-ఈమంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది. ఎట్లు పృథివ్యాదిలోకములు, ప్రాణాది వాయువులు, కాలముయొక్క అవయవములు, మాసములు

ఒకదానితో ఒకటి కలసి వర్తమానములై యున్నవో, అటులనే పీరాజు ప్రజలు పరస్పరా నుకూలముగ ప్రవర్తించి సభద్వారా ప్రజాపాలనము చేయుదురో వారు ఉత్తమ ప్రశంసను పొందుదురు. ౧౫౩౪[౪]

---

హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా. నిచృదతి జగతీ ఛన్దః. నిషాదః స్వరః.

పునః కీదృశో జనాః సుఖినో భవన్తీత్యాహ

మరల నదే విషయము.

హోతా యక్షదోజో న వీర్య్యꣳసహో ద్వార ఇన్ద్ర మవర్ధయన్ ।
సుప్రాయణా అస్మిన్ యజ్ఞే విశ్రయన్తా మృతా వృధో ద్వార
ఇన్ద్రాయ మీఢుషే వ్యన్త్వాజ్యస్య హోత ర్యజ॥ ॥౫॥

హోతా, యక్షత్, ఓజః, న, వీర్య్యమ్, సహః। ద్వారః, ఇన్ద్రమ్, అవర్ధ యన్, సుప్రాయణాః, సుప్రాయనా ఇతి సు+ప్రాయనాః, అస్మిన్, యజ్ఞే, వి, శ్రియ న్తామ్, ఋతావృధః, ఋతవృధ+ఇత్యృత+వృధః, ద్వారః, ఇన్ద్రాయ, మీఢుషే, వ్యన్తు, ఆజ్యస్య, హోతః, యజ॥ ॥౫॥

పదార్థః:-(హోతా) (యక్షత్) (ఓజః) జలవేగః.ఓజ ఇత్యుదకనా...నిఘం.౧.౧౨ (న) ఇవ (వీర్యమ్) బలమ్(సహః) సహనమ్ (ద్వారః) ద్వారాణి (ఇన్ద్రమ్)ఐశ్వర్యమ్ (అవర్ధయన్) వర్ధయన్తు (సుప్రాయణాః) శోభనాని ప్రకృష్టాన్యయనాని యాసు తాః (అస్మిన్) వర్తమానే (యజ్ఞే) సంగన్తవ్యే సంసారే (వి)(శ్రయన్తామ్) సేవన్తామ్(ఋతావృధః)యా ఋతం సత్యం వర్ధయన్తి తాః (ద్వారః) విద్యావినయద్వారాణి(ఇన్ద్రాయ)పరమైశ్వర్యయుక్తాయ (మీఢుషే) స్నిగ్ధాయ సేచన సమర్థాయ (వ్యన్తు) ప్రాప్నువన్తు (ఆజ్యస్య) విజ్ఞేయస్య రాజ్యవిషయస్య (హోతః) (యజ). ॥౫॥

అన్వయః:- హే హోతర్యథా యాః సుప్రాయణా ద్వార ఓజో న వీర్యం సహ ఇన్ద్రం చావర్ధయన్ తా ఋతావృధో ద్వారో మీఢుష ఇన్ద్రాయాస్మిన్ యజ్ఞే విద్వాంసో విశ్రయన్తా మాజ్యస్య వ్యన్తు, హోతా చ యక్షత్తథా త్వమ్ యజ. ॥౫॥

భావార్థః:-అత్రోపమా వాచక లుప్తోపమాలంకారౌ. యే మనుష్యా అస్మిన్ సంసారే విద్యాధర్మద్వారాణ్యుద్ఘాట్య పదార్థవిద్యాం సంసేవ్యైశ్వర్యం వర్ధయన్తి తేఽతులాని సుఖాని ప్రాప్నువన్తి. ॥౫॥

పదార్థము:-హోతః=యజ్ఞముచేయు పురుషుడా! ఎట్లు, సుప్రాయణాః=సుందరావకాశముగలవి,ప్రకృష్టాయనములుగలవియునైన,ద్వారః=ఏద్వారములు,ఓజః న=జలవేగమువలె,వీర్యమ్=బలమును,సహః=సహనమును,మఱియు, ఇన్ద్రమ్=ఐశ్వర్యమును అవర్ధయన్=పెంపొందజేయుచున్నవో, ఋతావృధః=సత్యమును పెంపొందజేయు, ద్వారః=ఆ విద్యావినయద్వారములను, మీఢుషే=స్నిగ్ధ వీర్యవంతుడగు, ఇన్ద్రాయ=ఉత్తమైశ్వర్య యుక్తుడైన రాజునిమిత్తము, అస్మిన్ యజ్ఞే=సంగతియోగ్యమైన యీ సంసారమున విద్వాంసులు, విశ్రయన్తామ్=విశేషముగ సేవించుచున్నారో, ఆజ్యస్య=తెలిసికొనదగిన రాజ్యవిషయములను, వ్యన్తు=పొందుచున్నారో, మఱియు హోతా=గ్రహీతుడు, యక్షత్=యజ్ఞమొనర్చునో, అటులనే,యజ=నీవు యజ్ఞమొనర్చుము.[౫]

భావార్థము:-ఈ మంత్రమందుపమ మఱియు వాచక లుప్తోపమాలంకారము గలవు. ఏమానవులీ సంసారమున విద్యాధర్మములయొక్క ద్వారములను ప్రసిద్ధమొనర్చి, పదార్థవిద్యను బాగుగా సేవించి ఐశ్వర్యమునభివృద్ధి పఱచుచున్నారో,వారు అతులసుఖములను పొందుచున్నారు. ౧౫౩౫[౫]

---

౧౫౩౬ హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః

పునర్మనుష్యైః కిం కర్తవ్య మిత్యాహ.

మఱల మానవు లేమి చేయవలయునను విషయము.

హోతా యక్షదుషే ఇన్ద్రస్య ధేనూ సుదుఘే మాతరా మహీ।

సవాతరౌ న తేజసా వత్సమిన్ద్ర మవర్ధతాం వీతామాజ్యస్య హోతర్యజ॥

హోతా యక్షత్, ఉషే+ఇత్యుషే, ఇన్ద్రస్య, ధేనూ+ఇతి ధేనూ, సుదుఘే+ఇతి సు+దుఘే, మాతరా, మహీ+ఇతి మహీ, సవాతరా వితి,స+వాతరౌ,న, తేజసా, వత్సమ్, ఇన్ద్రమ్, అవర్ధతామ్, వీతామ్, ఆజ్యస్య, హోతః, యజ ॥౬॥

పదార్థః:-(హోతా) (యజత్) (ఉషే) ప్రతాపయుక్త (ఇన్ద్రస్య) విద్యుతః (ధేనూ) దుగ్ధదాత్ర్యౌ గావౌ (సుదుఘే) సుష్ఠుకామప్రపూరికే(మాతరా) మాతృవద్వర్తమానే (మహీ) మహత్యౌ (సవాతరౌ) వాయునా సహ వర్తమానౌ (న)ఇవ (తేజసా) తీక్ష్ణప్రతాపేన (వత్సమ్) (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమ్ (అవర్ధతామ్) వర్ధేత (వీతామ్) ప్రాప్నుతామ్ (ఆజ్యస్య) ప్రక్షేప్తుం యోగ్యస్య (హోతః) (యజ). ॥౬॥

అన్వయః:-హే హోతస్త్వం యథేన్ద్రస్య సుదుఘే మాతరా మహీ ధేనూ సవాతరౌ

నోషే భౌతికసూర్యాఽగ్నీ వ్యక్తైజసేన్ద్రిం వత్సం పీతాం హోతాఽఽజ్యస్య యక్షద్ వర్ధతాం తథా యజ. ॥౬॥

భావార్థః:-అత్రోపమా వాచక లుప్తోపమాలంకారౌ. హే మనుష్యా యూయం యథా వాయునా ప్రేరితౌ భౌమవిద్యుతావగ్నీ సూర్యలోక తేజో వర్ధయతో యథా ధేనువద్వర్తమానే ఉషే. సర్వేషాం వ్యవహారాణా మారంభనివర్తికే భవత స్తథా ప్రయుఙ్ధ్వమ్. ॥౬॥

పదార్థము:-హే హోతః=సుఖదాతా! ఎట్లు, ఇన్ద్రస్య=విద్యుత్తుయొక్క, సుదుఘే మాతరా=సుందరమైన కోరికలను పూర్తిజేయు తల్లులవలెఉన్న,మహీ ధేనూ,సవాతరౌ న=వాయువుతో వర్తమానములై పాలనొసగు రెండుగోవు గోవులవలెనున్న,ఉషే =ప్రతాపయుక్తభౌతిక సూర్యరూపాగ్నులు రెండు, తేజసా=తీక్ష్ణప్రతాపముతో,ఇన్ద్రమ్ వత్సమ్=పరమైశ్వర్యయుక్తబాలకుని,పీతామ్=లభించుచున్నవో, మఱియు,హోతా= దాత, ఆజ్యస్య యక్షత్=పొరవేయదగిన వస్తువును సంగతమొనర్చునో, మఱియు అవర్ధతామ్=వృద్ధియగునో, అటుల, యజ=నీవు యజ్ఞమొనర్చుము. [౬]

భావార్థము:-ఈమంత్రమందుపమయు వాచక లుప్తోపమాలంకారమును గలవు. ఓ మానవులారా! ఎట్లుమీరు వాయువుచే ప్రేరేపించబడిన భౌతికాగ్ని, విద్యుదగ్ని, సూర్యలోకముయొక్క తేజస్సును పెంపొందజేయునో, మఱియు నెట్లు దుగ్ధదాత్రీ గోవులవలె వర్తమానములు ప్రతాపయుక్తములునగు దివారాత్రములు సకల వ్యవహారముల ఆరంభనివృత్తులను జేయునవిగాకాగలవో,అటుల నీవు యత్నమొనర్చుచుండుము.



౧౫౩౭ హోతేత్యస్య బృహదుక్థో గోతమ ఋషిః, అశ్వినౌ దేవతే, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పున స్తమేవ విషయమాహ

మఱల నదే విషయము

హోతా యక్షద్దైవ్యా హోతారా భిషజా సఖాయా, హవిషేన్ద్రం భిషజ్యతః। కవీ దేవౌ ప్రచేతసావిన్ద్రాయ ధత్త ఇన్ద్రియం వీత మాజ్యస్య హోతర్యజ ॥

హోతా, యక్షత్, దైవ్యా, హోతారా, భిషజా, సఖాయా, హవిషా,ఇన్ద్రమ్ భిషజ్యతః కవీ+ఇతి కవీ, దేవౌ, ప్రచేతసా విత్తి ప్ర+చేతసౌ, ఇన్ద్రాయ, ధత్తః, ఇన్ద్రియమ్, వీతామ్, ఆజ్యస్య, హోతః, యజ ॥ ॥౭॥

పదార్థః:-(హోతా) సుఖప్రదాతా (యక్షత్)(దైవ్యా)దేవేషు విద్వత్సు సాధూ(హో

తారా) రోగనివర్త్య సుఖస్య ప్రదాతారౌ (భిషజా) చికిత్సకౌ (సఖాయా) సుహృదౌ (హవిషా) యథాయోగ్యేన గృహీతవ్యవహారేణ (ఇన్ద్రమ్) పరమైశ్వర్య మిచ్ఛుకం జీవమ్ (భిషజ్యతః) చికిత్సాం కురుతః (కవీ) ప్రాజ్ఞౌ (దేవౌ) వైద్యకవిద్యయా ప్రకాశమానౌ (ప్రచేతసా) ప్రకృష్ట విజ్ఞానయుక్తౌ (ఇన్ద్రాయ) పరమైశ్వర్యాయ (ధత్తః) దధ్యాతామ్ (ఇన్ద్రియమ్) ధనమ్ (వీతామ్) ప్రాప్నుతామ్ (ఆజ్యస్య) నిదానాదేః (హోతః) యుక్తాహార విహారకృత్ (యజ) ప్రాప్నుహి.

అన్వయః:- హే హోతస్త్వం యథా హోతాఽఽజ్యస్య యక్షద్దైవ్యా హోతారా సఖాయా కవీ ప్రచేతసా దేవౌ భిషజా హవిషేన్ద్రం భిషజ్యత ఇన్ద్రాయేన్ద్రియం ధత్త, ఆయుర్వీతాం తథా యజ. ॥౭॥

భావార్థః:- అత్ర వాచక లుప్తోపమాలంకారః. మనుష్యా యథా సద్వైద్యా రోగిణోఽనుకంప్యౌషధాదినా రోగాన్నివార్యైశ్వర్యాయుషీ వర్ధయన్తి, తథా యూయం సర్వేషు మైత్రీం భావయిత్వా సర్వేషాం సుఖాయుషీ వర్ధయత. ॥౭॥

పదార్థము:- హోతః=యుక్తాహార విహారములొనర్చు వైద్యుడా! ఎట్లు, హోతా=సుఖమొసగువాడు, ఆజ్యస్య=తెలిసికొనదగిన నిదానాదివిషయములను, యక్షత్=సంగతమొనర్చునో, దైవ్యా=విద్వాంసులలో నుత్తములు, హోతారా=రోగములనివృత్తపఱచి సుఖమునొసగు వారలు, సఖాయా=పరస్పరమిత్రులు, కవీ=బుద్ధిమంతులు, ప్రచేతసా=ఉత్తమవిజ్ఞానయుక్తులు, దేవౌ=వైద్యవిద్యచే ప్రకాశవంతులునగు, భిషజా=చికిత్సచేయు నిరువురు వైద్యులు, హవిషా=యథాయోగ్యముగ గ్రహించతగిన వ్యవహారముతో, ఇన్ద్రమ్=పరమైశ్వర్యమును గోరు జీవమునకు, భిషజ్యతః=చికిత్సచేయుదురో, ఇన్ద్రాయ=ఉత్తమ ఐశ్వర్యము కొఱకు, ఇన్ద్రియమ్=ధనమును, ధత్తః=ధరించుదురో మఱియు ఆయువును, వీతామ్=పొందుదురో అటులే నీవును, యజ=పొందుము. [౭]

భావార్థము:- ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఓ మానవులారా! ఎట్లు శ్రేష్ఠ వైద్యులు రోగులపై కనికరించి ఓషధాములచే రోగముల నివృత్తపఱచి, ఐశ్వర్యమును ఆయువును పెంపొంద జేయుదురో, అటులనే మీరును సమస్త ప్రాణులందు మిత్రవృత్తితో ప్రవర్తించి సమస్త ఆయుస్సుఖములను పెంపొందజేయుడు.

---

౻౩౮ హోతేత్యస్య బృహదుక్థో వామదేవ్య ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయ మాహ

మఱల నదే విషయము

హోతా యక్షత్తిస్రో దేవీర్న భేషజం త్రయస్త్రిధాతవోఽపస ఇడా సరస్వతీ భారతీ మహీః। ఇన్ద్రపత్నీ ర్హవిష్మ తీర్వ్యన్త్వాజ్యస్య హోతర్యజ॥

హో॑తా యక్షత్, తి॒స్రః, దే॒వీః, న, భే॒షజమ్, త్ర॒యః, త్రి॒ధాత॑వ ఇతి త్రి॒+ధాత॑వః, అ॒పసః, ఇడా, సర॑స్వతీ, భార॑తీ, మ॒హీః, ఇన్ద్ర॑పత్నీ॒రితీన్ద్ర॑+పత్నీః హ॒విష్మ॑తీః, వ్య॑న్తు, ఆజ్య॑స్య, హో॑తః, యజ॥ ॥౮॥

పదార్థః:-(హోతా) విద్యాయా దాతాఽఽదాతా వా (యక్షత్) (తిస్రః) త్రిత్వసంఖ్యాకాః (దేవీః) సకల విద్యాప్రకాశికాః (న) ఇవ (భేషజమ్) ఔషధమ్ (త్రయః) అధ్యాపకోపదేశకవైద్యాః (త్రిధాతవః) త్రయోఽస్థిమజ్జవీర్యాణి ధాతవో యేభ్యస్తే (అపసః) కర్మాణః (ఇడా) ప్రశంసితుమర్హా(సరస్వతీ)బహువిజ్ఞానయుక్తా(భారతీ)సుష్ఠువిద్యాయా ధారికా పోషికా వా వాణీ (మహీః) మహతీః పూజ్యాః (ఇన్ద్రపత్నీః) ఇన్ద్రస్య జీవస్య పత్నీః స్త్రీవద్వర్త్తమానాః (హవిష్మతీః) వివిధ విజ్ఞానసహితాః (వ్యన్తు) ప్రాప్నువన్తు. (ఆజ్యస్య) ప్రాప్తుం యోగ్యస్యాఽధ్యాపనాఽధ్యయన వ్యవహారస్య (హోతః) (యజ). ॥౮॥

అన్వయః:- హే హోతర్యథా హోతాఽఽజ్యస్య యక్షత్. యథా త్రిధాతవోఽపసస్త్రయ స్తిస్రో దేవీర్న భేషజం మహీ ఇడా సరస్వతీ భారతీ చ హవిష్మతీ రిన్ద్రపత్నీర్వ్యన్తు తథాయజ

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా ప్రశస్తా విజ్ఞానవతీ సుమేధా చ స్త్రియః స్వసదృశాన్ పతీన్ ప్రాప్య మోదన్తే తథాఽధ్యాపకోపదేశకవైద్యా మనుష్యాః స్తుతి విజ్ఞాన యోగధారణా యుక్తా స్త్రివిధా వాచః ప్రాప్యాఽఽనన్దన్తి. ॥౮॥

పదార్థము:- హే, హోతః=సుఖమునుగోరు మానవుడా! ఎట్లు, హోతా=విద్యనొసగు అధ్యాపకుడు, అజ్యస్య=చదివి,చదివించురూపములోనున్న పొందదగిన వ్యవహారమును, యక్షత్=పొందునో ఎట్లు, త్రిధాతవః=ఎముకలు, క్రొవ్వు, వీర్యము, అనుధాతువర్ధకత్రయము, అపసః=కర్మలలో పనిచేయుచు, త్రయః= అధ్యాపకుడు,ఉపదేశకుడు వైద్యుడు, తిస్రః దేవీఃన=సర్వవిద్యలను ప్రకాశజచు మూడువాక్కులవలె, భేషజమ్= ఔషధమును, మహీః=గొప్ప పూజ్యమైనది, ఇడా=ప్రశంసించదగినది, సరస్వతీ=అధిక విజ్ఞానము గలది, మఱియు భారతీ=సుందర విద్యను ధరించునదిలేక పోషించునది, హవిష్మతీః=వివిధ విజ్ఞానములసహితముగ, ఇన్ద్రపత్నీః=జీవాత్మయొక్క పత్నివలె వర్తమానమునైన వాణిని, వ్యన్తు=పొందుదురో అటులనే నీవు, యజ=వారియొక్క సంగతి నెఱుగుము. [౮]

భావార్థము:-ఈమంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది.ఎట్లు ప్రశస్తలు, విజ్ఞానవతులు, ఉత్తమ బుద్ధిమతులునైన స్త్రీలు తమకు దగిన పతులనుపొంది ప్రసన్నలగుచున్నారో అటులనే అధ్యాపకులు, ఉపదేశకులు, వైద్యులు స్తుతి జ్ఞానయోగధారణాయుక్తులై త్రివిధవాక్కులను పొంది ఆనందితులగుచున్నారు. ౧౫౩౮[౮]

౧౪౩౮ హోతే త్యస్య ప్రజాపతి ర్ఋషిః। ఇన్ద్రో దేవతా। నిచృదతి జగతీ ఛన్దః। నిషాదఃస్వరః.
పున స్తమేవ విషయ మాహ.
మరల నదే విషయము.

హోతా యక్షత్త్వష్టార మిన్ద్రం దేవం భిషజꣳ సుయజం
ఘృతశ్రియమ్ ।పురురూపꣳ సురేతసం మఘోన
మిన్ద్రాయ త్వష్టా దధదిన్ద్రియాణి వేత్వాజ్యస్య హోతర్యజ॥ ॥౮॥

హోతా, యక్షత్, త్వష్టారమ్, ఇన్ద్రమ్, దేవమ్, భిషజమ్, సుయజమితి సు+యజమ్, ఘృత శ్రియమితి ఘృత+శ్రియమ్, పురురూపమితి పురు+రూపమ్। సురేతస మితి సు+రేతసమ్, మఘోనమ్, ఇన్ద్రాయ। త్వష్టా, దధత్. ఇన్ద్రియాణి, వేతు, ఆజ్యస్య, హోతః, యజ॥ ॥౮॥

పదార్థః:-(హోతా) (యక్షత్) (త్వష్టారమ్) దోషవిచ్ఛేదకమ్ (ఇన్ద్రమ్) ఐశ్వర్యవన్తమ్ (దేవమ్) దేదీప్యమానమ్ (భిషజమ్) వైద్యమ్ (సుయజమ్) సుష్ఠుసంగన్తారమ్ (ఘృతశ్రియమ్) ఘృతేనోదకేన శోభమానమ్ (పురురూపమ్) బహురూపమ్ (సురేతసమ్) సుష్ఠువీర్యమ్ (మఘోనమ్) పరమపూజిత ధనమ్ (ఇన్ద్రాయ) జీవాయ (త్వష్టా) ప్రకాశకః (దధత్) ధరన్ సన్ (ఇన్ద్రియాణి) శ్రోత్రాదీని ధనాని వా (వేతు) ప్రాప్నోతు (ఆజ్యస్య) జ్ఞాతుం యోగ్యస్య (హోతః) (యజ).

అన్వయః:- హే హోతర్యథా హోతా త్వష్టారం సురేతసం మఘోనం పురురూపం ఘృతశ్రియం సుయజం భిషజం దేవమిన్ద్రం యక్షదాజ్యస్యేన్ద్రాయేన్ద్రియాణి దధత్సన్ త్వష్టా వేతు తథా యజ. ॥౮॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే మనుష్యా యూయమాప్తం రోగ నివారకం శ్రేష్ఠౌషధ దాయకం ధనైశ్వర్యవర్ధకం వైద్యం సేవిత్వా శరీరాత్మాన్తః కరణేన్ద్రియాణాం బలం వర్ధయిత్వా పరమైశ్వర్యం ప్రాప్నుత. ॥౮॥

పదార్థము:-హోతః=శుభగుణప్రదాతా, ఎట్లు, హోతా=పథ్యాహార విహార కర్త, త్వష్టారమ్=ధాతు వైషమ్యము వలన జనించిన దోషములను నష్ట పఱచు సుందర పరాక్రమ యుక్తుడు, మఘోనమ్=పరమప్రశస్త ధనవంతుడు, పురురూపమ్=బహురూపములు గలవాడు, ఘృతశ్రియమ్=జలముతో శోభాయమానుడు, సుయజమ్=సుందర సంగమొనర్చువాడు, భిషజమ్=వైద్యుడు, దేవమ్=తేజస్వి, ఇన్ద్రమ్=ఐశ్వర్యవంతుడునగు పురుషునితో, యక్షత్=సంగమొనర్చుచున్నాడో, మఱియు, ఆజ్యస్య=

తెలిసికొనదగిన వచనమునకు, ఇన్ద్రియ=ప్రేరకుడైన జీవునికొఱకు,ఇన్ద్రియాణి=చెవి మొదలగు ఇంద్రియములను లేక ధనమును, దధత్=ధరించుచు, త్వష్టా=తేజస్వియగుచు, వేతు=పొందునో, అటులనే నీవును, యజ=పొందుము. [౯]

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఓ మానవులారా! మీరు అప్పుడు, సత్యవాది, రోగనివారకముగు సుందరమైన మందులనిచ్చువాడు, ధనైశ్వర్యములను పెంపొందజేయువాడునగు వైద్యుని సేవించి,శరీరాత్మాంతఃకరణేంద్రియములను పెంపొందజేసి పరమైశ్వర్యమును పొందుము. ౧౨౩౯[౯]

---

౧౦. హోతేత్యస్య ప్రజాపతి ర్ఋషిః బృహస్పతి ర్దేవతా। స్వరాడతి జగతీ ఛన్దః। నిషాదః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

హోతా యక్షద్వనస్పతి ఌ శమితారఌ శత క్రతుం ధియో

జోష్టారమిన్ద్రియమ్। మధ్వా సమఞ్జన్పథిభిః సుగేభిః స్వదాతి

యజ్ఞం మధునా ఘృతేన వేత్వాజ్యస్య హోతర్యజ॥ ॥౧౦॥

హోతా, యక్షత్, వనస్పతిమ్, శమితారమ్, శత క్రతుమితి శత+క్రతుమ్ ధియః, జోష్టారమ్, ఇన్ద్రియమ్. మధ్వా, సమ ఞ్జన్నితి సమ్+అఞ్జన్, పథిభిరితి పథి+భిః,సుగేభిరితి సు+గేభిః,స్వదాతి, యజ్ఞమ్, మధునా, ఘృతేన, వేతు ఆజ్యస్య, హోతః, యజ॥ ॥౧౦॥

పదార్థః:-(హోతా) (యక్షత్) (వనస్పతిమ్) వనానాం కిరణానాం స్వామినం సూర్యమ్ (శమితారమ్) యజమానమ్ (శతక్రతుమ్) అసంఖ్యాత ప్రజ్ఞమ్ (ధియః) ప్రజ్ఞాయాః కర్మణో వా (జోష్టారమ్) ప్రీతం సేవమానమ్ (ఇన్ద్రియమ్) ధనమ్(మధ్వా)మధురేణ విజ్ఞానేన(సమఞ్జన్) సమ్యక్ ప్రకటయన్ (పథిభిః) మార్గైః(సుగేభిః) సుఖేన గమనాధికరణైః (స్వదాతి)ఆస్వదేత. అత్ర వ్యత్యయేన పరస్మైపదమ్ (యజ్ఞమ్) సంగతం వ్యవహారమ్(మధునా)మధురేణ(ఘృతేన) ఆజ్యేనోదకేన వా (వేతు) వ్యాప్నోతు (ఆజ్యస్య) విజ్ఞేయస్య సంసారస్య (హోతః) దాతర్జన (యజ) ప్రాప్నుహి. ॥౧౦॥

అన్వయః:- హే హోతర్యథా హోతా వనస్పతిమివ శమితారం శతక్రతుం ధియో జోష్టా

రం యతున్మధ్వా సుగేభిః పథిభి రాజ్యస్యేన్ద్రియం సమఞ్జన్ స్వదాతి మధునా ఘృతేన యజ్ఞం వేతు తథా యజ. ॥౧౦॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యే మనుష్యాః సూర్యవద్విద్యా ప్రజ్ఞా ధర్మైశ్వర్య ప్రాపక ధర్మమార్గే గచ్ఛన్తః సుఖాని భుఞ్జీరంస్తేఽన్యేషామపి సుఖప్రదా భవన్తి.

పదార్థము:-హోతః=దానమొసగు పురుషుడా ! హోతా=యజ్ఞకర్త, వనస్పతిమ్=కిరణములకు స్వామియైన సూర్యునికి తుల్యుడు, శమితారమ్=యజమాని, శతక్రతుమ్=అనేకవిధములైన ప్రజ్ఞలు కలవాడు, ధియః జోష్టారమ్=బుద్ధినిలేక కర్మను ప్రసన్నముగా సేవించువాడునగు పురుషుని,యక్షత్=ఎటుల సంగమొనర్చునో,మధ్వా=మధురవిజ్ఞానముతో, సుగేభిః పథిభిః=సుఖపూర్వకముగ గమనమొనర్చుట కాధారమైన మార్గములద్వారా,ఆజ్యస్య=తెలిసికొనదగిన సంసారముయొక్క,ఇన్ద్రియమ్=ధనమును, సమఞ్జన్=బాగుగా ప్రకటించుచు,స్వదాతి=ఆస్వాదించునో,మఱియు మధునా=మధురమైన, ఘృతేన=ఘృతముచే లేక జలముచే, యజ్ఞమ్=సంగతికి యోగ్యమైన వ్యవహారమును, వేతు=పొందునో అటులనే మీరుకూడ. యజ=పొందుడు. [౧౦]

భావార్థము:- ఈమంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది. ఏమానవులు సూర్యుని వలె విద్యాబుద్ధి, ధర్మ, ఐశ్వర్యములను ప్రాప్తింపజేయు ధర్మయుక్తమార్గము లందుచరించుచు సుఖములను భోగింతురో, వారు ఇతరులకు సుఖమునొసగు వారగుచున్నారు, ౧౫౪౦[౧౦]



౧౫౪౧ హోతే త్యస్య ప్రజాపతి రృషిః। ఇన్ద్రో దేవతా। నిచృచ్ఛక్వరీ ఛన్దః। ధైవతః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

హోతా యక్షదిన్ద్రꣳస్వాహాజ్యస్య స్వాహా మేదసః స్వాహా

స్తోకానాꣳస్వాహా స్వాహా కృతీనాꣳస్వాహా హవ్యసూక్తీనామ్।

స్వాహా దేవా ఆజ్యపా జుషాణా ఇన్ద్ర ఆజ్యస్య వ్యన్తు హోతర్యజ॥౧౧॥

హోతా, యక్షత్, ఇన్ద్రమ్, స్వాహా, ఆజ్యస్య, స్వాహా, మేదసః, స్వాహా, స్తోకానామ్, స్వాహా,స్వాహా కృతీనామితి స్వాహా+కృతీనామ్,స్వాహా, హవ్యసూక్తీనామితి హవ్య+సూక్తీనామ్, స్వాహా, దేవాః, ఆజ్యపా ఇత్యాజ్య+పాః, జుషాణాః,

ఇన్ద్రి॰,ఆజ్యస్య, వ్యన్తు, హోతః, యజ॥ ॥౧౧॥

పదార్థః: (హోతా) (యక్షత్) (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమ్ (స్వాహా) సత్యాం వాచమ్ (ఆజ్యస్య) జ్ఞాతుమర్హస్య (స్వాహా) సత్యక్రియయా (మేదసః) స్నిగ్ధస్య (స్వాహా) (స్తోకానామ్) అపత్యానామ్ (స్వాహా) (స్వాహా) (కృతీనామ్) సత్యవాక్క్రియాఽనుష్ఠానానామ్ (స్వాహా) (హవ్యసూక్తీనామ్) బహూని హవ్యానాం సూక్తాని యాసు తాసామ్ (స్వాహా) (దేవాః) (విద్వాంసః) (ఆజ్యపాః) య ఆజ్యం పిబన్తి వాఽఽజ్యేన రక్షన్తి తే(జుషాణాః) ప్రీతాః (ఇన్ద్రి) పరమైశ్వర్యప్రదః (ఆజ్యస్య) (వ్యన్తు) (హోతః) (యజ). ॥౧౧॥

అన్వయః:-హే హోతర్యథేన్ద్రి హోతాఽఽజ్యస్య స్వాహా, మేదసః స్వాహా,స్తోకానాం స్వాహా, స్వాహాకృతీనాం స్వాహా, హవ్యసూక్తీనాం స్వాహేన్ద్రిం యక్షద్యథా స్వాహాఽఽజ్యస్య జుషాణా ఆజ్యపా దేవా ఇన్ద్రిం వ్యన్తు తథా యజ. ॥౧౧॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే పురుషా శరీరాత్మాఽపత్య సత్క్రియా విద్యానాం వృద్ధిం చికీర్షన్తి తే సర్వతః సుఖాపన్నా భవన్తి. ॥౧౧॥

పదార్థము:-హోతః=విద్యాదాతా ! ఎట్లు, ఇన్ద్రిః=పరమైశ్వర్యదాత యగు, హోతా=విద్యోన్నతిని గ్రహించువాడు, ఆజ్యస్య స్వాహా=తెలిసికొనదగిన శాస్త్రము యొక్క సత్యవాణిని, మేధసఃస్వాహా=స్నిగ్ధధాతువుయొక్క యథార్థక్రియను, స్తోకానామ్ స్వాహా=చిన్నపిల్లల యొక్క ఉత్తమ ప్రియవాక్కును, స్వాహా కృతీనామ్= సత్యవాగనుష్ఠానముల యొక్కయు క్రియల అనుష్ఠానముల యొక్కయు హోమక్రియను,హవ్యసూక్తీనామ్=అధికముగ గ్రహించ దగిన శాస్త్రములయొక్క సుందర వచనయుక్త బుద్ధుల ఉత్తమ క్రియాయుక్తమైన, ఇన్ద్రిమ్=పరమైశ్వర్యమును, యక్షత్= పొందునో ఎట్లు, స్వాహా=సత్యవాణిచే, ఆజ్యస్య=స్నిగ్ధవచనమును, జుషాణః=ప్రసన్న పడుచినవారు,ఆజ్యపాః=ఘృతాదులను త్రాగువారు లేక దానిచే రక్షణచేయువారు నైన,దేవాః=విద్వాంసులు ఐశ్వర్యమును, వ్యన్తు=పొందుదురో, అటుల నీవు యజ= యజ్ఞము చేయుము. [౧౧]

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఏపురుషులు శరీర, ఆత్మ,సంతాన, సత్కార, విద్యాదులను వృద్ధిచేయదలంచుచున్నారో వారుసమస్త విధముల సుఖయుక్తులగుచున్నారు. ౧౫౪౧[౧౧]

---

౧౫౪౨ దేవ మిత్యస్యా శ్వినా ఋషిః ఇన్ద్రో దేవతా। నిచృదతి జగతీ ఛన్దః। నిషాదః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

దేవం బర్హిరిన్ద్రిసుదేవం దేవైర్వీరవత్స్తీర్ణం వేద్యామవర్ధయత్ ।

వస్తోర్వృతం ప్రాక్తోర్భృత్తం రాయా। బర్హిష్మతోఽ
త్యగా ద్వసువనే వసుధేయస్య వేతు యజ॥ ॥౧౨॥

దేవమ్, బర్హిః, ఇన్ద్రమ్, సుదేవమితి సు+దేవమ్, దేవైః, వీరవదితి వీర+వత్, స్తీర్ణమ్, వేద్యామ్, అవర్ధయత్, వస్తోః, వృతమ్, ప్ర, అక్తోః, భృతమ్, రాయా, బర్హిష్మతః, అతి, అగాత్, వసువన ఇతి వసు+వనే, వసుధేయస్యేతి వసు+దేయస్య, వేతు యజ॥ ॥౧౨॥

పదార్థః:-(దేవమ్) దివ్యగుణమ్ (బర్హిః)అన్తరిక్షమివ బర్హిరిత్యన్తరిక్ష నా...నిఘం.౧.౩ (ఇన్ద్రమ్) పరమైశ్వర్యకారకమ్ (సుదేవమ్) శోభనం విద్వాంసమ్ (దేవైః) విద్వద్భిః (వీరవత్) వీరైస్తుల్యమ్ (స్తీర్ణమ్) కాష్ఠైర్విషా చాఽఽచ్ఛాదనీయమ్ (వేద్యామ్) హవనాధారే కుణ్డే (అవర్ధయత్) వర్ధయేత్ (వస్తోః) దినే (వృతమ్) స్వీకృతమ్ (ప్ర) (అక్తోః) రాత్రౌ (భృతమ్) ఘృతమ్ (రాయా) ధనేన (బర్హిష్మతః) అన్తరిక్షస్య సమ్బన్ధో విద్యతే యేషాం తాన్ (అతి) (ఉల్లఙ్ఘనే) (అగాత్) గచ్ఛతి (వసువనే) ధనానాం సంవిభాగే(వసుధేయస్య)వసూని ధేయాని యస్మింస్తస్య జగతః (వేతు) (యజ). ॥౧౨॥

అన్వయః:-హే విద్వన్ యథా బర్హిష్మతోఽత్యగాద్వసుధేయస్య వసువనే వేద్యాం స్తీర్ణం వస్తోర్వృతమక్తో ర్భృతం హుతం ద్రవ్యం నైరోగ్యం ప్రావర్ధయత్సుఖం వేతు తథా బర్హిరివ రాయా సహ దేవం దేవైః సహ వీరవద్వర్తమానం సుదేవమిన్ద్రం యజ. ॥౧౨॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా యజమానో వేద్యాం సమిత్సుచితం హుతఘృతమగ్నిం వర్ధయిత్వాఽన్తరిక్షస్థాని వాయుజలాదీని శోధయిత్వా రోగనివారణేన సర్వాన్ ప్రాణినః ప్రీణయతి తథైవ సజ్జనా జనా ధనాదినా సర్వాన్ సుఖయన్తి ॥౧౨॥

పదార్థము:-ఓ విద్వాంసుడా! ఎట్లు, బర్హిష్మతః=అంతరిక్షముతో సంబంధముగల వాయుజలములను, అతి అగాత్=ఉల్లంఘించునో, వసుధేయస్య=ధనములను ధారణ మొనర్పు జగత్తుయొక్క,వసువనే=ధనములను సేవించుటకై, వేద్యామ్=హవన కుండమందు, స్తీర్ణమ్=సమిధా ఘృతాదులతో రక్షింపదగినది,వస్తోః=పగటియందు, వృతమ్=స్వీకరించబడినది.అక్తోః=రాత్రియందు, భృతమ్=ధరించి హవనముచేయబడిన ద్రవ్యము నైరోగ్యమును, ప్ర అవర్ధయత్=బాగుగా పెంపొందజేయునో, మఱియు సుఖమును, వేతు=లభింపజేయునో అటులనే, బర్హిః=అంతరిక్షతుల్యుడు,రాయా దేవమ్=ధనముతో పాటు ఉత్తమ గుణములుకలవాడు, దేవైః=విద్వాంసులతో,వీరవత్=వీరులవలె నర్తమానుడు, ఇన్ద్రమ్=ఉత్తమైశ్వర్యమును కలుగజేయు వాడునగు, సుదేవమ్=సుందరవిద్వాంసుని,

యజ= సేవించుము, [౧౨]

భావార్థము,-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఎట్లు యజమానుడు వేదియందలి సమిధలందు బాగుగా హోమముచేసి నేయివేసి అగ్నిని ప్రజ్వలింపజేసి, అంతరిక్షవాయుజలాదులను శుద్ధమొనర్చి రోగనివారణమొనర్చి సకలప్రాణులను తృప్తిపఱచుచున్నాడో అటులనే సజ్జనులుధనాదులచేఅందఱినిసుఖవంతులుగనొనర్చుదురు.

---

౧౩ఆ౩ దేవీ రిత్యస్యా శ్వినా వృషీ। ఇన్ద్రో దేవతా। భురిక్ శక్వరీ ఛన్దః। పఞ్చమః స్వరః।
పునస్తమేవ విషయ మాహ.
మరల నదే విషయము.

దేవీర్ద్వార ఇన్ద్రఀసఙ్ఘాతే వీడ్వీర్యామ న్న వర్ధయన్।
ఆ వత్సేన తరుణేన కుమారేణ చ మీవతా పార్వాణఀరేణు
కకాటం నుదన్తాం వసువనే వసుధేయస్య వ్యన్తు యజ॥ ॥౧౩॥

దేవీః, ద్వారః, ఇన్ద్రమ్, సఙ్ఘాత+ఇతి సమ్+ఘాతే, వీడ్వీః, యామన్, అవర్ధయన్, ఆ, వత్సేన, తరుణేన, కుమారేణ, చ, మీవతా, అప, అర్వాణమ్, రేణుకకాటమితి రేణు+కకాటమ్, నుదన్తామ్, వసువన ఇతి వసు+వనే, వసుధేయస్యేతి వసు+ధేయస్య, వ్యన్తు, యజ॥ ॥౧౩॥

పదార్థః:-(దేవీః) దేదీప్యమానాః (ద్వారః) ద్వారాణి (ఇన్ద్రమ్) ఐశ్వర్యమ్ (సంఘాతే) సంబంధే (వీడ్వీః) విశేషేణ స్తోతుం యోగ్యాః (యామన్) యామని మార్గే (అవర్ధయన్) వర్ధయన్తి (ఆ) (వత్సేన) వత్సవద్వర్తమానేన (తరుణేన) యువావస్థేన (కుమారేణ) అకృతవివాహేన (చ) (మీవతా) హింసతా (అప) (అర్వాణమ్) గచ్ఛన్తమశ్వమ్ (రేణుకకాటమ్) రేణుభిర్వ్యాప్తం కూపమ్ (నుదన్తామ్) ప్రేరయన్తు (వసువనే) (వసుధేయస్య) (వ్యన్తు) ప్రాప్నువన్తు (యజ).

అన్వయః:-హే విద్వన్ యథా వీడ్వీ ర్దేవీ ర్ద్వారో రేణుకకాటం యామన్ వర్జయిత్వా తరుణేన మీవతా కుమారేణ వత్సేన చ సహ వర్తమాన మర్వాణ మిన్ద్ర మావర్ధయన్, వసువనే సఙ్ఘాతే వసుధేయస్య విఘ్న మపనుదన్తాం వ్యన్తు, తథా యజ. ॥౧౩॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే మనుష్యా యథా పథికా మార్గే వర్తమానం కూపం నివార్య శుద్ధం మార్గం కృత్వా ప్రాణినః సుఖేన గమయన్తి తథా బాల్యావస్థా

యాం వివాహాదీన్విఘ్నాన్నివార్య విద్యాం ప్రాపయ్య స్వసన్తానాన్ సుఖమార్గే గమయన్తు.

ఓ విద్వాంసుడా! ఎట్లు, వీడ్వీః=విశేషముగ స్తుతించదగినవి, దేవీః=ప్రకాశమానములునగు,ద్వారః=ద్వారములు,రేణుక కాటమ్=ధూళియుక్తకూపమును,అనగా చీకటి బావిని,యామన్=మార్గమునందువదలి,తరుణేన మీవతా=మష్టులనుహింసించు యువక కూరునితో, చ=మఱియు, కుమారేణ వత్సేన=దూడవలె ప్రజలతో వర్తమానుడగు బ్రహ్మచారితోకూడి, అర్వాణమ్=నడచుచున్న గుఱ్ఱమును,మఱియు ఇన్ద్రియమ్=ఐశ్వర్యమును, ఆ అవర్ధయన్=వెంపొందజేయునో, వసువనే = ధనమును సేవించదగిన, సజ్ఞూతే=సంబంధమున, వసుధేయస్య=ధనధారక సంసారముయొక్క విఘ్నమును, అప నుదన్తామ్=ప్రేరితమొనర్చుము. మఱియు, వ్యన్తు=పొందుము, అటుల, యజ=పొందుము. [౧౩]

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఓ మానవులారా! ఎట్లు బాటసారులు మార్గమున వర్తమానమైయున్న అంధకూపమును తప్పించి మార్గమును సరిచేయించి ప్రాణులను సుఖముగ చేర్చుచున్నారో అటులనే బాల్యావస్థయందు వివాహాది విఘ్నములను తొలగించి విద్యను ప్రాప్తింపజేసి స్వసంతానమును సుఖమార్గమున నడిపించవలయును. ౧౫౪౩[౧౩]

---

౧౫౪౪ దేవీ త్యస్యాశ్విచా వృషి। అహోరాత్రం దేవతే। స్వరాట్ పఙ్క్తిశ్ఛన్దః।పంచమః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

దేవీ ఉషాసా నక్తేన్ద్రం యజ్ఞే ప్రయత్య హ్వేతామ్। దైవీర్విశః

ప్రాయా సిష్టాం సుప్రీతే సుధితే వసువనే వసు ధేయస్య వీతాం యజ॥౧౪॥

దేవీ ఇతి దేవీ, ఉషాసానక్తా, ఉషసానక్తే త్యుషసా+నక్తా, ఇన్ద్రమ్,యజ్ఞే ప్రయతీతి ప్ర+యతి, అహ్వేతామ్, దైవీః, విశః, ప్ర, అయాసిష్టామ్, సుప్రీతే ఇతి సు+ప్రీతే, సుధితే ఇతి సు+ధితే, వసువన ఇతి వసు+వనే, వసుధేయస్యేతి వసు+ధేయస్య, వీతామ్, యజ॥ ॥౧౪॥

పదార్థః:-(దేవీ) దేదీప్యమానే (ఉషాసానక్తా) రాత్రిదినే (ఇన్ద్రమ్) పరమైశ్వర్యవన్తం యజమానమ్ (యజ్ఞే) సంగంతవ్యే యజ్ఞాదివ్యవహారే(ప్రయతి) ప్రయతన్తే యస్మింస్తత్ర (అహ్వేతామ్) ఆహ్వాయతః (దేవీః) దేవానాం న్యాయకారిణాం విదుషామిమాః (విశః) ప్రజాః (ప్ర)

(అయాసిష్టామ్) ప్రాప్నుతః (సుప్రీతే) సుష్ఠు ప్రీతి ర్యాభ్యాం తే (సుధితే) సుష్ఠు హితః తే (వసువనే) ధనవిభాగే (వసుధేయస్య) కోషస్య (వీతామ్) వ్యాప్నుతామ్ (యజ). ॥౧౪॥

అన్వయః:- హే విద్వన్ యథా సుప్రీతే సుధితే దేవీ ఉషాసానక్తా ప్రయతి యజ్ఞే ఇన్ద్రమహ్వేతాం వసుధేయస్య వసువనే దేవీర్విశః ప్రాయాసిష్టాం సర్వం జగద్వీతాం వ్యాప్నుతాం తథా యజ. ॥౧౪॥

భావార్థః:- అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే మనుష్యా యథాఽహోరాత్రం నియమేన వర్తిత్వా ప్రాణినో వ్యవహారయంతి తథా యూయం నియమేన వర్తిత్వా ప్రజా ఆనన్ద్య సుఖయత. ॥౧౪॥

పదార్థము:-ఓ విద్వాంసుడా! ఎట్లు, సుప్రీతే=సుందరప్రీతికి హేతువులు, సుధితే=మంచిహితకరములు, దేవీ=ప్రకాశమానములునగు, ఉషాసా నక్తా=రాత్రి పగలు, ప్రయతి=ప్రయత్నమునకు కారణమైన, యజ్ఞే=సంగతికి యోగ్యమగు యజ్ఞాది వ్యవహారము లందు, ఇన్ద్రమ్=పరమైశ్వర్యయుక్తుడగు యజమానుని, అహ్వేతామ్=ఆహ్వానించునో, వసుధేయస్య=ధనమును ధారణమొనర్చిన ధనాగారముయొక్క, వసువనే=ధనవిభాగమందు, దైవీః=న్యాయస్థులైన విద్వాంసులకు లభించిన ఈ, విశః=ప్రజలకు, ప్ర, అయాసిష్టామ్=ప్రాప్తములగు చున్నవో, మఱియు సర్వజగమునకు, వీతామ్=ప్రాప్తములగునో అటులనీవు, యజ=యజ్ఞమొనర్చుము. [౧౪]

భావార్థము,-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఓ మానవులారా! ఎట్లు రాత్రి పగలు నియమముగవర్తించి ప్రాణులయొక్క శబ్దాదివ్యవహారములను చేయించుచున్నవో, అటులనే మీరును నియమముగ ప్రవర్తించి ప్రజలకానందము కలుగజేసి సుఖము చేకూర్చుడు. ౧౭౪౪[౧౪]

---

౧౭౪౫ దేవీ ఇత్యస్యాశ్వి నావృషీ। ఇన్ద్రో దేవతా। భురిగతి జగతీ ఛన్దః। నిషాదః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

దేవీ జోష్ట్రీ వసు ధితీ దేవమిన్ద్ర మవర్ధతామ్ ।

అయావ్యన్యాఘా ద్వేషాంస్యాన్యా వక్షద్వసు వార్యాణి

యజమానాయ శిక్షితే వసువనే వసుధేయస్య వీతాం యజ॥ ॥౧౫॥

దేవీ ఇతి దేవీ, జోష్ట్రీ, ఇతి జోష్ట్రీ వసుధితీ ఇతి వసు+ధితీ, దేవమ్,

లందు సిద్ధపఱచిన పాకమును వండవలయును. [౬౦]

భావార్థము:-ఏమానవులు అగ్ని మొదలగువానిని ప్రయుక్తపఱచుటకై ఎనిమిది విధముల యంత్రములను నిర్మింతురో వారు సృష్టించబడిన ప్రసిద్ధపదార్థములతో ననేక కార్యములను సిద్ధపఱచగలరు. ౧౬౩౬[౬౦]

---

అస్మిన్నధ్యాయే అగ్నివిద్వద్గృహ ప్రాణాపానాఽధ్యాపకోపదేశక వాగశ్వాగ్ని విద్వత్ప్రశంసనీయ పదార్థ గృహద్వార రాత్రిదివశిల్పి శ్రీశస్త్రాస్త్ర సేనాజ్ఞాని రక్షా సృష్ట్యుపకారగ్రహణ విఘ్ననివారణ శత్రుసేనా పరాజయ స్వసేనా సంగరక్షణ పశుగుణయజ్ఞానాం నిరూపణాదేతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సంగతి రస్తీతి బోధ్యమ్.

ఈఅధ్యాయమందు, అగ్ని, విద్వాంసుడు; గృహము, ప్రాణాపానములు, అధ్యాపకోపదేశకులు, వాణి, అశ్వము, అగ్ని, విద్వాంసుడు, ప్రశస్తపదార్థములు, గృహద్వారములు, దివారాత్రములు, శిల్పి, శ్రీశస్త్రాస్త్రములు, సేన, జ్ఞానులరక్షణ, సృష్టివలన నుపకారగ్రహణము, విఘ్ననివారణము, శత్రుసేనాపరాజయము, స్వసైన్య సంగరక్షణలు, పశుగుణములు, యజ్ఞము వీని నిరూపణముండుట వలన నీయధ్యాయము యొక్క అర్థము పూర్వాధ్యాయమందు చెప్పబడిన అర్థముతో సంబంధము గలిగియున్నదని యెఱుంగవలయును

---

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం, పరమవిదుషాం శ్రీ విరజానంద
సరస్వతీస్వామినాం శిష్యేణ పరమహంస పరివ్రాజకాచార్యేణ శ్రీమద్దయానంద
సరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాంవిభూషితే సుప్రమాణ
యుక్తే యజుర్వేదభాష్యే ఏకోనత్రింశోఽధ్యాయః సంపూర్ణః.

★

కృష్ణామండలాంతర్గత కుందేరు గ్రామవాస్తవ్యులగు పాలడుగు
శేషాచలాచార్య, తదేవ మండలాంతర్గత ముదునూరు గ్రామవాస్తవ్యుడు
అన్నే కేశవార్యశాస్త్రి గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన శ్రీమద్దయానంద
సరస్వతీ నిర్మిత యజుర్వేద భాషాభాష్యమందలి యిరువది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

---



ఓమ్

## ముప్పదియవ అధ్యాయము - సంఘ నిర్మాణము

మానవసంఘము శ్రేష్ఠమైనది. మానవుడు సంఘజీవి. అతనిజీవనము ప్రాణులన్నిటికన్న మిన్న. అతనికొఱకే లోకము పుట్టినదా అని అనిపించును. కాని అతడును ఇంకొకరికై పుట్టి యున్నాడు. ఈ పరస్పరానురాగ భావమే సంఘమునకు ప్రాణము.

౨౪వఅధ్యాయములో ఆయా జంతువులు పిట్టలు ఎటుల ఉపయోగకరములో, ఎటుల హానికరములో వివరించబడినది. ప్రస్తుతమీ 30వ అధ్యాయములో మానవులెటుల ఉపక రించవలయునో చెప్పుచున్నాడు.

నేటివరకు వేదముల ఆశయము-ప్రయో జనము యజ్ఞకర్మలనియే భావించుచువచ్చిరి కాని మహర్షి వానిని సకలవిద్యల కాకరమని యుద్ఘోషించెను.

యజ్ఞమనగా జంతుబలి ప్రధానమైనదని పౌరాణికులు భావించిరి తదనుసారమీవేద ములోని౨౨-౨౯ అధ్యాయములను అశ్వమే ధయజ్ఞ ప్రకరణముగ భావించిరి. అటులనే యీ౩౦వ అధ్యాయమును పురుష మేధమవి నిర్ణయించిరి. కానిదయానందుడు౩౯వఅధ్యా యమును పురుషమేధముగ భావించి, మృతద హన సంస్కారముగ నిర్దేశించియుండెను.

ఉవ్వటుని భాష్య మీ మంత్రములకులేదు. మహీధరుని భాష్యమున్నది. అందు బ్రాహ్మ ణాది నలుబది యెనమండుగురను ప్రథమ యూపమునందును, మిగతా వారిలో ౧౧ గురు చొప్పున ౧౧ యూపములందును, చివ రకు మిగులు ౧౪మందిని పదమూడవయూప మునను, వివిధ రూపజంతువులను ఎనిమిదం టిని పదునాలుగవ యూపమున బంధించి యజ్ఞాంతమున బ్రాహ్మణాదులను వదలిపెట్టి ఎనిమిది పశువులను వధించ వలయుననియు, ఆ తర్వాత యజమాను డడవికి పోయి సన్న్య సించవలయుననియు ఉన్నది. అందలి యే శబ్ద ముల కీ యర్థము, కార్యనిర్దేశము జరుగగలదో అనూహ్యము. ఇందలిచతుర్థ్యంతములను దేవ తాపదములని మహీధరుడు నిర్దేశించెను. విచారశీలపాఠకుల మననార్థమింత పేర్కొ నుట భావ్యముగ భావించితిమి.

దయానందుడు పౌరాణిక భావనములకు స్వస్తిచెప్పి నిష్కళంకమైనభావములను ప్రద ర్శించెను. వేదము పేరుతో అప్పటివరకు నడచు సకలాచారభావములు నాటినుండి పౌరాణిక ములనియు, అవైదికములనియు భావించ బడసాగెను.

అనేక యుపజాతుల నిర్దేశమిందు జరిగిన దని పౌరాణికులమంతవ్యము. దయానందుడు వేదమునుఈశ్వరీయ జ్ఞానముగ భావించుటచే నిందు రూఢిశబ్దములు లేవనియు,యౌగికము లేయున్నవనియు, కనుకనవి నేటిజాత్యుపజా తుల భావమును బలపఱచ జాలవనియు నిరూ పించెను.

ఈయధ్యాయములో సుమారు ౧౭౦భిన్న భిన్నమనఃప్రవృత్తులుల్లేఖించ బడినవి, ఇందు శ్లాఘ్యములు నున్నవి, నింద్యములునున్నవి. సంఘోపయోగమునకై యిరువుర నెటులుప యోగించవలెను? ఇందు మొదటి నాలుగు మంత్రములైతే గాయత్రీ మంత్రవాక్యాలు. ౫ నుండి ౨౧ వరకున్న మంత్రములలో చతు ర్థ్యంత శబ్దములకు ద్వితీయాంత శబ్దములు చేర్చబడియున్నవి. కాని క్రియాపద మెద్దియు నుపయోగించబడలేదు. ౨౨వ మంత్రములో మాత్రము అచ్చటికే అన్వయుంచు నట్టుల "షతా అష్టా...ఆలభేత" అని చెప్పబడినది. వక్తయొక్క ఆశయమును గ్రహించుటకై

కొన్ని అనుక్తశబ్దములను ఊహించవలసియున్నది. దానినే అధ్యాహారమందురు ఇక్కడ యేశబ్దమునుఅధ్యాహార మొనర్పవలయును?

పరమభక్తుడైన దయానందుడు పరమపిత పరమదయాళువునగు పరమాత్ముని యాశయము గ్రహించినవాడై ప్రతి మంత్రమునందు రెండు విరుద్ధక్రియలను అధ్యాహార మొనర్చి వ్యాఖ్యానించెను. కొన్ని చతుర్థ్యంతములను ప్రయోజనార్థము నందు వ్యాఖ్యానించి, ఆయాసుకర్మలకై ఆయాసుగుణశీలుర సమకూర్చవలె ననియు, కొన్ని చతుర్థ్యంతములకు "ప్రవృత్తుడైన"అను అధ్యాహారమును చేర్చి ద్వితీయాంతమునకు విశేషణముగ వ్యాఖ్యానించి. అయా కుకర్ములను తొలగించవలెననియు రెండువిరుద్ధక్రియలను ప్రతి మంత్రమునందధ్యాహార మొనర్చిరి. విచారశీలురీ యధ్యాహారమును గాంచి పులకితులు కాకమానరు.

ఈఅధ్యాయమునందు దేవతలు వేర్వేరుగ నున్నారు. మానవసంఘ నిర్మాణమును నిర్దేశించిన మంత్రములలో కొన్నిటికి విద్వాంసులు,కొన్నిటికీశ్వరుడు.మఱికొన్నిటికి౧౪నుండిచివరివరకు ఈశ్వరుడు,రాజు ఇరువురు దేవతలుగనున్నారు.కనుకదయానందుడువిశేషించి వినిప్రతి పదార్థమునందు "ఓ పరమాత్మ! లేక ఓరాజా"అని సంబోధించియున్నాడు.

ఇహపరలోకములకు పరోక్షనియంత పరమాత్మ.ఈలోకపు ప్రత్యక్షనియంత రాజు.సంఘమును సంస్కరించి సుఖవంతముగ నొనర్చుటకు వీరిసహాయమావశ్యకముగదా!సంఘసంస్కర్త సంఘసేవకు డీయధ్యాయమును సూక్ష్మముగ విచారించి ఇందలి యాశయములను గ్రహించవలయును.

సంఘనిర్మాణ తత్పరులైన పాఠకులీభావములను గ్రహించి తనయింటినుండియే నీసంస్కరణలను అమలునందు బెట్టి లోకోపకార మొనర్పగలరని భావించుచున్నాము. అందులకై యీయధ్యాయమునందలి మనః ప్రవృత్తులఅనుక్రమణికయునిందుచేర్చుచున్నాము.

[ఆచార్యులు]

## ౩౦ వ అధ్యాయపు ద్వితీయాంతముల అనుక్రమణిక

[ఆచారార్యులు]

ఓమ్

# అథ త్రింశోఽధ్యాయ ఆరభ్యతే

ఇపుడు ముప్పదియవ అధ్యాయము * ఆరంభమగు చున్నది.

విశ్వానిదేవ సవిత ర్దురితాని పరాసువ । యద్భద్రం తన్న ఆసువ ॥౧॥

---

* 1981 విక్రమ శక అజ్మీరు వైదిక యంత్రాలయ సంస్కరణమునకు అనుకృతి.

ఈ అధ్యాయములో ౨౨ మంత్రములు. ౨౩ ఛందస్సులు, ౪౩౮ పదములు, ౧౪౦౮ అక్షరములున్నవి.

[అనువాదకులు]

౧౬౩౪ దేవేత్యస్య నారాయణ ఋషిః। సవితా దేవతా। త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
తత్రాదాదీశ్వరాత్కిం ప్రార్థనీయ మిత్యాహ.
ఈశ్వరు నేమి ప్రార్థించవలయును?

దేవ సవితః ప్రసువ యజ్ఞం ప్రసువ యజ్ఞపతిం భగాయ। దివ్యో

గన్ధర్వః కేతపూః కేతన్నః పునాతు వాచస్పతి ర్వాచన్నః స్వదతు ॥౧॥

దేవ, సవితరితి సవితః, ప్ర, సువ, యజ్ఞమ్, ప్ర, సువ, యజ్ఞ పతిమితి

యజ్ఞ+పతిమ్, భగాయ, దివ్యః, గన్ధర్వః, కేతపూరితి కేత+పూః, కేతమ్. నః,

పునాతు, వాచః, పతిః వాచమ్, నః, స్వదతు॥ ॥౧॥

పదార్థః:-(దేవ) దివ్యస్వరూప (సవితః) సకలైశ్వర్యయుక్త జగదుత్పాదక (ప్ర) ప్రకర్షేణ(సువ) సంపాదయ (యజ్ఞమ్) రాజధర్మాఖ్యమ్ (ప్ర) (సువ)ఉత్పాదయ (యజ్ఞపతిమ్) యజ్ఞస్య రాజ్యస్య పాలకం (భగాయ) ఐశ్వర్యయుక్తాయ ధనాయ. భగ ఇతి ధన నా....నిఘం ౨.౧౦.(దివ్యః) దివి శుద్ధస్వరూపే భవః (గన్ధర్వః) యో గాం పృథివీం ధరతి సః (కేతపూః) యః కేతం విజ్ఞానం పునాతి సః (కేతమ్) ప్రజ్ఞానమ్. కేత ఇతి ప్రజ్ఞా నా...నిఘం.౩.౯.(నః)అస్మాకమ్ (పునాతు) పవిత్రయతు (వాచస్పతిః) వాణ్యాః పాలకః (వాచమ్) వాణీమ్ (నః) అస్మాకమ్ (స్వదతు) ఆస్వాదయతు. ॥౧॥

అన్వయః:- హే దేవ సవితర్జగదీశ్వర త్వం యో దివ్యో గన్ధర్వః కేతపూ రాజా నః కేతం పునాతు. యో వాచస్పతి ర్నో వాచం స్వదతు,తం యజ్ఞపతిం భగాయ ప్రసువ,యజ్ఞఞ్చ ప్రసువ.

భావార్థః:- యో విద్యాశిక్షావర్ధకః శుద్ధ గుణకర్మ స్వభావో రాజ్యం పాతుం యథా యోగ్యైశ్వర్యవర్ధకో ధార్మికాణాం పాలకః పరమేశ్వరోపాసకః సకలశుభగుణాఢ్యో భవేత్స ఏవ రాజా భవితుం యోగ్యో భవతి. ॥౧॥

పదార్థము:- దేవ=దివ్యస్వరూపా! సవితః=సమస్తైశ్వర్య యుక్తా! జగత్తునుత్పత్తి జేయు జగదీశ్వరా! దివ్యః=శుద్ధస్వరూపుడు,గన్ధర్వః=పృథివిని ధరించువాడు, కేతపూః= విజ్ఞానమును పవిత్ర పఱచువాడునగునేరాజు, నః=మాయొక్క, కేతమ్=బుద్ధిని, పునాతు=పవిత్రపఱచునో మఱియు, వాచః పతిః=వాక్కుయొక్క రక్షకుడై ,నః వాచమ్=మావాక్కును,స్వదతు=మధురముగ ప్రియమైనదిగ నొనర్చునో,యజ్ఞపతిమ్= అట్టిరాజ్యరక్షకరాజును, భగాయ=ఐశ్వర్యయుక్త ధనమునిమిత్తము, ప్రసువ=ఉత్పన్న మొనర్చుము. మఱియు, యజ్ఞమ్=రాజ ధర్మరూప యజ్ఞమును కూడ, ప్ర సువ= సిద్ధపఱచుము. [౧]

భావార్థము:-ఎవడు విద్యార్థులను పెంపొందజేయువాడు,శుభగుణకర్మ స్వభావ యుక్తుడు, రాజ్యమును రక్షణ జేయుటకై యథా యోగ్యమున నైశ్వర్యమును పెంపొందజేయు వాడు, ధర్మాత్ములను రక్షించు వాడు, పరమేశ్వరోపాసకుడు, సమస్త శుభగుణయుక్తుడుగ నుండునో అట్టివాడే రాజగుటకు యోగ్యుడగుచున్నాడు. [౧]

---

౧౬౩౦ తత్సవితురిత్యస్య నారాయణ ఋషిః। సవితా దేవతా,నిచృద్గాయత్రీ ఛన్దః। షడ్జః స్వరః.
పునస్తమేవ విషయ మాహ,
మరల నదే విషయము.

తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి।
ధియో యో నః ప్రచోదయాత్॥ ॥౨॥

తత్. సవితుః, వరేణ్యమ్, భర్గః, దేవస్య, ధీమహి, ధియః. నః, ప్రచోదయాదితి ప్ర+చోదయాత్॥ ॥౨॥

పదార్థః:-(తత్)(సవితుః)సమగ్రస్య జగదుత్పాదకస్య సకలైశ్వర్యప్రదస్య(వరేణ్యమ్)వర్తుమర్హమత్యుత్తమమ్ (భర్గః) భృజ్జన్తి దుఃఖాని యస్మాత్తత్(దేవస్య) సుఖప్రదాతుః(ధీమహి)ధరేమ(ధియః) ప్రజ్ఞాః కర్మాణి వా (యః) (నః) అస్మాకమ్ (ప్రచోదయాత్) ప్రేరయేత్. ॥౨॥

అన్వయః:- హే మనుష్యా యో నో ధియః ప్రచోదయాత్ తస్య సవితుర్దేవస్య యద్వరేణ్యం భర్గో యథా వయం ధీమహి, తథా తద్యూయమపి దధేధ్వమ్. ॥౨॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః.యథా పరమేశ్వరో జీవాన శుభాచరణాన్నివర్త్య శుభాచరణే ప్రవర్తయతి,తథా రాజాపి కుర్యాత్.యథా పరమేశ్వరే పితృభావం కుర్వన్తి తథా రాజన్యపి కుర్యు ర్యథా పరమేశ్వరో జీవేషు పుత్రభావమాచరతి తథా రాజాపి ప్రజాసు పుత్రభావమాచరేత్ యథా పరమేశ్వరః సర్వదోషక్లేశాఽన్యాయేభ్యోనివృత్తోఽస్తి తథైవ రాజాపి భవేత్. ॥౨॥

పదార్థము:-ఓమానవులారా! యః=ఎవడు, నః ధియః=మాబుద్ధులను లేక కర్మలను, ప్రచోదయాత్=ప్రేరేపించునో అట్టి, సవితుః=సమస్తజగదుత్పాదకుడు,దేవస్య=సకలైశ్వర్యములను, మఱియు, సుఖములనొసగు ఈశ్వరునియొక్క, వరేణ్యం=గ్రహించదగినది అత్యుత్తమమైనది, భర్గః=దుఃఖములను నాశన మొనర్చునదియునగు నేశుద్ధ స్వరూపమున్నదో దానిని మేమెటుల, ధీమహి=ధరించుచున్నామో అటులనే, తత్=ఆశుద్ధస్వరూపమును మీరును ధరించుడు. [౨]

భావార్థము,-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. పరమేశ్వరు డెట్లుజీవులనుఅశుభాచరణములనుండి వేఱుపఱచి శుభాచరణములందు ప్రవృత్తపఱచుచు న్నాడో, అటులనే రాజను చేయవలయును. పరమేశ్వరు నెట్లు తండ్రిగా విశ్వసించు చున్నారో అటులనే రాజునుకూడ తలంచవలయును. పరమేశ్వరుడెటుల జీవుల యెడల పుత్రభావముతో వ్యవహరించుచున్నాడోఅటులనే రాజుకూడ ప్రజలయెడల పుత్రులవలె ప్రవర్తించవలయును. పరమేశ్వరుడెట్లు సకలదోషక్లేశాన్యాయములకు దూరముగవేరై యున్నాడో అటులనే రాజుకూడ నుండవలయును. [౨]



౧౬.౩౯ విశ్వానీత్యస్య నారాయణ ఋషిః। సవితా దేవతా। గాయత్రీ ఛన్దః। షడ్జః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ యద్భద్రం తన్న ఆ సువ॥ ॥౩॥

విశ్వాని, దేవ, సవితః, దురితానీతి దుః+ఇతాని, పరా, సువ, యత్, భద్రమ్, తత్, నః, ఆ, సువ॥ ॥౩॥

పదార్థః:-(విశ్వాని) సమగ్రాని (దేవ) దివ్యగుణకర్మ స్వభావ (సవితః) ఉత్తమగుణకర్మ స్వభావేషు ప్రేరక పరమేశ్వర దుష్టాచరణాని దుఃఖాని వా (పరా) దూరార్థే (సువ) గమయ (యత్) (భద్రమ్) భన్దనీయం ధర్మ్యాచరణం సుఖం వా(తత్) (నః)(అస్మభ్యమ్) (ఆ) సమన్తాత్ (సువ) జనయ. ॥౩॥

అన్వయః:-హే దేవ సవితస్త్వమస్మద్విశ్వాని దురితాని పరా సువ యద్భద్రం తన్న ఆ సువ.

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథోపాసితో జగదీశ్వరస్స్వభక్తాన్ దుష్టాచారాన్నివర్త్య శ్రేష్ఠాచారే ప్రవర్తయతి. తథా రాజాఽపి ప్రజా అధర్మాన్నివర్త్య ధర్మే ప్రవర్తయేత్,స్వయమపి తథా స్యాత్. ॥౩॥

పదార్థము:-దేవ=ఉత్తమ గుణకర్మస్వభావయుక్త! సవితః=ఉత్తమ గుణకర్మ స్వభావములకై ప్రేరేపించు పరమేశ్వరా! నీవు మాయొక్క, విశ్వాని దురితాని=సమస్త దుష్టాచరణలను, పరాసువ=దూరమొనర్చుము. మఱియు, యత్ భద్రం=కల్యాణకర ధర్మయుక్తాచరణము లేక సుఖమేదియున్నదో, తత్=దానిని,నః=మానిమిత్తము ఆసువ=బాగుగా నుత్పత్తిజేయుము. [౩]

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఎట్లు ఉపాసించబడిన జగదీశ్వరుడు తనభక్తులను దుష్టాచరణలనుండి నివృత్తపఱచి శ్రేష్ఠాచరణము లందు ప్రవృత్తపఱచుచున్నాడో అటులనే రాజుకూడ ప్రజల నధర్మమునుండి నివర్తించి

ధర్మమందు ప్రవర్తింపజేసి తానుకూడ నటులనే ప్రవర్తించవలయును. [౩]

---

౧౬౪౦ విభక్తారమిత్యస్య మేధాతిథిర్ఋషిః సవితా దేవతా, గాయత్రీ ఛన్దః। షడ్జః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

విభక్తారꣳ హవామహే వసోశ్చిత్రస్య రాధసః ।
సవితారం నృచక్షసమ్॥ ॥౪॥

విభక్తారమితి వి-భక్తారమ్, హవామహే, వసోః, చిత్రస్య, రాధసః ।
సవితారమ్, నృచక్షసమితి నృ+చక్షసమ్॥ ॥౪॥

పదార్థః:-(విభక్తారమ్) విభాజయితారమ్ (హవామహే) ప్రశంసేమ (వసోః) సుఖానాం వాసహేతోః (చిత్రస్య) అద్భుతస్య (రాధసః) ధనస్య (సవితారం) జనయితారమ్ (నృచక్షసమ్) నృణాం ద్రష్టారం పరమాత్మానమ్. ॥౪॥

అన్వయః:- హే మనుష్యా యం వసోశ్చిత్రస్య రాధసో విభక్తారం సవితారం నృచక్షసం వయం హవామహే తం యూయమప్యాహ్వయత. ॥౪॥

భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే రాజన్ యథా పరమేశ్వరః స్వస్వ కర్మానుకూలం సర్వజీవేభ్యః ఫలం దదాతి,తథా భవానపి దదాతు యథా జగదీశ్వరో యాదృశం యస్య కర్మ పాపం పుణ్యం యావ చ్చాఽస్తి తావదేవ తాదృశం తస్మై దదాతి.తథా త్వమపి యస్య యావద్వస్తు యాదృశం కర్మ చ తావత్తాదృశం చ తస్మై దేహి.యథా పరమేశ్వరః పక్షపాతం విహాయ సర్వేషు జీవేషు వర్తతే, తథా త్వమపి భవ. ॥౪॥

పదార్థము:-ఓమానవులారా! వసోః=సుఖములకు నివాసహేతువు,చిత్రస్య=ఆశ్చర్యరూపమునగు,రాధసః=ధనముయొక్క,విభక్తారం=విభాగమొనర్చువాడు, సవితారమ్=సమస్తోత్పాదకుడు, నృచక్షసమ్=సకల మానవులందు అంతర్యామిస్వరూపముతో సమస్తకార్యములను చూచువాడునగు నేపరమాత్మను మేము, హవామహే=ప్రశంసించెదమో అతనిని మీరుకూడ ప్రశంసించుడు. [౪]

భావార్థము:-ఈమంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఓరాజా!ఎట్లు పరమేశ్వరుడు సమస్తజీవులకు వానివాని కర్మానుకూలముగ ఫలిత మొసగుచున్నాడో అటులనే నీవుకూడ నొసగుము. ఎట్లు జగదీశ్వరుడు ఎవనియొక్క పాపపుణ్య రూపకర్మ లెటులఎంతగాయున్నవో అతనికి అటులనే ఫలితమునొసగుచున్నాడో అటులనే నీవుకూడ నెవనియొక్క వస్తువు లేక కర్మయెటులుండునో వానికటులనే అంతేఫలితమునొసగుము

పరమేశ్వరుడెట్లు పక్షపాతములేకుండ సమస్తజీవులందు వర్తించుచున్నాడో అటులనే నీవును వర్తించుము. [౪]

---

బ్రహ్మణ ఇత్యస్య నారాయణ ఋషిః। పరమేశ్వరో దేవతా। స్వరాడతి శక్వరీ ఛన్దః। పఞ్చమః స్వరః.

ఈశ్వర వద్రాజ్ఞాఽపి కర్తవ్య మిత్యాహ.

ఈశ్వరునివలె రాజుకూడ చేయవలయునను విషయము.

బ్రహ్మణే బ్రాహ్మణం క్షత్త్రాయ రాజన్యం మరుద్భ్యో వైశ్యం తపసే శూద్రం తమసే తస్కరం నారకాయ వీరహణం పాప్మనే క్లీబమాక్రయాయా అయోగూం కామాయ పుంశ్చలూ మతిక్రుష్టాయ మాగధమ్॥

బ్రహ్మణే, బ్రాహ్మణమ్, క్షత్త్రాయ, రాజన్యమ్, మరుద్భ్య ఇతి మరుత్+భ్యః, వైశ్యమ్, తపసే, శూద్రమ్, తమసే, తస్కరమ్, నారకాయ, వీరహణమ్, వీరహనమితి వీర+హనమ్, పాప్మనే, క్లీబమ్, ఆక్రయాయా ఇత్యా+క్రయాయై, అయోగూమ్, కామాయ, పుంశ్చలూమ్, అతిక్రుష్టాయేత్యతి+క్రుష్టాయ, మాగధమ్॥ ॥౫॥

పదార్థః-(బ్రహ్మణే) వేదేశ్వరవిజ్ఞానప్రచారాయ(బ్రాహ్మణమ్)వేదేశ్వరవిదమ్(క్షత్త్రాయ) రాజ్యాయ పాలనాయ వా (రాజన్యమ్) రాజపుత్రం (మరుద్భ్యః) పశ్వాదిభ్యః ప్రజాభ్యః (వైశ్యమ్) విక్షు ప్రజాసు భవమ్ (తపసే) సన్తాపజన్యాయ సేవనాయ (శూద్రమ్) ప్రీత్యా సేవకం శుద్ధికరమ్ (తమసే) అన్ధకారాయ ప్రవృత్తమ్ (తస్కరమ్) చోరమ్ (నారకాయ) నరకే దుఃఖబన్ధనే భవాయ కారాగారాయ (వీరహణమ్) యో వీరాన్ హన్తి తమ్ (పాప్మనే) పాపాచరణాయ ప్రవృత్తం (క్లీబమ్) నపుంసకమ్ (ఆక్రయాయై)ఆక్రమన్తి ప్రాణినో యస్యాం తస్యై హింసాయై ప్రవర్తమానం (అయోగూం) అయసా శస్త్రవిశేషేణ సహ గన్తారమ్ (కామాయ) విషయసేవనాయ ప్రవృత్తాన్ (పుంశ్చలూమ్) పుంభిః సహ చలితచిత్తాం వ్యభిచారిణీమ్(అతిక్రుష్టాయ) అత్యన్తనిన్దనాయ ప్రవర్తకమ్ (మాగధమ్) నృశంసమ్. ॥౫॥

అన్వయః-హే పరమేశ్వర రాజన్ వా త్వమత్ర బ్రహ్మణే బ్రాహ్మణం, క్షత్త్రాయ రాజన్యం,మరుద్భ్యో వైశ్యం,తపసే శూద్రం,సర్వతో జనయ.తమసే తస్కరం,నారకాయ వీరహణం, పాప్మనే క్లీబమాక్రయాయా అయోగూం, కామాయ పుంశ్చలూ మతిక్రుష్టాయ మాగధఞ్చ దూరే గమయ. ॥౫॥

భావార్థః:- హేరాజన్ యథా జగదీశ్వరో జగతి పరోపకారాయ పదార్థాన్ జనయతి దోషాన్నివారయతి,తథా త్వమిహ రాజ్యే సజ్జనానుత్కర్షయ, దుష్టాన్ నిఃసారయ, దణ్డయ, తాడయ చ యతః శుభగుణానాం ప్రవృత్తిర్దుర్వ్యసనానాఞ్చ నివృత్తిః స్యాత్. ॥౫॥

పదార్థము:-ఓపరమేశ్వరా! లేక రాజా! నీవీజగత్తులో,బ్రహ్మణే=వేదముయొక్కయు నీశ్వరునియొక్కయు జ్ఞానప్రచారార్థము, బ్రాహ్మణమ్=వేదేశ్వరులనెఱుగువానిని, క్షత్రాయ=రాజ్యము లేక రాజ్యరక్షణనిమిత్తము, రాజన్యం=రాజపుత్రుని మరుద్భ్యః=పశువు మొదలగు ప్రజలకొఱకు,వైశ్యమ్=ప్రజలలో ప్రసిద్ధుడైనవానిని,తపసే=సంతాపజన్య సేవలకొఱకు, శూద్రమ్=ప్రీతితో సేవచేయువానిని మఱియు శుద్ధిచేయు శూద్రుని నలువైపుల నుత్పన్న మొనర్చుము, తమసే= అంధకారము నిమిత్తము ప్రవృత్తుడైన, తస్కరం=చోరుని, నారకాయ=దుఃఖ సంబంధము నందు కలిగన కారాగారమునిమిత్తము, వీరహణం=వీరులను చంపువానిని, పాప్మనే=పాపాచరణకై ప్రవృత్తుడైన, క్లీబం=నపుంసకుని, ఆక్రయాయై=ప్రాణులు భీతాహములై పాఱిపోవునటుల హడలెత్తించుటకై హింసార్థముప్రవృత్తుడైన,అయోగూం=లోహనిర్మితాయుధ విశేషము ధరించి సంచరించు వానిని, కామాయ=విషయ సేవనార్థము ప్రవృత్తురాలు, పుంశ్చలూం=పురుషులసంపర్కముచే చంచలచిత్తురాలై మెలగునట్టివ్యభిచారిణీస్త్రీనిమఱియు,అతిక్రుష్టాయ=అధికముగ నిందించుటకై ప్రవృత్తుడైన, మాగధమ్=భట్టును దూరమొనర్చుము. [౫]

భావార్థము:-ఓరాజా! ఎట్లు పరమేశ్వరుడు జగత్తులో పరోపకారము నిమిత్తము పదార్థముల నుత్పత్తిచేయుచు దోషములను నివృత్తపఱచుచున్నాడోఅటులనే నీవీరాజ్యమందు సజ్జనుల నున్నతిపఱచి దుష్టులను తొలగించి దండించుము. అందువలన శుభగుణ ప్రవృత్తి, దుర్వ్యసన నివృత్తి యగుగాక! ౧౬౪౧[౫]

---

౧౬౪౨ నృత్తాయేత్యస్య నారాయణ ఋషిః। పరమేశ్వరో దేవతా। నిచృదష్టిశ్ఛన్దః। మధ్యమః స్వరః.

పునా రాజపురుషైః కిం కర్తవ్య మిత్యాహ.

మరల రాజపురుషు లేమిచేయవలయును?

నృత్తాయ సూతం గీతాయ శైలూషం ధర్మాయ సభాచరం

నరిష్ఠాయై భీమలం నర్మాయ రేభꣳహసాయ కారిమానన్దాయ స్త్రీషఖం

ప్రమదే కుమారీ పుత్రం మేధాయై రథకారం ధైర్యాయ తక్షాణమ్. ॥౬॥

నృత్తాయ, సూతమ్, గీతాయ, శైలూషమ్, ధర్మాయ, సభాచరమితి సభా

+చరమ్, నరిష్ఠాయై, భీమలం, నర్మాయ, రేభమ్, హసాయ, కారిమ్। ఆనన్దాయే త్యానన్దాయ, స్త్రీషఖమ్, స్త్రీసఖమితిస్త్రీ+సఖమ్, ప్రమద ఇతి ప్ర+మదే, కుమారీ పుత్రమితి కుమారీ+పుత్రమ్, మేధాయై, రథకారమితి రథ+కారమ్, ధైర్యాయ, తక్షాణమ్॥ ॥౬॥

పదార్థః:-(నృత్తాయ) నృత్యాయ (సూతమ్) క్షత్రియాద్ బ్రాహ్మణ్యాం జాతమ్(గీతాయ) గానాయ (శైలూషమ్) గాయనమ్ (ధర్మాయ) ధర్మరక్షణాయ (సభాచరమ్) యః సభాయాం చరతి తమ్ (నరిష్ఠాయై) అతిశయితా దుష్టా నరాః సన్తి యస్యాం తస్యై ప్రవృత్తం (భీమలం) యో భీమాన్ భయంకరాన్ లాత్యాదదాతి తమ్ (నర్మాయ) కోమలత్వాయ (రేభమ్) స్తోతారం. రేభ ఇతి స్తోతృనామ...నిఘం.౩.౧౬ (హసాయ) హసనాయ ప్రవృత్తమ్ (కారిమ్) ఉపహాసకర్తారం(ఆనన్దాయ)(స్త్రీషఖమ్)స్త్రియా మిత్రం పతిమ్(ప్రమదే)ప్రమాదాయ ప్రవృత్తం (కుమారీపుత్రం) వివాహాత్పూర్వం వ్యభిచారేణోత్పన్నం (మేధాయై) ప్రజ్ఞాయై (రథకారమ్) విమానాదిరచకం శిల్పినం (ధైర్యాయ) (తక్షాణం) తనూకర్తారం. ॥౬॥

అన్వయః:-హే జగదీశ్వర రాజన్ వా త్వం నృత్తాయ సూతం, గీతాయ శైలూషం, ధర్మాయ సభాచరం.నర్మాయ రేభమానన్దాయ స్త్రీషఖం,మేధాయై రథకారం, ధైర్యాయ తక్షాణమాసువ.నరిష్ఠాయై భీమలం, హసాయ కారిం, ప్రమదే కుమారీపుత్రం పరాసువ. ॥౬॥

భావార్థః:-రాజపురుషైః పరమేశ్వరోపదేశేన రాజాజ్ఞయా చ సర్వే శ్రేష్ఠా ధార్మికా జనా ఉత్సాహనీయా, హాస్యభయప్రమదా నివారణీయా,అనేకాః సభాః నిర్మాయ సర్వా వ్యవస్థాః శిల్పవిద్యోన్నతిశ్చ కార్యా. ॥౬॥

పదార్థము:-ఓజగదీశ్వరా; అథవా రాజా! నీవు,నృత్తాయ=నృత్యముచేయుటకై సూతం=క్షత్రియునివలన బ్రాహ్మణస్త్రీకిపుట్టిన సూతుని,గీతాయ=గానార్థము,శైలూషం=పాడునటుని,ధర్మాయ=ధర్మరక్షణకై,సభాచరమ్=సభయందుచరించు సభాపతిని, నర్మాయ=కోమలతా నిమిత్తము, రేభం=స్తుతించు వానిని, ఆనన్దాయ=ఆనందమును భోగించునిమిత్తము, స్త్రీ షఖమ్=స్త్రీతో మైత్రి గలిగియుండు పతిని,మేధాయై=బుద్ధి నిమిత్తము, రథకారమ్=విమానాదులను నిర్మించు శిల్పిని,ధైర్యాయ=ధైర్యము నిమిత్తము, తక్షాణమ్=సునిశితమైన కార్యమొనర్చు వడ్రంగిని ఉత్పన్నమొనర్చుము, నరిష్ఠాయై=అతిదుష్టనరుల గోష్ఠి నిమిత్తము ప్రవృత్తుడైన, భీమలమ్=భయంకర విషయములను గ్రహించువానిని, హసాయ=నవ్వులకై ప్రవృత్తుడగు, కారిమ్=ఎగతాళిచేయు వానిని, మఱియు, ప్రమదే=ప్రమాదము నిమిత్తము ప్రవృత్తుడైన, కుమారీపుత్రమ్= వివాహమునకు పూర్వము వ్యభిచారమువలన నుత్పన్నమైన వానిని దూరపఱచుము.

భావార్థము:- రాజపురుషులు పరమేశ్వరోపదేశమువలనను, రాజాజ్ఞచేతను సమస్త శ్రేష్ఠ ధర్మాత్ములకుత్సాహమొసగవలయును. పరిహాసము చేయువారిని భయముకలిగించువారిని నివృత్తపఱచి అనేకశిక్షలను నిర్మించి సకలవ్యవస్థలను, శిల్పవిద్యను ఉన్నతిపఱచు చుండవలయును. ౧౬౯౩.౩

---

౧౬౯౩ తపస ఇత్యస్య నారాయణ ఋషిః। విద్వాంసో దేవతాః। నిచృదష్టిశ్ఛన్దః। పఞ్చమః స్వరః.
పునస్తమేవ విషయ మాహ.
మరల నదే విషయము.

తపసే కౌలాలం మాయాయై కర్మారꣳ రూపాయ మణికారꣳ శుభే వపꣳ శరవ్యాయా ఇషుకారꣳ హేత్యై ధనుష్కారం కర్మణే జ్యాకారం దిష్టాయ రజ్జుసర్జం మృత్యవే మృగయు మన్తకాయ శ్వనినమ్॥ ॥౭॥

తపసే, కౌలాలమ్, మాయాయై, కర్మారమ్, రూపాయ, మణికారమితి మణి+కారమ్, శుభే, వపమ్, శరవ్యాయై, ఇషుకారమితీషు+కారమ్, హేత్యై. ధనుష్కారమ్, ధనుః కారమితి ధనుః+కారమ్, కర్మణే, జ్యాకారమితి జ్యా+కారమ్, దిష్టాయ, రజ్జు సర్జమితి రజ్జు+సర్జమ్, మృత్యవే, మృగయుమితి మృగ+యుమ్, అన్తకాయ, శ్వనినమితి శ్వ+నినమ్॥ ॥౭॥

పదార్థః:-(తపసే) తపనాయ (కౌలాలం) కులాలపుత్రం (మాయాయై) ప్రజ్ఞావృద్ధయే. మాయేతి ప్రజ్ఞా నా....నిఘం.౩.౯. (కర్మారం)యః కర్మాణ్యలం కరోతి తమ్ (రూపాయ) సురూపనిర్మాపకాయ (మణికారం)యో మణీన్ కరోతి తం (శుభే) శుభాచరణాయ (వపం)యో వపతి క్షేత్రాణి కృషీవల ఇవ విద్యాదిశుభాన్గుణాంస్తం(శరవ్యాయై)శరాణాం నిర్మాణాయ (ఇషుకారం) య ఇషూన్ బాణాన్ కరోతి తమ్ (హేత్యై) వజ్రాది శస్త్ర నిర్మాణాయ (ధనుష్కారం) యో ధనురాదీని కరోతి తం(కర్మణే) క్రియాసిద్ధయే (జ్యాకారం) యో జ్యాం ప్రత్యఞ్చాం కరోతి తమ్ (దిష్టాయ) దిశత్యతిసృజతి యేన తస్మై(రజ్జుసర్జం) యో రజ్జూః సృజతి తం (మృత్యవే) మృత్యుకరణాయ ప్రవృత్తం (మృగయుం) య ఆత్మనో మృగాన్ హన్తుమిచ్ఛతి తం వ్యాధం(అన్తకాయ)యో అన్తం కరోతి తస్మై హితకరం (శ్వనినం) బహుశ్వపాలం.॥౭॥

అన్వయః:- హే జగదీశ్వర నరేశ!వా త్వం తపసే కౌలాలం,మాయాయై కర్మారం,రూపాయ మణికారం, శుభే వపం,శరవ్యాయై ఇషుకారం,హేత్యై ధనుష్కారం,కర్మణే జ్యాకారం,

దుష్టాయ రజ్జుసర్జమాసువ, మృత్యవే మృగయుం,మన్తకాయ శ్వనినం పరాసువ. ॥౭॥

భావార్థః:- రాజపురుషైర్యథా పరమేశ్వరేణ సృష్టౌ రచనావిశేషా దర్శితాస్తథా శిల్పవిద్యయా సృష్టిదృష్టాన్తేన చ రచనా విశేషాః కర్తవ్యాః. హింసకాః శ్వపాలినశ్చాండాలాదయో దూరే నివాసనీయాః. ॥౭॥

పదార్థము:- ఓ జగదీశ్వరా! లేక రాజా! నీవు, తపసే=కుండలను కాల్చు తాపమును సహించుటకై, కౌలాలమ్=కులాలుని,మాయాయై=బుద్ధిని పెంచుటకై,కర్మారమ్=ఉత్తమ శోభిత కార్యమొనర్చగల వానిని, రూపాయ=సుందర స్వరూపమును నిర్మాణమొనర్చుటకై, మణికారమ్=మణిని చేయువానిని, శుభే=శుభాచరణార్థము, వపమ్= పొలమునందు విత్తనములను విత్తు కృషీవలునివలె విద్యాది శుభగుణములను విత్తువానిని, శరవ్యాయై=బాణములుచేయు నిమిత్తము, ఇషుకారమ్=బాణకర్తను, హేత్యై=వజ్రాది ఆయుధములుచేయు నిమిత్తము, ధనుష్కారమ్=ధనువు మొదలగు వాని నిర్మాతను, కర్మణే=క్రియాసిద్ధికై, జ్యాకారమ్=అల్లెత్రాడు చేయువానిని,దిష్టాయ=మఱియు అతిరచనకలిగించు దానినిమిత్తము, రజ్జుసర్జమ్=త్రాడునునిర్మించువానిని నుత్పన్న మొనర్చుడు, మఱియు, మృత్యవే = హత్యచేయుటకు ప్రవృత్తుడైన, మృగయుమ్=వ్యాధుని, మఱియు, అన్తకాయ=అంత మొనర్చువానికి హితమొనర్చు, శ్వనినమ్=అధికముగ కుక్కలను పెంచువానిని దూరమొనర్చుము. ।౭।

భావార్థము:- పరమేశ్వరు డెట్లు సృష్టియందు రచనా విశేషమును చూపెట్టెనో అటులనే రాజపురుషులు శిల్పవిద్యతో సృష్టియొక్క దృష్టాంతములతో విశేష రచనను చేయుచుండవలయును. మఱియు హింసకులను, కుక్కలను పెంచు చండాలురను దూరముగ నివసింపజేయవలయును. ॥౭॥

---

౨౦-౮ నదీభ్య ఇత్యస్య నారాయణ ఋషిః। విద్వాంసో దేవతాః,కృతిశ్ఛన్దః। నిషాదః స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

నదీభ్యః పౌఞ్జిష్ఠ మృక్షీకాభ్యో నైషాదం పురుష వ్యాఘ్రాయ
దుర్మదం గన్ధర్వాప్సరోభ్యో వ్రాత్యం ప్రయుగ్భ్య ఉన్మత్తꣳ
సర్పదేవజనేభ్యోఽప్రతి పద మయేభ్యః కితవ మీర్యతాయ అకితవం
పిశాచేభ్యో విదలకారీం యాతుధానేభ్యః కణ్టకీకారీమ్॥ ॥౮॥

నదీభ్యః, పౌఞ్జిష్ఠమ్, ఋక్షీకాభ్యః, నైషాదమ్,నైషాదమితి నై+షా

దమ్, పురుషవ్యాఘ్రాయేతి పురుష+వ్యాఘ్రాయ, దుర్మదమితి దుః+ మదమ్, గన్ధర్వాప్సరోభ్య ఇతి గన్ధర్వాప్సరః+భ్యః, వ్రాత్యమ్, ప్రయుగ్భ్య + ఇతి ప్రయుక్+భ్యః, ఉన్మత్త మిత్యుత్+మత్తమ్, సర్పదేవ జనేభ్య ఇతి సర్ప+ దేవ జనేభ్యః, అప్రతిపద మిత్య ప్రతి+పదమ్, అయేభ్యః, కితవమ్, ఈర్యతాయై, అకితవమ్, పిశాచేభ్యః, విదలకారీ మితి విదల+కారీమ్, యాతుధానేభ్య + ఇతి యాతు+ధానేభ్యః, కణ్టకీకారీ మితి కణ్టకీ+కారీమ్॥ ॥8॥

పదార్థః:-(నదీభ్యః) సరిద్వినాశాయ ప్రవృత్తం (పౌఞ్జిష్ఠం)పుక్కసం (ఋక్షీకాభ్యః)యా ఋక్షా గతీః కుర్వన్తి తాభ్యః ప్రవృత్తం (నైషాదం) నిషాదస్య పుత్రం (పురుషవ్యాఘ్రాయ) వ్యాఘ్ర ఇవ పురుషస్తస్మై హితం (దుర్మదం) దుర్గతో దుష్టో మదోఽభిమానం యస్య తం (గన్ధర్వాప్సరాభ్యః)గన్ధర్వాశ్చాప్సరసశ్చ తాభ్యః ప్రవృత్తం(వ్రాత్యం)అసంస్కృతం(ప్రయుగ్భ్యః) యే ప్రయుఞ్జతే తేభ్యః ప్రవృత్తం (ఉన్మత్తం) ఉన్మాదరోగిణం (సర్పదేవజనేభ్యః) సర్పాశ్చ దేవజనాశ్చ తేభ్యో హితం (అప్రతిపదం) అనిశ్చితబుద్ధిం (అయేభ్యః) య అయ్యన్తే ప్రాప్యన్తే పదార్థాస్తేభ్యః ప్రవృత్తం (కితవం) ద్యూతకారిణం (ఈర్యతాయై) కమ్పనాయ ప్రవృత్తం(అకితవం) అద్యూతకారిణం (పిశాచేభ్యః) పిశితా నష్టాఽఽశా యేషాం తే పిశాచాః, అథవా పిశితమవయవీభూతం నరక్తం వా మాంసమాచామన్తి భక్షయన్తీతి పిశాచాః.ఉభయథాపృషోదరాదిత్వాత్సిద్ధిః (విదలకారీమ్) యా విగతాన్దలాన్ కరోతి తామ్ (యాతుధానేభ్యః) యాన్తి యేషు తే యాతవో మార్గాస్తేభ్యో ధనం యేషాన్తేభ్యః ప్రవృత్తమ్ (కణ్టకీ కారీమ్) యా కంటకీం కరోతి తామ్ ॥౮॥

అన్వయః:- హే జగదీశ్వర నృప వా త్వం నదీభ్యః పౌఞ్జిష్ఠమృక్షీకాభ్యో నైషాదం పురుషవ్యాఘ్రాయ దుర్మదం, గన్ధర్వాప్సరోభ్యో వ్రాత్యం,ప్రయుగ్భ్య ఉన్మత్తం,సర్పదేవజనేభ్యోఽప్రతిపదమయేభ్యః కిత వమీర్యతాయా అకితవం, పిశాచేభ్యో విదలకారీం, యాతుధానేభ్యః కణ్టకీకారీం పరాసువ ॥౮॥

భావార్థః:- హే రాజన్ యథా పరమేశ్వరో దుష్టేభ్యో మహాత్మనో దూరే వాసయతి. దుష్టాః పరమేశ్వరాద్దూరే వసన్తి తథా:త్వం దుష్టేభ్యో దూరే వస. దుష్టాంశ్చ స్వతో దూరే వాసయ, సుశిక్షయా సాధూన్ సమ్పాదయ వా. ॥౮॥

పదార్థము:- ఓ జగదీశ్వరా! అథవా రాజా! నీవు, నదీభ్యః=నదులను భ్రష్టపఱచు నిమిత్తము ప్రవృత్తుడైన, పౌఞ్జిష్ఠమ్=పుక్కసుని, ఋక్షీకాభ్యః=గమనమొనర్చు స్త్రీల నిమిత్తము ప్రవృత్తుడైన, నైషాదమ్=నిషాదపుత్రుని, పురుషవ్యాఘ్రాయ=వ్యాఘ్రము వలె హింసకపురుషునకు హితకారియగు, దుర్మదమ్=దుష్టాభిమానిని, గన్ధర్వాప్సరో

భ్యః=పాడుచు నృత్యముచేయు స్త్రీలనిమిత్తము ప్రవృత్తుడైన, వ్రాత్యమ్=సంస్కార రహిత మానవుని, ప్రయుగ్భ్యః=ప్రయోగించువారి నిమిత్తము ప్రవృత్తుడైన, ఉన్మత్తమ్=ఉన్మాదరోగిని, సర్పదేవజనేభ్యః=సర్పములకు, మూర్ఖులకు హితకారియగు,అప్రతిపదమ్ = సంశయాత్ముని, అయేభ్యః = పొసగు పదార్థముల నిమిత్తము ప్రవృత్తుడైన, కితవమ్=జూదరిని:ఈర్యతాయై=కంపన నిమిత్తము ప్రవృత్తుడైన, అకితవమ్=జూదమాడనివానిని,పిశాచేభ్యః=దురాచారము లొనర్చుటచే ఆశను నష్టపఱచుకొన్నవానిని, లేక రక్తసహితముగ పచ్చిమాంసము తినుటకై ప్రవృత్తురాలైన, విదలకారీమ్=వేఱువేఱుగముక్కలుచేయు నామెను,మఱియు, యాతుధానేభ్యః=మార్గములనుండి ధనముతెచ్చువాని నిమిత్తము ప్రవృత్తురాలైన, కణ్టకీకారీమ్=కంటకములను ముండ్లను నాటునామెను వేఱుచేయుము. దూరమొనర్చుము. ॥౮॥

భావార్థము:- ఓ రాజా! పరమేశ్వరుడెట్లు దుష్టులనుండి మహాత్ములను దూరముగ నుంచుచున్నాడో, మఱియు దుష్టులు పరమేశ్వరునకు దూరముగ వసించుచున్నారో అటులనే నీవు దుష్టులకు దూరముగనుండి, దుష్టులను నీనుండి దూరముగ వసింపజేయుము. అథవా సుశిక్షచే శ్రేష్ఠులుగ నొనర్చుము. ॥౮॥



౧౬౹౯ సన్ధయ ఇత్యస్య నారాయణ ఋషిః। విద్వాన్ దేవతా। భురిగత్యష్టిశ్ఛన్దః। మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ.

మరల నదే విషయము.

సన్ధయే జారం గేహాయోపపతి మార్త్యై పరివిత్తం నిరృత్యై పరివివిదాన మరాద్ధ్యా ఏదిధిషుఃపతిం నిష్కృత్యై పేశస్కారీꣳ సంజ్ఞానాయ స్మరకారీం ప్రకామోద్యాయోపసదం వర్ణాయానురుధం బలాయోపదామ్॥

సన్ధయ+ఇతి సమ్+ధయే, జారమ్, గేహాయ, ఉపపతి మిత్యుప+పతిమ్, ఆర్త్యా ఇత్యా+ఋత్యై, పరివిత్త మితి పరి+విత్తమ్, నిరృత్యా ఇతి నిః ఋత్యై, పరివివిదాన మితి పరి+వివిదానమ్, అరాధ్యై, ఏదిధిషుః పతిమిత్యేదిధిషుః +పతిమ్, నిష్కృత్యై, నిః కృత్యా+ఇతి నిః కృత్యై, పేశస్కారీమ్, పేశః కారీ మితి పేశః+కారీమ్, సంజ్ఞానాయేతి సమ్+జ్ఞానాయ, స్మరకారీతి స్మర+కారీమ్,

ప్రకామోద్యాయేతి ప్రకామ+ఉద్యాయ. ఉపసద మిత్యు ప+సదమ్ వర్ణాయ, అను రుధ మిత్యను+రుధమ్, బలాయ, ఉపదామిత్యు ప+దామ్॥ ॥౯॥

పదార్థః:-(సన్ధయే) పరస్త్రీ సమాగమనాయ ప్రవర్తమానమ్ (జారమ్) వ్యభిచారిణమ్(గేహాయ) గృహపత్నీసఙ్గమాయ ప్రవృత్తమ్ (ఉపపతిమ్)యః పత్యుః సమీపే వర్తతే తమ్ (ఆర్త్యై) కామపీడాయై ప్రవృత్తమ్ (పరివిత్తమ్) కృతవివాహే కనిష్ఠే బన్ధావవివాహితం జ్యేష్ఠమ్ (నిర్‌ఋత్యై)పృథివ్యై ప్రవృత్తమ్.ని ఋతిరితి పృథివీనా...నిఘం.౧.౧(పరివివిదానమ్)అప్రాప్తదాయే జ్యేష్ఠే ప్రాప్తదాయం కనిష్ఠమ్ (అరాధ్యై) అవిద్యమాన సంసిద్ధయే ప్రవృత్తమ్ (ఏదిధిషుః పతిమ్) అకృతవివాహాయాం జ్యేష్ఠాయాం పుత్ర్యామూఢాకనిష్ఠా తస్యాః పతిమ్ (నిష్కృత్యై) ప్రాయశ్చిత్తాయ ప్రవర్తమానమ్ (పేశస్కారీమ్) రూపకర్త్రీమ్(సఞ్జ్ఞానాయ) సమ్యక్ జ్ఞానమ్ కామప్రబోధం తస్మై ప్రవృత్తామ్ (స్మరకారీమ్) యా స్మరం కామం కరోతి తాం దూతికామ్ (ప్రకామోద్యాయ) యః ప్రకృష్టైః కామైరుద్యతస్తస్మై (ఉపసదమ్) యః సమీపే సీదతి తమ్ (వర్ణాయ) స్వీకరణాయ ప్రవృత్తమ్ (అనురుధమ్) యోఽనురుణద్ధి తమ్ (బలమ్)బలవృద్ధయే (ఉపదామ్) ఉప సమీపే దీయతే తామ్ ॥౯॥

అన్వయః:- హే జగదీశ్వర సభేశ రాజన్ వా త్వం సన్ధయే జారం, గేహాయోపపతి మార్త్యై పరివిత్తం, నిర్‌ఋత్యై పరివివిధానమరాధ్యై ఏదిధిషుః పతిం నిష్కృత్యై పేశస్కారీం సఞ్జ్ఞానాయ స్మరకారీం ప్రకామోద్యాయోపసదం, వర్ణాయానురుధం, బలాయోపదాం పరాసువ.

భావార్థః:- హే రాజన్ యథా పరమేశ్వరో జారాదీన్ దుష్టాన్ దణ్డయతి తథా త్వమేతాన్దణ్డయ. యథేశ్వరః పాపత్యాగినో నిగృహ్ణాతి తథా త్వం ధార్మికాననుగృహాణ ॥౯॥

పదార్థము:- ఓ జగదీశ్వరా! లేక సభాపతి రాజా! నీవు, సన్ధయే=పరస్త్రీ గమనమునకై ప్రవృత్తుడైన, జారమ్=వ్యభిచారిని, గేహాయ=గృహపత్ని సంగమము నిమిత్తము ప్రవృత్తుడైన,ఉపపతిమ్=పతి కలిగియున్న నామెతో వ్యభిచరించు రెండవపతిని, ఆర్త్యై=కామపీడనిమిత్తము ప్రవృత్తుడైన,పరివిత్తమ్=తమ్మునకు పెండ్లికాగావివాహము కాని జ్యేష్ఠుని, నిర్‌ఋత్యై=పృథివి నిమిత్తము ప్రవృత్తుడైన, పరివివిదానమ్=జ్యేష్ఠుడు తనభాగము పంచుకొనకపూర్వమే భాగము పంచుకొనిన చిన్నతమ్ముని, అరాధ్యై=అవిద్యమాన పదార్థమును సాధించుటకై ప్రవృత్తుడైన, ఏదిధిషుఃపతిమ్=జ్యేష్ఠపుత్రికకు వివాహము కాకపూర్వమే వివాహితయైన చిన్నకుమార్తెపతిని, నిష్కృత్యై=ప్రాయశ్చిత్తము నిమిత్తము ప్రవృత్తురాలగు, పేశస్కారీమ్=శృంగార విశేషములచే రూపమును చూపెట్టు వ్యభిచారిణిని, సమ్ జ్ఞానాయ=ఉత్తమ కామదేవుని మేలుకొలుపుటకు ప్రవృత్తురాలైన,స్మరకారీమ్=కామమును రేకెత్తించు కుంటెనకత్తెను, ప్రకామోద్యాయ=ఉత్కృష్టకర్మలచే నుద్యతుడైనవానికై,ఉపసదమ్=స్నేహితుని,వర్ణాయ=స్వీకరించుటకు

ప్రవృత్తుడై, అనురుధమ్=వెనుకనుండి అడ్డుతగులువానిని, బలాయ=బలము నభివృద్ధి జేయు నిమిత్తము, ఉపదామ్=కానుకను, (నజరానాలను) అథవా లంచములను దూర పఱచుము. ॥౯॥

భావార్థము:- ఓ రాజా! పరమేశ్వరు డెట్లు జారాది దుష్టులను దండించుచున్నాడో అటులనే నీవును వీరిని దండించుము. మఱియు నీశ్వరు డెటుల పాపకర్మలను విడనాడువానిపై దయ చూపుచున్నాడో అటులనే నీవును ధార్మికుల ననుగ్రహించుచుండుము. [౯]

---

౧౬౪౬ ఉత్సాదేభ్య ఇత్యస్య నారాయణ ఋషిః।విద్వాన్ దేవతా। భురిగత్యష్టిశ్ఛన్దః। గాన్ధారః స్వరః.

పున స్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

ఉత్సాదేభ్యః కుబ్జం ప్రముదే వామనం ద్వార్భ్యః స్రామఁస్వప్నాయాన్ధ మధర్మాయ బధిరం పవిత్రాయ భిషజం ప్రజ్ఞానాయ నక్షత్ర దర్శ మా శిక్షాయై ప్రశ్నిన ముపశిక్షాయా అభిప్రశ్నినం మర్యాదాయై ప్రశ్నవివాకమ్॥

ఉత్సాదేభ్య ఇత్యుత్+సాదేభ్యః కుబ్జమ్, ప్రముద+ఇతి ప్ర+ ముదే వామనమ్, ద్వార్భ్య+ఇతిద్వాః+భ్యః, స్రామమ్, స్వప్నాయ, అన్ధమ్, అధర్మాయ, బధిరమ్, పవిత్రాయ,భిషజమ్, ప్రజ్ఞానాయేతి ప్ర+ జ్ఞానాయ,నక్షత్ర దర్శమితి నక్షత్ర+దర్శమ్, ఆశిక్షాయా ఇత్యా+శిక్షాయై, ప్రశ్నినమ్, ఉపశిక్షాయా+ఇత్యుప+ శిక్షాయై, అభిప్రశ్నిన మిత్యభి+ప్రశ్నినమ్, మర్యాదాయై, ప్రశ్న వివాకమితి ప్రశ్న +వివాకమ్॥ ॥౧౦॥

పదార్థః:- (ఉత్సాదేభ్యః)నాశేభ్యః ప్రవృత్తమ్(కుబ్జమ్)వక్రాఙ్గమ్(ప్రముదే) ప్రకష్టానన్దాయ (వామనమ్) హ్రస్వాఙ్గమ్ (ద్వార్భ్యః) సవర్ణేభ్య ఆచ్ఛాదనేభ్యః ప్రవృత్తమ్ (స్రామమ్)నత తం ప్రస్రవితజలనేత్రమ్ (స్వప్నాయ) నిద్రాయై (అన్ధమ్) (అధర్మాయ) ధర్మాచరణరహితాయ (బధిరమ్) శ్రోత్రవికలమ్ (పవిత్రాయ) రోగనివారణేన శుద్ధికరణాయ (భిషజమ్) వైద్యమ్ (ప్రజ్ఞానాయ) ప్రకష్టజ్ఞానవర్ధనాయ (నక్షత్రదర్శమ్) యో నక్షత్రాణి పశ్యతి తైః దర్శయతి వా తమ్ (ఆశిక్షాయై) సమన్తాద్విద్యోపాదానాయ (ప్రశ్నినమ్) ప్రశస్తాః ప్రశ్నా విద్యన్తే యస్య (ఉ

పశిక్షాయైః) ఉపవేదాదివిద్యోపాదానాయ (అభిప్రశ్నినమ్) అభితః బహవః ప్రశ్నా విద్యన్తే యస్య తమ్ (మర్యాదాయై) న్యాయాఽన్యాయవ్యవస్థాయై (ప్రశ్నవివాకమ్) యః ప్రశ్నాన్ వివేచయతి తమ్. ॥౧౦॥

అన్వయః:- హే పరమేశ్వర రాజన్! వా త్వముత్సాదేభ్యః కుబ్జం, ప్రముదే వామనం, ద్వార్భ్యః స్రామం, స్వప్నాయాఽన్ధమధర్మాయ బధిరం పరాసువ, పవిత్రాయ భిషజం, ప్రజ్ఞానాయ నక్షత్రదర్శమాశిక్షాయై ప్రశ్నినముపశిక్షాయా అభిప్రశ్నినం, మర్యాదాయై ప్రశ్నవివాకమాసువ.

భావార్థః:- హే రాజన్! యథేశ్వరః పాపాచరణఫలప్రదానేన కుబ్జవామనస్రవితజలనేత్రాన్ధబధిరాన్ మనుష్యాదీన్ కరోతి, భిషగ్జ్యోతిర్విదధ్యాపకపరీక్షకప్రశ్నోత్తరవివేచకేభ్యః శ్రేష్ఠకర్మఫలదానేన పవిత్రతా ప్రజ్ఞావిద్యాగ్రహణాధ్యాపన పరీక్షా ప్రశ్నోత్తరకరణ సామర్థ్యాఞ్చ దదాతి, తథైవ త్వం యేన యేనాఙ్గేన నరా విచేష్టన్తే తస్య తస్యాఙ్గస్యోపరి దణ్డనిపాతనేన వైద్యాదీనాం ప్రతిష్ఠాకరణేన చ రాజధర్మం సతతమున్నయ. ॥౧౦॥

పదార్థము:- ఓ పరమేశ్వర! లేక రాజా! నీవు, ఉత్సాదేభ్యః=నాశమొనర్చుటకు ప్రవృత్తుడైన, కుబ్జమ్=గూనివానిని, ప్రముదే=ప్రబల కామాద్యానందము నిమిత్తము, వామనమ్= పొట్టివానిని, ద్వార్భ్యః = ఆచ్ఛాదనార్థము, స్రామమ్=నేత్రములనుండి నిరంతరము నీళ్లుకారువానిని, స్వప్నాయ=నిద్రించుటకై, అన్ధమ్=అంధుని, మఱియు అధర్మాయ=ధర్మాచరణ లేనివాని నిమిత్తము, బధిరమ్=చెవిటివానిని వేఱుచేయుము మఱియు, పవిత్రాయ=రోగమును నివృత్తిపఱచుటకై, భిషజమ్=వైద్యుని, ప్రజ్ఞానాయ=ఉత్తమ జ్ఞానమును పెంపొందజేయు నిమిత్తము, నక్షత్రదర్శమ్=నక్షత్రములను చూచువానిని అథవా నక్షత్రములవలన నుత్తమ విషయములను చూపెట్టు గణితజ్ఞుడైన జ్యోతిష్కుని, ఆశిక్షాయై=బాగుగా విద్యను గ్రహించుటకై, ప్రశ్నినమ్=ప్రశంసిత ప్రశ్నకర్తను, ఉపశిక్షాయై=ఉపవేదాది విద్యలను గ్రహించుటకై, అభిప్రశ్నినమ్=సమస్త దిశలనుండి బహుప్రశ్నలు వేయువానిని, మఱియు, మర్యాదాయై=న్యాయాన్యాయములయొక్క వ్యవస్థనిమిత్తము, ప్రశ్న వివాకమ్=ప్రశ్నలకు వివేచించి సమాధానమొసగువాని నుత్పన్నమొనర్చుము. ॥౧౦॥

భావార్థము:- ఓ రాజా! ఈశ్వరు డెట్లు పాపాచరణముయొక్క ఫలిత మొసగుటచే అవిటి, కుంటి, గ్రుడ్డి (మరుగుజ్జు) ఎల్లప్పుడు కంటియందు పుసికట్టువాడు, చెవిటి, మూగ, మున్నగు మానవులను నిర్మించుచున్నాడో, మఱియు, వైద్యుడు, జ్యోతిష్కుడు, అధ్యాపకుడు, పరీక్షకుడు, ప్రశ్నోత్తర వివేచకుడు మొదలగువారికి శ్రేష్ఠ కర్మలఫలిత మొసగుటకై పవిత్రబుద్ధి, విద్యాగ్రహణము, అధ్యయనము, అధ్యాపనము, పరీక్షించుట ప్రశ్నోత్తరము లొనర్చుట మొదలగుసామర్థ్యముల నొసగుచున్నాడో, అటులనే నీవును ఏయేయంగములతో మానవులు విరుద్ధకార్యము లొనర్చుచున్నారో ఆయా అంగములకు తగినదండన విధించియు, వైద్యాదుల ప్రతిష్ఠగావించియు రాజధర్మమును నిరంత

రము ఉన్నతి పఱచుచుండుము. ॥౧౦॥



౧౬౪౭ అర్మేభ్య ఇత్యస్య నారాయణ ఋషిః। విద్వాన్ దేవతా। స్వరాడతిశక్వరీ ఛన్దః।పఞ్చమః స్వరః.
పున స్తమేవ విషయ మాహ.
మరల నదే విషయము.

అర్మేభ్యో హస్తిపం జవాయాశ్వపం పుష్ట్యై గోపాలం వీర్య్యాయా
విపాలం తేజసేఽజపాల మిరాయై కీనాశం కీలాలాయ సురాకారం
భద్రాయ గృహపశ్రేయసే విత్తధమాధ్యక్ష్యాయానుక్షత్తారమ్ ॥౧౧॥

అర్మేభ్యః, హస్తిపమితి హస్తి+పమ్, జవాయ, అశ్వపమిత్యశ్వ+పమ్, పుష్ట్యై గోపాల మితి గో+పాలమ్, వీర్య్యాయ, అవిపాల మిత్యవి+పాలమ్, తేజసే, అజపాల మిత్యజ+పాలమ్, ఇరాయై, కీనాశమ్, కీలాలాయ, సురాకార మితి సురా+కారమ్. భద్రాయ, గృహపమితి గృహ+పమ్ శ్రేయసే, విత్తధ మితి విత్త+ధమ్, అధ్యక్ష్యేత్యధి+అక్ష్యాయ, అనుక్షత్తారమిత్యను+క్షత్తారమ్॥

పదార్థః:- (అర్మేభ్యః) ప్రాపకేభ్యః (హస్తిపమ్) హస్తీనాం పాలకమ్ (జవాయ) వేగాయ (అశ్వపమ్) అశ్వానాం రక్షకం శిక్షకమ్ (పుష్ట్యై) రక్షణాయ (గోపాలమ్) గవాం పాలకమ్ (వీర్య్యాయ)వీర్య్యవృద్ధయే (అవిపాలమ్) అవీనాం రక్షకమ్ (తేజసే)తేజోవర్ధనాయ (అజపాలమ్) అజానాం రక్షకమ్ (ఇరాయై) అన్నాదివృద్ధయే. ఇరేత్యన్ననా...నిఘం ౨.౭(కీనాశమ్)కృషీవలమ్ (కీలాలాయ) అన్నాయ. కీలాల ఇత్యన్ననా...నిఘం.౨.౭ (సురాకారమ్)సోమనిష్పాదకమ్ (భద్రాయ) కల్యాణాయ (గృహపమ్) గృహాణాం రక్షకమ్ (శ్రేయసే) ధర్మార్థకామప్రాప్తయే (విత్తధమ్) యో విత్తం ధనం దధాతి తమ్(అధ్యక్ష్యాయ) అధ్యక్షాణాం భావాయ (అనుక్షత్తారమ్) సారథ్యనుకూలమ్. ॥౧౧॥

అన్వయః:- హే ఈశ్వర రాజన్!వా త్వమర్మేభ్యో హస్తిపం జవా యాఽశ్వపం, పుష్ట్యై గోపాలం,వీర్య్యాయావిపాలం,తేజసేఽజపాలమిరాయై కీనాశం,కీలాలాయ సురాకారం, భద్రాయ గృహపం, శ్రేయసే విత్తధమాధ్యక్ష్యాయాఽనుక్షత్తారమాసువ. ॥౧౧॥

భావార్థః:- రాజపురుషైః సుశిక్షితాన్ హస్తిరక్షకాదీన్ సఙ్గృహ్యైతైర్వ్యవహారాః సాధనీయాః. ॥౧౧॥

పదార్థము:-ఓ ఈశ్వరా! లేక రాజా! నీవు, అర్మేభ్యః=ప్రాప్తిని కలుగ జేయువారి నిమిత్తము, హస్తిపమ్=గజములరక్షకుని, జవాయ=వేగము నిమిత్తము, అశ్వపమ్=అశ్వ రక్షకుని అశ్వశిక్షకుని, పుష్ట్యై=పుష్టిని కలుగజేయుట్కై, గోపాలమ్=గోవులను పాలించు వానిని, వీర్యాయ=వీర్యాభివృద్ధికై, అవిపాలమ్=గొఱ్ఱెలవానిని, తేజసే=తేజోవృద్ధికై, అజపాలమ్=మేకలను పాలించు వానిని, ఇరాయై=అన్నాదుల నభివృద్ధి పరచుటకై, కీనాశమ్=కృషీవలుని, కీలాలాయ=అన్నము నిమిత్తము, సురాకారమ్=సోమఓషధియొక్క రసమును తీయువానిని. మఱియు, భద్రాయ=కల్యాణార్థము, గృహపమ్=గృహరక్షకుని, శ్రేయసే=ధర్మ, అర్థ, కామప్రాప్తి నిమిత్తము, విత్తధమ్=ధనమును ధరించువానిని, మఱియు, ఆధ్యక్షాయ= అధ్యక్షుల స్వత్తము నిమిత్తము, అనుక్షత్తారమ్=అనుకూల సారథిని ఉత్పన్న మొనర్పుము. [౧౧]

భావార్థము:-రాజపురుషులు మంచి శిక్షితులగు హయరక్షకాదులను గ్రహించి వారిచే ననేక వ్యవహారములను సాధించ వలయును. ॥౧౧॥

---

భాయా ఇత్యస్య నారాయణ ఋషిః। విద్వాన్ దేవతా। విరాట్పంక్తిః ఛన్దః। గాంధార స్వరః.

పునస్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

భాయై దార్వాహారం ప్రభాయా అగ్న్యేధం బ్రధ్నస్య విష్టపాయాభిషేక్తారం వర్షిష్ఠాయ నాకాయ పరివేష్టారం దేవలోకాయ పేశితారం మనుష్యలోకాయ ప్రకరితార సర్వేభ్యో లోకేభ్య ఉపసేక్తార మవఋత్యై వధాయోపమన్థితారం మేధాయ వాసఃపల్పూలీం ప్రకామాయ రజయిత్రీమ్॥

భాయై,దార్వాహారమితి దారు+ఆహారమ్, ప్రభాయా ఇతి ప్ర+భాయై, అగ్న్యేధ మిత్యగ్ని+ఏధమ్, బ్రధ్నస్య, విష్టపాయ, అభిషేక్తారమ్, అభిషేక్తార మిత్యభి+సేక్తారమ్, వరిష్ఠాయ, నాకాయ, పరివేష్టార మితి పరి+వేష్టారమ్, దేవలోకాయేతి దేవ+లోకాయ, పేశితారమ్, మనుష్యలోకా యేతి, మనుష్య+లోకాయ, ప్రకరితారమితి ప్ర+కరితారమ్, సర్వేభ్యః, లోకేభ్యః ఉపసేక్తారమిత్యుప + సేక్తారమ్, అవ ఋత్యా ఇత్యవ+ఋత్యై, వధాయ, ఉపమన్థితార మిత్యుప+మన్థితా

రమ్, మేధాయ, వాసఃపల్పూలీ మితి వాసః+పల్పూలీమ్, ప్రకామాయేతి ప్ర+కామాయ, రజయిత్రీమ్॥ ॥౧౨॥

పదార్థః:- (భాయై) దీప్త్యై (దార్వాహారమ్) యో దారూణి కాష్ఠాన్యాహరతి తమ్ (ప్రభాయై)(అగ్న్యేధమ్)అగ్నిశ్చైధశ్చ తత్ (బ్రధ్నస్య)అశ్వస్య. బ్రధ్న ఇత్యశ్వనా... నిఘం.౧.౧౪ (విష్టపాయ) విశన్తి యత్ర తస్మై మార్గాయ (అభిషేక్తారమ్) అభిషేకకర్తారమ్ (వర్షిష్ఠాయ) అతివృద్ధాయ శ్రేష్ఠాయ (నాకాయ) అవిద్యమానదుఃఖాయ (పరివేష్టారమ్) పరివేషణకర్తారమ్ (దేవలోకాయ) దేవానాం దర్శనాయ (పేశితారమ్) విద్యావయవ వేత్తారమ్ (మనుష్యలోకాయ) మనుష్యత్వదర్శనాయ (ప్రకరితారమ్) విక్షేప్తారమ్ (సర్వేభ్యః) (లోకేభ్యః) సంహతేభ్యః (ఉపసేక్తారమ్) ఉపసేచనకర్తారమ్(అవఋత్యై)విరుద్ధప్రాప్తయే (వధాయ) హననాయ ప్రవృత్తమ్ (ఉపమన్థితారమ్) సమీపే విలోడితారమ్ (మేధాయ) సఙ్గమాయ (వాసః పల్పూలీమ్) వాససాం శుద్ధికరీమ్ (ప్రకామాయ) ప్రకృష్టకామనాసిద్ధయే (రజయిత్రీమ్) వివిధరాగకారిణీమ్ ॥౧౨॥

అన్వయః:- హే జగదీశ్వర రాజన్ వా త్వం భాయై దార్వాహారం, ప్రభాయా అగ్న్యేధం, బ్రధ్నస్య విష్టపాయాభిషేక్తారం,వర్షిష్ఠాయ నాకాయ పరివేష్టారం,దేవలోకాయ పేశితారం, మనుష్యలోకాయ ప్రకరితారం, సర్వేభ్యో లోకేభ్య ఉపసేక్తారం, మేధాయ వాసః పల్పూలీం, ప్రకామాయ రజయిత్రీ మాసువ. అవఋత్యై వధాయోపమన్థితారం పరాసువ. ॥౧౨॥

భావార్థః:- రాజపురుషాదిమనుష్యైరీశ్వరసృష్టేః సకాశాత్సర్వాః సామగ్ర్యో గ్రాహ్యాస్తాభిః శరీరబలం విద్యాన్యాయప్రకాశో మహత్సుఖం రాజ్యాభిషేకాః దుఃఖవినాశో విద్వత్సఙ్గో మనుష్యస్వభావో వస్త్రాదిపవిత్రతా నిష్పాదనీయా విరోధశ్చ త్యక్తవ్యః. ॥౧౨॥

పదార్థము:-ఓ జగదీశ్వరా! అథవా రాజా! నీవు భాయై=దీప్తికొఱకు, దార్వాహారమ్=ఇంధనములు సమకూర్చు వానిని, ప్రభాయై=కాంతి శోభలకై, అగ్న్యేధమ్=అగ్నిని, ఇంధనములను, బ్రధ్నస్య=గుఱ్ఱముయొక్క, విష్టపాయ=మార్గము నిమిత్తము, అభిషేక్తారమ్=అభిషేకించి రాజుగా చేయువానిని, వర్షిష్ఠాయ=అతిశ్రేష్ఠము, నాకాయ=సమస్త దుఃఖరహితమునగు సుఖవిశేషము కొఱకు, పరివేష్టారమ్=వడ్డించువానిని, దేవలోకాయ=విద్వాంసుల ధర్మముకొఱకు, పేశితారమ్=విద్యయొక్క అవయవముల నెఱుగు వానిని, మనుష్యలోకాయ=మానవత్వమును చూచుటకు, ప్రకరితారమ్=విక్షేపమొనర్చు వానిని,సర్వేభ్యః లోకేభ్యః=సమస్త లోకముల కొఱకు, ఉపసేక్తారమ్=ఉపసేచన మొనర్చువానిని, మేధాయ=సంగమార్థము, వాసః పల్పూలీమ్=వస్త్రములను శుద్ధిజేయు ఓషధిని, మఱియు,ప్రకామాయ=ఉత్తమకోరిక సిద్ధికొఱకు, రజయిత్రీమ్=ఉత్తమమైన రంగులువేయు ఓషధిని ప్రకటించుము. మఱియు,అవఋత్యై=విరుద్ధముగ ప్రాప్తమగు,వధాయ=హత్యచేయుటకై ప్రవృత్తుడైన, ఉపమన్థితారమ్=తాడనాదులచే పీడనుకలుగజేయుదుష్టునిదూరమొనర్చుము. [౧౨]

భావార్థము:-రాజపురుషాది మానవులు ఈశ్వరనిర్మిత సృష్టినుండి సమస్తసామాగ్రిని గ్రహించి వానితో శారీరికబలమును విద్యాన్యాయములప్రకాశమును, గొప్ప సుఖమును, రాజ్యాభిషేకమును, దుఃఖ వినాశమును, విద్వాంసుల స్నేహమును, మానవులస్వభావమును, వస్త్రాదుల పవిత్రతను బాగుగా సంసిద్ధపఱచవలయును. విరోధమును త్యజించవలయును. ౧౭-౧౨ [౧౨]

---

౧౩ ఋతయ ఇత్యస్య నారాయణ ఋషిః। ఈశ్వరో దేవతా। కృతిశ్ఛన్దః। నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ

మరల నదే విషయము.

ఋతయే స్తేన హృదయం వైరహత్యాయ పిశునం వివిక్త్యై క్షత్తారమౌ

పద్రష్ట్ర్యాయానుక్షత్తారం బలాయానుచరం భూమ్నే పరిష్కన్దం

ప్రియాయ ప్రియవాదిన మరిష్ట్యా అశ్వసాదఀ స్వర్గాయ లోకాయ

భాగదుఘం వర్షిష్ఠాయ నాకాయ పరివేష్టారమ్॥ ॥౧౩॥

ఋతయే, స్తేన హృదయ మితి స్తేన+హృదయమ్, వైరహత్యా యేతి వైర+హత్యాయ, పిశునమ్, వివిక్త్యా+ఇతి వి+విక్త్యై,క్షత్తారమ్, ఔపద్రష్ట్ర్యా యేత్యౌప+ద్రష్ట్ర్యాయ, అనుక్షత్తార మిత్యను+క్షత్తారమ్, బలాయ, అనుచరమిత్యను +చరమ్ భూమ్నే, పరిస్కన్దమ్, పరిస్కన్ద మితి పరి+స్కన్దమ్, ప్రియాయ, ప్రియవాదిన మితి ప్రియ+వాదినమ్, అరిష్ట్యై, అశ్వసాద మిత్యశ్వ + సాదమ్, స్వర్గాయేతి స్వః+గాయ, లోకాయ, భాగదుఖమితి భాగ+దుఘమ్, వర్షిష్ఠాయ, నాకాయ, పరివేష్టార మితి పరి+వేష్టారమ్॥ ॥౧౩॥

పదార్థః:- (ఋతయే) హింసాయై ప్రవృత్తమ్ (స్తేనహృదయమ్) చోరస్య హృదయమివ హృదయమస్య తమ్ (వైరాహత్యాయ) వైరం హత్యా చ యస్మిన్ కర్మణి తస్మై ప్రవర్తమానమ్ (పిశునమ్) విరుద్ధసూచకమ్ (వివిక్త్యై) వివేకాయ (క్షత్తారమ్) క్షతాత్తారకం ధర్మాత్మానమ్ (ఔపద్రష్ట్ర్యాయ) ఉపద్రష్టృత్వాయ (అనుక్షత్తారమ్) (బలాయ)(అనుచరమ్) (భూమ్నే) బహుత్వాయ (పరిష్కన్దమ్) సర్వతో రేతసః సేక్తారమ్ (ప్రియాయ) ప్రీత్యై (ప్రియ

వాదినమ్) (అరిష్ట్యై) కుశలప్రాప్తయే(అశ్వసాదమ్) యోఽశ్వాన్ సాదయతి తమ్ (స్వర్గాయ) సుఖవిశేషాయ (లోకాయ) దర్శనాయ సఙ్ఘాతాయ వా (భాగదుఘమ్) యో భాగాన్ దోగ్ధి ప్రపిపర్తి తమ్(వర్షిష్ఠాయ) అతిశయేన వృద్ధాయ (నాకాయ) అవిద్యమానదుఃఖాయాఽఽనన్దాయ (పరివేష్టారమ్) పరితః సర్వతో వ్యాప్తవిద్యం విద్వాంసమ్. ॥౧౩॥

అన్వయః:- హే పరమాత్మన్ హే రాజన్ వా త్వమృతయే స్తేనహృదయం, వైరహత్యాయ పిశునం పరాసువ. వివిక్త్యై క్షత్తార మౌపద్రష్ట్ర్యాయానుక్షత్తారం, బలాయాఽనుచరం,భూమ్నే పరిష్కన్దం, ప్రియాయ ప్రియవాదినమరిష్ట్యా అశ్వసాదం,స్వర్గాయ లోకాయ భాగదుఘం, వర్షిష్ఠాయ నాకాయ పరివేష్టార మాసువ. ॥౧౩॥

భావార్థః:- రాజాదిమనుష్యై ర్దుష్టసఙ్గం విహాయ శ్రేష్ఠసఙ్గం విధాయ వివేకాదీన్యుత్పాద్య సుఖయితవ్యమ్. ॥౧౩॥

పదార్థము:-ఓపరమాత్మ! లేక రాజా! నీవు, ఋతయే=హింసచేయుటకు ప్రవృత్తుడైన, స్తేనహృదయం=చోరునివలె కపటము గలవానిని మఱియు, వైరహత్యాయ=వైరమునందు,హత్యకర్మలందుప్రవృత్తుడైన,పిశునమ్=నిందకుని వేఱుపఱచుము,వివిక్త్యై=యథార్థవిజ్ఞాననిమిత్తము,క్షత్తారం=తాడననుండిరక్షించుధర్మాత్ముని, ఔపద్రష్ట్ర్యాయ=ఉపద్రష్టయగుటకై,అనుక్షత్తారం=ధర్మాత్మునకు అనుకూలముగ వర్తించువానిని, బలాయ=బలముకొఱకు, అనుచరం=సేవకుని, భూమ్నే=సృష్టిఅధికమగుటకై,పరిష్కన్దం=సకలదిక్కులనుండి వీర్యముచే తడుపువానిని,ప్రియాయ=ప్రీతినిమిత్తము,ప్రియవాదినం=ప్రియవాదిని, అరిష్ట్యై=కుశలప్రాప్తికై, అశ్వసాదం=గుఱ్ఱముల నడుపువానిని, స్వర్గాయ=సుఖవిశేషమును,లోకాయ=చూచుటకు, లేక సంచితమొనర్చుటకు, భాగదుఘం=అంశములను పూర్ణపఱచువానిని, వర్షిష్ఠాయ=అతిశ్రేష్ఠము,నాకాయ=సమస్తదుఃఖరహితమునగు నానందముకొఱకు,పరివేష్టారం=సమస్తదిశలందు వ్యాపించిన విద్యగల విద్వాంసుని ప్రకటించుము, [౧౩]

భావార్థము:-రాజాద్యుత్తమ మానవులు దుష్టసాంగత్యమును త్యజించి శ్రేష్ఠుల స్నేహమొనర్చి వివేకాదులనుత్పన్నమొనర్చి సుఖులు కావలయును. ౧౬౯[౧౩]

---

౧౬౫౦ మన్యవ ఇత్యస్య నారాయణ ఋషిః। రాజేశ్వరౌ దేవతే। నిచృదత్యష్టిశ్ఛన్దః। గాన్ధారః స్వరః

పునస్తమేవ విషయమాహ.

మరల నదే విషయము.

మన్యవేఽయస్తాపం క్రోధాయ నిసరం యోగాయ యోక్తారఞ్ఛోకాయాఽభిసర్తారం క్షేమాయ విమోక్తార ముత్కూల నికూలేభ్య స్త్రిష్ఠినం వపుషే మానస్కృతఞ్ఛీలా యాఞ్జనీకారీం నిరృత్యై కోశకారీం యమాయాసూమ్॥

మన్యవే, అయస్తాప మిత్యయః+తాపమ్, క్రోధాయ, నిసరమితి ని+సరమ్, యోగాయ, యోక్తారమ్, శోకాయ, అభిసర్తార మిత్యభి+సర్తారమ్, క్షేమాయ, విమోక్తారమితి వి+మోక్తారమ్, ఉత్కూల నికూలేభ్య ఇత్యుత్కూల+నికూలేభ్యః, త్రిష్ఠినమ్, త్రిష్ఠినమితి త్రి+ష్ఠినమ్, వపుషే, మానస్కృతమ్, మానఃకృతమితి మానః+కృతమ్, శీలాయ, ఆఞ్జనీకారీ మిత్యాఞ్జనీ+కారీమ్, నిరృత్యా+ఇతి నిః+ఋత్యై, కోశకారీమితి కోశ+కారీమ్। యమాయ, అసూమ్॥ ॥1౪॥

పదార్థః:- (మన్యవే) ఆన్తర్యక్రోధాయ ప్రవృత్తమ్(అయస్తాపమ్)లోహసువర్ణ తాపకమ్ (క్రోధాయ) బాహ్యకోపాయ ప్రవృత్తమ్ (నిసరమ్) యో నిశ్చితం సరతి గచ్ఛతి తమ్ (యోగాయ) యుఞ్జన్తి యస్మింస్తస్మై (యోక్తారమ్) యోజకమ్ (శోకాయ) (అభిసర్తారమ్) అభిముఖ్యే గన్తారమ్ (క్షేమాయ) రక్షణాయ (విమోక్తారమ్) దుఃఖాద్విమోచకమ్ (ఉత్కూల నికూలేభ్యః) ఊర్ధ్వనీచతటేభ్యః (త్రిష్ఠినమ్) యే త్రిషు జలస్థలాన్తరిక్షేషు తిష్ఠన్తి తే త్రిష్ఠా బహవస్త్రిష్ఠా విద్యన్తే యస్య తమ్(వపుషే)శరీరహితాయ(మానస్కృతమ్) మనస్కృతేషు విచారేషు కుశలమ్ (శీలాయ)జితేన్ద్రియత్వాదిశీలినే (ఆఞ్జనీకారీమ్) ఆఞ్జనీః ప్రసిద్ధాః క్రియాః కర్తుం శీలం యస్యాస్తామ్ (నిరృత్యై) భూమ్యై (కోశకారీమ్) యా కోశం కరోతి తామ్ (యమాయ) దణ్డదానాయ ప్రవృత్తమ్ (అసూమ్) యాఽస్యతి ప్రక్షిపతి తామ్. ॥౧౪॥

అన్వయః:- హే జగదీశ్వర రాజన్ వా త్వం మన్యవేఽయస్తాపం,క్రోధాయ నిసరం. శోకాయాభిసర్తారం, యమాయాసూం పరాసువ. యోగాయ యోక్తారం, క్షేమాయ విమోక్తారముత్కూలనికూలేభ్యస్త్రిష్ఠినం. వపుషే మానస్కృతం, శీలాయాఽఽఞ్జనీకారీం, నిరృత్యై కోశకారీమాసువ.

భావార్థః:- హే రాజాదయో మనుష్యా యే తప్తం లోహమివ క్రుద్ధా అన్యేషాం పరితాపకా ధర్మ్యనియమానాం వినాశకాః స్యుస్తాన్ దణ్డయిత్వా యోగాభ్యాసకర్త్రాదీన్ సత్కృత్య సర్వత్ర యానగమకాన్ సఙ్గృహ్య యథావత్ సుఖం యుష్మాభి ర్వర్ధనీయమ్. ॥౧౪॥

పదార్థము,-ఓజగదీశ్వరా! అథవా సభాపతియైన రాజా! నీవు, మన్యవే=ఆన్తర్య క్రోధముకొఱకు ప్రవృత్తుడైన, అయస్తాపమ్=లోహమును లేక సువర్ణమును తపింప జేయువానిని, క్రోధాయ=బాహ్యక్రోధము నిమిత్తము ప్రవృత్తుడైన, నిసరమ్=నిశ్చితముగ నడచువానిని, శోకాయ=శోకముకొఱకు ప్రవృత్తుడైన, అభిగర్తారం=సమ్ముఖముగ నడచువానిని మఱియు,యమాయ=దండించుటకు ప్రవృత్తురాలైన,అసూమ్=క్రోధముతోనిటునటు హస్తాదులను జాచునామెను దూరమొనర్చుము. మఱియు,యోగాయ=యోగాభ్యాసముకొఱకు,యోక్తారం=యోగముచేయువానిని,క్షేమాయ=రక్ష

ణకై,విమోక్తారం=దుఃఖములనుండితప్పించువానిని,ఉత్కూలనికూలేభ్యః=పైకిక్రిందకు పార్శ్వములకు ఎక్కించుటకు దింపుటకు,త్రిష్ఠినమ్=జల,స్థల,ఆకాశము లందుండు విమానాది యానములుగల పురుషుని, వపుషే=శరీర హితముకొఱకు, మానస్కృతం=మనస్సుతోనాలోచించుటలో ప్రవీణుడై నవానిని,శీలాయ=జితేంద్రియత్వాద్యుత్తమ స్వభావములుగలవానికై ,అంజనీకారీం=ప్రసిద్ధక్రియలొనర్చు స్వభావముగల స్త్రీని, మఱియు, నిర్ఋత్యై=భూమికై ,కోశకారీం=కోశసంచయమొనర్చుస్త్రీనిఉత్పత్తిజేయుము.లేక ప్రకటించుము.

భావార్థము:-రాజాదిమానవులారా! ఎవరు తపించిన లోహమువలె క్రోధమును పొంది ఇతరులకు దుఃఖమును కలుగజేసి ధర్మనియమములను నష్టపఱచుదురో వారినిదండించి, యోగాభ్యాసాదులను చేయువారిని సత్కరించి సమస్తప్రదేశములందు వాహనములనునడిపించువారినిసమకూర్చి మీరుసుఖమునుయథావతుగా పెంపొందజేయవలెను.



౧౬.౫౧ యమాయేత్యస్య నారాయణ ఋషిః। రాజేశ్వరౌ దేవతే । విరాట్ కృతిశ్ఛన్దః। నిషాదః స్వరః
పునస్తమేవ విషయ మాహ.
మరల నదే విషయము.

యమాయ యమసూ మథర్వభ్యోఽవతోకాꣳ సంవత్సరాయ పర్యాయిణీం పరివత్సరాయా విజాతా మిదావత్స రాయా తీత్వరీ మిద్వత్సరాయా తిష్కద్వరీం వత్సరాయ విజర్జరాꣳ సంవత్సరాయ పలిక్నీ మృభుభ్యోఽజిన సన్ధꣳసాధ్యేభ్య శ్చర్మమ్నమ్॥ ॥౧౫॥

యమాయ, యమసూమితి యమ+సూమ్, అథర్వభ్య ఇత్యథర్వ+భ్యః, అవతోకా మిత్యవ+తోకాం, సంవత్సరాయ, పర్యాయిణీం, పర్యాయిణీమితి పరి+ఆయినీం, పరివత్సరాయేతి. పరి+వత్సరాయ, అవిజాతా మిత్యవి+జాతాం, ఇదావత్సరాయ, అతీత్వరీ మిత్యతి+ఇత్వరీం, ఇద్వత్సరాయే తీత్+వత్సరాయ, అతిష్కద్వరీం, అతిష్కద్వరీ మిత్యతి+ష్కద్వరీం, వత్సరాయ, విజర్జరామితి వి+జర్జరామ్ సంవత్సరాయ, పలిక్నీం, ఋభుభ్యఇత్యృభు+భ్యః, అజినసన్ధ మిత్యజిన+సన్ధం. సాధ్యేభ్యః. చర్మమ్నమితి చర్మ+మ్నమ్ ॥౧౫॥

పదార్థః :- (యమాయ) నియన్త్రే (యమసూమ్) యా యమాన్ నియన్తౄన్ సూతే తామ్ (అథర్వభ్యః) అహింసకేభ్యః (అవతోకామ్) నిరపత్యామ్(సంవత్సరాయ) (పర్యాయిణీమ్

పరితః కాలక్రమజ్ఞామ్ (పరివత్సరాయ) ద్వితీయవర్ష నిర్ణయాయ (అవిజాతామ్) అప్రసూతాంబ్ర హ్మచారిణీమ్ (ఇదావత్సరాయ) ఇదావత్సరస్తృతీయస్తత్రకార్యసంపాదనాయ. అత్రవర్ణవ్యత్య యః (అతీత్వరీమ్) అతిగమనశీలామ్ (ఇద్వత్సరాయ) పఞ్చమాయ వర్షాయ (అతిష్కద్వరీమ్) అతి శయేన యా స్కన్దతి జానాతి తామ్.(వత్సరాయ) సామాన్యాయ (విజర్జరామ్)విశేషేణ జర్జరీ భూతామ్ (సంవత్సరాయ) చతుర్థాయానువత్సరాయి, అత్రానోః పూర్వపదస్య లోపః (పలి క్నీమ్) శ్వేతకేశామ్ (ఋభుభ్యః) మేధావిభ్యః (అజినసన్ధమ్)జేతుమయోగ్యాన్ సందధాతి తమ్. అత్ర జి ధాతోః కర్మణి నక్ ఉ३.२. (సాధ్యేభ్యః) యే సాద్ధుం యోగ్యాస్తేభ్యః (చర్మమ్నమ్) యశ్చర్మ విజ్ఞానం మ్నాత్యభ్యస్యతి తమ్. ॥१५॥

అన్వయః:- హే జగదీశ్వర రాజన్ వా త్వం యమాయ యమసూ మథర్వభ్యోఽవతో కాం, సంవత్సరాయ పర్యాయిణీం.పరివత్సరాయా విజాతా మిదావత్సరాయా తీత్వరీ మిద్వత్స రాయాతిష్కద్వరీం,వత్సరాయ విజర్జరాం,సంవత్సరాయ పలిక్నీ మృభుభ్యోఽజినసన్ధం,సాధ్యేభ్య శ్చర్మమ్నమాసువ, ॥१५॥

భావార్థః:- ప్రభవాదిషష్టిసంవత్సరేషు పఞ్చ పఞ్చ కృత్వా ద్వాదశ యుగాని భవన్తి. ప్రత్యేకయుగే క్రమేణ సంవత్సరపరివత్సరేదావత్సరానువత్సరే ద్వత్సరాః పఞ్చసఙ్జ్ఞా భవన్తి. తాన్ సర్వకాలావయవమూలాన్ విశేషతయా యాః స్త్రియో యథావద్విజ్ఞాయ వ్యర్థన్న నయన్తి.తాః సర్వార్థసిద్ధి మాప్నువన్తి. ॥१५॥

పదార్థము:—ఓజగదీశ్వరా! లేక రాజా! నీవు, యమాయ=నియమకర్త కొఱకు, యమసూమ్=నియంతల నుత్పత్తిజేయునామెను,అథర్వభ్యః=అహింసకుల నిమిత్తము, అవతోకాం=సంతానముదగ్గరలేని స్త్రీని,సంవత్సరాయ=ప్రథమసంవత్సరార్థము, పర్యా యిణీం=సర్వదిశలనుండికాలక్రమమును తెలుసుకొనగలనామెను,పరివత్సరాయ=రెండవ వర్షమునిర్ణయమునకై,అవిజాతాం=బ్రహ్మచారిణియగు బిడ్డలుగనని కన్యను, ఇదావత్స రాయ=మూడవ ఇదావత్సరమున కార్యసాధనార్థము, అతీత్వరీం=అత్యంతము నడచు నామెను,ఇద్వత్సరాయ=ఐదవఇద్వత్సరజ్ఞానార్థము,అతిష్కద్వరీమ్=అతిశయముగ తెలు సుకొనునామెను,వత్సరాయ=సామాన్య సంవత్సరము కొఱకు, విజర్జరాం=వృద్ధస్త్రీని, సంవత్సరాయ=నాల్గవ అనువత్సరము కొఱకు, పలిక్నీం=శ్వేతకేశములుగల నామెను, ఋభుభ్యః=బుద్ధిమంతుల నిమిత్తము, అజినసన్ధం=జయించుటకు శక్యముగాని పురుషు లతో మైత్రినెఱపువానిని, సాధ్యేభ్యః=మఱియు సాధనయోగ్యకార్యములనిమిత్తము. చర్మమ్నమ్=విజ్ఞానశాస్త్రాభ్యాసముచేయు పురుషుని ఉత్పత్తిచేయుము. [१५]

భావార్థము:-ప్రభవాది ६० సంవత్సరములలో నైదేసి చొప్పున १२ పన్నెండు యుగములగుచున్నవి,అప్రతియొక్కయుగమునందుక్రమముగసంవత్సరము,పరివత్సరము ఇదావత్సరము,అనువత్సరము,ఇద్వత్సరము అని ఐదుసంజ్ఞలు కలవు.కావున నాకాలముల యొక్కఅవయవములన్నిటిని, అన్నిమూలసంవత్సరములను విశేషముగ నేస్త్రీలు యథా

వతుగా తెలిసికొని వ్యర్థముగపోగొట్టరో వారు సమస్తప్రయోజనసిద్ధినిపొందుచున్నారు.

---

౧౬.౩౦ సరోభ్య ఇత్యస్య నారాయణ ఋషిః। రాజేశ్వరౌ దేవతే। విరాట్ కృతిశ్ఛన్దః। నిషాదః స్వరః
పునస్తమేన విషయమాహ.

మరల నదే విషయము.

సరోభ్యో ధైవరం ముపస్థావరాభ్యో దాశం వైశన్తాభ్యో వైన్దం నడ్వ
లాభ్యః శౌష్కలం పారాయ మార్గార మవారాయ కేవర్తం తీర్థేభ్య
ఆన్దం విషమేభ్యో మైనాలꣳ స్వనేభ్యః పర్ణకం గుహాభ్యః కిరాతꣳ
సానుభ్యో జమ్భకం పర్వతేభ్యః కిమ్పూరుషమ్ ॥౧౬॥

సరోభ్య+ఇతి సరః + భ్యః, ధైవరమ్, ఉపస్థావరాభ్య ఇత్యుప+స్థావరాభ్యః, దాశమ్, వైశన్తాభ్యః, వైన్దమ్, నడ్వలాభ్యః, శౌష్కలమ్, పారాయ, మార్గారమ్, అవారాయ, కేవర్తమ్, తీర్థేభ్యః, ఆన్దమ్, విషమేభ్య ఇతి వి+సమేభ్యః, మైనాలమ్, స్వనేభ్యః, పర్ణకమ్, గుహాభ్యః, కిరాతమ్, సానుభ్య, ఇతిసాను+భ్యః జమ్భకమ్, పర్వతేభ్యః, కిమ్పూరుషమ్, కిమ్పురుష మితి కిమ్+పురుషమ్ ॥౧౬॥

పదార్థః:- (సరోభ్యః) తడాగేభ్యస్తారణాయ (ధైవరమ్) ధీవరస్యాపత్యమ్ (ఉపస్థావరాభ్యః) ఉపస్థితాభ్యోఽవరాభ్యో నికృష్టక్రియాభ్యః. (దాశమ్)దాశత్యస్మై తమ్ (వైశన్తాభ్యః) వేశన్తా అల్పజలాశయా స్తా ఏవ తాభ్యః(వైన్దమ్) నిషాదస్యాపత్యమ్.(నడ్వలాభ్యః) నడా విద్యన్తే యాసు భూమిషు తాభ్యః (శౌష్కలమ్) యశ్శుష్కలైర్మత్స్యైర్జీవతి తమ్(పారాయ) మృగకర్మసమాప్త్యర్థం ప్రవృత్తమ్. (మార్గారమ్) యో మృగాణామరిర్వ్యాధస్తస్యాపత్యమ్ (అవారాయ) అర్వాచీన మాగమనాయ (కేవర్తమ్)జలే నౌకాయాః పరావారయోర్గమకమ్(తీర్థేభ్యః) తరన్తి యైస్తీర్యన్తే వా తేభ్యః (ఆన్దమ్) బన్ధితారమ్ (విషమేభ్యః) నికటదేశేభ్యః (మైనాలమ్) యో మైనం కామదేవమలతి వారయతి తం జితేన్ద్రియమ్ (స్వనేభ్యః) శబ్దేభ్యః(పర్ణకమ్)యః పర్ణేషు పాలనేషు కుత్సితస్తమ్ (గుహాభ్యః) కన్దరాభ్యః (కిరాతమ్) జనవిశేషమ్ (సానుభ్యః)శైలశిఖరేభ్యః (జమ్భకమ్) యో జమ్భయతి నాశయతి తమ్.(పర్వతేభ్యః) గిరిభ్యః (కిమ్పూరుషమ్) జాఙ్గలం కుత్సితం మనుష్యమ్. ॥౧౬

అన్వయః:- హే జగదీశ్వర రాజన్ వా! త్వం సరోభ్యో ధైవరముపస్థావరాభ్యో దాశం"

వై॒శ॒న్తాభ్యో॒ వైన్దం,నడ్వలాభ్యః శౌష్కలం,విష॒మేభ్యో॒ మైనాలమవారాయ కేవ॒ర్తం,తీర్థేభ్య ఆన॒న్దమాసువ.పారాయ మార్గారం, స్వనేభ్యః పర్ణకం,గుహాభ్యః కిరాతం,సానుభ్యో జమ్భకం, పర్వ॒తేభ్యః కిమ్పూరుషం పరాసువ. ॥౧౬॥

భావార్థః:- మనుష్యా ఈశ్వరగుణకర్మస్వభావానుకూలైః కర్మభి ర్ధీవరాదీన్ సంరక్ష్య, వ్యాధాదీన్ పరిత్యజ్యోత్తమం సుఖం ప్రాప్నువన్తు. ॥౧౬॥

పదార్థము,-ఓజగదీశ్వరా! లేక రాజా! నీవు,సరోభ్యః=తటాక[తరణ]నిమిత్తము, ధై॒వరమ్=పల్లెవాని కుమారుని, ఉపస్థావరాభ్యః=సమీపస్థ నికృష్టక్రియల నిమిత్తము,దాశమ్=ఏమైనాపొందు సేవకుని, వై॒శన్తాభ్యః=చిన్నచిన్నజలాశయముల ప్రబంధముకొఱకు, వైన్దం=నిషాదుని సంతానమును, నడ్వలాభ్యః=కీకసగడ్డియున్నభూమికై, శౌష్కలమ్=చేపలతోజీవించువానిని, విష॒మేభ్యః=వికటదేశములకొఱకు, మైనాలం=కామదేవు నడ్డగించువానిని,అవారాయ=తనవైపు[ఒడ్డు]నకువచ్చుటకై, కేవ॒ర్తం=జలమందునౌకను ఈదరికి ఆదరికి చేర్చువానిని, తీర్థేభ్యః=దాటుసాధనములకొఱకు, ఆన్దం=బంధించువానిని నుత్పన్నమొనర్చుము, పారాయ= హరిణాదుల చేష్టలను సమాప్త పఱచుటకు ప్రవృత్తుడైన,మార్గారం=వేటకానిపుత్రుని,స్వనేభ్యః=శబ్దములకొఱకు,పర్ణకం=రక్షించుటలోనిందితుడగుభిల్లుని,గుహాభ్యః=గుహలనిమిత్తము,కిరాతం=పిట్టలనుకొట్టువానిని,సానుభ్యః=శిఖరములపైనుండుటకై ప్రవృత్తుడైన, జమ్భకం=నాశనమొనర్చు వానిని, మఱియు, పర్వతేభ్యః = కొండలనుండి, కిమ్పూరుషం = కుత్సితుడైన అడవి మనుష్యుని దూర మొనర్చుము. [౧౬]

భావార్థము:-మానవులు ఈశ్వరునియొక్క గుణకర్మ స్వభావములకనుకూలము లగు కర్మలతో ధీవరాదిసేవకులను శిక్షించి కిరాతాది హింసకులనువిడనాడి ఉత్తమ సుఖములను పొందుదురుగాక! ౧౬౫౨[౧౬]

---

౧౬౫౩ బీభత్సాయా ఇత్యస్య నారాయణ ఋషిః। రాజేశ్వరౌ దేవతే।విరాట్ ధృతిశ్ఛన్దః।ఋషభః స్వరః

పునస్తమేవ విషయ మాహ.

మరల నదే విషయము.

బీ॒భ॒త్సాయై॑ పౌల్కసం వర్ణా॑య హిరణ్యకా॒రం తు॒లాయై॑ వాణిజం ప॒శ్చా॒ద్దో॒షాయ॑ గ్లా॒విన॑o విశ్వే॑భ్యో భూ॒తేభ్యః॑ సిధ్మ॒లం భూత్యై॑ జాగర॒ణమభూ॑త్యై స్వప॒నమార్త్యై॑ జనవా॒దిన॑o వ్యృద్ధ్యా॑ అపగ॒ల్భ॒ సంశ॒రాయ॑ ప్రచ్ఛి॒దమ్॥ ॥1౭॥

బీ॒భ॒త్సాయై॑, పౌ॒ల్కసమ్, వర్ణా॑య, హి॒ర॒ణ్య॒ కా॒రమితి హిరణ్య+కారమ్, తు॒లాయై॑, వా॒ణి॒జమ్, ప॒శ్చా॒ద్దో॒షాయేతి పశ్చా+దోషాయ, గ్లా॒వినమ్, వి॒శ్వే॑భ్యః,

భూతేభ్యః, సిధ్మలమ్, భూత్యై, జాగరణమ్, అభూత్యై, స్వపనమ్, ఆర్త్యై+ఇత్యా

ఋత్యై, జనవాదిన మితి జన+వాదినమ్, వ్యృద్ధ్యా+ఇతి వి+ఋద్ధ్యై. అపగల్భ

మిత్యప+గల్భమ్. సంశరాయేతి సమ్+శరాయ, ప్రచ్ఛిదమితి ప్ర+చ్ఛిదమ్॥

పదార్థః:- (బీభత్సాయై) భర్త్సనాయ ప్రవృత్తమ్. (పౌల్కసమ్) పుల్కసస్యాన్త్యజ స్యాఽపత్యమ్. అత్ర వృషాదరాదిత్వాదభీష్టసిద్ధిః (వర్ణాయ) సురూపసంపాదనాయ (హిరణ్యకారమ్) సువర్ణకారం సూర్యం వా (తులాయై) తోలనాయ (వాణిజమ్) వణిగపత్యమ్ (పశ్చాదోషాయ) పశ్చాద్దోషదానాయ ప్రవృత్తమ్ (గ్లావినమ్) అహర్షితారమ్ (విశ్వేభ్యః) సర్వేభ్యః (భూతేభ్యః) (సిధ్మలమ్)సిధ్మాః సుఖసాధకా విద్యన్తే యస్య తమ్(భూత్యై) ఐశ్వర్యాయ (జాగరణమ్) జాగృతిమ్ (అభూత్యై)అనైశ్వర్యాయ (స్వపనమ్)నిద్రామ్. (ఆర్త్యై) పీడా నివృత్తయే (జనవాదినమ్) ప్రశస్తా జనవాదా విద్యన్తే యస్య తమ్ (వ్యృద్ధ్యై) విగతా చాసౌ బుద్ధిశ్చ వ్యృద్ధి స్తస్యై (అపగల్భమ్) ప్రగల్భతారహితమ్ (సంశరాయ) సమ్యగ్హింసనాయ ప్రవృత్తమ్(ప్రచ్ఛిదమ్) యః ప్రచ్ఛినత్తి తమ్. ॥౧౩॥

అన్వయః:- హే ఈశ్వర వా రాజన్! త్వం బీభత్సాయై పౌల్కసం, పశ్చాదోషాయ గ్లావినమభూత్యై స్వపనం, వ్యృద్ధ్యా అపగల్భ సంశరాయ ప్రచ్ఛిదం పరాసువ. వర్ణాయ హిరణ్యకారం,తులాయై వాణిజం,విశ్వేభ్యో భూతేభ్యః సిధ్మాలం, భూత్యై జాగరణమార్త్యై జనవాదినమాసువ: ॥౧౭॥

భావార్థః:- యే మనుష్యా నీచసఙ్గం త్యక్త్వోత్తమసఙ్గతిం కుర్వన్తి తే సర్వవ్యవహారసిద్ధ్యైశ్వర్యవన్తో జాయన్తే. యేఽనలసాః సన్తః సిద్ధయే యతంతే తే సుఖం, యే చాఽలసాస్తే చ దారిద్ర్యమాప్నువన్తి. ॥౩॥౭

పదార్థము:-ఓజగదీశ్వరా! అథవా రాజా!నీవు,బీభత్సాయై=బెదరించుటకు,భయపెట్టుటకు ప్రవృత్తుడైన, పౌల్కసం=పాకీవానిని, పశ్చాదోషాయ=పరోక్షమున దోషమునాపాదించుటకై ప్రవృత్తుడైన,గ్లావినం=హర్షమును నష్టపఱచువానిని,అభూత్యై= దారిద్ర్యము నిమిత్తము సమర్థమైన, స్వపనం=నిద్రను, వ్యృద్ధ్యై=సంపదను పాడొనర్చుటకు ప్రవృత్తుడైన, అప్రగల్భం=ప్రగల్భరహితపురుషునిమఱియు,సంశరాయ=బాగుగా చంపుటకుప్రవృత్తుడైన,ప్రచ్ఛిదం=అధికముగఛేదనమొనర్చువానిని దూరమొనర్చుము,మఱియు, వర్ణాయ=సుందరమైన రూపమును నిర్మించుటకై,హిరణ్యకారం=స్వర్ణకారుని అథవా సూర్యుని, తులాయై=తూకముచేయుటకై,వాణిజమ్=వణిక్పుత్రుని,విశ్వేభ్యః భూతేభ్యః=సమస్తప్రాణులకొఱకు, సిధ్మలం=సుఖమును సిద్ధింపజేయువారు, సహాయకులు గలవానిని, భూత్యై=ఐశ్వర్యము కొఱకు, జాగరణం=ప్రబోధించువానిని మఱియు,ఆర్త్యై=పీడానివారణకై,జనవాదినం=మానవులకుప్రశంసించదగినవాదవివాదము చేయునుత్తమమానవుని ఉత్పన్నమొనర్చుము. అథవా ప్రకటించుము, [౧౭]

ర్థ్యమునుండి, దిశః=పూర్వాది దిశలు, అకల్పయన్=కల్పించబడినవో, తథా=అటులనే ఈశ్వరుని సామర్థ్యముచే నితరలోకము లుత్పన్నములై నవని గ్రహించుడు. ౧౩.

భావార్థము :-మానవులారా! ఈ సృష్టియందు కార్యరూపములుగ నే యేవస్తువు లున్నవో అవి యన్నియు విరాడ్రూపకార్యకారణముల అవయవరూపములని గ్రహించ వలయును. ౧౩. [౧౬౨౧]

---

౧౬౨౨ యత్పురుషేణేత్యస్య నారాయణ ఋషిః, పురుషో దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పున స్తమేవ విషయమాహ. మఱల విషయమదియే.

యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞ మతన్వత ।

వసంతోఽస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మః శరద్ధవిః ॥౧౪॥

యత్,పురుషేణ,హవిషా,దేవాః, యజ్ఞమ్, అతన్వత, వసన్తః, అస్య,ఆసీత్, ఆజ్యమ్, గ్రీష్మః, ఇధ్మః, శరత్,హవిః. ౧౪

పదార్థః :-(యత్) యదా (పురుషేణ) పూర్ణేన పరమాత్మనా (హవిషా) హోతు మాదాతు మర్హేణ (దేవాః) విద్వాంసః (యజ్ఞమ్) మానసం జ్ఞానమయమ్ (అతన్వత)విస్తృణంతి (వసన్తః) పూర్వాహ్ణః (అస్య)యజ్ఞస్య (ఆసీత్) అస్తి (ఆజ్యమ్) (గ్రీష్మః) మధ్యాహ్నః (ఇధ్మః) ప్రదీపకః (శరత్) అర్ధరాత్రః (హవిః) హోతవ్యం ద్రవ్యమ్. ॥౧౪॥

అన్వయః :-హే మనుష్యాః యద్ధవిషా పురుషేణ సహ దేవా యజ్ఞమతన్వత తదాఽస్య వసన్త ఆజ్యం గ్రీష్మ ఇధ్మః శరద్ధవి రాసీదితి యూయ మపి విజానీత. ॥౧౪॥

భావార్థః :-యదా బాహ్యసామగ్ర్యభావే విద్వాంసో సృష్టికర్తురీశ్వరస్యోపాసనాఖ్యం మానసం జ్ఞానయజ్ఞం విస్తారయేయు స్తదా పూర్వాహ్ణాదికాల ఏవ సాధనరూపేణ కల్పనీయః. ॥౧౪॥

పదార్థము :-మానవులారా! యత్=ఎప్పుడు, హవిషా పురుషేణ=గ్రహించుటకు యోగ్యుడగు పూర్ణ పరమాత్మునితోపాటు, దేవాః=విద్వాంసులు, యజ్ఞమ్=మానసజ్ఞాన మైన యజ్ఞమును,అతన్వత=విస్తృత మొనర్చుచున్నారో, అప్పుడు, అస్య=ఈ యజ్ఞము నకు, వసన్తః=పూర్వాహ్ణకాలము, ఆజ్యమ్=ఘృతము, గ్రీష్మః=మధ్యాహ్నకాలము, మఱియు, శరత్=అర్ధరాత్రి, హవిః=హోమ మొనర్చదగిన పదార్థములుగ, ఆసీత్= ఉన్నవి అని గ్రహించుడు. ౧౪.

భావార్థము :-బాహ్యసామగ్రి లభించని స్థితిలో విద్వాంసులు సృష్టికర్తయగు నీశ్వ రుని ఉపాసనారూప మానసజ్ఞానయజ్ఞమును విస్తృత మొనర్చినప్పుడు పూర్వాహ్ణాది కాల ములనే సాధనరూపములుగ కల్పన యొనర్చుకొనవలయును. ౧౪. [౧౬౨౨]

---

౧౬౨౩ సప్తాస్యేత్యస్య నారాయణ ఋషిః, పురుషో దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పున స్తమేవ విషయమాహ. మఱల విషయమదియే.

సప్తాస్యాసన్పరిధయ స్త్రిః సప్త సమిధః కృతాః।
దేవా యద్యజ్ఞం తన్వానా అబధ్నన్పురుషం పశుమ్ ॥౧౫॥

సప్త,అస్య,ఆసన్,పరిధయ ఇతి పరి+ధయః,త్రిః,సప్త,సమిధ ఇతి సమ్+
ఇధః,కృతాః,దేవాః, యత్,యజ్ఞమ్, తన్వానాః,అబధ్నన్, పురుషమ్, పశుమ్. ౧౫

పదార్థః :-(సప్త) గాయత్ర్యాదీని ఛందాంసి (అస్య) (యజ్ఞస్య) (ఆసన్)సన్తి (పరిధయః) పరితః సర్వతఃసూత్రవద్ధీయన్తే యే తే (త్రిః) త్రివారమ్ (సప్త) ఏకవింశతిః ప్రకృతిః మహత్తత్వం,అహంకారః,పఞ్చసూక్ష్మభూతాని,పఞ్చ స్థూలాని,పఞ్చజ్ఞానేంద్రియాణి,సత్వరజస్తమాంసి, త్రయో గుణా శ్చేత్యేకవింశతిః (సమిధః)సామగ్రీభూతాః (కృతాః) నిష్పాదితాః(దేవాః)విద్వాంసః (యత్) యమ్ (యజ్ఞమ్) మానసం జ్ఞానమయమ్ (తన్వానాః) విస్తృణవన్తః (అబధ్నన్)బధ్నన్తి (పురుషమ్) పరమాత్మానమ్ (పశుమ్) ద్రష్టవ్యమ్. ॥౧౫॥

అన్వయః :-హే మనుష్యాః! యద్యం యజ్ఞం తన్వానా దేవాః పశుం పురుషం హృద్య బధ్న న్తస్యాఽస్య సప్త పరిధయ ఆసం స్త్రిః సప్త సమిధః కృతా స్తం యథావద్ విజానీత. ॥౧౫॥

భావార్థః :- హేమనుష్యా యూయమిమ మనేకవిధ కల్పిత పరిధ్యాదిసామగ్రీయుక్తం మానసం యజ్ఞం కృత్వా పూర్ణమీశ్వరం విజ్ఞాయ సర్వాణి ప్రయోజనాని సాధ్నుత. ॥౧౫॥

పదార్థము :-మానవులారా! యత్ యజ్ఞమ్=ఏ మానసజ్ఞాన యజ్ఞమును, తన్వానాః దేవాః=విస్తృతమొనర్చు విద్వాంసులు, పశుమ్=జ్ఞాతవ్యుడైన, పురుషమ్=పరమాత్మను హృదయమునందు, అబధ్నన్=బంధించుచున్నారో, అస్య=ఆయీ యజ్ఞమునకు, సప్త=గాయత్ర్యాది సప్తఛందస్సులు, పరిధయః ఆసన్=నలువంకల దారముతో చుట్టిన ఏడువరుసలవలె నున్నవి. త్రిఃసప్తః=ఇరువది యొకటి అనగా ప్రకృతి, మహత్తత్వము, అహంకారము, పంచస్థూలభూతములు, సూక్ష్మభూతములు, పంచజ్ఞానేంద్రియములు, సత్వరజస్తమములను గుణత్రయములు, సమిధః=సామాగ్రిలుగ, కృతాః=చేయబడినవి. ఆ యజ్ఞమును యథావతుగ నెఱుగుడు. ౧౫.

భావార్థము :-మానవులారా! అనేకవిధముల కల్పిత పరిధి మొదలైన సామగ్రిచే కూడుకొన్న యీ మానసయజ్ఞ మొనర్చి దానివలన పూర్ణ పరమేశ్వరుని గ్రహించి సకలార్థములను సాధించుడు. ౧౫. [౧౬౭౩]

---

౧౬౫౫ యజ్ఞేనేత్యస్య నారాయణ ఋషిః, పురుషో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః,
పునస్తమేవ విషయ మాహ. మఱల విషయమదియే.

యజ్ఞేన యజ్ఞ మయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్।
తే హ నాకం మహిమానః సచన్త యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః॥౧౬॥

యజ్ఞేన, యజ్ఞమ్, అయజన్త, దేవాః, తాని, ధర్మాణి, ప్రథమాని, ఆసన్, తే, హ, నాకమ్, మహిమానః, సచన్త, యత్ర, పూర్వే, సాధ్యాః, సన్తి, దేవాః ॥౧౬॥

పదార్థః :—(యజ్ఞేన) ఉక్తేన జ్ఞానేన(యజ్ఞమ్)పూజనీయం సర్వరక్షక మగ్నివత్తపనమ్=(అయజన్త) పూజయన్తి (దేవాః) విద్వాంసః (తాని)ఈశ్వరపూజనాదీని (ధర్మాణి) ధారణాత్మకాని (ప్రథమాని) అనాదిభూతాని ముఖ్యాని (ఆసన్) సన్తి (తే) (హ) ఏవ (నాకమ్)అవిద్యమానదుఃఖం ముక్తిసుఖమ్ (మహిమానః) మహత్త్వయుక్తాః (సచన్త) సమవయన్తి ప్రాప్నువన్తి (యత్ర) యస్మిన్ సుఖే (పూర్వే) ఇతః పూర్వసంభవాః (సాధ్యాః) కృతసాధనాః (సన్తి) (దేవాః) దేదీప్యమానా విద్వాంసః. ॥౧౬॥

నిరుక్తకార ఇమం మంత్రమేవం వ్యాచష్టే—యజ్ఞేన యజ్ఞమయజన్త దేవా అగ్నినాగ్నిమయజన్త దేవా అగ్నిః పశు రాసీత్తమాలభన్త, తేనాయజంతేతి చ బ్రాహ్మణమ్. తాని ధర్మాణి ప్రథమా న్యాసన్. తే హ నాకం మహిమానః సమసేవన్త. యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః సాధనాద్యుస్థానే దేవగణా ఇతి నైరుక్తాః నిరు. అ. ౧౨. ఖం. ౪౧.

అన్వయః :—హే మనుష్యా యే దేవా యజ్ఞేన యజ్ఞ మయజన్త తాని ధర్మాణి ప్రథమాన్యాసన్, తే మహిమానః సంతో యత్ర పూర్వే సాధ్యా దేవాః సన్తి, తన్నాకం హ సచన్త తద్యూయ మప్యాప్నుత. ॥౧౬॥

భావార్థః :—మనుష్యై ర్యోగాభ్యాసాదినా సదా పరమేశ్వర ఉపాసనీయః. అనేనానాదికాలీన ధర్మేణ ముక్తిసుఖం ప్రాప్య పూర్వవిద్వద్వదానన్దితవ్యమ్. ॥౧౬॥

పదార్థము :— మానవులారా ! దేవాః=ఏ విద్వాంసులు, యజ్ఞేన=పూర్వోక్తయజ్ఞముచే, యజ్ఞమ్=పూజనీయుడు, సర్వరక్షకుడు,అగ్నివత్తేజస్వియునైన ఈశ్వరుని,అయజంత=పూజించుచున్నారో, తాని ధర్మాణి=ఆ ఈశ్వర పూజాది ధారణరూప ధర్మములు, ప్రథమాని=అనాదిరూపములుగ ముఖ్యములై,ఆసన్=ఉన్నవి. తే=ఆవిద్వాంసులు,మహిమానః=మహత్వముతోకూడినవారు, యత్ర=ఏ సుఖములో, పూర్వే సాధ్యాః=ఇంతకు పూర్వము కృతసాధనులైన, దేవాః=ప్రకాశవంతులైన విద్వాంసులు, సన్తి=ఉన్నారో, నాకమ్ హ=ఆసకల దుఃఖరహిత ముక్తిసుఖమునే, సచన్త=పొందుచున్నారు. దానిని మీరును పొందుడు. ॥౧౬॥

భావార్థము :— యోగాభ్యాసాదులచే మానవులు నిరంతరము ఈశ్వరుని నుపాసించవలయును. అనాదికాలమునుండి ప్రవృత్తమైన యీధర్మమువలన ముక్తిసుఖమును పొంది, పూర్వము ముక్తిపొందిన విద్వాంసులవలె ఆనందమనుభవించుట మానవుల కర్తవ్యము. ౧౬. [౧౬౨౪]

---

౧౭ అద్భ్య ఇత్యస్యోత్తర నారాయణ ఋషిః, ఆదిత్యో దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయమదియే.

అద్భ్యః సమ్భృతః పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణః సమవ ర్తతాగ్రే।
తస్య త్వష్టా విదధద్రూపమేతి తన్మ ర్త్యస్య దేవత్వ మాజానమగ్రే॥౧౭॥

అద్భ్య ఇత్యత్ + భ్యః, సమ్భృత ఇతి సమ్ + భృతః, పృథివ్యై, రసాత్, చ, విశ్వకర్మణ ఇతి విశ్వ + కర్మణః, సమ్, అవ ర్తత, అగ్రే, తస్య, త్వష్టా, విదధదితి వి + దధత్, రూపమ్, ఏతి, తత్, మ ర్త్యస్య, దేవత్వమితి దేవ + త్వమ్, ఆజాన మిత్యా + జానమ్, అగ్రే ॥౧౭॥

పదార్థ :—(అద్భ్యః) జలేభ్యః (సమ్భృతః) సమ్యక్ పుష్టః(పృథివ్యై)పృథివ్యాః. అత్ర పఞ్చమ్యర్థే చతుర్థీ. (రసాత్) జిహ్వావిషయాత్. (చ) (విశ్వకర్మణః) విశ్వాని సర్వాణి సత్యాని కర్మాణి యస్యాశ్రియేణ తస్మాత్సూర్యాత్ (సమ్) (అవ ర్తత) వ ర్తతే (అగ్రే) పాగ్రిక్ (తస్య) (త్వష్టా) తనూకర్తా (విదధత్) విధానం కుర్వన్(రూపమ్)స్వరూపమ్(ఏతి)(తత్)(మ ర్త్యస్య) మనుష్యస్య (దేవత్వమ్)విద్వత్త్వమ్(ఆజానమ్)సమన్తాజ్జనానాం మనుష్యాణామిదంక ర్తవ్యంకర్మ(అగ్రే)ఆదితః.

అన్వయః :—హే మనుష్యా ! యోఽద్భ్యః పృథివ్యై విశ్వకర్మణశ్చ సమ్భృత స్తస్మాదగ్రే సాదగ్రే ఇదం సర్వం సమవ ర్తత తస్యాఽస్య జగతో తద్రూపం త్వష్టా విదధదగ్రే మ ర్త్యస్యాజానం దేవత్వ మేతి. ॥౧౭॥

భావార్థః :—హే మనుష్యాః యోఽఖిలకార్యకర్తా పరమాత్మా కారణాత్ కార్యాణి నిర్మిమీతే సకలస్య జగతః శరీరాణాం రూపాణి విదధాతి తజ్జ్ఞానం తదాజ్ఞాపాలనమేవ దేవత్వమస్తీతి జానీత. ॥౧౭॥

పదార్థము :— మానవులారా ! అద్భ్యః=జలములకంటె, పృథివ్యై=పృథివికంటె, విశ్వకర్మణః=సకలకర్మలకాశ్రయుడైన సూర్యునికంటె, సంభృతః=చక్కగా పుష్టమైన, రసాత్ అగ్రే=రసముకంటె పూర్వము ఏ యీ జగత్తంతయు, సమ్ వర్తత=వ ర్తమానమై యున్నదో, తస్య=ఆ యీ జగత్తుయొక్క, తత్ రూపమ్=ఆ స్వరూపమును, త్వష్టా=సూక్ష్మమొనర్చు ఈశ్వరుడు, విదధత్=విధాన మొనర్చుచు, అగ్రే=ఆదిమకాలములో, మ ర్త్యస్య=మనుష్యునియొక్క ఆజానమ్=చక్కని క ర్తవ్యకర్మను, దేవత్వమ్=విద్వత్తును, ఏతి=పొందుచున్నాడు. ౧౭.

భావార్థము :— మానవులారా ! సంపూర్ణ కార్యమొనర్చు పరాత్పరుడు కారణము నుండి కార్యమును సృజించుచున్నాడు. జగతుయొక్క సకల శరీరరూపములను నిర్మించుచున్నాడు.అతని జ్ఞానము,అతని ఆజ్ఞాపాలనయే దేవత్వము అని ఎఱుగుడు.౧౭.[౧౬౫౫]

---

౧౬౫౬ వేదాహమిత్యాస్యోత్తరనారాయణః ఋషిః, ఆదిత్యో దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథ విజ్ఞానం జిజ్ఞాసవే కథముపదిశేదిత్యాహ.

## విద్వాంసుడు జిజ్ఞాసువునకెటుల ఉపదేశించ వలయును

వేదాహ మేతం పురుషం మహాన్త మాదిత్య వర్ణం తమసః పరస్తాత్ ।
తమేవ విదిత్వాతి మృత్యు మేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ ॥౧౮॥

వేద, అహమ్, ఏతమ్, పురుషమ్, మహాన్తమ్, ఆదిత్య వర్ణమిత్యాదిత్య+వర్ణమ్, తమసః, పరస్తాత్, తమ్, ఏవ, విదిత్వా, అతి, మృత్యుమ్, ఏతి, న, అన్యః, పన్థాః, విద్యతే, అయనాయ. ॥౧౮॥

పదార్థః :—(వేద)జానామి. (అహమ్)(ఏతమ్) పూర్వోక్తం పరమాత్మానమ్ (పురుషమ్) స్వస్వరూపేణ పూర్ణమ్.(మహాన్తమ్)మహాగుణవిశిష్టమ్ (ఆదిత్యవర్ణమ్)ఆదిత్యస్య వర్ణః స్వరూపమివ స్వరూపం యస్య తం స్వప్రకాశమ్ (తమసః) అజ్ఞానాదంధకారాద్వా (పరస్తాత్) పరస్మిన్ వర్తమానమ్(తమ్)(ఏవ)(విదిత్వా) జ్ఞాత్వా(అతి) ఉల్లంఘనే(మృత్యుమ్) దుఃఖప్రదం మరణమ్ (ఏతి)గచ్ఛతి(న)(అన్యః)భిన్నః పన్థాః) మార్గః విద్యతే)భవతి(అయనాయ అభీష్టస్థానాయ మోక్షాయ.

అన్వయః :—హే జిజ్ఞాసోఽహం యమేతం మహాన్త మాదిత్యవర్ణం తమసః పరస్తాద్వర్తమానం పురుషం వేద, తమేవ విదిత్వా భవాన్మృత్యు మేతి. అన్యః పన్థా అయనాయ న విద్యతే ॥౧౮॥

భావార్థః :—యది మనుష్యా ఐహికపారమార్థికే సుఖే ఇచ్ఛేయు స్తర్హి సర్వేభ్యో బృహత్తమం స్వప్రకాశానంద స్వరూప మజ్ఞానలేశాద్దూరే వర్తమానం పరమాత్మానం జ్ఞాత్వైవ మరణాద్యగాధ దుఃఖసాగరాత్ పృథగ్భవితుం శక్నువన్త్యయమేవ సుఖప్రదో మార్గోఽస్తి. అస్మాదన్యః కశ్చిదపి మనుష్యాణాం ముక్తిమార్గో న భవతి. ॥౧౮॥

పదార్థము :—జిజ్ఞాసువులారా ! అహమ్=నేను, ఏతత్=ఈ పూర్వోక్తుడు, మహాన్తమ్=గొప్పగొప్ప గుణములతో యుక్తుడు, ఆదిత్యవర్ణమ్=సూర్యునివలె ప్రకాశస్వరూపుడు, తమసః పరస్తాత్=అంధకారములేక అజ్ఞానమునుండి వేరుగానున్నవాడునగు పురుషమ్=స్వస్వరూపముచే సర్వత్ర నిండియున్న ఏ పరమాత్మను, వేద=ఎరుగుచున్నానో, తత్ ఏవ=అతనినే, విదిత్వా=మీరెఱిగి, మృత్యుమ్ అతి ఏతి=దుఃఖదాయకమగు మరణమును ఉల్లంఘించి పోగలుగుదురు. కాని, అన్యః పంథాః=దీనికంటె భిన్నమైన మార్గము, అయనాయ=అభీష్టస్థానమైన మోక్షమునకై, న విద్యతే=లేనే లేదు. ॥౧౮॥

భావార్థము :—ఐహికాముష్మికసుఖములను మానవు డభిలషించుచూ అన్నిటికంటె మిక్కిలి పెద్దవాడు, స్వయంప్రకాశుడు, మఱియు ఆనందస్వరూపుడు, అజ్ఞానమునుండి పృథగ్వర్తమానుడునగు పరమాత్మను ఎఱిగియే అగాధ దుఃఖసాగరమునుండి వేరు కాగలుగుచున్నాడు. ఇదియే సుఖదాయకమైన మార్గము. దీనికంటె భిన్నముగ మానవులకు ముక్తిమార్గ మితర మెద్దియులేదు. ॥౧౮॥ [౧౬.౭౭]

---

౧౬.౭౭ ప్రజాపతి రిత్యస్యోత్తర నారాయణ ఋషిః, ఆదిత్యో దేవతా; భురిక్ త్రిష్టుప్ ఛన్దః; ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మఱల విషయమదియే.

ప్రజాపతి శ్చరత్తి గర్భే అ_న్తరజాయమానో బహుధా వి జాయతే ।
తస్య యోనిం పరి పశ్యంత్తి ధీరా _స్తస్మిన్ హ తస్థు ర్భువనాని విశ్వా॥౧౯॥

ప్రజాపతి రితి ప్రజా + పతిః, చరత్తి, గర్భే, అ_న్తః, అజాయమానః, బహుధా, విః జాయత్తే, తస్య, యోనిమ్, పరి, పశ్యన్తి, ధీరాః, తస్మిన్, హ, తస్థుః, భువనాని, విశ్వా ॥౧౯॥

పదార్థః :-(ప్రజాపతిః)ప్రజాపాలకో జగదీశ్వరః(చరతి)(గర్భే)గర్భస్థే జీవాత్మని(అ_న్తః) హృది (అజాయమానః) స్వస్వరూపేణానుత్పన్నః సన్ (బహుధా) బహుప్రకారైః (వి)విశేషేణ (జాయతే) ప్రకటో భవతి (తస్య) ప్రజాపతేః (యోనిమ్)స్వరూపమ్ (పరి) సర్వతః (పశ్య_న్తి) ప్రేక్ష_న్తే (ధీరాః) ధ్యానవ_న్తః (తస్మిన్) జగదీశ్వరే (హ) ప్రసిద్ధమ్ (తస్థుః) తిష్ఠన్తి (భువనాని) భవన్తి యేషు తాని లోకజాతాని (విశ్వా) సర్వాణి. ॥౧౯॥

అన్వయః :- హే మనుష్యా యోఽజాయమానః ప్రజాపతి గ్గర్భేఽ_న్తశ్చరతి, బహుధా విజాయతే, తస్య యం యోనిం ధీరాః పరిపశ్య_న్తి, తస్మిన్ హ విశ్వా భువనాని తస్థుః. ॥౧౯॥

భావార్థః :- యోఽయం సర్వరక్షక ఈశ్వరః స్వయ మనుత్పన్నః సన్, స్వసామర్థ్యా జ్జగదుత్పాద్య, తత్రాంతఃప్రవిశ్య, సర్వత్ర విచరతి, యమనేకప్రకారేణ ప్రసిద్ధం విద్వాంస ఏవ జానంతి తం జగదధికరణం సర్వవ్యాపకం పరమాత్మానం విజ్ఞాయ మనుష్యై రానన్దితవ్యమ్. ॥౧౯॥

పదార్థము :-మానవులారా ! అజాయమానః=స్వస్వరూపముచే ఉత్పన్నముకాని వాడు, ప్రజాపతిః=ప్రజారక్షకుడునైన యే జగదీశ్వరుడు, గర్భే=గర్భస్థుడైన జీవాత్మయందును, అ_న్తః=అందఱి హృదయములలోను, చరతి=విచరించు చున్నాడో, మఱియు, బహుధా వి జాయతే=అనేకవిధముల ప్రకటితమగు చున్నాడో, తస్య=ఆ ప్రజాపతి యొక్క, యోనిమ్=ఏ స్వరూపమును, ధీరాః=ధ్యానశీలురైన విద్వాంసులు, పరిపశ్య_న్తి =అన్నివైపులనుండి చూచుచున్నారో, తస్మిన్ హ=అతనిలోనే, విశ్వా భువనాని=సకల లోకలోకాంతరములు, తస్థుః=స్థితములై యున్నవి. ॥౧౯॥ [౧౬.౨౨]

భావార్థము :-ఏయీ సర్వరక్షకుడగు ఈశ్వరుడు, తాను పుట్టకయే స్వసామర్థ్యముచే జగత్తును రచించి అందుప్రవేశించి సర్వత్ర విచరించునో, అనేకవిధముల ప్రసిద్ధమైన యే ఈశ్వరుని విద్వాంసులే ఎరుగుచున్నారో, జగత్తున కాధారుడు సర్వవ్యాపకుడునైన ఆ పరమాత్మను ఎఱిగి మానవుడానందమును అనుభవించవలయును. ॥౧౯॥

---

౧౬.౨౦ యో దేవేభ్య ఇత్యస్యోత్తర నారాయణ ఋషిః; సూర్యో దేవతా; అనుష్టుప్ ఛన్దః; గాంధారః స్వరః.

పున స్తదేవ విషయ మాహ. మఱల విషయమదియే.

యో దేవేభ్య ఆతపతి యో దేవానాం పురోహితః ।
పూర్వో యో దేవేభ్యో జాతో నమో రుచాయ బ్రాహ్మయే ॥౨౦॥

యః, దేవేభ్యః, ఆతపతీత్యా+తపతి, యః, దేవానామ్, పురోహిత ఇతి పురః+హితః,పూర్వః,యః,దేవేభ్యః,జాతః,నమః,రుచాయ,బ్రాహ్మయే ॥౨౦॥

పదార్థః:-(యః)సూర్యః,(దేవేభ్యః)దివ్యగుణేభ్యః పృథివ్యాదిభ్యః(ఆతపతి)సమం తాత్తపతి (యః)(దేవానామ్)పృథివ్యాదిలోకానామ్(పురోహితః)పురస్తాద్ధితాయ మధ్యే ధృతః(పూర్వః)(యః) (దేవేభ్యః)పృథివ్యాదిభ్యః(జాతః)ఉత్పన్నః(నమః) అన్నమ్ (రుచాయ) రుచికరాత్ (బ్రాహ్మయే) యో బ్రహ్మణః పరమేశ్వరస్యాపత్యమివ తస్మాత్. అత్రోభయత్ర పఞ్చమ్యర్థే చతుర్థీ. ॥౨౦॥

అన్వయః :– హే మనుష్యాః యో దేవేభ్య ఆతపతి,యో దేవానాం పురోహితో, యో దేవేభ్యః పూర్వో జాత స్తస్మాద్రుచాయ బ్రాహ్మయే నమో జాయతే.॥౨౦॥

భావార్థః :– హే మనుష్యా యేన జగదీశ్వరేణ సర్వేషాం హితాయాన్నాద్యుత్పాదన నిమిత్తః సూర్యో నిర్మిత స్తమేవ సతత ముపాసీధ్వమ్. ॥౨౦॥

పదార్థము :—మానవులారా ! యః=ఏ సూర్యలోకము, దేవేభ్యః=ఉత్తమ గుణములు కలిగిన పృథివ్యాదులకై, ఆతపతి=బాగుగా తపించుచున్నదో, యః=ఏది, దేవానామ్=పృథివ్యాదిలోకములమధ్య,పురోహితః=మొదటినుండియే స్థితమొనర్చబడియున్నదో, యః=ఏది, దేవేభ్యః=పృథివ్యాదులకంటె, పూర్వః=ముందుగ,జాతః=ఉత్పన్నమైయున్నదో, రుచాయ=రుచినికలిగించునది, బ్రాహ్మయే=పరమేశ్వరుని సంతానము వలెనున్నదియునగు ఆ సూర్యలోకమునుండి, నమః=అన్నము ఉత్పన్నమగుచున్నది. ౨౦.

భావార్థము :– ఓ మానవులారా ! అందఱి హితమునకై అన్నాదుల ఉత్పత్తికి నిమిత్తమగు సూర్యుని సృజించిన ఆ పరమేశ్వరునినే ఉపాసించుడు. ॥౨౦॥ [౧౮౭౫]

---

౧౮౭౬ రుచమిత్యస్యోత్తర నారాయణ ఋషిః; విశ్వే దేవా దేవతాః; అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పున స్తమేవ విషయమాహ. మఱల విషయమయ్యదియే.

రుచం బ్రాహ్మం జనయన్తో దేవా అగ్రే తదబ్రువన్
యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్తస్య దేవా అసన్వశే ॥౨౧॥

రుచమ్, బ్రాహ్మమ్, జనయన్తః, దేవాః, అగ్రే, తత్, అబ్రువన్, యః, త్వా, ఏవమ్, బ్రాహ్మణః, విద్యాత్, తస్య, దేవాః, అసన్, వశే. ॥౨౧॥

పదార్థః :– (రుచమ్) రుచికరమ్ (బ్రాహ్మమ్) బ్రహ్మోపాసకమ్ (జనయన్తః) నిష్పాదయన్తః (దేవాః) విద్వాంసః (అగ్రే) (తత్) బ్రహ్మేవ ప్రకృతిస్వరూపమ్ (అబ్రువన్)బ్రువన్తు

(సః) (త్వా) (ఏవమ్) అమునా ప్రకారేణ (బ్రాహ్మణః) (విద్యాత్) విజానీయాత్ (తస్య) (దేవాః) విద్వాంసః (అసన్) స్యుః (వశే) తదధీనాః. ॥౨౧॥

అన్వయః :— హే బ్రహ్మనిష్ఠః యే రుచం బ్రాహ్మం త్వా జనయంతో దేవా అగ్రే తదబ్రువన్, యో బ్రాహ్మణ ఏవం విద్యాత్తస్య తే దేవా వశే అసన్. ॥౨౧॥

భావార్థః :— ఇదమేవాఽఽద్యం విద్వత్కృత్యమస్తి, యద్వేదేశ్వరధర్మాదిషు రుచి రుపదేశా ధ్యాపన ధార్మికత్వ జితేంద్రియత్వ శరీరాత్మబలవర్ధన మేవం కృతే సతి సర్వే దివ్యా గుణా భోగాశ్చ ప్రాప్తుం శక్యాః ॥౨౧॥

పదార్థము:— ఓ బ్రహ్మనిష్ఠుడా ! రుచమ్=రుచికారకుడవు,బ్రాహ్మమ్=బ్రహ్మోపాసకుడవునగు,త్వా=నిన్ను,జనయన్తః=సంపన్న మొనర్చుచు,దేవాః=ఏ విద్వాంసులు, అగ్రే=ముందు, తత్=బ్రహ్మ జీవ ప్రకృతుల స్వరూపమును, అబ్రువన్=చెప్పుదురో, యః బ్రాహ్మణః=ఏ బ్రాహ్మణుడు,ఏవమ్ విద్యాత్=ఇటుల ఎఱుగునో, తస్య=అతనికి దేవాః=ఆ విద్వాంసులు,వశే=వశమునందు.అసన్=ఉందురు గాక ! ౨౧. [౧౬-౭౫]

భావార్థము :—వేదేశ్వర ధర్మాదు లందభిరుచి, ఉపదేశము, అధ్యాపనము, ధార్మికత్వము, జితేంద్రియత్వము, శరీరాత్మ బలవర్ధనము ఇవియే విద్వాంసులకు ప్రప్రథమ కర్తవ్యములు.ఇటు లొనర్చుటవలననే సకలోత్తమ గుణములు,భోగములు లభించగలవు.

---

౧౬-౭౦ శ్రీశ్చ త ఇత్యస్యోత్తర నారాయణ ఋషిః; ఆదిత్యో దేవతా; నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః;ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మఱల విషయమదియే.

శ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యా వహోరాత్రే పార్శ్వే నక్షత్రాణి రూపమశ్వినౌ వ్యాత్తమ్। ఇష్ణన్నిషాణాముం మ ఇషాణ సర్వలోకం మ ఇషాణ ॥౨౨॥

శ్రీః, చ, తే, లక్ష్మీః, చ, పత్న్యౌ, అహోరాత్రే ఇత్యహోరాత్రే, పార్శ్వే, ఇతి పార్శ్వే నక్షత్రాణి,రూపమ్, అశ్వినౌ,వ్యాత్తమితి వి+ఆత్తమ్.ఇష్ణన్ ఇషాణ, అముమ్, మే, ఇషాణ. సర్వలోకమితి సర్వ+లోకమ్, మే, ఇషాణ. ॥౨౨॥

పదార్థః :— (శ్రీః) సకలా శోభా (చ)(తే) తవ (లక్ష్మీః)సర్వమైశ్వర్యమ్ (చ)(పత్న్యౌ) స్త్రీవద్వర్తమానే (అహోరాత్రే) (పార్శ్వే)(నక్షత్రాణి)(రూపమ్)(అశ్వినౌ) సూర్యాచంద్రమసౌ (వ్యాత్తమ్) వికాసితం ముఖమివ. అత్ర వి ఆఙ్ పూర్వాద్ డుదాఞ్ ధాతోః క్తః (ఇష్ణన్)ఇచ్ఛన్ (ఇషాణ) కామయ (అముమ్) ఇతః పరం పరోక్షం సుఖమ్ (మే)మహ్యమ్ (ఇషాణ)ప్రాపయ (సర్వలోకమ్) సర్వేషాం దర్శనమ్ (మే) మహ్యమ్ (ఇషాణ) ॥౨౨॥

అన్వయః:—హే జగదీశ్వర! యస్య తే శ్రీశ్చ లక్ష్మీశ్చ పత్న్యా వహోరాత్రే పార్శ్వే,యస్య తే సృష్టౌ అశ్వినౌ వ్యాత్తం నక్షత్రాణి రూపం, స త్వం మేఽముం మిష్ణన్నిషాణ, మే సర్వలోకమిషాణ, మే సర్వాణి సుఖానీషాణ. ॥౨౨॥

భావార్థః :— హే రాజాదయో మనుష్యా యథేశ్వరస్య న్యాయాదయో గుణాః, వ్యాప్తిః కృపా పురుషార్థః సత్యం రచనం సత్యా నియమాశ్చ సన్తి, తథైవ యుష్మాకమపి సన్తు. యతో యుష్మాక ముత్తరోత్తరం సుఖం వర్ధేతేతి. ॥౨౨॥

అత్రేశ్వర సృష్టి, రాజగుణ వర్ణనా దేతదధ్యాయోక్తార్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సంగతి రస్తీతి వేద్యమ్.

పదార్థము:—జగదీశ్వరా!తే=ఏనీయొక్క, శ్రీః=నిఖిలశోభ, చ=మఱియు, లక్ష్మీః= సర్వైశ్వర్యము, చ=మఱియు, పత్న్యౌ=ఇద్దఱి స్త్రీలవలెనున్నవో, అహోరాత్రే=రేయుం బవళ్లు, పార్శ్వే=వెనుకముందులో, ఏ నీదుసృష్టిలో, అశ్వినౌ=సూర్యచంద్రులు, వ్యాత్తమ్ =తెఱచిన ముఖముతో తుల్యములో, నక్షత్రాణి=నక్షత్రములు, రూపమ్=రూపవంతములునై యున్నవో అట్టి నీవు, మే=నాయొక్క, అముమ్=పరోక్షసుఖమును, ఇష్ణన్=కోరువాడవై, ఇషాణ=లభింపజేయుము. మే=నాకు, సర్వలోకమ్=అందఱి దర్శనమును, ఇషాణ= లభింపజేయుము, నాకు సకల సుఖములను, ఇషాణ=సమకూర్చుము. ౨౨.

భావార్థము :—రాజాదిమానవులారా! ఈశ్వరుని న్యాయాది గుణములు, వ్యాప్తి, కృప, పురుషార్థము, సత్యసృష్టి, సత్యనియమములు ఎటులున్నవో, అటులనే మీవి కూడ ఉండ వలయును. దానివలన మీకు ఉత్తరోత్తరము సుఖమభివృద్ధి జెందును గాక! ౨౨. [౧౬౭౦]

ఈ అధ్యాయమునందు (౧) ఈశ్వరుని సృష్టి (౨) రాజగుణముల వర్ణన యుండుటచే ఈ అధ్యాయము నందు చెప్పబడిన అర్థమునకు పూర్వాధ్యాయమునందు చెప్పబడ్డ అర్థముతో సంగతి యున్నదని గ్రహించవలెను.

---

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం శ్రీ పరమవిదుషాం విరజానంద సరస్వతీ స్వామినాం శిష్యేణ శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యేణ శ్రీ మద్దయానంద సరస్వతీ స్వామినా విరచితే సంస్కృతార్య భాషాభ్యాం సమన్వితే సుప్రమాణ యుక్తే యజుర్వేదభాష్యే ఏకత్రింశత్తమోఽధ్యాయః సమాప్తః.

★

కృష్ణామండలాంతర్గత కుందేరు గ్రామ వాస్తవ్యుడగు పాలడుగు శేషాచలాచార్య, తదేవ మండలాంతర్గత ముదునూరు గ్రామ వాస్తవ్యుడు అన్నే కేశవార్యశాస్త్రి గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన శ్రీ మద్దయానంద సరస్వతీ యజుర్వేద భాషాభాష్యమందలి ౩౧వ అధ్యాయము సమాప్తము.

---



ఓమ్

# అథ ద్వాత్రింశత్తమాధ్యాయార్భః

—:०:—

ముప్పదిరెండవ అధ్యాయము ఆరంభము.

ఓ౩మ్.విశ్వాని దేవ సవిత ర్దురితాని పరాసువ। యద్భద్రం తన్న ఆ సువ॥౧॥

౧-౭౧ తదేవేత్యస్య స్వయంభు బ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ పరమేశ్వరః కీదృశ ఇత్యాహ. పరమేశ్వరు డెట్టివాడను విషయమును చెప్పెను.

తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తదు చంద్రమాః।

తదేవ శుక్రం తద్ బ్రహ్మ తా ఆపః స ప్రజాపతిః ॥౧॥

తత్,ఏవ,అగ్నిః,తత్,ఆదిత్యః,తత్,వాయుః, తత్, ఊం ఇత్యూం, చంద్రమాః,తత్,ఏవ,శుక్రమ్,తత్,బ్రహ్మ,తాః,ఆపః,సః,ప్రజాపతి రితి ప్రజా+పతిః.॥౧॥

పదార్థ :—(తత్)సర్వజ్ఞం సర్వవ్యాపి సనాతన మనాది సచ్చిదానందస్వరూపం నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావం న్యాయకారి దయాలు జగత్స్రష్టృ జగద్ధర్తృ సర్వాన్తర్యామి(ఏవ)నిశ్చయే,(అగ్నిః) జ్ఞానస్వరూపత్వాత్ స్వప్రకాశత్వాచ్చ(తత్)(ఆదిత్యః)ప్రలయే సర్వస్యాదాతృత్వాత్(తత్)(వాయుః) అనంతబలత్వ సర్వధర్తృత్వాభ్యామ్ (తత్) (ఉ) (చన్ద్రమాః) ఆనన్దస్వరూపత్వాదాహ్లాదకత్వాచ్చ (తత్)(ఏవ)(శుక్రమ్)ఆశుకారిత్వా చ్ఛుద్ధభావాచ్చ. (తత్)(బ్రహ్మ)సర్వేభ్యో మహత్త్వాత్(తాః) (ఆపః)సర్వత్ర వ్యాపకత్వాత్(సః)(ప్రజాపతిః)సర్వస్యాః ప్రజాయాః స్వామిత్వాత్. ॥౧॥

అన్వయః :—హే మనుష్యా స్తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తచ్చన్ద్రమా స్తదేవ శుక్రం తద్బ్రహ్మ, తా ఆపః, స ఉ ప్రజాపతి రస్త్యేవం యూయం విజానీత. ॥౧॥

భావార్థః :—హేమనుష్యా యథేశ్వరస్యేమాన్యగ్న్యాదీని గౌణికాని నామాని సన్తి, తథాఽన్యానీన్ద్రాదీన్యపి వర్తన్తే. అస్యైవోపాసనా ఫలవతీ భవతీతి వేద్యమ్. ॥౧॥

పదార్థము :—మానవులారా ! తత్ ఏవ=సర్వజ్ఞుడు,సర్వవ్యాపి,సనాతనుడు, అనాది, సచ్చిదానందస్వరూపుడు,నిత్యుడు,శుద్ధుడు, బుద్ధుడు, ముక్తస్వభావుడు, న్యాయకారి, దయాలువు, జగత్స్రష్ట, ధారణకర్త మఱియు అందఱిలో అంతర్యామియునైన యతడే, అగ్నిః =జ్ఞానస్వరూపుడు, స్వయంప్రకాశితుడునగుటచే అగ్ని, తత్=అతడు,ఆదిత్యః=ప్రలయ సమయమున అన్నిటిని గ్రహించువాడగుటచే ఆదిత్యుడు,తత్=అతడు,వాయుః=అనంత బలశాలి, అన్నిటికి ధర్త యగుటచే వాయువు,తత్=అతడు, చంద్రమాః=ఆనందస్వరూపుడు, ఆనందకారకుడు నగుటచే చంద్రుడు, తత్ ఏవ=అతడే, శుక్రమ్=శీఘ్రకారి లేక శుద్ధభావము గలవాడగుటచే శుక్రుడు, తత్=అతడు, బ్రహ్మ, తాః=అతడు, ఆపః= సర్వవ్యాపకు డగుటచే అప్పు, ఉ=మఱియు, సః=అతడు, ప్రజాపతిః=సకలప్రజలకు స్వామియగుటచే ప్రజాపతియునై యున్నాడని మీరంద రెఱుగవలయును. ౧.

భావార్థము:-మానవులారా! ఈయగ్న్యాదిగౌణనామము లెటుల ఈశ్వరున కున్నవో అటులనే ఇంద్రాదినామములు నున్నవి. అతని ఉపాసనయే ఫలవంతము కాగలదని గ్రహించుడు. ౧. [౧౬-౨౧]

---

౧౬-౨౨ సర్వ ఇత్యస్య స్వయంభు బ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః

పున స్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి।
నైన మూర్ధ్వం న తిర్యఞ్చం న మధ్యే పరి జగ్రభత్॥౨॥

సర్వే, నిమేషా ఇతి ని + మేషాః, జజ్ఞిరే, విద్యుత ఇతి వి + ద్యుతః, పురుషాత్, అధి, న, ఏనమ్, ఊర్ధ్వమ్, న, తిర్యఞ్చమ్, న, మధ్యే, పరి, జగ్రభత్॥౨॥

పదార్థః :-(సర్వే)(నిమేషాః)నేత్రోన్మీలనాది లక్షణాః కలా కాష్ఠాది కాలావయవాః(జజ్ఞిరే) జాయన్తే. (విద్యుతః)విశేషేణ ద్యోతమానాత్(పురుషాత్)పూర్ణాద్విభోః(అధి)(న)నిషేధే(ఏనమ్) పరమాత్మానమ్(ఊర్ధ్వమ్)ఉపరిస్థమ్(న)(తిర్యఞ్చమ్) తిర్యక్ స్థితమధస్థం వా(న)(మధ్యే)(పరి) సర్వతః(జగ్రభత్)గృహ్ణాతి.

అన్వయః :-హే మనుష్యాః యస్మాద్విద్యుతః పురుషా త్సర్వే నిమేషా అధి జజ్ఞిరే,తమేనం కోఽపి నోర్ధ్వం న తిర్యఞ్చం న మధ్యే పరి జగ్రభత్తం యూయం సేవధ్వమ్. ॥౨॥

భావార్థః :-హేమనుష్యా యస్య నిర్మాణేన సర్వే కాలావయవా జాతా, యచ్చోర్ధ్వ మధో మధ్యే పార్శ్వతో దూరే నికటే వా కథయితు మశక్యం, యత్ సర్వత్ర పూర్ణం బ్రహ్మాఽస్తి తద్యోగాభ్యాసేన విజ్ఞాయ సర్వే భవన్త ఉపాసీరన్. ॥౨॥

పదార్థము :-మానవులారా ! విద్యుతః పురుషాత్=విశేషముగ ప్రకాశించు పూర్ణ పరమాత్మనుండి, సర్వే నిమేషాః=నిమేష కాల కాష్ఠాది సకల కాలావయవములు, అధి జజ్ఞిరే=అధికముగ నుత్పన్నమగుచున్నవి. ఏనమ్=అట్టి ఆ పరమాత్ముని ఎవరును, న ఊర్ధ్వమ్=పైనుండిగాని,న తిర్యంచమ్=అడ్డముగాగావి,నలుదిసలనుండి గావి,క్రిందినుండి గాని, న మధ్యే=మధ్యనుండిగావి,పరిజగ్రభత్=సంపూర్ణముగ గ్రహించజాలరు.అతనిని మీరు సేవించుడు. ౨.

భావార్థము :-మానవులారా ! కాలావయవము లెవనిచే నిర్మించబడినవో, ఎవడు పైన,క్రింద,మధ్య,పార్శ్వము,దూరము,సమీపము అని చెప్ప శక్యుడు గాడో, ఏ బ్రహ్మ అంతట నిండియున్నాడో అతనిని ఎఱిగి యోగాభ్యాసముచే ఉపాసించుడు. ౨.[౧౬-౨౨]

---

౧౬-౨౩ న తస్యేత్యస్య స్వయంభు బ్రహ్మ ఋషిః, హిరణ్యగర్భః పరమాత్మా దేవతా, నిచృత్ పంక్తి శ్ఛందః, పఞ్చమః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నావిషయమే.

షో౽తీతానాగతేషు కల్పేషు జగదుత్పాదనాయ పూర్వం ప్రకటో భవతి, స ధ్యానశీలేన మనుష్యేణ జ్ఞాతవ్యో నాన్యేనేతి భావః. ॥౪॥

పదార్థము :—జనాః=విద్వాంసులారా ! ఏషః హ=ఈ ప్రసిద్ధపరమాత్మ, దేవః=ఉత్తమ స్వరూపుడు, సర్వాః=సకలదిక్కులందు, ప్రదిశాః=విదిశలందు, అను=అనుకూలముగ వ్యాప్తుడై, స ఉ=అతడే, గర్భే అంతః=అంతఃకరణ మధ్యమున, పూర్వః=ప్రథమ కల్పాదిలో, హ=ప్రసిద్ధముగ జాతః=ప్రకటితుడైనవాడు, సః ఏవ జాతః=అతడే ప్రసిద్ధుడైన వాడు, సః జనిష్యమాణః=అతడే రాబోవు కల్పములందు ప్రథమ ప్రసిద్ధిని పొందును, సర్వతోముఖః=అన్ని దిశలందు ముఖాద్యవయవములు కలవాడు. అనగా ముఖాదీంద్రియముల కార్యము సర్వత్ర యొనర్చువాడు, ప్రత్యఙ్=ప్రతిపదార్థమును పొందువాడు, తిష్ఠతి=అచలుడునై సర్వత్ర స్థితుడై యున్నాడు. అతడే మీకు ఉపాసించుటకు, తెలుసుకొనుటకు యోగ్యుడై యున్నాడు. ౪.

భావార్థము :—ఈ పూర్వోక్త పరమేశ్వరుడు జగత్తు నుత్పన్నమొనర్చి ప్రకాశితుడు, సకల దిశలందు వ్యాప్తుడు, సర్వవ్యాపకుడునగుటచే ఇంద్రియములు లేకుండగనే సకలేంద్రియముల కార్య మొనర్చువాడు, సకలప్రాణుల హృదయమున స్థిరమైన వాడునునై యున్నాడు. అతడు భూత భవిష్యత్కల్పములందు జగదుత్పత్తికై ముందు ప్రకటితుడగును. అతడు ధ్యానశీలుడైన మానవునకు తెలుసుకొనదగినవాడు. ఇతరుల కగమ్యుడు. ౪.

---

౧౬-౭౫ యస్మాదిత్యస్య స్వయంభు బ్రహ్మ ఋషిః, పరమేశ్వరో దేవతా, భురిక్ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

యస్మా జ్జాతం న పురా కిఞ్చనైవ య ఆ బభూవ భువనాని విశ్వా।
ప్రజాపతిః ప్రజయా సꣳరరాణ స్త్రీణి జ్యోతీꣳషి సచతే స షోడశీ ॥౫॥

యస్మాత్, జాతమ్, న, పురా, కిమ్, చన, ఏవ, యః, ఆబభూవేత్యా + బభూవ, భువనాని, విశ్వా, ప్రజాపతి రితి ప్రజా + పతిః, ప్రజయా, సꣳరరాణ ఇతి సమ్ + రరాణః, త్రీణి, జ్యోతీꣳషి, సచతే, సః, షోడశీ ॥౫॥

పదార్థః :-(యస్మాత్)పరమేశ్వరాత్(జాతమ్)ఉత్పన్నమ్(న)నిషేధే(పురా)పురస్తాత్ (కిమ్) (చన)కిఞ్చిదపి(ఏవ) (యః) (ఆ బభూవ)సమన్తాద్భవతి (భువనాని) లోకజాతాని సర్వాఽధికరణాని (విశ్వా)సర్వాణి(ప్రజాపతిః)ప్రజాయాః పాలకోఽధిష్ఠాతా(ప్రజయా)ప్రజాతయా(సమ్) (రరాణః) సమ్యక్ రమమాణః (త్రీణి) విద్యుత్సూర్యచన్ద్రరూపాణి (జ్యోతీంషి) తేజోమయాని ప్రకాశకాని (సచతే)సమవైతి(సః) (షోడశీ)షోడశ కలా యస్మిన్ సన్తి సః. ॥౫॥

అన్వయః :—హే మనుష్యాః ! యస్మాత్ పురా కిఞ్చన న జాతం, య స్సర్వత ఆ బభూవ, యస్మిన్ విశ్వా భువనాని వర్తన్తే, స ఏవ షోడశీ ప్రజయా సహ సంరరాణః ప్రజాపతి స్త్రీణి జ్యోతీంషి సచతే. ॥౫॥

భావార్థః :—యస్మాదీశ్వరోఽనాది ర్వర్తతే తత స్తస్మాత్పూర్వం కిమపి భవితు న్న శక్యమ్. స ఏవ సర్వాసు ప్రజాసు వ్యాప్తో జీవానాం కర్మాణి పశ్యన్ సం స్తదనుకూలఫలం దదన్న్యాయం కరోతి, యేన ప్రాణాదీని షోడశ వస్తూని సృష్టాన్యతః స షోడశీత్యుచ్యతే. ప్రాణః, శ్రద్ధాఽకాశం, వాయు రగ్ని ర్జలం, పృథివీన్ద్రియం,మనోఽన్నం, వీర్యం, తపో, మన్త్రాః, కర్మ, లోకాః నామ చ షోడశకలాః. ప్రశ్నోపనిషది షష్ఠే ప్రశ్నే వర్ణితాః. ఏతత్సర్వం షోడశాత్మకం జగత్ పరమాత్మని వర్తతే తేనైవ నిర్మితం పాల్యతే చ. ॥౫॥

పదార్థము:—మానవులారా! యస్మాత్ పురా=ఏ పరమేశ్వరునకు పూర్వము, కిమ్ చన=ఏమియు, న జాతమ్=పుట్టియుండలేదో,యః=ఎవడన్ని దిక్కులలో,ఆబభూవ=చక్కగా వెలయుచున్నాడో, ఎవనిలో, విశ్వా భువనాని=సకల వస్తువుల కాధారమగు సమస్తలోకములు ఇమిడియున్నవో, సః ఏవ=అతడే, షోడశీ=షోడశకలలు గలవాడు, ప్రజయా=ప్రజలతో, సమ్ రరాణః=చక్కగా రమణమొనర్చుచు, ప్రజాపతిః=ప్రజా రక్షకుడు, అధిష్ఠాతయునై, త్రీణి జ్యోతీంషి=తేజోమయములగు విద్యుత్సూర్యచంద్ర ప్రకాశకజ్యోతులను సచతే=సంయోగ పఱచుచున్నాడు. ౫.

భావార్థము :- ఈశ్వరు డనాదియగుటచే నతనికి పూర్వమేమియు నుండజాలదు. అతడే సకలప్రజలందు వ్యాప్తుడై జీవముల కర్మలను పర్యవేక్షించును.తదనుకూల ఫలము నొసగుచు న్యాయమొనర్చును.ప్రాణాదిషోడశ పదార్థములను సృష్టించుటచే నతడు షోడశి యని పిలువబడుచున్నాడు. ౫

(ప్రాణము,శ్రద్ధ,ఆకాశము,వాయువు,అగ్ని,జలము,పృథ్వి,ఇంద్రియము,మనస్సు, అన్నము, వీర్యము, తపస్సు, మంత్రము, కర్మ, లోకము, నామము.) ఈ షోడశకలలు ప్రశ్నోపనిషత్తులో[చెప్పబడి]ఉన్నవి. షోడశ వస్తురూపములో నున్న జగత్తంతయు పరమాత్మలో నిమిడియున్నది. దీనిని సృజించి పాలించువాడతడే. ౫. [౧౬-౨౬]

---

యేనేత్యస్య స్వయమ్భు బ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నావిషయమే.

యేన ద్యౌ రుగ్రా పృథివీ చ దృఢా యేన స్వః స్తభితం యేన నాకః ।
యో అ న్తరిక్షే రజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ ॥౬॥

యేన, ద్యౌః, ఉగ్రా, పృథివీ, చ, దృఢా, యేన,స్వరితి స్వః, స్తభితమ్,యేన, నాకః,యః, అన్తరిక్షే, రజసః, విమాన ఇతి వి+మానః, కస్మై, దేవాయ,హవిషా, విధేమ. ॥౬॥

పదార్థః :-(యేన)జగదీశ్వరేణ(ద్యౌః)సూర్యాదిప్రకాశవాన్ పదార్థః (ఉగ్రా) తీవ్రతేజస్కా (పృథివీ)భూమిః(చ)(దృఢా)దృఢీకృతా (యేన)(స్వః)సుఖమ్ (స్తభితమ్) ధృతమ్ (యేన) (నాకః) **అవిద్యమానదుఃఖో మోక్షః**(యః)(అన్తరిక్షే)మధ్యవర్తిన్యాకాశే (రజసః) లోకసమూహస్య. లోకా

రజాంస్యుచ్యన్త ఇతి నిరుక్తమ్. (విమానః)వివిధం మానం యస్మిన్ సః(కస్మై)సుఖస్వరూపాయ (దేవాయ) స్వప్రకాశాయ సకలసుఖదాత్రే (హవిషా) ప్రేమభక్తిభావేన(విధేమ)పరిచరేమ ప్రాప్నుయామ వా. ॥౬॥

అన్వయః :—హేమనుష్యాః యేనోగ్రా ద్యౌః పృథివీ చ దృఢా,యేన స్వః స్తభితం,యేన నాకః స్తభితో యోఽన్తరిక్షే వర్తమానస్య రజసో విమానోఽస్తి, తస్మై కస్మై దేవాయ వయం హవిషా విధేమైవం యూయమప్యేనం సేవధ్వమ్. ॥౬॥

భావార్థః :—హే మనుష్యాః యః సకలస్య జగతో ధర్తా సర్వసుఖప్రదాతా మోక్షసాధక ఆకాశ ఇవ వ్యాప్తః పరమేశ్వరోఽస్తి, తస్యైవ భక్తిం కురుత. ॥౬॥

పదార్థము:-మానవులారా! యేన=ఏ జగదీశ్వరునిచే, ఉగ్రా ద్యౌః=తీవ్ర తేజస్సు గల ప్రకాశయుక్త సూర్యాది పదార్థములు, చ=మఱియు, పృథివీ=భూమి,దృఢా=దృఢ మొనర్చబడెనో,యేన నాకః=ఎవడు సకలదుఃఖ రహితమగు మోక్షమును ధారణ మొన ర్చెనో. యః=ఎవడు,అంతరిక్షే=మధ్యనున్న ఆకాశములో స్థితుడై,రజసః=లోక సమూహమును, విమానః=వివిధముగ మానమొనర్చువాడై యున్నాడో అట్టి, కస్మై=సుఖ స్వరూపుడు,దేవాయ=స్వయంప్రకాశమానుడు, సకల సుఖదాతయునగు నీశ్వరుని మేము, హవిషా=ప్రేమతో,భక్తిభావముతో విధేమ=సేవించెదముగాక! పొందెదముగాక ! [ఇటులనే మీరును అతనిని సేవించుడు.] ౬.

భావార్థము :—మానవులారా ! సకల జగద్ధర్త, సర్వసుఖ ప్రదాత,మోక్షసాధకుడు, ఆకాశమువలె వ్యాప్తుడునగు నే పరమేశ్వరుడున్నాడో అతనినే భజించుడు. ౬.

---

యం క్రన్దసీత్యస్య స్వయంభు బ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా; స్వరాడతిజగతీ ఛన్దః, నిషాదః స్వరః,

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

యం క్రన్దసీ అవసా త స్తభానే అభ్యైక్షేతాం మనసా రేజమానే।
యత్రాధి సూర ఉదితో విభాతి కస్మై దేవాయ హవిషా విధేమ॥
ఆపో హ యద్ బృహతీ ర్యశ్చిదాపః. ॥౭॥

యమ్:క్రన్దసీఇతి క్రన్దసీ,అవసా, తస్తభానే ఇతి త స్త+భానే, అభి, ఐక్షేతామ్, మనసా, రేజమానే ఇతి రేజమానే, యత్ర, అధి, సూరః, ఉదిత ఇత్యుత్+ఇత, విభాతీతి వి+భాతి, కస్మై, దేవాయ, హవిషా, విధేమ, ఆపః, హ, యత్, బృహతీః, యః, చిత్, ఆపః. ॥౭॥

పదార్థః :—(యమ్)(క్రన్దసీ)గుణైః ప్రశంసనీయే(అవసా)రక్షణాదినా(తస్తభానే)ధారికే(అభి) అభిముఖ్యే(ఐక్షేతామ్)ఈక్షేతాం పశ్యతః(మనసా)విజ్ఞానేన(రేజమానే)చలన్త్యౌ భ్రమన్త్యౌ(యత్ర) యస్మిన్(అధి)ఉపరి(సూరః)సూర్యః(ఉదితః) ఉదయం ప్రాప్తః (విభాతి) విశేషేణ ప్రకాశయన్

ప్రకాశయితా భవతి(కస్మై)సుఖసాధకాయ(దేవాయ)శుద్ధస్వరూపాయ(హవిషా)ఆదాతవ్యేవ యోగాభ్యాసేన(విధేమ)(ఆపః)వ్యాప్తాః హ) కిల(యత్)యాః(బృహతీః) మహత్యః (యః) (చిత్) అపి (ఆపః)ఆకాశః. ॥౭॥

అన్వయః :— హే మనుష్యాః యం పరమాత్మానం ప్రాప్తే తస్తభానే రేజమానే క్రన్దసీ ద్యావా పృథివ్యా వవసా సర్వం ధరతో యత్ర సూరోఽధ్యుదితో, యద్ యా బృహతీ రాపో హ యశ్చిదాపః సన్తి. తాశ్చిదపి విభాతి, తం తౌ చాధ్యాపకోపదేశకౌ మనసా అభ్యైక్షేతాం, తస్మై కస్మై దేవాయ హవిషా వయం విధేమైనం యూయ మపి భజత. ॥౭॥

భావార్థః :— హేమనుష్యాః యత్ర సర్వాభివ్యాపకేశ్వరే సూర్యపృథివ్యాదయో లోకా భ్రమన్తః సన్తో దృశ్యన్తే యేన ప్రాణ ఆకాశోఽపి వ్యాప్తస్తం స్వాత్మస్థం యూయ ముపాసీధ్వమ్. ॥౭॥

పదార్థము:— యమ్=ఏపరమాత్మను పొందునవిలేక అతని యధికారములో నుండునవి,తస్తభానే=సకలమునుధారణమొనర్చునవి,రేజమానే=చాలాయమానములు, క్రందసీ=స్వగుణములచే ప్రశంసించదగినవియగు సూర్యపృథివీలోకములు, అవసా=రక్షాదులచే అన్నిటిని ధారణమొనర్చుచున్నవో. యత్ర=ఏ పరమేశ్వరునియందు, సూరః=సూర్యలోకము,అధి ఉదితః=అధికముగ ఉదయమును పొందినదో, యత్=ఏ,బృహతీః=మహత్తరమగు, ఆపః హ=వ్యాప్తజల మేది ఉన్నదో,యః చిత్=ఏదైనా,ఆపః=ఆకాశమున్నదో, దానినికూడ, విభాతి=విశేషించి ప్రకాశితమొనర్చు ప్రకాశకుడగుచున్నాడో ఆ పరమేశ్వరుని అధ్యాపకోపదేశకులు, మనసా=విజ్ఞానముతో, అభి ఐక్షేతామ్=అభిముఖులై గాంచెదరు. కస్మై=అట్టి సుఖసాధకుడు, దేవాయ=శుద్ధస్వరూపుడునగు పరమాత్మను, హవిషా=గ్రహించదగిన యోగాభ్యాసముచే మేము, విధేమ=సేవించువారమగుదుముగాక! అతనిని మీరును భజించుడు. ౭.

భావార్థము :— మానవులారా ! అన్నిదిక్కులనుండి వ్యాపకుడైన యే పరమాత్మయందు పృథివీ సూర్యాదిలోకములు భ్రమించుచున్నటుల గోచరమగుచున్నవో, ప్రాణాకాశములుకూడ యెవనిచే వ్యాప్తములై యున్నవో స్వాత్మయందు స్థితుడైన ఆ పరమాత్మను మీ రుపాసించుడు. ౭. [౧౬౮౭]

---

వేన ఇత్యస్య స్వయమ్భు బ్రహ్మ ఋషిః; పరమాత్మా దేవతా; నిచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయ మాహ. మరల నావిషయమే.

వేన స్తత్పశ్య న్నిహితం గుహా సద్యత్ర విశ్వం భవత్యేకనీడమ్ ।
తస్మిన్నిద సఞ్చ విచైతి సర్వఀ స ఓతః ప్రోతశ్చ విభూః ప్రజాసు.॥౮॥

వేనః, తత్, పశ్యత్, నిహితమితి ని+హితమ్,గుహా,సత్,యత్ర, విశ్వమ్, భవతి,ఏకనీడమిత్యేక+నీడమ్, తస్మిన్, ఇదమ్,సమ్,చ,వి,చ, ఏతి,సర్వమ్,సః,ఓత ఇత్యా+ఉతః, ప్రోత ఇతి ప్ర+ఉతః, చ, విభూరితి వి+భూః, ప్రజాస్వితి ప్ర+జాసు ॥౮॥

పదార్థః :—(వేనః)పణ్డితో విద్వాన్(తత్)చేతన బ్రహ్మ(పశ్యత్)పశ్యతి. (నిహితమ్)స్థితమ్ (గుహా)గుహాయాం బుద్ధౌ గుప్తే కారణే వా(సత్)నిత్యమ్(యత్ర)యస్మిన్(విశ్వమ్) సర్వం జగత్ (భవతి)(ఏకనీడమ్)ఏకస్థానమ్(తస్మిన్)(ఇదమ్)జగత్(సమ్)(చ)(వి)(చ) (ఏతి) (సర్వమ్) (సః) (ఓతః)ఊర్ధ్వతన్తుః పట ఇవ(ప్రోతః)తిర్యక్తన్తుషు పట ఇవ(చ)(విభూః)వ్యాపకః(ప్రజాసు)ప్రకృతి జీవాదిషు. ॥౮॥

అన్వయః :—హే మనుష్యా ! యత్ర విశ్వ మేకనీడం భవతి, తద్గుహా నిహితమ్ సద్ వేనః పశ్యత్. తస్మిన్నిదం సర్వం సమేతి చ వ్యేతి చ, స విభూః ప్రజాస్వోతః ప్రోతశ్చ. స ఏవ సర్వై రుపాసనీయోఽస్తి. ॥౮॥

భావార్థః :—హే మనుష్యా ! విద్వానేవ యం బుద్ధిబలేన జానాతి యః సర్వేషా మాకాశాదీనాం పదార్థానా మధికరణ మస్తి.యత్ర సంహారకాలే సర్వం జగల్లీయతే,సర్గకాలే చ యతో నిస్సరతి,యేన వ్యాప్తేన వినా కిఞ్చిదపి వస్తు న వర్తతే,తం విహాయాఽన్యం కఞ్చిదప్యుపాస్యమీశ్వరం మావిజానన్తు.

పదార్థము :—మానవులారా! యత్ర=ఎవనియందు,విశ్వమ్=సమస్త జగత్తు, ఏకనీడమ్=ఏకాశ్రయముగలది,భవతి=అగుచున్నదో, తత్ గుహా=ఆ గుహయందు, గుప్త కారణమునందు,నిహితమ్=స్థితుడు, సత్=నిత్యుడు, చేతనుడునగు బ్రహ్మను, వేనః= పండితుడైన విద్వాంసుడు,పశ్యత్=జ్ఞానదృష్టిచే చూచుచున్నాడు. తస్మిన్=అతనియందు, ఇదమ్ సర్వమ్= ఈ సకలజగత్తు, సమ్ ఏతి=ప్రలయసమయమున లీనమగును, చ= మఱియు నుత్పత్తి సమయములో, వి=పృథక్ స్థూలరూపముగ,చ=కూడ అగుచున్నది. సః=అతను,విభూః=వివిధరీతుల వ్యాపుడై, ప్రజాసు=ప్రజలలో, ఓతః=పడుగులోని వస్త్రము[పోగుల]వలె, చ=మఱియు ప్రోతః= పేకలోని వస్త్రము[పోగుల]వలె వ్యాప్తడగు చున్నాడో అతడే అందఱికి ఉపాసనీయుడు. ౮.

భావార్థము :—మానవులారా ! ఎవనిని విద్వాంసుడుమాత్రమే బుద్ధిబలముచే నెఱుగునో,ఎవడు ఆకాశాది పదార్థముల కాధారుడో, ప్రలయము నందెవ్వనియందు విశ్వము లీనమగునో,ఉత్పత్తి సమయమున నెవనినుండి వెలువడుచున్నదో, మఱియు నేవ్యాప్తేశ్వరుడు లేకుండగ నే వస్తువు ఖాళీగా లేదో,అట్టివానిని త్యజించి యితరుని నెవనిని ఉపాస్య దేవునిగ భావించకుడు. ౮. [౧౬౮౭౮]

---

౧౬౮౯ ప్ర తదిత్యస్య స్వయమ్భు బ్రహ్మ ఋషిః; విద్వాన్ దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మఱల నావిషయమే.

ప్ర తద్వోచేదమృతం ను విద్వాన్ గన్ధర్వో ధామ విభృతం గుహా సత్ ।
త్రీణి పదాని నిహితా గుహాస్య యస్తాని వేద స పితుః పితాఽసత్ ॥౯॥

ప్ర,తత్,వోచేత్,అమృతమ్,ను,విద్వాన్,గన్ధర్వః,ధామ,విభృత మితి వి+భృతమ్,గుహా, సత్,త్రీణి, పదాని,నిహితేతి ని+హితా,గుహా,అస్య,యః, తాని, వేద, సః, పితుః, పితా, అసత్ ॥౯॥

పదార్థః :—(ప్ర)(తత్)చేతనం బ్రహ్మ (వోచేత్)గుణకర్మస్వభావత ఉపదిశేత్(అమృతమ్) నాశరహితమ్(ను)సద్యః(విద్వాన్)పణ్డితః(గన్ధర్వః) యో గాం వేదవాచం ధరతి సః(ధామ) ముక్తి-సుఖస్య స్థానమ్(విభృతమ్) విశేషేణ ధృతమ్. (గుహా)బుద్ధౌ(సత్) నిత్యమ్ (త్రీణి) ఉత్పత్తిస్థితి-ప్రలయాః కాలా వా(పదాని)జ్ఞాతుమర్హాణి(నిహితా)నిహితాని(గుహా బుద్ధౌ(అస్య) అవినాశినః (యః) (తాని)(వేద)జానాతి(సః) (పితుః) జనకస్యేశ్వరస్య వా (పితా) జ్ఞానప్రదానేనా స్తికత్వేన వా రక్షకతి (అసత్)భవేత్. ॥౯॥

అన్వయః :—హే మనుష్యాః! యో గన్ధర్వో విద్వాన్ గుహా విభృత మమృతం ధామ తత్ సన్ను ప్రవోచేత్ యాన్యస్య గుహా నిహితాని పదాని త్రీణి సన్తి,తాని చ వేద, స పితుః పితాఽసత్.

భావార్థః :—హేమనుష్యా! య ఈశ్వరస్య ముక్తిసాధకం బుద్ధిస్థం స్వరూప ముపదిశేయు ర్యథార్థతయా పదార్థానాం పరమాత్మన శ్చ గుణకర్మస్వభావాన్ విజానీయు స్తే వయోవృద్ధానాం పితౄణా మపి పితరో భవితుం యోగ్యాః సన్తీతి విజానీత. ॥౯॥

పదార్థము :—మానవులారా! గంధర్వః=వేదవాణిని ధరించిన, యః విద్వాన్=ఏ విద్వాంసుడు,గుహా=బుద్ధిలో, విభృతమ్=విశేషించి ధారణమొనర్పబడిన, అమృతమ్= నాశరహితమైన,ధామ=ముక్తిస్థానమును,తత్=ఆ, సత్=నిత్యచేతన బ్రహ్మనుగుఱించి, ను=శీఘ్రముగ, ప్ర వోచేత్=గుణకర్మస్వభావములతో సహా ఉపదేశించునో మఱియు అస్య=ఈ అవినాశిబ్రహ్మయొక్క. గుహా=జ్ఞానమునందు,నిహితా=స్థితములైన, పదాని =తెలుసుకోదగిన,త్రీణి=ఉత్పత్తిస్థితి ప్రళయములను మూడు,భూత భవిష్యద్వర్తమాన ములను మూడు కాలములేవి ఉన్నవో,తాని=వానిని ఎవడు,వేద=ఎఱుగుచున్నాడో, సః =అతడు,పితుః=తనతండ్రికి,లేక సర్వరక్షకుడైన ఈశ్వరునికి, పితా=జ్ఞానమిచ్చువాడు లేక ఆస్తికత్వరక్షకుడు, అసత్=అగునుగాక: ౯.

భావార్థము :—ఓ మనుష్యులారా! ఏ విద్వాంసులు ఈశ్వరుని ముక్తిసాధకమును, బుద్ధిస్థ స్వరూపమును ఉపదేశించెదరో,సరిగాపదార్థములయొక్కయు,ఈశ్వరునియొక్కయు గుణకర్మ స్వభావములను ఎఱుగుదురో, వారు వయస్సునందు పెద్దలైన పితాదుల రక్షణకుకూడ యోగ్యులగు చున్నారు అని ఎఱుగుడు. ౯. [౧౬౮౯]

---

స న ఇత్యస్య స్వయంభు బ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

సన్నో బన్ధు ర్జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా ।
యత్ర దేవా అమృత మానశానా స్తృతీయే ధామన్న ధ్యైరయన్త ॥౧౦॥

సః,నః, బన్ధుః,జనితా, సః, విధాతేతి వి+ధాతా,ధామాని, వేద, భువనాని,విశ్వా, యత్ర, దేవాః, అమృతమ్, ఆనశానాః, తృతీయే, ధామన్, అధ్యైరయన్తేత్యధి+ ఐరయన్త ॥౧౦॥

పదార్థః :—(సః)(నః)అస్మాకమ్(బన్ధుః)భ్రాతేవ మాన్యః సహాయః(జనితా)జనయితా. అత్ర జనితా మన్త్రే ఇతి అ.౬.౪.౫౩ ణి లోపః. (సః)(విధాతా)సర్వేషాం పదార్థానాం కర్మఫలానాం చ విధానకర్తా(ధామాని)జన్మస్థాననామాని(వేద)జానాతి (భువనాని) లోక లోకాన్తరాణి(విశ్వా) సర్వాణి (యత్ర)యస్మిన్ జగదీశ్వరే(దేవాః)విద్వాంసః(అమృతమ్)మోక్షసుఖమ్(ఆనశానాః)ప్రాప్నువన్తః (తృతీయే)జీవప్రకృతిభ్యాం విలక్షణే(ధామన్)ధామన్యాధారభూతే(అధ్యైరయన్త)సర్వత్ర స్వేచ్ఛయా విచరన్తి. ॥౧౦॥

అన్వయః :—హే మనుష్యా! యత్ర తృతీయే ధామన్నమృతమానశానా దేవా అధ్యైరయన్త, యో విశ్వా భువనాని ధామాని చ వేద, స నో బన్ధుర్జనితా, స విధాతాఽస్తీతి నిశ్చినుత. ॥౧౦॥

భావార్థః :—హే మనుష్యా ! యస్మిఞ్ఛుద్ధస్వరూపే పరమాత్మని యోగినో విద్వాంసో ముక్తిసుఖం ప్రాప్య మోదన్తే స ఏవ సర్వజ్ఞః సర్వోత్పాదకః సర్వదా సహాయకారీ చ మన్తవ్యో నేతర ఇతి.

పదార్థము:—మానవులారా ! యత్ర=ఏ, తృతీయే=జీవప్రకృతులకు విలక్షణమైన ధామన్=ఆధారరూపమైన జగదీశ్వరునియందు, అమృతమ్=మోక్షసుఖమును,ఆనశానాః =పొందుచున్నవారై,దేవాః=విద్వాంసులు,అధ్యైరయన్త=సర్వత్ర స్వేచ్ఛగ విచారించు చున్నారో, ఎవడు,విశ్వా భువనాని=సకల లోకలోకాంతరములను, మఱియు, ధామాని= జన్మస్థాన నామములను,వేద=ఎఱుగుచున్నాడో, సః=ఆ పరమాత్మ,నః=మాకు, బంధుః =భ్రాతృతుల్యుడైన మాన్యసహాయకుడు, జనితా=ఉత్పన్న మొనర్చువాడు,సః=అతడు, విధాతా=సకల పదార్థములను, కర్మఫలములను విధాన మొనర్చువాడునై యున్నాడని నిశ్చయ మొనర్చుము. ౧౦.

భావార్థము :— మనుష్యులారా ! ఏ శుద్ధస్వరూపుడగు పరమాత్మయందు, యోగి రాజులు,విద్వాంసులు ముక్తి సుఖమును పొంది ఆనందించుచున్నారో అతడే సర్వజ్ఞుడు, సర్వోత్పాదకుడు మఱియు నెల్లప్పుడు సహాయకారుడు అని స్వీకరించవలయును. ఇతరుని స్వీకరించగూడదు. ౧౦. [౧౬౫౦]

---

**పరీత్యేత్యస్య స్వయంభు బ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా,నిచృత్త్రిష్టుప్ ఛందః,ధైవతః స్వరః.**
**పునస్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.**

పరీత్య భూతాని పరీత్య లోకాన్ పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ ।
ఉపస్థాయ ప్రథమజా మృతస్యాత్మనాఽత్మానమభి సం వివేశ ॥౧౧॥

పరీత్యేతి పరి+ఇత్య, భూతాని, పరీత్యేతి పరి+ఇత్య, లోకాన్, పరీత్యేతి పరి+ఇత్య,సర్వాః,ప్రదిశ ఇతి ప్ర+దిశః,దిశః,చ,ఉపస్థాయేత్యుప+స్థాయ,ప్రథమజామితి ప్రథమ+జామ్,ఋతస్య,ఆత్మనా,ఆత్మానమ్;అభి,సమ్,వివేశ ॥౧౧॥

పదార్థః :—(పరీత్య)పరితః సర్వతోఽభివ్యాప్య (భూతాని) (పరీత్య) (లోకాన్) దర్శిష్టవ్యాన్ పృథివీసూర్యాదీన్ (పరీత్య)(సర్వాః)(ప్రదిశః) ఆగ్నేయాద్యా ఉపదిశః (దిశః) పూర్వాద్యాః (చ)

అధః ఉపరి చ (ఉపస్థాయ) పఠిత్వా సంసేవ్య వా (ప్రథమజామ్) ప్రథమోత్పన్నాం వేదచతుష్టయీమ్ (ఋతస్య) సత్యస్య (ఆత్మనా) స్వస్వరూపేణాన్తఃకరణేన చ (ఆత్మానమ్) స్వరూపమధిష్ఠానం వా (అభి) అభిముఖ్యే (సమ్) సమ్యక్ (వివేశ) ప్రవిశతి ॥౧౧॥

అన్వయః:— హేవిద్వన్! త్వం యో భూతాని పరీత్య లోకాన్ పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ పరీత్య ఋతస్యాత్మాన మభిసంవివేశ. ప్రథమజా ముపస్థాయాత్మనా తం ప్రాప్నుహి॥౧౧॥

భావార్థః:— హేమనుష్యా! యూయం ధర్మాచరణ వేద యోగాభ్యాస సత్సఙ్గాదిభిః కర్మభిః శరీరపుష్టిం మాత్మాన్తఃకరణశుద్ధిం చ సంపాద్య సర్వత్రాభివ్యాప్తం పరమాత్మానం లబ్ధ్వా సుఖినో భవత ॥౧౧॥

పదార్థము:— విద్వాంసుడా! భూతాని=ప్రాణులందు, పరీత్య=అన్నివైపుల నుండి వ్యాప్తుడై, లోకాన్ =సూర్యాది లోకములందు, పరీత్య=వ్యాప్తుడై, చ=మఱియు క్రింద మీద, సర్వాః ప్రదిశః=ఆగ్నేయాది పది దిశలందు, మఱియు, దిశః= పూర్వాది దిశలందు, పరీత్య=అన్నివైపులనుండి వ్యాప్తుడై, ఋతస్య = సత్యము యొక్క, ఆత్మానమ్=స్వరూపము నందు లేక అధిష్ఠానమునందు, అభిసమ్‌వివేశ=ఎవడు సమ్ముఖమున చక్కగ ప్రవేశించు చున్నాడో అతనిని, ప్రథమజామ్=ప్రథమ కల్పాదిలో ఉత్పన్నమైన వేదచతుష్టయ వాణిని, ఉపస్థాయ=చదివి లేక చక్కగా సేవించి, ఆత్మనా=నీ శుద్ధస్వరూపముచే లేక అంతఃకరణముచే పొందుము ౧౧.

భావార్థము :— మానవులారా! మీరు ధర్మాచరణము, వేదాభ్యాసము, యోగాభ్యాసము, సత్సంగము మొదలైన కర్మలచే శారీరకపుష్టిని, ఆత్మాంతఃకరణముల శుద్ధిని సంపాదించి, సర్వత్ర నిండియున్న పరమాత్మను పొంది సుఖులు గండు. ౧౬౧

---

౧౬౨పరీత్యస్య స్వయమ్భు బ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః

పున స్తమేవ విషయ మాహ. మఱల విషయ మయ్యాదియే.

పరి ద్యావాపృథివీ సద్య ఇత్వా పరి లోకాన్ పరి దిశః పరి స్వః ।

ఋతస్య తన్తుం వితతం విచృత్య తదపశ్య త్తదభవ త్తదాసీత్ ॥౧౨॥

పరి, ద్యావా పృథివీ ఇతి ద్యావాపృథివీ, సద్యః, ఇత్వా, పరి, లోకాన్, పరి, దిశః, పరి, స్వరితి స్వః, ఋతస్య, తన్తుమ్, వితతమితి వి+తతమ్, విచృత్యేతి వి +చృత్య, తత్, అపశ్యత్, తత్, అభవత్, తత్, ఆసీత్ ।౧౨॥

పదార్థః—(పరి) సర్వతః (ద్యావాపృథివీ) సూర్యభూమీ(సద్యః) శీఘ్రమ్ (ఇత్వా) ప్రాప్య (పరి) సర్వతః (లోకాన్) ద్రష్టవ్యాన్ సృష్టిస్థాన్ భూగోలాన్ (పరి) (దిశః) పూర్వాద్యాః (పరి) (స్వః) సుఖమ్ (ఋతస్య) సత్యస్య (తన్తుమ్) కారణమ్ (వితతమ్) విస్తృతమ్ (విచృత్య) వివిధతయా గ్రన్థిత్వా బధ్వా (తత్) (అపశ్యత్) పశ్యతి (తత్) (అభవత్) భవతి (తత్) (ఆసీత్) అస్తి ॥౧౨॥

అన్వయః:— హే మనుష్యా! యః పరమేశ్వరో ద్యావాపృథివీ సద్య ఇత్వా పర్యపశ్య ద్యో లోకాన్ సద్య ఇత్వా పర్యభవత్. యో దిశః సద్య ఇత్వా పర్యాసీద్యః స్వః సద్య ఇత్వా పర్యపశ్యచ్య ఋతస్య వితతం తన్తుం విచృత్య తత్సుఖమపశ్యద్యేన తత్సుఖ మభవద్యత స్తద్విజ్ఞాన మాసీ త్తం యథావద్విజ్ఞాయోపాసీరన్ ॥౧౨॥

భావార్థః:— యే మనుష్యాః పరమేశ్వర మేవ భజన్తి, తన్నిర్మితాం సృష్టిం సుఖాయోప భుఞ్జతే, త ఐహికం పారమార్థికం విద్యాజన్యం సుఖం చ సద్యః ప్రాప్య సతత మానన్దన్తి ॥౧౨॥

పదార్థము:-మానవులారా!ఏ ఈశ్వరుడు,ద్యావాపృథివీ=సూర్యుని=భూమిని, సద్యః=శీఘ్రముగ, ఇత్వా=పొంది, పరి అపశ్యత్=అన్నివైపులనుండి చూచుచున్నాడో,ఎవడు,లోకాన్=చూడదగినసృష్టిస్థభూగోళములను శీఘ్రముగపొంది,పరిఅభవత్=అన్నివైపులనుండి ప్రకటితుడగుచున్నాడో,ఎవడు,దిశః=పూర్వాదిదిశలను శీఘ్రముగ పొంది, పరి=అన్నిదిక్కులనుండిచూచుచున్నాడో, ఎవడు, ఋతస్య=సత్యముయొక్క, వితతమ్=విస్తృతమైన, తంతుమ్=కారణమును, విచృత్య=వివిధ విధముల బంధించి, తత్=ఆసుఖమును చూచునో, ఎవనిచే, తత్=ఆసుఖము కలిగెనో, మఱియు ఎవని నుండి, తత్=ఆవిజ్ఞానముకలిగెనో అతనిని యథావతుగా నెఱిగి ఉపాసించుడు. ౧౨

భావార్థము:—ఏమానవులు పరమేశ్వరునే భజించుచున్నారో, అతడు నిర్మించిన సృష్టిని సుఖమునకై ఉపయోగించు చున్నారో,వారు ఐహికాముష్మిక విద్యాజన్య సుఖములను శీఘ్రముగ పొంది నిరంతరము ఆనందితు లగుదురు. ౧౨. ౧౬౬౩

---

౧౬౬౩ సదసస్పతి మిత్యస్య మేధాకామ ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిగ్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః
పున స్తమేవ విషయ మాహ. మఱల విషయ మయ్యదియే.

సదసస్పతి మద్భుతం ప్రియ మిన్ద్రస్య కామ్యమ్ ।
సనిం మేధా మయాసి షస్వాహా ॥ ౧౩ ॥

సదసః, పతిమ్, అద్భుతమ్, ప్రియమ్ ఇన్ద్రస్య, కామ్యమ్, సనిమ్, మేధామ్, అయాసిషమ్, స్వాహా ॥౧౩॥

పదార్థః:—(సదసః) సభాయా జ్ఞానస్య న్యాయస్య దణ్డస్య వా (పతిమ్) పాలకం స్వామినమ్ (అద్భుతమ్) ఆశ్చర్యగుణకర్మస్వభావమ్. (ప్రియమ్) ప్రీతివిషయం ప్రసన్నకరం ప్రసన్నం వా(ఇన్ద్రస్య) ఇన్ద్రియాణాం స్వామినో జీవస్య (కామ్యమ్) కమనీయమ్ (సనిమ్) సనన్తి సంవిభజన్తి సత్యాఽసత్యే యయా తామ్(మేధామ్)సఙ్గతాం ప్రజ్ఞామ్(అయాసిషమ్)ప్రాప్నుయామ్ (స్వాహా) సత్యయా క్రియయా వాచా వా ॥౧౩॥

అన్వయః:—హేమనుష్యా అహం స్వాహా యం సదసస్పతి మద్భుత మిన్ద్రస్య కామ్యం ప్రియం పరమాత్మాన ముపాస్య సంసేవ్య చ సనిం మేధా మయాసిషం తం పరిచర్యైతాం యూయమపి ప్రాప్నుత ॥౧౩॥

భావార్థః:—యే మనుష్యాః సర్వశక్తిమన్తం పరమాత్మానం సేవన్తే, తే సర్వా విద్యాః ప్రాప్య శుద్ధయా ప్రజ్ఞయా సర్వాణి సుఖాని లభన్తే. ॥౧౩॥

పదార్థము :—మానవులారా! నేను, స్వాహా=సత్యక్రియచే, సత్యవాణిచే, సదసః=సభకు, జ్ఞానమునకు, న్యాయమునకు, దండనమునకు, పతిమ్=రక్షకుడు,అద్భుతమ్=ఆశ్చర్యమైన గుణకర్మస్వభావములు కలవాడు. ఇంద్రస్య=ఇంద్రియముల కధిపతియైన జీవమునకు, కామ్యమ్=కమనీయుడు, ప్రియమ్=ప్రీతివిషయమున ప్రసన్నమొనర్చువాడు,లేక ప్రసన్నరూపుడునగునే పరమాత్మను ఉపాసించి, సేవించి, సనిమ్=సత్యాసత్యములను చక్కగా విడదీయు, మేధామ్=ఉత్తమబుద్ధిని, అయాసిషమ్=పొందుదునో, అయీశ్వరుని సేవించి యీబుద్ధిని మీరును పొందుడు. ౧౩

భావార్థము :—సర్వశక్తిమంతుడగు పరమాత్మను ఏ మానవులు సేవించుదురో వారన్నివిద్యలను పొంది శుద్ధబుద్ధిచే సకలసుఖములను సేవించుదురు. [౧౩] ౧౬౯౩

---

౧౬౯౪ యామిత్యస్య మేధాకామ ఋషిః, పరమాత్మా దేవతా,నిచృదనుష్టుప్ ఛన్దః,గాన్ధారః స్వరః.

మనుష్యై రీశ్వరాద్ బుద్ధి ర్యాచనీయేత్యాహ.

మానవు లీశ్వరునుండి బుద్ధిని యాచించవలయును.

యాం మేధాం దేవగణాః పితర శ్చోపాసతే । తయా మామద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా ॥౧౪॥

యామ్, మేధామ్, దేవగణా ఇతి దేవ+గణాః, పితరః, చ, ఉపాసత ఇత్యుప+ఆసతే, తయా, మామ్, అద్య, మేధయా, అగ్నే, మేధావినమ్, కురు, స్వాహా॥౧౪॥

పదార్థః:—(యామ్) (మేధామ్) ప్రజ్ఞాం ధనం వా. మేధేతి ధన నా...నిఘం. ౨. ౧౦. (దేవగణాః)దేవానాం విదుషాం సమూహాః (పితరః) పాలయితారో విజ్ఞానినః (చ) (ఉపాసతే) ప్రాప్య సేవన్తే (తయా)(మామ్) (అద్య) (మేధయా) (అగ్నే) స్వప్రకాశత్వేన విద్యావిజ్ఞాపక! (మేధావినమ్) ప్రశస్తా మేధా విద్యతే యస్య తమ్ (కురు)(స్వాహా)సత్యయా వాచా. ॥౧౪॥

అన్వయః— హే అగ్నే! విద్వన్నధ్యాపక! జగదీశ్వర! వా దేవగణాః పితరశ్చ యాం మేధా ముపాసతే, తయా మేధయా మామద్య స్వాహా మేధావినం కురు. ॥౧౪॥

భావార్థః:—మనుష్యాః పరమేశ్వర ముపాస్యాప్తం విద్వాంసం సంసేవ్య శుద్ధం విజ్ఞానం ధర్మజం ధనఞ్చ ప్రాప్తు మిచ్ఛేయు రన్యాంశ్చైవం ప్రాపయేయుః ॥౧౪॥

పదార్థము :— అగ్నే =స్వయంప్రకాశ స్వరూపుడవగుటచే విద్యను విజ్ఞాపనమొనర్చు ఈశ్వరుడా! లేక అధ్యాపకుడవైనవిద్వాంసుడా! దేవగణాః=అనేక విద్వాంసులు చ=మఱియు, పితరః=రక్షించుజ్ఞానులు, యామ్ మేధామ్=ఏ బుద్ధిని లేక ధనమును

ఉపాసతే=పొంది సేవించుచున్నారో, తయా మేధయా=ఆబుద్ధిచే, లేక ధనముచే, మామ్=నన్ను, అద్య=నేడు,స్వాహా=సత్యవాణిచే, మేధావినమ్=ప్రశంసితబుద్ధి లేక ధనము కలిగిన వానిగా, కురు=ఒనర్చుము. ౧౪ .

భావార్థము :— మనుష్యులు పరమేశ్వరుని ఉపాసనను ఆప్తవిద్వాంసుల సేవను చక్కగా నొనరించి, శుద్ధవిజ్ఞాన ధర్మములచే కలిగిన ధనమును పొందుట కిచ్ఛగించెదరు గాక! ఇతరులకు కూడనటులనే లభింపజేయుదురు గాక! ౧౪. ౧౬-౧౪

---

౧౬-౧౫ మేధామిత్యస్య మేధాకామ ఋషిః, పరమేశ్వర విద్వాంసౌ దేవతే,నిచృద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మఱల విషయ మయ్యాదియే.

మేధామ్మే వరుణో దదాతు మేధామగ్నిః ప్రజాపతిః । మేధా మిన్ద్రశ్చ వాయుశ్చ మేధామ్ ధాతా దదాతు మే స్వాహా ॥౧౫॥

మేధామ్, మే, వరుణః, దదాతు,మేధామ్, అగ్నిః, ప్రజాపతి రితి ప్రజా+పతిః,మేధామ్, ఇన్ద్రః, చ, మేధామ్, ధాతా, దదాతు, మే, స్వాహా॥౧౫॥

పదార్థః :— (మేధామ్) శుద్ధాం ధియం ధనం వా (మే) మహ్యామ్ (వరుణః) శ్రేష్ఠః (దదాతు) (మేధామ్) (అగ్నిః) విద్యాప్రకాశితః (ప్రజాపతిః) ప్రజాయాః పాలకః (మేధామ్) (ఇన్ద్రః) పరమైశ్వర్యవాన్ (చ) (వాయుః) బలిష్ఠో బలప్రదః (చ) (మేధామ్) (ధాతా) సర్వస్య సంసారస్య రాజ్యస్య (దదాతు) (మే) మహ్యామ్ (స్వాహా) ధర్మ్యయా క్రియయా. ॥౧౫॥

అన్వయః— హేమనుష్యాః యథా వరుణః పరమేశ్వరో విద్వాన్ వా స్వాహా మే మేధాం దదాతు. అగ్నిః ప్రజాపతి ర్మేధాం దదాతు. ఇన్ద్రో మేధాం దదాతు. వాయుశ్చ మేధాం దదాతు. ధాతా చ మే మేధాం దదాతు.తథా యుష్మభ్యమపి దదాతు. ॥౧౫॥

భావార్థః—మనుష్యా యథాఽత్మార్థం గుణకర్మస్వభావం సుఖం చేచ్ఛేయు స్తాదృశ మేవాఽన్యార్థమ్. యథా స్వస్యోన్నతయే ప్రార్థయేయు స్తథా పరమేశ్వరస్య విదుషాఞ్చ సకాశాదన్యేషామపి ప్రార్థయేయు ర్న కేవలం ప్రార్థనా మేవ కుర్యుః; కిం తర్హి? సత్యాచరణమపి. యదా యదా విదుషాం సమీపం గచ్ఛేయు స్తదా తదా సర్వేషాం కల్యాణాయ ప్రశ్నోత్తరాణి కుర్యుః ॥౧౫॥

పదార్థము :— మానవులారా! ఎటుల, వరుణః=అతిశ్రేష్ఠుడైన పరమేశ్వరుడు లేక విద్వాంసుడు, స్వాహా=ధర్మయుక్త క్రియచే,మే=నాకొఱకు,మేధామ్=శుద్ధ బుద్ధి లేక ధనమును, దదాతు=ఇచ్చునో,అగ్నిః=విద్యాప్రకాశితుడు,ప్రజాపతిః=ప్రజారక్షకుడు, మేధామ్=బుద్ధిని ప్రసాదించునో, ఇంద్రః=పరమైశ్వర్యవంతుడు, మేధామ్=బుద్ధి నొసగునో,చ=మఱియు, వాయుః=బలదాత,బలవంతుడు, మేధామ్=బుద్ధిని ఇచ్చునో, చ=మఱియు, ధాతా=సకలసంసారమ్మును లేక రాజ్యమును ధరించు నీశ్వ

రుడు లేక విద్వాంసుడు, మే = నాకు బుద్ధిని, ధనమును, దదాతు = ఇచ్చునో అటులనే మీకును ప్రసాదించుగాక ! ౧౫

భావార్థము :— మనుష్యుడెటుల తనకొరకు గుణకర్మ స్వభావములను సుఖములను వాంఛించునో అటులనే పరులకై కూడ కోరవలయును. ఎటుల తనయున్నతిని అభిలషించునో, అటులనే పరమేశ్వరుని సాన్నిధ్యమున, విద్వాంసుల సాంగత్యమున అన్యులయున్నతికై ప్రార్థించవలయును. కేవలము ప్రార్థనమొనర్చుటయేగాదు, సత్యాచరణము కూడ ఆచరించవలయును. విద్వాంసుల సాన్నిధ్యమున కేగినప్పుడెల్లా ఉందఱి కళ్యాణముకొఱకు ప్రశ్నోత్తరముల జరుపవలయును. (౧౫. ౧౬౯౫)

---

౧౬౯౬ ఇదం మ ఇత్యస్య శ్రీకామ ఋషిః, విద్వద్రాజానౌ దేవతే, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మఱల విషయ మయ్యదియే.

ఇదం మే బ్రహ్మ చ క్షత్రం చోభే శ్రియ మశ్నుతామ్ । మయి దేవా దధతు శ్రియ ముత్తమాం తస్యై తే స్వాహా॥౧౬॥

ఇదమ్, మే, బ్రహ్మ, చ, క్షత్రమ్, చ, ఉభే ఇత్యుభే, శ్రియమ్, అశ్నుతామ్, మయి, దేవాః, దధతు, శ్రియమ్, ఉత్తమామిత్యుత్ + తమామ్, తస్యై, తే, స్వాహా॥

పదార్థః:— (ఇదమ్)(మే)మమ (బ్రహ్మ) వేదేశ్వర విజ్ఞానం తద్వత్కులమ్ (చ) (క్షత్రమ్) రాజ్యం ధనుర్వేదవిద్యా క్షత్రియకులమ్(చ)(ఉభే)(శ్రియమ్)రాజ్యలక్ష్మీమ్(అశ్నుతామ్)ప్రాప్నుతామ్(మయి)(దేవాః)విద్వాంసః(దధతు)ధరన్తు(శ్రియమ్)శోభాం లక్ష్మీం చ.(ఉత్తమామ్) అతిశ్రేష్ఠామ్ (తస్యై) శ్రియై (తే) తుభ్యమ్ (స్వాహా) సత్యాచరణయా క్రియయా. ॥౧౬॥

అన్వయః:—హేపరమేశ్వర! భవత్కృపయా, హే విద్వన్! తవ పురుషార్థేన చ స్వాహా మే మమేదం బ్రహ్మ చ క్షత్రం చోభే శ్రియ మశ్నుతాం, యథా దేవా మయ్యుత్తమాం శ్రియం దధతు, తథాఽన్యేష్వపి. హే జిజ్ఞాసో! తే తుభ్యం తస్యై వయం ప్రయతేమహి. ॥౧౬॥

భావార్థః:—అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే మనుష్యాః పరమేశ్వరాజ్ఞా పాలనేన విదుషాం సేవయా సత్కారేణ సర్వేషాం మనుష్యాణాం మధ్యాద్బ్రాహ్మణ క్షత్రియా సుశిక్ష్య విద్యాది సద్గుణైః సంయోజ్య, సర్వేషా మున్నతిం విధాయ, స్వాత్మవత్ సర్వేషు వర్తేరన్, తే సర్వపూజ్యాః స్యు రితి. ॥౧౬॥

పదార్థము:— ఓ పరమేశ్వరా ! మీకృపచేతను, ఓ విద్వాంసుడా ! నీపురుషార్థము వలనను, స్వాహా = సత్యాచరణ క్రియచే, మే = నాయొక్క, ఇదమ్ = ఈ, బ్రహ్మ = వేదేశ్వరుల విజ్ఞానము లేక వాని(జ్ఞాత) నెఱుగు పురుషుడు,చ = మఱియు, క్షత్రమ్ = రాజ్యము, ధనుర్వేదవిద్య, క్షత్రియకులము, చ = మరియు, ఉభే = ఈయిరువురు, శ్రియమ్ = రాజ్యలక్ష్మిని, అశ్నుతామ్ = పొందుదురుగాక ! ఎటుల, దేవాః = విద్వాంసులు, మయి = నానిమిత్తము, ఉత్తమామ్ = అతిశ్రేష్ఠమైన, శ్రియమ్ = రాజ్యలక్ష్మిని, అశ్నుతామ్ = పొందుదురో ఎటుల, దేవాః = విద్వాంసులు, మయి = నానిమిత్తము ఉత్తమామ్ । శ్రియమ్ = అతిశ్రేష్ఠశోభను లేక లక్ష్మిని, దధతు = ధరించుదురో ! [అటులనే ఇతరులకు.] ఓ జిజ్ఞాసువా! తే = నీకొఱకును,తస్యై = ఆ శ్రీ నిమిత్తము, మేమును [అటులనే] ప్రయత్నించెదము గాక ! ౧౬

భావార్థము :— ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. ఏమానవులు పరమేశ్వరుని ఆజ్ఞాపాలనము వలన, విద్వాంసుల సేవాసత్కారముల వలన సకల మానవులమధ్య బ్రాహ్మణక్షత్రియులను సుందరశిక్షా విద్యాది సద్గుణములచే సుసంపన్నులుగ నొనర్చి అందఱియున్నతికై విధానమొనరించి తన ఆత్మవలెనె అందఱియందును ప్రవర్తించెదరో, వారందఱికి పూజించ యోగ్యులయ్యెదరు. ॥౧౬॥ ౧౬౯౬

ఈ అధ్యాయమునందు పరమేశ్వరుడు, విద్వాంసుడు, బుద్ధి, ధనము వీని ప్రాప్తికి ఉపాయముల వర్ణన యుండుటచే ఈ యధ్యాయము నందున్న యర్థమునకు పూర్వాధ్యాయమున చెప్పబడ్డ అర్థముతో సంగతి కలదని గ్రహించవలయును.

అత్ర పరమేశ్వర విద్వత్ ప్రజ్ఞా ధన ప్రాప్త్యుపాయ గుణ వర్ణనా దేతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సఙ్గతి ర్వేద్యా.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం శ్రీయుతపరమవిదుషాం శ్రీవిరజానంద సరస్వతీ స్వామినాం శిష్యేణ శ్రీపరమహంస పరివ్రాజకాచార్యేణ శ్రీమద్దయానన్ద సరస్వతీ స్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సమన్వితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే ద్వాత్రింశోఽధ్యాయః పూర్తిమ గాత్



కృష్ణా మండలాంతర్గత కుందేరు గ్రామవాస్తవ్యులగు
పాలడగు శేషాచలాచార్య, తదేవమండలాంతర్గత ముదునూరు
గ్రామవాస్తవ్యుడు అన్నే కేశవార్యశాస్త్రి గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన
శ్రీమద్దయానన్ద సరస్వతీ నిర్మిత యజుర్వేదభాషాభాష్యమందలి ౩౨వ అధ్యాయము సమాప్తము.

— ఇతి —



ఓమ్

# అథ త్రయ స్త్రింశ త్తమాధ్యాయారంభః

—————:O:—————

ముప్పదిమూడవ అధ్యాయము ప్రారంభము.

ఓం విశ్వాని దేవ సవిత ర్దురితాని పరాసువ।యద్భద్రం తన్న ఆ సువ ॥౧॥

౧౬౯౭ అస్యేత్యస్య వత్సప్రీర్ఋషిః, అగ్నయో దేవతాః, స్వరాట్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః॥

అథాగ్న్యాది పదార్థాన్ విజ్ఞాయ కార్యం సాధ్య మిత్యాహ॥

అగ్న్యాది పదార్థములను తెలిసికొని కార్యమును సాధించవలయును.

అస్యా జరాసో దమా మరిత్రా అర్చద్ధూమాసో అగ్నయః పావకాః। శ్వితీచయః శ్వాత్రాసో భురణ్యవో వనర్షదో వాయవో న సోమాః ॥౧॥

అస్య, అజరాసః, దమామ్, అరిత్రాః, అర్చద్ధూమాస ఇత్యర్చత్+ధూమాసః, అగ్నయః, పావకాః, శ్వితీచయః, శ్వాత్రాసః, భురణ్యవః,వనర్షదః, వ నసద ఇతి వన+సదః, వాయవః, న, సోమాః ॥౧॥

పదార్థః:— (అస్య)పరమేశ్వరస్య(అజరాసః)వయో హానిరహితాః(దమామ్)గృహాణామ్, అత్రనుడభావే పూర్ణసవర్ణదీర్ఘః (అరిత్రాః)యేఽరిభ్యస్త్రాయన్తే తే (అర్చద్ధూమాసః)అర్చన్తః సుగన్ధియుక్తా ధూమా యేషా న్తే(అగ్నయః)విద్యుదాదయః(పావకాః)పవిత్రీకరాః (శ్వితీచయః) యే శ్వితిం శ్వేతవర్ణం చిన్వన్తి తే (శ్వాత్రాసః)శ్వాత్రం ప్రవృద్ధం ధనం యేభ్య స్తే, శ్వాత్రమితి ధన నా...నిఘం. ౨. ౧౦.(భురణ్యవః)ధర్తారో గతిమన్తశ్చ (వన ర్షదః) యే వనేషు రశ్మిషు సీదన్తి తే,అత్ర వా ఛన్దసీతి రుడాగమః(వాయవః)పవనాః(న)ఇవ(సోమాః)ఐశ్వర్యప్రాపకాః ॥౧॥

అన్వయః:— హే మనుష్యా! యేఽస్య జగదీశ్వరస్య సృష్టావజరాసోఽరిత్రా అర్చద్ధూమాసః పావకాః శ్వితీచయః శ్వాత్రాసో భురణ్యవః సోమా అగ్నయో వనర్షదో వాయవో న దమాం ధారకాః సన్తి, తాన్ యూయం విజానీత॥౧॥

భావార్థః:— అత్రోపమాలంకారః. యది మనుష్యా అగ్నివాయ్వాదీన్ సృష్టిస్థాన్ పదార్థాన్ విజానీయు స్తర్హ్యేతేభ్యో బహూ నుపకారాన్ గ్రహీతుం శక్నుయుః॥౧॥

పదార్థము :— మానవులారా!(అస్య)ఈ పూర్వాధ్యాయోక్త ఈశ్వరుని సృష్టియందు(అజరా సః) ఒకే అవస్థగలవి (అరిత్రాః) శత్రువుల నుండి కాపాడునవి(అర్చద్ధూమాసః)సుగంధిత ధూమయుక్తములు(పావకాః) పవిత్ర కారకములు(శ్వితీచయః)శ్వేత వర్ణమును కూడబెట్టునవి(శ్వాత్రాసః) ధనాభివృద్ధికి హేతువులు(భురణ్యవః) ధారణమొనర్చునవి లేక గమనశీలముగలవి (సోమాః)ఐశ్వర్యమును పొందునవి యగు(అగ్నయః) విద్యుదాద్యగ్నులు(వనర్షదః)వనములందుండు లేక కిరణములందుండు (వాయవఃన) వాయువులవలె (దమామ్)గృహమును ధరించునవేవి యున్నవో వానిని మీరు తెలిసికొనుడు ॥౧౬॥

భావార్థము :- ఇందుపమా లంకార మున్నది. మానవులు అగ్ని వాయ్వాది సృష్టిస్థిత పదార్థములను తెలిసికొనుచో వానివలన ననేకోపకారములను గ్రహింప గలుగుచున్నారు ॥౧॥ ౧౬౯౭

హరయ ఇత్యస్య విశ్వరూప ఋషిః,అగ్న యో దేవతాః,గాయత్రీ ఛన్దః, అగ్న యో దేవతాః,షడ్జఃస్వరః

పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

హరయో ధూమకేతవో వాతజూతా ఉప ద్యవి. యతన్తే వృథగగ్నయః ॥౨॥

హరయః, ధూమకేతవ ఇతి ధూమ+కేతవః, వాతజూతా + ఇతి వాత జూతాః, ఉప,ద్యవి, యత న్తే, వృథక్, అగ్నయః ॥౨॥

పదార్థః- (హరయః) హరణశీలాః(ధూమకేతవః) కేతురివ ధూమో జ్ఞాపవో యేషా న్తే (వాతజూతాః) వాయునా ప్రాప్తతేజస్కాః (ఉప)(ద్యవి) ప్రకాశే (యత న్తే)(వృథక్)పృథక్ వర్ణవ్యత్యయః (అగ్నయః)పావకాః. ॥౨॥

అన్వయః :-హే మనుష్యా! యే ధూమకేతవో వాతజూతా హరయోఽగ్నయో వృథక్ ద్యవి ఉప యత న్తే, తాన్ కార్యసిద్ధయే సంప్రయుఙ్గ్ధ్వమ్. ॥౨॥

భావార్థః :- హేమనుష్యా యేషాం ధూమో విజ్ఞాపకో వాయుః ప్రదీపకో హరణ శీలతా చ యేషు వ ర్తతే, తేఽగ్నయః స న్తీతి విజానీత ॥౨॥

పదార్థము :- ఓమానవులారా(ధూమకేతవః) పతాకమువలె తెలియజేయు ధూమముగలవి(వాతజూతాః)వాయువువలన తేజమునుపొందునవి (హరయః) హరణ శీలములునగునే (అగ్నయః) అగ్నులు(వృథక్) పలు విధములుగ(ద్యవి)ప్రకాశ నిమిత్త ములై (ఉపయత న్తే)యత్నముచేయుచున్నవో వానిని కార్యసిద్ధికై ఉపయోగించుడు.

భావార్థము- మానవులారా! వేనిని ధూమము జ్ఞానమును కలుగజేయునో, వాయువు ప్రదీప్తమొనర్చునో, వేనియందు హరణశీలత్వమున్నదో అవి యగ్నులని తెలుసుకొనుడు. ॥౨॥ ౧౬౯౮

---

౧౬౯౯ యజాన ఇత్యస్య గోతమ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః॥

విద్వద్భి ర్మనుష్యైః కిం కార్య మిత్యాహ॥ విద్వాంసు లేమి చేయవలయును ?

యజానో మిత్రావరుణా యజా దేవాఀ౨॥ఋతం బృహత్ ।

అగ్నే యక్షి స్వం దమమ్ ॥౩॥

యజ, నః, మిత్రా వరుణా, యజ, దేవాన్, ఋతమ్, బృహత్, అగ్నే. యక్షి, స్వమ్, దమమ్ ॥౩॥

పదార్థః :- (యజ)సత్కురు (నః) అస్మాకమ్ (మిత్రావరుణా) సుహృచ్ఛ్రేష్ఠౌ(యజ) దేహ్యుపదిశ, అత్రోభయ త్రద్వ్యచోఽ త స్తిఙ ఇతి దీర్ఘః(దేవాన్) విదుషశ్చ (ఋతమ్) సత్యమ్ (బృహత్) మహత్(అగ్నే) విద్వన్ (యక్షి) సంగమయ (స్వమ్) స్వకీయమ్(దమమ్)గృహమ్॥౩॥

అన్వయః :— హే అగ్నే త్వం నో మిత్రావరుణా దేవాంశ్చ యజ. బృహదృతం యజ. యేన స్వం దమం యక్షి॥౩॥

భావార్థః :— హే విద్వాఀసో జనా! అస్మాకం మిత్ర శ్రేష్ఠవిదుషాం సత్కర్తారః సత్యోపదేశకాః స్వగృహకార్యసాధకా యూయం భవత. ॥౩॥

పదార్థము:— (అగ్నే) విద్వాంసుడా!నీవు (నః) మాయొక్క (మిత్రావరుణా) మిత్రులను శ్రేష్ఠజనులను (దేవాన్) విద్వాంసులను (యజ) సత్కరించుము. (బృహత్ ఋతమ్) గొప్ప సత్యమును (యజ) ఉపదేశించుము. దానిచే (స్వమ్ దమమ్) స్వకీయ గృహమును (యక్షి) సంగతమొనరించుము ॥౩॥

భావార్థము :— విద్వాంసులారా! మీరు మామిత్రులను, శ్రేష్ఠులను, విద్వాంసులను సత్కరించు వారుగను, సత్యోపదేశకులుగను, స్వగృహకార్యసాధకులుగను గండు.

---

౧౭౦౦ యుక్ష్వేత్యస్య విశ్వరూప ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః

పునస్తమేవ విషయ మాహ. మరలనదే విషయము.

యుక్ష్వా హి దేవహూతమాఀ ౨॥ అశ్వాఀ ౨॥ అగ్నే రథీరివ ।
నిహోతా పూర్వ్యః సదః ॥౪॥

యుక్ష్వ, హి, దేవహూతమానితి దేవ+హూతమాన్, అశ్వాన్,అగ్నే, రథీరివేతి రథీః+ఇవ, ని, హోతా, పూర్వ్యః, సదః ॥౪॥

పదార్థః :—(యుక్ష్వ)యోజయ. అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః,(హి) ఖలు(దేవహూతమాన్)యే దేవైర్విద్వద్భిర్హూయన్తే స్తూయన్తే తేఽతిశయితాస్తాన్ (అశ్వాన్) ఆశుగామినోఽగ్న్యాదీన్ తురఙ్గాన్ వా (అగ్నే) విద్వన్(రథీ రివ)యథా సారథిస్తథా. అత్ర మత్వర్థే ఈర్ ప్రత్యయః (ని) నితరామ్ (హోతా) ఆదాతా(పూర్వ్యః)పూర్వైః కృతవిద్యః (సదః) అత్రాడభావః ॥౪॥

అన్వయః :— హే అగ్నే! త్వం రథీ రివ దేవహూతమానశ్వాన్ యుక్ష్వ, హోతా పూర్వ్యః సన్ హి ని సదః ॥౩౩. ౪॥

భావార్థః:- అత్రోపమాలంకారః. యథా సుశిక్షితః సారథి రశ్వై రనేకాని కార్యాణి సాధ్నోతి తథా కృతవిద్యో జనోఽగ్న్యాదిభి రనేకాని కార్యాణి సాధ్నుయాత్ ॥౩౩ ౪॥

పదార్థము:— (అగ్నే)విద్వాంసుడా! నీవు(రథీ రివ)సారథివలె(దేవహూతమాన్) విద్వాంసులచే నత్యంతము స్తుతించబడిన(అశ్వాన్)శీఘ్రగాములైన అగ్న్యాదులను లేక గుఱ్ఱములను(యుక్ష్వ)సంప్రయుక్తమొనర్చుము (పూర్వ్యః)పూర్వజులైన విద్వాంసుల వలన విద్యను పొందినవాడవు (హోతా) గ్రహించువాడవునై (హి)నిశ్చయముగ (ని సదః)స్థిరుడ వగుము ॥౪॥

భావార్థము :— ఇందు వాచక లుప్తోపమాలంకార మున్నది. ఉత్తమశిక్షితుడైన సారథి గుఱ్ఱముతో ననేక కార్యముల నెట్లు సాధించుచున్నాడో, అటులనే విద్వాంసుడు

అగ్న్యాదులతో ననేక కార్యములను సాధించవలయును ॥౪॥ [౧౨౦౦]

౧౨౦౧ ద్వే ఇత్యస్య కుత్సఋషిః, అగ్నిర్దేవతా, స్వరాట్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః

రాత్రిదివసౌ జగత్పాలకౌ విత్యాహ. రాత్రింబగళ్ళు జగమును రక్షించుచున్నవి.

ద్వే విరూపే చరతః స్వర్థే అన్యాన్యా వత్స ముపధాపయేతే। హరి రన్యస్యాం భవతి స్వధావాఞ్ఛుక్రో అన్యస్యాం దదృశే సువర్చా ॥౫॥

ద్వే ఇతి ద్వే, విరూపే ఇతి వి+రూపే, చరతః, స్వర్థేఇతిసు+అర్థే, అన్యాన్యే త్యన్యా+అన్యా, వత్సమ్, ఉప, ధాపయేతే ఇతి ధాపయేతే, హరిః, అన్యస్యామ్, భవతి, స్వధావానితి స్వధా+వాన్, శుక్రః, అన్యస్యామ్, దదృశే, సువర్చా ఇతి సు+వర్చాః ॥౫॥

పదార్థః :— (ద్వే) (విరూపే) విరుద్ధస్వరూపే (చరతః) (స్వర్థే) సుష్ఠు అర్థః ప్రయోజనం యయోస్తే (అన్యాన్యా) భిన్నా భిన్నా ఏకైకా కాలభేదేన (వత్సమ్) వసన్తి భూతాన్యస్మింస్తం సంసారం వదతి సతతమితి వత్సో బాలస్తం వా (ఉప) (ధాపయేతే) పాయయతః (హరిః) మనోహారీ చన్ద్రో బాలో వా (అన్యస్యామ్) రాత్రౌ యోషితి వా (భవతి) (స్వధావాన్) ప్రశస్తస్వధా అమృతరూపా గుణా విద్యన్తే యస్మిన్ సః (శుక్రః) పావకః సూర్య ఆశుకారీ బాలశ్చ (అన్యస్యామ్) ప్రకాశరూపాయాం దివసవేలాయాం జాయాయాం వా (దదృశే) దృశ్యతే (సువర్చాః) సుష్ఠు తేజాః ॥౫॥

అన్వయః :—హే మనుష్యా! యథా స్వర్థే ద్వే విరూపే స్త్రియౌ చరతోఽన్యాన్యా చ వత్స ముపధాపయేతే తయో రన్యస్యాం స్వధావాన్ హరి ర్భవతి శుక్రః సువర్చా అన్యస్యాం దదృశే తథా ద్వే రాత్ర్యహనీ వర్తేతే ఇతి జానీత ॥౫॥

భావార్థః— అత్రానుభయాభేదరూపకోఽలఙ్కారః :- యథా ద్వే స్త్రియౌ వా గావావవత్యప్రయోజనే పృథక్ పృథక్ వర్తమానే కాలభేదేనైకం బాలం పాలయేతాం తయో రేకస్యాం హృద్యో మహాగుణీ శాన్తిశీలో బాలో జాయేత। ఏకస్యాఞ్చ శీఘ్రకారీ తేజస్వీ శత్రుతాపకో బాలో జాయేత, తథా ద్వే రాత్ర్యహనీ భిన్నస్వరూపే కాలభేదే నైకం సంసారం పాలయతః. కథం రాత్రి రమృతవర్షకం చిత్తప్రసాదకం చన్ద్రమస ముత్పాద్య దివసరూపా చ పావకరూపం శోభనప్రకాశం సూర్యముత్పాద్యేతి పూర్వాన్వయః ॥౫॥

పదార్థము :— మానవులారా! (స్వర్థే)సుందర ప్రయోజనముగల(ద్వే)ఇరువురు (విరూపే) భిన్న భిన్నరూపముగలిగియున్న స్త్రీలు(చరతః)భోజనాదులనాచరించుచు (అన్యాన్యా)ఒక్కొక్కరు భిన్న భిన్న సమయములందు (వత్సమ్) నిరంతరము మాటలాడు ఒకానొక బాలకునికి (ఉపధాపయేతే) సమీపించి పాలుత్రాగించుచున్నారు. (అన్యస్యామ్) ఆయిరువురియందొకా మెకు(స్వధావాన్) ప్రశస్తశాంత్యాద్యమృతతుల్యగుణయుక్తుడగు (హరిః) మనస్సును హరించు పుత్రుడు (భవతి) ఎట్లు అగుచున్నాడో మఱియు(శుక్రః)శీఘ్రకారి (సువర్చాః)సుందరతేజస్వియగు [పుత్రుడు] (అన్యస్యామ్) రెండవఆమె యందెటుల(దదృశః)కనబడుచున్నాడో అటులనే సుందర ప్రయోజనము

గల రెండు నలుపు తెలుపు వేర్వేరు రూపములుగల రాత్రి,పగలు వర్తమానములై యున్నవి. మఱియునొక్కొక్కటి వేఱువేఱు సమయములందు సంసారరూపబాలునొకనికి దుగ్ధాదులు త్రాగించుచున్నవి. ఆరెంటియందొకటియగు రాత్రియందు అమృతసూతియై మనస్సును ప్రసన్నపఱచు చంద్రుడుత్పన్నమగుచున్నాడు. మఱియు రెండవదియగు దినమునందు పవిత్రకర్తయు, సుందరతేజము గలవాడునునగు సూర్యరూప పుత్రుడు కనబడుచున్నాడు అని మీరెఱుంగవలయును.

భావార్థము :— ఈమంత్రమందను భయా ఖేదరూపకా లంకారమున్నది. ఎట్లు ఇరువురు స్త్రీలు లేక రెండుఆవులు సంతాన ప్రయోజనముగలవియై వేర్వేఱుగా నుండుచు భిన్నభిన్న సమయములందొక బాలకుని రక్షించుచో, ఆయిరువురియందొక రైకు మనోహరుడు మహాగుణి, శాంతిశీలుడునగు బాలుడును, రెండవ యామెయందు శీఘ్రకారి, తేజస్వి, శత్రుతాపకుడునగు బాలకుడునుకలుగునో, అటులనే భిన్నరూపముగల దివారాత్రములు రెండు వేఱు వేఱు సమయములందొక సంసార రూపబాలుని పాలించుచున్నవి. రాత్రి అమృతమును వర్షించి చిత్తమును ప్రసన్నపఱచు చంద్రరూప బాలకుని ఉత్పత్తిచేసియు, మఱియు దినరూపస్త్రీ తేజోమయ సుందరప్రకాశముగల సూర్యరూప పుత్రుని నుత్పత్తిచేసియు నని పూర్వముతో నన్వయము. ౫ [౧౨౦౧]

---

[౧౨౦౨] అయమిత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్దేవతా, భురిక్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.
విద్వద్భిః కిం కర్తవ్య మిత్యాహ॥. విద్వాంసు లేమి చేయవలయును ?

అయ మిహ ప్రథమో ధాయి ధాతృభి ర్హోతా యజిష్ఠో అధ్వరేష్వీడ్యః ।
యమప్నవానో భృగవో విరురుచు ర్వనేషు చిత్రం విభ్వం విశే విశే ॥౬॥

అయమ్, ఇహ, ప్రథమః, ధాయి, ధాతృభి రితి ధాతృ+భిః, హోతా, యజిష్ఠః, అధ్వరేషు, ఈడ్యః, యమ్, అప్నవానః, భృగవః, విరురుచు రితి వి+రురుచుః, వనేషు, చిత్రమ్, విభ్వమితి విభ్వమ్, విశే విశ ఇతి విశే+విశే ॥౬॥

పదార్థః :— (అయమ్) విద్యుదాదిస్వరూపః (ఇహ) అస్మిన్ సంసారే (ప్రథమః) విస్తీర్ణః (ధాయి) ధ్రియతే (ధాతృభిః) ధర్తృభిః (హోతా) సుఖదాతా (యజిష్ఠః) అతిశయేన యష్టా సఙ్గమయితా (అధ్వరేషు) అహింసనీయేషు వ్యవహారేషు (ఈడ్యః) అధ్యేషణీయః (యమ్) (అప్నవానః) సుసన్తానయుక్తాః సుశిష్యాః (భృగవః) పరిపక్వజ్ఞానాః (విరురుచుః) విశేషేణ దీపయేయుః (వనేషు) కిరణేషు వా (చిత్రమ్) అద్భుతగుణ కర్మస్వభావమ్ (విభ్వమ్) విభుం విద్యుదాఖ్యమగ్నిమ్ (విశే,విశే) ప్రజాయై, ప్రజాయై ॥౩౩ ౬॥

అన్వయః :- హే మనుష్యా యథా ధాతృభి రిహ విశే విశేఽయం ప్రథమో హోతా యజిష్ఠోఽధ్వరేష్వీడ్యో ధాయి, యథా భృగవశ్చాప్నవానో యం వనేషు చిత్రం విభ్వం విరురుచు స్తం యూయం ధరత ప్రకాశయత చ ॥౩౩ ౬॥

భావార్థః :. అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే విద్వాంస ఇహ విద్యుద్విద్యాం జానన్తి తే సర్వాః ప్రజాః సర్వసుఖయుక్తాః కర్తుం శక్నువన్తి ॥౩౩ ౬॥

పదార్థము :— మానవులారా! ఎట్లు(ధాతృభిః) ధరించువారిచే (ఇహ)ఈసంసార మున(విశేవిశే) ప్రజలకొఱకు(అయమ్) ఈ (ప్రథమః)విస్తారముగలది (హోతా)సుఖ దాత(యజిష్ఠః) అతిశయముగ సంగత మొనర్చునది(అధ్వరేషు) రక్షణీయ వ్యవహారము లందు(ఈడ్యః)అన్వేషించదగిన విద్యుదగ్ని(ధాయి)ధారణచేయబడుచున్నదో,మఱియు నెట్లు(భృగవః)దృఢమైనజ్ఞానముగలవారు(అప్నవానః)సుసంతానయుతులునగునుత్తమ శిష్యులు (వనేషు) వనములందు అథవా కిరణములలో(చిత్రమ్)ఆశ్చర్యరూప గుణకర్మ స్వభావములుగలది(యమ్విభ్వమ్) వ్యాపకమునగునే విద్యుదూపాగ్నిని (విరురుచుః) విశేషముగపొందుదురో దానిని అటులనే మీరును ధరించి ప్రకాశపఱచుడు॥౬॥

భావార్థము:—ఇందు వాచక లుప్తోపమాలంకార మున్నది. ఏ విద్వాంసులీ లోకమున విద్యుద్విద్యను తెలుసుకొనుచున్నారో వారు సకలప్రజలను సుఖసమన్వితు లుగ నొనర్చుటకు సమర్థులగుచున్నారు॥౬॥ ౧౭౦౨.

---

౧౭౦౩ త్రీణి శతేత్యస్య విశ్వామిత్ర ఋషిః, విద్వాంసో దేవతాః, స్వరాట్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః

శిల్పినో విద్వాంసః కిం కుర్యు రిత్యాహ. శిల్పులు,విద్వాంసులు ఏమిచేయవలెను?

త్రీణి శతా త్రీ సహస్రాణ్యగ్నిం త్రింశచ్చ దేవా నవ చా సపర్యన్।

ఔక్షన్ ఘృతై రస్తృణన్బర్హి రస్మాఽఆది ద్ధోతారం న్యసాదయన్త ॥౭॥

త్రీణి. శతా, త్రీ, సహస్రాణి, అగ్నిమ్, త్రింశత్, చ, దేవాః, నవ, చ, అసపర్యన్, ఔక్షన్, ఘృతైః, అస్తృణన్, బర్హిః, అస్మై, ఆత్, ఇత్, హోతారమ్, ని, అసాదయన్త ॥౭॥

పదార్థః :- (త్రీణి)(శతా) శతాని (త్రీ)త్రీణి (సహస్రాణి) సహస్రకోశమార్గమ్ (అగ్నిమ్) (త్రింశత్) పృథివ్యాదీన్, (చ)(దేవాః) విద్వాంసః, (నవ) (చ) (అసపర్యన్) సేవేరన్ (ఔక్షన్) సిఞ్చేరన్ (ఘృతైః) ఘృతాదిభి రుదకేన వా (అస్తృణన్) ఆచ్ఛాదయన్తు (బర్హిః) అన్తరిక్షమ్ (అస్మై) అగ్నయే (ఆత్) అభితః (ఇత్) ఏవ (హోతారమ్) హవనకర్తారమ్ (ని) నితరామ్ (అసాదయన్త) స్థాపయన్తు ॥౭॥

అన్వయః :— హే మనుష్యా! యథా త్రింశచ్చ నవ చ దేవాస్త్రీణి శతా త్రీ సహస్రాణ్యగ్ని మసపర్యన్ ఘృతైరౌక్షన్ బర్హిరస్తృణన్నస్మై హోతార మాదిన్న్యసాదయన్త, తథా యూయమపి కురుత ॥౩॥

భావార్థః :— అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. యే శిల్పినో విద్వాంసోఽగ్నిజలాది పదార్థాన్ యానేషు సంప్రయోజ్యోత్తమ మధ్యమ నికృష్ట వేగై రనేకాని శతాని సహస్రాణి క్రోశాన్మార్గం గన్తుం శక్నుయు స్తేఽన్తరిక్షేఽపి యాతుం సమర్థా జాయన్తే ॥౭॥

పదార్థము :— మానవులారా! ఎట్లు (త్రింశత్) పృథివిమొదలగు ముప్పదింటిని (చ) మఱియు (నవ) తొమ్మిదింటిని (చ దేవాః) మఱియు సకల విద్వాంసులు, (త్రీణిశతా) మూడువందల (త్రీ) (సహస్రాణి) మూడువేలకోసుల మార్గమున (అగ్నిమ్) అగ్నిని (అసపర్యన్) సేవింతురో (ఘృతైః) నేతితో, లేక జలములతో (ఔక్షన్

తడపుదురో (బర్హిః) అంతరిక్షమును (అస్తృణన్)ఆచ్ఛాదిత మొనర్చుదురో (అస్మై)ఈ అగ్నినిమిత్తము (హోతారమ్)హవన మొనర్చు వానిని(అత్,ఇత్)సకలదిశల నుండియు (ని,ఆసాదయన్త) నిరంతరము స్థాపిత మొనర్చుదురో, అటులనే మీరును చేయుడు.

భావార్థము :— ఇందు వాచకలుప్తోపమాలంకారమున్నది. విద్వాంసులైనట్టి శిల్పులు అగ్నిజలాది పదార్థములను యానములందు సంయుక్తపఱచి ఉత్తమ, మధ్యమ, నికృష్ట వేగములతో ననేకవందల వేల కోసులమార్గము పోగలరో వారు ఆకాశమున పయనించుటకు సమర్థులగుచున్నారు ॥౭॥ [౧౭౦౩]

---

౧౭౦౪ మూర్ధానమిత్యస్య విశ్వామిత్ర ఋషిః, విద్వాంసో దేవతాః, భురిక్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః

పునస్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

మూర్ధానం దివో అరతిం పృథివ్యా వైశ్వానర మృత ఆ జాత మగ్నిమ్।
కవిꣳ సమ్రాజ మతిథిం జనానా మాసన్నా పాత్రం జనయన్త దేవాః ॥౮॥

మూర్ధానమ్, దివః, అరతిమ్, పృథివ్యాః, వైశ్వానరమ్, ఋతే, ఆ, జాతమ్, అగ్నిమ్, కవిమ్, సమ్రాజమితి సమ్ + రాజమ్, అతిథిమ్, జనానామ్, ఆసన్, ఆ, పాత్రమ్, జనయన్త, దేవాః, ॥౮॥

పదార్థః :— (మూర్ధానమ్) శిరోవదున్నతప్రదేశే సూర్యరూపేణ వర్తమానమ్ (దివః) ఆకాశస్య (అరతిమ్) ప్రాప్తమ్ (పృథివ్యాః) (వైశ్వానరమ్) విశ్వేభ్యో నరేభ్యో హితమ్ (ఋతే) యజ్ఞనిమిత్తమ్ (ఆ) సమన్తాత్. (జాతమ్) ప్రాదుర్భూతమ్ (అగ్నిమ్) పావకమ్ (కవిమ్) క్రాంతదర్శకమ్, (సమ్రాజమ్) యః సమ్యగ్రాజతే తమ్ (అతిథిమ్) అతిథివద్వర్తమానమ్ (జనానామ్) మనుష్యాణామ్ (ఆసన్) ముఖే ఉత్పన్నమ్ (ఆ) సమన్తాత్, (పాత్రమ్) పాన్తి రక్షన్తి యేన తమ్ (జనయన్త) ప్రాదుర్భావయేయుః (దేవాః) విద్వాంసః ॥౮॥

అన్వయః :— హే మనుష్యా! యథా దేవా దివో మూర్ధానం పృథివ్యా అరతిం వైశ్వానర మృత ఆజాతం కవిం సమ్రాజం జనానా మతిథిం పాత్రమాసన్నగ్ని మా జనయన్త, తథా యూయ మప్యేనం ప్రాదుర్భావయుత ॥౮॥

భావార్థః :— అత్ర వాచకలు.... యే పృథివ్యప్వాయ్వాకాశేషు వ్యాప్తం విద్యుదాఖ్య మగ్నిం పాదుర్భావ్య యన్త్రాదిభి ర్యుక్త్యా చాలయేయుస్తే కిం కిం కార్యం న సాధయేయుః ॥౮॥

పదార్థము :— మానవులారా! ఎట్లు (దేవాః) విద్వాంసులు (దివః) ఆకాశము యొక్క (మూర్ధానమ్) పైభాగమున సూర్యరూపమున వర్తమానమైయున్నదియు (పృథివ్యాః)భూమిమీద (అరతిమ్) ప్రాప్తించునది, (వైశ్వానరమ్) సకలమానవులకు హితమొనర్చునది.(ఋతే)యజ్ఞనిమిత్తము(ఆ జాతమ్)బాగుగా ప్రకటితమైనది (కవిమ్) సర్వమును చూపెట్టునది (సమ్రాజమ్) బాగుగా ప్రకాశమానము (జనానామ్) మానవులకు (అతిథిమ్) ప్రథమమున భోజనభాగమును తీసికొను అతిథివలె నున్నది (పాత్రమ్) రక్షణహేతువు (ఆసన్)ఈశ్వరుని యొక్క ముఖరూప సామర్థ్యమందుత్పన్నమైనదియు

నగు (అగ్నిమ్) అగ్నిని (అజనయన్త) బాగుగా ప్రకటించుదురో అటులనే మీరును దీనిని ప్రకటించుడు.

భావార్థము :— ఇందు వాచకలుప్తోపమాలంకారమున్నది. ఎవరు పృథివి జల వాయు ఆకాశములందు వ్యాప్తమైయున్న విద్యుద్రూపాగ్నిని ప్రకటించి యంత్రకళాదులను యుక్తితో నడిపింతురో వారు ఏపనులను సాధించలేరు ? (౧౨౦౪)

---

౧౨౦౫ అగ్ని రిత్యస్య భరద్వాజ ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః
మనుష్యః సూర్యవద్దోషాన్ హన్యాదిత్యాహ.

మానవుడు సూర్యునివలె దోషములను వినాశ మొనర్చవలయును.

అగ్ని ర్వృత్రాణి జఙ్ఘన ద్ద్రవిణస్యు ర్వి పన్యయా । సమిద్ధః శుక్ర ఆహుతః ॥౯॥

అగ్నిః, వృత్రాణి, జఙ్ఘనత్, ద్రవిణస్యుః, విపన్యయా, సమిద్ధ ఇతి సమ్+ఇద్ధః, శుక్రః, ఆహుత ఇత్యా హుతః ॥౯॥

పదార్థః :— (అగ్నిః) సూర్యాదిరూపః (వృత్రాణి) మేఘావయవాన్ (జఙ్ఘనత్) భృశం హన్తి (ద్రవిణస్యుః) ఆత్మనో ద్రవిణ మిచ్ఛుః. (విపన్యయా) విశేషవ్యవహారయుక్త్యా (సమిద్ధః) సమ్యక్ ప్రదీప్తః, (శుక్రః) శీఘ్రకర్తా (ఆహుతః) కృతాహ్వానః ॥౯॥

అన్వయః :— హే విద్వన్! యథా సమిద్ధః శుక్రోఽగ్నిర్వృత్రాణి జఙ్ఘనత్తథా ద్రవిణస్యు రాహుతో భవాన్ విపన్యయా దుష్టాన్ భృశం హన్యాత్ ॥౯॥

భావార్థః :— అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. యథా వ్యవహారవిత్పురుషో ధనం ప్రాప్య సత్కృతో భూత్వా దోషాన్ హన్తి తథా సూర్యో మేఘం తాడయతి ॥౯॥

పదార్థము:—విద్వాంసులారా! ఎట్లు, సమిద్ధః = బాగుగాప్రదీప్తము, శుక్రః = శీఘ్ర కారియునైన, అగ్నిః = సూర్యాదిరూపాగ్ని, వృత్రాణి = మేఘావయవములను, జఙ్ఘనత్ = శీఘ్రముగ నఱకుచున్నదో, అటులనే, ద్రవిణస్యుః = ధనమునాకాంక్షించువారు, ఆహుతః = పిలువబడినవారునగు మీరు, విపన్యయా = విశేషవ్యవహారయుక్తిచే దుష్టులను శీఘ్రముగా వధించుడు ॥౯॥

భావార్థము :— ఇందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఎట్లు వ్యవహారవిదుడగు పురుషుడు ధనమును సంపాదించి సత్కారమును పొంది దోషములను నాశమొనర్చుచున్నాడో, అటులనే సూర్యుడు మేఘమును తాడనమొనరించుచున్నాడు ॥౯॥ ౧౨౦౫

---

[౧౨౦౬] విశ్వేభి రిత్యస్య మేధాతిథి ర్ఋషిః, అగ్నిర్దేవతా, విరాట్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః
పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

విశ్వేభిః సోమ్యం మధ్వగ్న ఇన్ద్రేణ వాయునా । పిబా మిత్రస్య ధామభిః ॥౧౦॥

విశ్వేభిః, సోమ్యమ్, మధు, అగ్నే, ఇన్ద్రేణ, వాయునా, పిబ, మిత్రస్య, ధామభిరితి ధామ+భిః ॥౧౦॥

పదార్థః :- (విశ్వేభిః) అఖిలైః (సోమ్యమ్) సోమేష్వోషధీషు భవమ్ (మధు) మధురాది గుణయుక్తం రసమ్ (అగ్నే) అగ్నిరివ వర్తమాన విద్వన్ (ఇన్ద్రేణ) సర్వేషాం ధారకేణ (వాయునా) బలవతా పవనేన (పిబ) అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (మిత్రస్య) సుహృదః (ధామభిః) స్థానైః

అన్వయః :- హే అగ్నే త్వం యథా సూర్యో విశ్వేభి ర్ధామభి రిన్ద్రేణ వాయునా సహ సోమ్యం మధు పిబతి, తథా మిత్రస్య విశ్వేభి ర్ధామభిః సోమ్యం మధు రసం త్వం పిబ ॥౧౦॥

భావార్థః :- అత్ర వాచకలు... హే మనుష్యా! యూయం యథా సూర్యః సర్వస్మాద్రసమాకృష్య వర్షిత్వా సర్వాన్ పదార్థాన్ పుష్ణాతి తథా విద్యావినయాభ్యాం సర్వాన్ పుష్ణీత

పదార్థము :— అగ్నే = అగ్నివలె వర్తమానుడవు, తేజోవంతుడవునైన విద్వాంసుడా! నీవు ఎట్లు సూర్యుడు, విశ్వేభిః ధామభిః = సమస్త గృహములతో, ఇన్ద్రేణ = ధనమునుధరించు, వాయునా = బలముగల వాయువుతోడను, సోమ్యమ్ = ఉత్తమౌషధులలోనుండు మధురాది గుణములుగల రసమును, త్రాగుచున్నాడో, అటులనే, మిత్రస్య = మిత్రుని యొక్క సమస్త స్థానముల నుండి సుందరమైన ఓషధులరసమును, పిబ = త్రాగుము. ॥౧౦॥

భావార్థము:— ఇందు వాచక లుప్తోపమాలంకార మున్నది. మానవులారా! మీరు సూర్యుడు సమస్త పదార్థములనుండి రసమును పీల్చి, వర్షింపజేసి, సమస్త పదార్థములను పుష్టిపరచుచున్నటులనే విద్యావినయములచే అందఱిని పుష్టి పఱచుడు.

---

౧౨౦౭ ఆ యదిత్యస్య పరాశర ఋషిః, అగ్నిర్దేవతా, విరాట్ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః
పునస్తమేవ విషయ మాహ. మరల నదే విషయము,

ఆ యదిషే నృపతిం తేజ ఆనట్ శుచి రేతో నిషిక్తం ద్యౌరభీకే। అగ్నిః శర్ధ మనవద్యం యువానఀ స్వాధ్యం జనయ త్సూద యచ్చ ॥౧౧॥

ఆ, యత్, ఇషే, నృపతి మితినృ+పతిమ్, తేజః, ఆ నట్, శుచి, రేతః, నిషిక్తమ్, నిషిక్త మితి ని+సిక్తమ్, ద్యౌః, అభీకే, అగ్నిః, శర్ధమ్, అనవద్యమ్, యువానమ్, స్వాధ్య మితి సు+ఆధ్యమ్, జనయత్, సూదయత్, చ ॥౧౧॥

పదార్థ :— (ఆ) (యత్) యదా (ఇషే) వృష్ట్యై, (నృపతిమ్) సూర్యం రాజానమివ (తేజః) యజ్ఞోత్థమ్ (ఆనట్) సమన్తాత్ వ్యాప్నోతి. ఆనడితి వ్యాప్తికర్మా...నిఘం. ౨. ౧౮ (శుచి) పవిత్రమ్ (రేతః) వీర్యకరం జలమ్ (నిషిక్తమ్) అగ్న్యావాజ్యాదిప్రక్షేపణేన నితరాం సిక్తం విస్తృతమ్ (ద్యౌః) ఆకాశస్య షష్ఠ్యర్థేఽత్ర ప్రథమా (అభీకే) సమీపే (అగ్నిః) సూర్యరూపః (శర్ధమ్) బలహేతుమ్ (అనవద్యమ్) సర్వదోషరహితమ్ (యువానమ్) యువత్వసమ్పాదకమ్ (స్వాధ్యమ్) యః సుష్ఠు ధ్యాయతే తమ్ (జనయత్) జనయతి (సూదయత్) క్షరతి వర్షయతి (చ) ॥౧౧॥

అన్వయః :— హే మనుష్యా! యదిషే నిషిక్తం శుచి తేజో నృపతి మానట్ తదాగ్నిః శర్ధ మనవద్యమ్, యువానం స్వాధ్యం రేతో ద్యౌ రభీకే జనయత్సూదయచ్చ ॥౧౧॥

భావార్థః :—యథాఽగ్నౌ హుతం ద్రవ్యం తేజసా సహైవ సూర్యం ప్రాప్నోతి, సూర్యో వర్షిత్వా సర్వాన్ పాలయతి, తథా రాజా ప్రజాభ్యః కరానాకృష్య దుర్భిక్షే పునర్దత్వా శ్రేష్ఠాన్ సమ్పాల్య, దుష్టాన్ సన్తాడ్య, ప్రాగల్భ్యం బలఞ్చ ప్రాప్నోతి ॥౧౧॥

పదార్థము :— మానవులారా! యత్ = ఎప్పుడు, ఇషే = వర్షముకొఱకు, నిషిక్తమ్ = అగ్నియందు ఘృతాదులు పడుటవలన నిరంతరము పెంపొందినది, శుచి = పవిత్రమైనది యునగు, తేజః = యజ్ఞమువలనలేచిన తేజము, నృపతిమ్ = రాజు తేజము వ్యాప్తమైనటుల సూర్యుని, అఆనట్ = బాగుగావ్యాప్తమగు చున్నదో అపుడు, అగ్నిః, = సూర్యరూపాగ్ని, శర్ధమ్ = బలహేతువు, అనవద్యమ్ = నిర్దోషము, యువానమ్ = యౌవనమును కలుగ జేయునది, స్వాధ్యమ్ = సమస్త జనులచే ధ్యానించబడునది, రేతః = పరాక్రమవంతమునైన వర్షజలమును. ద్యోః అభీకే = ఆకాశసమీపమున, జనయత్ = ఉత్పన్నమొనర్చి, చ సూదయత్ = వర్షింపజేయుచున్నది.

భావార్థము :— ఇందు వాచకలుప్తోపమాలంకార మున్నది. ఎటులగ్ని యందు హోమము చేయబడిన ద్రవ్యము తేజముతో పాటు సూర్యుని పొందుచున్నదో, మఱియు సూర్యుడు జలాదులు నాకర్షించి వర్షింపజేసి సమస్తమును కాపాడుచున్నాడో, అటులనే రాజు ప్రజలనుండి పన్ను తీసికొని, దుర్భిక్షకాలమున తిరిగి ఇచ్చి శ్రేష్ఠులను బాగుగా పాలించి, దుష్టులను దండించి, బలప్రాగల్భ్యములను పొందుచున్నాడు. [౧౭౦౭] ॥౧౧॥

[౧౭౦౮] అగ్న ఇత్యస్య విశ్వవారా ఋషిః అగ్నిర్దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః॥
పున ర్విద్వద్భిః కిం కార్య మిత్యాహ. మరల విద్వాంసులేమి చేయవలయును?

అగ్నే శర్ధ మహతే సౌభగాయ తవ ద్యుమ్నాన్యుత్తమాని సన్తు। స జాస్పత్యꣳ సుయమమా కృణుష్వ శత్రూయతామభి తిష్ఠా మహాꣳసి ॥౧౨॥

అగ్నే, శర్ధ, మహతే, సౌభగాయ, తవ, ద్యుమ్నాని, ఉత్తమానీత్యుత్ + తమాని, సన్తు, సమ్, జాస్పత్యమ్, జాపత్య మితి జాః + పత్యమ్, సుయమమితి సు + యమమ్, ఆ, కృణుష్వ, శత్రూయతామ్, శత్రూయతామితి, శత్రు + తామ్, అభి, తిష్ఠ, మహాꣳసి ॥౧౨॥

పదార్థము—(అగ్నే) విద్వన్! రాజన్ వా! (శర్ధ) దుష్టగుణశత్రునాశకం బలమ్, అత్ర సుపాం సు లుగితి సోర్లుక్. శర్ధ ఇతి బల నా.. నిఘం.౨.౯, (మహతే) (సౌభగాయ) శోభనైశ్వర్యస్య భావాయ (తవ) (ద్యుమ్నాని) ధనాని యశాంసి వా (ఉత్తమాని) శ్రేష్ఠాని (సన్తు) (సమ్) (జాస్పత్యమ్) జాయాపతేర్భావం జాస్పత్యమ్. అత్ర ఛాన్దసో వర్ణలోప ఇతి యాలోపః సుడాగమశ్చ (సుయమమ్) సుష్ఠు యమో నియమో యస్మింస్తమ్, (ఆ) (కృణుష్వ) కురుష్వ (శత్రూయతామ్) శత్రుత్వ మిచ్ఛతామ్ (అభి) (తిష్ఠ) అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (మహాంసి) తేజాంసి ॥౧౨॥

అన్వయః— హే అగ్నే! త్వం మహతే సౌభగాయ శర్ధ కృణుష్వ, యతస్తవ ద్యుమ్నాన్యుత్తమాని సన్తు, త్వం జాస్పత్యం సుయమం సమాకృణుష్వ, శత్రూయతాం మహాంస్యభితిష్ఠ ॥౧౨॥

భావార్థః :— యే సుసంయమినో మనుష్యాః సన్తి, తేషాం మహదైశ్వర్యం బలం కీర్తిః సుశీలా భార్యా శత్రుపరాజయశ్చ భవతి॥౧౨॥

పదార్థము:- (అగ్నే)విద్వాంసుడా!లేక రాజా! నీవు(మహతే సౌభగాయ)గొప్ప సౌభాగ్యముకొఱకు(శర్ధ)దుష్టగుణములను, శత్రువులను నాశమొనర్చు బలమును(ఆకృణుష్వ) బాగుగా పెంపొందించుము. అందువలన(తవ)నీయొక్క(ద్యుమ్నాని)ధనములు లేక యశస్సులు(ఉత్తమాని సన్తు)శ్రేష్ఠములగును. నీవు (జాస్పత్యమ్) స్త్రీపురుషభావమును (సుయమమ్) సుందరనియమయుక్తము, శాస్త్రానుకూలమునగు బ్రహ్మచర్యయుక్తము-(సమ్ ఆ) బాగుగా నొనర్చుము. మఱియు నీవు (శత్రూయతామ్) శత్రువులగుటకిచ్ఛగించిన మానవులయొక్క (మహాంసి) తేజములను (అభి తిష్ఠ) తిరస్కృతమొనర్చుము ॥౧౨॥

భావార్థము :—ఉత్తమసంయములగు మానవులకు గొప్ప ఐశ్వర్యము,బలకీర్తులు, ఉత్తమశీలవతియైన స్త్రీ, శత్రువుల పరాజయము లభించును ॥౧౨॥ ౧౭౦౮

---

౧౭౦౯ త్వామిత్యస్య భరద్వాజ ఋషిః, విశ్వేదేవా దేవతాః, భురిక్ పంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః

పునస్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

త్వాꣳహి మన్ద్రతమ మర్కశోకైర్వవృమహే మహి నః శ్రోష్యగ్నే ।
ఇన్ద్రం న త్వా శవసా దేవతా వాయుం పృణన్తి రాధసా నృతమాః ॥౧౩॥

త్వామ్, హి, మన్ద్రతమమితి మన్ద్ర+తమమ్, అర్కశోకైరిత్యర్క+శోకైః, వవృమహే, మహి, నః, శ్రోషి, అగ్నే, ఇన్ద్రమ్, న, త్వా, శవసా, దేవతా, వాయుమ్, పృణన్తి, రాధసా, నృతమా ఇతి నృ+తమాః ॥౧౩॥

పదార్థః:- (త్వామ్)(హి)యతః(మన్ద్రతమమ్)అతిశయేన ప్రశంసాదిసత్కృతమ్ (అర్కశోకైః)అర్కః సూర్య ఇవ శోకాః ప్రకాశా యేషాన్తైః (వవృమహే)స్వీకుర్మహే(మహి)మహద్వచః(నః)అస్మాకం బ్రహ్మచర్యాదిసత్కర్మసు ప్రవృత్తానామ్(శ్రోషి)శృణోషి. అత్ర వికరణస్య లుక్(అగ్నే)అగ్నిరివ వర్తమాన విద్వన్!(ఇన్ద్రమ్)(సూర్యమ్)(న)ఇవ(త్వా)త్వామ్(శవసా)బలేన (దేవతా)దివ్యగుణయుక్తమ్, అత్ర సుపో లుక్(వాయుమ్)వాతమివ(పృణన్తి)పిపురతి (రాధసా) ధనేన(నృతమాః)యేఽతిశయేన నేతారః శ్రేష్ఠా జనాః ॥౧౩॥

అన్వయః :- హే అగ్నే!హి యతో నో మహి శ్రోషి తస్మాన్మన్ద్రతమం త్వామర్కశోకైర్వయం వవృమహే, నృతమాః శవసా ఇన్ద్రం న వాయుమివ చ దేవతా త్వా రాధసా పృణన్తి. ॥౧౩॥

భావార్థః:- అత్రోపమావాచక లుప్తోపమాలంకారౌ.యే దుఃఖాని సోఢ్వా సూర్యవత్తేజస్వినో వాయువద్బలిష్ఠా విద్యాశ్రితే గృహ్ణన్తి తే మేఘేన సూర్య ఇవ సర్వేషా మానన్దకరాః పురుషోత్తమా జాయన్తే. ॥౧౩॥

పదార్థము :— అగ్నే = అగ్నివలెనుండురాజా ! లేక విద్వాంసుడా ! హి = ఏ కారణముచే నీవు, నః = బ్రహ్మచర్యాది సత్కర్మలలో ప్రవృత్తులైన మా యొక్క, గిరః = మహాగంభీర వాక్కులను, శ్రోషి = వినుచున్నావో ఆకారణముచే, మన్ద్రతమమ్ = అతిశయముగ ప్రశంసాదులచే సత్కారమునుపొందిన,త్వామ్ = నిన్ను,అర్కశోకైః = సూర్యునివంటి తేజస్సు కలిగియున్న ప్రజలతో మేము, వవృమహే = స్వీకరించుచున్నాము. మఱియు, నృతమాః = విశేషించి శ్రేష్ఠనాయకులు, శవసా = బలయుక్తులై,ఇన్ద్రమ్ న = సూర్యునివలె తేజోవంతులై,మఱియు,వాయుమ్ = వాయువువలె బలవంతులై దేవతా = దివ్యగుణయుక్తులై త్వా = నిన్ను, రాధసా = ధనముచే, పృణన్తి = పాలించుచున్నారు. లేక పూరించుచున్నారు ॥౧౩॥ ౧౭౦౬

భావార్థము:—ఇందుపమా వాచకలుప్తోపమాలంకారము లున్నవి.దుఃఖములను సహించి సూర్యునివలె తేజోవంతులును వాయువువలె బలవంతులునునైనయే విద్వాంసులు విద్యను, సుశిక్షను గ్రహించుచున్నారో, వారు మేఘముచే నానందపఱచు సూర్యునివలె సమస్తమున కానందమొసగువారై ఉత్తమ పురుషులగు చున్నారు ॥౧౩॥

---

౧౭౦౦ త్వే ఇత్యస్య వసిష్ఠ ఋషిః, విద్వాంసో దేవతాః, అనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః॥
విద్వద్వదితరజనైర్వర్తితవ్య మిత్యాహ. విద్వాంసుల వలె నితరులును వర్తించవలెను.

త్వే అగ్నే స్వాహుత ప్రియాసః సన్తు సూరయః । యన్తారో యే మఘవానో జనానా మూర్వాన్దయన్త గోనామ్ ॥౧౪॥

త్వే ఇతి త్వే, అగ్నే, స్వాహుతేతి సు+ఆహుత, ప్రియాసః, సన్తు, సూరయః, యన్తారః, యే, మఘవాన ఇతి మఘ+వానః, జనానామ్, ఊర్వాన్, దయన్త, గోనామ్ ॥౧౪॥

పదార్థః :—(త్వే)తవ(అగ్నే)విద్వన్!)స్వాహుత)సుష్ఠ్వాదత్త విద్య! (ప్రియాసః)ప్రీతికరాః (సన్తుసూరయః) విద్వాంసః(యన్తారః)నిగృహీతేన్ద్రియాః(యే)(మఘవానః)బహు ధనయుక్తాః (జనానామ్)మనుష్యాణాం మధ్యే (ఊర్వాన్) హింసకాన్ (దయన్త)దయన్తే ఘ్నన్తి(గోనామ్) పృథివీ ధేన్వాదీనామ్. అత్ర గోః పాదాన్తే అ. ౭. ౧. ౫౦. ఇతి నుడాగమః ॥౧౪॥

అన్వయః :— హే స్వాహుతా ఽ గ్నే ! యే జనానాం మధ్యే వీరా యన్తారో మఘవానో గోనా మూర్వాన్దయన్త తే సూరయస్త్వే ప్రియాసః సన్తు ॥౧౪॥

భావార్థః :- హే మనుష్యా ! యథా విద్వాంసో ఽ గ్న్యాది పదార్థ విద్యాం గృహీత్వా విద్వత్ప్రియా భూత్వా, దుష్టాన్ హత్వా, గవాదీన్ రక్షిత్వా మనుష్యప్రియా భవన్తి. తథా యూయమపి భవత ॥౧౪॥

పదార్థము :— స్వాహుత = బాగుగా విద్యను గ్రహించిన వాడా ! అగ్నే = విద్వాంసుడా! జనానామ్ = మానవుల మధ్య వీరపురుషులు, యన్తారః = జితేన్ద్రియులు

మఘవానః=బహుధనముతో కూడిన వారునగు యే=ఎవరు, గోనామ్=భూమి, అథవా గోవుమొదలగు వానియొక్క, ఊర్వాః=హింసకులను, దయన్త=వధించుచున్నారో, సూరయః=ఆ విద్వాంసులు, త్వే=నీకు, ప్రియాసః=ప్రియులు, సన్తు=అగుదురుగాక ॥౧౪॥

భావార్థము :—మానవులారా!విద్వాంసులెటుల అగ్న్యాది పదార్థముల విద్యను గ్రహించి విద్వాంసులకు ప్రియులై,దుష్టులను వధించి, గోవుమొదలగు వానిని రక్షించి మానవులకు ప్రియులగుచున్నారో అటులనే మీరును చేయుడు॥౧౪॥ ౧౭౦౦

౧౭౦౧ శ్రుధీత్యస్య ప్రస్కణ్వ ఋషిః, అగ్నిర్దేవతా, బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః
అథ రాజధర్మ విషయ మాహ. రాజధర్మ విషయము.

శ్రుధి శ్రుత్కర్ణ వహ్నిభి ర్దేవై రగ్నే సయావభిః । ఆ సీద న్తు బర్హిషి మిత్రో అర్యమా ప్రాతర్యావాణో అధ్వరమ్ ॥౧౫॥

శ్రుధి, శ్రుత్కర్ణేతి శ్రుత్+కర్ణ, వహ్నిభి రితి వహ్నిభిః, దేవైః, అగ్నే, సయావభిరితి సయావ+భిః, ఆ, సీదన్తు, బర్హిషి, మిత్రః, అర్యమా, ప్రాతర్యావాణః, ప్రాతర్యావాన ఇతి ప్రాతః+యావానః, అధ్వరమ్ ॥౧౫॥

పదార్థః :- (శ్రుధి) శృణు (శ్రుత్కర్ణ) అర్థివచః శ్రోతారౌ కర్ణౌ యస్య తత్సమ్బుద్ధౌ (వహ్నిభిః) కార్యనిర్వాహకైః (దేవైః) విద్వద్భిః సహ (అగ్నే) పావకద్వర్తమాన విద్వన్ రాజన్ వా (సయావభిః) యే సహ యాన్తి తైః (ఆ) (సీదన్తు) (బర్హిషి) అన్తరిక్షఇవ సభాయామ్ (మిత్రః) పక్షపాతరహితః సర్వేషాం సుహృత్ (అర్యమా) యోఽర్యాన్ వైశ్యాన్ స్వామినో వా మన్యతే సః (ప్రాతర్యావాణః) యే ప్రాతర్యాన్తి రాజ్యకార్యాణి ప్రాపయన్తి (అధ్వరమ్) అహింసనీయ రాజ్యవ్యవహారమ్ ॥౧౫॥

అన్వయః—హే శ్రుత్కర్ణాగ్నే! సయావభిర్వహ్నిభి ర్దేవైః సహాధ్వరం శ్రుధి. ప్రాతర్యావాణో మిత్రోఽర్యమా చ బర్హిష్యాసీదన్తు ॥౧౫॥

భావార్థః—సభాపతినా రాజ్ఞా సుపరీక్షితానమాత్యాన్ స్వీకృత్య, తైః సహ సదసి స్థిత్వా వివద మానవచాంసి శ్రుత్వా సమీక్ష్య యథార్థో న్యాయః కర్తవ్యః ॥౧౫॥

పదార్థము :— శ్రుత్కర్ణ=యాచించువారి మాటలను వినువాడా! అగ్నే=అగ్నివలె తేజోవంతుడవగునో విద్వాంసుడా! లేక రాజా! నీవు,సయావభిః=తోడవచ్చువారు, వహ్నిభిః=కార్యనిర్వాహమొనర్చు వారునగు,దేవైః=విద్వాంసులతో కూడి, అధ్వరమ్=రక్షించదగిన రాజ్య వ్యవహారమును, శ్రుధి=వినుము. మఱియు, ప్రాతర్యావాణః=ప్రాతః కాలముననే రాజకార్యములను లభింపజేయువారు, మిత్రః=పక్షపాత రహితుడు,అందఱికి మిత్రుడు మఱియు, అర్యమా=వైశ్యులను లేక తమ నాయకులను యథార్థముగ విశ్వసించువాడు వీరందఱు, బర్హిషి=అంతరిక్ష సదృశ పరిషత్తునందు, ఆసీదన్తు=చక్కగా కూర్చుందురు గాక! ॥౧౫॥

భావార్థము :— సభాపతియైన రాజు చక్కగా పరీక్షితులైన మంత్రులను స్వీకరించి వారితోపాటు సభయందాసీనుడై వివాదమొనర్చు వారిమాటలను విని, వానిని విచారించి యథార్థమైన న్యాయమును కలుగజేయవలయును. ॥౧౫॥

---

౧౭౧౨ విశ్వేషా మిత్యస్య గోతమ ఋషిః, అగ్ని ర్దేవతా, స్వరాట్ పంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః

పున స్తమేవ విషయ మాహ. మరుల నదే విషయము.

విశ్వేషా మదితి ర్యజ్ఞియానాం విశ్వేషా మతిథి ర్మానుషాణామ్ । అగ్ని ర్దేవానా మవ ఆ వృణానః సుమృడీకో భవతు జాతవేదాః ॥౧౬॥

విశ్వేషామ్, అదితిః, యజ్ఞియానామ్, విశ్వేషామ్, అతిథిః, మానుషాణామ్, అగ్నిః, దేవానామ్, అవః, ఆవృణాన ఇత్యా+వృణానః, సుమృడీక ఇతి సు+మృడీకః, భవతు, జాతవేదా ఇతి జాత+వేదాః ॥౧౬॥

పదార్థః :— (విశ్వేషామ్)సర్వేషామ్, (అదితిః)అఖణ్డితబుద్ధిః(యజ్ఞియానామ్)యే యజ్ఞం పూజనమర్హన్తి తే (విశ్వేషామ్) సర్వేషామ్ (అతిథిః) పూజనీయః (మానుషాణామ్) మనుష్యాణామ్ (అగ్నిః) తేజస్వీ రాజా (దేవానామ్) విదుషామ్ (అవః) రక్షణాదికమ్ (ఆవృణానః) సమన్తాత్ స్వీకుర్వన్ (సుమృడీకః) సుష్ఠుసుఖప్రదః (భవతు) (జాతవేదాః) ఆవిర్భూత విద్యాయోగ ప్రజ్ఞః ॥౧౬॥

అన్వయః :— హే సభాపతే! భవాన్ విశ్వేషాం యజ్ఞియానాం దేవానాం మధ్యేఽదితిర్విశ్వేషాం మానుషాణా మతిథి రవ ఆవృణానః సుమృడీకో జాతవేదా అగ్ని ర్భవతు ॥౧౬॥

భావార్థః :— మనుష్యై ర్యః సర్వేషు విద్వత్సు గమ్భీరబుద్ధిః సర్వమనుష్యేషు మాన్యః ప్రజారక్షాదిరాజకార్యం స్వీకుర్వాణః సర్వసుఖదాతా వేదాదిశాస్త్రవేత్తా శూరో భవేత్, స, రాజా కర్తవ్యః ॥౧౬॥

పదార్థము :— సభాపతీ! నీవు, విశ్వేషామ్ యజ్ఞియానామ్ దేవానామ్ = పూజించుటకు సత్కరించుటకు యోగ్యులైన విద్వాంసుల మధ్య, అదితిః = అఖండిత బుద్ధిగలవాడవు, విశ్వేషామ్ మనుష్యాణామ్ అతిథిః = సకల మానవులకు పూజనీయుడవు, అవః = రక్షాదులను, ఆవృణానః = బాగుగా స్వీకరించువాడవు, సుమృడీకః = సుందర సుఖమునొసగు వాడవు, జాతవేదాః = విద్యా యోగాభ్యాసములచే ప్రసిద్ధబుద్ధి గలవాడవు, అగ్నిః = తేజస్వివియునగు రాజువుగ, భవతు = కమ్ము ॥౧౬॥

భావార్థము :— మానవులు సకల విద్వాంసులలో గంభీర బుద్ధిగలవాడు, సమస్త మానవులలో మాననీయుడు, ప్రజారక్షణాది రాజకార్యములను స్వీకరించువాడు, సకల సుఖదాత, వేదాది శాస్త్రముల తెలుగువాడు, శూరవీరుడుగ నెవడుండునో అతనినే రాజుగా చేయవలయును. ॥౧౬॥



---

౧౭౧౩ మహాఇత్యస్య లుశోధానాక ఋషిః, సవితా దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః

పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

మహో అగ్నేః సమిధానస్య శర్మణ్యనాగా మిత్రే వరుణే స్వస్తయే। శ్రేష్ఠే స్యామ సవితుః సవీమని తద్దేవానా మవో అద్యా వృణీమహే ॥౧౭॥

మహః, అగ్నేః, సమిధా నస్యేతి సమ్+ఇధానస్య, శర్మణి, అనాగాః, మిత్రే, వరుణే, స్వస్తయే, శ్రేష్ఠే, స్యామ, సవితుః, సవీమని, తత్, దేవానామ్, అవః, అద్య, వృణీమహే ॥౧౭॥

పదార్థః :— (మహః) మహతః (అగ్నేః) విజ్ఞానవతః సభాపతేః (సమిధానస్య) ప్రకాశమానస్య (శర్మణి) ఆశ్రయే (అనాగాః) అనపరాధినః. అత్ర సుపాం సులుగితి జసః స్థానే సుః (మిత్రే) సుహృది (వరుణే) స్వీకర్తవ్యే జనే (స్వస్తయే) సుఖాయ (శ్రేష్ఠే) ఉత్తమే (స్యామ) భవేమ (సవితుః) సకలజగదుద్పాదకస్య పరమేశ్వరస్య (సవీమని) ఆజ్ఞాయామ్ (తత్) వేదోక్తమ్ (దేవానామ్) విదుషామ్ (అవః) రక్షణాదికమ్ (అద్య) అస్మిన్ దివసే. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (వృణీమహే) స్వీకుర్మహే ॥౧౭॥

అన్వయః :— వయం రాజపురుషా మహః సమిధానస్యాగ్నేః శర్మణి శ్రేష్ఠే మిత్రే వరుణే చానాగాఃస్యామ అద్య సవితుః సవీమని వర్తమానాః స్వస్తయే దేవానాం తదవో వృణీమహే.

భావార్థః :— ధార్మిక విద్వద్భీ రాజపురుషై రధర్మం విహాయ ధర్మే ప్రవర్తిత్వా పరమేశ్వరస్య సృష్టౌ వివిధా రచనా దృష్ట్వా స్వేషామన్యేషాం చ రక్షణం విధాయేశ్వరస్య ధన్యవాదా వాచ్యాః ॥౧౭॥

పదార్థము :— రాజ పురుషులమైన మేము, మహః = గొప్ప వాడు, సమిధానస్య = ప్రకాశమానుడు, అగ్నేః = విజ్ఞాన వంతుడునైన సభాపతియొక్క, శర్మణి = ఆశ్రయమున, శ్రేష్ఠే = శ్రేష్ఠమైన, మిత్రే = మిత్రుని విషయమున, వరుణే = స్వీకరించదగిన మానవుల విషయమునను, అనాగాః స్యామ = అపరాధ రహితుల మయ్యెదము గాక, అద్య = నేడు, సవితుః = సకల జగదుత్పాదకుడైన పరమేశ్వరుని యొక్క, సవీమని = ఆజ్ఞయందు వర్తమానులమై, స్వస్తయే = సుఖము కొఱకు, దేవానామ్ = విద్వాంసులయొక్క, తత్ = ఆవేదోక్త, అవః = రక్షణాది కర్మలను, వృణీమహే = స్వీకరించుచున్నాము. ॥౧౭॥

భావార్థము :— ధార్మిక విద్వాంసులైన రాజపురుషులు అధర్మమును త్యజించి, ధర్మమందు ప్రవృత్తులై పరమేశ్వరుని సృష్టియందలి వివిధ విధములైన రచనలను గాంచి, తమను ఇతరులను రక్షించుచు ఈశ్వరునకు ధన్యవాదములర్పించుచు నుండవలెను. ॥౧౭॥

౧౭౧౮ ఆప ఇత్యస్య వసిష్ఠ ఋషిః, ఇన్ద్రో దేవతా, స్వరాట్ పంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః॥
అధ్యాపకోపదేశకౌ కిం కుర్యాతా మిత్యాహ. అధ్యాపకులు ఉపదేశకు లేమి చేయవలయును?

ఆప శ్చిత్పిప్యుః స్తర్యో న గావో నక్షన్నృతం జరితార స్త ఇన్ద్ర। యాహి వాయు ర్న నియుతో నో అచ్ఛా త్వం హి ధీభి ర్దయసే వి వాజాన్ ॥౧౮॥

ఆపః, చిత్, పిప్యుః, స్తర్యః, న, గావః, నక్షన్, ఋతమ్, జరితారః, తే, ఇన్ద్ర, యాహి, వాయుః, న, నియుత ఇతి ని+యుతః, నః, అచ్ఛ, త్వమ్, హి, ధీభిః, దయసే, వి, వాజాన్ ॥౧౮॥

పదార్థః :- (ఆపః)జలాని(చిత్)అపి(పిప్యుః)వర్ధన్తే(స్తర్యః)స్తృణన్తి యాభి స్తాః (న)ఇవ (గావః)కిరణాః(నక్షన్)వ్యాప్నువన్తి(ఋతమ్)సత్యమ్(జరితారః) స్తావకాః (తే) (ఇన్ద్ర) పరమైశ్వర్యయుక్త విద్వన్! (యాహి) (వాయుః) పవనః (న) ఇవ (నియుతః) వాయోర్వేగాదయో గుణాః (నః) అస్మాన్ (అచ్ఛ) అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (త్వమ్) (హి) ధీభిః ప్రజ్ఞాభిః కర్మభిర్వా (దయసే) కృపాం కరోషి (వి) (వాజాన్) విజ్ఞానవతః. ॥౧౮॥

అన్వయః:- హే ఇన్ద్ర! తే తవ జరితార ఆప ఇవ పిప్యుస్తర్యో గావో న ఋతం నక్షన్ తథా వాజానో్న నియుతశ్చ వాయుర్న త్వమచ్ఛ యాహి, హి యతో ధీభి ర్విదయసే తస్మాచ్చిదపి సత్కర్తవ్యోఽసి. ॥౧౮॥

భావార్థః :- అత్రోపమాలంకారః.యది పదార్థానాం గుణకర్మ స్వభావస్తావకా ఉపదేశకాఽధ్యాపకాః స్యుస్తర్హి సర్వే మనుష్యా విద్యావ్యాపినః సన్తో దయావన్తో భవేయుః ॥౧౮॥

పదార్థము:- ఇన్ద్ర = పరమైశ్వర్యయుక్త విద్వాంసుడా! తే జరితారః = నిన్ను స్తుతించువారు, ఆపః = జలముల వలె, పిప్యుః = ముందునకు సాగిపోవుదురు, మఱియు, స్తర్యః = విస్తారమునకు హేతువులైన, గావః న = కిరణములవలె,ఋతమ్ = సత్యమున, నక్షన్ = వ్యాప్తులగు చున్నారు. అటులనే,నియుతః = వేగాది గుణములుగల,వాయుః న = వాయువువలె, వాజాన్ నః = విజ్ఞానముగల మమ్మును, త్వమ్ = నీవు, అచ్ఛ = బాగుగా, యాహి = పొందుము, హి = ఏకారణమున,ధీభిః = బుద్ధితో లేక కర్మలతో, వి దయసే = విశేషించి దయజూపు చున్నావో ఆ కారణముచే, చిత్ = కూడ సత్కార యోగ్యుడవు. ॥౧౮॥

భావార్థము :- ఇందు వాచక లుప్తోపమాలంకార మున్నది. పదార్థముల యొక్క గుణకర్మ స్వభావములను స్తుతించు వారు. ఉపదేశకులు అధ్యాపకులు నగుచో సర్వమానవులు విద్యల యందు వ్యాప్తులై దయగల వారగుదురు॥౧౮॥౧౨౧౪

---

౧౨౧౫ గావ ఇత్యస్య పురుమీఢాజమీఢా వృషీ, ఇన్ద్రవాయూ దేవతే, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః మనుష్యైరాభూషణాది రక్షణీయమిత్యాహ. మానవులు ఆభూషణాదులను రక్షించవలయును.

గావ ఉపావతావతం మహీ యజ్ఞస్య రప్సుదా । ఉభా కర్ణా హిరణ్యయా॥౧౯॥

గావః, ఉప, అవత, అవతమ్, మహీ ఇతి మహీ, యజ్ఞస్య, రప్సుదా, ఉభా, కర్ణా, హిరణ్యయా ॥౧౯॥

పదార్థః :- (గావః) కిరణా ధేనవో వా (ఉప) సమీపే (అవత) రక్షత (అవతమ్) రక్షణీయం వేద్యాదిగర్తమ్, (మహీ) మహత్యౌ ద్యావాపృథివ్యౌ (యజ్ఞస్య) (రప్సుదా) యే రప్సు రూపం దత్తస్తే (ఉభా) ద్వే (కర్ణా) కర్ణౌ శ్రోత్రే (హిరణ్యయా) హిరణ్య ప్రచురే. ॥౧౯॥

అన్వయః :— హే మనుష్యా! యథా గావ ఉభా రప్సుదా మహీ రక్షన్తి, తథా యూయం హిరణ్యయా కర్ణా యజ్ఞస్యావత ముపావత. ॥౧౯॥

భావార్థః :— అత్ర వాచకలుప్తో ... యథా సూర్యకిరణా గవాదిపశవశ్చ సర్వం వస్తు జాతం రక్షన్తి,తథైవ మనుష్యై రుక్మాది నిర్మితం కుణ్డలాద్యాభూషణం సదా రక్షణీయమ్ ౧౯.

పదార్థము :- మానవులారా! ఎట్లు, గావః=గోవులు లేక కిరణములు, రప్సుదా=రూపము నొసగునవి, మహీ ఉభా=గొప్పవియునగు ఆకాశ పృథువుల రెంటిని రక్షించుచున్నవో, అటులనే మీరును, హిరణ్యయా=సువర్ణాభూషణ సమన్వితము లైన, కర్ణా=రెండుచెవులను, మఱియు, యజ్ఞస్య=సంగతమగు యజ్ఞముయొక్క, అవతమ్=వేద్యాది అవయవములను, ఉప అవత=దగ్గరగ నుండి రక్షించుడు ॥౧౯॥

భావార్థము :- ఇందు వాచకలుప్తోపమాలంకారమున్నది. ఎట్లు సూర్యకిరణములు, గోవులు మొదలగు పశువులు సమస్త వస్తువులను రక్షించుచున్నవో అటులనే మానవులు సువర్ణాదులచే నిర్మించబడిన కుండలాది ఆ భూషణములను సదా రక్షించుచుండవలయును ॥౧౯॥ ౧౨౧౫

౧౨౧౬ యదద్యేత్యస్య వసిష్ఠ ఋషిః, సవితా దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః

రాజా కీదృశో భవేదిత్యాహ. రాజెటు లుండ వలయును.

యద॒ద్య సూర॒ ఉది॒తేఽనాగా మి॒త్రో అ॒ర్యమా । సు॒వాతి సవి॒తా భగః॥౨౦॥

యత్, అ॒ద్య, సూరే, ఉది॒త ఇత్యుత్+ఇతే, అనాగాః, మి॒త్రః, అ॒ర్యమా, సు॒వాతి, స॒వి॒తా, భగః ॥౨౦॥

పదార్థః :— (యత్) యః (అద్య) (సూరే) సూర్యే (ఉదితే) (అనాగాః) అధర్మాచరణ రహితః (మిత్రః)సర్వేషాం సుహృత్ (అర్యమా) న్యాయకారీ (సువాతి)ఉత్పాదయేత్(సవితా) రాజనియమైః ప్రేరకః (భగః) ఐశ్వర్యవాన్ ॥౨౦॥

అన్వయః :- హే మనుష్యా ! యద్యోఽద్య ఉదితే సూరేఽనాగా మిత్రః సవితా భగోఽర్యమా స్వాస్థ్యం సువాతి, స రాజ్యం కర్తు మర్హేత్ ॥౨౦॥

భావార్థః :- హే మనుష్యా ! యథోదితేఽర్కే తమో నివృత్య ప్రకాశే సతి సర్వే ఆనన్దితా భవన్తి, తథైవ ధార్మికే రాజని సతి ప్రజాసు సర్వథా స్వాస్థ్యం భవతి ॥౨౦॥

పదార్థము :— మానవులారా ! అద్య=నేడు, సూరే=సూర్యుడు, ఉదితే=ఉదయమగునపుడు అనగా ప్రాతఃకాలమున, అనాగాః=అధర్మాచరణరహితుడు, మిత్రః=సుహృత్తు, సవితా=రాజ్య నియమములచే ప్రేరేపించు వాడు, భగః=ఐశ్వర్య వంతుడు, అర్యమా యత్=న్యాయకారియు నైయే రాజు ఆరోగ్యమును సంపాదించునో ఆ రాజు రాజ్యము చేయుటకు యోగ్యుడగును.॥౨౦॥

భావార్థము :- మానవులారా! ఎట్లు సూర్యుడుదయించగనే చీకటి నివృత్తియై వెలుగు రాగానే సమస్త ప్రజలు ఆనందితులగుచున్నారో అటులనే రాజు ధర్మాత్ముడుగ నున్నప్పుడు ప్రజల యందన్ని విధముల ఆరోగ్యము పెంపొందును. ॥౨౦॥ ౧౨౧౬

౧౨౭౭ ఆ సుత ఇత్యస్య సునీతి ర్ఋషిః, వేనో దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః షడ్జః, స్వరః
పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

ఆ సుతే సిఞ్చత శ్రియఀ రోదస్యో॑రభి శ్రియమ్ । రసా దధీత వృషభమ్॥

*తం ప్రత్నథాఽయం వేనః ॥౨౧॥

ఆ, సుతే, సిఞ్చత, శ్రియమ్, రోదస్యోః, అభిశ్రియమిత్యభి+శ్రియమ్, రసా; దధీత, వృషభమ్ ॥౨౧॥

పదార్థః :– (ఆ) సమన్తాత్ (సుతే) ఉత్పన్నే జగతి (సిఞ్చత) (శ్రియమ్) శోభాయు క్తమ్ (రోదస్యోః) ద్యావాపృథివ్యోః (అభిశ్రియమ్) అభితః శోభకమ్ (రసా) రసానన్దప్రదా జనాః. అత్ర సుపామితి డాదేశః (దధీత) (వృషభమ్) బలిష్ఠమ్ ॥౨౧॥

అన్వయః :- హే మనుష్యా! రసా యూయం సుతే వృషభం రోదస్యో రభిశ్రియం శ్రియం సభాపతి మాసిఞ్చత. స చ యుష్మాన్ దధీత ॥౨౧॥

భావార్థః :– మనుష్యైరాజ్యోన్నత్యా జగతః ప్రకాశః సౌన్దర్యాదిగుణవాన్ బలిష్ఠో విద్వాన్ శూరః పూర్ణాఙ్గో జనో రాజ్యేఽభిషే క్తవ్యః. స చ ప్రజాసు సుఖం దధ్యాత్ ॥౨౧॥

పదార్థము:-మానవులారా! రసా = ఆనంద మొసగు మీరు,సుతే = ఉత్పన్నమైన జగత్తునందు, వృషభమ్ = అతిబలము గలవాడు, రోదస్యోః = ఆకాశమును భూమిని, అభిశ్రియమ్ = సర్వవిధముల శోభిత మొనర్చువాడు, శ్రియమ్ = శోభాయుక్తుడునగు సభాపతియైన రాజును, ఆ సిఞ్చత = బాగుగా నభిషేక మొనర్చుడు, మఱియు నా సభాపతి మిమ్ము, దధీత = ధారణ మొనర్చును గాక! ॥౨౧॥

భావార్థము:- మానవులు రాజ్యముయొక్క ఉన్నతిచే జగత్ప్రకాశకుడు, సౌందర్యాదిగుణయుక్తుడు, అతిబలవంతుడు, విద్వాంసుడు, శూరుడు, పూర్ణవయస్కుడునైన మానవుని రాజుగ నభిషేకించవలయును. మఱియు నారాజు ప్రజలకు సుఖము సమకూర్చవలయును ॥౨౧॥ ౧౨౧౭

---

౧౨౧౮ ఆతిష్ఠన్తమిత్యస్య విశ్వామిత్ర ఋషిః,ఇన్ద్రో దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః
అథ విద్యుదగ్నిః కీదృశ ఇత్యాహ. విద్యుదగ్ని యెటువంటిది ?

ఆ తిష్ఠన్తం పరి విశ్వే అభూషఞ్ఛ్రియో వసాన శ్చరతి స్వరోచిః । మహత్తద్వృష్ణో అసురస్య నామా విశ్వరూపో అమృతాని తస్థౌ ॥౨౨॥

ఆ తిష్ఠన్తమిత్యా+తిష్ఠన్తమ్, పరి, విశ్వే, అభూషన్, శ్రియః, వసానః,

* "తం ప్రత్నథా అయం వేనః" ఇవి రెండు ప్రతీకలు. ౭ వ అ. ౧౨, ౧౬ మంత్రములు. ఏదో కర్మకాండ విశేషార్థమిట పేర్కొనబడినవి. కనుక అర్థము వ్రాయలేదు. పూర్వవ్యాఖ్య చూచుకొన వలెను.

చ ర తి, స్వరోచి రితి స్వ+రోచిః, మహత్, తత్, వృష్ణః, అసురస్య, నామ, ఆ, విశ్వరూప ఇతి విశ్వ+రూపః, అమృతాని, తస్థౌ ॥౨౨॥

పదార్థః :— (ఆతిష్ఠన్తమ్) సమన్తాత్ స్థిరమ్ (పరి) సర్వతః (విశ్వే) సర్వే (అభూషన్) భూషయేయుః (శ్రియః) ధనాని శోభా వా (వసానః) స్వీకుర్వాణః(చరతి)(స్వరోచిః) స్వకీయా రోచి ర్దీప్తి ర్యస్య సః (మహత్) (తత్) (వృష్ణః) వర్షకస్య (అసురస్య) హింసకస్య విద్యుదాఖ్యా స్యాగ్నేః (నామ) సంజ్ఞా (ఆ) (విశ్వరూపః) విశ్వం సమగ్రం రూపం యస్య సః (అమృతాని) నాశరహితాని వస్తూని. అత్ర సప్తమ్యర్థే షష్ఠీ (తస్థౌ) తిష్ఠతి ॥౨౨॥

అన్వయః :— హే విద్వాంసో! విశ్వే భవన్తో యథా శ్రియో వసానః స్వరోచి ర్విశ్వరూపోఽగ్నిశ్చరత్యమృతాని తస్థౌ,తథైతమాతిష్ఠన్తం పర్యభూషన్. యద్వృష్ణోఽసురస్యాస్య మహత్తన్నామాస్తి, తేన సర్వాణి కార్యాణ్యలంకురుత ॥౨౨॥

భావార్థః :- అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః.యతోఽయం విద్యుదాఖ్యోఽగ్నిః సర్వ పదార్థస్థోఽపి న కిఞ్చిత్ప్రకాశయతి. తస్మాదస్యాసురేతి నామ,య ఏతద్విద్యాం జానన్తి,తే సర్వతః సుభూషితా భవన్తి ॥౨౨॥

పదార్థము :- విద్వాంసులారా! విశ్వే = మీరందఱు, శ్రియః=ధనమును లేక శోభలను, వసానః=ధరించుచున్నది, స్వరోచిః=స్వయముగనే దీప్తివంతము, విశ్వరూపః=సమస్త పదార్థముల యందాయా రూపములతో వ్యాప్తమునగు నగ్ని,చరతి =చరించుచు మఱియు, అమృతాని=నాశరహితవస్తువులలో నెట్లు, తస్థౌ = స్థితమైయున్నదో, అటులనే, ఆతిష్ఠన్తమ్=బాగుగా స్థిరమైయున్న యీ యగ్నిని, పరి అభూషన్ =సకలదిశలనుండి శోభితమొనర్చుడు, వృష్ణః=వర్షింపజేయునది, అసురస్య= హింసకము నగు నీ విద్యుద్రూపాగ్నికిని, మహత్=గొప్పదియను, తత్ =పరోక్షనామమున్నది కనుక, దానితో సమస్త కార్యములను శోభితమొనర్చుడు ॥౨౨॥

భావార్థము :— ఇందు వాచక లుప్తోపమాలంకారమున్నది. విద్యుద్రూపాగ్ని సకల పదార్థములందు స్థిరమై యుండియు నేమాత్రము ప్రకాశితము కాకుండుటచే దీనికి అసురనామము కలిగెను. ఎవరీ విద్యుద్రూపాగ్నిని తెలిసికొనుచున్నారో వారు సకల విధముల సుభూషితు లగుచున్నారు ॥౨౨॥ ౧౭౧౮

---

౧౭౧౯ ప్ర వ ఇత్యస్య సుచీక ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః
మనుష్యైరీశ్వర ఏవ పూజ్య ఇత్యాహ. మానవు లీశ్వరునే పూజించవలయును.

ప్ర వో మహే మన్దమానా యాన్ధసోఽర్చా విశ్వానరాయ విశ్వాభువే ।
ఇన్ద్రస్య యస్య సుమఖꣳసహో మహి శ్రవో నృమ్ణఞ్చ రోదసీ సపర్యతః ॥౨౩॥

ప్ర, వః, మహే, మన్దమానాయ, అన్ధసః, అర్చ, విశ్వానరాయ, విశ్వాభువే, విశ్వభువ ఇతి విశ్వ+భువే,ఇన్ద్రస్య, యస్య, సుమఖమితి సు+మఖమ్,

సహః, మహి, శ్రవః, నృమ్ణమ్, చ, రోదసీ ఇతి రోదసీ, సపర్యతః ॥౨౩॥

పదార్థః :— (ప్ర) (వః) యుష్మభ్యమ్ (మహే) మహతే (మన్దమానాయ) ఆనన్ద స్వరూపాయ (అన్ధసః) అన్నాదేః. అత్ర విభక్తివ్యత్యయః (అర్చ) సత్కురుత. అత్ర వచనవ్యత్యయో ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘశ్చ (విశ్వానరాయ) విశ్వే నరా నాయకా యస్మింస్తస్మై (విశ్వాభువే) యో విశ్వే భవతే ప్రాప్నోతి విశ్వాభూ ర్యస్య వా విశ్వం భవతి యస్మాదితి వా తస్మై. అత్రోభయత్ర సంహితాయామితి దీర్ఘః (ఇన్ద్రస్య) పరమేశ్వరస్య (యస్య) (సుమఖమ్) శోభనా మఖా యజ్ఞా యస్మాత్తమ్ (సహః) బలమ్ (మహి) మహత్ (శ్రవః) యశః (నృమ్ణమ్) ధనమ్ (చ) (రోదసీ)ద్యావాపృథివ్యౌ (సపర్యతః) సేవేతే ॥౨౩॥

అన్వయః :— హే మనుష్య! త్వం రోదసీ యస్యేన్ద్రస్య సుమఖం నృమ్ణం సహో మహి శ్రవశ్చ సపర్యతస్తస్మై విశ్వానరాయ మహే మన్దమానాయ విశ్వాభువే ప్రార్చ, స వో౽న్ధసః సుఖం దదాతు. ॥౨౩॥

భావార్థః :— హే మనుష్యా! యేనోత్పాదితం ధనం బలం చ సర్వైః సేవ్యతే స ఏవ మహాయశస్వీ సర్వాధ్యక్ష ఆనన్దమయః సర్వవ్యాప్త ఈశ్వరో యుష్మాభిః పూజ్యః ప్రార్థనీయశ్చ. స యుష్మభ్యం ధనాదిజన్యం సుఖం దాస్యతి. ॥౨౩॥

పదార్థము :- మానవుడా! నీవు, రోదసీ = ఆకాశభూములు, యస్య ఇన్ద్రస్య = ఏ పరమేశ్వరుని యొక్క, సుమఖమ్ = సుందర యజ్ఞము కలిగియున్న, నృమ్ణమ్ = ధనమును, సహః = బలమును, చ = మఱియు, మహి = గొప్ప, శ్రవః = యశమును, సపర్యతః = సేవించుచున్నవో, విశ్వానరాయ = సమస్త మానవుల కాధారుడు, మహే = గొప్పవాడు, మన్దమానాయ = ఆనంద స్వరూపుడు, విశ్వాభువే = సమస్తమునకు ప్రాప్తమగువాడు, లేక సమస్త భూమికి స్వామి, లేక సంసార మెవనినుండి జనించుచున్నదో అట్టి ఆ యీశ్వరుని, ప్ర అర్చ = పూజచేయుము. అనగా నతనిని విశ్వసించుము. అతడు, వః = మీ కొఱకు, అన్ధసః = అన్నాదుల యొక్క సుఖము నొసగును॥౨౩॥

భావార్థము :-మానవులారా! ఎవని వలన నుత్పన్నమైన ధన బలాదులను సకల జనులు సేవించుచున్నారో అట్టి మహాకీర్తివంతుడు,సమస్తమునకు స్వామియు, ఆనంద స్వరూపుడును, సర్వవ్యాపకుడునైన ఈశ్వరుడు మీకు పూజనీయుడు. ప్రార్థించ యోగ్యుడు. అతడు మీకు ధనాదుల వలన కలుగు సుఖముల నొసగును॥౨౩॥౧౭౨౯

---

౧౭౩౦ బృహన్నిదిత్యస్య త్రిశోక ఋషిః, ఇన్ద్రో దేవతా,నిచృద్ గాయత్రీ ఛన్దః,షడ్జః స్వరః

మనుష్యః పరమేశ్వర మేవ మిత్రం కుర్యా దిత్యాహ.

మానవులు పరమేశ్వరుని మిత్రునిగ చేసికొన వలయును.

బృహన్నిదిధ్మ ఏషాం భూరి శస్తం పృథుః స్వరుః । యేషా మిన్ద్రో యువా సఖా ॥౨౪॥

బృహన్, ఇత్, ఇధ్మః, ఏషామ్, భూరి, శస్తమ్, పృథుః, స్వరుః, యేషామ్, ఇన్ద్రః, యువా, సఖా ॥౨౪॥

పదార్థః :— (బృహాన్) మహాన్ (ఇత్) ఏవ (ఇధ్మః) ప్రదీప్తః (ఏషామ్) మనుష్యాణామ్ (భూరి) బహు (శస్తమ్) స్తుత్యం కర్మ. (పృథుః) విస్తీర్ణః(స్వరుః)ప్రతాపకః (యేషామ్)(ఇన్ద్రః) పరమైశ్వర్యవాన్ పరమాత్మా (యువా) ప్రాప్తయౌవనః (సఖా) మిత్రమ్ ॥౨౪॥

అన్వయః :— యేషామిధ్మః పృథుః స్వరు ర్యువా, బృహన్నిన్ద్రః సఖాఽస్త్యేషామిద్భూరి శస్తం భవతి ॥౨౪॥

భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. యస్యోత్తమః పరమేశ్వరః సఖా భవేత్ స యథాఽస్మిన్ బ్రహ్మాణ్డే సూర్యః ప్రతాపయుక్తోఽస్తి, తథా ప్రతాపయుక్తః స్యాత్ ॥౨౪॥

పదార్థము :- యేషామ్=ఎవరికి, ఇధ్మః=తేజస్వి, పృథుః=విస్తార యుక్తుడు' స్వరుః=ప్రతాపవంతుడు, యువా=యువకుడు, బృహాన్ = మిగుల గొప్పవాడు' ఇన్ద్రః=ఉత్తమైశ్వర్యము గలవాడునగు పరమాత్మ, సఖా=మిత్రుడో, ఏషామ్ ఇత్= నిశ్చయముగా వారికర్మ యే,భూరి శస్తమ్=మిగుల స్తుతి యోగ్యమగుచున్నది.॥౨౪॥

భావార్థము :- ఇందు వాచకలుప్తోపమాలంకార మున్నది. ఎవనికి ఉత్తమ పరమేశ్వరుడు మిత్రుడగునో అతడీ బ్రహ్మాండమున సూర్యునివలె ప్రతాపవంతుడగును.

---

౧౩౨౧ ఇన్ద్ర ఇత్యస్య మధుచ్ఛన్దా ఋషిః,ఇన్ద్రో దేవతా,నిచృద్ గాయత్రీ ఛన్దః,షడ్జః స్వరః

పునర్మనుష్యాః కిం కుర్యు రిత్యాహ. మరల మానవు లేమి చేయవలయును ?

ఇన్ద్రేహి మత్స్యన్ధసో విశ్వేభిః సోమపర్వభిః । మహాఁ౨॥ ఽ అభిష్టి రోజసా ॥౨౫॥

ఇన్ద్ర, ఆ, ఇహి, మత్సి, అన్ధసః, విశ్వేభిః, సోమపర్వభిరితి సోమపర్వ+భిః, మహాన్, అభిష్టిః, ఓ జసా ॥౨౫॥

పదార్థః :— (ఇన్ద్ర) ఐశ్వర్యప్రద! విద్వన్! (ఆ) (ఇహి) ప్రాప్నుహి (మత్సి) తృప్తో భవ మద తృప్తౌ. శపో లుక్. (అన్ధసః) అన్నాత్ (విశ్వేభిః) అఖిలైః (సోమపర్వభిః) సోమాద్యోషధీనా మవయవైః (మహాన్) (అభిష్టిః) అభియష్టవ్యః సర్వతః పూజ్యః. పృషోదరాదిత్వాదిష్టసిద్ధిః (ఓజసా) పరాక్రమేణ సహ ॥౨౫॥

అన్వయః :- హే ఇన్ద్ర! యత స్త్వమోజసా సహ మహానభిష్టి ర్విశ్వేభిః సోమపర్వభి రన్ధసో మత్సి, తస్మాదస్మానేహి ॥౨౫॥

భావార్థః :— హే మనుష్యాః! యస్మాదన్నాదే ర్మనుష్యాదీనాం శరీరాదే ర్నిర్వాహో భవతి, తస్మాదేషాం వృద్ధి సేవనాహారవిహారా యథావద్విజానీయుః ॥౨౫॥

పదార్థము :- ఇన్ద్ర=ఐశ్వర్యము నొసగు విద్వాంసుడా! నీవు, ఓజసా =పరాక్రమముతో, మహాన్=గొప్పవాడవు, అభిష్టిః=సర్వవిధముల సత్కారార్హుడవు, విశ్వేభిః సోమపర్వభిః=సమస్త సోమోద్యోషధుల యొక్క అవయవములతోను ,అన్ధసః=అన్నము వలనను, మత్సి=తృప్తి జెందుచున్నావు కావున మాకు, ఆ ఇహి= ప్రాప్తమగుము ॥౨౫॥

భావార్థము :– మానవులారా! అన్నాదులతో మనుష్యాది ప్రాణులయొక్క శరీరాదుల నిర్వాహము జరుగుచున్నది. కావున వీని వృద్ధి సేవనాహారవిహారములను యథావిధిగా తెలిసికొనుడు. ॥౨౫॥ ౧౭-౨౧

---

౧౭-౨౬ ఇన్ద్ర ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిక్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః

రాజపురుషాః కీదృశాః స్యు రిత్యాహ. రాజపురుషు లెటులుండ వలయును?

ఇన్ద్రో వృత్రమవృణోచ్ఛర్ధనీతిః ప్రమాయినామమినాద్వర్పణీతిః ।
అహన్వ్యꣳసముశధగ్వనేష్వావిర్ధేనా అకృణోద్రామ్యాణామ్ ॥౨౬॥

ఇన్ద్రః, వృత్రమ్, అవృణోత్, శర్ధనీతిరితి శర్ధ+నీతిః, ప్ర, మాయినామ్, అమినాత్, వర్పణీతిః, వర్పనీతిరితి వర్ప+నీతిః, అహన్, వ్యꣳసమితి వి+అꣳసమ్, ఉశధక్, వనేషు, ఆవిః, ధేనాః, అకృణోత్, రామ్యాణామ్ ॥౨౬॥

పదార్థః :– (ఇన్ద్రః) సూర్య ఇవ ప్రతాపీ సభేశః (వృత్రమ్) దుష్టం శత్రుం ప్రకాశావరకం మేఘమివ ధర్మావరకమ్ (అవృణోత్) యుద్ధాయ వృణుయాత్ (శర్ధనీతిః) శర్ధస్య బలస్య నీతి ర్నయనం ప్రాపణం యస్య(ప్ర)(మాయినామ్) మాయా కుత్సితా ప్రజ్ఞా విద్యతే యేషా న్తాన్. అత్ర కర్మణి షష్ఠీ (అమినాత్) హింస్యాత్, (వర్పణీతిః) వర్పాణాం నానావిధానాం రూపాణాం నీతిః ప్రాప్తిర్యస్య సః(అహన్) హన్యాత్ (వ్యంసమ్) విగతా అంసా భుజమూలాని యస్య తమ్ (ఉశధక్) య ఉశన్తి పరస్వం కామయన్తి తాన్ దహతి సః (వనేషు) స్థితం తస్కరమ్ (ఆవిః) ప్రాదుర్భావే (ధేనాః) వాణీః (అకృణోత్) కుర్యాత్ (రామ్యాణామ్) రమయన్తి ఆనన్దయన్తి తేషామ్. ॥౨౬॥

అన్వయః :– శర్ధనీతి ర్వర్పనీతి రుశధగిన్ద్రో వృత్ర మవృణోత్, మాయినాం ప్రామిణాత్ వనేషు వ్యంసమహన్, రామ్యాణాం ధేనా ఆవి రకృణోత్స ఏవ రాజా భవితుం యోగ్యః ॥౨౬॥

భావార్థః :– అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే సూర్యవత్సుశిక్షితా వాచః ప్రకటయన్తి, అగ్నిర్వనానీవ దుష్టాన్ శత్రూన్దహన్తి,దినం రాత్రిమివ ఛలకాపట్యా విద్యాన్ధకారాదీన్ నివర్తయన్తి, బలమావిష్కుర్వన్తి తే సుప్రతిష్ఠితా రాజజనా భవన్తి. ॥౨౬॥

పదార్థము :– శర్ధనీతిః = బలమును పొందినవాడు, వర్పణీతిః = నానావిధ రూపములు గలవాడు, ఉశధక్ = పరపదార్థములను గోరుచోరాదులను నష్టపఱచువాడు, ఇన్ద్రః = సూర్యునివలె ప్రతాపవంతుడునగు సభాపతి. వృత్రమ్ = ప్రకాశము నడ్డుపఱచు మేఘమువలెనుండు ధర్మనిరోధక దుష్ట శత్రువును,అవృణోత్ = యుద్ధము కొఱకు స్వీకరించ వలెను, మాయినామ్ = ఛల కపటాది దుష్టబుద్ధులు గలవారిని, ప్ర అమినాత్ = చంపవలెను. వనేషు = వనము లందుండు, వ్యంసమ్ = కపటమను భుజములుగల చోరులను, అహన్ = హత్యచేయవలెను, మఱియు, రామ్యాణామ్ = ఆనందమొసగు ఉపదేశముల యొక్క, ధేనాః = వాక్కులను, ఆవిః అకృణోత్ = ప్రకటించవలెను. అట్టి వాడే రాజగుటకు యోగ్యుడు ॥౨౬॥

భావార్థము :— ఇందు వాచకలుప్తోప మాలంకార మున్నది. ఎవరు సూర్యుని వలె సుశిక్షిత వాక్కులను ప్రకటించుచున్నారో, అగ్ని వనములను దహించునటుల దుష్ట శత్రువులను హతమార్చుదురో, రాత్రిని పగలు నివృత్తపఱచినటుల ఛలక పటా విద్యారూపాంధకారాదులను నివృత్తపఱచుదురో, బలమును ప్రకటించుదురో వారు మంచి ప్రతిష్ఠితులగు రాజపురుషులగు చున్నారు. ॥౨౬॥ ౧౬౨౬

---

౧౩౨౭ కుత ఇత్యస్యాగస్త్య ఋషిః, ఇన్ద్రో దేవతా, విరాట్ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః

పునస్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

కుతస్త్వమిన్ద్ర మాహినః సన్నేకో యాసి సత్పతే కిన్త ఇత్థా । సమ్పృచ్ఛసే సమరాణః శుభానై ర్వోచే స్తన్నో హరివో యత్తే అస్మే॥

*మహాం ౨॥౭ఇన్ద్రో య ఓజసా కదాచన స్తరీరసి కదాచన ప్రయుచ్ఛసి॥౨౭॥

కుతః, త్వమ్, ఇన్ద్ర, మాహినః, సన్, ఏకః, యాసి, సత్ప్వత, ఇతి సత్ + పతే, కిమ్, తే, ఇత్థా, సమ్, పృచ్ఛసే, సమరాణ ఇతి సమ్ + అరాణః, శుభానైః, వోచేః, తత్, నః, హరివ + ఇతి హరి + వః, యత్, తే, అస్మే + ఇత్యస్మే ॥౨౭॥

పదార్థః :. (కుతః) కస్మాత్, (త్వమ్) (ఇన్ద్ర)సభేశ! (మాహినః)పూజ్యమానో మహత్త్వేన యుక్తః (సన్) (ఏకః) అసహాయః (యాసి) గచ్ఛసి(సత్పతే)సతః సత్యస్య వ్యవహారస్య సతాం పురుషాణాం వా పాలక ! (కిమ్) (తే) తవ (ఇత్థా) అస్మాద్ధేతోః(సమ్)(పృచ్ఛసే) పృచ్ఛ. లేట్ (సమరాణః) సమ్యగ్గచ్ఛన్ (శుభానైః) మఙ్గలమయై ర్వచనైస్సహ (వోచేః) వదేః (తత్) ఏకాకి కారణమ్ (నః) అస్మాన్ (హరివః) ప్రశస్తా హరయో హరణ శీలా అశ్వా విద్యన్తే యస్య తత్స మ్బుద్ధౌ (యత్) యతః (తే) తవ (అస్మే) వయమ్ ॥౨౭॥

అన్వయః :- హే సత్పతే ఇన్ద్ర! మాహిన స్త్వమేకః సన్ కుతో యాసి ? కిన్త ఇత్థా ? హే హరివో ! యదస్మే తే తస్మాత్సమరాణ స్త్వన్నః సమ్పృచ్ఛసే, శుభానై స్తద్వోచేశ్చ॥౨౭॥

భావార్థః—రాజప్రజా పురుషైః సభాధ్యక్ష ఏవం వక్తవ్యః—హే సభాపతే భవతాఽసహాయేన కిమపి రాజకార్యం న కర్తవ్యమ్. కిన్తు సజ్జన రక్షణే దుష్టతాడనే చాస్మదాది సహాయ యుక్తేన సదైవ స్థాతవ్యమ్. శుభాచరణయుక్తే నాస్మదాది శిష్టసమ్మత్యా మృదువచనైశ్చ, సర్వాః ప్రజాః శాసనీయాః॥౨౭॥

పదార్థము:— సత్పతే = శ్రేష్ఠ సత్యవ్యవహారములను లేక శ్రేష్ఠ పురుషులను రక్షించువాడా ! ఇన్ద్ర = సభాపతీ, మాహినః = మహత్త్వయుక్తుడవు, సత్కారమును పొందినవాడవునై, త్వమ్ = నీవు, ఏకః సన్ = తోడులేని ఒంటరివాడవై, కుతః యాసి = ఏకారణమును పొందుచున్నావు లేక తిరుగుచున్నావు ? కిమ్ తే ఇత్థా =

---

* ఈ మంత్రములో చివర మహా..., కదా..., కదా..., అను ప్రతీకములు అ. ౭. మం. ౪౦; అ. ౮. మం. ౨,౩ లుగ చెప్పబడిన ౩ మంత్రములవి. ఏదో కర్మకాండ విశేషము కొఱకిట వ్రాయబడినవి. అందువలన వీని యర్థ మిచట వ్రాయలేదు. కావున నచట నుండియే తెలిసి కొనవలెను.

ఈ విధముగా చేయుటవలన నీకు ప్రయోజన మేమి ?, హరివః = ప్రశంసితములు మనోహరములునగు గుఱ్ఱములుగల ఓరాజా!, యత్ = ఏకారణమున, అస్మే = మేము, తే = నీ వారమై యున్నామో, ఆకారణముననే బాగుగా నడచుచు నీవు, నః = మమ్ము, సమ్ పృచ్ఛసే = చక్కగా అడుగుము,మఱియు, శుభానైః = మంగల మయవాక్కులతోపాటు, తత్ = ఏకాకిగా నుండు ఆకారణమును, వోచేః = చెప్పుము॥౨౭॥

భావార్థము :- రాజప్రజా పురుషులు సభాధ్యక్షుడైన రాజుతో "ఓసభాపతి ! నీవు ఒంటరిగానే రాజకార్య మైనను చేయకుము. సజ్జనులను రక్షించుటలోను, దుష్టులను దండించుటలోను అస్మదాదుల సహాయము పొందువాడవై సదా యుండుము, శుభాచరణ యుక్తముచేతను, మాబోటి శిష్టులసమ్మతి ననుసరించియు, మృదువచనములతోను సమస్త ప్రజలను శిక్షించవలయును" అని చెప్పవలయును. ౨౭ ॥౧౭-౨౩॥

---

౧౭-౨౮ ఆ తదిత్యస్య గోరివితి ర్ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిక్ పంక్తిశ్ఛన్దః,పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయ మాహా. మరల నదే విషయము.

ఆ తత్త ఇన్ద్రాయవః పనన్తాభి య ఊర్వం గోమన్తం తిత్ృత్సాన్ ।
సకృత్స్వం యే పురుపుత్రాంమహీంసహస్రధారాం బృహతీం దుదుక్షన్ ॥౨౮॥

ఆ, తత్, తే, ఇన్ద్ర, ఆయవః, పనన్త, అభి, యే, ఊర్వమ్, గోమన్త మితి గో+మన్తమ్, తిత్ృత్సాన్, సకృత్స్వమితి సకృత్+స్వమ్,యే, పురుపుత్రామితి పురు+పుత్రామ్, మహీమ్, సహస్ర ధారామితి సహస్ర+ధారామ్, బృహతీమ్, దుదుక్షన్, దుధుక్షన్నితి దుధుక్షన్ ॥౨౮॥

పదార్థః :- (ఆ) (తత్) రాజకర్మ, (తే) తవ, (ఇన్ద్ర) రాజన్, (ఆయవః) యే సత్యం యన్తి తే మనుష్యాః ప్రజాః. ఆయవ ఇతి మనుష్యనా...నిఘం. ౨. ౩., (పనన్త) ప్రశంసేయుః, (అభి) ఆభిముఖ్యే (యే) (ఊర్వమ్) హింసకమ్, (గోమన్తమ్) దుష్టా గావ ఇన్ద్రియాణి యస్య తమ్, (తిత్ృత్సాన్) తర్దితుం హింసితు మిచ్ఛేయుః లేట్, (సకృత్స్వమ్) యా సకృతేక వారం సూతే తామ్, (యే) పురు (పుత్రామ్) బహవో ఽన్నాది వ్యక్తిమన్తః పుత్రా యస్యాస్తామ్, (మహీమ్) మహతీం భూమిమ్, (సహస్ర ధారామ్) సహస్రం ధారా హిరణ్యాదయో యస్యాస్తాం యద్వా యా సహస్ర మసఙ్ఖ్యాతం ప్రాణి జాతం ధరతి, (బృహతీమ్)విస్తీర్ణామ్, (దుదుక్షన్) దోగ్ధు మిచ్ఛేయుః. అత్ర వర్ణ వ్యత్యయేన ధస్య దః॥౨౮॥

అన్వయః :- హే ఇన్ద్ర ! య ఆయవః సకృత్స్వం పురుపుత్రాం సహస్రధారాం బృహతీం మహీం దుదుక్షన్ యే గోమన్తమూర్వమభి తిత్ృత్సాన్ యే చ తే తదా పనన్త తాన్ త్వం సతతమున్నయ॥ ౩౩. ౨౮॥

భావార్థః :- యే రాజభక్తా దుష్టహింసకా ఏకవారే బహుఫల పుష్పప్రదాం. సర్వ ధారికాం భూమిం దోగ్ధుం సమర్థా స్స్యుస్తే రాజకార్యాణి కర్తు మర్హేయుః ॥౨౮॥

పదార్థము :— ఇన్ద్ర = ఓరాజా, యే ఆయవః = సత్యమును పొందునే ప్రజలు, సకృత్స్వమ్ = ఒకేపర్యాయము పంటనిచ్చునది, పురుపుత్రామ్ = అన్నాది వ్యక్తినుంతు లగు పుత్రు లనేకులను గలిగియున్నది: సహస్రధారామ్ = అసంఖ్య సువర్ణాదిధాతుపు లను ప్రవాహ రూపముగ గలిగి యున్నది, లేక అసంఖ్య ప్రాణి కోటిని ధరించునది, బృహతీమ్ = విస్తార యుక్తమైనదియునగు, మహీమ్ = విశాల భూమిని, దుదుక్షః = పితుక తలంచుదురో అనగా దాని వలన కోరికల ఫలింప వలయునని తలంచెదరో, యే = మానవులు, గోమన్తమ్ = దూషితేంద్రియములు గలిగిన లంపటుడు,ఊర్వమ్ = హింసకజనుడునగు వానిని, అభి తిత్రృత్సాః = సమ్ముఖులై వధించ కోరుదురో మఱియు, తే = నీయొక్క, తత్ = ఆరాజ్య కర్మను, ఆపనన్త = ప్రశంసించుదురో వారిని నీవు ఉన్నతి పఱచుచుండుము

భావార్థము :—ఎవరు, రాజ భక్తులు, దుష్టులను హింసించువారు ఒక్క పర్యాయమే బహు ఫలపుష్పముల నొసగునది, సమస్తమును ధరించునదియునగు భూమిని పితుకుటకు సమర్థులునగుదురో వారే రాజకార్య మొనర్చుటకు యోగ్యులు ॥౨౮॥

---

౧౭౨౯ ఇమామిత్యస్య కుత్స ఋషిః, ఇన్ద్రో దేవతా, జగతీ ఛన్దః, నిషాదః స్వరః॥
పునస్తమేవ విషయ మాహ.. మరల నదే విషయము.

ఇమాన్తే ధియం ప్ర భరే మహో మహీమస్య స్తోత్రే ధిషణా యత్త ఆనజే ।
తముత్సవే చ ప్రసవే చ సాసహి మిన్ద్రం దేవాసః శవసా మదన్నను ॥౨౯॥

ఇమామ్, తే, ధియమ్, ప్ర, భరే, మహః, మహీమ్, అస్య, స్తోత్రే, ధిషణా, యత్, తే, ఆనజే, తమ్, ఉత్సవ ఇత్యుత్+సవే, చ, ప్రసవ ఇతి ప్ర+సవే, చ, సాసహిమ్, ససహిమితి ససహిమ్, ఇన్ద్రమ్, దేవాసః, శవసా, అమదన్, అను ॥౨౯॥

పదార్థః:—ఇమామ్, (తే) తవ, (ధియమ్) ప్రజ్ఞాం కర్మ వా, (ప్ర) (భరే) ధరే, (మహః) మహతః, (మహీమ్) సుపూజ్యామ్ మహీతి, వాఙ్ నా...నిఘం, ౧. ౧౧. (అస్య) మమ, (స్తోత్రే) స్తవనే, (ధిషణా) ప్రజ్ఞా, (యత్) యమ్, (తే) (తామ్), అత్ర కర్మణి షష్ఠీ (ఆనజే) వ్యనక్తి, (తమ్) (ఉత్సవే) కర్తవ్యానన్దసమయే, (చ) (ప్రసవే) ఉత్పత్తౌ, (చ) సాసహిమ్ భృశం సోఢారమ్, (ఇన్ద్రమ్) పరమబల యోగేన శత్రూణాం విదారకమ్, (దేవాసః) విద్వాంసః, (శవసా) బలేన, (అమదన్) ఆనన్దేయుః, (అను) ఆనుమాల్యేన ॥౨౯॥

అన్వయః :- హే ఇన్ద్రాహం మహీమిమాన్తే ధియం ప్రభరే స్తోత్రే౭స్య ధిషణా యత్త ఆనజే తం శవసా సాసహిమిన్ద్రం మహ ఉత్సవే చ ప్రసవే చ దేవాసో౭న్వమదన్ ॥౨౯॥

భావార్థః :- యే రాజాదయో మనుష్యా విద్వద్భ్య ఉత్తమాం ప్రజ్ఞాం వాచం చ గృహ్ణన్తి . తే సత్యానుకూలాః సన్తః స్వయమానన్దితా భూత్వా౭న్యానానన్దయన్తి॥౨౯॥

పదార్థము :—సభాధ్యక్షా ! నేను, మహీమ్ = సుందరము పూజ్యమునగు, ఇమామ్ తే ధియమ్ = నీ యొక్క యీ బుద్ధిని లేక కర్మను, ప్ర భరే = ధరించు చున్నాను, స్తోత్రే = స్తుతించుటలో, అస్య ధిషణా = ఈ నా యొక్క బుద్ధి, యత్ తే = ఏ నిన్ను, ఆనజే = ప్రకటించు చున్నదో అట్టి, శవసా = బలముతో, సాసహిమ్ = శీఘ్రముగా సహించు వాడు, ఇన్ద్రమ్ = ఉత్తమ బలయోగముతో శత్రువులను విదీర్ణ పఱచు వాడుననగు సభాపతిని, మహః ఉత్సవే చ = గొప్ప కార్యమును, చేయ దగిన ఆనందసమయముననను, ప్రసవే చ = ఉత్పత్తిలోను, దేవాసః = విద్వాంసులు, అను అమదన్ = అనుకూలముతో నానందపఱచుదురు గాక ॥౨౯॥

భావార్థము :-ఏ రాజాది మానవులు విద్వాంసుల వలన నుత్తమ బుద్ధిని లేక వాణిని గ్రహించుదురో వారు సత్యాను కూలురై స్వయముగ నానందితులై ఇతరు లను ప్రసన్న పఱచు చున్నారు॥౨౯॥ [౧౭.౨౫]

---

1726 విభ్రాడిత్యస్య విభ్రాడృషిః, సూర్యో దేవతా, విరాట్ జగతీ ఛన్దః, నిషాదః స్వరః

పునస్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

విభ్రాడ్ బృహత్పిబతు సోమ్యం మధ్వాయు ర్దధద్యజ్ఞపతా వవిహ్రుతమ్।
వాతజూతో యో అభిరక్షతి త్మనా ప్రజాః పుపోష పురుధా వి రాజతి ॥౩౦॥

విభ్రాడితి వి+భ్రాట్, బృహత్, పిబతు, సోమ్యమ్, మధు, ఆయుః, దధత్, యజ్ఞపతావితియజ్ఞ+పతౌ, అవిహ్రుతమిత్యవి+హ్రుతమ్, వాతజూత ఇతి వాత +జూతః, యః, అభిరక్షతీత్యభి+రక్షతి, త్మనా, ప్రజా ఇతి ప్ర+జాః, పుపోష, పురుధా, వి, రాజతి ॥౩౦॥

పదార్థః—(విభ్రాట్)యో విశేషేణ భ్రాజతే సః(బృహత్)మహత్(పిబతు) (సోమ్యమ్) సోమేష్వోషధీషు భవం రసమ్(మధు)మధురాదినా గుణేన యుక్తమ్(ఆయుః)జీవనమ్(దధత్)ధరన్ (యజ్ఞపతౌ)యజ్ఞస్య యుక్తస్య వ్యవహారస్య పాలకే స్వామిని (అవిహ్రుతమ్) అఖణ్డితమ్(వాత జూతః)వాయునా ప్రాప్తవేగః (యః) (అభిరక్షతి) (త్మనా) ఆత్మనా (ప్రజాః) (పుపోష) పుష్ణాతి (పురుధా)బహుధా(వి)(రాజతి)విశేషేణ ప్రకాశతే ॥౩౦॥

అన్వయః—యో వాతజూతః సూర్య ఇవ విభ్రాడవిహ్రుతమాయుర్యజ్ఞపతౌ దధత్ త్మనా ప్రజా అభి రక్షతి పుపోష పురుధా విరాజతి చ స భవాన్ బృహత్ సోమ్యం మధు పిబతు.

భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. హే రాజాదయో మనుష్యా యథా సూర్యో వృష్టిద్వారా సర్వేషాం జీవనం పాలనం కరోతి తద్వత్సద్గుణై ర్మహాన్తో భూత్వా న్యాయవినయాభ్యాం ప్రజాః సతతం రక్షన్తు ॥౩౦॥

పదార్థము :—(యః) ఎవడు(వాతజూతః) వాయువుచే వేగమును పొందినవాడు సూర్యునివలె (విభ్రాడ్) విశేష ప్రకాశముగల ఏరాజపురుషుడు (అవిహ్రుతమ్) అఖండ

కుర్వన్తి పుత్రపౌత్రవన్తో భూత్వా మనుష్యసుఖోన్నతయే సమర్థా విద్వాంసో భవితు మర్హన్తి.

పదార్థము—మానవులారా! సరాతయః = సమానముగ దానమొనర్చువారలు, సమన్యవః=సమానమైన క్రోధముగలవారునునగు, విశ్వే దేవాసః = ఏ సకలవిద్వాంసులు, సాకమ్=కలసి, అద్య=నేడు, నః మనవే=మా మానవుల నిమిత్తము, స్మ=ప్రసిద్ధులైన, వరివోవిదః=సత్కారమును తెలుసుకొనువారు, లేక ధనమును లభింపజేయువారు, భవన్తు=అగుదురో, తు=మఱియు, తే=వారు,అపరమ్=భవిష్యత్కాలమున, నః = మాయొక్క, తుచే = పుత్రపౌత్రాది సంతానార్థము మాకొఱకును సత్కారము నెఱుగువారు లేక ధనమును లభింపజేయువారు నగుదురో,తే హి= వారే మీనిమిత్తము కూడ సత్కారము నెఱుగువారు లేక ధనము లభింపజేయువారును నగుదురుగాక ! ॥౮౪॥

భావార్థము—ఏ మానవు లోకరికొకరు సుఖము చేకూర్చుదురో, ఎవరు కలిసి దుష్టులపై క్రోధమొనర్చెదరో వారే పుత్రపౌత్రవంతులై, మానవుల సుఖోన్నతికై సమర్థులగు విద్వాంసులగుటకు యోగ్యులగుచున్నారు. ॥౮౪॥ 1790

---

1791 అపాధమదిత్యస్య నృమేధ ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిక్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.
అథ కే జనా దుఃఖనివారణసమర్థాః స న్తీత్యాహ. ఏ మానవులు దుఃఖనివారణ సమర్థులగుదురు

అపాధమదభిశస్తీ రశస్తిహాథేన్ద్రో ద్యుమ్న్యాభవత్ ।
దేవాస్త ఇన్ద్ర సఖ్యాయ యేమిరే బృహద్భానో మరుద్గణ. ॥౮౫॥

అప, అధమత్, అభిశస్తీ రిత్యభి+శస్తీః, అశస్తి హేత్యశస్తి+హా,అథ, ఇన్ద్రః, ద్యుమ్నీ, ఆ, అభవత్, దేవాః, తే, ఇన్ద్ర, సఖ్యాయ, యేమిరే, బృహద్భానో ఇతి బృహత్+భానో, మరుద్గణేతి మరుత్+గణ. ॥౮౫॥

పదార్థః—(అప)దూరీకరణే(అధమత్) ధమతి(అభిశస్తీః)అభితో హింసాః(అశస్తిహా)అప్రశస్తానాం దుష్టానాం హన్తా(అథ)(ఇన్ద్రః)పరమైశ్వర్యవాన్ సభాపతీ రాజా. (ద్యుమ్నీ)బహుప్రశంసాధనయుక్తః(ఆ)(అభవత్) భవతు(దేవాః) విద్వాంసః (తే)తవ (ఇన్ద్ర) పరమైశ్వర్యప్రద సభాపతే! రాజన్! (సఖ్యాయ) మిత్రత్వాయ (యేమిరే) సంయమం కుర్వన్తి (బృహద్భానో) బృహన్తో భానవః కిరణా ఇవ కీర్తయో యస్య తత్సమ్బుద్ధౌ (మరుద్గణ) మరుతాం మనుష్యాణాం వాయూనాం వా గణః సమూహో యస్య తత్సమ్బుద్ధౌ ॥౮౫॥ అన్వయః—యే బృహద్భానో మరుద్గణ ఇన్ద్ర! దేవా స్తే సఖ్యాయ యేమిరే ద్యుమ్నీన్ద్రో భవానభిశస్తీ రపాధమదశాస్తిహాఽభవద్భవతు ॥౮౫॥ భావార్థః—యే మనుష్యా! ధార్మికాణాం న్యాయాధీశానాం ధనాఢ్యానాం వా మిత్రతాం కుర్వన్తి తే యశస్వినో భూత్వా సర్వేషాం దుఃఖనివారణాయ సూర్యవద్భవన్తి. ॥౮౫॥

పదార్థము—బృహద్భానో=గొప్ప కిరణములవలె ప్రకాశించు కీర్తిగలవాడా! మరుద్గణాః=మానవులచే అథవా పవన సమూహముచే కార్యమును సాధించువాడా!

ఇన్ద్ర=పరమైశ్వర్యము నొసగు సభాపతీ! రాజా! దేవాః=విద్వాంసులు, తే సఖ్యాయ =నీ స్నేహముకొఱకు, యేమిరే=సంయమమొనర్చుచున్నారు. మఱియు, ద్యుమ్నీ =అధికప్రశంసరూప ధనయుక్తుడవు, ఇన్ద్రః=పరమైశ్వర్యవంతుడవునగు నీవు,అభిశస్తీః =అందరినుండి హింసలను, అప అధమత్=దూరముగ బెదరించి తఱుముచున్నావు, అశస్తిహా=దుష్టనాశకుడవు, అభవత్=కమ్ము. ॥౯౫॥

భావార్థము—ఏ మానవులు ధార్మిక న్యాయాధీశులతో లేక ధనాఢ్యులతో మైత్రి చేయుదురో,వారు యశస్వులై సమస్త దుఃఖనివారణకై సూర్యునివలెనగుచున్నారు.

---

1792 ప్ర వ ఇత్యస్య నృమేధ ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పున ర్మనుష్యైః కిం కర్తవ్య మిత్యాహ. మానవులేమి యొనర్చవలెను.

ప్ర వ ఇన్ద్రాయ బృహతే మరుతో బ్రహ్మార్చత । వృత్రꣳహనతి వృత్రహా శతక్రతు ర్వజ్రేణ శతపర్వణా. ॥౯౬॥

ప్ర, వః, ఇన్ద్రాయ, బృహతే, మరుతః, బ్రహ్మ, అర్చత, వృత్రమ్, హనతి, వృత్రహేతి వృత్ర+హా, శతక్రతు రితి శత+క్రతుః, వజ్రేణ, శతపర్వణేతి శత+పర్వణా. ॥౯౬॥

పదార్థః—(ప్ర) (వః)యుష్మభ్యమ్(ఇన్ద్రాయ)పరమైశ్వర్యాయ (బృహతే)(మరుతః) మనుష్యాః(బ్రహ్మ) ధనమన్నం వా(అర్చత)సత్కురుత(వృత్రమ్)మేఘమ్(హనతి)హన్తి. అత్ర బహులం ఛన్దసీతి శపో లుక్ న (వృత్రహా)యో వృత్రం హన్తి (శతక్రతుః) శతమసఙ్ఖ్యాతాః క్రతవః ప్రజ్ఞాః కర్మాణి వా యస్య సః (వజ్రేణ) శస్త్రాస్త్రవిశేషేణ (శతపర్వణా) శతస్యాసఙ్ఖ్యాతస్య జీవజాతస్య పర్వా పాలనం యస్మాత్తేన ॥౯౬॥ అన్వయః—హే మరుతో మనుష్యా! యః శతక్రతుః సేనాపతిః శతపర్వణా వజ్రేణ వృత్రహా సూర్యో వృత్ర మివ బృహత ఇన్ద్రాయ శత్రూన్ హనతి వో బ్రహ్మ ప్రాపయతి తం యూయం ప్రార్చత ॥౯౬॥ భావార్థః—అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా! యే సూర్యో మేఘమివ శత్రూన్ హత్వా యుష్మదర్థ మైశ్వర్య మున్నయన్తి తేషాం సత్కారం యూయం కురుత సదా కృతజ్ఞా భూత్వా కృతఘ్నతాం త్యక్త్వా ప్రాజ్ఞాః సన్తో మహదైశ్వర్యం ప్రాప్నుత. ॥౯౬॥

పదార్థము—మరుతః=మానవులారా!శతక్రతుః=అసంఖ్యాత బుద్ధులుగలవాడు లేక అసంఖ్యాత కర్మలుగలవాడు నగునే సేనాపతి,శతపర్వణా=అసంఖ్యజీవులయొక్క పాలనమొనర్చు,వజ్రేణ=శస్త్రాస్త్రములతో,వృత్రహా=మేఘహంతకుడైనసూర్యుడు, వృత్రమ్=మేఘమును [హననమొనర్చుచున్నటుల], బృహతే=గొప్ప, ఇంద్రాయ= ఐశ్వర్యముకొఱకు శత్రువులను, హనతి=అంతమొనర్చుచున్నాడో మఱియు, వః = మీకొఱకు, బ్రహ్మ=ధనమును లేక అన్నమును లభింపజేయుచున్నాడో,అతనిని మీరు, ప్ర అర్చత=సత్కరించుడు. ॥౯౬॥

భావార్థము—ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది. మానవులారా! ఎవరు మేఘమును హననమొనర్చు సూర్యునివలె శత్రువులను హతమార్చి మీ నిమిత్తము ఐశ్వర్యము నున్నతిపఱచుచున్నారో వారిని మీరు సత్కరించుడు. సదా కృతజ్ఞులై కృతఘ్నతను త్యజించి ప్రాజ్ఞులై మహదైశ్వర్యమును పొందుడు. ॥౯౬॥

---

1793 అస్యేత్యస్య మేధాతిథి ఋషిః, మహేన్ద్రో దేవతా, స్వరాట్ సతో బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః॥ అథ మనుష్యైః పరమాత్మా స్తోతవ్య ఇత్యుపదిశ్యతే. మానవులు పరమాత్మను స్తుతించ వలెను.

అస్యేదిన్ద్రో వావృధే వృష్ణ్యꣳ శవో మదే సుతస్య విష్ణవి ।
అద్యా తమస్య మహిమాన మాయవోఽనుష్టువన్తి పూర్వథా. ॥౯౭॥
*ఇమా ఉ త్వా । యస్యాయమయꣳ సహస్రమ్ । ఊర్ధ్వ ఊషుణః ॥

అస్య, ఇత్, ఇన్ద్రః, వావృధే, వవృధ ఇతి వవృధే, వృష్ణ్యమ్, శవః, మదే, సుతస్య, విష్ణవి, అద్య, తమ్, అస్య, మహిమానమ్, ఆయవః, అను, స్తువన్తి, పూర్వథేతి పూర్వ+థా. ॥౯౭॥

పదార్థః—(అస్య) సంసారస్య (ఇత్) ఏవ (ఇన్ద్రః) పరమైశ్వర్యయుక్తో రాజా (వావృధే) వర్ధయతి (వృష్ణ్యమ్) వృషా సమర్థ స్తస్యేమమ్ (శవః) బల ముదకం వా. శవ ఇతి ఉదక నా... నిఘం. ౧.౧౨. (మదే) ఆనన్దాయ (సుతస్య) ఉత్పన్నస్య (విష్ణవి) వ్యాపకే పరమేశ్వరే. అత్ర వాచ్ఛన్దసీతి ఘి సంజ్ఞాకార్యాభావే గుణాదేశేఽవాదేశః. (అద్య) అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (తమ్) (అస్య) పరమాత్మనః (మహిమానమ్) మహత్త్వమ్ (ఆయవః) యే స్వకర్మఫలాని యాన్తి తే మనుష్యాః. ఆయవ ఇతి మనుష్య నా... నిఘం. ౨. ౩ (అను) (స్తువన్తి) ప్రశంసన్తి (పూర్వథా) పూర్వే ఇవ ॥౯౭॥ అన్వయః—హే మనుష్యా! య ఇన్ద్రో జీవో విష్ణవి సుతస్యాఽస్య మదే వృష్ణ్యం శవోఽద్య వావృధేఽస్య పరమాత్మన ఇన్మహిమానం పూర్వథా యవోనుష్టువన్తి తం యూయమపి స్తువత. ॥౯౭॥ భావార్థః—హే మనుష్యా! యది యూయం సర్వత్ర వ్యాపకస్య సర్వజగదుత్పాదకస్యాఖిలాధారకస్య పరమైశ్వర్యప్రాపకస్యాజ్ఞాం మహిమానం చ విజ్ఞాయ సర్వస్య సంసారస్యోపకారం కురుత, తర్హి యూయమ్ సతత మానన్దం ప్రాప్నుతేతి.

పదార్థము—మానవులారా! ఇన్ద్రః = ఏపరమైశ్వర్యయుక్తరాజు, విష్ణవి = వ్యాపక పరమాత్మయందు, సుతస్య = ఉత్పన్నమైన, అస్య = ఈ సంసారముయొక్క, మదే = ఆనందముకొఱకు, వృష్ణ్యమ్ = పరాక్రమమును, శవః = బలమును మఱియు జలమును, అద్య = ఈ వర్తమాన సమయమునందు, వావృధే = పెంపొందజేయుచున్నాడో, అస్య ఏ యీపరమాత్మయొక్క, మహిమానమ్ = మహిమను, ఇత్ = నిశ్చయముగ, పూర్వథా

---

*ఇచ్చట క్రమముగ అ. ౩౩. మం. ౮౧-౮౩; అ. ౧౧. మం. ౪౨ మంత్రముల ప్రతీకములు కర్మకాండ విశేషార్థమై ఉదహరించ బడినవి.

=పూర్వజులవలె,ఆయవః=తమతమ కర్మఫలములనుపొందు మానవులు, అను స్తువన్తి =అనుకూలముగ స్తుతించుచున్నారో, తమ్=అతనిని మీరుకూడ స్తుతించుడు. ॥౯౭॥

భావార్థము—మానవులారా! మీరు సర్వవ్యాపకుడును, సకల జగదుత్పాదకుడును, సర్వాధారుడును, ఉత్తమైశ్వర్యపాలకుడునగు నీశ్వరునియొక్క ఆజ్ఞను మహిమను తెలిసికొని సమస్త జగత్తున కుపకారమొనర్చినచో మీరు నిరంతరము ఆనందమును పొందుదురు. ॥౯౭॥ 1793

---

ఈ యధ్యాయమందు అగ్ని, ప్రాణోదానములు, దివారాత్రులు, ఋతువులు, సూర్యుడు, అగ్ని, రాజు, ఐశ్వర్యము, ఉత్తమయానము, విద్వాంసుడు, లక్ష్మి, వైశ్వానరుడు, ఈశ్వరుడు, ఇంద్రుడు, బుద్ధి, వరుణుడు, అశ్వినులు, అన్నము, సూర్యుడు, రాజు ప్రజలు, పరీక్షకుడు, ఇంద్రవాయువులు మున్నగు పదార్థముల గుణముల వర్ణన యున్నది.

కావున నీ యధ్యాయమందు చెప్పబడిన అర్థమునకు
పూర్వాధ్యాయమునందు చెప్పబడిన అర్థముతో
సంబంధమున్నదని యెఱుంగవలయును.



ఇతి శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం శ్రీయుత పరమవిదుషాం విరజానన్ద సరస్వతీస్వామినాం శిష్యేణ శ్రీమద్దయానన్ద సరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సమన్వితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే త్రయస్త్రింశోఽధ్యాయః సమాప్తమగతమ్.



కృష్ణా మండలాంతర్గత కుందేరు గ్రామవాస్తవ్యులగు
పాలడగు శేషాచలాచార్య, తదేవమండలాంతర్గత ముదునూరు
గ్రామవాస్తవ్యుడు అన్నే కేశవార్యశాస్త్రి గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన
శ్రీ మద్దయానన్ద సరస్వతీ నిర్మిత యజుర్వేదభాషాభాష్యమందలి ౩౩ వ అధ్యాయము సమాప్తము.

—( ఇతి )—



ఓమ్

# అథ చతుస్త్రింశాధ్యాయారమ్భః

—o—

## ముప్పదినాల్గవ అధ్యాయము ప్రారంభము

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ। యద్భద్రం తన్న ఆ సువ ॥౧॥

1794యజ్జాగ్రత ఇత్యస్య శివసంకల్ప ఋషిః, మనో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ మనసో వశీకరణ విషయమాహా.

ఈ మంత్రమందిపుడు మనస్సును వశపరచుకొను విషయము వివరించబడినది.

యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవైతి। దూరఙ్గమం

జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే మనః శివసఙ్కల్పమస్తు. ॥౧॥

యత్, జాగ్రతః, దూరమ్, ఉదైతీత్యుత్+ఐతి, దైవమ్, తత్, ఊఁ

ఇత్యూఁ, సుప్తస్య, తథా, ఏవ, ఏతి, దూరఙ్గమ మితి దూరమ్+గమమ్,

జ్యోతిషామ్, జ్యోతిః, ఏకమ్, తత్, మే, మనః, శివసఙ్కల్పమితి శివ+

సఙ్కల్పమ్. అస్తు. ॥౧॥

పదార్థః—(యత్ జాగ్రతః) (దూరమ్) (ఉదైతి)ఉద్గచ్ఛతి (దైవమ్) దేవ ఆత్మని భవం దేవస్య జీవాత్మనః సాధన మితి వా (తత్) యత్, వ్యత్యయః(ఉ)(సుప్తస్య)శయానస్య (తథా) తేనైవ ప్రకారేణ(ఏవ)(ఏతి)అన్తర్గచ్ఛతి (దూరఙ్గమమ్) యద్దూరం గచ్ఛతి గమయతి వాఽనేక పదార్థాన్ గృహ్ణాతి తత్ (జ్యోతిషామ్) శబ్దాదివిషయప్రకాశకానామిన్ద్రియాణామ్. (జ్యోతిః) ప్రకాశకం ప్రవర్తక మాత్మా మనసా సంయుజ్యతే మన ఇన్ద్రియేణేన్ద్రియమర్థేనేతి మహర్షివాత్స్యాయనోక్తేః (ఏకమ్) అసహాయమ్ (తత్) (మే) మమ(మనః)సంకల్పవికల్పాత్మకమ్(శివసంకల్పమ్)శివః కల్యాణకారీ ధర్మవిషయః సంకల్ప ఇచ్ఛా యస్య తత్(అస్తు)భవతు. అన్వయః— హే జగదీశ్వర విద్వన్ వా భవదనుగ్రహేణ యద్దైవం దూరఙ్గమం జ్యోతిషాం జ్యోతిరేకం జాగ్రతో దూరముదైతి,తదు సుప్తస్య తథైవాన్తరేతి,తన్మే మనః శివసంకల్పమస్తు. భావార్థః— యే మనుష్యాః పరమేశ్వరాజ్ఞాసేవనం విద్వత్సంగం కృత్వా అనేకవిధసామర్థ్యయుక్తం మనః శుద్ధం సమ్పాదయన్తి, యజ్జాగృతావస్థాయాం విస్తృతవ్యవహారం తత్సుషుప్తౌ శాన్తం భవతి యద్వేగవతాం వేగవత్తరం, జ్ఞానస్య సాధకత్వాదిన్ద్రియాణామపి ప్రవర్తకం నిగృహ్ణన్తి తేఽశుభవ్యవహారం విహాయ శుభాచరణే ప్రేరయితుం శక్నువన్తి. ॥౧॥

పదార్థము—జగదీశ్వరా! లేక, [విద్వాంసుడా!] నీ కృపచే, యత్ =ఏది, దైవమ్ =ఆత్మయందుండునది లేక జీవాత్మకు సాధనమైనది, దూరంగమమ్ =దూరముపోవునది, మానవుని దూరముగ తీసుకొని వెళ్లునది,అనేకపదార్థములను గ్రహించునది,జ్యోతిషామ్ =శబ్దాది విషయములను ప్రకాశపఱచు శ్రోత్రాదింద్రియములను, జ్యోతిః =

ప్రవృత్తపఱచునది, ఏకమ్ = ఒంటరిది, జాగ్రతః = జాగ్రతావస్థయందు, దూరమ్ = దూరదూరముగ, ఉత్ ఏతి = పరుగిడునదై యున్నదో, ఉ = మఱియు, తత్ = ఏది, సుప్తస్య = నిద్రించుచున్న వానికికూడ, తథా ఏవ = అదే ప్రకారముగా, ఏతి = లోపలకు అంతఃకరణములోపలికి ప్రవేశించుచున్నదో, తత్ మే మనః = సంకల్పవికల్పాత్మకమైన ఆ నా మనస్సు, శివసంకల్పమ్ = కల్యాణకర ధర్మమునకు సంబంధించిన కోరికగలది, అస్తు = అగుగాక! ॥౧॥

భావార్థము—ఏ మానవులు పరమేశ్వరునియొక్క ఆజ్ఞను పాలించి,విద్వాంసుల సాంగత్యమొనర్చి,వివిధసామర్థ్యములుగల మనస్సును శుద్ధపఱచుచున్నారో, ఏమనస్సు జాగ్రతావస్థయందు విస్తృతవ్యవహారములుగలదై సుషుప్త్యవస్థయందు శాంతినిపొందు చున్నదో, ఎవరు వేగముగల పదార్థములలో నతివేగముగలదియు, జ్ఞానమునకు సాధన మగుటచే నింద్రియముల ప్రవర్తకమునగు మనస్సును వశపఱచుకొనుచున్నారో, వారు అశుభవ్యవహారములను విడనాడి శుభవ్యవహారములందు మనస్సును ప్రవృత్త మొనర్చగలుగుచున్నారు. ॥౧॥ 1794

---

1795 యేన కర్మాణీత్యస్య శివసంకల్ప ఋషిః, మనో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వన్తి విదథేషు ధీరాః ।
యదపూర్వం యక్షమన్తః ప్రజానాం తన్మే మనః శివసఙ్కల్ప మస్తు॥

యేన, కర్మాణి, అపసః, మనీషిణః, యజ్ఞే, కృణ్వన్తి, విదథేషు, ధీరాః, యత్, అపూర్వమ్, యక్షమ్, అన్తరిత్యన్తః, ప్రజానామితి ప్ర+జానామ్, తత్, మే, మనః, శివసంకల్పమితి శివ+సంకల్పమ్ అస్తు ॥౨॥

పదార్థః—(యేన)మనసా(కర్మాణి)కర్తురీప్సితతమాని క్రియమాణాని (అపసః) అపః కర్మ తద్వన్తః సదా కర్మనిష్ఠాః (మనీషిణః) మనస ఈషిణో దమనకర్తారః (యజ్ఞే)అగ్నిహోత్రాదౌ ధర్మ్యేణ సఙ్గతవ్యవహారే యోగాభ్యాసే వా(కృణ్వన్తి)కుర్వన్తి(విదథేషు)విజ్ఞానయుద్ధాదివ్యవహారేషు (ధీరాః)ధ్యానవన్తో మేధావినః, ధీర ఇతి మేధావి నా... నిఘం. ౩. ౧౫.(యత్)(అపూర్వమ్) అనుత్తమగుణకర్మస్వభావమ్. (యక్షమ్)పూజనీయం సంగతం వా. అత్రౌణాదికః సన్ ప్రత్యయః(అన్తః)మధ్యే (ప్రజానామ్) ప్రాణిమాత్రాణామ్.(తత్)(మే) మమ(మనః)మననవిచారాత్మకమ్(శివసఙ్కల్పమ్)ధర్మేష్టమ్(అస్తు) ॥౨॥ అన్వయః—హే పరమేశ్వర వా విద్వన్భవత్సఙ్గేన యేనాపసో మనీషిణో ధీరా యజ్ఞే విదథేషు చ [కర్మాణి]కృణ్వన్తి, యదపూర్వం ప్రజానా మన్తర్యక్షం వర్తతే తన్మే మనః శివసఙ్కల్పమస్తు. ॥౨॥ భావార్థః—మనుష్యైః పరమేశ్వరస్యోపాసనేన సువిచారవిద్యాసత్సఙ్గై రన్తఃకరణ మధర్మాచారాన్నివర్త్య ధర్మాచారే ప్రవర్తనీయమ్. ॥౨॥

పదార్థము—పరమేశ్వరా! లేక విద్వాంసుడా! ఎపుడు నీ సాంగత్యముచే, యేన =

ఏ మనస్సుతో, అపసః = సదా కర్మ ధర్మనిష్ఠులు, మనీషిణః = మనస్సును దమన మొనర్చు వారు, ధీరాః = ధ్యానించు బుద్ధిమంతులు, యజ్ఞే = అగ్నిహోత్రాదులందు లేక ధర్మ సంబంధ వ్యవహారమందు, అథవా యోగ యజ్ఞమందును, విదథేషు = విజ్ఞానమునకు సంబంధించిన వ్యవహారములందును, యుద్ధాది వ్యవహారములందును, కర్మాణి = అత్యంత ఇష్టకర్మలను, కృణ్వన్తి = చేయుచున్నారో, యత్ = ఏది, అపూర్వమ్ = సర్వోత్తమ గుణ కర్మ స్వభావముగలది, ప్రజానామ్ అన్తః = అన్ని ప్రాణుల హృదయములందు, యక్షమ్ = పూజనీయమగుచున్నదో, అథవా కలసి ఏకమగుచున్నదో, తత్ మే మనః = అట్టి మనన విచారాత్మకమగు నా మనస్సు, శివసఙ్కల్పమ్ = ధర్మేష్టము, అస్తు = అగుగాక! ॥౨॥

భావార్థము—మానవులు పరమేశ్వరోపాసనవలనను, సుందరవిచారములతోను, విద్యతోను, సత్సంగముతోను, తమ అంతఃకరణములను అధర్మాచరణమునుండి తొలగించి, ధర్మాచరణమందు ప్రవృత్తమొనర్చవలయును. ॥౨॥

---

1796 యత్ ప్రజ్ఞానమిత్యస్య శివసఙ్కల్ప ఋషిః, మనో దేవతా, స్వరాట్ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః

పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

యత్ప్రజ్ఞాన ముత చేతో ధృతిశ్చ యజ్జ్యోతి రన్త రమృత ప్రజాసు ।
యస్మా న్న ఋతే కిఞ్చన కర్మ క్రియతే తన్మే మనః శివసంకల్ప మస్తు.॥౩॥

యత్, ప్రజ్ఞానమితి ప్ర+జ్ఞానమ్, ఉత, చేతః, ధృతిః, చ, యత్, జ్యోతిః, అన్తః, అమృతమ్, ప్రజాస్వితి ప్ర+జాసు, యస్మాత్, న, ఋతే, కిమ్, చన, కర్మ, క్రియతే, తత్, మే, మనః, శివసంకల్పమితి శివ+సఙ్కల్పమ్, అస్తు. ॥౩॥

పదార్థః—(యత్)(ప్రజ్ఞానమ్)ప్రజానాతి యేన తద్బుద్ధిస్వరూపమ్(ఉత)అపి (చేతః) చేతతి స్మరతి యేన తత్(ధృతిః)ధైర్యరూపమ్(చ)చకారాల్లజ్జాదీన్యపి కర్మాణి యేన క్రియన్తే(యత్)(జ్యోతిః)ద్యోతమానమ్(అన్తః)అభ్యన్తరే(అమృతమ్)నాశరహితమ్(ప్రజాసు)జనేషు(యస్మాత్) మనసః(న)(ఋతే)వినా(కిమ్)(చన)కిఞ్చిదపి(కర్మ)(క్రియతే)(తత్) (మే)జీవాత్మనో మమ(మనః) సర్వకర్మసాధనమ్ (శివసంకల్పమ్) శివే కల్యాణకరే పరమాత్మని కల్ప ఇచ్ఛాఽస్య తత్ (అస్తు) భవతు. ॥౩॥ అన్వయః—హే జగదీశ్వర పరమయోగిన్ విద్వన్వా! భవజ్జ్ఞాపనేన యత్ప్రజ్ఞానం చ ఉత చేతః [ధృతి] ర్యచ్చ ప్రజాస్వన్త రమృతం జ్యోతి ర్యస్మాదృతే కిఞ్చన కర్మ న క్రియతే తన్మే మనః శివసంకల్పమస్తు. ॥౩॥ భావార్థః—హే మనుష్యాః! యదన్తః కరణ బుద్ధి చిత్త మనోఽహఙ్కార వృత్తిత్వాచ్చతుర్విధ మన్తః ప్రకాశం ప్రజానాం సర్వకర్మసాధకం నాశరహితం మనోఽస్తి తన్న్యాయ్యే సత్యాచరణే చ ప్రవర్త్య పక్షపాతాఽన్యాయాఽధర్మాచరణా ద్యుయం నివర్తయత. ॥౩॥

పదార్థము—జగదీశ్వరా! లేక పరమయోగీ! లేక విద్వాంసుడా! నీవు తెలియ

చెప్పుటచే: యత్ = ఏది, ప్రజ్ఞానమ్ = విశేష జ్ఞానోత్పాదక బుద్ధిస్వరూపము, ఉత = మఱియును, చేతః = స్మృతికి సాధనము, ధృతిః = ధైర్యస్వరూపము, చ = మఱియు, లజ్జాది కర్మలకు హేతువు, ప్రజాసు అన్తః = మానవుల అంతఃకరణమునందు ఆత్మకు మిత్రమగుటచే, అమృతమ్ = నాశరహితము, జ్యోతిః = ప్రకాశస్వరూపము [నైయున్నదో], యస్మాత్ ఋతే = ఏదిలేనిదే, కిమ్ చన కర్మ = ఏ పనియును, న క్రియతే = చేయఁబడదో, తత్ మే మనః = జీవాత్మనగు నా యొక్క సకల కర్మలకు సాధనరూపమైనట్టి ఆ మనస్సు, శివసంకల్పమ్ = కల్యాణకారియైన పరమాత్మను అభిలషించునది, అస్తు = అగుగాక ! ॥౩॥

భావార్థము—మానవులారా! అంతఃకరణ, బుద్ధి, చిత్త, అహంకార స్వరూపవృత్తులుగలదై నాలుగువిధములుగ లోపల ప్రకాశమొనర్చునది, ప్రాణుల సమస్త కర్మలను సాధించునది, అవినాశియునైన ఏ మనస్సుకలదో, దానిని మీరు న్యాయ సత్యాచరణలముయందు ప్రవృత్తపఱచి, పక్షపాత, అన్యాయ, అధర్మాచరణములనుండి నివృత్తమొనర్చుడు. ॥౩॥ 1796

---

1997 యేనేదమిత్యస్య శివసంకల్ప ఋషిః, మనో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

యేనేదం భూతం భువనం భవిష్యత్పరిగృహీత మమృతేన సర్వమ్ ।
యేన యజ్ఞ స్తాయతే స ప్తహోతా తన్మే మనః శివసఙ్కల్ప మస్తు. ॥౪॥

యేన, ఇదమ్, భూతమ్, భువనమ్, భవిష్యత్, పరిగృహీతమితి పరి+గృహీతమ్, అమృతేన, సర్వమ్, యేన, యజ్ఞః, తాయతే, సప్తహోతేతి సప్త+హోతా, తత్, మే, మనః, శివసఙ్కల్పమితి శివ+సఙ్కల్పమ్, అస్తు. ॥౪॥

పదార్థః—(యేన)మనసా(ఇదమ్)వస్తుజాతమ్ (భూతమ్) అతీతమ్ (భువనమ్)భవతీతి భువనమ్ వర్తమానకాలస్య సంబంధి, ఔణాదికః క్యుః (భవిష్యత్) యదుత్పత్స్యమానం భావి (పరిగృహీతమ్) పరితః సర్వతో గృహీతం జ్ఞాతమ్ (అమృతేన) నాశరహితేన పరమాత్మనా సహ యుక్తేన (సర్వమ్) సమగ్రమ్ (యేన) (యజ్ఞః) అగ్నిష్టోమాదిర్వి జ్ఞానమయో వ్యవహారో వా (తాయతే)తన్యతే విస్తీర్యతే(సప్తహోతా) అగ్నిష్టోమేపి సప్త (తత్)(మే) మమ(మనః)యోగయుక్తచిత్తమ్ (శివసంకల్పమ్) శివో మోక్షరూపసంకల్పో యస్య తత్ (అస్తు) భవతు. ॥౪॥

అన్వయః—హే మనుష్యా! యేనామృతేన భూతం భువనం భవిష్యత్సర్వమిదం పరిగృహీతం భవతి యేన సప్తహోతా యజ్ఞస్తాయతే, తన్మే మనః శివసంకల్పమస్తు. ॥౪॥ భావార్థః—హే మనుష్యా! యచ్చిత్తం యోగాభ్యాససాధనోపసాధనసిద్ధం భూత భవిష్యద్వర్తమానజ్ఞం సర్వసృష్టివిజ్ఞాతృకర్మోపాసనాజ్ఞానసాధకం వర్తతే తత్సదైవ కల్యాణప్రియం కురుత. ॥౪॥

పదార్థము—మానవులారా ! యేన అమృతేన = నాశరహితుడైన పరమాత్మతో కూడియున్న యే మనస్సుతో, భూతమ్ = గడచినది, భువనమ్ = వర్తమాన కాలమునకు

సంబంధించినది, భవిష్యత్ = ముందు జరుగబోవునది, సర్వమ్ ఇదమ్ = ఈ సమస్తము, ఈ త్రికాలస్థ వస్తువులన్నియు, పరిగృహీతమ్ = సకలదిశలనుండి గృహీతమగుచున్నవో అనగా తెలిసికొనబడుచున్నవో, యేన = దేనివలన, సప్తహోతా = సప్తహోతలు [గల అగ్నిష్టోమము] ఏడుగురు హోతలు లేక పంచప్రాణములు, ౬వది జీవాత్మ, ౭వది అవ్యక్తము అను ఇచ్చిపుచ్చుకొను నీ యేడు ఉన్న, యజ్ఞః = యగ్నిష్టోమాది యజ్ఞము అథవా విజ్ఞానరూప వ్యవహారము, తాయతే = విస్తృతము చేయబడుచున్నదో, మే = నాయొక్క, తత్ మనః = యోగయుక్తమైన ఆచిత్తము, శివసంకల్పమ్ = మోక్ష రూపసంకల్పముగలది, అస్తు = అగుగాక! ॥౪॥

భావార్థము—మానవులారా! ఏ చిత్తము యోగాభ్యాసపు సాధనోపసాధనము లచే సిద్ధమైనది, భూత, భవిష్యత్ వర్తమానములను త్రికాలముల జ్ఞాత, సమస్తసృష్టిని తెలిసికొనునది, కర్మ ఉపాసన జ్ఞానములకు సాధకమునై యున్నదో దానిని సదా కల్యాణమునందు ప్రియమైనదిగ నొనర్పుడు. ॥౪॥ 1797

---

1798 యస్మిన్నిత్యస్య శివసంకల్ప ఋషిః, మనో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

యస్మి న్నృచః సామ యజూఁషి యస్మి న్ప్రతిష్ఠితా రథనాభా వివారాః ।
యస్మిం శ్చిత్తఁ సర్వ మోతం ప్రజానాం తన్మే మనః శివసంకల్ప మస్తు॥

యస్మిన్, ఋచః, సామ, యజూంషి, యస్మిన్, ప్రతిష్ఠితా, ప్రతిష్ఠితేతి ప్రతి+స్థితా, రథనాభావివేతి రథనాభౌ+ఇవ, అరాః, యస్మిన్, చిత్తమ్, సర్వమ్, ఓతమిత్యా+ఉతమ్, ప్రజానామితి ప్ర+జానామ్, తత్, మే, మనః, శివసఙ్కల్ప మితి శివ+సఙ్కల్పమ్, అస్తు. ॥౫॥

పదార్థః—(యస్మిన్) మనసి (ఋచః) ఋగ్వేదః (సామ) సామవేదః (యజూంషి) యజుర్వేదః (యస్మిన్) (ప్రతిష్ఠితా) ప్రతిష్ఠితాని (రథనాభావివ) యథా రథస్య రథచక్రస్య మధ్యమే కాష్ఠే సర్వేఽవయవా లగ్నా భవన్తి తథా (అరాః) రథచక్రావయవాః (యస్మిన్) (చిత్తమ్) సర్వపదార్థవిషయిజ్ఞానమ్ (సర్వమ్) సమగ్రమ్ (ఓతమ్) సూత్రే మణిగణా ఇవ ప్రోతమ్ (ప్రజానామ్) (తత్) (మే) మమ (మనః) (శివసఙ్కల్పమ్) శివః కల్యాణకారో వేదాదిసత్యశాస్త్రప్రచార సఙ్కల్పో యస్మింస్తత్ (అస్తు) భవతు ॥౫॥ అన్వయః—రథనాభా వివారా యస్మిన్మనసి ఋచః సామ యజూంసి ప్రతిష్ఠితా యస్మిన్నథర్వాణః ప్రతిష్ఠితా భవన్తి యస్మిన్ ప్రజానాం సర్వం చిత్త మోతమస్తి తన్మే మనః శివసఙ్కల్ప మస్తు. ॥౫॥ భావార్థః—అత్రోపమావాచక లుప్తోపమాలఙ్కారౌ. హే మనుష్యా! యుష్మాభి ర్యస్య స్వాస్థ్యే ఏవ వేదాదిపఠన పాఠనవ్యవహారో ఘటతే తత్ మన ఏవ వేదాది విద్యాధారం యత్ర సర్వేషాం వ్యవహారాణాం జ్ఞానం సఞ్చితం భవతి తదన్తః కరణం విద్యాధర్మాచరణేన పవిత్రం సంపాదనీయమ్. ॥౫॥

పదార్థము—యస్మిన్ = ఏ మనస్సునందు, రథనాభావివ అరాః = ఎట్లు రథచక్ర

ము యొక్క మధ్యనుండు అడ్డలోనికి ఆకులు తగిలి యుండుచున్నవో అటులనే, ఋచః ఋగ్వేదము, సామః = సామవేదము, యజూంషి = యజుర్వేదము, ప్రతిష్ఠితా = సమస్త దిశలనుండిస్థితములై యున్నవో, యస్మిన్ = దేనియందు అథర్వవేదము స్థితమైయున్నదో, యస్మిన్ = దేనియందు, ప్రజానామ్ = ప్రాణులయొక్క, సర్వమ్ = సమగ్రము, చిత్తమ్ = సర్వపదార్థ సంబంధజ్ఞానము, ఓతమ్ = సూత్రమునందలి మణులవలె సంయుక్తమై యున్నదో, తత్ మే మనః = అట్టి నా మనస్సు, శివసంకల్పమ్ = కల్యాణకరము, వేదాది సత్యశాస్త్రముల ప్రచారరూప సంకల్పముకలదియు, అస్తు = అగుగాక! ॥౫॥

భావార్థము—మానవులారా! ఏ మనస్సుయొక్క స్వాస్థ్యమునందే వేదాది విద్యల కాధారముకలుగునో, దేనియందు సమస్త వ్యవహారముల జ్ఞానము యేకత్రిత మగుచున్నదో, అట్టి ఆ యంతఃకరణమును మీరు విద్యచేతను పవిత్రపఱచుడు. ॥౫॥

---

1799 సుషారథిరిత్యస్య శివసఙ్కల్ప ఋషిః, మనో దేవతా, స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయ మాహ. మరల విషయ మయ్యాదియే

సుషారథి రశ్వానివ యన్మనుష్యా న్నేనీయతేఽ భీశుభి ర్వాజిన ఇవ ।
హృత్ప్రతిష్ఠం యద జిర ఞ్జవిష్ఠం తన్మే మనః శివసఙ్కల్ప మస్తు॥౬॥

సుషారథిః సుసారథిరితి సు+సారథిః, అశ్వానివేత్యశ్వాన్+ఇవ, యత్, మనుష్యాన్, నేనీయతే, అభీశుభిరిత్యభీశు+భిః, వాజిన+ఇవేతి వాజినః+ఇవ, హృత్ప్రతిష్ఠమ్, హృత్ప్రతిష్ఠమితి హృత్+ప్రతిష్ఠమ్, యత్, అజిరమ్, జవిష్ఠమ్, తత్, మే, మనః, శివసంకల్పమితి శివ+సంకల్పమ్, అస్తు. ॥౬॥

పదార్థః—(సుషారథిః) శోభనశ్చాసౌ సారథి ర్యానచాలయితా తథా (యత్) (మనుష్యాన్)మనుష్యగ్రహణ ముభయలక్షకం ప్రాణిమాత్రస్య(నేనీయతే)భృశమిత స్తతో నయతి గమయతి (అభీశుభిః) రశ్మిభిః, అభీశవ ఇతి రశ్మి నా...నిఘం.౧. ౫ (వాజిన ఇవ)సుశిక్షితానశ్వానివ (హృత్ప్రతిష్ఠమ్)హృది ప్రతిష్ఠా స్థితి ర్యస్య తత్(యత్)(అజిరమ్)విషయాదిషు ప్రక్షేపకం జరాద్యవస్థారహితం వా(జవిష్టమ్)అతిశయేన వేగవత్తరమ్(తత్)(మే)మమ(మనః) (శివసఙ్కల్పమ్)మఙ్గలనియమేష్టమ్ (అస్తు) భవతు. ॥౬॥ అన్వయః—యత్ సుషారథిరశ్వానివ మనుష్యాన్నేనీయతేఽభీశుభి ర్వాజిన ఇవ నియచ్ఛతి చ బలాత్ సారథి రశ్వానివ ప్రాణినో నయతి యద్ధృత్ప్రతిష్ఠ మజిరం జవిష్ఠమస్తి తన్మే మనః శివసఙ్కల్ప మస్తు. ॥౬॥ భావార్థః—అత్రోపమాలంకారః యత్రాసక్తం తత్రైవ ప్రగ్రహైః సారథిః తురఙ్గానివ వశే స్థాపయతి సర్వేఽవిద్వాంసో యదనువర్తన్తే విద్వాంసశ్చ యత్స్వవశం కుర్వన్తి యచ్ఛుద్ధం సత్సుఖకార్యశుద్ధం సద్దుఃఖకారి యజ్జితం సిద్ధం యదజితమసిద్ధిం ప్రయచ్ఛతి తన్మనో మనుష్యైః స్వవశం సదా రక్షణీయమ్.

పదార్థము—యత్ = ఏ మనస్సు, సుషారథిః = చక్కని నేర్పరియైన సారథి, బండివాడు, అశ్వానివ = కళ్లెముతో గుఱ్ఱములను యెటుబడితే అటు నడిపించుచున్న

టుల, మనుష్యాన్ = మానవాది ప్రాణులను, నేనీయతే = తొందరతొందరగా ఇటు నటు నడిపించుచున్నదో, మఱియు, అభీశుభిః = పగ్గములతో, వాజినః = వేగవంతములైన గుఱ్ఱములను సారథి స్వాధీనపఱచుకొనుచున్నటుల నియమము నందు నుంచునో, యత్ = ఏది, హృత్ప్రతిష్ఠమ్ = హృదయమందుండునది, అజిరమ్ = విషయాదులయందు ప్రేరేపించునది, అథవా వృద్ధాద్యవస్థా రహితము, జవిష్ఠమ్ = అత్యంత వేగవంతమునునై యున్నదో, తత్ మే మనః = ఆ నా మనస్సు, శివసంకల్పమ్ = మంగలమయ నియమముల నభిలషించునది, అస్తు = అగుగాక! ॥౬॥

భావార్థము—ఈ మంత్రమందు ఉపమాలంకారములు రెండున్నవి.ఏ పదార్థము నందాసక్తియుండునో అక్కడికే బలాత్కారముగ సారథి గుఱ్ఱములను వశమునందుంచి నడపునట్లు ప్రాణులను తీసికొని వెళ్లును.మఱియు సారథి కళ్లెముతో గుఱ్ఱములను వశమునందుంచినట్లు [ప్రాణులను] వశమునందుంచును. సకలమూర్ఖులు దేనికి వశవర్తులై ప్రవర్తించుదురో, విద్వాంసులు దేనిని తమ స్వాధీనము నందుంచుకొనుదురో, ఏది శుద్ధమైన సుఖమును కలుగజేయునది, అశుద్ధమైన దుఃఖమును కలుగజేయునది యగునో,ఏది జయించబడిన సిద్ధిని,జయించబడకున్న అసిద్ధిని కలుగజేయునో, అట్టి మనస్సును మానవులు సదా వశమునందుంచుకొనవలయును. ॥౬॥ 1799

---

1800 పితుమిత్యస్యాగస్త్య ఋషిః, అన్నం దేవతా, ఉష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః

అథ కః శత్రూన్ విజేతుం శక్నోతీత్యాహ. ఎవరు శత్రువులను జయించగలరు ?

పితుం ను స్తోషమ్మహో ధర్మాణ న్తవిషీమ్ ।

యస్య త్రితో వ్యోజసా వృత్రం విపర్వ మర్దయత్. ॥౭॥

పితుమ్, ను, స్తోషమ్, మహః, ధర్మాణమ్, తవిషీమ్, యస్య, త్రితః, వి, ఓజసా, వృత్రమ్, విపర్వమితి వి+పర్వమ్, అర్దయత్. ॥౭॥

పదార్థః—(పితుమ్)అన్నమ్(ను)సద్యః(స్తోషమ్)స్తువే(మహః)మహాన్తమ్(ధర్మాణమ్) పక్షపాతరహితం న్యాయాచరణం ధర్మమ్(తవిషీమ్)బలయుక్తాం సేనామ్.తవిషీతి బల నా...నిఘం. ౨. ౯.(యస్య)(త్రితః)త్రిషు కాలేషు, సప్తమ్యర్థే తసిః (వి) (ఓజసా)ఉదకేన సహ. ఓజస ఇత్యుదక నా...నిఘం.౧. ౧౨.(వృత్రమ్)మేఘమ్(విపర్వమ్)విగతాని పర్వాణి గ్రన్థయో యస్య తమ్ (అర్దయత్)అర్దయతి నాశయతి. ॥౭॥ అన్వయః—అహం యస్య పితుం మహో ధర్మాణం తవిషీం ను స్తోషం స రాజపురుషః త్రితః సూర్య ఓజసా సహ వర్తమానం విపర్వం వృత్రం వ్యర్దయదివ శత్రూఞ్జేతుం శక్నోతి. ॥౭॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. యేన సత్యో ధర్మో బలవతీ సేనా పుష్కలాన్నాదిసామగ్రీ చ ధ్రియతే, స సూర్యో మేఘమివ శత్రూన్ విజేతుం శక్నుయాత్. ॥౭॥

పదార్థము—నేను, యస్య = ఎవనియొక్క, పితుమ్ = అన్నమును, మహఃధర్మాణమ్ = గొప్పదైన పక్షపాతరహిత న్యాయాచరణ ధర్మమును, తవిషీమ్ = బలముగల

సేనను, ను=శీఘ్రముగా, స్తోషమ్=స్తుతించుచున్నానో, ఆ రాజపురుషుడు, త్రితః=మూడు కాలములందు; సూర్యుడెటుల, ఓజసా=జలముతోఁగూడియున్న, విపర్వమ్=భిన్న భిన్నములై పోయిన గ్రంథులుగల, వృత్రమ్=మేఘమును, వి అర్దయత్ = విశేషముగ నష్టపఱచుచున్నాడో,అటులనే శత్రువులను జయించుటకు సమర్థుడగుచున్నాడు.

భావార్థము—ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఎవడు సత్య ధర్మమును, శక్తిసామర్థ్యములుగలిగిన సైన్యమును,పుష్కలముగ నన్నాది సామగ్రులను ధరించునో, అతడు సూర్యుడు మేఘమును నాశనమొనర్చుచున్నటులనే శత్రువులను జయించగలుగుచున్నాడు. ॥౭॥ 1800

---

1801 అన్విదిత్యస్యాగస్త్య ఋషిః, అనుమతి ర్దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పున ర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ. మరల మానవు లేమి చేయవలయును ?

అన్విదనుమతే త్వం మన్యాసై శఞ్చ న స్కృధి ।

క్రత్వే దక్షాయ నో హిను ప్ర ణ ఆయూꣳషి తారిషః. ॥౮॥

అను, ఇత్, అనుమత ఇత్యను+మతే, త్వమ్, మన్యాసై, శమ్, చ, నః, కృధి, క్రత్వే, దక్షాయ, నః, హిను, ప్ర, నః, ఆయూꣳషి, తారిషః ॥౮॥

పదార్థః— (అను) (ఇత్) ఏవ (అనుమతే) అనుకూలా మతి ర్యస్య తత్సమ్బుద్ధౌ (త్వమ్) (మన్యాసై)మన్యస్వ (శమ్)సుఖమ్(చ) (నః)అస్మాన్ (కృధి)కురు (క్రత్వే)ప్రజ్ఞాయై (దక్షాయ) బలాయ చతురత్వాయ వా(నః)అస్మాన్(హిను)వర్ధయ(ప్ర)(నః)అస్మాకమ్ (ఆయూంషి) జీవనాదీని(తారిషః)సన్తారయసి. ॥౮॥ అన్వయః—హే అనుమతే సభాపతే విద్వంస్త్వం యచ్ఛమనుమన్యాసై తేన యుక్తాన్నస్కృధి, క్రత్వే దక్షాయ నో హిను,న ఆయూంషి చేత్ప్రతారిషః. భావార్థః—మనుష్యైర్యథా స్వార్థసిద్ధయే ప్రయత్యేత తథైవాన్యార్థేఽపి ప్రయత్నో విధేయః యథా స్వస్య కల్యాణవృద్ధీ అన్వేష్టవ్యే తథాఽన్యేషామపి. ఏవం సర్వేషాం పూర్ణమాయుః సమ్పాదనీయమ్. ॥౮॥

పదార్థము—అనుమతే=అనుకూల బుద్ధిగల సభాపతియైన విద్వాంసుడా! త్వమ్=నీవు. దేనిని. శమ్=సుఖకరమని, అను మన్యాసై =అంగీకరించెదవో దానిని గలిగియున్న వారముగ, నః=మమ్ము,కృధి=చేయుము, క్రత్వే=బుద్ధికొఱకు, దక్షాయ=బలముకొఱకు లేక చాతుర్యము నిమిత్తము, నః=మమ్ము,హిను=అభివృద్ధిపఱచుము. చ=మఱియు, నః=మాయొక్క,ఆయూంషి=ఆయువులను, ఇత్=నిశ్చయముగ, ప్రతారిషః=బాగుగా పూర్తియొనర్చుము. ॥౮॥

భావార్థము—మానవులెటుల స్వార్థసిద్ధికై ప్రయత్న మొనర్చెదరో అటులనే ఇతరులకై కూడ, ప్రయత్న మొనర్చవలయును, ఎటుల తమ కల్యాణాభివృద్ధిని కోరుదురో, అటులనే ఇతరులకుకూడ వాంఛించవలయును. ఇటుల సకలజనుల ఆయువు గడపవలయును. ॥౮॥ 1801

---

1802 అను న ఇత్యస్యాగస్త్య ఋషిః, అనుమతిర్దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల విషయ మయ్యుదియే.

అను నో౽ద్యానుమతి ర్యజ్ఞం దేవేషు మన్యతామ్ ।

అగ్నిశ్చ హవ్యవాహనో భవతం దాశుషే మయః. ॥౯॥

అను, నః, అద్య, అనుమతిరిత్యను+మతిః,యజ్ఞమ్, దేవేషు, మన్యతామ్,

అగ్నిః, చ, హవ్యవాహన ఇతి హవ్య+వాహనః, భవతమ్, దాశుషే, మయః॥

పదార్థః—(అను)(నః)అస్మాకమ్(అద్య)ఇదానీమ్(అనుమతిః)అనుకూలం విజ్ఞానమ్(యజ్ఞమ్) సుఖదాన సాధనం వ్యవహారమ్(దేవేషు)విద్వత్సు (మన్యతామ్) (అగ్నిః)పావకవత్తేజస్వీ తజ్జ్ఞో వా (చ) సముచ్చయే (హవ్యవాహనః) యో హవ్యాని గ్రహీతుం యోగ్యాని వస్తూని వహతి ప్రాపయతి(భవతమ్)(దాశుషే)దాత్రే(మయః)సుఖకారిణౌ.మయ ఇతి సుఖ నా..నిఘం.౩.౬॥౯॥
అన్వయః—యో౽నుమతి రద్య దేవేషు నో యజ్ఞ మనుమన్యతాం స హవ్యవాహనో౽గ్నిశ్చ యువాం దాశుషే మయః సుఖకారిణౌ భవతమ్. ॥౯॥ భావార్థః—యే మనుష్యా సత్కర్మానుష్ఠానే౽నుమతిదాతారో దుష్టకర్మానుష్ఠానస్య నిషేధకా స్తే౽గ్న్యాదివిద్యయా సుఖం సర్వేభ్యః ప్రయచ్ఛన్తి. ॥౯॥

పదార్థము—అనుమతిః=అనుకూల విజ్ఞానముగల యే జనుడు, అద్య = నేడు, దేవేషు=విద్వాంసులలో, నః=మాయొక్క,యజ్ఞమ్=సుఖమునకు సాధనరూపమైన వ్యవహారమును, అను మన్యతామ్ = అనుకూలముగ నంగీకరించునో అతడు, చ = మఱియు, హవ్యవాహనః అగ్నిః=గ్రహించదగిన పదార్థములను లభింపజేయు అగ్ని వంటి తేజస్వి లేక అగ్ని విద్యనెఱిగిన విద్వాంసుడు, ఆ మీ యిరువురు, దాశుషే =దాన శీలమానవునికి, మయః=సుఖకారులు, భవతమ్=అగుడు. ॥౯॥

భావార్థము—ఏ మానవులు సత్కర్మానుష్ఠానమున కనుమతి నొసగుదురో, మఱియు దుష్కర్మానుష్ఠానమును నిషేధింతురో వారు అగ్ని మొదలగు విద్యలచే సమస్త ప్రజలకు సుఖము నొసగుదురు. ॥౯॥ 1802

---

1803 సినీవాలీత్యస్య గృత్సమద ఋషిః, సినీవాలీ దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ విదుష్యః కుమార్యః కిం కుర్యు రిత్యాహ.

విదుషీమణులైన కుమారీరత్నము లేమి చేయవలయును ?

సినీవాలి పృథుష్టుకే యా దేవానామసి స్వసా ।

జుషస్వ హవ్య మాహుతం ప్రజాం దేవి దిదిడ్ఢి నః. ॥౧౦॥

సినీవాలి, పృథుష్టుకే, పృథుస్తుక ఇతి పృథు+స్తుకే, యా, దేవానామ్,

అసి, స్వసా, జుషస్వ, హవ్యమ్, ఆహుతమిత్యా+హుతమ్ ప్రజామితి

ప్ర+జామ్, దేవి, దిదిడ్ఢి, నః. ॥౧౦॥

పదార్థః— (సినీవాలి) సినీ ప్రేమబద్ధా చాసౌ బలకారిణీ చ తత్సమ్బుద్ధౌ (పృథుష్టుకే) పృథు ర్విస్తీర్ణా ష్టుకా స్తుతిః కేశభారః కామో వా యస్య తత్సమ్బుద్ధౌ, సువిస్తృతే పృథుకేశభారే పృథుకామే వా (యా) (దేవానామ్) విదుషామ్ (అసి) (స్వసా) భగిని (జుషస్వ) సేవస్వ (హవ్యమ్)ఆదాతుమర్హామ్(ఆహుతమ్) సమన్తాత్ వరదీక్షాదికర్మభిః స్వీకృతం పతిమ్ (ప్రజామ్) సుసన్తానరూపామ్(దేవి)విదుషి (దిదిడ్ఢి) దిశ దేహి.అత్ర దిశ ధాతో ర్బహులం ఛన్దసీతి శ్లుః (నః)అస్మభ్యమ్. ॥౧౦॥ అన్వయః—హే సినీవాలి పృథుష్టుకే! దేవి విదుషి కుమారి! యా త్వం దేవానాం స్వసాఽసి సా హవ్య మాహుతం పతిం జుషస్వ, నః ప్రజాం దిదిడ్ఢి. భావార్థః—హే కుమార్యో! యూయం బ్రహ్మచర్యేణ సమగ్రా విద్యాః ప్రాప్య యువతయో భూత్వా స్వేష్టాన్ స్వపరీక్షితాన్ వర్తు మర్హాన్ పతీన్ స్వయం వృణుత తైః సహానన్ద్య ప్రజా ఉత్పాదయత.

పదార్థము—సినీవాలి=ప్రేమయుక్తురాలై బలమునొసగుదానా!పృథుష్టుకే=విస్తృతస్తుతి, విశాల శిరోజములు, లేక విపుల కామన కలిగియున్నదానా! దేవి=విదుషి కుమారి! యా = ఏ నీవు, దేవానామ్ = విద్వాంసులకు, స్వసా అసి = సోదరివిగాయై ఉన్నావో ఆ నీవు, హవ్యమ్ =గ్రహించదగినవాడు, ఆహుతమ్=బాగుగా వర దీక్షాది కర్మలచే స్వీకరించబడినవాడునగు పతిని, జుషస్వ= సేవించుము. నః=మా నిమిత్తము, ప్రజామ్=సుందరసంతానరూప ప్రజను, దిదిడ్ఢి=ఇమ్ము. ॥౧౦॥

భావార్థము—ఓ కుమారికలారా! మీరు బ్రహ్మచర్యాశ్రమములో సమస్త విద్యలను బడసి యువతులై మీకు అభీష్టమైనవారిని, స్వయముగ పరీక్షించి వరించదగిన పతులను స్వయముగ వరించుడు. ఆ పతులతో నానందించుచు పుత్రాదుల నుత్పన్న మొనర్చుడు. ॥౧౦॥ 1803

---

1804 పఞ్చేత్యస్య గృత్సమద ఋషిః, సరస్వతీ దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

పఞ్చ నద్యః సరస్వతీ మపి యన్తి సస్రోతసః ।
సరస్వతీ తు పఞ్చధా సో దేశేఽ భవత్సరిత్. ॥౧౧॥

పఞ్చ, నద్యః, సరస్వతీమ్, అపి, యన్తి, సస్రోతస ఇతి సస్రోతసః, సరస్వతీ, తు, పఞ్చధా, సా, ఉ ఇత్యూ, దేశే, అభవత్, సరిత్. ॥౧౧॥

పదార్థః—(పఞ్చ) పఞ్చజ్ఞానేన్ద్రియవృత్తయః(నద్యః)నదీవత్ప్రవాహరూపాః (సరస్వతీమ్) ప్రశస్తవిజ్ఞానవతీం వాచమ్(అపి)(యన్తి)ప్రాప్నువన్తి(సస్రోతసః)సమానం మనో రూపం స్రోతః ప్రవాహో యాసా న్తాః(సరస్వతీ)(తు) అవధారణే(పఞ్చధా)పఞ్చజ్ఞానేన్ద్రియశబ్దాదివిషయ ప్రతిపాదనేన పఞ్చప్రకారాః(సా)(ఉ)(దేశే)స్వనివాసే స్థానే(అభవత్)భవతి(సరిత్)యా సరతి గచ్ఛతి సా. ॥౧౧॥ అన్వయః—మనుష్యైః సస్రోతసః పఞ్చ నద్యః యాం సరస్వతీ మపి యన్తి సా ఉ సరిత్ సరస్వతీ దేశే పఞ్చధా త్వభవదితి విజ్ఞేయా. ॥౧౧॥ భావార్థః— అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్యా వాణీ పఞ్చశబ్దాదివిషయాశ్రితా సరిద్వ ర్తతే తాం విజ్ఞాయ.

యథావత్ప్రసార్య మధురా శ్లక్ష్ణా ప్రయోక్తవ్యా. ॥౧౧॥

పదార్థము—సస్రోతసః = ఒకేవిధమైన మనోరూప ప్రవాహముగలవి, నద్యః = నదులవలె ప్రవాహరూపములునగు, పఞ్చ = పంచజ్ఞానేంద్రియముల వృత్తులు, సరస్వతీమ్ = ప్రశస్తజ్ఞానయుక్తమగు నే వాణిని, అపి యన్తి = పొందుచున్నవో, సా ఉ సరిత్ సరస్వతీ = నడచు ఆ వాణియే, దేశే = తన నివాసస్థానమున, పఞ్చధా = పంచజ్ఞానేంద్రియముల శబ్దాదిపంచవిషయములను ప్రతిపాదించుటచే నైదువిధములుగా, తు = మాత్రమే, అభవత్ = అగుచున్నదని మానవులెఱుంగవలయును. ॥౧౧॥

భావార్థము—ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. మానవులు ఏ వాణి శబ్దాదిపంచవిషయముల నాశ్రయించి, నదివంటి ప్రవాహముగలదై యున్నదో అట్టిదానిని దెలిసికొని యథావిధిగా ప్రచారమొనర్చి మృదుమధురవాణిని ప్రయోగించవలయును. ॥౧౧॥

---

1805 త్వమగ్న ఇత్యస్య హిరణ్యస్తూప ఆఙ్గిరస ఋషిః, అగ్నిర్దేవతా, విరాట్ జగతీ ఛన్దః, నిషాదః స్వరః

అథ జనైరీశ్వరాజ్ఞా పాల్యేత్యాహ. మానవులీశ్వరాజ్ఞను పాలించ వలయును.

త్వమగ్నే ప్రథమో అఙ్గిరా ఋషిర్దేవో దేవానామభవః శివః సఖా ।
తవ వ్రతే కవయో విద్మనాపసోఽజాయన్త మరుతో భ్రాజదృష్టయః. ॥౧౨॥

త్వమ్, అగ్నే, ప్రథమః, అఙ్గిరాః, ఋషిః, దేవః, దేవానామ్, అభవః, శివః, సఖా, తవ, వ్రతే, కవయః, విద్మనాపస ఇతి విద్మనా+అపసః, అజాయన్త, మరుతః, భ్రాజదృష్టయ ఇతి భ్రాజత్+ఋష్టయ. ॥౧౨॥

పదార్థః—(త్వమ్)(అగ్నే) పరమేశ్వర విద్వన్ వా (ప్రథమః) ప్రఖ్యాతః (అఙ్గిరాః) అఙ్గానాం రస ఇవ వర్తమానో యద్వాఽఙ్గిభ్యో జీవాత్మభ్యో సుఖం రాతి దదాతి సః (ఋషిః) జ్ఞాతా (దేవః) దివ్యగుణకర్మస్వభావః (దేవానామ్) విదుషామ్ (అభవః) భవేః (శివః) కల్యాణకారీ (సఖా) మిత్రః (తవ) (వ్రతే) శీలే నియమే వా (కవయః) మేధావినః (విద్మనాపసః) విద్మనాని విదితాన్యపాంసి కర్మాణి యేషాం తే (అజాయన్త) జాయన్తే (మరుతః) మనుష్యాః (భ్రాజదృష్టయః) భ్రాజన్త్యః శోభమానా ఋష్టయ ఆయుధాని యేషాన్తే ॥౧౨॥ అన్వయః—హే అగ్నే! యతస్త్వమ్ ప్రథమోఽఙ్గిరా దేవానాం దేవః శివః సఖా ఋషి రభవస్తస్మాత్తవ వ్రతే విద్మనాపసో భ్రాజదృష్టయః కవయో మరుతోఽజాయన్త. ॥౧౨॥ భావార్థః—యది మనుష్యాః సర్వసుహృదం విద్వాంసం సర్వమిత్రం పరమాత్మానఞ్చ సఖాయం మత్వా విజ్ఞాన నిమిత్తాని కర్మాణి కృత్వా ప్రకాశితాత్మానో భవేయుస్తర్హి తే విద్వాంసో భూత్వా పరమేశ్వరస్యాజ్ఞాయాం వర్తితుం శక్నుయుః ॥౧౨॥

పదార్థము—అగ్నే = పరమేశ్వరా! విద్వాంసుడా! త్వమ్ = నీవు, ప్రథమః = ప్రఖ్యాతుడవు, అఙ్గిరాః = అవయవముల యొక్క సారభూతమైన రసమువలె నుండువాడవు, లేక జీవాత్మలకు సుఖమునొసగువాడవు, దేవానామ్ = విద్వాంసులమధ్య,

దేవః=ఉత్తమగుణకర్మస్వభావ యుక్తుడవు,శివః=కల్యాణకరుడవు,సఖా=మిత్రుడవు, ఋషిః=జ్ఞానివి, అభవః=అగుదువు కావున,తవ=నీయొక్క,వ్రతే=స్వభావమునందు. లేక, నియమమునందు, విద్మనాపసః=ప్రసిద్ధకర్మలుగలవారు, భ్రాజదృష్టయః=సుందరములైన ఆయుధములు గలవారు, కవయః=బుద్ధిశాలురునైన,మరుతః=మానవులు, అజాయన్త=పుట్టుచున్నారు. ॥౧౨॥

భావార్థము—మానవులు సమస్తమునకు మిత్రుడు, విద్వాంసుడు,సమస్తమునకు హితమొనగూర్చువాడునగు పరమాత్మను మిత్రునిగ భావించి విజ్ఞానము నిమిత్తము కర్మలొనర్చి ప్రకాశితాత్మలుగల వారగుచో వారు విద్వాంసులై పరమేశ్వరుని ఆజ్ఞయందు ప్రవర్తించగలరు. ॥౧౨॥ 1805

---

1806 త్వన్న ఇత్యస్య హిరణ్యస్తూప ఆఙ్గిరస ఋషిః, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
రాజేశ్వరౌ కథం సేవనీయౌ విత్యాహ. రాజును, ఈశ్వరుని ఎట్లు సేవించవలయును ?

త్వన్నో అగ్నే తవ దేవ పాయుభిర్మఘోనో రక్ష తన్వశ్చ వన్ద్య ।
త్రాతా తోకస్య తనయే గవామస్యనిమేషꣳ రక్షమాణస్తవ వ్రతే. ॥౧౩॥

త్వమ్, నః, అగ్నే, తవ, దేవ, పాయుభిరితి పాయు+భి, మఘోనః, రక్ష, తన్వః, చ, వన్ద్య, త్రాతా, తోకస్య, తనయే, గవామ్, అసి, అనిమేషమిత్యని+మేషమ్, రక్షమాణః, తవ వ్రతే. ॥౧౩॥

పదార్థః—(త్వమ్)(నః) అస్మాకమ్ (అగ్నే) రాజన్నీశ్వర వా (తవ) (దేవ) దివ్యగుణకర్మస్వభావ (పాయుభిః) రక్షాదిభిః (మఘోనః)బహుధనయుక్తాన్ (రక్ష)(తన్వః)శరీరాణి(చ)(వన్ద్య) వన్దితుం స్తోతుం యోగ్య (త్రాతా)రక్షితా(తోకస్య)అపత్యస్య (తనయే)పౌత్రస్య. అత్ర విభక్తివ్యత్యయః (గవామ్)ధేన్వాదీనామ్(అసి) (అనిమేషమ్) నిరన్తరమ్ (రక్షమాణః)(తవ) (వ్రతే) సునియమే. ॥౧౩॥ అన్వయః—హే అగ్నే! దేవ తవ వ్రతే వర్తమానాన్ మఘోనోఽస్మాన్ తవ పాయుభిస్త్వం రక్ష. నస్తన్వశ్చ రక్ష. హేవన్ద్య! యతస్త్వమనిమేషం రక్షమాణస్తోకస్య తనయే గవాఞ్చ త్రాతాసి తస్మాదస్మాభిర్నిత్యం సత్కర్తవ్య ఉపాసనీయ శ్చాసి. ॥౧౩॥
భావార్థః—అత్ర శ్లేషాలంకారః. య ఈశ్వర గుణకర్మస్వభావాజ్ఞానుకూలత్వే వర్తన్తే యేషామీశ్వరో విద్వాంసశ్చ సతతం రక్షకాః సన్తి తే శ్రియా దీర్ఘాయుషా ప్రజాభిశ్చ రహితా కదాచిన్న భవన్తి. ॥౧౩॥

పదార్థము—దేవ = ఉత్తమగుణకర్మ స్వభావయుక్తా! అగ్నే = రాజా! లేక ఈశ్వరా! తవ=నీయొక్క, వ్రతే=ఉత్తమ నియమమునందు వర్తమానులము,మఘోనః=బహుధనయుక్తులమునైన మమ్ము, తవ=నీయొక్క, పాయుభిః=రక్షణాదులకు హేతువులైన కర్మలచే, త్వమ్=నీవు, రక్ష=రక్షించుము, చ=మఱియు, నః= మా యొక్క, తన్వః=శరీరములను రక్షించుము, వన్ద్య=స్తుతించదగిన పరమేశ్వరా! నీవు, అనిమేషమ్=నిరంతరము, రక్షమాణః=రక్షించువాడవు, తోకస్య = సంతానమునకు

తనయే=పౌత్రులకు, గవామ్ = గవాదులకును, త్రాతా = రక్షకుడవునై, అసి = ఉన్నావు. కనుక మేము సర్వదా సత్కరించుటకును, ఉపాసించుటకును యోగ్యుడవై యున్నావు. ॥౧౩॥

భావార్థము—ఈ మంత్రమునందు శ్లేషాలంకారమున్నది. ఏ మానవులు పరమేశ్వరుని యొక్క గుణకర్మ స్వభావములకును, ఆజ్ఞలకును అనుకూలముగ వర్తించుదురో మఱియు నెవరికి ఈశ్వరుడు, విద్వాంసులు నిరంతరము రక్షకులై యుందురో, వారు లక్ష్మీహీనులు, దీర్ఘాయురహితులు, సంతానహీనులు, నెన్నటికి కాజాలరు. ॥౧౩॥

---

1807 ఉత్తానాయామిత్యస్య దేవశ్రవదేవవాతౌ భారతావృషీ, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః

పున ర్విద్వాన్ కిం కుర్యా దిత్యాహ. విద్వాంసు లేమి చేయవలయును ?

ఉత్తానాయా మవ భరా చికిత్వా న్త్సద్యః ప్రవీతా వృషణం జజాన ।
అరుషస్తూపో రుశదస్య పాజ ఇడాయాస్పుత్రో వయునేఽజనిష్ట. ॥౧౪॥

ఉత్తానాయామ్, అవ, భర, చికిత్వాన్, సద్యః, ప్రవీతేతి ప్ర+వీతా, వృషణమ్, జజాన, అరుషస్తూప ఇత్యరుష+స్తూపః, రుశత్, అస్య, పాజః, ఇడాయాః, పుత్రః, వయునే, అజనిష్ట. ॥౧౪॥

పదార్థః—(ఉత్తానాయామ్) ఉత్కృష్టతయా విస్తీర్ణాయాం భూమావన్తరిక్షే వా(అవ) అర్వాచీనే(భర)అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః(చికిత్వాన్)జ్ఞానవాన్(సత్యః)(ప్రవీతా)కమితా (వృషణం) వృష్టికరం యజ్ఞమ్(జజాన) జనయతే. అత్రాన్తర్గతో ణిచ్ ప్రత్యయః (అరుషస్తూపః) యోఽరుషానహింసకాన్ ఉచ్ఛ్రాపయతి సః (రుశత్) సురూపమ్ (అస్య) (పాజః)బలమ్ (ఇడాయాః) ప్రశంసితాయాః (పుత్రః)(వయునే)విజ్ఞానే (అజనిష్ట) జాయతే ॥౧౪॥ అన్వయః—హే విద్వఀస్త్వం యథా చికిత్వాన్ ప్రవీతా విద్వానుత్తానాయాం వృషణ జజానాఽరుశస్తూప ఇడాయాః పుత్రో వయునేఽజనిష్టాఽస్య రుశత్పాజశ్చాఽజనిష్ట తథా సద్యోఽవభర ॥౧౪॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యది మనుష్యా అస్యాం సృష్టౌ బ్రహ్మచర్యాదినా కుమారాన్ కుమారీంశ్చ ద్విజాన్ సమ్పాదయేయుస్తర్హ్యేతే సద్యో విద్వాంసః స్యుః ।౧౪॥

పదార్థము—ఓ విద్వాంసుడా! ఎటుల, చికిత్వాన్ = జ్ఞానవంతుడు, ప్రవీతా = కామించువాడునగు విద్వాంసుడు, ఉత్తానాయామ్=ఉత్కృష్టముగ విస్తరించియున్న భూమియందు లేక అంతరిక్షమున, వృషణమ్ = వర్షమునకు హేతువైన యజ్ఞమును, జజాన=ప్రకటించునో, మఱియు, అరుషస్తూపః=రక్షకుల నున్నతిపఱచువాడు, ఇడాయాః=ప్రశంసిత స్త్రీయొక్క, పుత్రః=పుత్రుడు, వయునే=విజ్ఞానమున, అజనిష్ట=ప్రసిద్ధమగునో, మఱియు, అస్య=దీనియొక్క, రుశత్ =సుందరరూపయుక్తుడు, పాజః =బలము ప్రసిద్ధమునగుచున్నదో, అటులనే నీవు, సద్యః=శీఘ్రముగా, అవ భర=నీ పక్షమును పుష్టపఱచుము. ॥౧౪॥

భావార్థము—ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది. మానవులీ సృష్టియందు బ్రహ్మచర్యాదుల సేవనముతో పుత్రపుత్రికలను ద్విజులుగ నొనర్చుచో వీరందఱు శీఘ్రముగా విద్వాంసులు కాగలుగుదురు. ॥౧౪॥ 1807

---

ఇడాయా ఇత్యస్య దేవశ్రవదేవవాతౌ భారతావృషీ, అగ్నిర్దేవతా, నిరాడనుష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః

కింభూతో జనో రాజ్యాధికారే స్థాపనీయ ఇత్యాహ.

ఎట్టి మానవుడు రాజ్యాధికారమునందు స్థాపించబడుటకు యోగ్యుడు ?

ఇడాయా స్త్వా పదే వయం నాభా పృథివ్యా అధి ।
జాతవేదో ని ధీమహ్యగ్నే హవ్యాయ వోఢవే. ॥౧౫॥

ఇడాయాః, త్వా, పదే, వయమ్, నాభా, పృథివ్యాః, అధి, జాతవేద ఇతి జాత+వేదః, ని, ధీమహి, అగ్నే, హవ్యాయ, వోఢవే. ॥౧౫॥

పదార్థః— (ఇడాయాః) ప్రశంసితాయా వాచః (త్వా) త్వామ్ (పదే) ప్రతిష్ఠాయామ్ (వయమ్) అధ్యాపకోపదేశకాః (నాభా) నాభౌ మధ్యే (పృథివ్యాః) విస్తీర్ణాయా భూమేః (అధి) ఉపరి (జాతవేదః) జాతప్రజ్ఞాన (ని) నితరామ్ (ధీమహి) స్థాపయేమ (అగ్నే) అగ్నిరివ తేజస్విన్ విద్వన్ రాజన్! (హవ్యాయ) హోతుం దాతుమర్హామ్. అత్ర విభక్తివ్యత్యయః (వోఢవే) వోఢుం ప్రాప్తుం ప్రాపయితుం వా ॥౧౫॥ అన్వయః—హే జాతవేదోఽగ్నే! వయమిడాయాః పదే పృథివ్యా అధి నాభా త్వా హవ్యాయ వోఢవే ని ధీమహి ॥౧౫॥ భావార్థః—హే విద్వన్ రాజన్! యస్మిన్నధికారే త్వాం వయం స్థాపయేమ తమధికారం ధర్మపురుషార్థాభ్యాం యథావత్సాధ్నుహి. ॥౧౫॥

పదార్థము—జాతవేదః=ప్రసిద్ధప్రజ్ఞావంతుడా! అగ్నే=అగ్నివలె తేజోవంతా! విద్వాంసా, రాజా ! వయమ్=అధ్యాపకోపదేశకులమైన మేము, ఇడాయాః=ప్రశంసితవాణియొక్క, పదే=వ్యవస్థయందును, పృథివ్యాఽధి=విస్తృతభూమిమీద, నాభా=మధ్యభాగముననుు, త్వా=నిన్ను, హవ్యాయ=ఇవ్వదగిన పదార్థములను, వోఢవే=పొందుటకు లేక లభింపజేయుటకు, ని ధీమహి=నిరంతరము స్థాపించుచున్నాము॥౧౫॥

భావార్థము—విద్వాంసుడవైన రాజా ! ఏ అధికారమునందు నిన్ను మేము స్థాపించుచున్నామో, ఆ యధికారమును నీవు ధర్మముతోను, పురుషార్థముతోను, యథావిధిగా నెఱవేర్పుము. ॥౧౫॥ 1808

---

1809 ప్రమన్మహే ఇత్యస్య నోధా ఋషిః, ఇన్ద్రో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యై ర్విద్యాధర్మౌ వర్ధనీయా విత్యాహ.

మానవులు విద్యను, ధర్మమును పెంపొదజేయవలయును ?

ప్ర మన్మహే శవసానాయ శూష మాఙ్గూషం గిర్వణసే అఙ్గిరస్వత్ । సువృక్తిభిః

స్తువత ఋగ్మియా యార్చా మార్కం నరే విశ్రుతాయ. ॥౧౬॥

ప్ర, మన్మహే, శవసానాయ,శూషమ్, ఆఙ్గూషమ్,గిర్వణసే, అఙ్గిర

స్వత్, సువృక్తిభిరితి సువృక్తి+భిః, స్తువతే, ఋగ్మియాయ, అర్చామ, అర్కమ్,

నరే, విశ్రుతాయేతి వి+శ్రుతాయ. ॥౧౬॥

పదార్థః—(ప్ర) (మన్మహే)యాచామహే. మన్మహ ఇతి యాచ్ఞా కర్మా నిఘం ౩. ౧౯. (శవసానాయ)విజ్ఞానాయ (శూషమ్)బలమ్(ఆఙ్గూషమ్) విద్యాశాస్త్రబోధమ్.ఆఙ్గూష ఇతి పద నామ. నిఘం. ౪. ౨. (గిర్వణసే)గిరః సుశిక్షితా వాచో వనన్తి సంభజన్తి వా తస్మై (అఙ్గిర స్వత్) ప్రాణవత్ (సువృక్తిభిః) సుష్ఠు వృజతే దోషాన్ యాసు క్రియాసు తాభిః (స్తువతే) యః శాస్త్రార్థాన్ స్తౌతి (ఋగ్మియాయ)యోఋచో మినోత్యధితే తస్మై (అర్చామ) సత్కుర్యామ (అర్కమ్)అర్చనీయమ్(నరే)నాయకాయ(విశ్రుతాయ) విశేషణ శ్రుతా గుణా యస్మిం స్తస్మై

అన్వయః—హే మనుష్యా ! యథా వయం సువృక్తిభిః శవసానాయ గిర్వణసే ఋగ్మియాయ విశ్రుతాయ స్తువతే నరేఽఙ్గిరస్వదాఙ్గూషం శూషం ప్రమన్మహే ఏతమర్కమర్చామ తథైతం ప్రతి యూయమపి ప్రర్తధ్వమ్ ॥౧౬॥ భావార్థః—అత్రోపమా వాచక లుప్తోపమాలంకారా. మనుష్యైః సత్కరణీయస్య సత్కారం నిరాదరణీయస్య నిరాదరం కృత్వా విద్యాధర్మౌ సతతం వర్ధనీయౌ. ॥౧౬॥

పదార్థము—మానవులారా! మే మెట్లు,సువృక్తిభిః= నిర్దుష్టములైన క్రియలతో, శవసానాయ=విజ్ఞానము నిమిత్తము, గిర్వణసే=సుశిక్షితవాక్కులతో కూడినవాడు, ఋగ్మియాయ=ఋక్కులను పఠించువాడు, విశ్రుతాయ = విశిష్టగుణములు గలవా డని చెప్పబడువాడు, స్తువతే=శాస్త్రాశయములను బోధించువాడు,నరే=నాయకుడు నగు మానవునికై, అఙ్గిరస్వత్ =ప్రాణమువలె, ఆఙ్గూషమ్=విద్యా శాస్త్రముల బోధ అను, శూషమ్=బలమును, ప్ర మన్మహే=కోరుచున్నామో, మఱియు, అర్కమ్= ఈ పూజనీయపురుషుని, అర్చామ= సత్కరించెదమో, అటులనే ఈ విద్వాంసులపట్ల మీరును ప్రవర్తించుడు. ॥౧౬॥

భావార్థము—ఈ మంత్రమందుపమా వాచక లుప్తోపమాలంకారములున్నవి. మానవులు సత్కరించదగినవారిని సత్కరించి, నిరాదరించదగినవారిని నిరాదరించి, విద్యను, ధర్మమును, నిరంతరము అభివృద్ధిపఱచు చుండవలయును. ॥౧౬॥ 1809

---

1810 ప్ర వ ఇత్యస్య నోధా ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ కే పితరః సన్తీత్యాహ. ఎవరు పితరులు ?

ప్ర వో మహే మహి నమో భరధ్వ మాఙ్గూష్యꣳ శవసానాయ సామ ।

యేనా నః పూర్వే పితరః పదజ్ఞా అర్చన్తో అఙ్గిరసో గా అవిన్దన్. ॥౧౭॥

ప్ర, వః, మహే, మహి, నమః, భరధ్వమ్, ఆఙ్గూష్యమ్, శవసానాయ,

సామ, యేన, నః, పూర్వే, పితరః, పదజ్ఞా ఇతి పద+జ్ఞాః, అర్చన్తః, అఙ్గిరసః, గాః, అవిన్దన్. ॥౧౭॥

పదార్థః—(ప్ర)(వః) యుష్మభ్యమ్ (మహే)మహతే(మహి) మహత్సత్కారార్థమ్ (నమః) సత్కర్మాన్నం వా(భరధ్వమ్)భరత (ఆఙ్గూషమ్)ఆఙ్గూషాయ సత్కారాయ బలాయ వా హితమ్ (శవసానాయ) బ్రహ్మచర్యసుశిక్షాభ్యాం శరీరాత్మబలయుక్తాయ (సామ) సామవేదమ్ (యేన)అత్ర సంహితాయా మితి దీర్ఘః (నః)అస్మాకమస్మాన్ వా (పూర్వే)పూర్వజాః (పితరః) పాలకా జ్ఞానినః (పదజ్ఞాః)యే పదం జ్ఞాతవ్యం ప్రాపణీయమాత్మస్వరూపం జానన్తి తే (అర్చన్తః)సత్క్రియాం కుర్వన్తః(అఙ్గిరసః)సర్వస్యాః సృష్టే ర్విద్యాఙ్గవిదః (గాః) సుశిక్షితా వాచః (అవిన్దన్) లమ్భయేరన్ ॥౧౭॥ అన్వయః—హే మనుష్యా! యథా పదజ్ఞా నోఽస్మానర్చన్తోఽఙ్గిరసః పూర్వే నః పితరో యేన మహే శవసానాయ వశ్చాఽఽఙ్గూష్యం సామగాశ్చావిన్దన్ తేన తేభ్యో యూయం మహి నమః ప్రభరధ్వమ్ ॥౧౭॥ భావార్థః—అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా! యే విద్వాంసో యుష్మాన్ విద్యాసుశిక్షాభ్యాం విపశ్చితో ధార్మికాన్ కుర్యుస్తానేవ పూర్వాఽధీతవిద్యాన్ పితౄన్ విజానీత. ॥౧౭॥

పదార్థము—మానవులారా! ఎటుల, పదజ్ఞాః=తెలిసికొనదగిన లేక పొందదగిన ఆత్మస్వరూపము నెఱిగినవారు, నః=మమ్ము, అర్చన్తః=సత్కరించువారు, అఙ్గిరసః =సృష్టివిద్యయొక్క సమస్త అవయవముల నెఱుగువారు, పూర్వే = మొట్టమొదటి వారు, పితరః=రక్షకులు, జ్ఞానులునైనవారు, యేన=ఎందువలన, మహే = గొప్ప వాడు,శవసానాయ=బ్రహ్మచర్యముచే,ఉత్తమశిక్షచే శరీరాత్మ బలములుగలవాడునగు వానికొఱకును,వః=మీనిమిత్తమును, ఆఙ్గూష్యమ్=సత్కారములేక బలముకొఱకు ఉపయోగించు, సామ=సామవేదమును మఱియు, గాః=సుశిక్షితవాక్కులను. అవిన్దమ్ =లభింపచేయుదురో,అందువలననే వారికి మీరు,మహి=గొప్పసత్కారమునిమిత్తము; నమః=ఉత్తమకర్మను, లేక అన్నమును, ప్రభరధ్వమ్=ధరించుడు. ॥౧౭॥

భావార్థము—ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. మానవులారా! ఏ విద్వాంసులు మిమ్ము విద్యచేతను, ఉత్తమశిక్షణచేతను, పండితులుగను, ధర్మాత్ములుగను చేయుదురో, అట్టి ప్రథమపండితులనే మీరు పితరులుగ నెఱుంగుడు.

---

1811 ఇచ్ఛన్తీత్యస్య దేవశ్రవా దేవవాతశ్చ భారతావృషీ ఇన్ద్రో దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథాప్త లక్షణ మాహ. ఆప్తుని లక్షణము ?

ఇచ్ఛన్తి త్వా సోమ్యాసః సఖాయః సున్వన్తి సోమం దధతి ప్రయాంసి ।
తితిక్షన్తే అభిశస్తిం జనానా మిన్ద్ర త్వదా కశ్చన హి ప్రకేతః. ॥౧౮॥

ఇచ్ఛన్తి, త్వా, సోమ్యాసః, సఖాయః సున్వన్తి, సోమమ్, దధతి, ప్ర

యాంసి, తితిక్షన్తే, అభిశస్తి మిత్యభి+శస్తిమ్, జనానామ్, ఇన్ద్ర, త్వత్, ఆ, కః, చన, హి, ప్రకేత ఇతి ప్ర+కేతః. ॥౧౮॥

పదార్థః—(ఇచ్ఛన్తి)(త్వా)త్వామ్(సోమ్యాసః)సోమేష్వైశ్వర్యాదిషు సాధవః(సఖాయః) సుహృదః సన్తః (సున్వన్తి)నిష్పాదయన్తి(సోమమ్) ఐశ్వర్యాదికమ్ (దధతి)ధరన్తి (ప్రయాంసి) కమనీయాని విజ్ఞానాదీని (తితిక్షన్తే)సహన్తే(అభిశస్తిమ్)దుర్వచనవాదమ్ (జనానామ్)మనుష్యాణామ్(ఇన్ద్ర)రాజన్! (త్వత్)తవ సకాశాత్ (ఆ) సమన్తాత్ (కః)(చన)అపి(హి)యతః (ప్రకేతః) ప్రకృష్టా కేతా ప్రజ్ఞా యస్య సః ॥౧౮॥ అన్వయః—హే ఇన్ద్ర! యే సోమ్యాసః సఖాయః సోమం సున్వన్తి ప్రయాంసి దధతి,జనానామభిశస్తిమా తితిక్షన్తే చ తాం స్త్వం సతతం సత్కృరు హి యతస్త్వత్ప్రకేతః కశ్చన నాస్తి తస్మాత్సర్వే త్వా త్వామిచ్ఛన్తి ॥౧౮॥ భావార్థః—హే మనుష్యా! ఇహ నిన్దాస్తుతిహానిలాభాదీన్ తితిక్షవః పురుషార్థినః సర్వైః సహ మైత్రీమాచరన్త ఆప్తాః స్యుస్తే సర్వైః సేవనీయాః సత్కర్తవ్యాశ్చ త ఏవ సర్వేషామధ్యాపకాఉపదేష్టారశ్చస్యుః

పదార్థము—ఇన్ద్ర=సభాధ్యక్షుడవైన రాజా! ఎవరు, సోమ్యాసః = ఐశ్వర్యము పొందుటలో నారితేరినవారు, సఖాయః = మిత్రులునై, సోమమ్ = ఐశ్వర్యాదులను, సున్వన్తి=సాధించుచున్నారో, ప్రయాంసి=కోరదగిన విజ్ఞానాది గుణములను, దధతి =ధరించుచున్నారో, మఱియు, జనానామ్=మానవులయొక్క, అభిశస్తిమ్= దుర్వచనములను, వాదవివాదములను, ఆ తితిక్షన్తే = బాగుగా సహించుచున్నారో, అట్టి వారిని నీవు నిరంతరము సత్కరించుచుండుము. త్వత్=నీకంటె, ప్రకేతః = ఉత్తమ బుద్ధిమంతుడు, కః చన=ఎవరును లేడు,హి = కనుక, త్వా = నిన్ను సమస్తప్రజలు, ఇచ్ఛన్తి=కోరుచున్నారు. ॥౧౮॥

భావార్థము—ఏ మానవు లీ లోకమున నిందాస్తుతులను, హాని లాభాదులను సహించు పురుషార్థులై, సర్వభూతములపట్ల మిత్రునివలె మెలగుచు నాప్తులగుదురో వారందఱికి సేవనీయులు, సత్కరించదగినవారు నగుచున్నారు. మఱియు నట్టివారే యందఱికి అధ్యాపకులు, ఉపదేశకులు కావలయును. ॥౧౮॥ 1811

---

1812 న త ఇత్యస్య దేవశ్రవా దేవవాతశ్చ భారతావృషీ, ఇన్ద్రో దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునః సభాధ్యక్షః కిం కుర్యా దిత్యాహ. సభాధ్యక్షుడైన రాజు ఏమి చేయ వలయును?

న తే దూరే పరమా చిద్రజాంస్యా తు ప్ర యాహి హరివో హరిభ్యామ్ ।
స్థిరాయ వృష్ణే సవనా కృతేమా యుక్తా గ్రావాణః సమిధానే అగ్నౌ ॥౧౯॥

న, తే, దూరే, పరమా, చిత్, రజాంసి, ఆ, తు, ప్ర, యాహి, హరివ ఇతి హరి+వః, హరిభ్యామితి హరి+భ్యామ్, స్థిరాయ, వృష్ణే, సవనా, కృతా, ఇమా, యుక్తాః, గ్రావాణః, సమిధాన ఇతి సమ్+ఇధానే, అగ్నౌ. ॥౧౯॥

పదార్థః—(న)నిషేధే (తే)తవ సకాశాత్(దూరే) విప్రకృష్టే (పరమా) పరమాణి దూర స్థాని (చిత్)అపి (రజాంసి) స్థానాని(ఆ) (తు) హేతౌ (ప్ర) (యాహి)గచ్ఛ (హరివః) ప్రశస్తౌ హరీ విద్యేతే యస్య తత్సమ్బుద్ధౌ (హరిభ్యామ్)ధారణాకర్షణవేగగుణైర్యుక్తాభ్యాం తురఙ్గాభ్యాం జలాఽగ్నిభ్యాం వా (స్థిరాయ) (వృష్ణే) సుఖసేచకాయ పదార్థాయ (సవనా) ప్రాతః సవనాదీని కర్మాణి(కృతా)కృతాని (ఇమా) ఇమాని (యుక్తాః) పరీభూతాః (గ్రావాణః)గర్జనా కర్తారో మేఘాః. గ్రావేతి మేఘ నా.—నిఘం. ౧. ౧౦.(సమిధానే)సమిధ్యమానే, అత్ర యకో లుక్ (అగ్నౌ) ॥౧౯॥ అన్వయః—హే హరివో రాజన్! యథా సమిధానేఽగ్నౌ ఇమా సవనా కృతా తు గ్రావాణో యుక్తా భూత్వాఽఽగచ్ఛన్తి తథా స్థిరాయ వృష్ణే హరిభ్యామా ప్రయాహి ఏవం కృతే పరమా చిద్రజాంసి తే దూరే న భవన్తి ॥౧౯॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే విద్వాంసో! యథా పావకేనోత్పాదితా వర్షితా మేఘాః పృథివ్యాః సమీపే భవన్త్యాకర్షణేన దూరమపి గచ్ఛన్తి, తథాఽగ్న్యాదియానైర్గమనే కృతే కోపి దేశో దూరే న భవతి. ఏవం పురుషార్థం కృత్వాఽలమైశ్వర్యాణి జనయత ॥౧౯॥

పదార్థము—హరివః=ప్రశస్తమైన గుఱ్ఱములుగల రాజా! ఎటుల, సమిధానే= ప్రదీప్తపఱచబడిన, అగ్నౌ=అగ్నియందు, ఇమాః సవనాః=ఈ ప్రాతఃసవనాదియజ్ఞ కర్మలు,కృతాతు=చేయబడుచునుండుటచే,గ్రావాణః=గర్జించు మేఘములు, యుక్తాః =గుంపులుగాకలిసి వచ్చుచున్నవో,అటులనే,స్థిరాయ=ద్వఢము,వృష్ణే =సుఖదాయకమునైన విద్యాదిపదార్థముకొఱకు, హరిభ్యామ్ = ధారణాకర్షణ వేగ గుణములతో కూడిన గుఱ్ఱములతో, లేక అగ్ని జలములతో, ఆ ప్ర యాహి = బాగుగారమ్ము ఇట్లు చేయుటవలన, పరమా = దూరస్థములైన,రజాంసి చిత్=స్థానములుకూడ,తే=నీకు దూరే=దూరము, న=కావు. ॥౧౯॥

భావార్థము—ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది.ఓ విద్వాంసులారా! ఎటు లగ్నివలన నుత్పన్నమొనర్చబడిన వర్షపు మేఘములు భూమిని సమీపించునో, ఆకర్షణచే దూరముకూడ వెళ్లునో,అటులనే అగ్నిచే సిద్ధములైన యానములతో ప్రయాణమొనర్చుచో నేదేశము దూరముకాదు. ఈ విధముగా పురుషార్థమొనర్చి సంపూర్ణైశ్వర్యముల నుత్పత్తి యొనర్చుడు. ॥౧౯॥ 1812

---

1813 అషాఢ మిత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ రాజ ధర్మ విషయ మాహ.రాజధర్మ విషయము చెప్పెను.

అషాఢం యుత్సు పృతనాసు పప్రిం స్వర్షా మప్సాం వృజనస్య గోపామ్ ।
భరేషుజాం సుక్షితిం సుశ్రవసం జయన్తం త్వా మను మదేమ సోమ. ॥౨౦॥

అషాఢమ్, యుత్స్వితి యుత్+సు, పృతనాసు, పప్రిమ్, స్వర్షామ్, స్వః సామితి స్వః+సామ్, అప్సామ్, వృజనస్య, గోపామ్, భరేషు జామితి భరేషు +జామ్, సుక్షితిమితి సు+క్షితిమ్, సుశ్రవసమితి సు+శ్రవసమ్, జయన్తమ్,

త్వామ్, అను, మదేమ, సోమ. ॥౨౦॥

పదార్థః—(అషాఢమ్)సోఢుమ[న]ర్హమ్(యుత్సు)యుద్ధేషు (పృతనాసు)మనుష్యసేనాసు (పప్రిమ్)పూర్ణబలవిద్యం పాలకం వా(స్వర్షామ్) యః స్వః సుఖం సనతి సమ్భజతి తమ్ (అప్సామ్) యోఽపో జలాని ప్రాణాన్ సనోతి దదాతి తమ్(వృజనస్య)బలస్య (గోపామ్)రక్షకమ్ (భరేషుజామ్)భరేషు భరణీయేషు సఙ్గ్రామేషు జేతారమ్ (సుక్షితిమ్) శోభనా క్షితిః పృథివీరాజ్యం యస్య తమ్. క్షితిరితి పృథివీ నా...నిఘం. ౧. ౧. (సుశ్రవసమ్) శోభనాని శ్రవాంస్యన్నాని యశాంసి వా యస్య తమ్ (జయన్తమ్) శత్రూణాం విజేతారమ్ (త్వామ్) (అను) పశ్చాత్ (మదేమ) (సోమ) సకలైశ్వర్యసమ్పన్న! ॥౨౦॥ అన్వయః—హే సోమ రాజన్ సేనాపతే! వా వయం యం యుత్స్వషాఢం పృతనాసు పప్రిం స్వర్షామప్సాం వృజనస్య గోపాం భరేషుజాం సుక్షితిం సుశ్రవసం జయన్తం త్వా మను మదేమ ॥౨౦॥ భావార్థః—యస్య రాజ్ఞః సేనాపతే ర్వో త్తమస్వభావేన రాజసేనాః ప్రజాజనాః ప్రీతాః స్యు ర్యేషు ప్రీతేషు రాజా ప్రీతః స్యాత్తత్ర ధ్రువో విజయో నిశ్చలం పరమైశ్వర్యం పుష్కలా ప్రతిష్ఠా చ భవతి. ॥౨౦॥

పదార్థము—సోమ = సకలైశ్వర్యములతోగూడిన రాజా! లేక సేనాపతీ! మేము, యుత్సు = యుద్ధములందు, అషాఢమ్ = అసహ్యుడవు, పృతనాసు = మానవుని సేనలలో, పప్రిమ్ = పూర్ణబలవిద్యాయుక్తుడవు లేక రక్షకుడవు, స్వర్షామ్ = సుఖమును సేవించువాడవు, అప్సామ్ = జలములను లేక ప్రాణముల నొసగువాడవు, వృజనస్య = బలము యొక్క, గోపామ్ = రక్షకుడవు, భరేషుజామ్ = ధరించదగిన సంగ్రామములందు జయించువాడవు, సుక్షితమ్ = సుందరభూరాజ్యముగలవాడవు, సుశ్రవసమ్ = సుందరమైనఅన్నము, లేక కీర్తిగలవాడవు, జయన్తమ్ = శత్రువులను జయించువాడవునగు, త్వామ్ = నిన్ను, అను మదేమ = అనుమోదించెదముగాక! ॥౨౦॥

భావార్థము—ఏ రాజుయొక్క లేక సేనాపతియొక్క ఉత్తమ స్వభావముచే రాజపురుషులు, సేనలు, ప్రజలు, ప్రసన్నులుగ నుందురో, మఱియు వేని ప్రసన్నతలో రాజు ప్రసన్నుడుగ నుండునో, అచట దృఢమైన విజయము, నిశ్చలమైన ఉత్తమైశ్వర్యము, మంచి ప్రతిష్ఠయు నుండును. ॥౨౦॥ 1813

---

1814 సోమ ఇత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, భురిక్ పఙ్క్తిశ్ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

సోమో ధేనుꣳ సోమో అర్వన్త మాశుꣳ సోమో వీరం కర్మణ్యం దదాతి ।
సాదన్యం విదథ్యꣳ సభేయం పితృశ్రవణం యో దదాశ దస్మై. ॥౨౧॥

సోమః, ధేనుమ్, సోమః, అర్వన్తమ్, ఆశుమ్, సోమః వీరమ్, కర్మణ్యమ్, దదాతి, సాదన్యమ్, సదన్యమితి సదన్యమ్, విదథ్యమ్, సభేయమ్, పితృశ్రవణ మితి పితృ+శ్రవణమ్, యః, దదాశత్, అస్మై. ॥౨౧॥

పదార్థః—(సోమః)ఐశ్వర్యవాన్ (ధేనుమ్) విద్యాధారాం వాచమ్ (సోమః) సత్యాచారే ప్రేరకః(అర్వన్తమ్) వేగేన గచ్ఛన్తమశ్వమ్ (ఆశుమ్) మార్గాన్ సద్యోఽశ్నువన్తమ్(సోమః)శరీరాత్మబలమ్(వీరమ్)శత్రుబలాని వ్యాప్నువన్తమ్(కర్మణ్యమ్)కర్మణా సమ్పన్నమ్(దదాతి) (సాదన్యమ్) సాదనేషు స్థాపనేషు సాధుం (విదథ్యమ్) విదథే యజ్ఞే సాధుమ్ (సభేయమ్) సభాయాం సాధుమ్(పితృశ్రవణమ్)పితుః సకాశాచ్ఛ్రవణం యస్య తమ్ (యః) (దదాశత్) దదాతి (అస్మై) సోమాయ రాజ్ఞేఽధ్యాపకాయోపదేశకాయ వా. ॥౨౧॥ అన్వయః—యో మనుష్యోఽస్మై సోమాయోచితం దదాశత్తస్మై సోమో ధేనుం దదాతి సోమోఽర్వన్తమాశు దదాతి సోమః కర్మణ్యం సాదన్యం విదథ్యం పితృశ్రవణం సభేయం వీరం చ దదాతి. ॥౨౧॥ భావార్థః—యేఽధ్యాపకోపదేశకా! రాజపురుషా! వా సుశిక్షితాం వాచమగ్న్యాదితత్త్వవిద్యాం పురుషజ్ఞానం సభ్యతాఞ్చ సర్వేభ్యః ప్రదద్యుస్తే సర్వైః సత్కర్తవ్యాః స్యుః. ॥౨౧॥

పదార్థము—ఏ మానవుడు, అస్మై=ధర్మాత్ముడైన ఈ రాజునకు ఈ అధ్యాపకునకు, లేక ఈ ఉపదేశకునకు ఉచితపదార్థములను, దదాశత్ = ఇచ్చుచున్నాడో అతనికి, సోమః=ఐశ్వర్యవంతుడైన ఉపర్యుక్త పురుషుడు, ధేనుమ్= విద్యాధారమగు వాక్కును, దదాతి=ఇచ్చుచున్నాడు, సోమః = సత్యాచరణమునందు ప్రేరేపించు రాజు, అర్వన్తమ్=వేగముగా నడుచునది, ఆశుమ్ = మార్గమును శీఘ్రముగా దాటి పోవునదియునగు గుఱ్ఱము నిచ్చుచున్నాడు. మఱియు,సోమః = శరీరాత్మబలయుక్త రాజు, కర్మణ్యమ్ = కర్మవీరుడైన పురుషార్థిని, సాదన్యమ్ = స్థాపనావ్యవస్థయందు ప్రవీణుడైనవానిని, విదథ్యమ్ = యజ్ఞకార్య కుశలుని, పితృశ్రవణమ్ = ఆచార్యుని నుండి పితరునినుండి విద్యనభ్యసించువానిని, సభేయమ్ = సభయందు కూర్చొనదగిన వానిని,వీరమ్=శత్రువుల బలములందు వ్యాప్తుడగు శూరవీరపురుషుని ఇచ్చుచున్నాడు.

భావార్థము—ఏ అధ్యాపకుడు, ఏ ఉపదేశకుడు, ఏ రాజపురుషుడు సుశిక్షిత వాక్కును, అగ్ని మొదలగువాని తత్త్వవిద్యను, పురుషజ్ఞానమును, సభ్యతను, సమస్త ప్రజలకొసగుదురో, వారు సకల ప్రజలకు సత్కరించ యోగ్యులగుదురు. ॥౨౧॥1814

---

1815 త్వమిత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

త్వమిమా ఓషధీః సోమ విశ్వాస్త్వమపో అజనయస్త్వం గాః ।
త్వమా తతన్థోర్వన్తరిక్షం త్వం జ్యోతిషా వి తమో వవర్థ. ॥౨౨॥

త్వమ్, ఇమాః, ఓషధీః, సోమ, విశ్వాః, త్వమ్, అపః, అజనయః, త్వమ్, గాః, త్వమ్, ఆ, తతన్థ, ఉరు, అన్తరిక్షమ్, త్వమ్, జ్యోతిషా, వి, తమః. వవర్థ. ॥౨౨॥

పదార్థః—(త్వమ్) (ఇమాః) (ఓషధీః)సోమాద్యాః (సోమ) సోమవల్లీవ సర్వరోగవినాశక! (విశ్వాః)సర్వాః(త్వమ్)(అపః)జలాని కర్మ వా(అజనయః)జనయేః(త్వమ్)(గాః)పృథివీర్ధేనూః వా

(త్వమ్)(ఆ)(తతన్థ)తనోషి(ఉరు)బహు(అన్తరిక్షమ్)జలమాకాశం వా(త్వమ్)(జ్యోతిషా)ప్రకాశేన (వి) (తమః)అన్ధకారం రాత్రిమ్ (వవర్థ) వృణోషి. ॥౨౨॥ అన్వయః—హే సోమ రాజన్! య స్త్వం విశ్వా ఇమా ఓషధీ స్త్వం సూర్యఇవాఽప స్త్వం గాశ్చాఽజనయ స్త్వం సూర్య ఉర్వ న్త రిక్షమా తతన్థ సవితా జ్యోతిషా తమ ఇవ న్యాయేనాఽన్యాయం వివవర్థ, స త్వమస్మాభిర్మాన నీయోఽసి. ॥౨౨॥ భావార్థః—యే జనా ఓషధ్యో రోగానివ దుఃఖాని హర న్తి ప్రాణా ఇవ బలం జనయ న్తి యే రాజజనాః సూర్యో రాత్రిమివాఽధర్మాఽవిద్యాఽన్ధకారం నివ ర్త య న్తి తే జగత్పూజ్యాః కుతో న స్యుః. ॥౨౨॥

పదార్థము—సోమ = ఉత్తమ సోమలత ఓషధులవలె రోగనాశకుడవగునో రాజా! త్వమ్ = ఏ నీవు. ఇమాః విశ్వాః ఓషధీః = ఈ సకల సోమలతాది ఓషధులను, త్వమ్ = నీవు సూర్యునివలె, అపః = జలములను, లేక కర్మను, మఱియు, త్వమ్ = నీవు, గావః = పృథి విని. లేక గోవులను, అజనయః = ఉత్పన్న మొనర్చుదువో, లేక ప్రకటించుదువో, త్వమ్ = [ఏ]నీవు సూర్యునివలె, ఉరు = గొప్పఅవకాశమును ఆ తతన్థ = విస్తృతపఱచు చున్నావో, త్వమ్ = [ఏ]నీవు సూర్యుడు, జ్యోతిషా = ప్రకాశముచే, తమః = అంధకా రమును రూపుమాపుచున్నటుల న్యాయముచే నన్యాయమును, వివర్థ = ఆచ్ఛాదిత మొనర్చుదువో లేక నివృత్తపఱచుదువో ఆ నీవు మాకు మాననీయుడవై యున్నావు.

భావార్థము—ఓషధులెటుల రోగములను హరించునో అటులనే ఏ మానవులు దుఃఖములను దూర మొనర్చుచున్నారో, ప్రాణములవలె బలములను ప్రకటపఱచు చున్నారో, ఏ రాజపురుషులు, సూర్యుడు రాత్రిని రూపుమాపుచున్నటుల అధర్మ మును, అవిద్యాంధకారమును నివృత్తపఱచుదురో, వారు జగత్పూజ్యులెందులకు కారు?

---

1816 దేవేనేత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల విషయ మయ్యదియే.

దేవేన నో మనసా దేవ సోమ రాయో భాగꣳ సహసా వన్నభి యుధ్య ।
మా త్వా తనదీశిషే వీర్యస్యోభయేభ్యః ప్ర చికిత్స గవిష్టౌ. ॥౨౩॥

దేవేన, నః, మనసా, దేవ, సోమ, రాయః, భాగమ్, సహసావన్నితి సహసా+వన్, అభి, యుధ్య, మా, త్వా, ఆ, తనత్, ఈశిషే, వీర్యస్య, ఉభయేభ్యః, ప్ర, చికిత్స, గవిష్టావితి గో+ఇష్టౌ. ॥౨౩॥

పదార్థః—(దేవేన)దివ్యగుణకర్మస్వభావయుక్తేన(నః) అస్మభ్యమ్(మనసా)(దేవ) దివ్యగుణ సమ్పన్న(సోమ)అఖిలైశ్వర్యప్రాపక! (రాయః)ధనస్య(భాగమ్) సేవనీయమంశమ్ (సహసావన్) సహోఽధికం బలం విద్యతే యస్య తత్సమ్బుద్ధౌ, అత్ర ప్రథమార్థే తృతీయాయా అలుక్(అభి) (ఆభిముఖ్యే) (యుధ్య)యోధయ గమయ. అత్ర అన్తర్భావితణ్యర్థః యుధ్యతి ర్గతికర్మా నిఘం. ౨. ౧౪.(మా)నిషేధే(త్వా)త్వామ్(ఆ)(తనత్) నఞ్చేత్ అత్రోపసర్గాచ్ఛాన్దసైర్ఘ్య ఇత్యాద్యవ్యక్ష్ణ షియ పాతా త్తనుథాతోః స్వగణే లేట్ప్రయోగః సమర్థో భవతి(వీర్యస్య) వీరకర్మణః. అత్రాధీ

గర్ధదయేశాం కర్మణి ౨.౩.౫౨. ఇతి కర్మణి షష్ఠీ (ఉభయేభ్యః) ఐహికపారమార్థికసుఖేభ్యః (ప్ర) (చికిత్స) రోగనివారణాయేవ విఘ్ననివారణోపాయం కురు. అత్ర సంహితాయామితి దీర్ఘః (గవిష్టౌ)గోః స్వర్గస్య సుఖవిశేషస్యేష్టావిచ్ఛాయాం సత్యామ్. ॥౨౩॥ అన్వయః—హే సహసావన్త్సోమ! దేవ! రాజన్! యస్త్వం దేవేన మనసా రాయో భాగం నోఽభియుధ్య యత స్త్వం వీర్య స్యేశిషే త్వా కశ్చిన్నా ఆతనత్ స త్వం గవిష్టావుభయేభ్యః ప్రచికిత్స. ॥౨౩॥ భావార్థః—రాజాదివిద్వద్భిః కపటాదిదోషాన్ విహాయ శుద్ధేన భావేన సర్వేభ్యః సుఖమభిలష్య వీర్యం వర్ధనీయం యేన దుఃఖనివృత్తిః సుఖవృద్ధి రిహాముత్ర చ స్యాత్తత్ర సతతం ప్రయతితవ్యమ్. ॥౨౩॥

పదార్థము—సహసావన్ = అధికతర సేనాబలము గలవాడా, సోమ = సంపూర్ణైశ్వర్యప్రాపకా! దేవ = దివ్యగుణయుక్తా! ఓ రాజా! నీవు, దేవేన = ఉత్తమగుణ కర్మ స్వభావయుక్తమైన, మనసా = మనస్సుతో, రాయః = ధనముయొక్క, భాగమ్ = అంశమును, నః = మానిమిత్తము, అభి యుధ్య = సర్వవిధముల అన్నివైపులనుండి లభింపజేయుము. నీవు, వీర్యస్య = వీరకార్య మొనర్చుటకు, ఈశిషే = సమర్థవంతుడవగుచున్నావు కావున, త్వా = నిన్ను ఎవరు, మా ఆ తనత్ = అణగద్రొక్కజాలరు అట్టినీవు, గవిష్టౌ = సుఖవిశేషేచ్ఛ కలిగినప్పుడు, ఉభయేభ్యః = ఇహపరలోకములయొక్క సుఖముకొఱకు, ప్ర చికిత్స = రోగనివారణమువలె విఘ్ననివృత్తికి ఉపాయము లొనర్చుచుండుము. ॥౨౩॥

భావార్థము—రాజాది విద్వాంసులు, కపటాది దోషములను త్యజించి, పరిశుద్ధ భావముతో సమస్త ప్రజలకు సుఖమును వాంఛించి, పరాక్రమమును పెంపొందజేయవలయును. ఏ కర్మవలన దుఃఖనివృత్తియు సుఖవృద్ధియు నిహపరలోకములందు కలుగునో, అట్టి కర్మలొనర్చుటకు నిరంతరము ప్రయత్నము చేయుచుండవలయును ॥౨౩॥

---

అష్టావిత్యస్యాఽఽఙ్గిరసో హిరణ్యస్తూప ఋషిః, సవితా దేవతా, భురిక్ పఙ్క్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

అథ సూర్యః కిం కరోతీత్యాహ. సూర్యుడేమి చేయుచున్నాడు ?

అ॒ష్టౌ వ్య॑ఖ్యత్క॒కుభః॑ పృథి॒వ్యాస్త్రీ ధన్వ॒ యోజ॑నా స॒ప్త సిన్ధూ॑న్ ।
హి॒ర॒ణ్యా॒క్షః స॑వి॒తా దే॒వ ఆగా॒ద్దధ॒ద్రత్నా॑ దా॒శుషే॒ వార్యా॑ణి. ॥౨౪॥

అ॒ష్టౌ, వి, అ॒ఖ్య॒త్, క॒కుభః॑, పృ॒థి॒వ్యాః, త్రీ, ధన్వ॑, యోజ॑నా, స॒ప్త, సిన్ధూ॑న్, హి॒ర॒ణ్యా॒క్ష ఇతి హిరణ్య+అ॒క్షః, స॒వి॒తా, దే॒వః, ఆ, అ॒గా॒త్, దధ॑త్, రత్నా॑, దా॒శుషే॑, వార్యా॑ణి. ॥౨౪॥

పదార్థః—(అష్టౌ)(వి)(అఖ్యత్)విఖ్యాపయతి (కకుభః)సర్వా దిశః. కకుభ ఇతి దిఙ్నా... నిఘం. ౧.౬.(పృథివ్యాః)భూమేః సమ్బన్ధినీః(త్రీ)త్రీణి(ధన్వ)ధన్వేత్యన్తరిక్ష నా. నిఘం. ౧. ౩. (యోజనా)యోజనాని(సప్తసిన్ధూన్)భూమసముద్రమారభ్య మేఘాదూర్ధ్వాఽవయవపర్యన్తాన్ సాగరాన్(హిరణ్యాక్షః)హిరణ్యాని జ్యోతీంషి అక్షీణీవ యస్య సః (సవితా) 'సూర్యః' (దేవః)

ద్యోతకః(అ)(అగాత్)ఆగచ్ఛతి(దధత్)దధానః సన్(రత్నా)రమణీయాని పృథివీస్థాని (దాశుషే) దానశీలాయ జీవాయ (వార్యాణి) వర్తుం స్వీకర్తుం యోగ్యాని. ॥౨౪॥ అన్వయః—హే మనుష్యా! యథా హిరణ్యాక్షో దేవః సవితా దాశుషే వార్యాణి రత్నా దధత్ త్రీ ధన్వ యోజనా సప్త సిన్ధూన్ పృథివ్యా అష్టౌ కకుభో వ్యఖ్యదాగాచ్ఛ తథా యూయం భవత॥౨౪ భావార్థః—హే మనుష్యా! యథా సూర్యేణ పృథివీమారభ్య ద్వాదశకోశపర్యన్తస్థా లఘుత్వ యుక్తానాం సప్తవిధానామపామవయవాః సర్వా దిశశ్చ విభజ్యన్తే, వర్షాదినా సర్వేభ్యః సుఖం దీయతే,తథా శుభగుణకర్మస్వభావైర్దిగన్తాం కీర్తిం సమ్పాద్య వివిధైశ్వర్యదానేన మనుష్యాదీన్ ప్రాణినః సతతం సుఖయత. ॥౨౪॥

పదార్థము—మానవులారా! ఎటుల, హిరణ్యాక్షః=నేత్రములవలె రూపమును దర్శింపజేయు జ్యోతులు గలవాడు,దేవః=ప్రేరకుడు, సవితా=సూర్యుడు, దాశుషే =దానశీలములైన ప్రాణులకొఱకు. వార్యాణి=స్వీకరించదగిన, రత్నా = పృథివి యొక్క ఉత్తమపదార్థములను, దధత్=ధారణమొనర్చుచు, త్రీ=మూడు, ధన్వ= అవకాశరూపములగు, యోజనా=[౧౨ క్రోసులు]యోజనములు మఱియు,సప్త+ సిన్ధూన్=పృథివిమీదనున్న సముద్రము మొదలు మేఘముల పై యవయవముల పర్యంతము ఉన్న ఏడు సముద్రములను, మఱియు, పృథివ్యాః=భూమికి సంబంధించిన, అష్టౌ కకుభః = ఎనిమిది దిశలను, వి అఖ్యత్ = ప్రసిద్ధముగా ప్రకాశింపజేయుచున్నాడో, అటులనే మీరును కండు. ॥౨౪॥

భావార్థము—మానవులారా! సూర్యునిచే నెటుల భూమినుండి పన్నెండుకోసుల పర్యంతము ఉన్న తేలికబరువులతో కూడిన సప్తవిధ జలముల అవయవములు మఱియు సకలదిశలు విభజింపబడుచున్నవో, వర్షాదులచే సమస్తమునకు సుఖమొసగబడు చున్నదో, అటులనే శుభగుణ, కర్మ స్వభావములచే దిగంతమైన కీర్తిని వ్యాపింపజేసి, అనేకవిధములైన ఐశ్వర్యముల దానముచే, మానవాది ప్రాణులను నిరంతరము సుఖ పఱచుచుండుడు. ॥౨౪॥ 1817

---

హిరణ్యపాణిరిత్యస్యాఙ్గిరసో హిరణ్యస్తూప ఋషిః, సవితా దేవతా, నిచృజ్జగతీ ఛన్దః,నిషాదః స్వరః.

పునస్తమేవ విషయ మాహ. మరల నా విషయమే చెప్పబడినది.

హిరణ్యపాణిః సవితా విచర్షణి రుభే ద్యావాపృథివీ అన్తరీయతే ।
అపామీవాం బాధతే వేత్తి సూర్యమభి కృష్ణేన రజసా ద్యామృణోతి ॥౨౫॥

హిరణ్యపాణిరితి హిరణ్య+పాణిః, సవితా, విచర్షణిరితి వి+చర్షణిః, ఉభే+ఇత్యుభే, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, అన్తః, ఈయతే, అప, అమీవామ్, బాధతే, వేత్తి, సూర్యమ్, అభి, కృష్ణేన, రజసా, ద్యామ్, ఋణోతి॥౨౫॥

పదార్థః—(హిరణ్యపాణిః)హిరణ్యం జ్యోతిః పాణిరివ యస్య సః (సవితా) ఐశ్వర్యప్రదః (విచర్షణిః)విశేషేణదర్శకః(ఉభే)(ద్యావాపృథివీ(ప్రకాశభూమీ (అన్తః)మధ్యే(ఈయతే)ప్రాప్య

గచ్ఛతి(అప)దూరీకరణే(అమీవామ్)వ్యాధిరూపమన్ధకారమ్(బాధతే)దూరీకరోతి(వేతి)అస్తమేతి(సూర్యమ్)సవితృలోకః. అత్ర విభక్తివ్యత్యయః(అభి)సర్వతః(కృష్ణేన)కృష్ణవర్ణేన (రజసా) అన్ధకారలక్షణేన(ద్యామ్)(ఋణోతి)గచ్ఛతి ప్రాప్నోతి. ఋణోతీతి గతికర్మా నిఘం. ౨.౧౪. ॥౨౫॥
అన్వయః—హే మనుష్యా ! యో హిరణ్యపాణి ర్విచర్షణిః సవితా సూర్యం యదోభే ద్యావాపృథివీ అన్తరీయతే తదాఽమీవామపబాధతే యదా చ వేతి తదా కృష్ణేన రజసా ద్యామభి ఋణోతి. తం యూయం విజానీత. ॥౨౫॥ భావార్థః—హే మనుష్యా ! యథా సూర్యః సన్నిహితాఁల్లోకానాకృష్య ధరతి తథైవాఽనేకలోకాఽలంకృతం సూర్యాదికం సర్వం జగదభివ్యాప్యాఽఽకృష్యేశ్వరో దధాతీతి యూయం విజానీత,నహీశ్వరమన్తరేణ సర్వస్య విధాతా ధర్తా అన్యః కశ్చిత్సమ్భవితు మర్హతి. ॥౨౫॥

పదార్థము—మానవులారా!ఎవడు, హిరణ్యపాణిః=హస్తములవలె జలాదులను గ్రహించు ప్రకాశరూప కిరణములుగలడు, విచర్షణిః = విశేషించి సమస్తమును చూపెట్టువాడు, సవితా = సమస్త పదార్థముల ఉత్పత్తికి హేతువునైన, సూర్యమ్ = సూర్యుడు ఎప్పుడు, ఉభే ద్యావాపృథివీ=భూమ్యాకాశముల రెంటి, అన్తః = మధ్య, ఈయతే=ఉదయించి తిరుగుచున్నాడో, అప్పుడు, అమీవామ్= వ్యాధిరూపాంధకారమును, అప బాధతే=దూరమొనర్చుచున్నాడు, మఱియు, వేతి=అస్తమించునపుడు, కృష్ణేన రజసా=గాఢాంధకారరూపముతో, ద్యామ్=ఆకాశమును,అభి ఋణోతి= సమస్తదిశలనుండి వ్యాపించుచున్నాడు, అట్టి సూర్యుని మీరు తెలిసికొనుడు. ॥౨౫॥

భావార్థము—ఓ మానవులారా ! ఎట్లు సూర్యుడు తన సమీపమునందున్న లోకముల నాకర్షించి ధరించుచున్నాడో, అటులనే అనేక లోకములకు శోభాయమానుడగు సూర్యుని, సమస్తజగత్తును వ్యాపించి ఆకర్షించి, ఈశ్వరుడు ధరించుచున్నాడని యెఱుంగుడు. ఏలయన నీశ్వరుడుదక్క సమస్తమును సృష్టించి ధరించువాడితరుడెవ్వడు కాజాలడు. ॥౨౫॥ 1818

---

1819 హిరణ్యహస్త ఇత్యస్య అఙ్గిరసో హిరణ్యస్తూప ఋషిః, సవితా దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

హిరణ్యహస్తో అసురః సునీథః సుమృడీకః స్వవాఁ యాత్వర్వాఙ్ ।
అపసేధ న్రక్షసో యాతుధానానస్థాద్దేవః ప్రతిదోషం గృణానః. ॥౨౬॥

హిరణ్యహస్త ఇతి హిరణ్య+హస్తః, అసురః, సునీథ+ఇతి సు+నీథః, సుమృడీక ఇతి సు+మృడీకః, స్వవానితి స్వ+వాన్, యాతు, అర్వాఙ్, అపసేధన్నిత్యప+సేధన్, రక్షసః, యాతుధానానితి యాతు+ధానాన్, అస్థాత్, దేవః, ప్రతిదోషమితి ప్రతి+దోషమ్, గృణానః. ॥౨౬॥

పదార్థః—(హిరణ్యహస్తః) హిరణ్యాని జ్యోతింషి హస్తవద్యస్య సః (అసురః) ప్రక్షేప్తా (సునీథః)యః సుష్ఠు నయతి సః(సుమృడీకః)సుష్ఠు సుఖకరః(స్వవాన్) స్వే స్వకీయాః ప్రకాశాదయో గుణా విద్యన్తే యస్మిన్ సః. అత్ర దీర్ఘాదటి సమానపాదే అ. ౮. ३. ౯. ఇతి రుత్వే భో భగో...ఇత్యనేన రోర్యాదేశే చ, హలి సర్వేషామితి లోపః(యాతు) ప్రాప్నోతు(అర్వాఙ్) యోఽర్వాచీనాన్ అఞ్చతి ప్రాప్నోతి సః (అపసేధన్) దూరీకుర్వన్ (రక్షసః) దస్యుచోరాదీన్ (యాతుధానాన్)అన్యాయేన పరపదార్థధారకాన్ (అస్థాత్) ఉత్తిష్ఠతి ఉదేతి (దేవః) ప్రకాశకః (ప్రతిదోషమ్)ప్రతిజనం యో దోషస్తమ్. అత్రోత్తరపదలోపః (గృణానః)ఉచ్చారయన్ ప్రకటయన్. ॥౨౮॥ అన్వయః—హే మనుష్యా! యో హిరణ్యహస్తః సునీథోఽసురః సుమృడీకః స్వవాన్ దేవో రక్షసో యాతుధానానపసేధన్ ప్రతిదోషం గృణానశ్చాస్థాత్సోఽర్వాఙస్మత్సుఖాయ యాతు. తద్వద్యూయం భవత. ॥౨౮॥ భావార్థః—హే మనుష్యా! సదైవౌదార్యేణ యాచమానేభ్యో హిరణ్యాదికం దత్వా దుష్టాచారాన్ తిరస్కృత్య ధార్మికేభ్యః సుఖం ప్రదాయాఽహర్నిశం సూర్యవత్ప్రశంసితా భవత. ॥౨౮॥

పదార్థము—మానవులారా! హిరణ్యహస్తః = హస్తములవలెనుండు ప్రకాశములుగలది, సునీథః=బాగుగా లభింపజేయునది, అసురః=జలాదులను విరజిమ్మునది, సుమృడీకః=సుందరసుఖకరము, స్వవాన్ = స్వకీయప్రకాశాది గుణయుక్తము, దేవః =ప్రకాశకమునగు నీ సూర్యలోకము, యాతుధానాన్ = అన్యాయముగ నితరుల పదార్థములను ధరించు, రక్షసః=దోపిడికాండ్రు,దొంగలు మొదలగువారిని, అపసేధన్ =నివృత్తపఱచుచు, అనగా దోపిడికాండ్రు, దొంగలు మొదలగువారు చోరాదికృత్యములు సూర్యోదయమైనపిమ్మట జరుపజాలరు. కాని రాత్రిళ్లు మాత్రమే వారు పనులు జరుపుకొందురు. మఱియు,ప్రతిదోషమ్=మానవులకున్న దోషములను,గృణానః=ప్రకటించుచు, అస్థాత్=ఉదయించుచున్నదో, అది, అర్వాఙ్ =తనసమీపమందున్న పదార్థములను పొందుచున్నదై, మా సుఖముకొఱకు, యాతు=ప్రాప్తించుగాక!,దానివలెనే మీరును కండు. ॥౨౮॥

భావార్థము—మానవులారా! అడుగువారికి నుదారపూర్వకముగా సువర్ణాదుల నొసగి, దుష్టాచారులను తిరస్కరించి, ధార్మికులకు సుఖమును కలుగజేసి, ప్రతిదినము సూర్యునివలె ప్రశంసితు లగుడు. ॥౨౮॥1819

---

1820 యే త ఇత్యస్యాఙ్గిరస హిరణ్యస్తూప ఋషిః, సవితా దేవతా,
విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
అథాధ్యాపకోపదేశక విషయ మాహ.
అధ్యాపక, ఉపదేశకుల విషయ మిందు జెప్పెను.

యే తే పన్థాః సవితః పూర్వ్యాసోఽరేణవః సుకృతా అన్తరిక్షే ।
తేభిర్నో అద్య పథిభిః సుగేభీ రక్షా చ నో అధి చ బ్రూహి దేవ॥౨౯॥

యే, తే, పన్థాః, సవితరితి సవితః, పూర్వ్యాసః, అరేణవః, సుకృతా ఇతి సు+కృతాః, అన్తరిక్షే, తేభిః, నః, అద్య, పథిభిరితి పథిభిః, సుగేభిరితి సు+గేభిః,

రక్షా, చ, నః, అధి, చ, బ్రూహి. దేవ. ॥౨౭॥

పదార్థః—(యే)(తే)తవ(పన్థాః)మార్గాః అత్ర వచనవ్యత్యయేనైకవచనమ్(సవితః)సవితృవదైశ్వర్యప్రద (పూర్వ్యాసః) పూర్వైరాప్తైః సేవితాః (అరేణవః) అవిద్యమానా రేణవో యేషు తే(సుకృతాః)సుష్ఠునిష్పాదితాః(అన్తరిక్షే)ఆకాశే(తేభిః)తైః(నః)అస్మాన్(అద్య)ఇదానీమ్(పథిభిః)మార్గైః(సుగేభిః)సుఖేన గమనాఽధికరణైః(రక్ష)అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః(చ)(నః)అస్మాన్(అధి)ఉపరిభావే(చ)(బ్రూహి)ఉపదిశ(దేవ)సుఖవిద్యయోర్దాతః. ॥౨౭॥ అన్వయః—హే సవితర్దేవాఽఽప్తవిద్వన్! యస్య తే సూర్యస్యాన్తరిక్షే ఇవ యే పూర్వ్యాసోఽరేణవః సుకృతాః పన్థాః సన్తి తేభిస్సుగేభిః పథిభిరద్య నో నయ.తత్ర గచ్ఛతో నో రక్ష చ నోఽస్మాంశ్చాధి బ్రూహి. ఏవం సర్వాన్ ప్రతి బోధయ. ॥౨౭॥ భావార్థః—అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే విద్వాంసో!యుష్మాభిర్యథా సూర్యస్యాఽన్తరిక్షే నిర్మలాః మార్గాః సన్తి, తథైవోపదేశాధ్యాపనాభ్యాం విద్యాధర్మసుశీలప్రదాః పన్థానః ప్రాచరణీయాః. ॥౨౭॥

పదార్థము—సవితః=సూర్యునివలె నైశ్వర్యముల నొసగువాడా! దేవ=విద్యాసుఖములదాతా! ఆప్తవిద్వాంసుడా! తే=ఏ నీకు, అన్తరిక్షే = ఆకాశమున సూర్యుని గమనమునకు శుద్ధమార్గము లున్నటులనే, యే పూర్వ్యాసః=పూర్వజులైన ఆప్తులు సేవించినవి, అరేణవః=రేణురహితములు,సుకృతాః=సుందరసిద్ధములునగు నే,పంథాః =మార్గములున్నవో,తేభిః సుగేభిః = సుఖపూర్వకముగా ప్రయాణమొనర్చగలుగు, పథిభిః=ఆ మార్గములద్వారా, అద్య=నేడు,నః=మమ్ము నడిపించుము.ఆ మార్గముల నడచుచున్న మమ్ము,రక్ష చ=రక్షించుము కూడ,చ = మఱియు, నః = మాకు, అధి బ్రూహి=అధికముగ నుపదేశించుము. ఇటులనే సమస్త ప్రజలను మేలుకొలుపుము.

భావార్థము—ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది. విద్వాంసులారా! మీరు ఆకాశమున సూర్యుని నిర్మలమార్గము లెటులున్నవో, అటులనే ఉపదేశముచేతను, అధ్యాపనముచేతను విద్యాధర్మ సుశీలప్రదములైన మార్గములను ప్రచారమొనర్చుడు. ॥౨౭॥ 1820

---

1821 ఉభేత్యస్య ప్రస్కణ్వ ఋషిః, అశ్వినౌ దేవతే, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయ మాహ. మరల నా విషయమే ఇందు చెప్పెను.

ఉభా పిబత మశ్వినోభా నః శర్మ యచ్ఛతమ్ । అవిద్రియాభి రూతిభిః ॥౨౮॥

ఉభా, పిబతమ్, అశ్వినా, ఉభా, నః, శర్మ, యచ్ఛతమ్, అవిద్రియాభిః, ఊతిభి రిత్యూతి+భిః. ॥౨౮॥

పదార్థః—(ఉభా) ద్వౌ (పిబతమ్) (అశ్వినా) సూర్యాచన్ద్రమసావివాఽధ్యాపకోపదేశకౌ (ఉభా)ద్వౌ (నః) అస్మభ్యమ్ (శర్మ)శ్రేష్ఠం శరణం సుఖం వా (యచ్ఛతమ్)దద్యాతమ్(అవిద్రియాభిః)అచ్ఛిద్రాభిః(ఊతిభిః)రక్షణాదిభిః. ॥౨౮॥ అన్వయః—హే అశ్వినా ఉభా యువాం యత్రోత్తమం రసం పిబతం తచ్ఛర్మోభా యువామవిద్రియాభి రూతిభీ రక్షితం గృహం నో యచ్ఛతమ్. ॥౨౮॥ భావార్థః—అధ్యాపకోపదేశకైః సదోత్తమగృహ రచన నివాసోపదేశాన్ కృత్వా యత్ర పూర్ణా రక్షా స్యాత్తత్ర సర్వే ప్రేరణీయాః ॥౨౮॥

పదార్థము—అశ్వినా=సూర్యచంద్రులవలెనున్న అధ్యాపకోపదేశకులారా!ఉభా =మీ ఇరువురు ఎచట ఉత్తమ రసమును, పిబతమ్ = త్రాగుదురో, శర్మ = ఆ ఉత్తమ ఆశ్రయస్థానమును లేక సుఖమును, ఉభా=మీ రిరువురు, అవిద్రియాభిః=ఛిద్రరహితములగు, ఊతిభిః= రక్షణాది క్రియలచే సురక్షితగృహమును, నః = మా నిమిత్తము, యచ్ఛతమ్=ఒసగుడు. ॥౨౮॥

భావార్థము—అధ్యాపకోపదేశకులు సదా ఉత్తమగృహమును నిర్మించి నివాసముండుట కుపదేశములొనర్చి పూర్ణరక్షణ జరుగు విషయమునందు అందఱిని ప్రేరేపించవలయును. ॥౨౮॥ 1821

---

1822 అప్నస్వతీ మిత్యస్య కుత్స ఋషిః, అశ్వినౌ దేవతే, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల విషయ మయ్యది యే.

అప్నస్వతీ మశ్వినా వాచ మస్మే కృతం నో దస్రా వృషణా మనీషామ్ ।
అద్యూత్యేఽవసే ని హ్వయే వాం వృధే చ నో భవతం వాజసాతౌ. ॥౨౯॥

అప్నస్వతీమ్, అశ్వినా, వాచమ్, అస్మేఽఇత్యస్మే, కృతమ్, నః, దస్రౌ, వృషణా, మనీషామ్, అద్యూత్యే, అవసే, ని, హ్వయే, వామ్, వృధే, చ, నః, భవతమ్, వాజసాతావితి వాజ+సాతౌ. ॥౨౯॥

పదార్థః—(అప్నస్వతీమ్)ప్రశస్తాన్యప్నాంసి కర్మాణి విద్యన్తే యస్యాస్తామ్ (అశ్వినా) సకల విద్యావ్యాపినావధ్యాపకకోపదేశకౌ! (వాచమ్)వాణీమ్ (అస్మే) అస్మాకమ్ (కృతమ్)కురుతమ్ (నః) అస్మాకమ్ (దస్రా) దుఃఖోపక్షయితారౌ (వృషణా) సుఖస్య వర్షయితారౌ (మనీషామ్) ఉత్తమాం ప్రజ్ఞామ్(అద్యూత్యే)అవిద్యమానాని ద్యూతాని యస్మింస్తస్మిన్భవే(అవసే)రక్షణాయ (ని, హ్వయే)నితరాం స్తౌమి(వామ్)యువామ్(వృధే)వర్ధనాయ(చ)(నః) అస్మాకమ్ (భవతమ్) (వాజసాతౌ) వాజస్య ధనస్య విభాజకే సఙ్గ్రామే. ॥౨౯॥ అన్వయః—హే దస్రా వృషణాఽశ్వినా యువామస్మే వాచం మనీషా చాప్నస్వతీం కృతం నోఽద్యూత్యేఽవసే స్థాపయతమ్. వాజసాతౌ నో వృధే చ భవతం యౌ వామహన్నిహ్వయే తౌ మామున్నయతమ్॥౨౯॥ భావార్థః—యే మనుష్యా నిష్కపటానాప్తాన్దయాలూన్ విదుషః సతతం సేవన్తే తే ప్రగల్భా ధార్మికా విద్వాంసో భూత్వా సర్వతో వర్ధమానా విజయినః సన్తః సర్వేభ్యః సుఖినో భవన్తి.

పదార్థము—దస్రా=దుఃఖనాశకులారా!వృషణా=సుఖవర్షకులారా!అశ్వినా= సమస్తవిద్యలందు వ్యాప్తులైన అధ్యాపకోపదేశకులారా! మీ రిరువురు, అస్మే = మా యొక్క, వాచమ్=వాక్కును, చ=మఱియు, మనీషామ్ = బుద్ధిని, అప్నస్వతీమ్= ప్రశస్త కర్మలుగలదానిగ, కృతమ్=చేయుడు, నః = మమ్ము, అద్యూత్యే = జూదములులేని కర్మయందు, అవసే=రక్షణకై స్థిరమొనర్పుడు. వాజసాతౌ=ధనమును విభజించగల సంగ్రామమందు, నః = మా యొక్క, వృధే = వృద్ధినిమిత్తము, భవతమ్= ఉద్యతులగుడు, వామ్=ఏ మిమ్ము,ని హ్వయే=నిరంతరము స్తుతించుచున్నానో ఆ మీ రిరువురు నన్ను ఉన్నతిపఱచుడు. ॥౨౯॥

ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యం చ ।
హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి భువనాని పశ్యన్. ॥౩౧॥

ఆ, కృష్ణేన, రజసా, వర్తమానః, నివేశయన్నితి ని+వేశయన్, అమృతమ్, మర్త్యమ్, చ, హిరణ్యయేన, సవితా, రథేన, ఆ, దేవః, యాతి, భువనాని, పశ్యన్. ॥౩౧॥

పదార్థః—(ఆ)సమన్తాత్ (కృష్ణేన)కర్షితేన (రజసా) లోకసమూహేన సహ (వర్తమానః) (నివేశయన్)నిత్యం ప్రవేశయన్(అమృతమ్) నాశరహితం కారణమ్ (మర్త్యమ్) నాశసహితం కార్యమ్(చ)(హిరణ్యయేన)తేజోమయేన (సవితా)ఐశ్వర్యప్రదః(రథేన)రమణీయేన స్వరూపేణ (ఆ)(దేవః)దేదీప్యమానః(యాతి)ప్రాప్నోతి(భువనాని)భువనాధికరణాని వస్తూని(పశ్యన్)సంప్రేక్షమాణః. ॥౩౧॥ అన్వయః—హే విద్వంస్త్వం య ఆకృష్ణేన రజసా సహ వర్తమానః సతతమమృతం మర్త్యం చ నివేశయన్ హిరణ్యయేన రథేన సవితా దేవో విద్యుద్భువనాని యాతి తం పశ్యన్ సన్ సమ్ప్రయుఙ్గ్ధి. ॥౩౧॥ భావార్థః—హే మనుష్యా ! యా విద్యుత్కార్యం కారణం సమ్ప్రకాశ్య సర్వత్రాఽభివ్యాప్తా తేజోమయీ సద్యోగామినీ సర్వాకర్షికా వర్తతే తాం ప్రేక్షమాణాః సన్తః సంప్రయుజ్యాఽభీష్టాని సద్యో యాత. ॥౩౧॥

పదార్థము–ఓ విద్వాంసుడా! నీవు, ఆ కృష్ణేన=ఆకర్షితమైన, రజసా = లోకసమూహముతో, వర్తమానః=వర్తమానమై నిరంతరము, అమృతమ్ = నాశరహిత కారణమును, చ=మఱియు, మర్త్యమ్=నాశసహితకార్యమును,నివేశయన్ = వానివాని [నియమిత] కక్షలందు స్థిరపఱచుచు, హిరణ్యయేన=తేజఃస్వరూపమగు,రథేన= రమణీయ స్వరూపముతో, సవితా=ఐశ్వర్యదాత, దేవః=దేదీప్యమానమునగునే విద్యుద్రూపాగ్ని, భువనాని=సంసారస్థవస్తువులను, యాతి=ప్రాప్తమగుచున్నదో, దానిని, పశ్యన్=చూచుచు బాగుగా ప్రయోగించుడు. ॥౩౧॥

భావార్థము–మానవులారా! ఏ విద్యుత్తు కార్యకారణములను బాగుగా ప్రకాశితపఱచి, సర్వత్ర వ్యాపించి,తేజఃస్వరూపమై, శీఘ్రగామినియై,సమస్తము నాకర్షించునదై యున్నదో దానిని జూచినవారై సంప్రయోగించి అభీష్టస్థానములకు శీఘ్రముగా వెళ్లుచుండుడు. ॥౩౧॥ 1824

---

1825 ఆ రాత్రీత్యస్య కుత్స ఋషిః, రాత్రిర్దేవతా, పథ్యా బృహతీ ఛన్దః, మధ్యమః, స్వరః.

అథ రాత్రివర్ణన మాహ. రాత్రి వర్ణన ఇందు చెప్ప బడెను.

ఆ రాత్రి పార్థివꣳ రజః పితు రప్రాయి ధామభిః ।
దివః సదాꣳసి బృహతీ వి తిష్ఠ స ఆ త్వేషం వర్తతే తమః॥౩౨॥

ఆ, రాత్రి, పార్థివమ్, రజః, పితుః, అప్రాయి, ధామభిరితి ధామ+భిః,

ద్రివః సదాంసి, బృహతీ, వి, తిష్ఠసే, ఆ, త్వేషమ్, వర్తతే, తమః. ॥౩౨॥

పదార్థః—(ఆ)సమన్తాత్(రాత్రి)రాత్రిః. అత్ర లిఙ్గవ్యత్యయః(పార్థివమ్)పృథివ్యాః సమ్బన్ధి (రజః)లోకః(పితుః)మధ్యలోకస్య(అప్రాయి)పూర్యతే(ధామభిః)సర్వైస్థానైః(దివః)ప్రకాశస్య (సదాంసి) సీదన్తి యేషు తాన్యధికరణాని (బృహతీ) మహతీ (వి) (తిష్ఠసే, తిష్ఠతే, ఆక్రమతే వ్యాప్నోతి(ఆ)(త్వేషమ్)స్వకాన్త్యా ప్రకృష్టమ్(వర్తతే)(తమః)అన్ధకారః ॥౩౨॥ అన్వయః— హే మనుష్యా!యా బృహతీ రాత్రిదివః సదాంసి వితిష్ఠసే యయా పితుః.ర్ధామభిః పార్థివం రజ ఆ అప్రాయి, యస్యాశ్చ త్వేషం తమ ఆ వర్తతే తాం యుక్త్యా సేవధ్వమ్. ॥౩౨॥ భావార్థః— హే మనుష్యా ! యా పృథివ్యాదేశ్ఛాయా రాత్రౌ ప్రకాశం నిరోధయతి సర్వ మావృణోతి తాం యథావత్సేవవన్తామ్. ॥౩౨॥

పదార్థము—ఓ మానవులారా! బృహతీ రాత్రి=ఏ గొప్ప రేత్రిరి,దివః=ప్రకాశము యొక్క, సదాంసి=స్థానమునందు, వి తిష్ఠసే = వ్యాప్తమగుచున్నదో, ఏరాత్రి,పితుః = తనకు సూర్యునికి మధ్యస్థములగు లోకముల, ధామభిః = సమస్తస్థానములతో [పాటు], పార్థివమ్=పృథివీసంబంధమైన, రజః=లోకమును, ఆ అప్రాయి=బాగుగా పూరించునో మఱియు దేనియొక్క, త్వేషమ్=స్వకాంతిచే నభివృద్ధినొందిన, తమః= అంధకారము, ఆ వర్తతే=వచ్చుచుపోవుచు నున్నదో,దానిని యుక్తితో సేవించుడు.

భావార్థము—మానవులారా! పృథివి మొదలగువానియొక్క ఏ నీడ రాత్రు లందు ప్రకాశమున కడ్డుతగులుచున్నదో అనగా సమస్తము నావరించుచున్నదో దానిని మీరు యథావిధిగా సేవించుడు. ॥౩౨॥ 1825

---

1826 ఉష ఇత్యస్య గోతమ ఋషిః, ఉషర్దేవతా, నిచృత్పరోష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పున రుషో వర్ణన ముప దిశ్యతే. మరల ఉషఃకాల వర్ణన.

ఉషస్తచ్చిత్ర మా భరా స్మభ్యం వాజినీవతి ।
యేన తోకం చ తనయం చ ధామహే. ॥౩౩॥

ఉష, తత్, చిత్రమ్, ఆ, భర, అస్మభ్యమ్, వాజినీవతీతి వాజినీ వతి, యేన, తోకమ్, చ, తనయమ్, చ, ధామహే. ॥౩౩॥

పదార్థః—(ఉషః)ఉషోవద్వర్తమానే(తత్)(చిత్రమ్) అద్భుతస్వరూపమ్(ఆ) (భర) పోషయ (అస్మభ్యమ్)(వాజనీవతి)బహ్వన్నాదైశ్వర్యయుక్తే(యేన)(తోకమ్)సద్యోజాత మపత్యమ్(చ) (తనయమ్)ప్రాప్తకుమారావస్థమ్(చ)(ధామహే)ధరేమ. ॥౩౩॥ అన్వయః—హే వాజినీ వత్యుషర్వద్వర్తమానే స్త్రి! యథా వాజినీవత్యుషా యాదృశం చిత్రం స్వరూపం ధరతి, తత్తా దృశ మస్మభ్యం త్వమాభర యేన వయం తోకం చ తనయం చ ధామహే. ॥౩౩॥ భావార్థః— అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. యథా సర్వం శోభాయుక్తా మఙ్గలప్రదా ప్రభాతవేలా సర్వ వ్యవహారధారికా వర్తతే తథాభూతాః స్త్రియో యది స్యుస్తర్హి తాః సదా స్వం స్వం పతిం ప్రసాద్య పుత్రపౌత్రాదినా ఆనన్దం లభేరన్. ॥౩౩॥

పదార్థము—వాజినీవతి=అధికముగ అన్నాద్యైశ్వర్యములు కలిగినదానా!ఉషః =ప్రాతఃకాలమువంటి కాంతిగలదానా! ఓ స్త్రీ! ఎటులధికముగ నన్నము మొదలగు ఐశ్వర్యములకు హేతువైన ప్రాతఃకాలసమయము, చిత్రమ్ = ఎట్టి ఆశ్చర్యస్వరూప మును ధరించుచున్నదో, తత్ =అటులనే, అట్టిరూపమును నీవు, అస్మభ్యమ్=మానిమిత్తము, ఆ భర=బాగుగా పుష్టిపఱచుము. యేన=అందువలన మేము,తోకమ్=సద్యోజాతబాలకుని, చ=మఱియు, తనయమ్ = కుమారావస్థలోనుండు తనయుని, చ= కూడ, ధామహే=ధరించెదముగాక ! ॥౩౩॥

భావార్థము—ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఎట్లు సకల శోభాయుక్తము, కల్యాణము నొసగునదియునగు ప్రభాతసమయము సకల వ్యవహారములను ధరించెడిదై యున్నదో అటులనే స్త్రీలును అట్టివారలగుచో వారు సదా తమ తమ పతులను ప్రసన్నపఱచి, పుత్రపౌత్రాదులతోకూడి ఆనందమును పొందుదురు.॥౩౩

---

1827 ప్రాత రిత్యస్య వసిష్ఠ ఋషిః,అగ్న్యాదయో లిఙ్గోక్తా దేవతాః,నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః

పున ర్మనుష్యాః కిం కుర్యు రిత్యాహ. మరల మానవు లేమి చేయవలయును ?

ప్రా॒త ర॒గ్నిం ప్రా॒త రిన్ద్ర॑గ్ం హవామహే ప్రా॒త ర్మి॒త్రావరుణా ప్రా॒త ర॒శ్వినా।
ప్రా॒త ర్భగం పూ॒షణం బ్రహ్మ॒ణస్పతిం ప్రా॒తః సోమ ము॒త రు॒ద్రగ్ం హువేమ॥

ప్రా॒తః, అ॒గ్నిమ్, ప్రా॒తః, ఇన్ద్రమ్, హ॒వా॒మ॒హే॒, ప్రా॒తః, మి॒త్రా వరుణా, ప్రా॒తః, అ॒శ్వినా, ప్రా॒తః, భగమ్, పూ॒షణమ్, బ్రహ్మణః, పతిమ్, ప్రా॒తరితి ప్రా॒తః, సోమమ్, ఉ॒త, రు॒ద్రమ్, హు॒వే॒మ.

పదార్థః—(ప్రాతః)ప్రభాతే(అగ్నిమ్) పవిత్రం స్వప్రకాశం పరమాత్మానం పావకమగ్నిం వా (ప్రాతః) (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమ్ (హవామహే) ఆదద్యామాహ్వయేమ వా (ప్రాతః) (మిత్రావరుణా) ప్రాణోదానౌ (ప్రాతః) (అశ్వినా)మధ్యాపకోపదేశకౌ (ప్రాతః)(భగమ్)భజనీయం భాగమ్(పూషణమ్)పుష్టికరం భోగమ్(బ్రహ్మణః)ధనస్య వేదస్య(పతిమ్)స్వామినం పాలకమ్(ప్రాతః)(సోమమ్)ఓషధిగణమ్ (ఉత) అపి(రుద్రమ్)జీవమ్ (హువేమ)గృహ్ణీయామ. ॥౩౪॥
అన్వయః—హే మనుష్యా!యథా వయం ప్రాత రగ్నిం ప్రాత రింద్రం ప్రాతర్మిత్రావరుణా ప్రాత రశ్వినా హవామహే ప్రాత ర్భగం పూషణం బ్రహ్మణస్పతిం ప్రాతః సోమ ముత రుద్రఞ్చ హువేమ తథా యూయ మప్యాచరత. ॥౩౪॥భావార్థః—యే మనుష్యాః ప్రాతః పరమేశ్వరోపాసన మగ్నిహోత్రమైశ్వర్యోన్నత్యుపాయం ప్రాణాపానపుష్టికరణ మధ్యాపకోపదేశకాన్ విదుష ఓషధి సేవనం జీవం చ ప్రాప్తుం జ్ఞాతుం చ ప్రయతన్తే తే సర్వైః సుఖై రలఙ్కృతాః స్యుః. ॥౩౪॥

పదార్థము—ఓ మానవులారా! మే మెటుల, ప్రాతః=ప్రాతఃకాలమున, అగ్నిమ్ =పవిత్రుడు లేక స్వప్రకాశ స్వరూపుడునగు పరమాత్మను, లేక అగ్నిని, ప్రాతః = ప్రాతఃకాలమున, ఇన్ద్రమ్=ఉత్తమైశ్వర్యమును, ప్రాతః=ప్రభాతసమయమున,మిత్రావరుణా=ప్రాణోదానములను, మఱియు, ప్రాతః=వేకువజామున. అశ్వినా=అధ్యా

వకుని, ఉపదేశకుని, హవామహే = గ్రహించెదమో లేక ఆహ్వానించెదమో, ప్రాతః = ప్రాతఃకాలమున, భగమ్ = సేవించదగిన భాగమును, పూషణమ్ = పుష్టికారకమగు భోగమును, బ్రహ్మణస్పతిమ్ = ధనమును, లేక వేదమును రక్షించువానిని, ప్రాతః = ప్రభాతసమయమున, సోమమ్ = సోమాది ఓషధిగణమును, ఉత = మఱియు, రుద్రమ్ = జీవమును, హువేమ = స్వీకరించెదమో గ్రహించెదమో అట్లనే మీరును ఆచరించుడు.

భావార్థము—ఏ మానవులు ప్రాతఃకాలమున పరమేశ్వరోపాసనను, అగ్నిహోత్రమును, ఐశ్వర్యోన్నతికి ఉపాయమును, ప్రాణాపానముల పోషణమును, అధ్యాపకోపదేశకులను, విద్వాంసులను, ఓషధి సేవనమును, జీవాత్మను [వీనిని] పొందుటకు, లేక తెలిసికొనుటకు ప్రయత్నము చేయుచున్నారో, వారు సమస్త సుఖములతో సుశోభితులగుచున్నారు. ॥౩౪ 1827

---

1828 ప్రాతర్జిత మిత్యస్య వసిష్ఠ ఋషిః, భగో దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యా ఐశ్వర్యం సంపాదయేయు రిత్యాహ.

మానవు లైశ్వర్య (ధన) మును సంపాదించవలయును.

ప్రాతర్జితం భగముగ్రꣳహువేమ వయం పుత్ర మదితే ర్యో విధర్తా ।
ఆధ్రశ్చిద్యం మన్యమాన స్తురశ్చిద్రాజా చిద్యం భగం భక్షీత్యాహ ॥౩౫॥

ప్రాతర్జిత మితి ప్రాతః+జితమ్, భగమ్, ఉగ్రమ్, హువేమ, వయమ్ పుత్రమ్, అదితేః, యః, విధర్తేతి వి+ధర్తా, ఆధ్రః, చిత్, యమ్, మన్యమానః, తురః, చిత్, రాజా, చిత్, యమ్, భగమ్, భక్షి, ఇతి, ఆహ. ॥౩౫॥

పదార్థః—(ప్రాతః) ప్రభాతే (జితమ్) స్వపురుషార్థేన లబ్ధమ్ (భగమ్) ఐశ్వర్యమ్ (ఉగ్రమ్) అత్యుత్కృష్టమ్ (హువేమ) గృహ్ణీయామ (వయమ్) (పుత్రమ్) (అదితేః) అవినాశినః సేకారణ్యాన మానుః (యః) (విధర్తా) యో వివిధాన్ పదార్థాన్ ధరతి సః (ఆధ్రః) పుత్రస్య పుత్రః (చిత్) అపి (యమ్) (మన్యమానః) విజానన్ (తురః) త్వరమాణః (చిత్) అపి (రాజా) రాజమానః (చిత్) (యమ్) (భగమ్) ఐశ్వర్యమ్ (భక్షి) సేవస్వ (ఇతి) అనేన ప్రకారేణ (ఆహ) పరమేశ్వర ఉపదిశతి. ॥౩౫॥ అన్వయః—హే మనుష్యాః! యథా వయం ప్రాత ర్యో విధర్తా ఆధ్రశ్చిద్యం మన్యమాన స్తురశ్చిద్రాజాఽస్తి యం భగం చిద్భక్షీత్యాహ తమదితేః పుత్రం జితముగ్రం భాగం హువేమ తథా యూయమపి స్వీకురుత. ॥౩౫॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే మనుష్యాః! యుష్మాభిః సదా ప్రాతరారభ్య శయనపర్యన్తం యథాశక్తి సామర్థ్యేన విద్యయా పురుషార్థేనైశ్వర్యోన్నతిం విధాయాఽఽనన్దో భోక్తవ్యో దరిద్రేభ్యః సుఖం దేయ మిత్యాహేశ్వరః. ॥౩౫॥

పదార్థము—ఓ మానవులారా! ఎట్లు, వయమ్ = మేము, ప్రాతః = ప్రభాతసమయమున, విధర్తా = వివిధపదార్థములను ధరించునది, ఆధ్రఃచిత్ = న్యాయాదులందు తృప్తిపొందనివానికి పుత్రమునై, యః = ఏది [ఉన్నదో], యమ్ = ఏ ఐశ్వర్యమును, మన్యమానః = విశేషముగా తెలిసికొనువాడై, తురః చిత్ = శీఘ్రకారియునై, రాజా

=శోభాయుక్తుడునగు రాజు ఉన్నాడో,యమ్‌భగమ్ చిత్=ఏ ఐశ్వర్యమును,భక్షి ఇతి ఆహ=నీవు సేవించుమని యీశ్వరు డుపదేశించుచున్నాడో, అదితేః = అవినాశికారణమువలెనున్న తల్లి యొక్క,పుత్రమ్=పుత్రము అనగా—రక్షకము, జితమ్ = స్వపురుషార్థము వలన పొందబడినది, ఉగ్రమ్ = ఉత్కృష్టమునగు, భగమ్ = ఆ ఐశ్వర్యమును, హువేమ=గ్రహించెదమో, అటులనే మీరును స్వీకరించుడు. ॥౩౫॥

భావార్థము—ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. మానవులారా! మీరు సదా ప్రాతఃకాలమునుండి నిద్రించువరకు యథా శక్తి సామర్థ్యములతోను విద్యతోను, పురుషార్థముతో నైశ్వర్యము నభివృద్ధిపఱచి ఆనందము ననుభవించవలెను. దరిద్రులకు సుఖము చేకూర్చుచుండవలయునని ఈశ్వరు డుపదేశించుచున్నాడు.

---

1829 భగ ఇత్యస్య వసిష్ఠ ఋషిః, భగవాన్ దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథేశ్వర ప్రార్థనాదిక విషయ మాహ. ఈశ్వర ప్రార్థన.

భగ ప్రణేతర్భగ సత్యరాధో భగేమాం ధియ ము దవా దదన్నః ।
భగ ప్ర నో జనయ గోభి రశ్వై ర్భగ ప్ర నృభి ర్నృవన్తః స్యామ॥

భగ, ప్రణేతః, ప్రనేత రితి ప్ర+నేతః, భగ, సత్యరాధ ఇతి సత్య+రాధః, భగ, ఇమామ్, ధియమ్, ఉత్, అవ, దదత్, నః, భగ, ప్ర, నః, జనయ, గోభిః, అశ్వైః, భగ,ప్ర,నృభిరితి నృ+భిః, నృవన్త+ఇతి నృ+వన్తః స్యామ

పదార్థః—(భగ) ఐశ్వర్య యుక్త! (ప్రణేతః) పురుషార్థం ప్రతిప్రేరక (భగ) ఐశ్వర్యప్రద! (సత్యరాధః) సత్సు సాధూని రాధాంసి ధనాని యస్య తత్సమ్బుద్ధౌ (భగ)భజనీయ! (ఇమామ్) వర్తమానామ్(ధియమ్) ప్రజ్ఞామ్ (ఉత్)(అవ)రక్ష.అత్ర ద్వ్యచోఽత స్తిఙ ఇతి దీర్ఘః(దదత్)దదానః(నః) అస్మాకమ్ (భగ)విద్యైశ్వర్యప్రద! (ప్ర)(నః)అస్మాన్(జనయ)ప్రకటయ (గోభిః)ధేన్వాదిభిః(అశ్వైః)అశ్వాదిభిః(భగ)భజమాన!(ప్ర)(నృభిః)నాయకైః(నృవన్తః) (స్యామ) భవేమ ॥౩౬॥
అన్వయః—హే భగ ప్రణేత ర్భగ సత్యరాధో భగ త్వం నోఽస్మాకమిమాం ధియం దదత్సదుదవ. హే భగ!త్వం గోభి రశ్వైర్నృభిస్సహ నోఽస్మాన్ ప్రజనయ. హే భగ!యేన వయం నృవన్తః ప్రస్యామ తథా విధేహి ॥౩౬॥ భావార్థః—మనుష్యైర్యదా యదేశ్వరస్య ప్రార్థనా విదుషాం సఙ్గః క్రియేత తదా ప్రజ్ఞైవ యాచనీయోతాపి సన్త పురుషాః. ॥౩౬

పదార్థము—భగ = ఐశ్వర్యవంతా! ప్రణేతః=పురుషార్థముపట్ల ప్రేరేపించునో యీశ్వరా! భగ=ఐశ్వర్యదాతా! సత్యరాధః=విద్యమాన పదార్థములం దుత్తమ ధనములుగలవాడా! భగ= సేవించదగిన విద్వాంసుడా ! నీవు,నః ఇమామ్ ధియమ్ = మాకున్న యీబుద్ధిని,దదత్=ఒసగుచు,ఉత్ అవ=బాగుగారక్షించుము,భగ=విద్యారూపైశ్వర్యమునొసగువాడా! ఈశ్వరా! లేక విద్వాంసుడా! నీవు, గోభిః = గోవుమొదలగు పశువులతో, అశ్వైః=గుఱ్ఱము మొదలగు వాహనములతో, నృభిః=నాయకులు కులనిర్వాహకులునగు మానవులతో, నః=మమ్ము, ప్ర జనయ=ప్రకటపఱచుము, భగ=

•భజనీయా! విద్వాంసుడా! ఎటుల మేము, నృవన్తః=ప్రశంసనీయులగు మానవులుగల వారముగ, ప్రస్యామ=బాగుగా కాగలుగుదుమో, అట్లు చేయుము. ॥౩౮॥

భావార్థము—మానవులు భగవంతుని ప్రార్థించినపుడు, విద్వాంసుల సేవించి నపుడు సదా సుబుద్ధి శ్రేష్ఠపురుషుల పొత్తు కావలయునని కోరుచు నుండవలయును.

---

1830 ఉతేదానీమిత్యస్య వసిష్ఠ ఋషిః, భగో దేవతా, పఙ్క్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

అథైశ్వర్యోన్నతి విషయ మాహ. ఐశ్వర్యోన్నతి విషయము నిందు చెప్పెను.

ఉతేదానీం భగవన్తః స్యామోత ప్రపిత్వ ఉత మధ్యే అహ్నామ్ ।

ఉతోదితా మఘవన్త్సూర్యస్య వయం దేవానాꣳ సుమతౌ స్యామ ॥౩౭॥

ఉత, ఇదానీమ్, భగవన్త+ఇతి భగ+వన్తః, స్యామ, ఉత, ప్రపిత్వ ఇతి ప్ర+పిత్వే, ఉత, మధ్యే, అహ్నామ్, ఉత, ఉదితేత్యుత్+ఇతా, మఘవన్నితి మఘ+వన్, సూర్యస్య, వయమ్, దేవానామ్, సుమతావితి సు+మతౌ, స్యామ॥

పదార్థః—(ఉత)అపి (ఇదానీమ్)వర్తమానసమయే(భగవన్తః) సకలైశ్వర్యయుక్తాః (స్యామ) (ఉత)అపి (ప్రపిత్వే) పదార్థానాం ప్రాపణే (ఉత) (మధ్యే) (అహ్నామ్) దివసానామ్ (ఉత) (ఉదితా)ఉదయసమయే (మఘవన్)పరమపూజితధనయుక్త! (సూర్యస్య)(వయమ్)(దేవానామ్) విదుషామ్(సుమతౌ)(స్యామ) ॥౩౭॥ అన్వయః—హే మఘవన్!వయ మిదానీ ముత ప్రపిత్వే ఉత భవిష్యతి ఉతాహ్నాం మధ్యే భగవన్తః స్యామ. ఉత సూర్యస్యోదితా దేవానాం సుమతౌ భగవన్తః స్యామ ॥౩౭॥ భావార్థః—మనుష్యైర్వర్తమానే భవిష్యతి చ యోగైశ్వర్యస్యోన్నతే ర్లౌకికస్య వ్యవహారస్య వర్ధనే ప్రశంసాయాఞ్చ సతతం ప్రయతితవ్యమ్ ॥౩౭॥

పదార్థము—మఘవన్=ఉత్తమధనయుక్తా!ఈశ్వరా!లేక విద్వాంసుడా! వయమ్ =మేము, ఇదానీమ్=వర్తమాన సమయమున, ఉత=మఱియు, ప్రపిత్వే=పదార్థములయొక్క ప్రాప్తియందు, ఉత = మఱియు భవిష్యత్కాలమందు, ఉత = మఱియు, అహ్నామ్=దినములందు, మధ్యే=మధ్యన, భగవన్తః స్యామ=సకలైశ్వర్య యుక్తులమగుదుము గాక! ఉత=మఱియు, సూర్యస్య=సూర్యునియొక్క, ఉదితా = ఉదయకాలమందు, దేవానామ్=విద్వాంసులయొక్క, సుమతౌ = ఉత్తమబుద్ధియందు సకలైశ్వర్య యుక్తులము, స్యామ=అగుదుముగాక ! ॥౩౭॥

భావార్థము—మానవులు వర్తమాన, భవిష్యత్కాలములందు యోగైశ్వర్యోన్నతిని, లౌకికవ్యవహారముల నభివృద్ధి యొనర్చుటయందును, ప్రశంసయందును నిరంతరము ప్రయత్న మొనర్చవలయును. ॥౩౭॥ 1830

---

1831 భగ ఇత్యస్య వసిష్ఠ ఋషిః, భగవాన్ దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే చెప్పబడినది.

భగ ఏవ భగవాఀ అస్తు దేవా స్తేన వయం భగవ న్తః స్యామ ।
తం త్వా భగ సర్వ ఇజ్జోహ వీతి స నో భగ పుర ఏతా భవేహ. ॥౩౮॥

భగః, ఏవ, భగవానితి భగ+వాన్, అస్తు, దేవాః, తేన, వయమ్, భగవన్త ఇతి భగ+వ న్తః, స్యామ, తమ్, త్వా, భగ, సర్వః, ఇత్, జోహవీతి, సః, నః, భగ, పుర ఏతేతి పురః+ఏతా, భవ, ఇహ. ॥౩౮॥

పదార్థః—(భగః)భజనీయః సేవనీయః(ఏవ)(భగవాన్)ప్రశస్తైశ్వర్యయుక్తః(అస్తు)భవతు (దేవాః) విద్వాంసః (తేన)భగస్వరూపేణ భగవతా పరమేశ్వరేణ సహ (వయమ్) (భగవ న్తః) సకలశోభాయుక్తాః (స్యాను)భవేమ (తమ్) (త్వా) త్వామ్ (భగ) అఖిలశోభాయుక్త! (సర్వః) అఖిలో జనః(ఇత్)ఏవ (జోహవీతి)భృశమాహ్వయతి (సః)(నః)అస్మాకమ్(భగ)సకలైశ్వర్యప్రద ! (పురఏతా)యః పురస్తాదేతి సః (భవ)(ఇహ) ॥౩౮॥ అన్వయః—హే దేవాః! యో భగ ఏవ భగవానస్తు తేన వయం భగవ న్తః స్యామ. హే భగ!తం త్వా సర్వ ఇజ్జోహవీతి. భగ ! స త్వ మిహ నః పురఏతా భవ ॥౩౮॥ భావార్థః—హే మనుష్యా ! యూయం యః సకలైశ్వర్య సంపన్నః పరమేశ్వర స్తేన యే చాస్యోపాసకా విద్వాంస స్తైస్సహ సిద్ధాః శ్రీమన్తశ్చ భవత యో జగదీశ్వరో మాతాపితృవదస్మాసు కృపయతి తద్భక్తిపురః సరేణేహ మనుష్యానైశ్వర్య వతః సతతం కురుత ॥౩౮॥

పదార్థము—దేవాః=విద్వాంసులారా! ఎవడు, భగ ఏవ = నిశ్చయముగ సేవనీయుడు, భగవాన్ = ప్రశస్తైశ్వర్యయుక్తుడు, అస్తు = అగునో, తేన=ఆ ఐశ్వర్యరూపునితో, ఐశ్వర్యవంతుడైన పరమేశ్వరునితో, వయమ్=మేము, భగవ న్తః=సమగ్రైశ్వర్యయుక్తులము, స్యామ = అగుదుముగాక! భగ = పరిపూర్ణశోభాయుక్తా ! ఈశ్వరా! తమ్ త్వా=అట్టి నిన్ను, సర్వం ఇత్ =సమస్తప్రజలు,జోహవీతి=శీఘ్రముగా పిలచుచున్నారు. భగ=సకలైశ్వర్యదాతా! సః=అట్టి నీవు, ఇహ=ఈ జగత్తునందు, నః=మాకు, పుర ఏతా=అగ్రగామివి, భవ=అగుము. ॥౩౮॥

భావార్థము—ఓ మానవులారా!మీరు సకలైశ్వర్యయుక్తుడగు నే పరమేశ్వరుడు కలడో, అతనివలనను, మఱియు నెవరిట్టి పరమేశ్వరుని ఉపాసించు విద్వాంసులు కలరో, వారివలనను సిద్ధులు, శ్రీమంతులుకండు. ఏ పరమేశ్వరుడు తల్లి, తండ్రివలె మనపై దయచూపుచున్నాడో, అతని భక్తి పురస్సరముగ నీ లోకమునందు మానవులను ఐశ్వర్యవంతులుగ నిరంతర మొనర్చుచుండుడు. ॥౩౮॥ 1831

---

1832 సమధ్వరాయ ఇత్యస్య వసిష్ఠ ఋషిః, భగో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

సమధ్వరాయోషసో నమ న్త దధిక్రావేవ శుచయే పదాయ ।
అర్వాచీనం వసువిదం భగం నో రథ మివాశ్వా వాజిన ఆ వహన్తు ॥౩౯

సమ్, అధ్వరాయ, ఉషసః, నమన్త, దధిక్రా వేవేతి దధి+క్రావా ఇవ, శుచయే, పదాయ, ఆర్వాచీనమ్, వసు విదమితి వసు+విదమ్, భగమ్, నః, రథ మివేతి రథమ్+ఇవ, అశ్వాః, వాజినః, ఆ, వహన్తు. ॥౩౯॥

పదార్థః—(సమ్)(అధ్వరాయ) అహింసామయాయ వ్యవహారాయ (ఉషసః) ప్రభాతాః (నమన్త) నమన్తి(దధిక్రావేవ)యథా ధారకః క్రమితోఽశ్వస్తథా (శుచయే)పవిత్రాయ (పదాయ) ప్రాపణీయాయ (ఆర్వాచీనమ్) ఇదానీన్తనమ్ (వసువిదమ్) యేన వసూని వివిధాని ధనాని విన్దతి తమ్ (భగమ్)ఐశ్వర్యయుక్తమ్ (నః)అస్మాన్ (రథమివ) రమణీయం యాన మివ(అశ్వాః) ఆశుగామినః (వాజినః)తురంగాః(ఆ)(వహన్తు) గమయన్తు ॥౩౯॥ అన్వయః—హే మనుష్యాః! ఉషసో దధిక్రావేవ శుచయే పదాయాఽధ్వరాయ సన్నమన్త వాజినోఽశ్వా రథమివ నోఽర్వాచీనం వసువిదం భగం ప్రాపయన్తి తథైతా భవన్త ఆ వహన్తు ॥౩౯॥ భావార్థః—అత్ర ద్వావుపమాలఙ్కారౌ—యే మనుష్యా ఉషర్వద్విద్యాధర్మౌ ప్రకాశయన్తి అశ్వయానానీవ సద్యః సమగ్ర మైశ్వర్యం సర్వాన్ ప్రాపయన్తి తే శుచయో విద్వాంసో విజ్ఞేయాః॥౩౯॥

పదార్థము—మానవులారా! ఉషసః = ప్రభాతసమయములు, దధిక్రావేవ = బాగుగాధరించి యతిక్రమించగల గుఱ్ఱమువలె,శుచయే = పవిత్రము, పదాయ = పొందదగినది, అధ్వరాయ = హింసారూపాధర్మరహితమునైన వ్యవహారము నిమిత్తము, సమ్ నమన్త = మంచిగనమ్రములగుచున్నవి, అనగా ప్రాతఃకాలమున సత్వగుణాధిక్యత వలన సమస్తప్రాణుల చిత్తములు శుద్ధములు నమ్రములు నగుచున్నవి, అశ్వాః = శీఘ్రగాములైన, వాజినః = గుఱ్ఱములు, రథ మివ = రమణీయయానమును[వహనమొనర్చునటుల], నః = మాకు, అర్వాచీనమ్ = ఈ సమయమునకు జెందినది, వసువిదమ్ = అనేకవిధములైన ధనప్రాప్తికి హేతువునైన, భగమ్ = ఐశ్వర్యమును లభింపచేయుచున్నవి. అట్టి యీ రెంటిని మీరు, ఆ వహన్తు = బాగుగా నడిపించెదరుగాక! ॥౩౯॥

భావార్థము—ఈ మంత్రమందు రెండుపమాలంకారములున్నవి. ఏ మానవులు ప్రాతఃకాలమువలె విద్యను, ధర్మమును ప్రకాశపఱచుచున్నారో . మఱియు గుఱ్ఱముల యానములవలె శీఘ్రముగ సకలైశ్వర్యముల నందరికి చేకూర్చుచున్నారో, ఆ పవిత్ర విద్వాంసులు తెలిసికొనదగినవారై యున్నారు. ॥౩౯॥ 1832

---

1833 అశ్వావతీరిత్యస్య వసిష్ఠ ఋషిః, ఉషా దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః

విదుష్యః కిం కుర్యు రిత్యాహ. విదుషీమతల్లు లేమి చేయవలయును ?

అశ్వావతీ ర్గోమతీ ర్న ఉషాసో వీరవతీః సద ముచ్ఛన్తు భద్రాః ।
ఘృతం దుహానా విశ్వతః ప్రపీతా యూయం పాత స్వస్తిభిః సదా నః. ॥౪౦॥

అశ్వా వతీః, అశ్వవతీ రిత్యశ్వ+వతీః, గోమతీ రితి గో+మతీః, నః, ఉషాసః, ఉషస ఇత్యుషసః, వీరవతీరితి వీర+వతీః, సదమ్, ఉచ్ఛన్తు, భద్రాః,

ఘృతమ్, దుహానాః, విశ్వతః, ప్రపీతా+ఇతి ప్ర+పీతాః, యూయమ్, పాత, స్వస్తిభిః, సదా, నః. ॥౪౦॥

పదార్థః—(అశ్వావతీః)ప్రశస్తాన్యశ్వాని వ్యాప్తిశీలాన్యుదకాని విద్యన్తే యాసు తాః(గోమతీః)బహవో గావః కిరణా విద్యన్తే యాసు తాః (నః)అస్మాకమ్(ఉషాసః) ప్రభాతాః (వీరవతీః) బహవో వీరాః సన్తి యాసు తాః (సదమ్)సీదన్తి యస్మిన్ స్తత్ (ఉచ్ఛన్తు)వివసన్తు(భద్రాః) భన్దనీయాః కల్యాణకర్యః (ఘృతమ్) శుద్ధం ప్రదీప్తముదకమ్ ఘృతమిత్యుదక నా...నిఘం.౧.౧౨. (దుహానా)ప్రపూర్యన్త్యః (విశ్వతః) సర్వతః (ప్రపీతాః) ప్రకర్షేణ పీతా వృద్ధాః (యూయమ్) (పాత)రక్షత(స్వస్తిభిః) స్వాస్థ్యప్రదైః సుఖైః (సదా) (నః) అస్మాన్ ॥౪౦॥ అన్వయః—హే విదుష్యః స్త్రియో!యథాఽశ్వావతీర్గోమతీర్వీరవతీ ర్భద్రా ఘృతం దుహానా విశ్వతః ప్రపీతా ఉషాసోఽస్మాకం సదం ప్రాప్నువన్తి తథాఽస్మాకం సదం భవన్త్య ఉచ్ఛన్తు నోఽస్మాన్ యూయం స్వస్తిభిః సదా పాత ॥౪౦॥ భావార్థః—అత్ర వాచకలుప్తోపమాలంకారః యథా ప్రభాతవేలా జాగ్రతాం మనుష్యాణాం సౌఖ్యప్రదా భవన్తి తథా విదుష్యః స్త్రియా కుమారీణాం విద్యార్థినీనాం కన్యానాం విద్యాసుశిక్షాసౌభాగ్యం వర్ధయిత్వా సదైతా ఆనన్దయన్తు॥౪౦

పదార్థము—విదుషీమతల్లులారా! ఎటుల, అశ్వావతీః = ప్రశస్తవ్యాప్తి శీలజలములుగలవి, గోమతీః=బహుకరణయుక్తములు, వీరవతీః=అనేక వీరపురుషసంయుక్తములు, భద్రాః=కల్యాణకరములు, ఘృతమ్=శుద్ధజలమును, దుహానాః = పూరించునవి, విశ్వతః=అన్నివైపులనుండి, ప్రపీతాః = అధికముగ నభివృద్ధిజెందినవియునగు, ఉషాసః=ప్రభాతవేళలు మాయొక్క, సదమ్=సభకు లభించుచున్నవో, అనగా ప్రకాశింపజేయుచున్నవో లేక ప్రవృత్తపఱచుచున్నవో, అటులనే మాసభలందు మీరు, ఉచ్ఛన్తు=సమాప్తపఱచుడు, [సమావేశలగుడు.] మఱియు,నః=మమ్ము, యూయమ్=మీరు, స్వస్తిభిః=స్వస్థతనొసగు సుఖములతో,సదా=ఎల్లప్పుడు,పాత=రక్షించుడు.

భావార్థము—ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకార మున్నది. ఎట్లు ప్రాతఃకాలము మేలుకొనియున్న మానవులకు సుఖమునొసగెడిదగుచున్నదో అటులనే విదుషీమణులు విద్యార్థినులగు కుమారీ కన్యలకు విద్యాసుశిక్షా సౌభాగ్యములను అభివృద్ధిపఱచి సదైవ అట్టి యీ కన్యలను ఆనందితలుగ జేయుచుండవలయును.॥౪౦॥1833

---

1834 పూషన్నిత్యస్య సుహోత్ర ఋషిః, పూషా దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.
అథేశ్వరాప్తసేవినః కీదృశా భవన్తీత్యాహ. ఈశ్వరుని ఆప్తజనులను సేవించువారలెటులుందురు?

పూషన్తవ వ్రతే వయం న రిష్యేమ కదా చన । స్తోతారస్త ఇహ స్మసి ॥౪౧॥

పూషన్, తవ, వ్రతే, వయమ్, న, రిష్యేమ, కదా, చన, స్తోతారః, తే, ఇహ, స్మసి. ॥౪౧॥

పదార్థః—(పూషన్)పుష్టికారక ! (తవ) (వ్రతే) శీలే నియమే వా (వయమ్)(న) నిషేధే (రిష్యేమ)(కదా)(చన)కదాచిదపి(స్తోతారః)స్తుతికర్తారః(తే) తవ(ఇహ)(స్మసి)స్మః ॥౪౧॥
అన్వయః—హే పూషన్ పరమేశ్వర ఆప్తవిద్వన్! వా వయం తవ వ్రతే తస్మాద్వర్తేమహి య

తో న కదా చన రిష్యేమ. ఇహ తే స్తోతారః సన్తో వయం సుఖినః స్మసి ॥౪౧॥ భావార్థః— యే మనుష్యాః పరమేశ్వరస్యాప్తస్య వా గుణకర్మ స్వభావానుకూలా వర్తన్తే తే కదా చిన్నష్టసుఖా న జాయన్తే ॥౪౧॥

పదార్థము—పూషన్ = పుష్టికారక పరమేశ్వరా! లేక ఆప్తవిద్వాంసుడా! వయమ్ = మేము, తవ వ్రతే = నీ స్వభావమునందు, లేక నియమమునందు, కదా చన = ఎన్నటికిని, మా చిత్తము, న రిష్యేమ = చలించనీయకుండునటుల వర్తించెదముగాక! ఇహ = ఈ లోకమందు, తే స్తోతారః = నిన్ను స్తుతించువారలమై మేము సుఖవంతులము, స్మసి = అగుచున్నాము. ॥౪౧॥

భావార్థము—ఏ మానవులు పరమేశ్వరుని లేక ఆప్తవిద్వాంసుల గుణకర్మస్వభావముల కనుకూలముగ ప్రవర్తించుచున్నారో వా రెన్నటికిని నష్టసుఖులు కారు.[వారి సుఖము లెన్నటికి నశించవు.] ॥౪౧॥ 1834

---

1835 పథస్పథ ఇత్యస్య ఋజిష్వ ఋషిః, పూషా దేవతా, విరాట్ త్రిష్టుప్ఛన్దః, ధైవత స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల విషయ మయ్యాదియే.

పథస్పథః పరిపతిం వచస్యా కామేన కృతో అభ్యానడర్కమ్ ।

స నో రాసచ్ఛురుధ శ్చన్ద్రాగ్రా ధియం ధియం సీషధాతి ప్ర పూషా॥

పథస్పథః, పథః పథ ఇతి పథః+పథః, పరి పతి మితి పరి+పతిమ్, వచస్యా, కామేన, కృతః, అభి, ఆ నట్, అర్కమ్, సః, నః, రాసత్, శురుధః, చన్ద్రాగ్రా ఇతి చన్ద్ర+అగ్రాః, ధియం ధియ మితి ధియం+ధియమ్, సీషధాతి, సీసధాతీతి సీసధాతి, ప్ర,- పషా. ॥౪౨॥

పదార్థః—(పథస్పథః)మార్గస్య మార్గస్య (పరిపతిమ్)స్వామినమ్(వచస్యా)వచసా వచనేన. అత్ర సుపాం సులుగితి సూత్రేణ విభక్తే ర్యాదేశః(కామేన)(కృతః)నిష్పన్నః (అభి)అభితః(ఆనట్) వ్యాప్నోతి(అర్కమ్)అర్చనీయమ్(సః)(నః)అస్మభ్యమ్(రాసత్) దదాతు(శురుధః)యాః శురుధో దుఃఖాని రున్ధన్తి తాః (చన్ద్రాగ్రాః) చన్ద్రమాహ్లాదన మగ్రం ముఖ్యం యాసా న్తాః (ధియం ధియం)ప్రజ్ఞాం ప్రజ్ఞాం కర్మ కర్మ వా(సీషధాతి)సాధ్నుయాత్ (ప్ర) (పూషా) పుష్టికర్తా ॥౪౨॥ అన్వయః—హే మనుష్యా యో వచస్యా కామేన కృతః పూషా జగదీశ్వర ఆప్తో వా శురుధః చన్ద్రాగ్రాః సాధనాని నో రాసద్ధియం ధియం ప్రసీషధాతి స శుభగుణకర్మస్వభావానభ్యానట్ తమర్కం పథస్పథః పరిపతిం వయం స్తుయామ ॥౪౨॥ భావార్థః—హే మనుష్యా యో జగదీశ్వరః సర్వేషాం సుఖాయ వేదప్రకాశం కామయత ఆప్తోఽధ్యాపయతుమిచ్ఛతి. యౌ సర్వేభ్యః శ్రేష్ఠాం ప్రజ్ఞాం సత్కర్మశిక్షాం చ ప్రదత్తస్తౌ సర్వసన్మార్గస్వామినౌ సదా సత్కర్తవ్యౌ ॥౪౨॥

పదార్థము—మానవులారా! వచస్యా = వచనముతోను, మఱియు, కామేన = కామనతోను, కృతః = సిద్ధుడు, పూషా = పుష్టికర్తయునైన యే జగదీశ్వరుడు, లేక

ఆప్తుడు, శురుధః=శీఘ్రముగా దుఃఖములను నివారించునవి, చన్ద్రాగ్రాః = మొదటి నుండియు నానందకరములునైన సాధనములను,నః=మా నిమిత్తము, రాసత్ =ఒసగునో, ధియమ్ ధియమ్=ప్రతిబుద్ధిని, లేక కర్మను, ప్రపీపధాతి = ప్రకర్షముగా సిద్ధపఱచునో, సః=అతను శుభ గుణకర్మ స్వభావములను, అభి ఆనట్ = అన్నివైపులనుండి వ్యాప్తుడగును, అర్కమ్ = పూజనీయుడు, పథస్పథః = ప్రతిమార్గముయొక్క, పరిపతిమ్=స్వామియునైనయతనిని మేము స్తుతించెదముగాక! ॥౪౨॥

భావార్థము---మానవులారా! ఏ జగదీశ్వరుడు సకలసుఖముల నిమిత్తము వేదములను ప్రకాశించుటకు,ఏ ఆప్తపురుషుడు చదివించుటకు నిచ్చగించునో,ఎవరు సకలప్రజలకు శ్రేష్టమైన బుద్ధిని, ఉత్తమకర్మలను, ఉత్తమ శిక్షను ఒసగుచున్నారో, ఆ సమస్త శ్రేష్ఠమార్గముల స్వాములను సదా సత్కరించవలయును. ॥౪౨॥ 1835

---

1836 త్రీణీత్యస్య మేధాతిథి రృషిః విష్ణుర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథేశ్వర విషయ మాహ. ఈశ్వరుని విషయమిందు చెప్పెను.

త్రీణి పదా విచక్రమే విష్ణు ర్గోపా అదాభ్యః । అతో ధర్మాణి ధారయన్ ॥౪౩॥

త్రీణి, పదా, వి, చక్రమే, విష్ణుః, గోపాః, అదాభ్యః, అతః,
ధర్మాణి, ధారయన్. ॥౪౩॥

పదార్థః—(త్రీణి)(పదా)పదాని జ్ఞాతుం ప్రాపయితుం వా యోగ్యాని కారణసూక్ష్మ స్థూలరూపాణి (వి)(చక్రమే)విక్రామతి(విష్ణుః) వేవేష్టి వ్యాప్నోతి చరాఽచరం జగత్స పరమేశ్వరః (గోపాః)రక్షకః(అదాభ్యః)అహింసకత్వాద్దయాలుః(అతః)అస్మాత్(ధర్మాణి) ధర్మాన్ ధారకాణి పృథివ్యాదీని వా (ధారయన్) ॥౪౩॥ అన్వయః—హే మనుష్యా యోఽదాభ్యో గోపా విష్ణు ర్ధర్మాణి ధారయన్నతస్త్రీణి పదా విచక్రమే స ఏవాఽస్మాకం పూజనీయోఽస్తి భావార్థః—హే మనుష్యా యేన పరమేశ్వరేణ భూమ్యన్తరిక్షసూర్యరూపేణ త్రివిధం జగన్నిర్మితం సర్వం ధ్రియతే) రక్షయతే చ స ఏవోపాసనీయ ఇష్టదేవోఽస్తి ॥౪౩॥

పదార్థము—మానవులారా!అదాభ్యః=అహింసాధర్మముగలవాడగుటచే దయాశీలుడు, గోపాః=రక్షకుడు, విష్ణుః = చరాచర జగత్తునందు వ్యాపించియున్నవాడు నగునే పరమేశ్వరుడు, ధర్మాణి=పుణ్యరూపకర్మలను, లేక ధారకములగు పృథివ్యాదులను, ధారయన్ =ధరించుచు, అతః=ఇందువలన, త్రీణి=మూడు, పదా= తెలిసికొనదగిన లేక పొందదగిన కారణ, సూక్ష్మస్థూల [రూపములోనుండు] జగత్తును, విచక్రమే =ఆక్రమించుచు నున్నాడో, అతడే మనకు పూజనీయుడై యున్నాడు. ॥౪౩॥

భావార్థము—ఓ మానవులారా! ఏ పరమేశ్వరుడు, భూమి, అంతరిక్ష, సూర్యరూపాది త్రివిధ జగత్తులను రచియించి, సమస్తమును ధరించి రక్షించెనో, ఆ పరమేశ్వరుడే ఉపాసనా యోగ్యుడు, ఇష్టదైవమునై యున్నాడు. ॥౪౩॥ 1836

---

1837 తద్విప్రాస ఇత్యస్య మేధాతిథి రృషిః, విష్ణు ర్దేవతా,గాయత్రీ ఛన్దః,షడ్జః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే ఇందు చెప్పెను.

తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమిన్ధతే । విష్ణో ర్యత్పరమం పదమ్.

తత్, విప్రాసః, విపన్యవః, జాగృవాంస ఇతి జాగృ+వాంసః, సమ్, ఇన్ధతే, విష్ణోః, యత్, పరమమ్, పదమ్. ॥౪౪॥

పదార్థః—(తత్)(విప్రాసః)మేధావినో యోగినః (విపన్యవః)విశేషేణ స్తోతుమర్హా ఈశ్వరస్య వా స్తావకాః (జాగృవాంసః)అవిద్యానిద్రాత ఉత్థాయ జాగరూకాః(సమ్)(ఇన్ధతే)ప్రకాశయన్తి(విష్ణోః)సర్వత్రాఽభివ్యాపకస్య (యత్)(పరమమ్)ప్రకృష్టమ్(పదమ్)ప్రాపణీయం మోక్షప్రదం స్వరూపమ్ ॥౪౪॥ అన్వయః—హే మనుష్యా! యే జాగృవాంసో విపన్యవో విప్రాసో విష్ణోర్యత్పరమం పదమస్తి తత్సమిన్ధతే తత్సఙ్గేన యూయ మపి తాదృశా భవత ॥౪౪॥ భావార్థః—యే యోగాభ్యాసాదినా శుద్ధాన్తఃకరణాత్మనో ధార్మికాః పురుషార్థినో జనాః సన్తి త ఏవ వ్యాపకస్య పరమేశ్వరస్య స్వరూపం జ్ఞాతుం లబ్ధుం చార్హన్తి నేతరే ॥౪౪॥

పదార్థము—ఓ మానవులారా! ఎవరు, జాగృవాంసః=అవిద్యారూప నిద్రనుండి లేచినవారు, విపన్యవః=విశేషముగ స్తుతించదగినవారు, లేక ఈశ్వరుని స్తుతించువారు విప్రాసః = బుద్ధిమంతులైన ఏ యోగులు, విష్ణోః=సర్వవ్యాపకుడైన పరమాత్మ యొక్క, యత్ పరమమ్ పదమ్=ఉత్తమమైనది పొందదగినది మోక్షదాయకమునగు నే స్వరూపమున్నదో, తత్ = దానిని, సమ్ ఇన్ధతే = బాగుగా ప్రకాశితమొనర్చు చున్నారో, వారి సత్సంగముచే మీరును అటులనే కండు. ॥౪౪॥

భావార్థము—యోగాభ్యాసాది సత్కర్మలొనర్చి శుద్ధమనస్సు శుద్ధాత్మ గల వారు, ధార్మికులు, పురుషార్థులనగువా రెవరున్నారో, అట్టివారే వ్యాపక పరమేశ్వరుని స్వరూపమును తెలిసికొనుటకు, మరియు నతనిని పొందుటకు యోగ్యులగు చున్నారు. ఇతరులు కాజాలరు. ॥౪౪॥ 1837

---

1838 ఘృతవతీత్యస్య భరద్వాజ ఋషిః, ద్యావాపృథివ్యౌ దేవతే, నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే ఇందు చెప్పెను.

ఘృతవతీ భువనానా మభిశ్రియోర్వీ పృథ్వీ మధుదుఘే సుపేశసా ।
ద్యావా పృథివీ వరుణస్య ధర్మణా విష్కభితే అజరే భూరి రేతసా ॥౪౫॥

ఘృతవతీ ఇతి ఘృత+వతీ, భువనానామ్, అభిశ్రియేత్యభి+శ్రియా, ఉర్వీ ఇత్యుర్వీ, పృథ్వీ ఇతి పృథ్వీ మధుదుఘే+ఇతి మధు+దుఘే, సుపేశసేతి సు+పేశసా, ద్యావా పృథివీ+ఇతి ద్యావా పృథివీ, వరుణస్య, ధర్మణా, విష్కభితే ఇతి వి+స్కభితే, అజరే+ఇత్యజరే, భూరిరేతసేతి భూరి+రేతసా. ॥౪౫॥

పదార్థః—(ఘృతవతీ)ఘృతముదకం బహు విద్యతే యయో స్తే (భువనానామ్) లోకలో కా న్తరాణామ్. (అభిశ్రియా)అభితః సర్వతః శ్రీః శోభా లక్ష్మిర్యాభ్యా స్తే (ఉర్వీ) బహుపదార్థ యు క్తే(పృథ్వీ) వి స్తీర్ణే(మధుదుఘే)యే మధూదకం ప్రపూరయత స్తే(సుపేశసా)శోభనం పేశో రూపం యయో స్తే(ద్యావాపృథివీ)సూర్యభూమీ(వరుణస్య)సర్వేభ్యో వరస్య శ్రేష్ఠస్య జగదీశ్వ రస్య (ధర్మణా) ధారణసామర్థ్యేన (విష్కభితే) విశేషేణ ధృతే దృఢీకృతే (అజరే) స్వస్వరూ పేణ జరానాశరహితే (భూరిరేతసా) భూరి బహు రేత ఉదకం యయోర్వా భూరీణి బహూని రేతాంసి వీర్యాణి యాభ్యా స్తే ॥౪౫॥ అన్వయః—హేమనుష్యా! యస్య వరుణస్య పరమేశ్వ రస్య ధర్మణా మధుదుఘే సుపేశసా పృథ్వీ ఉర్వీ ఘృతవతీ అజరే భూరిరేతసా భువనానా మభిశ్రియా ద్యావాపృథివీ విష్కభితే తమేవోపాస్యం యూయం విజానీత ॥౪౫॥ భావార్థః— మనుష్యైర్యేన పరమేశ్వరేణ ప్రకాశాఽప్రకాశాత్మకం ద్వివిధం జగన్నిర్మాయ ధృత్వా పాల్యతే స ఏవ సర్వదోపాసనీయోఽస్తి. ॥౪౫॥

పదార్థము—ఓ మానవులారా ! వరుణస్య = సర్వశ్రేష్ఠుడైన యే జగదీశ్వరుని యొక్క, ధర్మణా=ధారణరూప సామర్థ్యమువలన, మధుదుఘే=జలమును పరిపూర్ణ పఱచునవి, సుపేశసా = సుందరరూపయుక్తములు, పృథ్వీ = విస్తారయుక్తములు, ఉర్వీ=బహుపదార్థములు గలవి, ఘృతవతీ=అధికజలములుగలవి, అజరే=స్వస్వరూప ములతో నాశరహితములు, భూరిరేతసా = బహుజలయుక్తములు, లేక అనేక వీర్య ములకు, పరాక్రమములకు హేతువులు, భువనానామ్=లోకలోకాంతరములను, అభి శ్రియా=సకలదిశలనుండి శోభింపజేయునవియునగు, ద్యావాపృథ్వీ =రవి ధరణులు, విష్కభితే = విశేషముగ ధరించబడినవో లేక, దృఢపఱచబడియున్నవో, అతడే ఉపా సించ యోగ్యుడని మీరు తెలిసికోనుడు. ॥౪౫॥

భావార్థము—ఏపరమేశ్వరుడు ప్రకాశాప్రకాశ రూప ద్వివిధ జగత్తులను నిర్మించి ధరించి, పాలించుచున్నాడో, ఆ పరమేశ్వరుడే సర్వదా మానవుల కుపాసించదగిన వాడై యున్నాడు. ॥౪౫॥ 1838

---

1839 యేన ఇత్యస్య విహవ్య ఋషిః, లిఙ్గోక్తా దేవతాః, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ రాజధర్మ విషయ మాహ. రాజధర్మ విషయము.

యే నః సపత్నా అప తే భవ న్త్వింద్రాగ్నిభ్యా మవ బాధామహే తాన్ ।
వసవో రుద్రా ఆదిత్యా ఉపరిస్పృశం మోగ్రం చేత్తార మధిరాజ మక్రన్॥

యే, నః, సపత్నా ఇతి స+పత్నాః, అప, తే, భవన్తు, ఇన్ద్రాగ్నిభ్యామితీ న్ద్రాగ్ని+భ్యామ్, అవ, బాధామహే, తాన్, వసవః, రుద్రాః, ఆదిత్యాః, ఉపరి స్పృశ మిత్యు పరి+స్పృశమ్, మా, ఉగ్రమ్, చేత్తారమ్, అధిరాజమిత్యధి +రాజమ్, అక్రన్. ॥౪౬॥

పదార్థః—(యే)(నః)అస్మాకమ్ (సపత్నాః)శత్రవః (అప)దూరీకరణే(తే)(భవన్తు)(ఇన్ద్రాగ్నిభ్యామ్) వాయువిద్యుదస్త్రాభ్యామ్ (అవ) (బాధామహే) (తాన్) (వసవః) పృథివ్యాదయః (రుద్రాః)దశ ప్రాణా ఏకాదశ ఆత్మా చ(ఆదిత్యాః) సంవత్సరస్య మాసాః(ఉపరిస్పృశమ్) య ఉపరి స్పృశతి తమ్ (మా)మామ్ (ఉగ్రమ్) తీవ్రస్వభావమ్(చేత్తారమ్)సత్యాఽసత్యయోర్యథావద్విజ్ఞాతారమ్ (అధిరాజమ్)సర్వేషాముపరి రాజానమ్ (అక్రన్) కుర్వన్తు ॥౪౬॥ అన్వయః—హే మనుష్యా! యే నః సపత్నాః స్యుస్తేఽపభవన్తు యథా తాన్వయమిన్ద్రాగ్నిభ్యామవబాధామహే యథా చ వసవో రుద్రా ఆదిత్యా ఉపరిస్పృశ ముగ్రం చేత్తారం మా మామధిరాజమక్రన్ తథా తాన్ యూయం నివారయత మాం చ సత్కురుత ॥౪౬॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యస్యాఽధికారే పృథివ్యాదయః పదార్థాః స్యుస్స ఏవ సర్వేషాముపరి రాజా స్యాత్ యో రాజా భవేత్స శస్త్రాస్త్రైః శత్రూన్నివార్య నిష్కణ్టకం రాజ్యం కుర్యాత్ ॥౪౬॥

పదార్థము—మానవులారా ! యే నః సపత్నాః = మాయొక్క యే శత్రువులున్నారో, తే=వారు, అప భవన్తు = దూరమగుదురుగాక ! అనగా పరాజయమును పొందుదురుగాక! ఎటుల, తాన్ =ఆ శత్రువులను మేము, ఇన్ద్రాగ్నిభ్యామ్= వాయు విద్యుత్తులచే,నిర్మితములైన శస్త్రములతో,అవ బాధామహే=పీడింపచేయుదుమో,మఱియు నెటుల, వసవః=పృథివ్యాదివసువులు, రుద్రాః=పదిప్రాణములు, ౧౧ వది ఆత్మ, ఆదిత్యాః=౧౨ మాసములు, ఉపరిస్పృశమ్ = ఉచ్చస్థానమందు కూర్చుండువాడను, ఉగ్రమ్ = తీవ్రస్వభావముగలవాడను, చేత్తారమ్ = సత్యాసత్యములను యథావిధిగా తెలిసికొనువాడనునగు, మా=నన్ను, అధిరాజమ్=సమర్థునిగను, అధిపతిగను,స్వామిగను, అక్రన్ = చేయునో ఆటులనే, ఆ శత్రువులను మీరు నివారించి, నన్ను సత్కరించుడు. ॥౪౬॥

భావార్థము—ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకార మున్నది. ఎవని యొక్క అధికారమున పృథివ్యాది పదార్థములుండునో, అతడే సమస్తమునకు రాజగును. ఎవడు రాజగునో అతడు శస్త్రాస్త్రములతో శత్రువులను నివారించి రాజ్యమును నిష్కంటక మొనర్చవలెను. ॥౪౬॥ 1839

1840 ఆ నాసత్యేత్యస్య హిరణ్యస్తూప ఋషిః, అశ్వినౌ దేవతే, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ కే జగద్ధితైషిణ ఇత్యాహ.

ఎవరు జగత్తునకు మేలు కలుగ జేయుదురు ?

ఆ నాసత్యా త్రిభి రేకాదశై రిహ దేవేభి ర్యాతం మధుపేయ మశ్వినా ।
ప్రాయు స్తారిష్టం నీరపాꣳసి మృక్షతꣳ సేధతన్ద్వేషో భవతꣳ సచాభువా.

ఆ, నాసత్యా, త్రిభిరితి త్రి+భిః, ఏకాదశైః, ఇహ, దేవేభిః, యాతమ్, మధుపేయమితి మధు+పేయమ్, అశ్వినా, ప్ర, ఆయుః,తారిష్టమ్, నిః, రపాꣳసి, మృక్షతమ్, సేధతమ్, ద్వేషః, భవతమ్, సచాభువేతి సచా+భువా. ॥౪౭॥

పదార్థః—(అ)సమన్తాత్ (నాసత్యా)అవిద్యమానాఽసత్యాచరణౌ(త్రిభిః) (ఏకాదశైః) త్రయస్త్రింశతా ఇహ(దేవేభిః)దివ్యైః పృథివ్యాదిభిః సహ(యాతమ్)ప్రాప్నుతమ్(మధుపేయమ్) మధురైర్గుణైర్యుక్తం పాతుం యోగ్యమ్(అశ్వినా)విద్వాంసౌ రాజప్రజాజనౌ (ప్ర) (ఆయుః) జీవనమ్(తారిష్టమ్)వర్ధయతమ్(నిః)నితరామ్(రపాంసి)పాపాని (మృక్షతమ్)మార్జయతమ్ (సేధతమ్)గమయతమ్(ద్వేషః) ద్వేషాదిదోషయుక్తాన్ ప్రాణినః (భవతమ్)(సచాభువా) యౌ సత్యేన పురుషార్థేన సహ భవత స్తౌ. ॥౪౭॥ అన్వయః—హే నాసత్యాఽశ్వినా ! యథా యువామిహ త్రిభిరేకాదశైర్దేవేభిః సహ మధుపేయ మాయాతం రపాంసి మృక్షతం ద్వేషో నిఃషేధతం సచాభువా భవత మాయుః ప్రతారిష్టం తథా వయమపి భవేమ. ॥౪౭॥ భావార్థః—త ఏవ జగద్ధితైషిణో యే పృథివ్యాది సృష్టివిద్యాం విజ్ఞాయాఽన్యాన్ గ్రాహయేయు ర్దోషాన్ దూరీకుర్యుశ్చిరంజీవనస్య విధానం చ ప్రచారయేయుః. ॥౪౭॥

పదార్థము—నాసత్యా = అసత్యాచరణ రహితులైన, అశ్వినా = రాజప్రజలారా! విద్వాంసులారా! ఎట్లు మీ రిరువురు, ఇహ = ఈ లోకమందు, త్రిభిః ఏకాదశైః = ౩౩ ముప్పదిమూడు, దేవేభిః = ఉత్తమపృథివ్యాది (అష్టవసువులు, ప్రాణాది ౧౧ రుద్రులు, ౧౨ మాసములు, విద్యుత్తు, యజ్ఞము,) ౩౩ దేవతలతో, మధుపేయమ్ = గుణయుక్తము త్రాగదగినదియునగు ఓషధుల రసమును, ఆ యాతమ్ = బాగుగా పొందుదురో, లేక దానినిమిత్తము వచ్చుచుందురో, రపాంసి = పాపములను, మృక్షతమ్ = శుద్ధమొనర్చుచుందురో, ద్వేషః = ద్వేషాదిదోషయుక్త ప్రాణులును, నిః షేధతమ్ = ఖండించుదురో, లేక నివారించుదురో, సచాభువా = సత్యమైన పురుషార్థముతో కార్యములందు సంయుక్తులు, భవతమ్ = అగుదురో, మఱియు, ఆయుః = జీవనమును, ప్ర తారిష్టమ్ = బాగుగా పెంపొందచేయుదురో, అటులనే మేము నగుదుము గాక. ॥౪౭॥

భావార్థము—ఎవరు పృథివ్యాది సృష్టి విద్యను దెలిసికొని, ఇతరులకు తెలియచేయుదురో, దోషములను దూరమొనర్చెదరో, అధికకాలము జీవించు విధానమును ప్రచారమొనర్చుచుందురో, వారే జగద్ధితైషులు కాగలుగుదురు. ॥౪౭॥ 1840

---

1841 ఏష వ ఇత్యస్యాగస్త్య ఋషిః, మరుతో దేవతాః, పంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యు రిత్యాహ. మరల మానవు లేమి చేయవలయును ?

ఏష వః స్తోమో మరుత ఇయఙ్గీ ర్మాన్దార్యస్య మాన్యస్య కారోః ।
ఏషా యాసీష్ట తన్వే వయాం విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥౪౮॥

ఏషః, వః, స్తోమః, మరుతః, ఇయమ్, గీః, మాన్దార్యస్య, మాన్యస్య, కారోః, ఆ, ఇషా, యాసీష్ట, తన్వే, వయామ్, విద్యామ, ఇషమ్, వృజనమ్, జీరదానుమితి జీర + దానుమ్. ॥౪౮॥

పదార్థః—(ఏషః)(వః)యుష్మభ్యమ్(స్తోమః)ప్రశంసా(మరుతః) మరణధర్మాణో మనుష్యాః (ఇయమ్)(గీః)సుశిక్షితా వాక్(మాన్దార్యస్య)ప్రశస్తకారుకస్య శిల్పినః (అ)(ఇషా) ఇచ్ఛయాఽ

న్నేన వా నిమిత్తేన(యాసీష్ట)ప్రాప్నుయాత్ (తన్వే)శరీరాదిరక్షణార్థమ్ (వయామ్) వయసామ వస్థావతాం ప్రాణినామ్.అత్రాఽఽమి టిలోప శ్ఛాన్దసః (విద్యామ)లభేమహి (ఇషమ్)విజ్ఞాన మన్నం వా(వృజనమ్)వర్జన్తి దుఃఖాని యేన తద్బలమ్(జీరదానుమ్)జీవయతీతి జీరదానుస్తమ్.
అన్వయః—హే మరుతో మనుష్యా!మాన్దార్యస్య మాన్యస్య కారో రేష స్తోమ ఇయం చ గీర్వో ఽస్తు యూయమిషా వయాం తన్వే ఆజీరదాను మిషం వృజనం చ విద్యామ.॥౪౮॥ భావార్థః—మనుష్యై స్సదైవ ప్రశంసనీయాని కర్మాణి సేవిత్వా, శిల్పవిద్యా విదః సత్కృత్య జీవనం బల మైశ్వర్యం చ ప్రాప్తవ్యమ్. ॥౪౮॥

పదార్థము—మరుతః=మరణధర్మముగల మానవులారా! మాన్దార్యస్య=ప్రశస్త కర్మల సేవకుడు, ఉదారచిత్తముగలవాడు, మాన్యస్య=సత్కరించదగినవాడు,కారోః =పురుషార్థియునైన శిల్పియొక్క, ఏషః స్తోమః=ఈ ప్రశంస, మఱియు,ఇయమ్ గీః =ఈ వాణి, వః=మీ కొఱకు ఉపయోగకరమగును గాక ! మీరు, ఇషా=ఇచ్ఛతో, లేక అన్న నిమిత్తముతో, వయామ్=ఆయువుగల ప్రాణులయొక్క, తన్వే = శరీరా దుల రక్షణకై, ఆ యాసీష్ట=బాగుగా ప్రాప్తమగుచుండుడు. మఱియు మేము, జీర దానుమ్=జీవనమునకు హేతువైన, ఇషమ్=విజ్ఞానమును, లేక అన్నమును, వృజనమ్ =దుఃఖములను వర్జించు బలమును, విద్యామ=పొందెదము గాక ! ॥౪౮॥

భావార్థము—మానవులు సదా ప్రశంసనీయ కర్మలను సేవించియు, శిల్పవిద్యా విద్వాంసులను సత్కరించియు, జీవనమును బలమును, ఐశ్వర్యమును బడయవలెను.

---

సహస్తోమా ఇత్యస్య ప్రాజాపత్యో యజ్ఞ ఋషః, ఋషయో దేవతాః, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః
అథ కే ఋషయో భవన్తీత్యాహ. ఎవరు ఋషు లగుచున్నారు ?

సహస్తోమాః సహఛన్దసఽ ఆవృతః సహ ప్రమా ఋషయః సప్త దైవ్యాః ।
పూర్వేషాం పన్థా మనుదృశ్య ధీరాఽ అన్వాలేభిరే రథ్యో న రశ్మీన్. ॥౪౯॥

సహస్తోమా+ఇతి సహ+స్తోమాః, సహఛన్దస ఇతి సహ+ఛన్దసః,
ఆవృత ఇత్యా+వృతః సహ ప్రమా ఇతి సహ+ప్రమాః, ఋషయః, సప్త,
దైవ్యాః, పూర్వేషామ్, పన్థామ్, అను దృశ్యేత్యను+దృశ్య, ధీరాః, అన్వాలే
భిర+ఇత్యను+ఆలేభిరే, రథ్యః, న, రశ్మీన్. ॥౪౯॥

పదార్థః—(సహస్తోమాః)స్తోమైః శ్లాఘాభి స్సహ వర్తమానా యద్వా సహస్తోమాః శాస్త్ర స్తుతయో యేషాన్తే(సహఛన్దసః)సహ ఛన్దాంసి వేదాఽధ్యయనం స్వాతన్త్ర్యం సుఖభోగో వా యేషాన్తే(ఆవృతః) బ్రహ్మచర్యేణ సకలా విద్యా అధీత్య గురుకులాన్నివృత్య గృహమాగతాః (సహప్రమాః)సహైవ ప్రమా యథార్థం ప్రజ్ఞానం యేషాన్తే (ఋషయః) వేదాదిశాస్త్రార్థవిదః (సప్త) పంచజ్ఞానేన్ద్రియాణ్యన్తః కరణమాత్మా చ (దైవ్యాః) దేవేషు గుణకర్మస్వభావేషు కుశలాః(పూర్వేషామ్)అతీతానాం విదుషామ్ (పన్థామ్)పన్థానం మార్గమ్ (అనుదృశ్య) అనుకూ

శ్యేన దృష్ట్వా(ధీరాః)ధ్యానవన్తో యోగినః (అన్వాలేభిరే) అనులభన్తే (రథ్యః) రథే సాధూ రథ్యాః పారథిః(న)ఇవ(రశ్మిన్)రజ్జూన్. ॥౪౯॥ అన్వయః—హే మనుష్యా! యథా సహస్తోమాః సహ ఛన్దస ఆవృతః సహప్రమాః సప్త దైవ్యా ధీరా ఋషయో రథ్యో రశ్మిన్నేవ పూర్వేషాం పన్థాన మనుదృశ్యాన్వాలేభిరే తథా భూత్వా యూయ మప్యాప్తమార్గ మన్వాలభధ్వమ్. ॥౪౯॥ భావార్థః—అత్రోపమావాచక లుప్తోమాలంకారౌ. యే రాగద్వేషాదిదోషాన్ దూరతస్త్యక్త్వా పరస్పరస్మిన్ ప్రీతిమన్తో భూత్వా బ్రహ్మచర్యేణ ధర్మానుష్ఠానపురఃసర మఖిలాన్ వేదాన్ విజ్ఞాయ సత్యాఽసత్యే వివిచ్య సత్యం లబ్ధ్వాఽసత్యం విహాయాప్తభావేన వర్తన్తే తే సుశిక్షితాః సారథయ ఇవాఽభీష్టం ధర్మ్యం మార్గం గన్తుమర్హన్తి త ఏవర్షిసంజ్ఞాం లభన్తే. ॥౪౯॥

పదార్థము—మానవులారా ! ఎట్లు, సహస్తోమాః = ప్రశంసలతో గూడినవారు, లేక సమాన శాస్త్రస్తుతులు గలవారు, సహఛన్దసః = వేదాదుల అధ్యయనము లేక స్వాతంత్ర్యము, సుఖభోగము సమానముగ గలవారు, ఆవృతః = బ్రహ్మచర్యముతో సమస్తవిద్యలను చదివి, గురుకులమునుండి తిరిగి ఇంటికివచ్చినవారు, సహ ప్రమాః = ఇంతేగాక ప్రమాణాది యథార్థ జ్ఞానముగలవారు, సప్త = పంచజ్ఞానేంద్రియములు అంతఃకరణము, ఆత్మ ఇవి యేడు, దైవ్యాః=ఉత్తమగుణకర్మ స్వభావములలో ప్రవీణులు, ధీరాః=ధ్యానముగల యోగులు, ఋషయః=వేదాది శాస్త్రముల నెఱింగిన వారు, రథ్యః న రశ్మిన్ =సారథి కళ్లెపు త్రాళ్లను పట్టుకొనుచున్నటుల, పూర్వేషామ్ =పూర్వ విద్వాంసులయొక్క,పన్థామ్=మార్గమును, అను దృశ్య అన్వాలేభిరే=అనుకూలముగచూచిన యనంతరము పొందు[అనుసరించు]చున్నారో, మీరును నటులనే యై అప్తుల మార్గమును పొందు[అనుసరించు]డు. ॥౪౯॥

భావార్థము—ఈ మంత్రమందు ఉపమ వాచక లుప్తోపమాలంకారములున్నవి. ఎవరు రాగద్వేషాది దోషములను దూరముగ త్యజించి పరస్పరము ప్రీతి నుంచువారై యుందురో, బ్రహ్మచర్యముతో ధర్మానుష్ఠాన పూర్వకముగా సకల వేదములను దెలిసికొని సత్యాసత్యముల నిశ్చయించి సత్యమును పొందుదురో,అసత్యమును త్యజించి ఆప్తుల భావముతో వర్తించుదురో, వారు సుశిక్షిత సారథులవలె నభీష్టమైన ధర్మయుక్త మార్గమున పురోగమించుటకు సమర్థులగుచున్నారు. మఱియు వారే ఋషిసంజ్ఞను పొందగలుగుచున్నారు. ॥౪౯॥ 1842

---

1843 ఆయుష్యమిత్యస్య దక్ష ఋషిః, హిరణ్యన్తేజో దేవతా, భురిగుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

ఐశ్వర్యము, జయము మొదలగు వానిని సంపాదించు విషయము.

ఆయుష్యం వర్చస్యంఀ రాయస్పోష మౌద్భిదమ్ ।
ఇదఀ హిరణ్యం వర్చస్వజ్జైత్రాయా విశతాదు మామ్ ॥౫౦॥

ఆయుష్యమ్, వర్చస్యమ్, రాయః, పోషమ్, ఔద్భిదమ్, ఇదమ్, హిరణ్యమ్, వర్చస్వత్, జైత్రాయ, ఆ, విశతాత్, ఉఀ ఇత్యూఀ, మామ్. ॥౫౦॥

పదార్థః—(ఆయుష్యమ్)ఆయుషే జీవనాయ హితమ్ (వర్చస్యమ్) వర్చసేఽధ్యయనాయ హితమ్(రాయః)(పోషమ్)ధనస్య పోషకమ్(ఔద్భిదమ్)ఉద్భిన్తి దుఃఖాని యేన తదేవ (ఇదమ్) (హిరణ్యమ్) తేజోమయం సువర్ణాదికమ్ (వర్చస్వత్) ప్రశస్తాని వర్చాంస్యన్నాని యస్మాత్తత్ (జైత్రాయ)జయాయ(ఆ)(విశతాత్)సమన్తాత్ విశతు తిష్ఠతు(ఉ)ఏవ(మామ్)॥౫౦॥ అన్వయః—హే మనుష్యా! యదౌద్భిదమాయుష్యం వర్చస్యం రాయస్పోషం వర్చస్వద్ధిరణ్యం జైత్రాయ మామావిశతాత్తదు యుష్మానప్యావిశత్. ॥౫౦॥ భావార్థః—యే మనుష్యాః! స్వాత్మవత్సర్వాన్ జానన్తి విద్వద్భిః సహ పరామృశ్య సత్యాఽసత్యే నిర్ణయన్తి తే దీర్ఘమాయుః పూర్ణ విద్యా సమగ్రమైశ్వర్యవిజయం చ ప్రాప్నువన్తి. ॥౫౦॥

పదార్థము—మానవులారా! ఔద్భితమ్=దుఃఖనాశకము, ఆయుష్యమ్ = జీవనమునకు హితకరము, వర్చస్యమ్=అధ్యయనమున కుపయోగకరము, రాయః పోషమ్ =ధనమును పుష్టిపఱచునది,వర్చస్వత్=ప్రశస్తములైన అన్నముల హేతువు, [ఇదమ్] హిరణ్యమ్=తేజస్స్వరూపమునగు నీ సువర్ణాద్యైశ్వర్యము,జైత్రాయ=జయము కలుగుటకై, మామ్=నన్ను, ఆ విశతాత్ = ఆవేశపఱచునో, అనగా నాదగ్గఱ స్థిరముగ నుండునో అది మీదగ్గఱకూడ స్థిరముగా నుండుగాక! ॥౫౦॥

భావార్థము—ఏ మానవులు, తమవలె నందఱిని తలచెదరో, విద్వాంసులతో, విచారించి సత్యాసత్యములను నిర్ణయించుదురో, వారు దీర్ఘాయువును, సమస్త విద్యలను, సమగ్రైశ్వర్యమును, విజయమును పొందుదురు. ॥౫౦॥ 1843

---

1844 న తదిత్యస్య దక్ష ఋషిః, హిరణ్యన్తేజో దేవతా, భురిక్ ఛక్వరీ ఛన్దః, ధైవతః స్వరః.

అథ బ్రహ్మచర్యప్రశంసా విషయ మాహ. బ్రహ్మచర్య ప్రశంస విషయము.

న తద్రక్షాꣳసి న పిశాచాస్తరన్తి దేవానామోజః ప్రథమజꣳ హ్యేతత్।
యో బిభర్తి దాక్షాయణꣳహిరణ్యꣳ స దేవేషు కృణుతే దీర్ఘ మాయుః
స మనుష్యేషు కృణుతే దీర్ఘ మాయుః॥ ॥౫౧॥

న, తత్, రక్షాꣳసి, న, పిశాచాః, తరన్తి, దేవానామ్, ఓజః, ప్రథమజమితి ప్రథమ+జమ్, హి, ఏతత్, యః, బిభర్తి, దాక్షాయణమ్, హిరణ్యమ్, సః, దేవేషు, కృణుతే, దీర్ఘమ్, ఆయుః,సః,మనుష్యేషు,కృణుతే,దీర్ఘమ్, ఆయుః॥

పదార్థః—(న) (తత్)అధ్యయనం విద్యాప్రాపణమ్(రక్షాంసి)అన్యాన్ ప్రపీడ్య స్వాత్మానమేవ యే రక్షన్తి తే (పిశాచాః) యే ప్రాణినాం పేశితం రుధిరాదిమాచామన్తి భక్షయన్తి తే హింసకా మ్లేచ్ఛాచారిణో దుష్టాః(తరన్తి)ఉల్లంఘన్తే(దేవానామ్)విదుషామ్(ఓజః)బలపరాక్రమః (ప్రథమజమ్)ప్రథమే వయసి బ్రహ్మచర్యాశ్రమే వా జాతమ్(హి)ఖలు(ఏతత్) (యః) (బిభర్తి) (దాక్షాయణమ్)దక్షేణ చతురేణాఽయనం ప్రాపణీయం తదేవ స్వార్థేఽణ్ (హిరణ్యమ్)జ్యోతిర్మయమ్ (సః) (దేవేషు) విద్వత్సు(కృణుతే)(దీర్ఘమ్) అమృయమానమ్(ఆయుః)జీవనమ్(సః)(మను

ష్యేషు)మననశీలేషు(కృణుతే)కరోతి(దీర్ఘమ్)(ఆయుః) ॥౫౧॥ అన్వయః—హే మనుష్యా! యద్దే వానాం ప్రథమజ మోజో౽స్తి న తద్రక్షాంసి న పిశాచా స్తరన్తి యో హ్యేతద్దాక్షాయణం హిరణ్యం బిభర్తి స దేవేషు దీర్ఘమాయుః కృణుతే స మనుష్యేషు దీర్ఘమాయుః కృణుతే. భావార్థః యే ప్రథమే వయసి దీర్ఘేణ ధర్మ్యేణ బ్రహ్మచర్యేణ పూర్ణాం విద్యామధీయతే న తేషాం కేచిచ్చోరా న దాయభాగినో న తేషాం భారోభవతి య ఏవం విద్వాంసో ధర్మ్యేణ వర్తన్తే తే విద్వత్సు మనుష్యేషు చ దీర్ఘమాయు ర్లబ్ధ్వా సతతమానన్దన్త్యన్యా నానన్దయన్తి చ. ॥౫౧॥

పదార్థము—మానవులారా! దేవానామ్=విద్వాంసులయొక్క, ప్రథమజమ్= ప్రథమావస్థయందు, లేక బ్రహ్మచర్యాశ్రమమునం దుత్పన్నమైన, ఓజః = ఏబలము పరాక్రమము ఉన్నదో, తత్ = దానిని, న రక్షాంసి = ఇతరులకు విశేషముగ పీడను కలిగించి స్వరక్షనే యొనర్చుకొనువారు, న పిశాచాః=ప్రాణులయొక్క రుధిరాదు లను త్రాగు హింసకులు, మ్లేచ్ఛాచారులు, దుష్టులు, తరంతి = ఉల్లంఘించజాలరు, యః=ఏ మానవుడు,ఏతత్ దాక్షాయణమ్=దక్షుడైన కార్యచతురునిచే, పొందదగినది, హిరణ్యమ్=తేజస్వరూపమునైన ఈ బ్రహ్మచర్యమును, బిభర్తి =ధరించుచున్నాడో, లేక పోషించుచున్నాడో, సః=అతడు, దేవేషు=విద్వాంసులలో దీర్ఘమ్, ఆయుః= దీర్ఘాయువును, కృణుతే=పొందుచున్నాడు, మఱియు, సః=అతడు, మనుష్యేషు= మననశీల మానవులలో, దీర్ఘమ్ ఆయుః=దీర్ఘాయువును, కృణుతే=పొందుచున్నాడు.

భావార్థము—ఎవరు మొదటి వయస్సులో ధర్మయుక్తమైన దీర్ఘ బ్రహ్మచర్యము తో పూర్ణవిద్యను అభ్యసించుచున్నారో, అట్టివారికి దొంగలు, దాయభాగులు ఉండరు, వారికి భారమునుగాదు,ఏ విద్వాంసు లీవిధముగ ధర్మయుక్త కర్మలతో వర్తించుదురో, అట్టివారు విద్వాంసులలోను, మానవులలోను మిగుల గొప్ప ఆయువును పొంది నిరం తరము ఆనందించెదరు, ఇతరుల నానందింప చేయుదురు కూడ. ॥౫౧॥1844

---

1845 యదేత్యస్య దక్ష ఋషిః, హిరణ్యన్తేజో దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే చెప్పబడినది.

యదాబధ్నన్దాక్షాయణా హిరణ్యꣳ శతానీకాయ సుమనస్యమానాః ।
తన్మ ఆ బధ్నామి శతశారదా యాయుష్మాఞ్జరదష్టి ర్యథాసమ్ ॥౫౨॥

యత్, ఆ, అబధ్నన్, దాక్షాయణాః, హిరణ్యమ్, శతానీకాయేతి శత+ అనీకాయ, సుమనస్యమానా ఇతి సు+మనస్యమానాః, తత్, మే, ఆ, బధ్నామి, శతశారదాయేతి శత+శారదాయ, ఆయుష్మాన్, జరదష్టి రితి జరత్+అష్టిః, యథా, అసమ్. ॥౫౨॥

పదార్థః—(యత్) (ఆ) (అబధ్నన్) బధ్నీయుః (దాక్షాయణాః) చాతుర్య్యవిజ్ఞానయుక్తాః (హిరణ్యమ్) సత్యాసత్యప్రకాశం విజ్ఞానమ్ (శతానీకాయ) శతాన్యనీకాని సైనికాని యస్య తస్మై (సుమనస్యమానాః) సుష్టువిచారయన్తః సజ్జనాః (తత్) (మే)మహ్యమ్ (ఆ) (బధ్నామి) (శతశారదాయ)శతం శరదో జీవనాయ(యుష్మాన్) (జరదష్టిః) జరం పూర్ణమాయుర్వ్యాప్తో యః సః (యథా)(అసమ్)భవేయమ్ ॥౫౨॥ అన్వయః—యే దాక్షాయణాః సుమనస్యమానాః శతానీకాయ మే యద్ధిరణ్యమాఽఽబధ్నం తదహం శతశారదాయాఽఽబధ్నామి. హే విద్వాంసో! యథాఽహం యుష్మాన్ ప్రాప్య జరదష్టి రసం తథా యూయం మాం ప్రత్యుప దిశత ॥౫౨॥ భావార్థః—ఏకత్ర శతశః సేనా ఏకాత్రైకా విద్యా విజయప్రదా భవతి యే దీర్ఘేణ బ్రహ్మచర్యేణ విద్వద్భ్యో విద్యాం సుశిక్షాం చ గృహీత్వా తదనుకులా వర్తన్తే తేఽల్పాఽఽయుషః కదాచిన్న జాయన్తే ॥౫౨॥

పదార్థము—దాక్షాయణాః=చాతుర్య విజ్ఞానయుక్తులు, సుమనస్య మానాః= బాగుగా విచారించువారునగు నే సజ్జనులు,శతానీకాయ=వందలకొలది సైనికులుగల, మే=నాకొఱకు,యత్ హిరణ్యమ్=సత్యాసత్యములను తెలియజేయు నే విజ్ఞానమును, ఆ అబధ్నన్=నిబద్ధమొనర్చుదురో,తత్=దానిని నేను,శతశారదాయ = నూరువత్సరములు జీవించుటకై ఆ బధ్నామి = నియతమొనర్చుకొనుచున్నాను. ఓ విద్వాంసులారా! నేను, యుష్మాన్=మిమ్ము పొంది,జరదష్టిః=దీర్ఘాయువును పొందువాడను, అసమ్=కాగలుగునటుల మీరు నాకుపదేశించుడు. ॥౫౨॥

భావార్థము—ఒకవైపున వందలకొలది సైనికులున్నను, విద్యయే రెండవ పక్షమునకు జయము చేకూర్చగలదగుచున్నది. ఎవరు చాలకాలమువరకు బ్రహ్మచర్యమును ధరించి, విద్వాంసులవలన విద్యను, సుశిక్షను గ్రహించి తదనుకూలముగా వర్తించుదురో, వారెన్నటికి అల్పాయుష్కులు కాజాలరు. ॥౫౨॥ 1845

---

1846 ఉత న ఇత్యస్య ఋజిష్వ ఋషిః, లిఙ్గోక్తా దేవతాః, భురిక్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.
అథ కే సర్వరక్షకాః సన్తీత్యాహ. సర్వరక్షకు లెవరు ?

ఉత నోఽహి ర్బుధ్న్యః శృణోత్వజ ఏకపా త్పృథివీ సముద్రః ।
విశ్వే దేవా ఋతావృధో హువానాః స్తుతా మన్త్రాః కవిశస్తా అవన్తు ॥౫౩॥

ఉత, నః, అహిః, బుధ్న్యః,శృణోతు, అజః, ఏకపాదిత్యేక+పాత్, పృథివీ, సముద్రః, విశ్వే, దేవాః, ఋతావృధః, ఋతవృధ+ఇత్యృత+వృధః, హువానాః, స్తుతాః, మన్త్రాః, కవిశస్తా ఇతి కవి+శస్తాః, అవన్తు. ॥౫౩॥

పదార్థః—(ఉత)అపి(నః)అస్మాకం వచాంసి(అహిః) మేఘః (బుధ్న్యః) బుధ్న్యేఽన్తరిక్షే భవః(శృణోతు)(అజః)యో న జాయతే సః(ఏకపాత్) ఏకః పాదో బోధో యస్య సః (పృథివీ) (సముద్రః)అన్తరిక్షమ్(విశ్వే)సర్వే(దేవాః) విద్వాంసః (ఋతావృధః) సత్యస్య వర్ధకాః (హువానాః)స్పర్ధమానాః(స్తుతాః)స్తుతిప్రకాశకాః(మన్త్రాః)విచారసాధకాః(కవిశస్తాః) కవిభిర్మేధావిభిః

శస్తాః ప్రశంసితాః(అవన్తు)॥౫౩॥ అన్వయః—హే మనుష్యాః! బుధ్న్యోఽహిరివ పృథివీ సముద్రశ్చైవైకపాదజో నః శృణోతు ఋతావృధో హువానా విశ్వే దేవా ఉతాపి కవిశస్తాః స్తుతా మన్త్రా నోఽస్మానవన్తు ॥౫౩॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే మనుష్యా! యథా పృథివ్యాదయః పదార్థా మేఘః పరమేశ్వరశ్చ సర్వాన్ రక్షన్తి తథైవ విద్యా విద్వాంసశ్చ సర్వాన్ పాలయన్తి. ॥౫౩॥

పదార్థము—ఓ మానవులారా! బుధ్న్యః = అంతరిక్షమున జనించు, అహిః = మేఘమువలెను,పృథివీ = భూమివలెను, సముద్రః = అంతరిక్షమువలెను,ఏకపాత్ = ఒకే విధమైన నిశ్చలమైన అవ్యభిచారియైన జ్ఞానముగలవాడు, అజః = ఎప్పుడు పుట్టనివాడునైన పరమాత్మ, నః = మా వాక్కులను, శ్రుణోతు = వినునుగాక ! మఱియు ఋతావృధః = సత్యము నభివృద్ధిపఱచువారు,హువానాః = స్పర్ధించువారునగు,విశ్వేదేవాః = సమస్త విద్వాంసులు, ఉత = మఱియు, కవిశస్తాః = బుద్ధిమంతులచే ప్రశంసించబడినవి, స్తుతాః = స్తుతిని ప్రకాశింపజేయునవి, మన్త్రాః = విచారసాధకములునగు మంత్రములు మమ్ము,అవన్తు = రక్షించును గాక ! ॥౫౩॥

భావార్థము—ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకార మున్నది. మానవులారా!ఎట్లు పృథివ్యాది పదార్థములు, మేఘము,పరమేశ్వరుడు సమస్తమును రక్షించుచున్నారో, అటులనే విద్య, విద్వాంసులు సమస్తమును పాలించుచున్నారు. ॥౫౩॥

---

1847 ఇమేత్యస్య కూర్మగార్త్స్నమద ఋషిః, ఆదిత్యా దేవతాః, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ వాగ్విషయ మాహ. ఇందు వాక్కు విషయము చెప్పెను.

ఇమా గిర ఆదిత్యేభ్యో ఘృతస్నూః సనాద్రాజభ్యో జుహ్వా జుహోమి ।
శృణోతు మిత్రో అర్యమా భగో న స్తువిజాతో వరుణో దక్షో అంశః॥

ఇమాః, గిరః, ఆదిత్యేభ్యః, ఘృతస్నూరితి ఘృత+స్నూః, సనాత్, రాజభ్య ఇతి రాజ+భ్యః, జుహ్వా, జుహోమి, శృణోతు, మిత్రః, అర్యమా, భగః, నః, తువిజాత ఇతి తువి+జాతః, వరుణః, దక్షః, అంశః. ॥౫౪॥

పదార్థః—(ఇమాః)సత్యాః(గిరః)వాచః(ఆదిత్యేభ్యః)తేజస్విభ్యః(ఘృతస్నూః)ఘృతముదకమివ ప్రదీప్తం వ్యవహారం స్నాన్తి శోధయన్తి తాః (సనాత్) నిత్యమ్ (రాజభ్యః) నృపేభ్యః (జుహ్వా)గ్రహణసాధనేన(జుహోమి)ఆదదామి(శృణోతు)(మిత్రః)సఖా(అర్యమా) న్యాయకారీ (భగః)ఐశ్వర్యవాన్(నః)అస్మాకమ్(తువిజాతః)బహుషు ప్రసిద్ధః(వరుణః) శ్రేష్ఠః (దక్షః) చతురః (అంశః) విభాజకః. ॥౫౪॥ అన్వయః—అహమాదిత్యేభ్యో రాజభ్యో యా ఇమా గిరో జుహ్వా సనాజ్జుహోమి తా ఘృతస్నూర్నో గిరో మిత్రోఽర్యమా భగ స్తువిజాతో దక్షోంఽశో వరుణశ్చ శృణోతు. ॥౫౪॥ భావార్థః—విద్యార్థిభిర్యా ఆచార్యేభ్యః సుశిక్షితా వాచో గృహీతాస్తా అన్య ఆప్తాః శ్రుత్వా సుపరీక్ష్య శిక్షయన్తు. ॥౫౪॥

పదార్థము—నేను, ఆదిత్యేభ్యః = తేజస్వులైన, రాజభ్యః = రాజులనుండి,ఇమాః

గిరః=ఏ యీ సత్యవాక్కులను, జుహ్వా=గ్రహణసాధనముచే, సనాత్ = నిత్యము, జుహోమి = స్వీకరించుచున్నానో, ఘృతస్నూః=జలమువలె మంచివ్యవహారమును శోధించెడి, నః=మా యొక్క ఆ వాక్కులను, మిత్రః=మిత్రుడు, [అర్యమా=న్యాయకారి, భగః = ఐశ్వర్యవంతుడు, తువిజాతః = అనేకులలో ప్రసిద్ధుడు] దక్షః = చతురుడు, అంశః=విభాగకర్త మఱియు, వరుణః=శ్రేష్ఠపురుషుడు, శృణోతు=వినునుగాక॥

భావార్థము—విద్యార్థులు ఆచార్యులవలన నే శిక్షిత వాక్కులను గ్రహించిరో వానిని ఆప్తులైన యన్యులు విని, బాగుగా పరీక్షించి శిక్షగఱపవలయును. ॥౫౪॥

---

1848 సప్తేత్యస్య కణ్వ ఋషిః, అధ్యాత్మం ప్రాణా దేవతాః, భురిగ్ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ శరీరేన్ద్రియ విషయ మాహ. శరీరేంద్రియముల విషయము.

స॒ప్త ఋష॑యః॒ ప్రతి॑హితాః॒ శరీ॑రే స॒ప్త ర॑క్షన్తి॒ సద॒మప్ర॑మాదమ్ ।
స॒ప్తాపః॒ స్వప॑తో లో॒క మీ॑యు॒స్తత్ర॑ జాగృతో॒ అస్వ॑ప్నజౌ సత్ర॒సదౌ॑ చ దే॒వౌ॥

స॒ప్త, ఋష॑యః, ప్రతి॑హితా॒ ఇతి॒ ప్రతి॑+హితా, శరీ॑రే, స॒ప్త, ర॒క్షన్తి॒, సద॑మ్, అప్ర॑మాద॒ మిత్య॑ప్ర+మాదమ్, స॒ప్త, ఆప॑ః, స్వప॑తః, లో॒కమ్, ఈ॒యుః, త॒త్ర, జా॒గృ॒తః, అస్వ॑ప్నజా॒విత్యస్వ॑ప్న+జౌ, సత్ర॒సదా॒వితి॑ సత్ర॒+సదౌ॑, చ॒, దే॒వౌ. ॥౫౫॥

పదార్థః—(సప్త)పంచజ్ఞానేన్ద్రియాణి మనో బుద్ధిశ్చ (ఋషయః) విషయప్రాపకాః (ప్రతిహితాః)ప్రతీత్యా ధృతాః(శరీరే)(సప్త)(రక్షన్తి) (సదమ్) సీదన్తి యస్మింస్తత్ (అప్రమాదమ్)(సప్త)(ఆపః)ఆప్నువన్తి వ్యాప్నువన్తి శరీరమిత్యాపః(స్వపతః)శయనం ప్రాప్తస్య(లోకమ్)జీవాత్మానమ్ (ఈయుః) యన్తి(తత్ర) లోకగమనకాలే(జాగృతః) (అస్వప్నజౌ) స్వప్నే న జాయతే యయో స్తౌ (సత్రసదౌ)సతాం జీవాత్మనాం త్రాణం సత్రం తత్ర సీదత స్తౌ(చ) (దేవౌ)దివ్యస్వరూపౌ ప్రాణాపానౌ. ॥౫౫॥ అన్వయః—యే సప్తర్షయః శరీరే ప్రతిహితాస్త ఏవ సప్తాప్రమాదం యథా స్యాత్తథా సదం రక్షన్తి తే స్వపతః సప్తాఽఽపః లోకమీయుస్తత్రాఽస్వప్నజౌ సత్రసదౌ చ దేవౌ జాగృతః. ॥౫౫॥ భావార్థః—అస్మిఞ్ఛరీరే స్థిరాణి వ్యాపకాని విషయబోధకాని సాన్తఃకరణాని జ్ఞానేన్ద్రియాణ్యేవ సాతత్యేన శరీరం రక్షన్తి. యదా చ జీవః స్వపితి తదా తమేవాశ్రిత్య తమోబలేనాన్తర్ముఖాని తిష్ఠన్తి బాహ్యవిషయం న బోధయన్తి స్వప్నావస్థాయాం చ జీవాత్మరక్షణతత్పరౌ తమోగుణా నభిభూతౌ ప్రాణాపానౌ జాగరణం కుర్వాతే అన్యథా యద్యనయోరపి స్వప్నః స్యాత్తదా తు మరణమేవ సంభావ్యమితి ॥౫౫॥

పదార్థము—సప్త ఋషయః = విషయములను, అనగా శబ్దాదులను ప్రాప్తింపజేయు పంచజ్ఞానేంద్రియములు, మనస్సు, బుద్ధి, ఏ యీ సప్తఋషులు, శరీరే=ఈ శరీరమున, ప్రతిహితాః=ప్రతీతితో స్థిరులై యున్నారో, సప్త=ఆ యేడే, అప్రమాదమ్=ప్రమాదము—పొరపాటు లేకుండ, సదమ్ = నివసించుట కాధారమైన శరీరమును.

రక్ష న్తి=రక్షించుచున్నవి, స్వపతః=నిద్రించుచున్న జనులయొక్క, ఆపః=శరీరమున వ్యాప్తములై యున్న, సప్త=పై యేడు,లోకమ్=జీవాత్మను, ఈయుః=పొందుచున్నవి, తత్ర = ఆ లోకమును పొందుసమయమున, అస్వప్నజౌ = స్వప్నమెన్నడును కననివి, సత్రసదౌ=జీవాత్మలను కాపాడునవి,చ=మఱియు;దేవౌ=స్థిరమైన ఉత్తమ గుణములు గలవియునగు ప్రాణాపానములు, జాగృతః=మేలుకొనుచున్నవి. ॥౫౫॥

భావార్థము—ఈ శరీరమున స్థిరములు వ్యాపకములు విషయబోధకములునైన అంతఃకరణసహిత పంచజ్ఞానేంద్రియములే నిరంతరము శరీరమును రక్షించుచున్నవి. మఱియు నెపుడు జీవుడు నిద్రించునో అపు డవి దానినిఆశ్రయించుకొని తమోగుణ బలముచేనంతర్ముఖములై ఉండుచున్నవి.కాని బాహ్యవిషయములను బోధించవు.మఱియు స్వప్నావస్థలో జీవాత్మ రక్షణతత్పరములై తమోగుణముచే నభిభూతములు కాకుండ ప్రాణాపానములు మేలుకొని ఉండుచున్నవి. అట్లుగాక ప్రాణాపానములు కూడ నిద్రించుచో మరణమే సంభవమగును. ॥౫౫॥ 1848

---

ఉత్తిష్ఠేత్యస్య కణ్వ ఋషిః, బ్రహ్మణస్పతి ర్దేవతా, నిచృద్ బృహతీ ఛన్దః,మధ్యమః స్వరః.

విద్వాన్ కిం కుర్యా దిత్యాహ. విద్వాంసు లేమి చేయవలయును ?

ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే దేవయన్త స్త్వేమహే ।
ఉప ప్రయన్తు మరుతః సుదానవ ఇన్ద్ర ప్రాశూ ర్భవా సచా॥౫౬

ఉత్, తిష్ఠ, బ్రహ్మణః, పతే, దేవ యన్త ఇతి దేవ+యన్తః, త్వా, ఈమహే, ఉప, ప్ర, యన్తు, మరుతః, సుదానవ+ఇతి సు+దానవః, ఇన్ద్ర, ప్రాశూః, భవ, సచా. ॥౫౬॥

పదార్థః—(ఉత్)(తిష్ఠ)(బ్రహ్మణః)ధనస్య(పతే)పాలక(దేవయన్తః)దేవాన్ కామయమానాః (త్వా)త్వామ్(ఈమహే)యాచామహే(ఉప) (ప్ర) (యన్తు) ప్రాప్నువన్తు (మరుతః) మనుష్యాః (సుదానవః)శోభనదానాః(ఇన్ద్ర)ఐశ్వర్యకారక!(ప్రాశూః)యః ప్రాశ్నాతి సః(భవ)అత్ర ద్వ్యచోతస్తిఙ ఇతి దీర్ఘః (సచా) సత్యసమవాయేన. ॥౫౬॥ అన్వయః—హే బ్రహ్మణస్పతే ఇన్ద్ర! దేవయన్తో వయం యన్త్వేమహే యన్త్వా సుదానవో మరుత ఉప ప్రయన్తు స త్వముత్తిష్ఠ సచా ప్రాశూ ర్భవ. ॥౫౬॥ భావార్థః—హే విద్వన్ యే విద్యాం కామయమానాస్త్వాముపతిష్ఠేయు స్తేభ్యో విద్యాదానాయ భవానుత్తిష్ఠతూద్యుక్తో భవతు. ॥౫౬॥

పదార్థము—బ్రహ్మణః పతే=ధనరక్షక! ఇన్ద్ర=ఐశ్వర్యకారకా! విద్వాంసుడా! దేవయన్తః=దివ్యవిద్వాంసులను కోరుచు మేము, త్వా=ఏ నిన్ను, ఈమహే=యాచించుచున్నామో, ఏ నిన్ను, సుదానతః మరుతః=సుందరదానమొసగు మానవులు, ఉప ప్ర యన్తు=సమీపమున ప్రయత్నపూర్వకముగ పొందుదురో. ఆ నీవు, ఉత్ తిష్ఠ= లెమ్ము! మఱియు సచా=సత్యముయొక్క సంబంధముతో, ప్రాశూః = ఉత్తమభోగమును భోగించువాడవు, భవ=కమ్ము, ॥౫౬॥

భావార్థము—ఓ విద్వాంసుడా ! ఎవరు విద్యను కోరుచున్నవారై నీ యండకు చేరుదురో వారికి విద్యాదానమొనర్చుటకై నీవు సంసిద్ధుడవు కమ్ము. ॥౫౬॥ 1849

---

1850 ప్రనూనమిత్యస్య కణ్వ ఋషిః, బ్రహ్మణస్పతి ర్దేవతా, విరాట్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః

అథేశ్వరవిషయ మాహా. ఈశ్వరుని విషయ మిందు చెప్పెను.

ప్ర నూనం బ్రహ్మణస్పతి ర్మన్త్రం వదత్యుక్థ్యమ్ ।
యస్మిన్నిన్ద్రో వరుణో మిత్రో అర్యమా దేవా ఓకాంసి చక్రిరే ॥౫౭॥

ప్ర, నూనమ్, బ్రహ్మణః, పతిః, మన్త్రమ్, వదతి, ఉక్థ్యమ్, యస్మిన్, ఇన్ద్రః, వరుణః, మిత్రః, అర్యమా, దేవాః, ఓకాంసి, చక్రిరే. ॥౫౭॥

పదార్థః—(ప్ర)(నూనమ్)నిశ్చితమ్(బ్రహ్మణః)వేదవిద్యాయాః(పతిః) పాలకః (మన్త్రమ్) (వదతి) (ఉక్థ్యమ్) ఉక్థేషు ప్రశంసనీయేషు సాధుమ్ (యస్మిన్)(ఇన్ద్రః) విద్యుత్సూర్యో వా (వరుణః)జలం చన్ద్రో వా(మిత్రః)ప్రాణోఽన్యే వాయవశ్చ (అర్యమా) సూత్రాత్మా (దేవాః) దివ్యగుణాః(ఓకాంసి)నివాసాన్(చక్రిరే)కృతవన్తః సన్తి. ॥౫౭॥ అన్వయః—హే మనుష్యా! యస్మిన్నిన్ద్రోవరుణో మిత్రోఽర్యమా దేవా ఓకాంసి చక్రిరే,స బ్రహ్మణస్పతిః పరమాత్మోక్థ్యం మన్త్రం వేదాఖ్యం నూనం ప్రవదతీతి విజానీత. ॥౫౭॥ భావార్థః—హే మనుష్యా! యస్మిన్ పరమాత్మని సర్వం జగత్కారణం కార్యం జీవాశ్చ వసన్తి యశ్చ సర్వేషాం జీవానాం హిత సాధకం వేదోపదేశం కృతవానస్తి తమేవ యూయం భజత. ॥౫౭॥

పదార్థము—మానవులారా! యస్మిన్=ఏ పరమాత్మయందు, ఇన్ద్రః=విద్యుత్తు లేక సూర్యుడు, వరుణః=జలము, లేక చంద్రుడు, మిత్రః = ప్రాణము, అపానాదీతర వాయువులు, అర్యమా=సూత్రాత్మయైన వాయువు, దేవాః = ఉత్తమగుణములు గలిగినవి ఇవియన్నియు, ఓకాంసి = నివాసములను, చక్రిరే=చేసుకొనియున్నవో, బ్రాహ్మణః=వేదవిద్యయొక్క, పతిః=రక్షకుడైన ఆ జగదీశ్వరుడు, ఉక్థ్యమ్=ప్రశంస నీయపదార్థములందు శ్రేష్ఠమైన, మన్త్రమ్=వేదరూప మంత్రభాగమును, నూనమ్= నిశ్చయముగ, ప్ర వదతి=బాగుగా చెప్పుచున్నాడని మీ రెఱుంగుడు. ॥౫౭॥

భావార్థము—మానవులారా! ఏ పరమాత్మయందు కార్యకారణరూప సమస్త జగత్తు, జీవములు నివసించుచున్నవో, ఎవడు సకలజీవులకు హితసాధకమగు వేదోప దేశమొనర్చుచున్నాడో అతనినే మీరు భజించుడు, సేవించుడు. ఉపాసించుడు. ॥౫౭॥

---

బ్రహ్మణస్పత ఇత్యస్య గృత్సమద ఋషిః,బ్రహ్మణస్పతి ర్దేవతా,నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః

పునస్తమేవ విషయ మాహా. మరల విషయ మయ్యదియే.

బ్రహ్మణస్పతే త్వమస్య యన్తా సూక్తస్య బోధి తనయం చ జిన్వ ।
విశ్వన్తద్భద్రం యదవన్తి దేవా బృహద్వదేమ విదథే సువీరాః॥

*య ఇమా విశ్వా । విశ్వకర్మా । యో నః పితా । అన్నపతేఽన్నస్య నో దేహి॥

బ్రహ్మణః, పతే, త్వమ్, అస్య, యన్తా, సూక్తస్యేతి సు+ఉక్తస్య, బోధి, తనయమ్, చ, జిన్వ, విశ్వమ్, తత్, భద్రమ్, యత్, అవన్తి, దేవాః బృహత్, వదేమ విదథే, సువీరా+ఇతి సు+వీరాః. ॥౫౮॥

పదార్థః—(బ్రహ్మణః)బ్రహ్మాణ్డస్య(పతే)రక్షక!(త్వమ్)(అస్య)(యన్తా)నియన్తా(సూక్తస్య) సుష్ఠు వక్తుమర్హస్య(బోధి)బోధయ(తనయమ్)విద్యాపుత్రమ్(చ)(జిన్వ)ప్రీణీహి(విశ్వమ్)సర్వమ్ (తత్)(భద్రమ్)కల్యాణకరమ్(యత్) (అవన్తి)రక్షన్త్యుపదిశన్తి (దేవాః) విద్వాంసః (బృహత్) మహత్(వదేమ)ఉపదిశేమ(విదథే)విజ్ఞాపనీయే వ్యవహారే(సువీరాః)శోభనాశ్చ తే వీరాశ్చసువీరాః అన్వయః— హే బ్రహ్మణస్పతే దేవా విదథే యదవన్తి యత్ సువీరా వయం బృహద్వదేమ తస్యాస్య సూక్తస్య త్వం యన్తా భవ తనయం చ బోధి తద్భద్రం విశ్వం జిన్వ. భావార్థః— హే జగదీశ్వర! భవానస్మాకం విద్యాయాః సత్యస్య వ్యవహారస్య చ నియన్తా భవత్వస్మాకమ పత్యాని విద్యావన్తి కరోతు సర్వం జగద్యథావద్రక్షతు! సర్వత్ర న్యాయ్యం ధర్మం సుశిక్షాం పరస్పరప్రీతిం చ జనయత్వితి. ॥౫౮॥

పదార్థము—బ్రహ్మణః=బ్రహ్మాండముయొక్క, పతే = రక్షకా! పరమేశ్వరా! దేవాః=విద్వాంసులు, విదథే = ప్రకటించదగిన వ్యవహారమునందు, యత్ = దేనిని రక్షించుచున్నారో, లేక [పది] ఉపదేశించుచున్నారో, మఱియు దేనిని, సువీరాః = ఉత్తమ వీరపురుషులమైన మేము, బృహత్=మిగులశ్రేష్ఠమని, వదేమ=చెప్పెదమో, అస్య సూక్తస్య=బాగుగా చెప్పదగిన ఆ యీ వచనమునకు, త్వమ్=నీవు, యన్తా= నియమకర్తవుకమ్ము, చ = మఱియు, తనయమ్ = విద్యను శుద్ధముగా విచారించు పుత్రునివంటి ప్రియపురుషునకు, బోధి=బోధించుము మఱియు, తత్ భద్రమ్ విశ్వమ్= కల్యాణకరములైన ఆ సకలజీవులను, జిన్వ=తృప్తపఱచుము. ॥౫౮॥

భావార్థము—జగదీశ్వరా! నీవు మా విద్యను, సత్యవ్యవహారమును నియమము నందుంచువాడవు కమ్ము, మా సంతానమును విద్యాసమన్వితులుగ నొనర్చుము, సర్వ జగత్తును యథావిధిగా రక్షించుము. న్యాయయుక్త ధర్మమును, ఉత్తమశిక్షను, పర స్పరప్రీతిని ఉత్పన్నమొనర్చుము. ॥౫౮॥

---

*అత్ర పూర్వోక్తమన్త్రాణాం చత్వారి ప్రతీకాని య ఇమా విశ్వా ౧౭. ౧౭ విశ్వకర్మా ౧౧ ౨౮ యో నః పితా ౧౭.౨౭. అన్నపతేఽన్నస్య నో దేహి ౧౧ ౮౩ విశేష కర్మణి కార్యార్థం ధృతాని.

అస్మిన్నధ్యాయే మనసో లక్షణం, శిక్షా, విద్యేచ్ఛా, విద్వత్సఙ్గః, కన్యాప్రబోధో, విద్వల్లక్షణం రక్షాయాచనం, బలైశ్వర్యేచ్ఛా, సోమౌషధిలక్షణం, శుభేచ్ఛా, పరమేశ్వరసూర్యవర్ణనం, స్వరక్షా, ప్రాతరుత్థానం, పురుషార్థేనర్ధి సిద్ధి ప్రాపణ మీశ్వరస్య జగన్నిర్మాణం, మహారాజవర్ణన మశ్విగుణకథన మాయుర్వర్ధనం, విద్వత్ప్రాణలక్షణ మీశ్వరకృత్యం చోక్త మతోఽస్యాఽధ్యాయార్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సఙ్గతి ర్వేద్యా, ॥౩౪॥

ఈ అధ్యాయమందు మనస్సు లక్షణము, శిక్ష, విద్యేచ్ఛ,విద్వాంసుల సాంగత్యము, కన్యాప్రబోధము, చేతనత్వము, విద్వాంసుల లక్షణము, రక్షణకై ప్రార్థన, బలైశ్వర్యేచ్ఛ, సోమఓషధి లక్షణము, శుభకర్మేచ్ఛ, పరమేశ్వరుని సూర్యుని వర్ణన, స్వరక్ష, ప్రాతఃకాలమున లేచుట, పురుషార్థముతో బుద్ధిసిద్ధులను పొందుట. ఈశ్వరుని జగన్నిర్మాణము, మహారాజుల వర్ణన, ఈశ్వరుని[అశ్వి]గుణకథనము, ఆయువును వృద్ధిపరచుట, విద్వాంసుల లక్షణము, ప్రాణముల లక్షణము, ఈశ్వరుని కర్తవ్యము మున్నగు విషయములు వివరించ బడెను. కావున నీ అధ్యాయము యొక్క అర్థమునకు పూర్వాధ్యాయమునందు చెప్పబడిన అర్థముతో నున్న సంబంధమును ఎరుంగవలయును.



ఇతి శ్రీమత్పరమహంస పరిప్రాజకాచార్యాణాం శ్రీయుత పరమవిదుషాం విరజానంద
సరస్వతీస్వామినాం శిష్యేణ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యేణ
శ్రీమద్దయానందసరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్య
భాషాభ్యాం విభూషితే సుప్రమాణయుక్తే
యజుర్వేదభాష్యే చతుస్త్రింశో
ఽధ్యాయః సమాప్తి
మగమత్.



కృష్ణా మండలాంతర్గత కుందేరు గ్రామవాస్తవ్యులగు
పాలడగు శేషాచలాచార్య, తదేవమండలాంతర్గత ముదునూరు
గ్రామవాస్తవ్యుడు అన్నే కేశవార్యశాస్త్రి గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన
శ్రీ మద్దయానన్దసరస్వతీ నిర్మిత యజుర్వేదభాషాభాష్యమందలి ౩౩ వ అధ్యాయము సమాప్తము.

—( ఇతి )—



ఓమ్

# అథ పఞ్చత్రింశాధ్యాయారమ్భః

—o—

## ముప్పదియైదవ అధ్యాయము ప్రారంభము

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ। యద్భద్రం తన్న ఆ సువ ॥౧॥

1852 అపేత్యస్య ఆదిత్యా దేవా ఋషయః, పితరో దేవతాః, పూర్వస్య పిపీలికామధ్యా గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః, ద్యుభిరిత్యుత్తరస్య ప్రాజాపత్యా బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

అథ వ్యవహారజీవయోర్గతి మాహ. వ్యవహారగతి జీవముగతి చెప్పబడెను.

అపేతో యన్తు పణయోఽసుమ్నా దేవపీయవః। అస్య లోకః సుతావతః।
ద్యుభిరహోభిరక్తుభిర్వ్యక్తం యమో దదాత్వవసానమస్మై. ॥౧॥

అప, ఇతః, యన్తు, పణయః, అసుమ్నా, దేవపీయవ ఇతి దేవ+పీయవః, అస్య, లోకః, సుతావతః, సుతవత ఇతి సుత+వతః,ద్యుభిరితి ద్యుభిః, అహోభిరిత్యహః+భిః, అక్తుభిరిత్యక్తు+భిః, వ్యక్తమితి వి+క్తమ్, యమః, దదాతు, అవసానమిత్యవ+సానమ్, అస్మై. ॥౧॥

పదార్థః—(అప) దూరీకరణే (ఇతః) అస్మాత్ (యన్తు) గచ్ఛన్తు (పణయః) వ్యవహారిణః (అసుమ్నా)అసుఖాని దుఃఖాని.సుమ్నమితి సుఖనా...నిఘం. ౩.౬.(దేవపీయవః)యే దేవానాం విదుషాం ద్వేష్టారః(అస్య)(లోకః)దర్శనీయః(సుతావతః)ప్రశస్తాని సుతాని వేదవిద్భిః ప్రేరితాని కర్మాణి యస్య తస్య(ద్యుభిః)ప్రకాశమానైః(అహోభిః)దినైః(అక్తుభిః)రాత్రిభిః(వ్యక్తమ్) ప్రసిద్ధమ్(యమః)యన్తా(దదాతు)(అవసానమ్)అవకాశమ్(అస్మై). ॥౧॥ అన్వయః—హే దేవపీయవః పణయోఽసుమ్నాన్యస్మైభ్యో దదతి త ఇతోఽపయన్తు లోకో యమో ద్యుభిరహోభిరక్తుభిరస్య సుతావతో జనస్య సంబన్ధినేఽస్మై వ్యక్తమవసానం దదాతు. ॥౧॥ భావార్థః—య ఆప్తాన్విదుషో ద్విషన్తి తే సద్యో దుఃఖమాప్నువన్తి యే జీవాః శరీరం త్యక్త్వా గచ్ఛన్తి తేభ్యో యథాయోగ్యమవకాశం దత్త్వా పరమేశ్వరస్తేషాం కర్మానుసారేణ సుఖదుఃఖాని దదాతి ॥౧॥

పదార్థము—దేవపీయవః=విద్వాంసులను ద్వేషించువారగు, పణయః=ఏ వ్యవహారచతురులు ఇతరులకు, అసుమ్నా = దుఃఖములను కలిగించుచున్నారో, వారు, ఇతః=ఇటనుండి,అప యన్తు=తొలగిపోవుదురుగాక!లోకః=చూడతగినవాడు, యమః =సర్వనియంతయునగు పరమాత్మ, ద్యుభిః= ప్రకాశవంతములగు, అహోభిః = దినములతోపాటు,అక్తుభిః=రాత్రులతోపాటు,అస్య సుతావతః=వేదముచేత లేకవిద్వాంసులచేత ప్రేరేపించబడిన ప్రశస్తములగు కర్మలుగల ఈ మానవునికి సంబంధియైన, అస్మై=ఈ మనుష్యునకై, వ్యక్తమ్ = ప్రసిద్ధమగు, అవసానమ్ = అవకాశమును, దదాతు = ఇచ్చుగాక! ॥౧॥

భావార్థము—ఆప్తులు,సత్యవాదులు,ధర్మాత్ములునగు విద్వాంసులను ద్వేషించువారు శీఘ్రముగ దుఃఖములను పొందుచున్నారు. శరీరమును త్యజించిపోవు జీవులకై యథాయోగ్యముగ అవకాశమును కల్పించి, వానికర్మలనుబట్టి పరమేశ్వరుడు సుఖదుఃఖములను ఫలముల నిచ్చుచున్నాడు. ॥౧॥ 1852

---

1853 సవితా త యిత్యస్య ఆదిత్యా దేవా ఋషయః, సవితా దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున రీశ్వరక ర్తవ్య విషయ మాహ. ఈశ్వరుని కర్తవ్య విషయము.

సవితా తే శరీరేభ్యః పృథివ్యాం లోక మిచ్ఛతు ।
తస్మై యుజ్యన్తా ముస్రియాః. ॥౨॥

సవితా, తే, శరీరేభ్యః, పృథివ్యామ్, లోకమ్, ఇచ్ఛతు, తస్మై, యుజ్యన్తామ్, ఉస్రియాః. ॥౨॥

పదార్థః—(సవితా)పరమాత్మా(తే)తవ(శరీరేభ్యః)దేహేభ్యః(పృథివ్యామ్)అన్తరిక్షే భూమౌ వా(లోకమ్)కర్మానుకూలం సుఖదుఃఖప్రాపకమ్ (ఇచ్ఛతు)(తస్మై)(యుజ్యన్తామ్)(ఉస్రియాః) కిరణాః. ఉస్రా ఇతి రశ్మినా...నిఘం...౧. ౫. ॥౨॥ అన్వయః—హే జీవ సవితా యస్య తే శరీరేభ్యః పృథివ్యాం లోకమిచ్ఛతు తస్మై తుభ్య ముస్రియా యుజ్యన్తామ్. భావార్థః—హే జీవా యో జగదీశ్వరో యుష్మభ్యం సుఖమిచ్ఛతి కిరణద్వారా లోకలోకాన్తరం ప్రాపయతి స ఏవ యుష్మాభి ర్న్యాయకారీ మన్తవ్యః. ॥౨॥

పదార్థము—ఓ జీవమా ! సవితా=పరమాత్మ, తే = ఏ నీయొక్క, శరీరేభ్యః= జన్మజన్మాంతరముల శరీరములకై , పృథివ్యామ్=అంతరిక్షమున లేక భూమియందు, లోకమ్=కర్మల కనుకూలములగు సుఖదుఃఖముల సాధనము లేక ప్రాప్తింపజేయు స్థానమును, ఇచ్ఛతు=కోరునో, తస్మై = అట్టి నీకై , ఉస్రియాః = ప్రకాశములగు కిరణములు, యుజ్యన్తామ్=ఉపయోగకరములగుగాక ! ॥౨॥

భావార్థము—ఓ జీవులారా! ఏ జగదీశ్వరుడు నీకై సుఖము కోరుచున్నాడో మఱియు కిరణములద్వారా లోకలోకాంతరములకు చేర్చుచున్నాడో అతనినే మీరు న్యాయకారిగ భావించవలెను. ॥౨॥ 1853

---

1854 వాయు రిత్యస్య ఆదిత్యా దేవా వా ఋషయః, సవితా దేవతా, ఉష్ణిక్ ఛన్దః,ఋషభః స్వరః.

జీవానాం కర్మగతి విషయ మాహ. జీవుల కర్మగతి విషయము.

వాయుః పునాతు సవితా పునాత్వగ్నే ర్భ్రాజసా సూర్యస్య వర్చసా ।
విముచ్యన్తా ముస్రియాః. ॥౩॥

వాయుః, పునాతు, సవితా, పునాతు, అగ్నేః, భ్రాజసా, సూర్యస్య, వర్చసా,

వి, ము॒చ్యన్తామ్, ఉ॒స్రియాః. ॥౩॥

పదార్థః—(వాయుః)(పునాతు)పవిత్రయతు(సవితా)సూర్యః(పునాతు) (అగ్నేః) విద్యుతః (భ్రాజసా)దీప్త్యా (సూర్యస్య) (వర్చసా)ప్రకాశేన(వి) (ముచ్యన్తామ్) త్యజ్యన్తామ్(ఉస్రియాః) కిరణాః. ॥౩॥ అన్వయః—హే మనుష్యా! వాయు రగ్నే ర్భ్రాజసా సూర్యస్య వర్చసా యానస్మాన్ పునాతు సవితా పునాతు ఉస్రియా విముచ్యన్తామ్. ॥౩॥ భావార్థః—యదా జీవాః శరీరాణి త్యక్త్వా విద్యుతం సూర్యప్రకాశం వాయ్వాదీని చ ప్రాప్య గచ్ఛన్తి గర్భం ప్రవిశన్తి తదా కిరణా స్తాన్ త్యజన్తి. ॥౩॥

పదార్థము—మానవులారా! వాయుః=పవనము, అగ్నేః=విద్యుత్తుయొక్క, భ్రాజసా=దీప్తిచేతను, సూర్యస్య=సూర్యునియొక్క, వర్చసా=తేజస్సుచేతను [ఏ] మమ్ములను, పునాతు=పవిత్రమొనర్చునో! సవితా=సూర్యుడు, పునాతు = పవిత్ర మొనర్చునో![ఆ నన్ను]ఉస్రియాః=కిరణములు,ముచ్యంతామ్=విడుచును గాక! ॥౩॥

భావార్థము—జీవములు శరీరమును వదలి విద్యుత్తును, సూర్యప్రకాశమును, వాయ్వాదులను పొంది గర్భములో ప్రవేశించినప్పుడు కిరణములు వానిని త్యజించుచున్నవి.

---

అశ్వత్థే ఇత్యస్య ఆదిత్యా దేవా ఋషయః, వాయుః సవితా దేవతే,అనుష్టుప్ ఛన్దః,గాన్ధారః స్వరః

పున ర్మనుష్యైః కిం కర్తవ్య మిత్యాహ. మానవు లేమి చేయవలయును ?

అ॒శ్వ॒త్థే వో॑ ని॒షద॑నం ప॒ర్ణే వో॑ వ॒స॒తి ష్కృ॒తా ।
గో॒భా॒జ ఇత్కి॒లాస॑థ॒ యత్స॒నవ॑థ॒ పూరు॑షమ్. ॥౪॥

అ॒శ్వ॒త్థే, వః, ని॒షద॑నమ్, ని॒సద॒న॒మితి ని॒+సద॑నమ్, ప॒ర్ణే, వః, వ॒స॒తిః, కృ॒తా, గో॒భా॒జ ఇతి గో॒+భాజః, ఇత్, కిల, అ॒స॒థ, యత్, స॒నవథ, పురు॑షమ్, పురు॑ష॒మితి॒ పురు॑షమ్. ॥౪॥

పదార్థః—(అశ్వత్థే)శ్వః స్థాస్యతి న స్థాస్యతి వా తస్మిన్ననిత్యే సంసారే (వః) యుష్మాకమ్(నిషదనమ్)స్థాపనమ్(పర్ణే)పర్ణవచ్చంచలే జీవనే(వః) యుష్మాకమ్(వసతిః) నివసతిః(కృతా) (గోభాజః)యే గాః పృథివీం వాచమిన్ద్రియాణి కిరణాన్ వా భజన్తి తే(ఇత్)ఏవ(కిల)(అసథ) భవథ(యత్)(సనవథ)సేవధ్వమ్(పూరుషమ్)సర్వత్ర పూర్ణం పరమాత్మానమ్. అన్వయః—హే జీవా! యేన జగదీశ్వరేణాశ్వత్థే వో నిషదనం కృతం,పర్ణే వో వసతిః కృతా, యత్పురుషం కిల సనవథ తేన సహ గోభాజ ఇద్యూయం ప్రయత్నేన ధర్మేఽసథ. ॥౪॥ భావార్థః—మనుష్యైరనిత్యే సంసారేఽనిత్యాని శరీరాణి పదార్థాంశ్చ ప్రాప్య క్షణభఙ్గురే జీవనే ధర్మాచరణేన నిత్యం పరమాత్మాన ముపాస్యాఽఽత్మపరమాత్మసంయోగజం నిత్యం సుఖం ప్రాపణీయమ్॥౪

పదార్థము—జీవులారా!ఏ పరమేశ్వరుడు,అశ్వత్థే=రేపు ఉండునో ఉండదో అను అనిత్యసంసారమునందు, వః=మీ యొక్క, నిషదనమ్=స్థానమును ఏర్పాటుచేసెనో, పర్ణే=పత్రసదృశ చంచల జీవనమునందు,వః వసతిః=మీ నివాసము, కృతా=చేసెనో,

యత్ పురుషమ్=ఏ పరమాత్ముని, కిల = నిశ్చయముగ, సనవథ=సేవించెదవో, అత నితోపాటు, గోభాజః = భూమిని, వాణిని ఇంద్రియములను, కిరణములను సేవించు వారలై మీరు, ఇత్=నిశ్చయముగ, ప్రయత్నపూర్వకముగ ధర్మమునందు స్థిరముగ, అసథ = ఉండుడు. ॥౪॥

భావార్థము—అనిత్యసంసారములో అనిత్యములగు శరీరములను, పదార్థము లను పొంది, క్షణభంగురమగు జీవనములో ధర్మాచరణముచే నిత్యుడగు పరమాత్ముని ఉపాసించి, మానవులు ఆత్మ పరమాత్మల సంయోగజమగు నిత్యసుఖమును పొందవలయును. ॥౪॥ 1855

---

సవితేత్యస్యాదిత్యా దేవా వా ఋషయః, వాయుసవితారౌ దేవతే, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః

కన్యా కిం కుర్యాదిత్యాహ. కన్య ఏమి చేయవలయును ?

సవితా తే శరీరాణి మాతు రుపస్థ ఆ వపతు । తస్మై పృథివి శం భవ. ॥౫॥

సవితా, తే, శరీరాణి, మాతుః, ఉపస్థ+ఇత్యుప+స్థే, ఆ, వపతు, తస్మై, పృథివి, శమ్, భవ. ॥౫॥

పదార్థః(సవితా)ఉత్పత్తికర్తా పితా(తే)తవ(శరీరాణి)ఆశ్రయాన్(మాతుః)జననీసమానాయాః ప్రదాయాః పృథివ్యాః (ఉపస్థే) సమీపే(ఆ) (వపతు)స్థాపయతు(తస్మై) (పృథివి)భూమివద్వర్తమానే కన్యే(శమ్)సుఖకారిణీ(భవ). ॥౫॥ అన్వయః—హే పృథివి! త్వం యస్యాస్తే శరీరాణి మాతు రుపస్థే స పితా ఆ వపతు, సా త్వం తస్మై పిత్రే శమ్భవ. ॥౫॥ భావార్థః—హే కన్యే! యుష్మాభి ర్వివాహానన్తర మపి జనకస్య జనన్యాశ్చ మధ్యే ప్రీతి ర్నైవ త్యాజ్యా కుతః తాభ్యామేవ యుష్మాకం శరీరాణి నిర్మితాని పాలితాని చ సన్త్యతః. ॥౫॥

పదార్థము—పృథివి=భూమివలె సహనశీలవైన కన్యా! తే=ఏ నీయొక్క, శరీరాణి=ఆశ్రయములను, మాతుః = తల్లివలె మాన్యమొసగు పృథివియొక్క,ఉపస్థే= సమీపమున, సవితా=ఉత్పత్తియొనర్చు పిత, ఆ వపతు=స్థాపించునో!ఆ నీవు, తస్మై =ఆ పితకొఱకు, శమ్=సుఖకారిణివి కమ్ము. ॥౫॥

భావార్థము—ఓ కన్యలారా! వివాహానంతరముకూడ తల్లిదండ్రులయందు ప్రీతిని వదలకుండుట మీకు యోగ్యము ఏలయన వారిద్దరి వలననే మీ శరీరము లుత్పన్నము లైనవి, పోషింపబడినవి కనుక... ॥౫॥ 1856

---

1857 ప్రజాపతావిత్యస్యాదిత్యా దేవా ఋషయః, ప్రజాపతిర్దేవతా, ఉష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

ఈశ్వరోపాసన విషయ మాహ. ఈశ్వరోపాసన విషయము.

ప్రజాపతౌ త్వా దేవతా యాముపోదకే లోకే నిదధామ్యసౌ

అప నః శోశుచ దఘమ్. ॥౬॥

ప్రజాపతావితి ప్రజా+పతౌ, త్వా, దేవతాయామ్, ఉపోదక ఇత్యు ప+ఉదకే, లోకే, ని, దధామి, అసౌ, అప, నః, శోశుచత్, అఘమ్. ॥౬॥

పదార్థః—(ప్రజాపతౌ)ప్రజాయాః పాలకే పరమేశ్వరే (త్వా)త్వామ్ (దేవతాయామ్) పూజనీయాయామ్(ఉపోదకే)ఉపగతాన్యుదకాని యస్మింస్తస్మిన్(లోకే)దర్శనీయే(ని)(దధామి) (అసౌ)(అప)(నః)అస్మాకమ్(శోశుచత్)భృశం శోషయతు(అఘమ్)పాపమ్. ॥౬॥ అన్వయః—హే జీవ! యోఽసౌ నోఽఘమపశోశుచత్తస్యాం ప్రజాపతౌ దేవతాయా ముపోదకే లోకే చ త్వా నిదధామి. ॥౬॥ భావార్థః—హే మనుష్యా! యో జగదీశ్వర ఉపాసితః సన్ పాపాచరణాత్ పృథక్ కారయతి తస్మిన్నేవ భక్తికరణాయ యుష్మానహం స్థిరీకరోమి యేన సదైవ యూయం శ్రేష్ఠం సుఖదర్శనం ప్రాప్నుయాత. ॥౬॥

పదార్థము—ఓ జీవమా! అసౌ=ఏ యీలోకము, నః=మనయొక్క, అఘమ్=పాపమును, అప శోశుచత్=శీఘ్రముగ శోషింపజేయునో, అట్టి,ప్రజాపతౌ = ప్రజారక్షకుడు, దేవతాయామ్=పూజనీయుడునగు పరమేశ్వరునియందును మఱియు,ఉపోదకే=ఉపగతము,సమీపస్థమునగు ఉదకముగలదియగు, లోకే=దర్శనీయస్థానమందును, త్వా=నిన్ను, నిదధామి=నిరంతరము ధారణమొనర్చుచున్నాను. ॥౬॥

భావార్థము—మానవులారా! ఉపాసించబడిన భగవంతుడు, మిమ్ము హింసాచరణములనుండి వేరుపఱచుచున్నాడు. ఎల్లప్పుడు మీరు శ్రేష్ఠసుఖదర్శనమును పొందగలుగుటకై అతనియందే భక్తి నుంచునటుల మిమ్ములను నేను స్థిరమొనర్చుచున్నాను.

---

1858 పరమిత్యస్య సంకసుక ఋషిః, యమో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున ర్మనుష్యైః కిం కర్తవ్య మిత్యాహ. మానవు లేమి చేయవలయును ?

పరం మృత్యో అను పరేహి పన్థాం యస్తే అన్య ఇతరో దేవయానాత్ ।
చక్షుష్మతే శృణ్వతే తే బ్రవీమి మా నః ప్రజాᳪ రీరిషో మోత వీరాన్ ॥౭॥

పరమ్, మృత్యో+ఇతి మృత్యో, అను, పరా, ఇహి, పన్థామ్, యః, తే, అన్యః, ఇతరః, దేవయానాదితి దేవ+యానాత్, చక్షుష్మతే, శృణ్వతే, తే, బ్రవీమి, మా, నః, ప్రజామితి ప్ర+జామ్, రీరిషః, రిరిష+ఇతి రిరిషః, మా, ఉత, వీరాన్. ॥౭॥

పదార్థః—(పరమ్)ప్రకృష్టమ్ (మృత్యో)మృత్యుః. అత్ర వ్యత్యయః (అను) (పరా)(ఇహి) దూరం గచ్ఛతు(పన్థామ్)మార్గమ్(యః)(తే)తవ(అన్యః) (ఇతరః)భిన్నః (దేవయానాత్) దేవా విద్వాంసో యాన్తి యస్మింస్తస్మాత్(చక్షుష్మతే)ప్రశస్తం చక్షు ర్విద్యతే యస్య తస్మై(శృణ్వతే) యః శృణోతి తస్మై(తే)తుభ్యమ్(బ్రవీమి)ఉపదిశామి(మా)(నః) అస్మాకమ్(ప్రజామ్) (రీరిషః) హింస్యాః(మా)(ఉత)అపి(వీరాన్)ప్రాప్తవిద్యాన్ శరీరబలయుక్తాన్. ॥౭॥ అన్వయః—హే

మనుష్య! యస్తే దేవయానాదితరోఽన్యో మార్గోఽస్తి తం పన్థానం మృత్యో పరేహి మృత్యుః పరైతు యతస్త్వం పరం దేవయాన మన్విహి అతఏవ చక్షుష్మతే శృణ్వతేఽహం తే బ్రవీమి యథా మృత్యుర్నః ప్రజాం న హింస్యాదుతాపి వీరాన్న హన్యాత్తథా త్వం ప్రజాం మా రీరిష ఉతాపి వీరాన్ వా రీరిషః. ॥౨॥ భావార్థః—మనుష్యైర్యావజ్జీవనం తావద్విద్వన్మార్గేణ గత్వా పరమాయుర్లబ్ధవ్యమ్ కదాచిద్వినా బ్రహ్మచర్యేణ స్వయంవరం కృత్వాఽల్పాయుషః ప్రజా నోత్పాదనీయా నచైతాసాం బ్రహ్మచర్యానుష్ఠానేన వియోగః కర్తవ్యః. ॥౨॥

పదార్థము—మానవుడా! తే=నీయొక్క, దేవయానాత్ = విద్వాంసులు నడచు మార్గమునకు, యః ఇతరః అన్యః = భిన్నముగ నే యన్యమార్గమున్నదో, పంథామ్ = ఆ మార్గమునకు, మృత్యో=మృత్యువు, పరా పహి = దూరముగ తొలగిపోవును గాక! కనుక నీవు, పరమ్ = ఉత్తమ దేవమార్గమును, అను = అనుకూలముగ పొందుము, ఇందు వలననే, చక్షుష్మతే = ఉత్తమ నయనములుగలవాడవు, శృణ్వతే = వినువాడవునగు, తే=నీకు, బ్రవీమి = ఉపదేశించుచున్నాను. ఎటుల మృత్యువు, నః = మా ప్రజలను గ్రసించదో, మఱియు వీరులనుగూడ మ్రింగదో, అటులనే నీవును, ప్రజామ్ = సంతానాదులను, మా రీరిషః = చంపకుము, విషయాదులతో నశింపజేయకుము, ఉత = మఱియు, వీరాన్ = విద్యాశరీర బలములతో యుక్తులైన వీరపురుషులను, మా = నశింపజేయకుము.

భావార్థము—మానవులు జీవితపర్యంతము విద్వాంసుల మార్గమున నడచి, ఉత్తమాయువును పొందవలయును. బ్రహ్మచర్య మనుష్ఠించక వివాహమాడి అల్పాయుష్కులగు బిడ్డలను పుట్టించగూడదు. మఱియు నా సంతానమును బ్రహ్మచర్యానుష్ఠానము నుండి విముఖులుగ నొనర్చకూడదు. ॥౨॥

---

1859 శం వాత ఇత్యస్య ఆదిత్యా దేవా వా ఋషయః, విశ్వేదేవా దేవతాః,
అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

సృష్టిస్థాః పదార్థాః కథం మనుష్యాణాం సుఖకారిణః స్యురిత్యాహ.

సృష్టిస్థ పదార్థములు మానవులకెట్లు సుఖకరములగుచున్నవి ?

శం వాతః శꣳహి తే ఘృణిః శం తే భవన్త్విష్టకాః ।
శం తే భవన్త్వగ్నయః పార్థివాసో మా త్వాభి శూశుచన్. ॥౩॥

శమ్, వాతః, శమ్, హి, తే, ఘృణిః, శమ్, తే, భవన్తు, ఇష్టకాః, శమ్, తే, భవన్తు, అగ్నయః, పార్థివాసః, మా, త్వా, అభి, శూశుచన్. ॥౩॥

పదార్థః—(శమ్)సుఖకరః (వాతః) వాయుః (శమ్) (హి)యతః(తే) (ఘృణిః)రశ్మివాన్ సూర్యః(శమ్)(తే)(భవన్తు)(ఇష్టకాః)వేద్యాం చితాః(శమ్)(తే)(భవన్తు) (అగ్నయః) పావకాః (పార్థివాసః)పృథివ్యాం విదితాః(మా)(త్వా)త్వామ్(అభి)(శూశుచన్)భృశం శోకం కుర్యుః॥౩॥ అన్వయః—హే జీవ! తే వాతః శం భవతు ఘృణిః శం హి భవతు ఇష్టకాస్తే శం భవన్తు పార్థివాసోఽగ్నయస్తే శం భవన్త్వేతే త్వామభి శూశుచన్. ॥౩॥ భావార్థః—హే జీవాస్తథైవ యుష్మాభిర్ధర్మ్యే వ్యవహారే వర్తితవ్యం యథా జీవతాం మృతానాం చ యుష్మాకం సృష్టిస్థా వాయ్వాదయః పదార్థాః సుఖకరాః స్యుః. ॥౩॥

పదార్థము—ఓ జీవమా! తే=నీకు, వాతః=వాయువు, శమ్ భవతు = సుఖకర మగునుగాక! ఘృణిః=కిరణయుక్త సూర్యుడు, శమ్ హి=సుఖకారి యగుగాక! ఇష్టకాః = వేదియందు పేర్చబడిన ఇటుకలు నీకై, శమ్ భవంతు = సుఖదాయకములగుగాక! పార్థివాసః అగ్నయః = పృథివినందు ప్రసిద్ధములైన విద్యుదాద్యగ్నులు, తే= నీకు, శమ్ భవన్తు=కళ్యాణకరములగుగాక! ఇవియన్నియు, త్వా=నిన్ను, మా అభిశూశుచన్ =ఏ వైపునుండియు శోకము గలిగింప జేయునవి కాకుండుగాక! ॥౮॥

భావార్థము—ఓ జీవులారా! బ్రతికియున్నను,చనిపోయినను సృష్టిలోనివాయ్వాది పదార్థములు మీకు సుఖకరములుగ నుండునటుల ధర్మయుక్త వ్యవహారమున మెలగవలయును. ॥౮॥ 1859

---

కల్పన్తామిత్యస్యాదిత్యా దేవా ఋషయః,విశ్వేదేవా దేవతాః, విరాట్ బృహతీ ఛన్దః,మధ్యమః స్వరః

పున స్తమేవ విషయ మాహ. మరల విషయ మయ్యదియే.

కల్పన్తాం తే దిశ స్తుభ్య మాపః శివతమా స్తుభ్యం భవన్తు సిన్ధవః ।
అన్తరిక్షఀ శివం తుభ్యం కల్పన్తాం తే దిశః సర్వాః. ॥౯॥

కల్పన్తామ్, తే, దిశః, తుభ్యమ్, ఆపః, శివతమా ఇతి శివ+తమాః, తుభ్యమ్, భవన్తు, సిన్ధవః, అన్తరిక్షమ్, శివమ్, తుభ్యమ్, కల్పన్తామ్, తే, దిశః, సర్వాః. ॥౯॥

పదార్థః—(కల్పన్తామ్)సమర్థా భవన్తు(తే)తుభ్యమ్(దిశః)పూర్వాద్యాః(తుభ్యమ్) (ఆపః) ప్రాణా బలాని వా(శివతమాః)అతిశయేన సుఖకరాః(తుభ్యమ్)(భవన్తు)(సిన్ధవః) నద్యః సముద్రా వా(అన్తరిక్షమ్)ఆకాశమ్(శివమ్)సుఖకరమ్. శివమితి సుఖ నా...నిఘం.౩. ౬.(తుభ్యమ్) (కల్పన్తామ్)(తే)తుభ్యమ్(దిశః)ఐశాన్యాద్యాః(సర్వాః)సమగ్రాః. ॥౯॥ అన్వయః—హే జీవ! తే దిశశ్శివతమాః కల్పన్తాం తుభ్యమాపః శివతమా భవన్తు తుభ్యం సిన్ధవః శివతమా భవన్తు. తుభ్యం శివమన్తరిక్షం భవతు తే సర్వా దిశః శివతమాః కల్పన్తామ్. ॥౯॥ భావార్థః—యేఽధర్మం విహాయ సర్వథా ధర్మమాచరన్తి తేభ్యః పృథివ్యాదయః సర్వే సృష్టిస్థాః పదార్థా మంగలకారిణో భవన్తి. ॥౯॥

పదార్థము—ఓ జీవమా! తే=నీకు, దిశః=పూర్వాది దిక్కులు, శివతమాః = అత్యంతసుఖకరములు లగుటకై,కల్పంతామ్=సమర్థములగుగాక!తుభ్యమ్=నీకు,ఆపః =ప్రాణములు లేక జలములు అతిసుఖకరములగుగాక!తుభ్యమ్=నీకు,సింధవః=నదులు సముద్రములు అతిసుఖప్రదములు, భవన్తు=అగుగాక! మఱియు, తే=నీకు,అంతరిక్షమ్ =ఆకాశము, శివమ్=కళ్యాణకరమగుగాక! తే=నీకు, సర్వాః దిశః = ఈశానాది సకల విదిశలు అత్యంత కళ్యాణకరములగుటకై, కల్పంతామ్ = సమర్థములగుగాక!

భావార్థము—అధర్మమును వీడి ధర్మము నన్ని విధముల నాచరించువారికై పృథివ్యాది సృష్టిస్థ పదార్థములన్నియు అత్యంతమంగళకరములు కాగలవు. ॥౯॥ 1860

---

1861 అశ్మన్వతీత్యస్య సుచీక ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

కే దుఃఖా త్తర న్తీత్యాహ. ఎవరు దుఃఖములనుండి తరించుచున్నారు ?

అశ్మన్వతీ రీయతే సꣳ రభధ్వ ముత్తిష్ఠత ప్ర తరతా సఖాయః ।

అత్రా జహీమోఽ శివా యే అసఞ్ఛివా న్వయము త్తరేమాభి వాజాన్॥

అశ్మన్వతీ త్యశ్మన్+వతీ, రీయతే, సమ్, రభధ్వమ్, ఉత్, తిష్ఠత, ప్ర, తరత, సఖాయః, అత్ర, జహీమః, అశివాః, యే, అసన్, శివాన్, వయమ్, ఉత్, తరేమ, అభి, వాజాన్. ॥౧౦॥

పదార్థః—(అశ్మన్వతీ)బహవోఽశ్మానో మేఘాః పాషాణా వా విద్యన్తే యస్యాం సృష్టౌ నద్యాం వా సా(రీయతే)గచ్ఛతి(సమ్)సమ్యక్(రభధ్వమ్)ప్రారమ్భం కురుత(ఉత్)(తిష్ఠత)ఉద్యుక్తా భవత(ప్ర)(తరత)దుఃఖాన్యుల్లఙ్ఘయత.అత్ర సంహితాయామితి దీర్ఘః(సఖాయః)సుహృదః సన్తః (అత్ర) అస్మిన్ సంసారే సమయే వా. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః(జహీమః)త్యజామః (అశివాః) అకల్యాణకరాః(యే)(అసన్)సన్తి(శివాన్)సుఖకరాన్(వయమ్) (ఉత్) (తరేమ) ఉల్లంఘయేము (అభి)(వాజాన్)అత్యుత్తమానన్నాది భోగాన్. ॥౧౦॥ అన్వయః—హే సఖాయో! యాఽశ్మన్వతీ రీయతే తయా వయం యేఽత్రాశివా అసన్ తాన్ జహీమః శివా న్వాజా నభ్యుత్తరేము తథా యూయం సంరభధ్వ ముత్తిష్ఠత ప్రతరత చ. ॥౧౦॥ భావార్థః—యే మనుష్యా! బృహత్యా నౌకయా సముద్రమివాఽశుభాచరణాని దుష్టాంశ్చ తీర్త్వా ప్రయత్నేనోద్యమినో భూత్వా మఙ్గలాన్యాచరేయు స్తే దుఃఖసాగరం సహజతః సన్తరేయుః. ॥౧౦॥

పదార్థము—సఖాయః = మిత్రులారా! అశ్మన్వతీ = అనేక మేఘములు లేక ప్రస్తరములు కలిగియున్న సృష్టి, లేక నది ప్రవాహమువలె, రీయతే = నడచుచున్నది. దానితోపాటు వయమ్ = మే మెటుల,అత్ర యే అశివాః అసన్ = ఈ జగత్తునందు లేక ఈకాలమున అకళ్యాణకరము లేవియున్నవో వానిని, జహీమః = వదలిపెట్టుచున్నామో,మఱియు, శివాన్ = సుఖకరములగు, వాజాన్ = అత్యుత్తమములగు అన్నాది భాగములను,అభిఉత్ తరేమ = అన్నివైపులనుండి తరణమొనర్చెదమో అనగా భోగించుదుమో అటులనే మీరును, సంరభధ్వమ్ = చక్కగా ఆరంభించుడు; ఉత్తిష్ఠత = ఉద్యతులు గండు,మఱియు, ప్రతరత = దుఃఖములను ఉల్లంఘించుడు. ॥౧౦॥

భావార్థము—పెద్ద నౌకతో సముద్రమును దాటుచున్నటుల అశుభాచరణములను, దుష్టజనులను [అతిక్రమించి]దాటి ప్రయత్నపూర్వకముగ పురుషార్థులై మంగళకరములగు ఆచరణము లొనర్చువారు దుఃఖసాగరమును సహజముగ తరించగలరు.॥

---

1862 అపాఘమిత్యస్య శునఃశేప ఋషిః, ఆపో దేవతాః, విరాడనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ కే పవిత్రకారకా ఇత్యాహ. ఏ మానవులు పవిత్రకారకులు ?

అపాఘ మప కిల్బిష మప కృత్యా మపో రపః

అపామార్గ త్వమస్మ దప దుఃష్వప్న్యꣳసువ. ॥౧౧॥

అప, అఘమ్, అప, కిల్విషమ్, అప, కృత్యామ్, అపో+ఇత్యపో, రపః, అపామార్గ, అపమార్గేత్యప+మార్గ, త్వమ్, అస్మత్, అప, దుఃష్వప్న్యమ్, దుఃష్వప్న్యమితి దుః+స్వప్న్యమ్, సువ. ॥౧౧॥

పదార్థః—(అప)దూరీకరణే(అఘమ్) పాపమ్ (అప) (కిల్బిషమ్) స్వాన్తస్థం మలమ్ (అప) (కృత్యామ్)దుష్క్రియామ్(అపో) దూరీకరణే (రపః) బాహ్యేన్ద్రియచాఞ్చల్యజన్యమపరాధమ్ (అపామార్గ)రోగనివారకోఽపామార్గ ఓషధిరివ పాపదూరీకర్తః(త్వమ్)(అస్మత్)అస్మాకం సకాశాత్(అప)(దుఃష్వప్న్యమ్)దుష్టశ్చాసౌ స్వప్నో నిద్రా చ తస్మిన్ భవమ్(సువ)ప్రేరయ ॥౧౧॥
అన్వయః—హే అపామార్గ!త్వ మస్మదఘ మపసువ కిల్విష మపసువ కృత్యా మపసువ రపోఽపో సువ. దుఃష్వప్న్య మపసువ. ॥౧౧॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. యథాఽపామార్గాద్యోషధయో రోగాన్నివార్య ప్రాణినః సుఖయన్తి తథా స్వయం సర్వేభ్యో దోషేభ్యః పృథగ్ భూత్వాఽన్యానశుభాచరణాత్ పృథక్ కృత్వా యే శుద్ధా భవన్త్యన్యాన్ భావయన్తి చ త ఏవ మనుష్యాదీనాం పవిత్రకరాః సన్తి. ॥౧౧॥

పదార్థము—అపామార్గ=అపామార్గ[ఉత్తరేణి]మను ఓషధి రోగమును దూరమొనర్చునటుల పాపములను దూరమొనర్చు సజ్జనపురుషా! త్వమ్ = నీవు, అస్మత్= మానుండి, అఘమ్=పాపమును, అప సువ=దూరపఱచుము. కిల్విషమ్ = మనోమాలిన్యమును దూరమొనర్చుము. కృత్యామ్=దుష్కర్మను, అప=తొలగించుము. రపః= బాహ్యేంద్రియముల చంచలత్వమను అపరాధమును,అపో=దూరపఱచుము,మఱియు దుఃష్వప్న్యమ్=చెడునిద్రలందు కలుగు విచారములను, అప=తొలగించుము. ॥౧౧॥

భావార్థము—ఉపమాలంకార మిందున్నది. అపామార్గాద్యోషధులు రోగములను తొలగించి సకలప్రాణులను సుఖపెట్టుచున్నటుల స్వయముగ సకలదోషముల నుండి వేరై, అన్యులను అశుభాచరణములనుండి తొలగించి తాము శుద్ధులై యితరులను శుద్ధులుగ నొనర్చువారే మనుష్యాదులను పవిత్రపఱచువారు కాగలుగుదురు. ॥

---

సుమిత్రియా న ఇత్యస్యాదిత్యా దేవా ఋషయః,ఆపో దేవతాః,నిచృదనుష్టుప్ ఛన్దః, ఋషభః,స్వరః

పున ర్మనుష్యాః కిం కుర్యు రిత్యాహ. మానవు లేమి చేయవలయును ?

సుమిత్రియా న ఆప ఓషధయః సన్తు దుర్మిత్రియా స్తస్మై సన్తు ।
యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మః. ॥౧౨॥

సుమిత్రియా+ఇతి సు+మిత్రియాః, నః, ఆపః, ఓషధయః, సన్తు, దుర్మిత్రియా ఇతి దుః+మిత్రియాః, తస్మై సన్తు, యః, అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్, ద్విష్మః. ॥౧౨॥

పదార్థః—(సుమిత్రియాః)శోభనా మిత్రా ఇవ(నః)అస్మభ్యమ్(ఆపః) ప్రాణా జలాని వా (ఓషధయః)సోమాద్యాః(సన్తు)(దుర్మిత్రియాః)దుర్మిత్రాః శత్రవ ఇవ దుఃఖప్రదాః(తస్మై)(సన్తు) (యః)(అస్మాన్)ధర్మాత్మనః(ద్వేష్టి)అప్రసన్నయతి(యమ్)దుష్టాచారిణమ్(చ)(వయమ్)(ద్విష్మః) అప్రీతయామః. ॥౧౨॥ అన్వయః—హే మనుష్యా! యా ఆప ఓషధయో నోఽస్మభ్యం సుమిత్రియాః సన్తు తా యుష్మభ్యమపి తాదృశ్యో భవన్తు యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మస్తస్మా ఏతా దుర్మిత్రియాః సన్తు. ॥౧౨॥ భావార్థః— యే రాగద్వేషాదిదోషాన్ విహాయ సర్వేషు స్వాత్మవద్వర్తన్తే తేభ్యో ధర్మాత్మభ్యః సర్వే జలౌషధ్యాదయః పదార్థాః సుఖకరా భవన్తి యే చ స్వాత్మపోషకాః పరద్వేషిణ స్తేభ్యోఽధర్మాత్మభ్యః సర్వ ఏతే దుఃఖకరా భవన్తి మనుష్యైర్ధర్మాత్మభిః సహ ప్రీతి ర్దుష్టాత్మభిః సహాఽప్రీతిశ్చసతతం కార్యా పరన్తు తేషా మప్యన్తఃకరణేన కల్యాణమేషణీయమ్. ॥౧౨॥

పదార్థము—మానవులారా! ఆపః = ప్రాణములు లేక జలములు మఱియు, ఓషధయః=సోమాద్యోషధులు, నః=మాకు, సుమిత్రియాః సంతు = సుందరమిత్రుల వలె హితకరములగుగాక! మీ కొఱకును అటులే యగుగాక! యః అస్మాన్ ద్వేష్టి= ఎవడు మమ్ములను ద్వేషించుచున్నాడో మఱియు, యమ్ = ఏ దుష్టాచారిని,వయమ్ ద్విష్మః=మేము అప్రీతి యొనర్చుదుమో, తస్మై=అతని కా పదార్థములు, దుర్మిత్రియాః సంతు=శత్రువులవలె దుఃఖదాయకము లగుగాక! ॥౧౨॥

భావార్థము— రాగద్వేషాది దోషములను వీడి అందఱితో ఆత్మ సదృశముగ ప్రవర్తించు ధర్మాత్ములకు ఓషధీజలాది పదార్థములు సుఖకరములగును, స్వార్థము నందు ప్రీతి, ఇతరులతో ద్వేషము యొనర్చు అధర్మాత్ములకు ఉక్తపదార్థములన్నియు దుఃఖదాయకములగును. మానవులు ధర్మాత్ములపట్ల ప్రీతి, అధర్మాత్ములయెడ అప్రీతి నిరంతరమొనరించవలయును.అయినను దుష్టులయెడకూడ అంతఃకరణమున కళ్యాణ మునే కాంక్షించవలయును. ॥౧౨॥ 1863

---

అనడ్వానిత్యస్యాదిత్యా దేవా ఋషయః, కృషీవలా దేవతాః, స్వరాడనుష్టుప్ ఛన్దః,గాన్ధారః స్వరః

కే మనుష్యాః కార్యం సాద్ధుం శక్నువన్తీత్యాహ.

ఏ మానవులు కార్యములను సాధించ గలరు?

అనడ్వాహ మన్వారభామహే సౌరభేయꣳ స్వస్తయే ।

స న ఇన్ద్ర ఇవ దేవేభ్యో వహ్నిః సన్తరణో భవ. ॥౧౩॥

అనడ్వాహమ్, అన్వారభామహ ఇత్యను ఆరభామహే, సౌరభేయమ్, స్వస్తయే, సః, నః, ఇన్ద్ర ఇవేతీన్ద్రః+ఇవ, దేవేభ్యః, వహ్నిః, సన్తరణ ఇతి సమ్+తరణః, భవ. ॥౧౩॥

పదార్థః—(అనడ్వాహమ్) యోఽనాంసి శకటాని వహతి తద్వద్వర్తమానమ్ (అన్వారభామహే)యానాని రచయిత్వా తత్ర స్థాపయేమ(సౌరభేయమ్)సురభ్యా అపత్యమ్ (స్వస్తయే)

సుఖాయ(సః)(నః)అస్మభ్యమ్(ఇన్ద్ర)ఇవ)విద్యుదివ(దేవేభ్యః)విద్వద్భ్యః(వహ్నిః)సద్యో వోఢాగ్నిః (సన్తరణః)యః సమ్యగధ్వన స్తారయతి పారం కరోతి సః(భవ)భవతు. అన్వయః—హే విద్వన్! యో వహ్ని ర్నో దేవేభ్యః సన్తరణో భవతి తం సౌరభేయమడ్వాహ మివ వర్త్తమాన మగ్నిం వయం స్వస్తయేఽన్వారభామహే. స తుభ్యం ఇన్ద్ర ఇవ భవ భవతు. ॥౧౩॥ భావార్థః—యే మనుష్యా విద్యుదాద్యగ్నివిద్యయా యానాదీని కార్యాణి కర్త్తుమారభన్తే తే బలిష్ఠై ర్వృషభైః కృషీవలా ఇవ స్వకార్యాణి సాద్ధుం శక్నువన్తి విద్యుదివేత స్తతో గన్తుఞ్చ.

పదార్థము—విద్వాంసుడా! వహ్నిః=శీఘ్రముగ చేర్పించు నేయగ్ని, నః దేవేభ్యః=మా విద్వాంసులకై, సంతరణః=చక్కని మార్గములగుండ దాటించునది యగుచున్నదో, సౌరభేయమ్=సురభి గోసంతానమగు, అనడ్వాహమ్ = బండి మొదలగు వానిని లాగు వృషభమువలెనున్న ఆ యగ్నితో మేము, స్వస్తయే = సుఖమునకై, అన్వారభామహే=యానముల నిర్మించి యందు ప్రాణుల ప్రతిష్ఠింపజేతుముగాక! సః=అది నీకు, ఇంద్ర ఇవ భవ=విద్యుత్తుల్యము అగుగాక! ॥౧౩॥

భావార్థము—విద్యుదాద్యగ్ని విద్యచే యాన నిర్మాణాదికార్యము లొనర్చుటకభ్యసించు మానవులతి బలవంతములగు వృషభములతో వ్యవసాయ మొనర్చువారివలె కార్యములను సాధించగలుగుచున్నారు. విద్యుదగ్నివలె శీఘ్రముగ నిటునటు సంచరించగలుగుచున్నారు. ॥౧౩॥ 1864

---

ఉద్వయన్తమిత్యస్యాదిత్యా దేవా ఋషయః, సూర్యో దేవతా, విరాడనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః

కే మోక్ష మధిగచ్ఛన్తీత్యాహ. ఎవరు మోక్షమును పొందుచున్నారు?

ఉద్వయ న్తమసస్పరి స్వః పశ్యన్త ఉత్తరమ్ ।
దేవం దేవత్రా సూర్య మగన్మ జ్యోతి రుత్తమమ్. ॥౧౪॥

ఉత్, వయమ్, తమసః, పరి, స్వరితిస్వః, పశ్యన్తః, ఉత్తరమిత్యుత్+తరమ్, దేవమ్, దేవత్రేతి, దేవ+త్రా, సూర్యమ్, అగన్మ, జ్యోతిః, ఉత్తమమిత్యుత్+తమమ్. ॥౧౪॥

పదార్థః—(ఉత్)(వయమ్)(తమసః)అన్ధకారాత్ (పరి) వర్జనే (స్వః) స్వప్రకాశమాదిత్యమ్ (పశ్యన్తః)ప్రేక్షమాణాః (ఉత్తరమ్)దుఃఖేభ్య ఉత్తారకం పరత్ర వర్త్తమానమ్ (దేవమ్)విజయాది లాభప్రదమ్(దేవత్రా)దేవేషు విద్వత్సు ప్రకాశమయేషు సూర్యాదిషు వా(సూర్యమ్) అన్తర్యామిరూపేణ స్వవ్యాప్త్యా చరాఽచరాత్మానం పరమాత్మానం (అగన్మ)విజానీయామ (జ్యోతిః) స్వప్రకాశమ్(ఉత్తమమ్)సర్వోత్కృష్టమ్ ॥౧౪॥ అన్వయః—హే మనుష్యా!వయం యం తమసస్పరం స్వరివ వర్త్తమానం దేవత్రా దేవం జ్యోతి రుత్తమ ముత్తరం సూర్యం పశ్యన్తః సన్తః పర్యుదగన్మ తమేవ యూయమపి సర్వతో విజానీత ॥౧౪॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలంకారః. హే మనుష్యా! యథా సూర్యం పశ్యన్తో దీర్ఘాయుషో ధర్మాత్మానో జనాః సుఖం లభన్తే తథైవ ధార్మికా యోగినో మహాదేవం సర్వప్రకాశకం జన్మమృత్యుక్లేశాదిభ్యః పృథగ్ వర్త్తమానం సచ్చిదానన్దస్వరూపం పరమాత్మానం సాక్షాద్విజ్ఞాయ మోక్షమవాప్య సతతమానన్దన్తి

పదార్థము—మానవులారా! తమసః=అంధకారమునకు పరుడు, స్వః=స్వయం ప్రకాశరూపుడగు సూర్యునివలె నున్నవాడు, దేవత్రా = విద్వాంసులలో, ప్రకాశమయములగు సూర్యాది పదార్థములలో, దేవమ్=విజయాది లాభముల నిచ్చువాడు, జ్యోతిః=స్వయంప్రకాశమయుడు, ఉత్తమమ్=సర్వోత్తముడు, ఉత్తరమ్=దుఃఖములను తరింపజేయువాడు, సూర్యమ్=అంతర్యామి రూపమున సకల చరాచరములకు స్వామియునైన యే పరమాత్మను మేము, పశ్యంతః=జ్ఞానదృష్టితో చూచుచు,పరి ఉత్ అగన్మ=అన్నివిధముల శ్రేష్ఠముగ ఎరుగుదుమో, అతనినే మీరును గుర్తించుడు.॥౧౪

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది.మానవులారా! సూర్యుని చూచుచు దీర్ఘాయుష్మంతులగు ధర్మాత్ములు సుఖమును పొందుచున్నటుల ధర్మాత్ములైన యోగులు మహాదేవుడు, సర్వప్రకాశకుడు, జన్మమృత్యుక్లేశాదులచే రహితుడు, సచ్చిదానంద స్వరూపుడునగు పరమాత్ముని సాక్షాత్తుగా నెఱిగి మోక్షమును పొంది నిరంతరము ఆనందితులగుచున్నారు. ॥౧౪॥ 1865

---

1866 ఇమమిత్యస్య సఙ్కసుక ఋషిః, ఈశ్వరో దేవతా, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.
పునస్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

ఇమం జీవేభ్యః పరిధిం దధామి మైషాం ను గాదపరో అర్థ మేతమ్ ।
శతం జీవన్తు శరదః పురూచీ రన్త ర్మృత్యుం దధతాం పర్వతేన ॥౧౫॥

ఇమమ్, జీవేభ్యః, పరిధిమితి పరి+ధిమ్, దధామి, మా, ఏషామ్, ను, గాత్, అపరః, అర్థమ్, ఏతమ్, శతమ్, జీవన్తు, శరదః, పురూచీః, అన్తః, మృత్యుమ్, దధతామ్, పర్వతేన. ॥౧౫॥

పదార్థః—(ఇమమ్)ప్రత్యక్షమ్ (జీవేభ్యః) ప్రాణధారకేభ్యః స్థావరజఙ్గమేభ్యశ్చ (పరిధిమ్) మర్యాదామ్ (దధామి) వ్యవస్థాపయామి (మా) (ఏషామ్) జీవానామ్ (ను) సద్యః (అగాత్) ప్రాప్నుయాత్ (అపరః)అన్యః (అర్థమ్)ద్రవ్యమ్ (ఏతమ్) ప్రాప్తమ్(శతమ్) (జీవన్తు) (శరదః) (పురూచీః) యాః పురూణి బహూని వర్షాణ్యఞ్చన్తి తాః(అన్తః) మధ్యే(మృత్యుమ్)(దధతామ్) ధారయన్తు (పర్వతేన)జ్ఞానేన బ్రహ్మచర్యాదినా వా ॥౧౫॥ అన్వయః—అహం పరమేశ్వర ఏషాం జీవానా మేత మర్థ మపరో మా ను గాదితీమం జీవేభ్యః పరిధిం దధామ్యేవ మాచరన్తో భవన్తః పురూచీః శతం శరదో జీవన్తు పర్వతేన మృత్యు మన్త ర్దధతామ్ ॥౧౫॥ భావార్థః—హే మనుష్యా! యే పరమేశ్వరేణ వ్యవస్థాపితాం ధర్మాచరణం కార్యమధర్మాచరణం త్యాజ్యమితి మర్యాదాం నోల్లఙ్ఘన్తేఽన్యాయేన పరపదార్థాన్న స్వీకుర్వన్తి తేఽరోగాః సన్తశ్శతం వర్షాణి జీవితుం శక్నువన్తి నేతర ఈశ్వరాజ్ఞాభఙ్క్తారః.యే పూర్ణేన బ్రహ్మచర్యేణ విద్యా అధీత్య ధర్మ మాచరన్తి తాన్మృత్యు ర్మధ్యే నాప్నోతీతి ॥౧౫॥

పదార్థము—పరమేశ్వరుడనైన నేను, ఏషామ్ = ఈ జీవులయొక్క, ఏతమ్= పరిశ్రమతో సంపాదించిన, అర్థమ్=ద్రవ్యమును, అపరః=అన్యులెవరు, మా ను గాత్

= తేలికగా కాజేయకూడదు. అని, జీవేభ్యః = జీవులకై, ఇమమ్ పరిధిమ్ = ఈ మర్యాదను, కట్టుబాటును ఏర్పాటుచేయుచున్నాను. ఇటు లాచరించుచు మీరు, పురూచీః = చాలాసంవత్సరములకు సంబంధించిన, శతమ్ శరదః = శతశరదృతువులు పూర్తిగ, జీవన్తు = జీవించుడు, పర్వతేన = జ్ఞానముచే లేక బ్రహ్మచర్యాదులచే, మృత్యుమ్ = మృత్యువును, అంతః దధతామ్ = అణచివేయుడు. దూర మొనర్చుడు. ॥౧౫॥

భావార్థము—మానవులారా! ధర్మము నాచరించవలయునని, అధర్మము నాచరించగూడదనియు పరమాత్మ డొనర్చిన కట్టుబాటును ఉల్లంఘించనివారు అన్యాయముతో నితరుల పదార్థముల గ్రహించనివారు నీరోగులై శతవర్షములు జీవించగలుగుదురు. ఈశ్వరాజ్ఞోల్లంఘకులు జీవించజాలరు పూర్ణ బ్రహ్మచర్యముతో విద్య నభ్యసించి ధర్మాచరణ మొనరించువారిని మధ్యలో మృత్యువు సమీపించదు. ॥౧౫॥ 1866

---

1867 అగ్న ఇత్యస్యాదిత్యా దేవా ఋషయః, అగ్ని ర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.
కే జనా దీర్ఘాయుషో భవన్తీత్యాహ. ఏ మానవులు దీర్ఘాయువును పొందుదురు ?

అగ్న ఆయూꣳషి పవస ఆ సువోర్జ మిషఞ్చ నః । ఆరే బాధస్వ దుచ్ఛునామ్॥

అగ్నే, ఆయూꣳషి, పవసే, ఆ, సువ, ఊర్జమ్, ఇషమ్, చ, నః, ఆరే, బాధస్వ, దుచ్ఛునామ్. ॥౧౬॥

పదార్థః—(అగ్నే) పరమేశ్వర విద్వన్ వా (ఆయూంషి) అన్నాదీని జీవనాని వా.ఆయురిత్యన్న నా... నిఘం. అ. ౧(పవసే) పవిత్రీకరోషి (ఆ) (సువ) జనయ (ఊర్జమ్)బలమ్ (ఇషమ్) విజ్ఞానమ్ (చ)(నః) అస్మభ్యమ్ (ఆరే)దూరే నికటే వా (బాధస్వ) (దుచ్ఛునామ్) దుష్టాః శ్వాన ఇవ వర్తమానాస్తాన్ హింస్యాన్ ప్రాణినః.అత్ర కర్మణి షష్ఠీ ॥౧౬॥ అన్వయః—హే అగ్నే! త్వమాయూంషి పవసే న ఊర్జ మిషం చాసువ దుచ్ఛునా మారే బాధస్వ ॥౧౬॥ భావార్థః—యే మనుష్యా దుష్టాచరణదుష్టసఙ్గౌ విహాయ పరమేశ్వరాప్తయోః సేవాం కుర్వన్తి తే ధన ధాన్యయుక్తాః సన్తో దీర్ఘాయుషో భవన్తి. ॥౧౬॥

పదార్థము—అగ్నే = పరమేశ్వరుడా! లేక విద్వాంసుడా ! నీవు, ఆయూంషి = అన్నాదిపదార్థములను, లేక జీవములను, పవసే = పవిత్రమొనర్చుచున్నావు. నః = మాకై, ఊర్జమ్ = బలమును, చ = మరియు, ఇషమ్ = విజ్ఞానమును, ఆ సువ = బాగుగా నుత్పన్న మొనర్చుము, దుచ్ఛునామ్ = కుక్కలవలె దుష్టహింసక ప్రాణులను, దూరే = దూరముగనే గాని, దగ్గఱగనే గాని, బాధస్వ = తాడన మొనర్చుము. ॥౧౬॥ 1867

భావార్థము—దుష్టుల సాంగత్యము,దుష్టాచరణమును వీడి పరమేశ్వరుని,ఆప్తుడు సత్యవాదియునగు విద్వాంసుని సేవించుమానవులు ధనధాన్యయుతులై దీర్ఘాయుష్మంతులగుదురు. ॥౧౬॥

---

1868 ఆయుష్మానిత్యస్య వైఖానస ఋషిః, అగ్ని ర్దేవతా, స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
అథ రాజధర్మ విషయ మాహ. రాజధర్మ విషయము.

ఆయుష్మా నగ్నే హవిషా వృధానో ఘృతప్రతీకో ఘృతయోని రేధి ।
ఘృతం పీత్వా మధు చారు గవ్యం పితేవ పుత్ర మభి రక్షతా దిమాన్త్స్వాహా॥

ఆయుష్మాన్, అగ్నే, హవిషా, వృధానః, ఘృతప్రతీక ఇతి ఘృత+ప్రతీకః, ఘృతయోని రితి ఘృత+యోనిః, ఏధి, ఘృతమ్, పీత్వా, మధు, చారు, గవ్యమ్, పితేవేతి పితా+ఇవ, పుత్రమ్, అభి, రక్షతాత్, ఇమాన్, స్వాహా॥౧౭॥

పదార్థః—(ఆయుష్మాన్)బహ్వాయు ర్విద్యతే యస్య సః(అగ్నే)అగ్నిరివ వర్తమాన రాజన్ (హవిషా)ఘృతాదినా (వృధానః)వర్ధమానః. అత్ర బహులం ఛన్దసీతి శానచి శపో లుక్(ఘృతప్రతీకః)యో ఘృత ముదకం ప్రత్యాయయతి సః(ఘృతయోనిః)ఘృతం ప్రదీప్తం తేజో యోనిః కారణం గృహం వా యస్య సః(ఏధి)భవ (ఘృతమ్)(పీత్వా)(మధు)మధురమ్ (చారు) సున్దరమ్ (గవ్యమ్)గోర్వికారమ్(పితేవ) (పుత్రమ్) (అభి)ఆభిముఖ్యే (రక్షతాత్) రక్ష (ఇమాన్) (స్వాహా) సత్యయా క్రియయా ॥౧౭॥ అన్వయః—హే అగ్నే! యథా హవిషా వృధానో ఘృతప్రతీకో ఘృతయోని రగ్ని ర్వర్ధతే తథాఽఽయుష్మాంస్త్వమేధి.మధుచారు గవ్యం ఘృతం పీత్వా పుత్రం పితేవ స్వాహేమా నభి రక్షతాత్ ॥౧౭॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా సూర్యాదిరూపేణాగ్ని ర్బాహ్యాభ్యన్తరః సన్ సర్వాన్ రక్షతి తథైవ రాజా పితృవద్వర్తమానః సన్ పుత్ర మివేమాః ప్రజాః సతతం రక్షేత్. ॥౧౭॥

పదార్థము—అగ్నే=అగ్నివలెనుండు తేజస్వీ! రాజా! ఎటుల,హవిషా=ఘృతాదులచే, వృధానః=వృద్ధిజెందినది, ఘృతప్రతీకః=జలమును ప్రసిద్ధిపఱచునది. ఘృతయోనిః=ప్రదీప్తమగు తేజస్సును కారణముగ లేక గృహముగ కలిగియున్నదియునగు నగ్ని వృద్ధిజెందునో, అటులనే, ఆయుష్మాన్ = పెద్దవయస్సుగలవాడవై నీవు, ఏధి=వర్ధిల్లుము. మధు=మధురమును, చారు=సుందరమునునగు, గవ్యమ్ ఘృతమ్=గోఘృతమును, పీత్వా=త్రాగి,పుత్రమ్ పితా ఇవ=కొడుకును తండ్రి[రక్షించుచున్నటుల]వలె,స్వాహా=సత్యక్రియతో,ఇమాన్=ఈ ప్రజాస్థమనుష్యులను, అభి రక్షతాత్=ఆభిముఖ్యుడవై రక్షించుము. ॥౧౭॥

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది. సూర్యాదిరూపమున అగ్ని బాహ్యాభ్యంతరమునందుండి అందఱిని రక్షించుచున్నటుల రాజు పితరునివలె ప్రవర్తించుచు పుత్రసదృశులగు నీప్రజలను నిరంతరము రక్షించవలెను. ॥౧౭॥ 1868

---

1869 పరీమ ఇత్యస్య భరద్వాజః శిరమ్బిఠ ఋషిః, ఇన్ద్రో దేవతా,విరాడనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

పరీమే గామనేషత పర్యగ్ని మహృషత ।
దేవేష్వక్రత శ్రవః క ఇమాం॥ ఆ దధర్షతి. ॥౧౮॥

పరి, ఇమే, గామ్, అనేషత, పరి, అగ్నిమ్, అహృషత, దేవేషు,

అక్రత, శ్రవః, కః, ఇమాన్, ఆ, దధర్షతి. ॥౧౮॥

పదార్థః—(పరి)సర్వతః(ఇమే)(గామ్) వాణీం పృథివీం వా(అనేషత)(పరి)సర్వతః(అగ్నిమ్)(అహ్వృషత) హరత (దేవేషు) విద్వత్సు (అక్రత).కురుత అత్ర మంత్రే ఘసేతి చ్లేర్లుక్ (శ్రవః) అన్నమ్(కః)(ఇమామ్)(ఆ)(దధర్షతి)ధర్షయితుం శక్నోతి. అత్ర లేటి వ్యత్యయేన శ్లుః ॥౧౮॥
అన్వయః—హే రాజజనాః య ఇమే యూయం గాం పర్యనేషతాఽగ్నిం పర్యహ్వృషత. ఏషు దేవేషు శ్రవోఽక్రతైవం భూతా నిమా న్భవతః క ఆ దధర్షతి ॥౧౮॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యే రాజజనాః పృథివీవద్ధీరా అగ్నివత్తేజస్వినోఽన్నవదాయుష్కరాః సన్తో ధర్మేణ ప్రజా రక్షన్తి తేఽతులాం రాజశ్రియ మాప్నువన్తి ॥౧౮॥

పదార్థము—రాజపురుషులారా! ఇమే = ఈ మీరు,గామ్ = వాణిని లేక పృథివిని, పరి అనేషత = స్వీకరించుడు. అగ్నిమ్ = అగ్నిని, పరి అహ్వృషత = అన్నివైపులనుండి హరించుడు అనగా కార్యమునందుపయోగించుడు,దేవేషు = ఈ విద్వాంసులయందు, శ్రవః = అన్నమును, అక్రత = చేయుడు, ఇటుల మెలగు మిమ్ములను, కః = ఎవడు, ఆ దధర్షతి = గద్దించగలుగును ? ॥౧౮॥

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది. పృథివివలె ధీరపురుషులు, అగ్నివలె తేజస్వులు, అన్నమువలె ఆయుర్వర్ధకులు నగుచు ప్రజలను రక్షించు రాజపురుషులు అతుల రాజ్యలక్ష్మిని పొందుచున్నారు. ॥౧౮॥ 1869

---

1870 క్రవ్యాదమిత్యస్య దమన ఋషిః, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః
పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

క్రవ్యాద మగ్నిం ప్ర హిణోమి దూరం యమరాజ్యం గచ్ఛతు రిప్రవాహః ।
ఇహైవాయ మితరో జాతవేదా దేవేభ్యో హవ్యం వహతు ప్రజానన్ ॥౧౯॥

క్రవ్యాదమితి క్రవ్య+అదమ్, అగ్నిమ్, ప్ర, హినోమి, దూరమ్, యమరాజ్యమితి యమరాజ్యమ్, గచ్ఛతు, రిప్రవాహః ఇతి రిప్ర+వాహః, ఇహ, ఏవ, అయమ్, ఇతరః, జాతవేదా ఇతి జాత+వేదాః, దేవేభ్యః, హవ్యమ్, వహతు, ప్రజానన్నితి ప్ర+జానన్. ॥౧౯॥

పదార్థః—(క్రవ్యాదమ్)యః క్రవ్యం మాంసమత్తి తమ్ (అగ్నిమ్)అగ్నిమివాఽన్యాన్ పరితాపకమ్ (ప్ర)(హిణోమి)గమయామి(దూరమ్)(యమఽరాజ్యమ్) యమస్య న్యాయాధీశస్య స్థానమ్(గచ్ఛతు)(రిప్రవాహః)యే రిప్రం పాపం వహన్తి తాన్ (ఇహ) అస్మిన్ సంసారే (ఏవ)(అయమ్)(ఇతరః)భిన్నః(జాతవేదాః)జాతప్రజ్ఞానః(దేవేభ్యః)ధార్మికేభ్యో విద్వద్భ్యః (హవ్యమ్) ఆదాతు మర్హం విజ్ఞానమ్ (వహతు)ప్రాప్నోతు (ప్రజానన్)ప్రకర్షేణ జానన్ సన్ ॥౧౯॥
అన్వయః—ప్రజాన న్నహం క్రవ్యాద మగ్ని మివ వర్తమానం యం దూరం ప్రహిణోమి యాశ్చ రిప్రవాహాశ్చ దూరం ప్రహిణోమి స యమరాజ్యం గచ్ఛతు తే చ ఇహైతరోఽయం జాతవేదా దేవేభ్యో హవ్యమేవ వహతు ॥౧౯॥ భావార్థః—అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే

న్యాయాధీశాః! యూయం దుష్టాచారిణః సంతాడ్య ప్రాణాదపి వియోజ్య శ్రేష్ఠాన్ సత్కృత్యేహ సృష్టౌ సామ్రాజ్యం కురుత. ॥౧౯॥

పదార్థము—ప్రజానన్ = బాగుగ నెఱుగుచున్న నేను, క్రవ్యాదమ్ = పచ్చిమాంసమును తినువాడు, అగ్నిమ్ = అగ్నివలె ఇతరులను తపింపజేయువాడునునైన దుష్టుని, దూరమ్ ప్రహిణోమి = దూరముగ తఱిమెదను, మఱియు, రిప్రవాహః = పాపి[భార]మును ఎత్తుకొను దుష్టులను దూరమొనర్చుచున్నాను. అతను, మఱియు ఆ పాపులందరు, యమరాజ్యమ్ = న్యాయాధీశుడైన రాజుయొక్క న్యాయాలయమునకు, గచ్ఛతు = పోవుదురు గాక! ఇహ = ఈ జగత్తునందు, ఇతరః అయమ్ జాతవేదాః = ధర్మాత్ముడగు నీ రెండవ విద్వాంసుడు, దేవేభ్యః = ధార్మికవిద్వాంసులను, హవ్యమ్ = గ్రహించదగిన విజ్ఞానమును, ఏవ = అవధారణార్థము, వహతు = లభించును గాక! ॥౧౯॥

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది. మీరు దుష్టాచారులను చక్కగా తాడనమొనర్చి, ప్రాణములనుగూడ తొలగించి, శ్రేష్ఠులను సత్కరించి యీ సృష్టియందు సామ్రాజ్యమును, అనగా చక్రవర్తి రాజ్యము నొనర్చుడు. ॥౧౯॥ 1870

---

1871 వహ వపామిత్యస్యాదిత్యా దేవా ఋషయః,

జాతవేదా దేవతా, స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ పితృసేవన విషయ మాహ. పితరులకు సేవచేయు విషయము.

**వహ వపాం జాతవేదః పితృభ్యో యత్రైనాన్వేత్థ నిహితాన్పరాకే**
**మేదసః కుల్యా ఉపతాన్త్స్రవన్తు సత్యా ఏషా మాశిషః సం నమన్తాꣳ స్వాహా॥**

వహ, వపామ్, జాతవేద ఇతి జాత+వేదః, పితృభ్య ఇతి పితృ+భ్యః, యత్ర, ఏనాన్, వేత్థ, నిహితానితి ని+హితాన్, పరాకే, మేదసః, కుల్యాః, ఉప, తాన్, స్రవన్తు, సత్యాః, ఏషామ్, ఆశిష ఇత్యా+శిషః, సమ్, నమన్తామ్, స్వాహా॥

పదార్థః—(వహ) ప్రాప్నుహి (వపామ్) వపన్తి యస్యాం భూమౌ తామ్ (జాతవేదః) జాతప్రజ్ఞానః (పితృభ్యః) జనకేభ్యో విద్యాశిక్షాదాతృభ్యో వా (యత్ర) (ఏనాన్) (వేత్థ) జానాసి (నిహితాన్) (పరాకే) దూరే (మేదసః) స్నిగ్ధాః (కుల్యాః) జలప్రవాహోధారాః (ఉప) (తాన్) జనాన్ (స్రవన్తు) ప్రాప్నువన్తు (సత్యాః) సత్సు సాధ్వ్యః (ఏషామ్) (ఆశిషః) ఇచ్ఛాః (సమ్) సమ్యక్ (నమన్తామ్) ప్రాప్నువన్తు (స్వాహా) సత్యయా క్రియయా ॥౨౦॥ అన్వయః—హే జాతవేదస్త్వం యత్రైతాన్ పరాకే నిహితాన్ వేత్థ తత్ర పితృభ్యో వపాం వహ యథా మేదసః కుల్యాస్తానుపస్రవన్తు తథా స్వాహైషా మాశిషః సత్యాః సన్నమన్తామ్ ॥౨౦॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యే దూరే స్థితాన్ పితౄన్ విదుషశ్చాహూయ సత్కుర్వన్తి యథాఽఽరామవృక్షాదీన్ జలవాయూ వర్ధయతస్తథైతేషామిచ్ఛా సత్యాః సత్యః సర్వతో వర్ధన్తే. ॥౨౦॥

పదార్థము—జాతవేదః = ఉత్తమజ్ఞానమును పొందినవాడా! నీవు, యత్ర =

ఎక్కడ, పరాకే = దూరముగ, ఏతాన్ నిహితాః = ఉన్న యీ పితరులను, వేత్థ = ఎఱుగుదువో, అక్కడ, పితృభ్యః = జనకులనుండి లేక విద్యాశిక్షాదాతలైన గురువుల నుండి, వపామ్ = వ్యవసాయయోగ్యమైన భూమిని, వహ = పొందుము. ఎటుల, మేదసః = ఉత్తమములైన, కుల్యాః = జలప్రవాహములతో కూడిన నదులు లేక కాలువలు, తాన్ = ఆ సజ్జనులకు, ఉప స్రవంతు = సమీపముగ లభించునో, అటులనే, స్వాహా = సత్యక్రియతో, ఏషామ్ = వీరియొక్క, ఆశిషః = కోరికలు, సత్యాః = సత్యములై, సమ్ నమంతామ్ = చక్కగా లభించునుగాక ! ॥౨౦॥

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది. దూరముగనున్న పితరులను, విద్వాంసులను ఆహ్వానించి సత్కరించువారికోరికలు సత్యములై, ఆ రామవృక్షములను జలవాయువులు పెంపొందజేయుచున్నటుల అన్నివిధముల పెంపొందును.

---

1872 స్యోనేత్యస్య మేధాతిథిరృషిః, పృథివీ దేవతా,
నిచృద్ గాయత్రీ, అపన ఇతి ప్రాజాపత్యా గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః,
గృహిణీ కీదృశీ స్యాదిత్యాహ. కులీన గృహిణి ఎటులుండవలయును ?

స్యోనా పృథివి నో భవానృక్షరా నివేశనీ ।
యచ్ఛా నః శర్మ సప్రథాః । అప నః శోశుచదఘమ్ ॥౨౧॥

స్యోనా, పృథివి, నః, భవ, అనృక్షరా, నివేశనీతి ని+వేశనీ, యచ్ఛ, నః, శర్మ, సప్రథా ఇతి స+ప్రథాః, అప, నః, శోశుచత్, అఘమ్. ॥౨౧॥

పదార్థః—(స్యోనా) సుఖకరీ(పృథివి) భూమి రివ వర్తమానే(నః)అస్మభ్యమ్ (భవ) (అనృక్షరా)నిష్కణ్టకా (నివేశనీ) నివిశన్తే యస్యాం సా (యచ్ఛ) దేహి.అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (నః)అస్మభ్యమ్(శర్మ)సుఖమ్(సప్రథాః)విస్తీర్ణేన ప్రశంసనేన సహ వర్తమానాః(అప)దూరీకరణే (నః)అస్మాకమ్(శోశుచత్)భృశం శోధయతు (అఘమ్) పాపమ్ ॥౨౧॥ అన్వయః—హే పృథివి భూమి రివ వర్తమానే స్త్రీ! త్వం యథాఽనృక్షరా నివేశనీ భూమిః స్యోనా భవతి తథా నో భవ సప్రథాః సతీ న శ్శర్మ యచ్ఛ యథా న్యాయేశో నోఽఘమపశోశుచ త్తథాఽపరాధం దూరం గమయ ॥౨౧॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యా స్త్రీ పృథివీవత్ క్షమాశీలా క్రూరతాది దోషరహితా బహుప్రశంసితా అన్యేషామపి దోషనివారికా భవతి సైవ గృహకృత్యే యోగ్యా భవతి. ॥౨౧॥

పదార్థము—పృథివి = భూమివలె నుండు క్షమాశీలవైన పడతీ!నీవు ఎటుల, అనృక్షరా = కంటకాది రహితము, నివేశనీ = కూర్చొనుట కాధారమునగు భూమి, స్యోనా = సుఖకరమగునో అటుల, నః = మాకు, శర్మ = సుఖమును, యచ్ఛ = ప్రసాదించుము, న్యాయాధీశుడెటుల, నః అఘమ్ = మా పాపములను, అప శోశుచత్ = శీఘ్రముగ దూరమొనర్చునో లేక శుద్ధమొనర్చునో అటులనే నీవు అపరాధమును దూరమొనర్చుము.

భావార్థము—ఇందు వాచక లుప్తోపమాలంకార మున్నది.పృథివివలె క్షమాశీల, ఓపికగలది, క్రూరత్వాది దోషరహిత, బహుప్రశంసితురాలు, ఇతరుల దోషములను కూడ నివారించునదియునై యుండు స్త్రీయే గృహకార్యములకు యోగ్యురాలగుచున్నది. ॥౨౧॥ 1872

1873 అస్మాదిత్యస్యాదిత్యా దేవా ఋషయః, అగ్నిర్దేవతా, స్వరాడ్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః

పున ర్మనుష్యైః కిం కర్తవ్య మిత్యాహ. మానవు లేమి చేయవలయును ?

అస్మాత్త్వమధి జాతోఽసి త్వదయం జాయతాం పునః ।

అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా. ॥౨౨॥

అస్మాత్, త్వమ్, అధి, జాతః, అసి, త్వత్, అయమ్, జాయతామ్,

పునరితి పునః, అసౌ, స్వర్గాయేతి స్వః+గాయ, లోకాయ, స్వాహా. ॥౨౨॥

పదార్థః—(అస్మాత్)లోకాత్(త్వమ్)(అధి) ఉపరిభావే (జాతః) (అసి) భవసి (త్వత్) తవ సకాశా దుత్పన్నః(అయమ్)పుత్రః (జాయతామ్)ఉత్పద్యతామ్ (పునః) పశ్చాత్ (అసౌ) విశేష నామా(స్వర్గాయ) విశేషసుఖభోగాయ (లోకాయ)ద్రష్టవ్యాయ(స్వాహా)సత్యయా క్రియయా

అన్వయః—హే విద్వన్!యత స్త్వమస్మాల్లోకా దధిజాతోఽసి తస్మాదయం త్వత్పున రసౌ స్వాహా స్వర్గాయ లోకాయ జాయతామ్ ॥౨౨॥ భావార్థః—హే మనుష్యా! యుష్మాభి రిహ మనుష్య శరీరం ధృత్వా విద్యాసుశిక్షాసుశీలధర్మయోగవిజ్ఞానాని సఙ్గృహ్య ముక్తిసుఖాయ ప్రయతి తవ్య మిద మేవ మనుష్యజన్మసాఫల్యం వేద్యమితి. ॥౨౨॥

పదార్థము—విద్వాంసుడా! త్వమ్=నీవు, అస్మాత్=ఈలోకమునకంటె అనగా నేటి మానవులకంటె, అధి జాతః అసి=సర్వోపరిగ ప్రసిద్ధుడవై యున్నావు. కావున, అయమ్=ఈ పుత్రుడు, త్వత్=నీకంటె, పునః=తర్వాత, అసౌ=విశేషనామము గలవాడై, స్వాహా=సత్యక్రియతో, లోకాయ=చూడదగిన, స్వర్గాయ=విశేష సుఖమును భోగించుటకు, జాయతామ్=సమర్థుడగు గాక ! ॥౨౨॥

భావార్థము—మానవులారా! మీ రిచట మానవశరీరమును ధరించి విద్యా సుశిక్షలను, సౌశీల్యమును, ధర్మమును, యోగాభ్యాసమును,విజ్ఞానమును చక్కగా గ్రహించి మోక్షసుఖమునకై ప్రయత్నించుడు. ఇదియే మానవజన్మయొక్క సాఫల్యమని గ్రహించుడు. ॥౨౨॥ 1873

అస్మిన్నధ్యాయే వ్యవహార జీవగతి జన్మ మృత్యు సత్యాఽఽశీ రగ్ని సత్యేచ్ఛానాం వ్యాఖ్యానా దేతదధ్యాయోక్తార్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సఙ్గతి రస్తీతి వేద్యమ్.

ఈ అధ్యాయమునందు వ్యవహారము, జీవగతి, జన్మము, మృత్యువు, సత్యము, ఆశీర్వాదము, అగ్ని, సత్యేచ్ఛ మొదలగునవి వ్యాఖ్యానించబడినవగుటచే నీ యధ్యాయమునందు చెప్పబడిన యర్థము పూర్వాధ్యాయమున చెప్పబడిన యర్థముతో సంగతి కలదని గ్రహించవలయును.

★

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం శ్రీమన్మహావిదుషాం విరజానంద
సరస్వతీస్వామినాం శిష్యేణ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యేణ
శ్రీమద్దయానంద సరస్వతీ స్వామినా విరచితే సంస్కృతార్య
భాషాభ్యాం సమన్వితే సుప్రమాణయుక్తే
యజుర్వేదభాష్యే పంచత్రింశో
ఽధ్యాయోఽల మగమత్.

★

కృష్ణా మండలాంతర్గత కుందేరు గ్రామవాస్తవ్యులగు
పాలడగు శేషాచలాచార్య, తదేవమండలాంతర్గత ముదునూరు
గ్రామవాస్తవ్యుడు అన్నె కేశవార్యశాస్త్రి గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన
శ్రీ మద్దయానన్దసరస్వతీ నిర్మిత యజుర్వేదభాషాభాష్యమందలి ౩౫ వ అధ్యాయము సమాప్తము.

—( ఇతి )—

ఓమ్

# అథ షట్ త్రింశాధ్యాయారమ్భః

—o—

ఇపుడు ముప్పదియారవ అధ్యాయము ప్రారంభించబడుచున్నది

ఓం విశ్వాని దేవ సవిత ర్దురి తాని పరాసువ। యద్భద్రం తన్న ఆ సువ ॥౧॥

1874 ఋచమిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, అగ్ని ర్దేవతా, పంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

అథ విద్వత్సఙ్గేన కిఞ్జాయత ఇత్యాహ. విద్వత్సంగముచే నేమగును ?

ఋచం వాచం ప్ర పద్యే మనో యజుః ప్ర పద్యే సామ ప్రాణం ప్ర పద్యే చక్షుః శ్రోత్రం ప్ర పద్యే। వాగోజః సహౌజో మయి ప్రాణాపానౌ ॥౧॥

ఋచమ్, వాచమ్, ప్ర, పద్యే, మనః, యజుః, ప్ర, పద్యే, సామ, ప్రాణమ్, ప్ర, పద్యే, చక్షుః, శ్రోత్రమ్, ప్ర, పద్యే, వాక్, ఓజః, సహ, ఓజః, మయి, ప్రాణాపానౌ. ॥౧॥

పదార్థః— (ఋచమ్) ప్రశంసనీయ మృగ్వేదమ్ (వాచమ్) వాణీమ్(ప్ర)(పద్యే)ప్రాప్నుయామ్ (మనః) మననాత్మకం చిత్తమ్ (యజుః) యజుర్వేదమ్ (ప్ర)(పద్యే) (సామ)సామవేదమ్ (ప్రాణమ్)(ప్ర)(పద్యే)(చక్షుః)చష్టే పశ్యతి యేన తత్ (శ్రోత్రమ్) శృణోతి యేన తత్ (ప్ర)(పద్యే)(వాక్)వాణీ(ఓజః)మానసం బలమ్(సహ)(ఓజః)శారీరం బలమ్(మయి) ఆత్మని (ప్రాణాపానౌ)(ప్రాణశ్చాఽపానశ్చ తావుచ్ఛ్వాసనిశ్వాసౌ. ॥౧॥ అన్వయః—హే మనుష్యా! యథా మయి ప్రాణాపానౌ దృఢౌ భవేతాం మమ వాగోజః ప్రాప్నుయాత్తయా తాభ్యాం చ సహోఽహమోజః ప్రాప్నుయామృచం వాచం ప్రపద్యే మనో యజుః ప్రపద్యే సామ ప్రాణం ప్రపద్యే చక్షుః శ్రోత్రం ప్రపద్యే తథా యూయ మేతాని ప్రాప్నుత. ॥౧॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. హే విద్వాంసో! యుష్మత్సఙ్గేన మమ ఋగివ ప్రశంసనీయా వాగ్యజురివ మనః సామ ఇవ ప్రాణః సప్తదశతత్త్వాత్మకం లిఙ్గం శరీరఞ్చ స్వస్థం నిరుపద్రవం సమర్థం భవతు. ॥౧॥

పదార్థము—మానవులారా! ఎటుల, మయి = నా యాత్మయందు, ప్రాణాపానౌ = ప్రాణాపానములు క్రింది మీది శ్వాసలు దృఢములగునో, వాక్ = నా వాణి, ఓజః = మానసబలమును పొందునో, సహ = ఆవాణితోను, ఆ శ్వాసలతోను నేను,ఓజః = శరీర బలమును పొందుదునో, ఋచమ్ వాచమ్ = ఋగ్వేదరూపవాక్కును,ప్రపద్యే = పొందుదునో, మనః = మననమొనర్చు అంతఃకరణముతో తుల్యమగు, యజుః = యజుర్వేదము, ప్రపద్యే = పొందుదునో, ప్రాణమ్ = ప్రాణక్రియ అనగా యోగాభ్యాసాదికమగు ఉపాసనకు సాధకమైన, సామ = సామవేదమును, ప్ర పద్యే = పొందుదునో, చక్షుః = ఉత్తమనేత్రమును, మఱియు, శ్రోత్రమ్ = శ్రేష్ఠకర్ణమును, ప్ర పద్యే = పొందుదునో, అటులనే మీరును వీనినన్నిటిని పొందుడు. ॥౧॥

భావార్థము—ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. విద్వాంసులారా! మీ సాంగత్యమున ఋగ్వేదసదృశము ప్రశంసనీయమునగు నా వాణి, యజుర్వేదముతో సమానమగు మనస్సు, సామవేదసదృశమగు ప్రాణము, సప్తదశతత్వములతో గూడిన లింగశరీరము, స్వస్థములు సకలోపద్రవములనుండి రహితములునై సమర్థవంతములగును గాక ! ॥౧॥ 1874

---

1875 యన్మే ఛిద్రమిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః,
బృహస్పతి ర్దేవతా, నిచృత్పఙ్క్తి-శ్ఛన్దః, పఞ్చమః స్వరః.
అథేశ్వరప్రార్థనా విషయ మాహ. ఈశ్వర ప్రార్థనా విషయము.

యన్మే ఛిద్రం చక్షుషో హృదయస్య మనసో వాతి తృణ్ణం బృహస్పతి
ర్మే తద్దధాతు । శం నో భవతు భువనస్య య స్పతిః. ॥౨॥

యత్, మే, ఛిద్రమ్, చక్షుషః, హృదయస్య, మనసః, వా, అతితృణ్ణమిత్యతి తృణ్ణమ్, బృహస్పతిః, మే, తత్, దధాతు, శమ్, నః, భవతు, భువనస్య, యః, పతిః. ॥౨॥

పదార్థః—(యత్) (మే) మమ (ఛిద్రమ్) న్యూనత్వమ్ (చక్షుషః) నేత్రస్య(హృదయస్య) (మనసః)అన్తఃకరణస్య(అతితృణ్ణమ్)అతిహింసితం వ్యాకులత్వమ్(బృహస్పతిః)బృహతామాకాశా దీనాం పాలక ఈశ్వరః(మే)మహ్యమ్(తత్)(దధాతు)పుష్ణాతు(శమ్)(నః)అస్మభ్యమ్(భవతు)(భువనస్య)భవన్తి భూతాని యస్మింస్తస్య(యః)(పతిః)పాలకః స్వామీశ్వరః. ॥౨॥ అన్వయః—యన్మే చక్షుషో హృదయస్య ఛిద్రం మనసో వాతితృణ్ణమస్తి తద్బృహస్పతి ర్మే దధాతు యో భువనస్య పతి రస్తి స నః శమ్భవతు. ॥౨॥ భావార్థః—సర్వైర్మనుష్యైః పరమేశ్వరస్యోపాసనయాఽఽజ్ఞాపాలనేన చాఽహింసాధర్మం స్వీకృత్య జితేన్ద్రియత్వం సంపాదనీయమ్

పదార్థము—మే చక్షుషః = నా నేత్రముయొక్క, హృదయస్య = అంతఃకరణముయొక్కయు, యత్ ఛిద్రమ్ = ఏ న్యూనత—లోటు, లేక, మనసః = మనస్సుయొక్క, అతితృణ్ణమ్ = వ్యాకులత్వ మేదియున్నదో, తత్ = దానిని, బృహస్పతిః = గొప్పవియగు ఆకాశాదుల పాలకుడగు పరమేశ్వరుడు, మే = నాకై, దధాతు = పుష్టము—పూర్ణము నొనర్చుగాక! యః భువనస్య పతిః = సకలసంసారమున కెవడు పతియో, అతడు, నః శమ్ భవతు = మాకు కళ్యాణకరు డగునుగాక ! ॥౨॥

భావార్థము—మానవులందరు పరాత్పరుని యుపాసనచేతను, ఆజ్ఞాపాలనము చేతను అహింసాధర్మమును స్వీకరించి జితేంద్రియత్వమును సంపాదించవలయును. ॥౨॥

---

1876 భూర్భువః స్వరిత్యస్య విశ్వామిత్ర ఋషిః, సవితా దేవతా, దైవీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః, తత్సవితు రిత్యస్య నిచృద్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.
అథేశ్వరోపాసనా విషయ మాహ. ఈశ్వరోపాసనా విషయము.

భూర్భువః స్వః । తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ।
ధియో యో నః ప్రచోదయాత్. ॥౩॥

భూః, భువః, స్వః, తత్, సవితుః, వరేణ్యమ్, భర్గః, దేవస్య, ధీమహి,
ధియః, యః, నః, ప్రచోదయాదితి ప్ర+చోదయాత్. ॥౩॥

పదార్థః—(భూః)కర్మవిద్యామ్(భువః)ఉపాసనావిద్యామ్(స్వః) జ్ఞానవిద్యామ్ (తత్)ఇన్ద్రియై రగ్రాహ్యం పరోక్షమ్(సవితుః)సకలైశ్వర్యప్రదస్యేశ్వరస్య(వరేణ్యమ్)స్వీకర్తవ్యమ్ (భర్గః) సర్వదుఃఖప్రణాశకం తేజఃస్వరూపమ్(దేవస్య)కమనీయస్య(ధీమహి) ధ్యాయేమ (ధియః)ప్రజ్ఞాః (యః)(నః)అస్మాకమ్(ప్రచోదయాత్)ప్రేరయేత్. ॥౩॥ అన్వయః—హే మనుష్యా! యథా వయం భూర్భువః స్వ రధీత్య యో నో ధియః ప్రచోదయాత్తస్య దేవస్య సవితుస్తద్వరేణ్యం భర్గో ధీమహి తథా యూయ మప్యేతద్ధ్యాయత. ॥౩॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. యే మనుష్యాః కర్మోపాసనాజ్ఞానవిద్యాః సంగృహ్యాఖిలైశ్వర్యయుక్తేన పరమాత్మా సహ స్వాత్మనో యుఞ్జతేఽధర్మాఽనైశ్వర్యదుఃఖాని విధూయ ధర్మైశ్వర్యసుఖాని ప్రాప్నువన్తి తానన్తర్యామీ జగదీశ్వరః స్వయం ధర్మాఽనుష్ఠాన మధర్మత్యాగం చ కారయితుం సదైవేచ్ఛతి. ॥౩॥

పదార్థము—మానవులారా! ఎటుల మేము, భూః=కర్మకాండపు విద్యను, భువః ఉపాసనాకాండపు విద్యను, మఱియు, స్వః=జ్ఞానకాండపు విద్యను సంగ్రహపూర్వకముగ అధ్యయనమొనర్చి, యః నః=ఎవడు మాయొక్క, ధియః=ధారణమొనర్చు బుద్ధులను, ప్రచోదయాత్=ప్రేరేపించునో, దేవస్య=కామించదగినవాడును, సవితుః =సమస్తైశ్వర్యమును ఇచ్చువాడునునగు నా పరమేశ్వరునియొక్క, తత్=ఇంద్రియములచే గ్రహించయోగ్యముకానిది, [పరోక్షమైనది, వరేణ్యమ్ = స్వీకరించదగినది] భర్గః=సకలదుఃఖవినాశకమునగు నా తేజఃస్వరూపమును, ధీమహి=ధ్యానించెదము, అటులనే మీరును దీనిని ధ్యానించుడు.

భావార్థము—దీనియందు వాచక లుప్తోపమాలంకార మున్నది. ఏ మానవులు కర్మోపాసనా జ్ఞానవిద్యలను చక్కగా సంగ్రహించి అఖిలైశ్వర్యయుక్తుడగు పరమాత్మునియందుస్వాత్మను లీనమొనర్చుదురో, అధర్మానైశ్వర్య దుఃఖములు అను మలినములను దళనమొనర్చి ధర్మైశ్వర్య సుఖములను పొందుచున్నారో, వారిని అంతర్యామి జగదీశ్వరుడే స్వయముగ ధర్మానుష్ఠానమొనరింపజేయుటకు, అధర్మత్యాగ మొనరింపజేయుటకు సదా వాంఛించును. ॥౩॥ 1876

---

1877 కయా న ఇత్యస్య వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

కయా నశ్చిత్ర ఆ భువదూతీ సదావృధః సఖా । కయా శచిష్ఠయా వృతా ॥౪॥

కయా, నః, చిత్రః, ఆ, భువత్, ఊతీ, సదావృధ ఇతి సదా+వృధః, సఖా, కయా, శచిష్ఠయా, వృతా. ॥౪॥

పదార్థః—(కయా)(నః)అస్మాకమ్(చిత్రః)అద్భుతగుణకర్మస్వభావః పరమేశ్వరః (ఆ)సమన్తాత్(భువత్)భవేత్(ఊతీ)రక్షణాదిక్రియయా. అత్ర తృతీయైకవచనస్య సుపాం సులుగితి పూర్వసవర్ణః(సదావృధః)సదైవవర్ధమానః(సఖా)సుహృత్ (కయా)(శచిష్ఠయా) అతిశయేన శచీ ప్రజ్ఞా తయా (వృతా) వర్తమానయా. ॥౪॥ అన్వయః—స సదావృధ శ్చిత్రో నః కయోతీ సఖా ఆభువత్ కయా వృతా శచిష్ఠయాఽస్మాన్ శుభేషు గుణకర్మస్వభావేషు ప్రేరయేత్. ॥౪॥ భావార్థః—వయమిదం యథార్థతయా న విజానీమః స ఈశ్వరః కయా యుక్త్యాఽస్మాన్ ప్రేరయతి యస్య సహాయేనైవ వయం ధర్మార్థకామమోక్షాన్ సాద్ధుం శక్నుమః. ॥౪॥

పదార్థము—సదావృధః=ఎల్లప్పుడు వృద్ధియగువాడు అనగా నెన్నటికి న్యూనత్వమును పొందనివాడు, చిత్రః = ఆశ్చర్యరూప గుణకర్మస్వభావములచే కూడినవాడునగు నాపరమేశ్వరుడు, నః=మాయొక్క,కయా ఊతీ=పరక్షణాది క్రియలతో, సఖా ఆ భువత్=సఖుడగును! మఱియు, కయా వృతా శచిష్ఠయా =వర్తమానము అత్యంతోత్తమమునగు బుద్ధితో మమ్ము శుభగుణ కర్మస్వభావములందు ప్రేరేపించును!

భావార్థము—ఎవని సహాయముచే మనము ధర్మార్థ కామమోక్షములను సాధించ సమర్థులము కాగలుగుదుమో, ఏ యుక్తితో పరమేశ్వరుడు మనలను ప్రేరేపించునో ఈ విషయమును మనము యథార్థరూపములో నెఱుగజాలము. ॥౪॥ 1877

---

1878 కస్త్వేత్యస్య వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

కస్త్వా సత్యో మదానాం మంహిష్ఠో మత్సదన్ధసః । దృఢా చిదారుజే వసు॥౫॥

కః, త్వా, సత్యః, మదానామ్, మంహిష్ఠః, మత్సత్, అన్ధసః, దృఢా, చిత్, ఆరుజ ఇత్యారుజే, వసు. ॥౫॥

పదార్థః— (కః) సుఖస్వరూపః (త్వా) త్వామ్ (సత్యః) సత్సు పదార్థేషు సాధు రీశ్వరః (మదానామ్) ఆనన్దానాం మధ్యే (మంహిష్ఠః) అతిశయేన మహితా వృద్ధః (మత్సత్) ఆనన్దయతి (అన్ధసః) అన్నాదేః సకాశాత్ (దృఢా) దృఢాని (చిత్) అపి (ఆరుజే) దుఃఖభఞ్జకాయ జీవాయ(వసు) వసూని ధనాని. అత్ర సుపాం సు లుగితి జసో లుక్. ॥౫॥ అన్వయః—హే మనుష్యా!మదానాం మంహిష్ఠః కః సత్యః ప్రజాపతి రన్ధస స్త్వా మత్సదారుజే తుభ్యం చిత్ దృఢా వసు ప్రయచ్ఛతి. ॥౫॥ భావార్థః—హే మనుష్యా! యోఽన్నాదినా సత్యవిజ్ఞాపనేన చ ధనాని ప్రదాయ సర్వానానన్దయతి తం సుఖస్వరూపం పరమాత్మాన మేవ యూయం నిత్యముపాధ్వమ్. ॥౫॥

పదార్థము—మానవులారా ! మదానామ్ = ఆనందములమధ్య, మంహిష్ఠః = అత్యంతముగ వృద్ధియైనవాడు, కః=సుఖస్వరూపుడు, సత్యః=విద్వన్మాన్యపదార్థము

లందు శ్రేష్ఠతముడు, ప్రజారక్షకుడునగు పరమాత్మ, అంధసః = అన్నాదిపదార్థము లతో, త్వామ్ = నిన్ను, మత్సత్ = ఆనందితమొనర్చుచున్నాడు. ఆరుజే = దుఃఖనాశకుడవైన నీకొఱకు, చిత్ = కూడ, దృఢా వసు = దృఢమైన ఐశ్వర్యమును ఒసగుచున్నాడు.

భావార్థము—మానవులారా! ఎవడు అన్నాదులచేత, సత్యవిజ్ఞాపనముచేత ధనములనొసగి యందఱను ఆనందితులుగ చేయుచున్నాడో ఆ సుఖస్వరూపుడగు పరమాత్మునినే మీరు నిత్యముపాసించుడు. ॥౫॥ 1878

---

అభీ షుణ ఇత్యస్య వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, పాదనిచృద్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

అభీ ష ణః సఖీనా మవితా జరితౄణామ్ । శత మ్భవా స్యూతిభిః. ॥౬॥

అభీ, సు, నః, సఖీనామ్, అవితా, జరితౄణామ్, శతమ్, భవాసి, ఊతిభిః॥

పదార్థః—(అభి)సర్వతః. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః(సు)శోభనే(నః)అస్మాకమ్(సఖీనామ్) మిత్రాణామ్(అవితా)రక్షితా(జరితౄణామ్) సత్యస్తావకానామ్ (శతమ్) అసంఖ్యమ్ (భవాసి) భవేః(ఊతిభిః)రక్షణాదిభిః. ॥౬॥ అన్వయః—హే జగదీశ్వర! యత స్త్వం శతం దదద్భ్యూతిభిర్నః సఖీనాం జరితౄణామవితా సుభవాసి తస్మాదస్మాభిః సత్కర్తవ్యోఽసి. భావార్థః—హే మనుష్యా! యో రాగద్వేషరహితానా మజాతశత్రూణాం సర్వేషాం సుహృదాం మనుష్యాణామసంఖ్య మైశ్వర్య మతులం విజ్ఞానం చ ప్రదాయ సర్వతోఽభిరక్షతి తమేవ పరమేశ్వరం నిత్యం సేవధ్వమ్. ॥౬॥

పదార్థము—జగదీశ్వరా! నీవు, శతమ్ = అసంఖ్యైశ్వర్య ప్రదాతుడవగుచు, అభి ఊతిభిః = అన్నివైపులనుండి ప్రవృత్తములగు రక్షాదిక్రియలచే, నః = మా[కు]యొక్క, సఖీనామ్ = మిత్రులకు, జరితౄణామ్ = సత్యస్తుతియొనర్చువారలకు, అవితా = రక్షకుడవుగా, సు భవాసి = చక్కగానున్నావు. కనుక నీవు మాకు సత్కరించదగినవాడవు.

భావార్థము—మానవులారా! ఎవడు రాగద్వేషరహితులు, అజాతశత్రువులు, అందఱితో సఖ్యభావము నెఱపువారునగు మనుష్యులకు అసంఖ్యైశ్వర్యమును, అతుల విజ్ఞానమును ప్రదానమొనర్చి అన్నివైపులనుండి అభిరక్షించుచున్నాడో, ఆ పరమేశ్వరునినే నిత్యము సేవించుడు. ॥౬॥ 1879

---

కయా త్వమిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, ఇన్ద్రో దేవతా, వర్ధమానా గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః

పున స్తమేవ విషయ మాహ. మరల విషయ మయ్యదియే.

కయా త్వం న ఊత్యాభి ప్ర మన్దసే వృషన్ । కయా స్తోతృభ్య ఆ భర ॥౭॥

కయా, త్వమ్, నః, ఊత్యా, అభి, ప్ర మన్దసే, వృషన్, కయా, స్తోతృభ్య ఇతి స్తోతృభ్యః, ఆ, భర. ॥౭॥

పదార్థః—(కయా)(త్వమ్)(నః)అస్మాన్(ఊత్యా) రక్షణాద్యయా క్రియయా (అభి)(ప్ర)(మన్దసే)సర్వత్ర ఆనన్దయసి(వృషన్)సుఖాభివర్షక(కయా)రీత్యా(స్తోతృభ్యః)ప్రశంసకేభ్యో మనుష్యేభ్యః(ఆ)(భర). ॥౭॥ అన్వయః—హే వృషన్నీశ్వర! త్వం కయోత్యా నోఽభిప్రమన్దసే కయా స్తోతృభ్యః సుఖ మాభర. ॥౭॥ భావార్థః—హే భగవన్ పరమాత్మన్!యయా యుక్త్యా త్వం ధార్మికానానన్దయసి తాన్ సర్వతః పాలయసి తాం యుక్తి మస్మాన్ బోధయ. ॥౭॥

పదార్థము—వృషన్ =అన్నిదిక్కులనుండి సుఖవర్షమును వర్షింపజేయు నీశ్వరా త్వమ్=నీవు, కయా ఊత్యా = ఏ రక్షణాది క్రియలచే, నః అభి ప్ర మందసే = అన్ని వైపులనుండి మమ్మానందపఱచుచున్నావు? మఱియు, కయా=పరీతిగ, స్తోతృభ్యః= నిన్ను ప్రశంసించు మనుష్యులకై సుఖమును, ఆ భర=చక్కగ ధారణమొనర్చెదవు ?

భావార్థము—భగవంతుడా! పరమాత్ముడా! ఏ యుక్తిచే నీవు ధర్మాత్ముల నానందితమొనర్చెదవు ? వారిని అన్నివిధముల రక్షించెదవు ? ఆ యుక్తి మా కెఱుక పఱచుము. ॥౭॥ 1880

---

1881 ఇన్ద్రో ఇత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, ఇన్ద్రో దేవతా,
ద్విపాద్విరాడ్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

ఇన్ద్రో విశ్వస్య రాజతి శన్నో అస్తు ద్విపదే శం చతుష్పదే. ॥౮॥

ఇన్ద్రః, విశ్వస్య, రాజతి, శమ్, నః, అస్తు, ద్విపద ఇతి ద్వి+పదే, శమ్, చతుష్పదే, చతుః పద ఇతి చతుః+పదే. ॥౮॥

పదార్థః—(ఇన్ద్రః)విద్యుదివేశ్వరః(విశ్వస్య)సంసారస్య మధ్యే (రాజతి) ప్రకాశతే (శమ్) సుఖమ్(నః)అస్మాకమ్(అస్తు) (ద్విపదే) పుత్రాద్యాయ (శమ్) (చతుష్పదే)గవాద్యాయ. ॥౮॥ అన్వయః—హే జగదీశ్వర ! యో భవానిన్ద్ర ఇవ విశ్వస్య రాజతి తస్య భవతః కృపయా నో ద్విపదే శమస్తు నశ్చతుష్పదే శమస్తు. ॥౮॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః హే జగదీశ్వర! యతో భవాన్ సర్వత్రాఽభివ్యాపకః మనుష్యపశ్వాదీనాం సుఖమిచ్ఛ రసి తస్మాత్సర్వై రుపాసనీయోఽసి. ॥౮॥

పదార్థము—జగదీశ్వరా! ఏ నీవు, ఇంద్రః = విద్యుత్తువలె, విశ్వస్య రాజతి = విశ్వమునందు విరాజిల్లుచున్నావో, ఆ నీకృపచే, నః=మాయొక్క, ద్విపదే=పుత్రాదులకు. శమ్ అస్తు=సుఖము చేకూరుగాక! మఱియు మాయొక్క, చతుష్పదే= గవాదులకు, శమ్=సుఖము కలుగుగాక ! ॥౮॥

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది.జగదీశ్వరా!నీవు సర్వత్ర అభివ్యాప్తుడవై మనుష్య పశ్వాదుల సుఖమభిలషించెడువాడవై యున్నావు కనుక అందఱికి ఉపాసించదగినవాడవై యున్నావు. ॥౮॥ 1881

---

1882 శన్న ఇత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, మిత్రాదయో
లిఙ్గోక్తా దేవతాః, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
మనుష్యైః స్వార్థపరార్థసుఖ మిషితవ్య మిత్యాహ.
మానవులు తమ సుఖముతోపాటు ఇతరుల సుఖమునుకూడ కోరవలయును.

శన్నో మిత్ర శ్శం వరుణః శన్నో భవత్వర్యమా ।
శన్న ఇన్ద్రో బృహస్పతిః శన్నో విష్ణు రురుక్రమః. ॥౯॥

శమ్, నః, మిత్రః, శమ్, వరుణః, శమ్, నః, భవతు, అర్యమా, శమ్, నః, ఇన్ద్రః, బృహస్పతిః, శమ్, నః, విష్ణుః, ఉరుక్రమ+ఇత్యురు+క్రమః॥

పదార్థః—(శమ్)సుఖకారి(నః)అస్మభ్యమ్(మిత్రః)ప్రాణఇవ ప్రియః సఖా(శమ్) (వరుణః) జలమివ శాన్తిప్రదః(శమ్)(నః)అస్మభ్యమ్(భవతు)(అర్యమా)యోఽర్యాన్ మన్యతే స న్యాయాధీశః(శమ్)(నః)అస్మభ్యమ్ (ఇన్ద్రః) పరమైశ్వర్యవాన్ (బృహస్పతిః) బృహత్యా వాచః పాలకో విద్వాన్(శమ్)(నః)అస్మభ్యమ్(విష్ణుః)వ్యాపకేశ్వరః(ఉరుక్రమః)ఉరు బహు క్రమః సంసారరచనే యస్య సః. ॥౯॥ అన్వయః—హే మనుష్యా! యథా నో మిత్రః శం భవతు వరుణః శమ్భవత్వర్యమా నః శం భవతు ఇన్ద్రో బృహస్పతి ర్నః శమ్భవతు ఉరుక్రమో విష్ణు ర్నః శమ్భవతు తథా యుష్మభ్యమపి భవేత్. ॥౯॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః.మనుష్యై ర్యథా స్వార్థం సుఖ మేష్టవ్యం తథా పరార్థమపి యథా చ తే స్వయం సత్సఙ్గమిచ్ఛేయు స్తథా తత్రా తత్రాన్యానపి ప్రేరయేయుః. ॥౯॥

పదార్థము—మానవులారా! ఎటుల, నః=మాకు, మిత్రః = ప్రాణతుల్యుడగు ప్రియమిత్రుడు, శమ్ భవతు=సుఖకారియగునో, వరుణః=జలమువలె శాంతినొసగువాడు, శమ్ = సుఖకరుడగునో, అర్యమా = పదార్థములస్వామి, లేక వైశ్యులను మన్నించు న్యాయాధీశుడు, నః=మాకు, శమ్=సుఖకారియగునో, ఇంద్రః=పరమైశ్వర్యవంతుడు, బృహస్పతిః=పెద్దదైన వేదరూపవాణియొక్క రక్షకుడగు విద్వాంసుడు, నః=మాకు, శమ్=కళ్యాణకరుడగునో, ఉరుక్రమః=సంసారరచనయందు అతిశ్రీఘుత్వమొనర్చు, విష్ణుః=వ్యాపకేశ్వరుడు, నః=మాకు. శమ్=కళ్యాణకరుడగునో, అటులనే మీకును నగుగాక! ॥౯॥

భావార్థము—ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. మానవులు తమకెటుల సుఖము నభిలషించెదరో అటులనే పరులకుకూడ, మఱియు వారెటుల తాము సత్సంగమభిలషించెదరో అటులనే యందు అన్యులనుగూడ ప్రేరేపించవలయును, ॥౯॥ 1882

---

1883 శన్నో వాత ఇత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, వాతాదయో
దేవతాః, విరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
పున ర్మనుష్యైః కిం కర్తవ్య మిత్యాహ. మరల మానవు లేమి చేయవలయును?

శన్నో వాతః పవతాం శన్న స్తపతు సూర్యః ।
శన్నః కనిక్రదద్దేవః పర్జన్యో అభి వర్షతు. ॥౧౦॥

శమ్, నః, వాతః, పవతామ్, శమ్, నః, తపతు, సూర్యః, శమ్, నః, కనిక్రదత్, దేవః, పర్జన్యః, అభి, వర్షతు. ॥౧౦॥

పదార్థః—(శమ్)సుఖకారకః(నః)అస్మభ్యమ్(వాతః)పవనః (పవతామ్)చలతు (శమ్) (నః) (తపతు)(సూర్యః)(శమ్)(నః) (కనిక్రదత్) భృశం శబ్దం కుర్వన్(దేవః) దివ్యగుణయుక్తో విద్యుదాఖ్యః(పర్జన్యః)మేఘః(అభి)ఆభిముఖ్యే(వర్షతు). ॥౧౦॥ అన్వయః—హే పరమేశ్వర! విద్వన్వా యథా వాతో నః శం పవతాం సూర్యో న స్తపతు కనిక్రదద్దేవో నః శం భవతు. పర్జన్యోఽభి వర్షతు తథాఽస్మాన్ శిక్షయ. ॥౧౦॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా ! యేన ప్రకారేణ వాయుసూర్యవిద్యున్మేఘాః సర్వేషాం సుఖకరాః స్యు స్తథాఽనుతిష్ఠత. ॥౧౦॥

పదార్థము—పరమేశ్వరా! లేక విద్వాంసుడా! ఎటుల, వాతః = పవనము, నః శమ్ పవతామ్=మాకు సుఖకరముగ వీచునో, సూర్యః నః శమ్ తపతు=సూర్యుడు మాకు సుఖకరముగ తపించునో, కనిక్రదత్ = అత్యంతశబ్దమొనర్చుచున్న, దేవః= ఉత్తమగుణయుక్త విద్యుద్రూపాగ్ని, నః శమ్ = మాకు సుఖకరమైనది యగునో, మఱియు, పర్జన్యః అభి వర్షతు = అన్నివైపులనుండి మేఘము మాకు వర్షించునో, అటువంటిశిక్షను మా కొసగుము. ॥౧౦॥

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది. మానవులారా ! వాయువు, సూర్యుడు, విద్యుత్తు,మేఘము అందరికి నెటుల సుఖకరములగునో అటుల అనుష్ఠానమొనర్చుచుండుడు. ॥౧౦॥ 1883

---

1884 అహాని శమిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, లిఙ్గోక్తా దేవతాః, అతిశక్వరీ ఛన్దః, పఞ్చమః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

అహాని శం భవన్తు నః శꣳ రాత్రీః ప్రతిధీయతామ్ । శన్న
ఇన్ద్రాగ్నీ భవతా మవోభిః శన్న ఇన్ద్రావరుణా రాతహవ్యా ।
శన్న ఇన్ద్రాపూషణా వాజసాతౌ శమిన్ద్రా సోమా సువితాయ శంయోః॥

అహాని, శమ్, భవన్తు, నః, శమ్, రాత్రీః, ప్రతి, ధీయతామ్, శమ్, నః, ఇన్ద్రాగ్నీ ఇతీన్ద్రాగ్నీ, భవతామ్, అవోభిరిత్యవః+భిః, శమ్, నః, ఇన్ద్రావరుణా, రాతహవ్యేతి రాత+హవ్యా, శమ్, నః, ఇన్ద్రాపూషణా, వాజసాతావితి వాజ+

సాతౌ, శమ్, ఇన్ద్రాసోమా, సువితాయ, శంయోః. ॥౧౧॥

పదార్థః—(అహాని) దినాని (శమ్)సుఖకారకాణి (భవన్తు)(నః)అస్మభ్యమ్ (శమ్)(రాత్రీః) రాత్రయః(ప్రతి)(ధీయతామ్)ధీయన్తామ్.అత్ర వచనవ్యత్యయేనైకవచనమ్(శమ్)(నః)అస్మభ్యమ్ (ఇన్ద్రాగ్నీ)విద్యుత్పావకౌ(భవతామ్)(అవోభిః)రక్షణాదిభిః సహ(శమ్)(నః) (ఇన్ద్రావరుణా) విద్యుజ్జలే(రాతహవ్యా) రాతం దత్తం హవ్య మాదాతవ్యం సుఖం యాభ్యాన్తే (శమ్) (నః) (ఇన్ద్రాపూషణా) విద్యుత్పృథివ్యౌ (వాజసాతౌ) వాజాన్యన్నాని సంభజన్తి యయా తస్యాం యుధి(శమ్)(ఇన్ద్రాసోమా)విద్యుదోషధిగణౌ(సువితాయ)ప్రేరణాయ(శంయోః)సుఖస్య ॥౧౧॥
అన్వయః—హే పరమేశ్వర విద్వన్ వా యథాఽవోభిః సహ శంయోః సువితాయ నోఽహాని శం భవన్తు రాత్రీశ్శం ప్రతిధీయతా మిన్ద్రాగ్నీ నః శం భవతాం రాతహవ్యా ఇన్ద్రావరుణా నః శం భవతాం వాజసాతా విన్ద్రాపూషణా నః శం భవతా మిన్ద్రాసోమా చ శం భవతాంతథా ఽస్మా ననుశిక్షేతామ్. ॥౧౧॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా! యదీశ్వరాప్తవిదుషాం శిక్షాయాం భవన్తః ప్రవర్తేరంస్తర్హ్యహర్నిశం భూమ్యాదయః సర్వే పదార్థా యుష్మాకం సుఖకరాః స్యుః ॥౧౧॥

పదార్థము—పరమేశ్వరా! లేక విద్వాంసుడా! ఎటుల,అవోభిః=రక్షణాదులతో పాటు, శంయోః=సుఖముయొక్క, సువితాయ=ప్రేరణకొఱకు, నః = మా నిమిత్తము, అహాని శమ్ భవంతు=దినములు సుఖకరములగునో, రాత్రీః=రాత్రుళ్లు, శమ్ ప్రతి ధీయతామ్ = కళ్యాణమునకై మమ్ము ధారణమొనర్చునో, ఇంద్రాగ్నీ = విద్యుత్తు ప్రత్యక్షాగ్ని ఈ రెండు, నః శమ్ భవతామ్ = మాకై సుఖకరములగునో, రాతహవ్యా = గ్రహించదగినవి,సుఖమును లభింపజేయునవియునైన, ఇంద్రావరుణా =విద్యుజ్జలములు, నః శమ్ = మాకు సుఖకరములగునో, వాజసాతౌ = అన్నముల సేవనమునకు హేతువగు సంగ్రామమునందు,ఇంద్రాపూషణా=విద్యుత్తు పృథివి రెండు, 'నః శమ్=మాకు సుఖకరములగునో మఱియు, ఇంద్రాసోమా = విద్యుత్తు మఱియు ఓషధులు, శమ్=సుఖకరములగునో అటులమాకు నీవు అనుకూల శిక్షగఅవుము.౧౧॥

భావార్థము—ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది.మానవులారా! మీరు ఈశ్వరునియొక్కయు, ఆప్తవిద్వాంసులయొక్కయు శిక్షణయందు ప్రవృత్తులగుచో భూమ్యాది పదార్థములన్నీ అహర్నిశము మీకు సుఖకరములుకాగలవు.

---

1885 శన్నో దేవీ.రిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, ఆపో దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.
కీదృశా జనాః సుఖసంపన్నా భవన్తీత్యాహ. ఎట్టి మానవులు సుఖసంయుక్తు లగుదురు ?

శన్నో దేవీ రభిష్టయ ఆపో భవన్తు పీతయే । శంయో రభి స్రవన్తు నః ॥౧౨॥

శమ్, నః, దేవీః, అభిష్టయే, ఆపః, భవన్తు, పీతయే, శంయోః, అభి, స్రవన్తు, నః. ॥౧౨॥

పదార్థః—(శమ్)(నః)అస్మభ్యమ్(దేవీః)దివ్యాః(అభిష్టయే) ఇష్టసుఖసిద్ధయే (ఆపః) జలాని (భవన్తు)(పీతయే)పానాయ(శంయోః)సుఖస్య(అభి)సర్వతః(స్రవన్తు)వర్షన్తు(నః)అస్మభ్యమ్.౧౨॥

అన్వయః—హే జగదీశ్వర విద్వన్వా ! యథాఽభిష్టయే పీతయే దేవీ రాపో నః శం భవన్తు నః శంయో ర్వృష్టి మభిస్రవన్తు తథోపదిశతమ్.॥౧౨॥ భావార్థః—యే యజ్ఞాదినా జలాదిపదార్థాన్ శుద్ధాన్ సేవన్తే తేషా ముపరి సుఖామృతస్య వృష్టిః సతతం భవతి. ॥౧౨॥

పదార్థము—జగదీశ్వరా! లేక విద్వాంసుడా! ఎటుల, అభిష్టయే=వాంఛిత సుఖ సిద్ధికై, పీతయే=పానమొనర్చుటకు, దేవీః ఆపః = దివ్యములు, ఉత్తములునగు జలములు, నః=మాకు, శమ్ భవంతు=సుఖకరములగునో, నః=మాకు, శంయోః అభిస్రవంతు=సుఖవర్షము అన్నిదిక్కులనుండి వర్షించునో అటుల ఉపదేశించుడు. ॥౧౨॥

భావార్థము—ఏ మానవులు యజ్ఞాదులచే శుద్ధములగు జలాదిపదార్థములను సేవించుచున్నారో వారిమీద సుఖామృత వర్షము నిరంతరము వర్షించును. ॥౧౨॥

---

స్యోనేత్యస్య మేధాతిథిర్ఋషిః, పృథివీ దేవతా, పిపీలికా మధ్యా నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః

పతివ్రతా కీదృశీ స్యాదిత్యాహ. ప్రతివ్రతయైన స్త్రీ యెటులుండును ?

స్యోనా పృథివి నో భవానృక్షరా నివేశనీ । యచ్ఛా నః శర్మ సప్రథాః ॥౧౩॥

స్యోనా, పృథివి, నః, భవ, అనృక్షరా, నివేశనీతి ని+వేశనీ, యచ్ఛ, నః, శర్మ, సప్రథా ఇతి స+ప్రథాః. ॥౧౩॥

పదార్థః—(స్యోనా) సుఖకరీ (పృథివి) భూమిః (నః)అస్మభ్యమ్(భవ)భవతు. అత్ర పురుష వ్యత్యయః(అనృక్షరా) కణ్టకగర్తాదిరహితా (నివేశనీ) యా నిత్యాన్ నివేశయతి సా (యచ్ఛ) దదాతు(నః)అస్మభ్యమ్(శర్మ)గృహమ్(సప్రథాః)విస్తారేణ సహ వర్తమానాః. అన్వయః—హే పృథివీవ వర్తమానే స్త్రి! యథాఽనృక్షరా నివేశనీ పృథివి నో భవతి తథా త్వం భవ సా సప్రథా నః శర్మ యచ్ఛేత్తథా స్యోనా త్వం నః శర్మ యచ్ఛ. ॥౧౩॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. యథా సర్వేషాం భూతానాం సుఖైశ్వర్యప్రదా పృథివీ వర్తతే తథైవ విదుషీ పతివ్రతా స్త్రీ పత్యాదీనా మానన్దప్రదా భవతి. ॥౧౩॥

పదార్థము—పృథివితో సమానముగ క్షమాశీలవైన ఓ స్త్రీ! ఎటుల, అనృక్షరా =కంటకగర్తాది రహితము, నివేశనీ=నిత్యము స్థిరపదార్థముల స్థాపించునదియునగు పృథివీ=భూమి,నః=మాకొఱకు అగుచున్నదో అటులనే నీవును అగుము. ఆ పృథివి, సప్రథాః=విస్తారముతో కూడినదై, నః = మాకు, శర్మ = స్థానమిచ్చుచున్నటుల, స్యోనా=సుఖము చేకూర్చు నీవు, నః=మాకు గృహసుఖమును, యచ్ఛ=ఒసగుము,

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది. ఎటుల పృథివి సకల ప్రాణులకు సుఖము ఐశ్వర్యము నొసగుచు నున్నదో అటులనే విదుషియైన పతివ్రతయైన స్త్రీ పత్యాదుల కానందము సమకూర్చునది యగుచున్నది. ॥౧౩॥ 1886

---

1887 ఆప ఇత్యస్య సిన్ధుద్వీప ఋషిః, ఆపో దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

ఆపో హి ష్ఠా మయోభువ స్తా న ఊర్జే దధాతన । మహే రణాయ చక్షసే॥

ఆప, హి, స్థ, మయోభువ ఇతి మయః+భువః, తాః, నః, ఊర్జే, దధాతన, మహే, రణాయ, చక్షసే. ॥౧౪॥

పదార్థః—(ఆపః)జలానీవ శాన్తిశీలా విదుష్యః సత్స్త్రియః(హి)యతః(స్థ)భవత.అత్ర సంహితాయామితి దీర్ఘః(మయోభువః)యా మయః సుఖం భావయన్తి తాః.మయ ఇతి సుఖనా...నిఘం ౩.౬.(తాః)(నః)అస్మాన్(ఊర్జే)పరాక్రమాయ బలాయ వా(దధాతన)ధరత(మహే) మహతే(రణాయ)సఙ్గ్రామాయ. రణ ఇతి సఙ్గ్రామ నా...నిఘం. ౨.౧౭.(చక్షసే)ప్రసిద్ధాయ. అన్వయః—హే ఆపః! స్త్రియో యథా మయోభువ ఆపో హి నో మహే రణాయ చక్షస ఊర్జే దధతు తథైతా యూయం దధాతన ప్రియాః స్థః. ॥౧౪॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః యథా సత్యః పతివ్రతాః స్త్రియః సర్వతః సర్వాన్ సుఖయన్తి తథైవ జలాదయః పదార్థాః. సుఖకరాః సన్తీతి వేద్యమ్. ॥౧౪॥

పదార్థము—ఆపః=జలములవలె శాంతిశీలలు విదుషీమణులునగు స్త్రీలను తల్లులారా! ఎటుల మయోభువః=సుఖముత్పన్నమొనర్చు జలములు, హి=ఏకారణమున, నః=మమ్ము, మహే రణాయ చక్షసే=గొప్పరణములకై,ఊర్జే=బలపరాక్రమముల కొఱకు ధారణములేక పోషణము ఒనర్చుచున్నవో అటులనే మీరును ధరించుడు. స్థ=ప్రియురాండ్రును గండు ॥౧౪॥

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది, ఎటుల శ్రేష్ఠపతివ్రత స్త్రీలన్నివిధముల నందఱిని సుఖపెట్టుదురో అటులనే జలాదిపదార్థములు అందఱికి సుఖకరములగునని గ్రహించుడు. ॥౧౪॥ 1887

---

1888 యో వ ఇత్యస్య సిన్ధుద్వీప ఋషిః, ఆపో దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

యో వః శివతమో రస స్తస్య భాజయతేహ నః । ఉశతీ రివ మాతరః ॥౧౫॥

యః, వః, శివతమ ఇతి శివ+తమః, రసః+తస్య, భాజయత, ఇహ, నః, ఉశతీరివేత్యుశతీః+ఇవ, మాతరః. ॥౧౫॥

పదార్థః—(యః)(వః)యుష్మాకమ్(శివతమః) అతిశయేన కల్యాణకరః (రసః)ఆనన్దవర్ధకః స్నేహరూపః (తస్య)రసమ్. అత్ర కర్మణి షష్ఠీ (భాజయత) సేవయత (ఇహ) అస్మిఞ్జగతి (నః) అస్మాన్ (ఉశతీరివ) కామయమానా ఇవ. అత్ర వాచ్ఛన్దసి. ౬. ౧. ౧౦౬. ఇతి పూర్వసవర్ణాదేశః (మాతరః) ॥౧౫॥ అన్వయః—హే సత్స్త్రియో! యో వః శివతమో రసోఽస్తి తస్యేహ నో మాతరః పుత్రా నుశతీరివ భాజయత ॥౧౫॥ భావార్థః—యది హోమాదినాఽఽపః శుద్ధాః క్రియేరంస్తర్హ్యేతా మాతరోఽపత్యానీవ పతివ్రతా పతీనివ సర్వాన్ ప్రాణినస్సుఖయన్తి ॥౧౫॥

పదార్థము—శ్రేష్ఠస్త్రీలారా! యః వః శివతమః రసః అస్తి = మీయొక్క అతిశయ కళ్యాణకరము, ఆనందవర్ధకమునగు స్నేహరూప రసమేది యున్నదో, తస్య = దానిని, ఇహ = ఈ జగమునందు, నః = మాకు, ఉశతీ రివ మాతరః = పుత్రులను కోరు మాతలవలె, భాజయత = సేవింపజేయుడు. ॥౧౫॥

భావార్థము—ఉపమాలంకార మిందున్నది. హోమాదులచే జలములను శుద్ధములుగ నొనర్చుచో నవి తల్లులు పిల్లలను, పతివ్రతస్త్రీలు పతులను సుఖపెట్టునటుల సకలప్రాణులను సుఖపెట్టును. ॥౧౫॥ 1888

---

1889 తస్మా ఇత్యస్య సింధుద్వీప ఋషిః, ఆపో దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

తస్మా అరఙ్గమామ వో యస్య క్షయాయ జిన్వథ । ఆపో జనయథా చ నః॥

తస్మై, అరమ్, గమామ, వః, యస్య, క్షయాయ, జిన్వథ, ఆపః, జనయథ, చ, నః. ॥౧౬॥

పదార్థః—(తస్మై)(అరమ్)అలమ్ (గమామ) ప్రాప్నుయామ (వః) యుష్మాన్ (యస్య) (క్షయాయ) నివాసాయ (జిన్వథ) ప్రీణయథ (ఆపః) జలానీవ (జనయథ) అత్ర సంహితాయామితి దీర్ఘః (చ)(నః) అస్మాన్ ॥౧౬॥ అన్వయః—హే స్త్రియో! యథా యూయం నోఽస్మానాప ఇవ శాన్తా జనయథ తథా వో యుష్మాన్ శాన్తా వయం జనయేమ యూయం యస్య క్షయాయ జిన్వథ తస్మై వయ మర ఙ్గమామ ॥౧౬॥ భావార్థః—అత్ర వాచకలుప్తోపమాలంకారః. స్త్రీ పురుషైః పరస్పరస్యాఽఽనన్దాయ జల వన్మ్రలతయా వర్తితవ్యం శుభాచరణైః పరస్పర మలంకృతై రేవ భవితవ్యమ్ ॥౧౬॥

పదార్థము—ఓ స్త్రీలారా! మీ రెటుల, నః = మాకు, ఆపః = జలములవలె శాంతమును, జనయథ = ప్రకటించెదరో అటులనే, వః = మీకును మేము శాంతమును ప్రకటించెదముగాక! చ = మఱియు మీరు, యస్య = ఏ పతియొక్క, క్షయాయ = నివాసమునకై, అతనిని, జిన్వథ = తృప్తిపఱచెదరో, తస్మై = అతనికి మేమును, అరమ్ = పూర్ణసామర్థ్యయుక్తులమై, గమామ = లభించెదము [ప్రాప్తించెదము]గాక! ॥౧౬॥

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది. స్త్రీ పురుషులు పరస్పరానందమునకై జలములవలె సరళముగ ప్రవర్తించవలయును. శుభాచరణములతో పరస్పరము సుశోభితులుగానే ఉండవలయును. ॥౧౬॥ 1889

---

1890 ద్యౌరిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, ఈశ్వరో దేవతా, భురిక్ శక్వరీ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైః కథం ప్రయతితవ్య మిత్యాహ. మానవు లెట్లు ప్రయత్నము చేయవలెను ?

ద్యౌః శాన్తి ర న్తరిక్షꣳ శాన్తిః పృథివీ శాన్తి రాపః, శాన్తి రోషధయః శాన్తిః ।

వనస్పతయః శాన్తి ర్విశ్వే దేవాః శాన్తి ర్బ్రహ్మ శాన్తిః సర్వꣳ శాన్తిః
శాన్తి రేవ శాన్తిః సా మా శాన్తి రేధి. ॥౧౭॥

ద్యౌః, శాన్తిః, అన్తరిక్షమ్, శాన్తిః, పృథివీ, శాన్తిః, ఆపః, శాన్తిః,
ఓషధయః, శాన్తిః, వనస్పతయః, శాన్తిః, విశ్వే, దేవాః, శాన్తిః, బ్రహ్మ, శాన్తిః,
సర్వమ్, శాన్తిః, శాన్తిః, ఏవ, శాన్తిః, సా, మా, శాన్తిః, ఏధి. ॥౧౭॥

పదార్థః—(ద్యౌః)ప్రకాశయుక్తః పదార్థః (శాన్తిః) శాన్తికరః (అన్తరిక్షమ్) ఉభయో ర్లోకయో ర్మధ్యస్థ మాకాశమ్ (శాన్తిః) (పృథివీ)భూమిః (శాన్తిః) (ఆపః)జలాని ప్రాణా వా (శాన్తిః)(ఓషధయః)సోమాద్యాః (శాన్తిః) (వనస్పతయః) వటాదయః (శాన్తిః) (విశ్వే) సర్వే (దేవాః) విద్వాంసః (శాన్తిః) (బ్రహ్మ) పరమేశ్వరో వేదో వా (శాన్తిః) (సర్వమ్) అఖిలం వస్తు (శాన్తిః)(శాన్తిః) (ఏవ) (శాన్తిః) (సా)(మా)మామ్(శాన్తిః)(ఏధి) భవతు ॥౧౭॥
అన్వయః—హే మనుష్యా!యా ద్యౌః శాన్తిర న్తరిక్షం శాన్తిః పృథివీ శాన్తి రాపః శాన్తి రోషధయః శాన్తి ర్వనస్పతయః శాన్తి ర్విశ్వే దేవాః శాన్తిర్ బ్రహ్మ శాన్తిః సర్వం శాన్తిః శాన్తిరేవ శాన్తిరై మ్రధి సా శాన్తి ర్యుష్మాక మపి ప్రాప్నోతు ॥౧౭॥ భావార్థః—హే మనుష్యా! యథా ప్రకాశాదయః పదార్థాః శాన్తికరాః స్యు స్తథా యూయం ప్రయతధ్వమ్ ॥౧౭॥

పదార్థము—మానవులారా! శాంతిః ద్యౌః = శాంతికరమగు నే ప్రకాశయుక్త పదార్థము, అంతరిక్షమ్ శాంతిః=శాంతికరమగు రెండు లోకముల మధ్యనున్న యే ఆకాశము, పృథివీ శాంతిః=సుఖకరము నిరుపద్రవమునగు నేపృథివి, ఆపః శాంతిః= శాంతిదములగు నేజలములు లేక ప్రాణములు, ఓషధయః శాంతిః = సుఖములనిచ్చు నే సోమలతా ద్యోషధులు, వనస్పతయః శాంతిః = శాంతికారకములగు వటాది వనస్పతులు, విశ్వేదేవాః శాంతిః=ఉపద్రవ నివారకులగు సకల విద్వాంసులు, బ్రహ్మ శాంతిః=సుఖదుడగు పరమేశ్వరుడు లేక వేదము, సర్వమ్[శాంతిః]= సుఖకరములగు సకలవస్తువులు, శాంతిరేవ శాంతిః=శాంతియే శాంతి, యేది, మా ఏధి=నాకు ప్రాప్తమగునో, సా శాంతిః=ఆ శాంతి, మీకును లభించుగాక ! ॥౧౭

భావార్థము—మానవులారా! ప్రకాశాది పదార్థములు శాంతికరములగు నటుల మీరు ప్రయత్నించుడు. ॥౧౭॥ 1890

---

1891 దృత ఇత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, ఈశ్వరో దేవతా, భురిగ్ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ కే ధర్మాత్మాన ఇత్యాహ. ఎవరు ధర్మాత్ములు కాగలుగుదురు ?

దృతే దృꣳహ మా మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని సమీక్షన్తామ్ ।
మిత్రస్యాఽహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే ।
మిత్రస్య చక్షుషా సమీక్షామహే. ॥౧౮॥

దృతే, దృꣳహ, మా, మిత్రస్య, మా, చక్షుషా, సర్వాణి, భూతాని, సమ్, ఈక్షన్తామ్, మిత్రస్య, అహమ్, చక్షుషా, సర్వాణి, భూతాని, సమ్, ఈక్షే, మిత్రస్య, చక్షుషా, సమ్, ఈక్షామహే. ॥౧౮॥

పదార్థః—(దృతే) అవిద్యాన్ధకారనివారక జగదీశ్వర విద్వన్ వా (దృꣳహ) దృఢీకురు (మా)మామ్ (మిత్రస్య) సుహృదః (చక్షుషా) దృష్ట్యా (సర్వాణి) (భూతాని) ప్రాణినః (సమ్) (సమ్యక్)(ఈక్షన్తామ్) ప్రేక్షన్తాం పశ్యన్తు(మిత్రస్య)(అహమ్) (చక్షుషా)(సర్వాణి) (భూతాని) (సమ్)(ఈక్షే)పశ్యేయమ్(మిత్రస్య)(చక్షుషా)(సమ్)(ఈక్షామహే)పశ్యేమ.॥ ౧౮॥ అన్వయః—హే దృతే! యేన సర్వాణి భూతాని మిత్రస్య చక్షుషా మా సమీక్షన్తామహం మిత్రస్య చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే ఏవం వయం సర్వే పరస్పరాన్ మిత్రస్య చక్షుషా సమీక్షామహే తత్రాస్మాన్ దృంహ. ॥౧౮॥ భావార్థః—త ఏవ ధర్మాత్మానో మనుష్యా యే స్వాత్మవత్సర్వాన్ ప్రాణినో మన్యేరన్ కఞ్చదపి న ద్వేషేయు ర్మిత్రవత్సర్వాన్ సదోపకుర్యు రితి॥

పదార్థము—దృతే=అవిద్యాంధకారమును నివారించు జగదీశ్వరా! లేక విద్వాంసుడా! ఏవిధముగ, సర్వాణి భూతాని=సకలప్రాణులు, మిత్రస్య చక్షుషా = మిత్రదృష్టితో, మా=నన్ను, సమ్ ఈక్షంతామ్ = చక్కగా చూచునో, అహమ్ = నేను, మిత్రస్య చక్షుషా=మిత్రునిదృష్టితో, సర్వాణి భూతాని = సకలప్రాణులను, సమీక్షే =చక్కగా చూచెదనో, ఈవిధముగనే మేమందఱము పరస్పరము, మిత్రస్య చక్షుషా =మిత్రదృష్టితో, సమీక్షామహే=చూడగలుగుదుమో అటులే యీ విషయమునందు మమ్ము, దృంహ=దృఢులుగా నొనర్చుము. ॥౧౮॥

భావార్థము—స్వాత్మసదృశముగ సంపూర్ణజీవులను భావించి, యెవరిని ద్వేషించకుండ మిత్రసదృశముగ నందరిని నెల్లప్పుడు సత్కరించువారే ధర్మాత్ములు. ॥౧౮॥

---

1892 దృతే దృంహ మేత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, ఈశ్వరో దేవతా, పాదనిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యు రిత్యాహ. మానవు లేమి చేయవలయును ?

దృతే దృꣳహ మా జ్యోక్తే సందృశి జీవ్యాసం జ్యోక్తే। సందృశి జీవ్యాసమ్॥

దృతే, దృꣳహ, మా, జ్యోక్, తే, సందృశీతి సమ్+దృశి, జీవ్యాసమ్, జ్యోక్, తే, సందృశీతి సమ్+దృశి, జీవ్యాసమ్. ॥౧౯॥

పదార్థః—(దృతే)సకలమోహాఽఽవరణవిచ్ఛేదకోపదేశక వా పరమాత్మన్(దృంహ)(మా) మామ్(జ్యోక్)నిరన్తరమ్(తే)తవ(సందృశి)సమ్యగ్దర్శనే(జీవ్యాసమ్)(జ్యోక్)నిరన్తరమ్ (తే) తవ(సందృశి)సమానదర్శనే విషయే(జీవ్యాసమ్). ॥౧౯॥ అన్వయః—హే దృతే! యేనాఽహన్తే సందృశి జ్యోక్ జీవ్యాసం తే సందృశి జ్యోగ్జీవ్యాసం తత్ర మా దృంహ. ॥౧౯॥ భావార్థః—మనుష్యైరీశ్వరాజ్ఞాపాలనేన యుక్తాహారవిహారైశ్చ శతం వర్షాణి జీవనీయమ్ ॥౧౯॥

పదార్థము—దృతే = సంపూర్ణ మోహావరణమును నాశనమొనరించు ఉపదేశక విద్వాంసుడా ! లేక పరమేశ్వరా ? ఏవిధముగ నేను, తే సందృశి = నీ దృష్టి సమ్యగ్ జ్ఞానములందు, జ్యోక్ = నిరంతరము, జీవ్యాసమ్ = జీవించెదనో, తే సందృశి = నీ యొక్క సమానదృష్టి విషయమున, జ్యోక్ జీవ్యాసమ్ = నిరంతరము జీవనము గడుపుదునో ఆ జీవనవిషయమున, మా = నన్ను, దృంహా = దృఢపఱచుము. ॥౧౯॥

భావార్థము—మానవులు ఈశ్వరాజ్ఞాపాలనము చేతను, యుక్తాహార విహారములద్వారాను శతవర్షములు జీవించవలయును. ॥౧౯॥ 1892

---

నమస్తే హరస ఇత్యస్య లోపాముద్రా ఋషిః, అగ్ని ర్దేవతా, భురిగ్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః

అథేశ్వరోపాసనా విషయ మాహ. ఈశ్వరోపాసనా విషయము.

నమస్తే హరసే శోచిషే నమస్తే అస్త్వర్చిషే ।
అన్యాఀ స్తే అస్మత్తపన్తు హేతయః పావకో అస్మభ్యꣳ శివో భవ॥

నమః, తే, హరసే, శోచిషే, నమః, తే, అస్తు, అర్చిషే, అన్యాన్, తే, అస్మత్, తపన్తు, హేతయః, పావకః, అస్మభ్యమ్, శివః, భవ. ॥౨౦॥

పదార్థః—(నమః)(తే)తుభ్యమ్(హరసే) హరతి పాపాని తస్మై (శోచిషే) ప్రకాశాయ (నమః)(తే)తుభ్యమ్(హరసే)హరతి పాపాని తస్మై(శోచిషే)ప్రకాశాయ (నమః)(తే) తుభ్యమ్ (అస్తు)(అర్చిషే)స్తుతివిషయాయ(అన్యాన్)(తే)(అస్మత్)(తపన్తు)(హేతయః) వజ్ర ఇవ వ్యవస్థాః (పావకః)పవిత్రకర్తా(అస్మభ్యమ్)(శివః)కల్యాణకారకః(భవ) ॥౨౦॥ అన్వయః—హే భగవన్! హరసే శోచిషే తే నమో అర్చిషే తే నమోస్తు హేతయ స్తేఽస్మదన్యాం స్తపన్తు త్వమస్మభ్యం పావకః శివో భవ. ॥౨౦॥ భావార్థః—హే పరమేశ్వర వయం భవచ్ఛుభగుణ కర్మ స్వభావతుల్యా నస్మద్గుణ కర్మస్వభావాన్ కర్తుం తే నమస్కుర్మో నిశ్చిత మిదం జానీమోఽధార్మికాఀస్తే శాసనాః పీడయన్తి ధార్మికాఀశ్చానన్దయన్తి తస్మాన్మఙ్గలస్వరూపం భవన్తమేవ వయ ముపాస్మహే. ॥౨౦॥

పదార్థము—భగవంతుడా! ఈశ్వరా! హరసే = పాపహర్తవు, శోచిషే = ప్రకాశకుడవునగు, తే = నీకు, నమః = నమస్కారములు, అర్చిషే తే నమః = స్తుతియోగ్యుడవగు నీకు నమస్కారములు, అస్తు = లభించుగాక! తే = నీయొక్క, హేతయః = వజ్రతుల్యములు స్థిరములునైన వ్యవస్థలు, అస్మత్ అన్యాన్ = మాకు భిన్నులైన అన్యాయకారులగు శత్రువులకు, తపంతు = దుఃఖము కలిగించుగాక! నీవు, అస్మభ్యమ్ = మాకై, పావకః = పవిత్రకర్తవు, శివః = కళ్యాణకరుడవు, భవ = కమ్ము. ॥౨౦॥

భావార్థము—పరమేశ్వరా! మేము నీయొక్క శుభగుణ కర్మ స్వభావములకు తుల్యముగ స్వకీయ గుణకర్మ స్వభావములను ఒనర్చుకొనుటకై నీకు నమస్కరించుచున్నాము నీ శాసనములు అధర్మాత్ములకు పీడను,ధర్మాత్ముల కానందమును కలిగించునవి యని నిశ్చితముగ మే మెఱుగుదుము.కనుక మంగళస్వరూపుడవగు నిన్నే మేము ఉపాసించుచున్నాము. ॥౨౦॥ 1893

1894 నమస్త ఇత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, ఈశ్వరో దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నదే విషయము.

నమస్తే అస్తు విద్యుతే నమస్తే స్తనయిత్నవే ।

నమస్తే భగవన్నస్తు యతః స్వః సమీహసే. ॥౨౧॥

నమః, తే, అస్తు, విద్యుత ఇతి వి+ద్యుతే, నమః, తే, స్తనయిత్నవే, నమః, తే, భగవన్నితి భగ+వన్, అస్తు, యతః, స్వరితి స్వః సమీహస ఇతి సమ్+ఈహసే. ॥౨౧॥

పదార్థః—(నమః)(తే)తుభ్యం పరమేశ్వరాయ(అస్తు)(విద్యుతే)విద్యుదివాఽభివ్యాప్తాయ (నమః)(తే)(స్తనయిత్నవే)స్తనయిత్నురివ దుష్టానాం భయంకరాయ(నమః)(తే)(భగవన్)అత్య న్తైశ్వర్యసమ్పన్న(అస్తు)(యతః)(స్వః)సుఖదానాయ(సమీహసే)సమ్యక్ చేష్టసే. అన్వయః— హే భగవన్! యత స్త్వమస్మభ్యం స్వః సమీహసే తస్మాద్విద్యుతే తే నమోఽస్తు స్తనయిత్నవే తే నమోఽస్తు సర్వాభిరక్షకాయ తే నమశ్చ సతతం కుర్యామ. ॥౨౧॥ భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా ! యస్మాదీశ్వరోఽస్మభ్యం సదాఽఽనన్దాయ సర్వాణి సాధనోపసాధనాని ప్రయచ్ఛతి తస్మాదయ మస్మాభిః సేవ్యోఽస్తి. ॥౨౧॥

పదార్థము:—భగవన్ =భగవంతుడా! అనంతైశ్వర్యయుక్తా! యతః = ఏకారణ ముచే నీవు మాకు, స్వః=సుఖమునిచ్చుటకై, సమీహసే =చక్కగా చేష్ట యొనర్చు చున్నావో, ఆకారణముచే, విద్యుతే = విద్యుత్తువలె అభివ్యాప్తుడవగు, తే = నీకు, నమః అస్తు=నమస్కారము, స్తనయిత్నవే = అధికతరముగ గర్జించు విద్యుత్తువలె దుర్జనులకు భయముగొలుపు, తే నమః అస్తు=నీకు నమస్కారము, అందఱిని అన్ని విధముల రక్షించువాడవగు, తే నమః అస్తు=నీకు నిరంతరము నమస్కారము. ॥౨౧॥

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది. మానవులారా ! ఈశ్వ రుడు సదా మనకు ఆనందము లభించు నిమిత్తము సకలసాధనోప సాధనముల నొసగు చున్నాడు. కావున మన కతడు సేవనీయుడు. ॥౨౧॥ 1894

---

యతోయత ఇత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, ఈశ్వరో దేవతా, భురిగుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

యతోయతః సమీహసే తతో నో అభయం కురు ।

శం నః కురు ప్రజాభ్యోఽభయం నః పశుభ్యః. ॥౨౨॥

యతోయత+ఇతి యతః+యతః, సమీహస+ఇతి సమ్+ఈహసే, తతః, నః, అభయమ్, కురు, శమ్, నః, కురు, ప్రజాభ్య ఇతి ప్ర+జాభ్యః,

అభయమ్, నః, పశుభ్య ఇతి పశు+భ్యః. ॥౨౨॥

పదార్థః— (యతోయతః) యస్మాద్యస్మాత్స్థానాత్ (సమీహసే) సమ్యక్ చేష్టసే (తతః) తస్మాత్తస్మాత్(నః)అస్మాన్(అభయమ్)నిర్భయమ్ (కురు) (శమ్)సుఖమ్ (నః) అస్మాకమ్ (కురు) (ప్రజాభ్యః)(అభయమ్)(నః)అస్మాకమ్(పశుభ్యః)గవాదిభ్యః. అన్వయః—హే భగవన్నీశ్వర!త్వం కృపాకటాక్షేణ యతోయతః సమీహసే, తతో నోఽభయం కురు, నః ప్రజాభ్యో నః పశుభ్యశ్చ శమభయం చ కురు. ॥౨౨॥ భావార్థః—హే పరమేశ్వర!భవాన్ యతః సర్వాభివ్యాప్తోఽస్తి తస్మాదస్మానన్యాంశ్చ సర్వేషు కాలేషు సర్వేషు దేశేషు సర్వేభ్యః ప్రాణిభ్యో నిర్భయాన్ కరోతు.

పదార్థము—భగవన్నీశ్వరా ! నీవు నీ కృపాకటాక్షముతో, యతోయతః = ఏయే స్థానములనుండి, సమీహసే=చక్కగ చేష్టయొనర్చుచున్నావో, తతః=ఆ యా స్థానములనుండి, అభయమ్ కురు=అభయమొనర్చుము. నః ప్రజాభ్యః=మా ప్రజలకు, నః పశుభ్యః = మాగవాది పశువులకు, శమ్ అభయమ్ కురు = సుఖమును శాంతిని కల్పించుము. ॥౨౨॥

భావార్థము—పరమేశ్వరా! నీవు అంతట అభివ్యాప్తుడవై యున్నావు కనుక సర్వకాలములందు, సకలదేశములందు, సర్వప్రాణులనుండి మమ్ము, ఇతరులను నిర్భయులుగ నొనర్చుము. ॥౨౨॥ 1895

---

సుమిత్రియేత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, సోమో దేవతా, విరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
కథం పదార్థా హితకారిణో భవన్తీత్యాహ. పదార్థము లెట్లు హితకరము లగుచున్నవి ?

సుమిత్రియా న ఆప ఓషధయః సన్తు దుర్మిత్రియాస్తస్మై సన్తు ।
యోఽస్మాన్ ద్వేష్టి యఞ్చ వయం ద్విష్మః. ॥౨౩॥

సుమిత్రియా ఇతి సు+మిత్రియాః, నః, ఆపః, ఓషధయః, సన్తు, దుర్మిత్రియా ఇతి, దుః+మిత్రియాః, తస్మై, సన్తు, యః, అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్, ద్విష్మః. ॥౨౩॥

పదార్థః—(సుమిత్రియాః)శోభనం మిత్రమివ వర్తమానాః (నః) అస్మభ్యమ్(ఆపః)ప్రాణా జలాని వా(ఓషధయః)యవాద్యాః(సన్తు)(దుర్మిత్రియాః)శత్రురివ విరుద్ధాః(తస్మై)(సన్తు)(యః) అధర్మీ(అస్మాన్)ధార్మికాన్(ద్వేష్టి) అప్రీతయతి(యమ్)(చ)(వయమ్)(ద్విష్మః). అన్వయః—హే మనుష్యా! యా ఇమా ఆప ఓషధయో నః సుమిత్రియాః సన్తు తా యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మస్తస్మై దుర్మిత్రియాః సన్తు. ॥౨౩॥ భావార్థః—యథా జితాన్యనుకూలానీన్ద్రియాణి మిత్రవద్ధితకారీణి భవన్తి తథా జలాదయోఽపి పదార్థా దేశకాలానుకూల్యేన యథోచితం సేవితా హితకరా విరుద్ధం సేవితాశ్చ శత్రువద్దుఃఖదా భవన్తి. ॥౨౩॥

పదార్థము—మానవులారా ! ఆపః=ఏయీ ప్రాణములు లేక జలములు, ఓషధయః=యవాద్యోషధులు, నః=మాకు, సుమిత్రియాః సంతు=సుందరమిత్రులవలె

నగునో అవి; యో అస్మాన్ ద్వేష్టి=మమ్మెవరు ద్వేషించుచున్నారో, చ=మఱియు, యమ్ వయమ్ ద్విష్మః=ఎవనిని మేము ద్వేషించెదమో, తస్మై=అతనికి, దుర్మిత్రియాః సంతు=శత్రుతుల్య విరుద్ధములు అగుగాక! ॥౨౩॥

భావార్థము—జితములు, అనుకూలములునగు నింద్రియము లెట్లు మిత్రతుల్యములు హితకరములు నగునో, అటులనే జలాది పదార్థములు దేశకాలానుసారముగ యథోచితముగ సేవించబడినచో హితకరములుగను, విరుద్ధముగ సేవించబడినచో శత్రుసదృశ దుఃఖదాయకములుగ నగుచున్నవి. ॥౨౩॥ 1896

---

1897 తచ్చక్షురిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, సూర్యో దేవతా, భురిగ్ బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథేశ్వరప్రార్థనా విషయ మాహ. ఈశ్వర ప్రార్థనా విషయము.

తచ్చక్షు ర్దేవహితం పురస్తా చ్ఛుక్ర ముచ్చరత్ । పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతꣳ శృణుయామ శరదః శతం ప్ర బ్రవామ శరదః శత మదీనాః స్యామ శరదః శతం భూయశ్చ శరదః శతాత్. ॥౨౪॥

తత్, చక్షుః, దేవహితమితి దేవ+హితమ్, పరస్తాత్, శుక్రమ్, ఉత్, చరత్, పశ్యేమ, శరదః, శతమ్, జీవేమ, శరదః, శతమ్, శృణుయామ, శరదః, శతమ్, ప్ర, బ్రవామ, శరదః, శతమ్, అదీనాః, స్యామ, శరదః, శతమ్, భూయః, చ, శరదః, శతాత్. ॥౨౪॥

పదార్థః—(తత్)చేతనం బ్రహ్మ (చక్షుః)చక్షు రివ సర్వదర్శకమ్ (దేవహితమ్) దేవేభ్యో విద్వద్భ్యో హితకారి (పురస్తాత్) పూర్వకాలాత్ (శుక్రమ్) శుద్ధమ్(ఉత్) (చరత్) చరతి సర్వం జానాతి(పశ్యేమ)(శరదః)(శతమ్)(జీవేమ)ప్రాణాన్ ధారయేమ(శరదః)(శతమ్)(శృణుయామ) శాస్త్రాణి మఙ్గలవచనాని చేతి శేషః(శరదః)(శతమ్) (ప్ర, బ్రవామ)అధ్యాపయేమోపదిశేమ వా (శరదః)(శతమ్)(అదీనాః)దీనతారహితాః(స్యామ)భవేమ (శరదః)(శతమ్) (భూయః) అధికమ్ (చ)పునః(శరదః)శతాత్. ॥౨౪॥ అన్వయః—హే పరమాత్మన్ ! భవాన్ యద్దేవహితం శుక్రం చక్షు రివ వర్తమానం బ్రహ్మ పరస్తాదుచ్చర త్తత్త్వాం శతం శరదః పశ్యేమ శతం శరదో జీవేమ శతం శరదః శృణుయామ శతం శరదః ప్రబ్రవామ శతం శరదోఽదీనాః స్యామ శతా చ్ఛరదో భూయశ్చ పశ్యేమ జీవేమ శృణుయామ ప్రబ్రవామోఽదీనాః స్యామ చ ॥౨౪॥ భావార్థః—హే పరమేశ్వర! భవత్కృపయా భవద్విజ్ఞానేన భవత్సృష్టిం పశ్యన్త ఉపయుఞ్జానాఽరోగాః సమాహితాః సన్తో వయం సకలేన్ద్రియై ర్యుక్తాః శతాద్వర్షేభ్యోఽప్యధికం జీవేమ సత్యశాస్త్రాణి భవద్గుణాంశ్చ శృణుయామ వేదాదీ నధ్యాపయేమ సత్యముపదిశేమ కదాచిత్కేనాపివస్తునా వినా పరాధీనా న భవేమ సదైవమాత్మవశాః సన్తః సతత మానన్దేమాఽన్యాంశ్చానన్ద యేమేతి. ॥౨౪॥

పదార్థము—పరమేశ్వరా! దేవహితమ్=విద్వాంసులకు హితకారివి, శుక్రమ్=శుద్ధుడవు, చక్షుః=నేత్రమువలె సర్వదర్శకుడవు—సర్వమును చూపించువాడవు, పురస్తాత్=అనాదికాలమునుండి,ఉత్ చరత్=ఉత్కృష్టతతో సకలము నెఱిగినవాడవునై యున్నావు. తత్=అట్టి చేతనబ్రహ్మమైన నిన్ను, శరదః శతమ్=నూరువత్సరముల వరకు, పశ్యేమ=చూచెదముగాక ! శతమ్ శరదః జీవేమ= నూరుసంవత్సరములవరకు ప్రాణముల ధరించెదముగాక !శతమ్ శరదః శృణుయామ=శతవర్షపర్యంతము మంగళకరములగు శాస్త్రవచనములను విందుముగాక! శతమ్ శరదః ప్రబ్రవామ = శతవర్షములపర్యంతము చదివించెదముగాక ! ఉపదేశించెదముగాక ! శతమ్ శరదః అదీనాః స్యామ=శతశరదృతువుల పర్యంతము దీనరహితులమై మనెదముగాక ! శతాత్ శరదః భూయః=నూరుపండ్లకంటె నెక్కువగ కూడ చూచెదముగాక! జీవించెదము గాక! వినెదముగాక! చదివెదముగాక! ఉపదేశించెదముగాక! దీనరహితులమై మనెదముగాక!

భావార్థము—పరమేశ్వరా! నీ దయవలన, నీ విజ్ఞానమువలన నీ సృష్టిని దర్శించుచు, నీతోకూడినవారమై నీరోగులు, సావధానులమునై మేము సకలేంద్రియ సహితులమై నూఱుసంవత్సరములకంటె నెక్కువ జీవించెదముగాక! సత్యశాస్త్రములను నీ గుణములను వినెదముగాక ! వేదాదులను చదివించెదముగాక ! సత్యోపదేశమొనర్చెదముగాక!ఎన్నడు ఏవస్తువైనా లేకున్నను పరాధీనులము కాకుందుముగాక! సదా స్వతంత్రులమై నిరంతరము ఆనందముల భోగించెదముగాక! ఇతరుల నానందింపజేసెదముగాక ! ॥౨౪॥ 1897

---

అత్ర పరమేశ్వరప్రార్థనం సద్గుణప్రాపణం సర్వేషాం సుఖభానం పరస్పరమిత్రత్వావశ్యకకరణం దినచర్యాశోధనం ధర్మలక్షణ మాయుర్వర్ధనం పరమేశ్వరవిజ్ఞానం చోక్తమత ఏతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సఙ్గతి రస్తీతి వేద్యమ్.

ఈ అధ్యాయమునందు పరమేశ్వర ప్రార్థన, అందఱి సుఖముల విజ్ఞాపనము, పరస్పర మైత్రియొనర్చు నావశ్యకత, దినచర్య శోధనము, ధర్మలక్షణము, వయస్సును వృద్ధిపఱచుట, పరమేశ్వరుని నెఱుగుట చెప్పబడినవి. ఇందుచే నీ యధ్యాయార్థమునకు పూర్వాధ్యాయమునందు చెప్పబడిన యర్థముతో సంగతి కలదని గ్రహించవలయును.



ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం శ్రీ మత్పరమవిదుషాం శ్రీ విరజానంద
సరస్వతీస్వామినాం శిష్యేణ శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యేణ
శ్రీమద్దయానంద సరస్వతీ స్వామినా విరచితే సంస్కృతార్య
భాషాభ్యాం సమన్వితే యజుర్వేదభాష్యే
షట్ త్రింశోఽధ్యాయః
పూర్తి మగాత్.



కృష్ణా మండలాంతర్గత కుందేరు గ్రామవాస్తవ్యులగు
పాలడుగు శేషాచలాచార్య, తదేవమండలాంతర్గత ముదునూరు
గ్రామవాస్తవ్యుడు అన్నే కేశవార్యశాస్త్రి గురుశిష్యు లిరువురు ఆంధ్రీకరించిన
శ్రీ మద్దయానన్దసరస్వతీ నిర్మిత యజుర్వేదభాషాభాష్యమందలి ౩౬వ అధ్యాయము సమాప్తము.



ఓమ్

# అథ సప్తత్రింశాధ్యాయారమ్భః

—౦—

౩౭వ అధ్యాయము ప్రారంభించబడుచున్నది

ఓం విశ్వాని దేవ సవిత ర్దురి తాని పరాసువ। యద్భద్రం తన్న ఆ సువ ॥౧॥

1898 దేవేత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, సవితా దేవతా, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథ మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ.

మొదటి మంత్రమందు మానవు లేమి చేయవలయునను విషయము.

దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో

హస్తాభ్యామ్ । ఆ దదే నారిరసి. ॥౧॥

దేవస్య, త్వా, సవితుః, ప్రసవ+ఇతి ప్ర+సవే, అశ్వినోః, బాహుభ్యామితి బాహు+భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, ఆ, దదే, నారిః, అసి. ॥౧॥

పదార్థః—(దేవస్య)సకలసుఖప్రదాతుః(త్వా) త్వామ్(సవితుః)జగదుత్పాదకస్య (ప్రసవే) ఉత్పన్నే జగతి(అశ్వినోః)అధ్యాపకోపదేశకయోః(బాహుభ్యామ్)బలవీర్యాభ్యామ్(పూష్ణః) పోషకస్య(హస్తాభ్యామ్)కరాభ్యామ్(ఆ)(దదే)సమన్తాద్ గృహ్ణామి(నారిః)నాయకః(అసి) అన్వయః— హే విద్వన్! యతస్త్వం నారి రసి తస్మాత్ సవితు ర్దేవస్య ప్రసవేఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం త్వాఽఽదదే. ॥౧॥ భావార్థ—హే మనుష్యా! యూయం విద్వద్వరాన్ ప్రాప్య సంసేవ్యైతేభ్యో విద్యాశిక్షే గృహీత్వాఽత్ర సృష్టౌ నాయకా భవత. ॥౧॥

పదార్థము—విద్వాంసుడా! నీవు, నారిః అసి=నాయకుడవు కాపున, సవితుః= జగదుత్పాదకుడైన, దేవస్య = సకలసుఖ ప్రదాతయొక్క, ప్రసవే = సృష్టియందు, అశ్వినోః=అధ్యాపకునియొక్కయు, ఉపదేశకునియొక్కయు, బాహుభ్యామ్=బల పరాక్రమములచేతను, పూష్ణః=పుష్టికర్తయొక్క, హస్తాభ్యామ్=చేతులచేతను, త్వా =నిన్ను, ఆ దదే=చక్కగా గ్రహించుచున్నాను. ॥౧॥

భావార్థము—మానవులారా! మీ రుత్తమ విద్వాంసులజేరి వారినుండి విద్యా సుశిక్షల గ్రహించి యీ సృష్టియందు నాయకులు గండు. ॥౧॥ 1898

---

1899 యుఞ్జత ఇత్యస్య శ్యావాశ్వ ఋషిః, సవితా దేవతా, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ యోగాభ్యాస విషయ మాహ. యోగాభ్యాస విషయము.

యుఞ్జతే మన ఉత యుఞ్జతే ధియో విప్రా విప్రస్య బృహతో విపశ్చితః ।

వి హోత్రా దధే వయునావిదేక ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః. ॥౨॥

యుఞ్జతే, మనః, ఉత, యుఞ్జతే, ధియః, విప్రాః, విప్రస్య, బృహతః, విపశ్చిత ఇతి విపః+చితః, వి,హోత్రాః, దధే, వయునా విత్, వయునవిదితి వయున+విత్, ఏకః, ఇత్, మహీ, దేవస్య, సవితుః, పరిష్టుతిః, పరిస్తుతి రితి పరి+స్తుతిః. ॥౨॥

పదార్థః—(యుఞ్జతే) సమాదధతి (మనః) సంకల్పవికల్పాత్మకమ్ (ఉత) అపి (యుఞ్జతే) (ధియః) ప్రజ్ఞాః కర్మాణి వా (విప్రాః) వివిధమేధావ్యాపినో మేధావినః (విప్రస్య) విశేషేణ సర్వత్ర వ్యాప్తస్య (బృహతః) సర్వేభ్యో మహతః (విపశ్చితః) అనన్తవిద్యస్య (వి) (హోత్రాః) యే జుహ్వత్యాదదతి తే (దధే) దధాతి (వయునావిత్) యో వయునాని ప్రజ్ఞానాని వేత్తి సః (ఏకః) అద్వితీయః (ఇత్) ఏవ (మహీ) మహతీ (దేవస్య) సకలజగత్ప్రకాశకస్య (సవితుః) సర్వాన్తర్యామిణః (పరిష్టుతిః) పరితః సర్వతః స్తుతిః ప్రశంసా. ॥౨॥ అన్వయః—హే మనుష్యా! య ఏకో వయునావిజ్జగదీశ్వరో సర్వం విదధే యస్య సవితు ర్దేవస్యేయం మహీ పరిష్టుతి రస్తి హోత్రా విప్రా యోగినో యస్య బృహతో విపశ్చితో విప్రస్య మధ్యే మనో యుఞ్జత ఉత ధియో యుఞ్జతే తమిదేవ యూయముపాధ్వమ్. భావార్థః—హే మనుష్యా! యో యోగిభి ర్ధ్యేయో యస్య ప్రశంసాదృష్టాన్తాః సూర్యాదయో వర్తన్తే యః సర్వజ్ఞోఽసహాయః సచ్చిదానన్దస్వరూపోఽస్తి తస్మై సర్వే ధన్యవాదా దాతుమర్హా వర్తన్తే తమేవేష్టదేవం యూయం మన్యధ్వమ్. ॥౨॥

పదార్థము—మానవులారా ! వయునావిత్ = ఉత్కృష్టజ్ఞానములో ప్రవీణుడు, ఏకః = అద్వితీయ జగదీశ్వరుడెవడు సకలమును, వి దధే = రచించుచున్నాడో, సవితుః = సర్వాంతర్యామి, దేవస్య = సకలజగత్తును ప్రకాశింపజేయువాడునగు నేయీశ్వరుని యొక్క, మహీ = గొప్పదైన, పరిష్టుతిః = అన్నివైపులనుండి ప్రశంసయున్నదో, హోత్రాః = శుభగుణ గ్రహీతలు, విప్రాః = అనేకవిధముల బుద్ధులలో వ్యాప్తులు, బుద్ధిమంతులునగు యోగులు, బృహతః = అందఱికంటె గొప్పవాడు, విపశ్చితః = అనంతవిద్యగలవాడు, విప్రస్య = విశేషించి సర్వత్ర వ్యాప్తుడునైన యే పరమేశ్వరుని మధ్య, మనః = సంకల్ప వికల్పరూపములోనున్న మనస్సును, యుంజతే = సమాహితమొనర్చుచున్నారో, ఉత = మఱియు, ధియః = బుద్ధులను లేక కర్మలను, యుంజతే = సంయుక్తపఱచుచున్నారో, ఇత్ = అతనినే మీరు ఉపాసనచేయుచు నుండుడు. ॥౨॥

భావార్థము—మానవులారా! ఎవడు యోగులచే ధ్యానించదగినవాడో, ఎవని ప్రశంసహేతువులుగ సూర్యాదులు దృష్టాంతములో, ఎవడు సర్వజ్ఞుడు, అసహాయుడు, సచ్చిదానంద స్వరూపుడునై ఉన్నాడో, ఎవడు అందఱి ధన్యవాదముల కర్హుడో, అతనినే ఇష్టదేవునిగ స్వీకరించుడు. ॥౨॥ 1899

---

దేవీత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, ద్యావాపృథివ్యౌ దేవతే, బ్రాహ్మీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః

అథ యజ్ఞవిషయ మాహ. యజ్ఞవిషయము.

దేవీ ద్యావాపృథివీ మఖస్య వామద్య శిరో రాధ్యాసం దేవయజనే
పృథివ్యాః । మఖాయ త్వా మఖస్య త్వా శీర్ష్ణే. ॥౩॥

దేవీ ఇతి దేవీ, ద్యావాపృథివీ ఇతి ద్యావా పృథివీ, మఖస్య, వామ్, అద్య, శిరః, రాధ్యాసమ్, దేవయజన ఇతి దేవ+యజనే, పృథివ్యాః, మఖాయ, త్వా, మఖస్య, త్వా, శీర్ష్ణే. ॥౩॥

పదార్థః—(దేవీ)దివ్యగుణసమ్పన్నే(ద్యావాపృథివీ) ప్రకాశభూమివద్వర్తమానే(మఖస్య)యజ్ఞస్య (వామ్)యువయోః(అద్య)ఇదానీమ్(శిరః)ఉత్తమాఙ్గమ్ (రాధ్యాసమ్) సంసాధయేయమ్ (దేవయజనే) దేవా విద్వాంసో యజన్తి యస్మింస్తస్మిన్ (పృథివ్యాః) భూమేర్మధ్యే (మఖాయ) యజ్ఞాయ(త్వా)త్వామ్(మఖస్య)యజ్ఞస్య(త్వా)(శీర్ష్ణే)ఉత్తమాఙ్గాయ. ॥౩॥ అన్వయః—దేవీ ద్యావాపృథివ్యధ్యాపికోపదేశికే స్త్రియావద్య పృథివ్యా దేవయజనే వాం మఖస్య శిరో రాధ్యాసమ్. మఖస్య శీర్ష్ణే త్వా మఖాయ త్వా రాధ్యాసమ్. ॥౩॥ భావార్థః—అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా! అత్ర జగతి యథా సూర్యభూమీ ఉత్తమాఙ్గవద్వర్తేతే తథైవ భవన్తః సర్వోత్తమా వర్తన్తాం యేన సర్వసఙ్గత్యధిష్ఠానో యజ్ఞః పూర్ణః స్యాత్ ॥౩॥

పదార్థము—దేవీ = ఉత్తమగుణ సంపన్నలారా! ద్యావాపృథివీ = ప్రకాశము వలెను, భూమివలెనున్న అధ్యాపికోపదేశికలగు నో స్త్రీలారా! అద్య = నేడు, పృథివ్యాః = భూమండలమున, దేవయజనే = విద్వాంసుల యజ్ఞస్థలములో, వామ్ = మీ యిరువురి యొక్క, మఖస్య శిరః = యజ్ఞపు ఉత్తమావయవమును నేను, రాధ్యాసమ్ = చక్కగా తయారుచేయుదునుగాక! మఖస్య = యజ్ఞము యొక్క, శీర్ష్ణే = ఉత్తమావయవసిద్ధికై త్వా = నిన్ను మఱియు, మఖాయ = యజ్ఞమునకై, నిన్ను చక్కగా సిద్ధమొనర్చెదను గాక! ॥౩॥

భావార్థము—వాచక లుప్తోపమాలంకార మిందున్నది. మానవులారా! ఈ జగత్తునందు భూమి సూర్యులుత్తమావయవములవలె నున్నటులుగానే మీరును సర్వసంగతుల కాశ్రయమగు యజ్ఞము పూర్తియగునటుల అందఱితో ఉత్తమరీతిగ ప్రవర్తించుడు. ॥౩॥ 1900

1901 దేవ్య ఇత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, యజ్ఞో దేవతా, నిచృత్పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.
అథ విదుష్యః స్త్రియః కీదృశ్యః స్యు రిత్యాహ. విదుషి స్త్రీ లెటు లుందురు?

దేవ్యో వమ్రయో భూతస్య ప్రథమజా మఖస్య వోఽద్య శిరో రాధ్యాసం
దేవయజనే పృథివ్యాః । మఖాయ త్వా మఖస్య త్వా శీర్ష్ణే. ॥౪॥

దేవ్యః, వమ్ర్యః, భూతస్య, ప్రథమజా ఇతి ప్రథమ+జాః, మఖస్య, వః, అద్య, శిరః, రాధ్యాసమ్, దేవయజన ఇతి దేవ+యజనే, పృథివ్యాః,

మఖాయ, త్వా, మఖస్య, త్వా, శీర్ ష్ణే. ॥౪॥

పదార్థః—(దేవ్యః) దేదీప్యమానాః (వమ్ర్యః) అల్పవయస్యః(భూతస్య)ఉత్పన్నస్య(ప్రథమజాః)ప్రథమాజ్జాతాః(మఖస్య)యజ్ఞస్య(వః)యుష్మాన్(అద్య)(శిరః)శిరోవత్(రాధ్యాసమ్) (దేవయజనే)విదుషాం సఙ్గతికరణే(పృథివ్యాః)(మఖాయ)యజ్ఞాయ(త్వా)త్వామ్ (మఖస్య) యజ్ఞస్య నిర్మాపికామ్(త్వా)త్వామ్(శీర్ ష్ణే) శిరోవద్వర్తమానాయ. ॥౪॥ అన్వయః—హే ప్రథమజా వమ్ర్యో దేవ్యో విదుష్యో భూతస్య మఖస్య పృథివ్యా దేవయజనేఽద్య వః శిరోవదహం రాధ్యాసం మఖస్య త్వా మఖాయ శీర్ ష్ణే త్వా రాధ్యాసమ్. ॥౪॥ భావార్థః—హే మనుష్యా! యావత్ స్త్రియో విదుష్యో న భవన్తి తావదుత్తమాశిక్షా న వర్ధతే. ॥౪॥

పదార్థము—ప్రథమజాః=ముందుపుట్టినవారు,వమ్ర్యః=అల్పవయస్కురాండ్రు, దేవ్యః=తేజస్వినులు, విదుషీమణులునగు స్త్రీలారా! భూతస్య=ఉత్పన్నము సిద్ధమునైన, మఖస్య=యజ్ఞమునకు సంబంధించిన, పృథివ్యాః దేవయజనే = భూమిమీద, విద్వాంసులు సంగతియొనర్చు స్థానమున, అద్య=నేడు, వః = మిమ్ము, శిరః=శిరస్తుల్యముగ, రాధ్యాసమ్=చక్కగ సిద్ధమొనర్చెదనుగాక! మఖస్య=యజ్ఞమును నిర్మించునట్టి, త్వా=నిన్ను, మఱియు, మఖాయ శీర్ ష్ణే=శిరస్సదృశముగనున్న యజ్ఞమునకై, త్వా=నిన్ను, చక్కగా సంసిద్ధురాలనుగ నొనర్చుదును. ॥౪॥

భావార్థము—మనుష్యులారా! స్త్రీలు విదుషీమణులు కానంతవరకు ఉత్తమశిక్ష వర్ధిల్లజాలదు. ॥౪॥ 1901

---

ఇయతీత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః,యజ్ఞో దేవతా,స్వరాడ్ బ్రాహ్మీ గాయత్రీ ఛన్దః,షడ్జః స్వరః

అథాధ్యాపక విషయ మాహ. అధ్యాపకుని విషయము.

ఇయత్యగ్రే ఆసీన్మఖస్య తేఽద్య శిరో రాధ్యాసం దేవయజనే
పృథివ్యాః । మఖాయ త్వా మఖస్య త్వా శీర్ ష్ణే. ॥౫॥

ఇయతి, అగ్రే, ఆసీత్, మఖస్య, తే, అద్య, శిరః, రాధ్యాసమ్, దేవయజన+ఇతి దేవ+యజనే పృథివ్యాః, మఖాయ, త్వా, మఖస్య, త్వా శీర్ ష్ణే॥

పదార్థః—(ఇయతి)ఏతావతి(అగ్రే)(ఆసీత్)అస్తి(మఖస్య)యజ్ఞస్య(తే)తవ (అద్య) (శిరః) ఉత్తమగుణమ్(రాధ్యాసమ్)(దేవయజనే)విదుషాం పూజనే(పృథివ్యాః)భూమేః (మఖాయ)సత్కారాఖ్యాయ(త్వా)(త్వామ్)(మఖస్య)సఙ్గతికరణస్య(త్వా)(శీర్ ష్ణే)ఉత్తమత్వాయ. అన్వయః—హే విద్వన్నహమగ్రే మఖాయ త్వా మఖస్య శీర్ ష్ణే త్వా రాధ్యాసమ్. యస్య తే మఖస్య శిర ఆసీత్ తం త్వా మద్య పృథివ్యా ఇయతి దేవయజనే రాధ్యాసమ్. ॥౫॥ భావార్థః—త ఏవాఽధ్యాపకాః శ్రేష్ఠాః సన్తి యే పృథివ్యా మధ్యే సర్వాన్ సుశిక్షావిద్యాయుక్తాన్ కర్తుం శక్నువన్తి. ॥౫॥

పదార్థము—విద్వాంసుడా!అగ్రే=ముందుగా,మఖాయ=సత్కారరూప యజ్ఞ

మునకై, త్వా=నిన్ను, మఖస్య=సంగతి కరణము యొక్క, శీర్ ష్ణే=శ్రేష్ఠత్వముకొఱకు, త్వా=నిన్ను, రాధ్యాసమ్=సిద్ధమొనర్చెదనుగాక! తే మఖస్య శిరః = ఏ నీ యొక్క యజ్ఞమునకు ఉత్తమగుణము, ఆసీత్=ఉన్నదో, ఆనిన్ను, అద్య=నేడు, పృథివ్యాః= భూమి యొక్క మధ్య, ఇయతి దేవయజనే = ఇంతమంది విద్వాంసుల పూజనమందు చక్కగ తయా[రుచేయు]దును గాక! ॥౫॥

భావార్థము—భూగోళమున నందఱికి ఉత్తమశిక్ష, ఉత్తమవిద్య గలుపుటకు సమర్థులైన అధ్యాపకులే శ్రేష్ఠులు కాగలరు. ॥౫॥ 1902

---

1903 ఇన్ద్రస్యేత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, యజ్ఞో దేవతా, భురిగతిజగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పున ర్మనుష్యాః కిం కుర్యు రిత్యాహ. మానవు లేమి చేయవలయును?

ఇన్ద్రస్యౌజః స్థ మఖస్య వోఽద్య శిరో రాధ్యాసం దేవయజనే పృథివ్యాః । మఖాయ త్వా మఖస్య త్వా శీర్ ష్ణే మఖాయ త్వా మఖస్య త్వా శీర్ ష్ణే మఖాయ త్వా మఖస్య త్వా శీర్ ష్ణే. ॥౬॥

ఇన్ద్రస్య, ఓజః, స్థ, మఖస్య, వః, అద్య, శిరః, రాధ్యాసమ్, దేవయజన ఇతి దేవ+యజనే, పృథివ్యాః, మఖాయ, త్వా, మఖస్య, త్వా, శీర్ ష్ణే, మఖాయ, త్వా, మఖస్య, త్వా, శీర్ ష్ణే, మఖాయ, త్వా, మఖస్య, త్వా, శీర్ ష్ణే. ॥౬॥

పదార్థః—(ఇన్ద్రస్య)పరమైశ్వర్యయుక్తస్య(ఓజః)పరాక్రమమ్(స్థ)భవత(మఖస్య)యజ్ఞస్య (వః)యుష్మాన్(అద్య)(శిరః)(రాధ్యాసమ్)(దేవయజనే)(పృథివ్యాః)భూమేః (మఖాయ) ధార్మికాణాం సత్కారనిమిత్తాయ(త్వా)త్వాం సత్కారమ్(మఖస్య) ప్రియాచరణాఖ్యస్య వ్యవహారస్య(త్వా)త్వామ్(శీర్ ష్ణే)శిరః సంబన్ధినే వచసే(మఖాయ)శిల్పయజ్ఞవిధానాయ (త్వా)త్వామ్ (మఖస్య) (త్వా) (శీర్ ష్ణే) ఉత్తమగుణప్రచారకాయ (మఖాయ) విజ్ఞానోద్భావనాయ (త్వా) (మఖస్య)విద్యాబుద్ధికరస్య వ్యవహారస్య(త్వా)(శీర్ ష్ణే). ॥౬॥ అన్వయః—హే మనుష్యా! యథాహామిన్ద్రస్యౌజో రాధ్యాసం తథాఽద్య పృథివ్యా దేవయజనే శిరోవద్ వో రాధ్యాసమ్ శీర్ ష్ణే మఖాయ త్వా మఖస్య త్వా రాధ్యాసం శీర్ ష్ణే మఖాయ త్వా మఖస్య త్వా రాధ్యాసం శీర్ ష్ణే మఖాయ త్వా మఖస్య త్వా రాధ్యాసం తథా యూయ మోజస్వినః స్థ. భావార్థః—అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. యే మనుష్యా! ధర్మాణి కర్మాణి కుర్వన్తి తే సర్వేషు శిరోవద్భవన్తి ॥౬॥

పదార్థము—మానవులారా! నేనెటుల, ఇన్ద్రస్య=పరమైశ్వర్యయుక్తుడైన పురుషుని యొక్క, ఓజః=పరాక్రమమును, రాధ్యాసమ్=సాధించెదనో, అటులనే అద్య= నేడు, పృథివ్యాః దేవయజనే=భూమిమీద విద్వాంసులపూజ జరుగు స్థానమందు, శిరః =ఉత్తమావయవమువలె, వః=మిమ్ము సిద్ధపఱచెదను, శీర్ ష్ణే = శిరస్సంబంధమగు, మఖాయ=ధర్మాత్ముల సత్కార నిమిత్తపు వచనమునకై, త్వా=నిన్ను, మఖస్య= ప్రియాచరణరూప వ్యవహారమునకు సంబంధిగ, త్వా=నిన్ను సిద్ధమొనర్చెదను! శీర్ ష్ణే

మ్, శరీరమ్, ఓ౩మ్, క్రతో ఇతి క్రతో, స్మర, క్లిబే, స్మర, కృతమ్, స్మర.

పదార్థః—(వాయుః) ధనంజయాదిరూపః (అనిలమ్) కారణరూపం వాయుమ్ (అమృతమ్) నాశరహితం కారణమ్ (అథ) (ఇదమ్) (భస్మాన్తమ్) భస్మ అన్తే యస్య తత్ (శరీరమ్) యచ్ఛీర్యతే హింస్యతే తదాశ్రయమ్ (ఓ౩మ్) ఏతన్నామ వాచ్య మీశ్వరమ్ (క్రతో)యః కరోతి జీవ స్తత్సమ్బుద్ధౌ (స్మర) పర్యాలోచయ (క్లిబే) స్వసామర్థ్యాయ (స్మర) (కృతమ్) యదనుష్ఠితమ్ (స్మర)తత్ ॥౧౫॥ అన్వయః—హే క్రతో ! త్వం శరీరత్యాగసమయే (ఓ౩మ్) స్మర క్లిబే పరమాత్మానం స్వ స్వరూపం చ స్మర. కృతం స్మర. అత్రస్థో వాయు రనిల మనిలోఽమృతం ధరతి. అథేదం శరీరం భస్మాన్తం భవతీతి విజానీత ॥౧౫॥ భావార్థః—మనుష్యై ర్యథా మృత్యు సమయే చిత్తవృత్తి ర్జాయతే శరీరాదాత్మనః పృథగ్భావశ్చ భవతి తథైవేదానీమపి నిశ్చేయమ్. ఏతచ్ఛరీరస్య భస్మాన్తా క్రియా కార్యా నాతో దహనాత్పరః కశ్చిత్సంస్కారః కర్తవ్యో వర్తమాన సమయ ఏకస్య పరమేశ్వరస్యైవాజ్ఞాపాలన ముపాసనం స్వసామర్థ్యవర్ధన ఞ్చైవ కార్యమ్, కృతం కర్మ విఫలం న భవతీతి మత్వా ధర్మే రుచి రధర్మేఽప్రీతిశ్చ కర్తవ్యా ॥౧౫॥

పదార్థము—క్రతో=కర్మ యొనరించు జీవమా ! నీవు శరీరమును త్యజించు సమయమున, ఓ౩మ్ స్మర=ఓమ్‌నామ వాచ్యుడగు నీశ్వరుని స్మరించుము, క్లిబే స్మర =స్వసామర్థ్యముకొఱకు పరమాత్మ స్వరూపమును, స్వస్వరూపమును స్మరించుము. కృతమ్ స్మర=చేసినదానిని స్మరించుము. ఇక్కడనున్న, వాయుః=ధనంజయాది రూప వాయువు, అనిలమ్=కారణరూపవాయువును ; ఆ కారణరూపవాయువు, అమృతమ్=అవినాశియగు కారణమును ధరించుచున్నది. అథ=తదనంతరము, ఇదమ్ శరీరమ్=నశ్వరము సుఖాదులకాశ్రయము నగు నీ శరీరము,భస్మాంతమ్=చివరకు భస్మము అగునది యని యెఱుగుము. ॥౧౫॥

భావార్థము—మృత్యుసమయమున చిత్తవృత్తి యెటులుండునో మఱియు శరీరమునుండి ఆత్మ ఎటుల వేఱు గావలసియున్నదో ఆవిధమును యిప్పుడును ఎఱుగవలయును. ఈ శరీరమునకు భస్మమొనరించునంతవరకే కార్యమొనర్పవలయును. కాల్చిన తర్వాత శరీరమునకే సంస్కారము చేయగూడదు. బ్రతికియుండగ ఏకేశ్వరోపాసన, అతని ఆజ్ఞాపాలనము, స్వసామర్థ్యవర్ధనము చేయుచుండవలయును. చేసినపని విఫలము —నిష్ఫలము కాబోదని విశ్వసించి ధర్మము నందభిరుచి, అధర్మమునందు అప్రీతియు నుంచవలయును. ॥౧౫॥ 1074

1975 అగ్నే నయేత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః
ఈశ్వరః కానసుగృహ్ణాతీ త్యాహ. ఈశ్వరు డే మానవులపై దయ చూపును ?

అగ్నే నయ సుపథా రాయే అస్మా న్విశ్వాని దేవ వయునాని విద్వాన్ ।
యుయోధ్యస్మజ్జుహురాణ మేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥

అగ్నే, నయ, సుపథేతి సు+పథా, రాయే, అస్మాన్, విశ్వాని, దేవ, వయునాని, విద్వాన్, యుయోధి, అస్మత్, జుహురాణమ్, ఏనః, భూయిష్ఠామ్, తే,

నమ ఉక్తిం మితి నమః+ఉక్తిమ్, విధేమ. ॥౧౬॥

పదార్థః—(అగ్నే) స్వప్రకాశ స్వరూప! కరుణామయ! జగదీశ్వర! (నయ)గమయ(సుపథా) ధర్మ్యేణ మార్గేణ(రాయే) విజ్ఞానాయ ధనాయ వసుసుఖాయ (అస్మాన్)జీవాన్(విశ్వాని) అఖిలాని (దేవ) దివ్యస్వరూప (వయునాని) ప్రశస్యాని ప్రజ్ఞానాని. వయున మితి ప్రశస్య నా...నిఘం. ३.౮. ప్రజ్ఞా నామసు...నిఘం. ३.౯. (విద్వాన్) యః సర్వం వేత్తి సః (యుయోధి) పృథక్కురు(అస్మత్)అస్మాకం సకాశాత్(జుహురాణమ్)కౌటిల్యమ్(ఏనః)పాపాచరణమ్(భూయిష్ఠామ్) బహుతమామ్ (తే)తుభ్యమ్(నమఉక్తిమ్) సత్కారపురఃసరాం ప్రశంసామ్ (విధేమ) పరిచరేమ. ॥౧౬॥ అన్వయః—హేదేవాగ్నే! పరమేశ్వర! యతో వయం తే భూయిష్ఠాం నమ ఉక్తిం విధేమ తస్మాద్విద్వాం స్త్వమస్మజ్జుహురాణ మేనో యుయోధ్యస్మాన్ రాయే సుపథా విశ్వాని వయునాని నయ ప్రాపయ. ॥౧౬॥ భావార్థః—యే సత్యభావేన పరమేశ్వర ముపాసతే యథాసామర్థ్యం తదాజ్ఞాం పాలయన్తి సర్వోపరి సత్కర్తవ్యం పరమాత్మానం మన్యన్తే తాన్ దయాలు రీశ్వరః పాపాచరణ మార్గాత్ పృథక్కృత్య ధర్మ్యమార్గే చాలయిత్వా విజ్ఞానం దత్త్వా ధర్మార్థకామమోక్షాన్ సాద్ధుం సమర్థాన్ కరోతి తస్మాత్ సర్వ ఏక మద్వితీయ మీశ్వరం విహాయ కస్యాప్యుపాసనం కదాచిన్నైవ కుర్యుః ॥౧౬॥

పదార్థము—దేవ=ద్వివ్యస్వరూపా! అగ్నే = ప్రకాశ స్వరూపా! కరుణామయా! జగదీశ్వరా! మేము, తే = నీకు, భూయిష్ఠామ్ = అత్యధికముగా, నమ ఉక్తిమ్విధేమ=సత్కార పూర్వకముగ ప్రశంసించెదము-సేవించెదము.కనుక,విద్వాన్ = సర్వజ్ఞుడవైన నీవు, అస్మత్ = మానుండి కౌటిల్యమును, ఏనః=పాపాచరణమును, యుయోధి=వేరుపఱచుము, అస్మాన్=జీవులమగు మమ్ము, రాయే=విజ్ఞానధనము కొఱకు ధనముచే కలుగు సుఖముకొఱకు, సుపథా=ధర్మానుకూలమార్గమున [నడిపించుము]. ధనముచే, విశ్వాని వయునాని=[మాకు]సకలప్రశస్తజ్ఞానములను, నయ= లభింపజేయుము. ॥౧౬5

భావార్థము—ఎవరు సత్యభావముతో పరమేశ్వరు నుపాసించెదరో, యథాశక్తి యతని యాజ్ఞను పాలించెదరో, మఱియు సర్వోపరిసత్కారమునకు యోగ్యునిగ పరమాత్మను భావించుచున్నారో, వారిని దయాళువగు నీశ్వరుడు పాపాచరణ మార్గము నుండి వేరుపఱచి, ధర్మయుక్త మార్గమున నడిపించి, విజ్ఞానమిచ్చి, ధర్మార్థకామ మోక్షములను సాధించుటకు సమర్థులుగ నొనర్చుచున్నాడు. కనుక అద్వితీయుడగు నీశ్వరుని దక్క నితరుని నెన్నటికి ఉపాసించకూడదు. ॥౧౬॥ 197॥

---

1976 హిరణ్మయేనేత్యస్య దీర్ఘతమా ఋషి, ఆత్మా దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథాన్తే మనుష్యా నీశ్వర ఉపదిశతి.

అంతమున మానవుల కీశ్వరు డుపదేశించుచున్నాడు.

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్ ।

యోఽసావాదిత్యే పురుషః సోఽసావహమ్ । ఓ౩మ్ ఖం బ్రహ్మ ॥౧౭॥

హిరణ్మయేన, పాత్రేణ, సత్యస్య, అపిహితమిత్యపి హితమ్, ముఖమ్,

యః, అసౌ, ఆదిత్యే, పురుషః, సః, అసౌ, అహమ్, ఓ౩మ్, ఖమ్, బ్రహ్మ.

పదార్థః—(హిరణ్మయేన)జ్యోతిర్మయేన (పాత్రేణ)రక్షకేణ (సత్యస్య) అవినాశినః యథార్థస్య కారణస్య(అపిహితమ్)ఆచ్ఛాదితమ్(ముఖమ్) ముఖవదుత్తమాఙ్గమ్(యః)(అసౌ)(ఆదిత్యే) ప్రాణే సూర్యమణ్డలే వా(పురుషః)పూర్ణః పరమాత్మా (సః)(అసౌ)(అహమ్)(ఓ౩మ్) యో ఽవతి సకలం జగత్తదాఖ్యా ఖమ్) ఆకాశవద్ వ్యాపకమ్ (బ్రహ్మ) సర్వేభ్యో గుణకర్మ స్వరూపతో బృహత్ ॥౧౭॥ అన్వయః—హే మనుష్యా ! యేన హిరణ్మయేన పాత్రేణ మయా సత్యస్యాపిహితం ముఖం వికాశ్యతే యోఽసావాదిత్యే పురుషోఽస్తి సోఽసావహం ఖమ్బ్రహ్మాస్మీతి విజానీత. ॥౧౭॥ భావార్థః—సర్వాన్మనుష్యాన్ ప్రతీశ్వర ఉపదిశతి. హే మనుష్యా ! యోఽహమత్రాస్మి స ఏవాన్యత్ర సూర్యాదౌ యోఽన్యత్ర సూర్యాదౌ వస్మి స ఏవాత్రాఽస్మి. సర్వత్ర పరిపూర్ణః ఖవద్వ్యాపకో న మత్తః కిఞ్చిదన్యద్ బృహదహమేవ సర్వేభ్యో మహానస్మి మదీయం సులక్షణపుత్రవత్ ప్రాణప్రియం నిజస్య నామౌ౩మితి వర్తతే. యో మమ ప్రేమ సత్యాచరణ భావాభ్యాం శరణం గచ్ఛతి. తస్యాన్తర్యామి రూపేణాహమవిద్యాం వినాశ్య తదాత్మానం ప్రకాశ్య శుభగుణకర్మస్వభావం కృత్వా సత్యస్వరూపావరణం స్థాపయిత్వా శుద్ధం యోగజం విజ్ఞానం దత్వా సర్వేభ్యో దుఃఖేభ్యః పృథక్కృత్య మోక్షసుఖం ప్రాపయామీత్యోమ్. ॥౧౭॥

పదార్థము—మానవులారా ! హిరణ్మయేన = జ్యోతిః స్వరూపుడను, పాత్రేణ = రక్షకుడను నగు నే నాచేత, సత్యస్య = అవినాశియు యథార్థమునగు కారణము యొక్క, అపిహితమ్ = ఆచ్ఛాదితము, ముఖమ్ = ముఖతుల్యమగు నుత్తమాంగము ప్రకాశ మొనర్చబడుచున్నదో, ఆదిత్యే = ప్రాణమునందు లేక సూర్యమండలము నందు, యః అసౌ పురుషః = పూర్ణుడైన ఏ యీ, పరమాత్మయున్నాడో, సః = అతడే, అసౌ అహమ్ = పరోక్షుడనగు నేను. ఆ నేను, ఖమ్ = ఆకాశమువలె వ్యాపకుడను, బ్రహ్మ = గుణకర్మ స్వరూపములచే అందరికంటె నధికుడను, ఓ౩మ్ = సకల రక్షకుడనునై యున్నాను. అట్టి నాయొక్క నామము "ఓ౩మ్" అని గ్రహించుడు. ॥౧౭॥

భావార్థము — సకలమానవుల కీశ్వరుడిటుల ఉపదేశించుచున్నాడు — ఓ మానవులారా ! ఏ నేనిచటయున్నానో, ఆ నేనే అన్యత్ర సూర్యాదులందును; అన్యత్ర సూర్యాదులందున్న నేనే ఇచటను ఉన్నాను. సర్వత్ర పరిపూర్ణుడనై ఆకాశమువలె వ్యాపకుడనై యున్నాను. నాకంటె నేదియు గొప్పది లేదు. నేనే సకలముకంటె మహాంతుడను. సులక్షణుడైన పుత్రునివలె ప్రాణప్రియమైన నా నిజ నామము ఓ౩మ్ అయి యున్నది. ఎవడు ప్రేమసత్యాచరణ భావములతో నాశరణము జొచ్చునో, నేను అంతర్యామిరూపమున అతని యవిద్యను వినాశమొనర్చి, ఆ యాత్మను ప్రకాశింపజేసి, శుభగుణకర్మ స్వభావయుక్తముగ నొనర్చి, సత్య స్వరూపావరణమును స్థిరముగ స్థాపింపజేసి, శుద్ధమైన యోగవిజ్ఞానము నిచ్చి, సకల దుఃఖముల నుండి వేఱు పఱచి, మోక్షసుఖమును లభింపజేయుచున్నాను. ఇత్యోమ్. ॥౧౭॥ 1976

---

అత్రేశ్వరగుణవర్ణన మధర్మత్యాగోపదేశః సర్వదా సత్కర్మానుష్ఠా నా వశ్యకత్వ మధర్మాచరణనిన్దా పరమేశ్వరస్యాతిసూక్ష్మస్వరూపవర్ణనం విదుషా జ్ఞేయత్వ మవిదుషాం మవిజ్ఞేయత్వం సర్వత్రాత్మభావే నాహింసాధర్మపాలనం తేన మోహశోకాదిత్యాగ ఈశ్వరస్య జన్మాది దోషరాహిత్యం వేద విద్యోపదేశనం కార్యకారణాత్మకస్య జడస్యోపాసన నిషేధ స్తాభ్యాం కార్యకారణాభ్యాం మృత్యుం నివార్య మోక్షసిద్ధికరణం జడవస్తున ఉపాసన నిషేధ శ్చేతనోపాసన విధి స్తదుభయ స్వరూప విజ్ఞానాఽఽవశ్యకత్వం శరీరస్వభావ వర్ణనం సమాధినా పరమేశ్వర మాత్మని నిధాయ శరీరత్యాగకరణం శరీరదాహాదూర్ధ్వ మన్యక్రియానుష్ఠాన నిషేధోఽధర్మత్యాగాయ ధర్మవర్ధనాయ పరమేశ్వర ప్రార్థన మీశ్వర స్వరూప వర్ణనం సర్వేభ్యో నామభ్య ఓమిత్యస్య ప్రాధాన్యప్రతిపాదనం చ కృతమత ఏతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సఙ్గతి రస్తీతి వేద్యమ్.

ఈ యధ్యాయమునందు ఈశ్వర గుణవర్ణనము, అధర్మ త్యాగోపదేశము, సర్వదా సత్కర్మానుష్ఠానావశ్యకత, అధర్మాచరణనింద, పరమేశ్వరుని అతిసూక్ష్మ స్వరూప నిర్ణయము, విద్వాంసులకు జ్ఞేయముగను, అవిద్వాంసులకు అజ్ఞేయముగ నుండుట, సర్వత్ర ఆత్మభావముతో మెలగి అహింసాధర్మమును రక్షించుట, దానిచేత మోహ శోకాదుల వీడుట, ఈశ్వరునికి జన్మాది దోషములు లేకుండుట, వేద విద్యోపదేశము, కార్యకారణరూపమున నున్న జడజగత్తుయొక్క ఉపాసనానిషేధము, ఆ కార్యకారణములచే మృత్యువును నివారణ మొనర్చి మోక్షాదులను సాధించుట, జడవస్తూపాసనానిషేధము, చేతనోపాసనావిధి, ఆ జడచేతనముల రెంటిని నెఱుగు నవసరము' శరీరస్వభావ వర్ణనము, సమాధిద్వారా పరమేశ్వరుని తనయాత్మయందు ధరించి శరీరమును వదలుట, శరీరదాహము తర్వాత ఇతరక్రియల అనుష్ఠానమును నిషేధించుట, అధర్మ త్యాగమునకై, ధర్మమును వృద్ధిపఱచుటకై పరమేశ్వరుని ప్రార్థన, ఈశ్వర స్వరూప వర్ణన, సకల నామములలో ఓమ్ నామముయొక్క శ్రేష్ఠత్వము ప్రతిపాదించబడినవి. ॥౧౭॥

కావున ఈ యధ్యాయమున చెప్పిన అర్థమునకు పూర్వాధ్యాయమున చెప్పబడిన అర్థముతో సంగతి కలదని యెఱుగవలయును.

ఇతి శ్రీమత్పరమ హంస పరివ్రాజ కాచార్యాణాం శ్రీపరమ విదుషాం విరజానంద సరస్వతీ స్వామినాం శిష్యేణ శ్రీమద్దయానంద సరస్వతీ స్వామినా నిర్మితే సంస్కృతార్య భాషాభ్యాం సమన్వితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే చత్వారింశత్తమోఽధ్యాయః సమాప్తః. సమాప్తశ్చాయం గ్రన్థ ఇతి.



మార్గశీర్ష కృష్ణ ౧ శనౌ, సంవత్ ౧౯౩౯
[౧౮౦౪ శా. శ. చిత్రభాను 1882 క్రీ. శ. ౨౩ ద. శ.] లో సమాప్తమైనది.
వైశాఖ శుక్ల ౧౧ శని సంవత్ ౧౯౪౬
[౧౮౧౧ విరోధి 1889 క్రీ. శ. ౮౫ ద. శ.] లో ముద్రణము సమాప్తమైనది.



ఓమ్

# యజుర్వేదములో నేమున్నది?

ఆర్యులారా!

ఆర్య సమాజాన్ని స్థాపించిన మహర్షి దయానంద సరస్వతి సమాజనియమాలల్లో "వేదము సమస్త సత్య విద్యల పుస్తకమనియు, దానిని చదువుట. చదివించుట, వినుట, వినిపించుట ఆర్యులందరికి పరమ ధర్మమని" నిర్దేశించి యుండుటయేగాక వేదములకు సత్య భాష్యము వ్రాసి అజ్ఞాన తిమిరమును పటాపంచ లొనర్చెను.

యజుర్వేదమున కాయన యొనర్చిన భాష్యమే యియ్యది.

ఇందు ఆయన (౧) ప్రతి మంత్రమునకు అక్కడికక్కడే దేవతను, ఋషిని, ఛందస్సును, స్వరమును నిర్దేశించి యుండెను. ఇంత సరళముగ మరే భాష్యకారుడును సూచించి యుండలేదు.

(౨) ఆ యా మంత్రము నందే విషయము గలదో ప్రతిచోట ముందుగ నిర్దేశించెను.

(౩) పద విభాగము అనే పద పాఠము నిచ్చెను.

(౪) సంస్కృతంలో I. ముందు ప్రతి పదార్థము. II. అన్వయము, III. భావార్థము, ఆరునెలల సంస్కృతం చదివిన వారికైనా తేలికగ అర్థమగు నంతటి సరళముగ వ్రాసెను.

(౫) మంత్రము లందలి అలంకారములను సూచించెను. దానికి తెలుగులో ప్రతి పదార్థ తాత్పర్యములు మేమనువదించి వ్రాయుచున్నాము. ఇటుల వైదిక సాహిత్యములోనే గాక ఆంధ్ర భాషలో కూడ నపూర్వ గ్రంథముగ నలరారునదై యున్న దియ్యది.

మహర్షి ప్రతి అధ్యాయాంతమున అందుగల విషయముల సూచిక ఇచ్చి యుండెను. ౪౦ అధ్యాయములలో నున్న ఆ యా విషయములను క్రోడీకరించి అకారాదిక్రమముగ నిట పొందు పఱుచుచున్నాను. ప్రతి యధ్యాయాంతమునందు "నిందు చెప్పబడ్డ యర్థమునకు పూర్వోక్తాధ్యాయార్థమునకు సంబంధమున్నదని" ఆయన నిర్దేశించి యుండెను. కనుక నవీన పాఠకులకు, స్వాధ్యాయ పరులకు జిజ్ఞాసువులకు నిది యత్యంతోపయుక్తము కాగలదు.

## యజుర్వేదములో నేమున్నది ?

శమిత్యోమ్.